సుందరములైన శాద్వలతలాలను దోకివేసి, మళ్ళీ చెట్టు చేమ మొలవకుండా గచ్చునేలలుగా మార్చేస్తారు. విశాలములైన వృక్షతతులను నరికివేసి ఇళ్ళు కట్టుకుంటారు. ఆ వృక్షాలే నెలవులుగా ఉండిన జంతువులను, పక్షులను పారదోలేస్తారు. తాము కట్టిన ఫ్యాక్టరీల పొగలతో వాతావరణమంతా కలుషితమైపోతుంది. ఇలాగ వందలాది, వేలాది మానవులు ప్రకృతిలో ఎంత వికృతిని తెచ్చినా వసంతఋతువు మసకబడజాలదు. పట్టణాల్లోకూడా దాని శోభ దృశ్యమానమే; అనుభవనీయమే.

సూర్యబింబం గోరువెచ్చగా ప్రకాశిస్తోంది. తాపోపశమనంగా గాలి తరగలు వీస్తున్నవి. ఎక్కడపడితే అక్కడ నవజీవన రేఖలవలె గడ్డిపరకలు పొటమరిస్తున్నవి. గుండెలు నిండిన వసంతానందంతో పిచ్చుకలు, పావురాళ్లు గూళ్లు నిర్మించుకుంటున్నవి; తేనెటీగలు నిరంతర రాగాలాపన చేస్తున్నవి. మొక్కలు, పక్షులు, క్రిమికీటకాలు, పసిపిల్లలు—సృష్టి యావత్తు సంతోషతరంగితమై ఉంది. కాని మానవులు—పెద్ద పెరిగిన స్త్రీపురుషులు—తమ మోసపుటెత్తులను, ఒకరినొకరు పీడించుకొనటమును మానరు అనే వారికి ప్రపూతములు, ప్రధానములు. ఈ వసంతోదయం గాని—నరాపరజంతు సంతానము ఆనందముకొరకై భగవంతుడిచ్చిన ఈ వసంత సౌందర్యము గాని—ప్రేమ, శాంతి, సౌహార్ద్రము తొంగిచూస్తున్న ఈ వసంతశోభ గాని వారికి గణనీయంకాదు.

నగరంలోని జైలుఅధికారులకుకూడా—సర్వప్రాణుల సంతోషార్థం అవతరించిన యీ వసంతం కాదు పవిత్రమైనది. లోగడదినం సాయంత్రం ఒకనోటీసు వచ్చింది. "ఏప్రియల్ 28 వ తేదీని 9 గంటలకు ముగ్గురు ఖైదీలను (ఇద్దరు ఆడవాళ్ళను, ఒక మొగవాణ్ణి) కోర్టులో హాజరుపెట్టాలి. వారిలో ప్రముఖ నేరస్థురాలైన ఒక ఆడఖైదీకి దిట్టమైన పహరా ఉండాలి" — ఈ తాఖీదుగల ఆ నోటీసు జైలు అధికారులకు ఆనాడు అత్యంత ప్రధాన విషయమై పోయింది.

ఏప్రియల్ 28 వ తేదీ ఉదయం 8 గంటలు అయింది. పెద్దవార్డరు బయలుదేరివచ్చాడు. ఆడఖైదీలు ఉండే వార్డువసారాలో నిల్చున్నాడు. అతనితోపాటే ఒక సన్నపాటి యువతికూడా వచ్చింది. ఆమె జుత్తు ఉంగరాలు తిరిగివుంది. బంగారు జరీ అంచుల గౌను తొడుక్కుంది. నడుముకు ఒక నీలపుబెల్టు పెట్టుకుంది. ఆమె చూపులు ఎందుకో బాధాసూచకంగా వున్నాయి.

ఒక చీకటికొట్టు తాళంతీశాడు వార్డరు. లోపలనుంచి వెగటుపుట్టించిన గాలి తరగ గుప్పన వచ్చింది. "మస్లోవా కోర్టులో హాజరుకావాలి ఇవాళ" అని అరచాడు వార్డరు. వెంటనే మళ్ళీ తలుపు ఓరగా వేశాడు. లోపల జైలుగదిలో ఆడఖైదీల గలగల రేగింది.

ప్రాణులకు కొత్తజీవం పోయగలిగిన ఆ వసంతకాలపు ఆ పైరుగాలి జైలు ఆవరణలోనికికూడా చొచ్చుకువస్తోంది. కాని మామూలుగా అక్కడి గాలి సన్నిపాతజ్వర క్రిములతోను, మురికికంపుతోను బరువెక్కి వుంటుంది. కొత్తగా అక్కడికి వెళ్ళిన వ్యక్తి చింతాక్రాంతుడు కాక తప్పదు. ఆడవార్డరుకు ఈ వాతావరణం అలవాటే. కాని ఇప్పుడామె బైటినుంచి వచ్చింది. వసారాలో అడుగుపెట్టిందో లేదో ఏవగింపు కలిగింది. నీరసించిన మనిషివలె నిల్చుంది.

"ఊఁ - తొందరగా రావాలి"—అని జైలువార్డరు కేకవేశాడు. ఒకటి రెండునిమిషాలు గడిచాయి. ఒక జవ్వని చలాకీగా బైటికి వచ్చింది. ఉన్నతమైన వక్షోభాగం - ఖైదీల కిచ్చే బూడిదరంగు గౌను తొడుక్కుంది. సిల్కుమేజోళ్ళు, జైలుబూట్లు ధరించింది - నల్లని అందమైన జుత్తు - తలకు చుట్టుకున్న తెల్లనిరుమాలులోనుంచి తప్పించుకుని వచ్చి చిరునుదురుమీద దోబూచులాడుతున్నాయి ముంగురులు. చాలకాలం జైల్లో వున్నందున ముఖం నిస్తేజమై వుంది. గదిలో ఒకమూల మగ్గబెట్టిన బంగాళాదుంపల రంగును జ్ఞాపకం తెస్తోంది. ఒక కన్ను కొంచెం మెల్ల. ముఖం ఎంత నిస్తేజంగా వున్నా ఆ నల్లకలువలవంటి నేత్రాల జ్యోతిమాత్రం అనుపమానంగా వుంది. రొమ్ము విరిచి ఠీవిగా నడిచివచ్చిందా పడుచు.

వచ్చి వసారాలో వార్డరు ఎదుట నిల్చుంది మస్లోవా, అతని కన్నులలోకి చూస్తూ, అతని ఆజ్ఞలకోసం నిరీక్షిస్తూ.

వార్డరు గదితాళం వేయబోతున్నాడు. ముఖం ముడతలు పడిపోయిన ఒక ముసలిది ముందుకు వచ్చి మస్లోవాతో ఏమో చెప్పబోయింది. వార్డరు ఆమెను లోనికి నెట్టేసి తలుపు తాళంవేశాడు. లోపల ఎవరో పక్కున నవ్వారు. మస్లోవా తనలో తాను నవ్వుకుంది. ఆ ముసలిది మాత్రం తలుపు సందులోనించి ముఖంపెట్టి గట్టిగా చెప్పింది: జాగ్రత్త సుమీ! వాళ్ళెంత ప్రశ్నించినా అదేమాట చెబుతూవుండు. అంతే. అనవసరమైనమాట అసలు పలుకవద్దు."

"ఏమైనా ఇంతకంటే చెడిపోయేది లేదు కదా! ఇంతకూ ఏదోవిధంగా అమో, తుమో తేలిపోవటమే నా కోరిక."

"ఎటో ఒకదానికి తేలిపోతుందిలే. ఊc-పద"—అన్నాడు వార్డరు చమత్కారంగా.

ముసలిదానికళ్ళు తలుపుసందుల్లోనించి ఇక కనిపించలేదు. వార్డరు మస్లోవాను జైలు ఆఫీసుకు తీసుకుపోయాడు. మస్లోవాను కోర్టుకు తీసుకుపోయేందుకు నియమితులైన ఇద్దరు సైనికులు వచ్చివున్నారక్కడ. ఒక గుమాస్తా పొగాకుకంపు కొడుతూన్న ఒక కాగితాన్ని వాళ్ళకిచ్చాడు. మస్లోవాను చూపించి "తీసుకుపోండి ఈమెను" అన్నాడు.

ఆ యిద్దరు సైనికుల్లో ఒకడు నిజ్నీనవగరాడ్‌నించి వచ్చిన రైతుకులానికి చెందినవాడు. మొగంనిండా స్ఫోటకం మచ్చలున్నాయి. గుమాస్తా యిచ్చిన కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు. మస్లోవాను చూచి, తిరిగి తనతోడి సైనికునికేసి తిరిగి రెప్పలెగురవేశాడు. రెండో సైనికుడు చువాష్ జాతివాడు. విశాలమైన రొమ్ము, బలంగల మనిషి. ఈ యిద్దరూ మస్లోవాను వెంటబెట్టుకుని బయలుదేరారు. జైలు ఆవరణదాటి పట్టణపు వీధుల్లో నడిచి వెడుతున్నారు.

బండ్లవాళ్ళు, వ్యాపారస్థులు, వంటవాళ్ళు, కార్మికులు, ప్రభుత్వోద్యోగులు-ఒకరేమిటి అందరూ ఆగి ఆ ఖైదీని వింతగా చూడసాగారు. 'ఇదంతా చెడునడత ఫలితం' అనుకున్నారు. తమకు అలాంటి చెడునడతలేదు గనుక అట్టిగతి తమకు పట్టలేదని వారి ఊహ. పిల్లలు ఆమెకేసి 'ఓ పెద్ద దొంగ' కామాలు అనుకుంటూ భయంభయంగా చూచారు. కాని పక్కనే సైనికులు వుండటం చూచి ఊరట చెందారు. ఒక పల్లెటూరి రైతుకూలీ పట్నంలో

బొగ్గులబస్తా అమ్ముకుని, తేనీరు తాగి, ఇంటికిపోతూ, ఈ దృశ్యంచూచి, జాలిపడి ఆ షైకికి ఒక చిన్న నాణెం ఇచ్చాడు. ఆమె తెల్లబోయి ఏదో గొణుక్కుంది. వీధిలో యావన్మందీ తనకేసే చూస్తున్నారని ఆమె తెలుసుకుంది. ముఖం తిప్పకుండానే పక్కచూపులు చూచుకుంటూ నడుస్తోంది. అంతమందిని తాను ఆకర్షించగలగటం ఆనందహేతువుగానే వుంది. మెల్లిగా వీస్తున్న గాలికూడా ఆమెకు హాయి గొలుపుతోంది. కాని ఆమెకు నడక అలవాటు లేదు. జైలుఅధికార్లిచ్చిన బూట్లు మంచివి కావు. కంకరరోడ్ల మీద నడవటం కష్టంగా వుంది.

ఒకధాన్యపు వ్యాపారస్తుని కొట్టుముందునించీ వెడుతున్నారు. కొట్టు ముందు వీధిలో కొన్ని పావురాలు గునగునతిరుగుతూ, గింజలేరుకు తింటున్నాయి. ఒక పావురాయికి మస్లోవా పాదం తగిలింది. ఆ పిట్ట రివ్వున ఎగిరి, రెక్కలు టపటపకొట్టుకుంటూ ఆమె చెవిప్రక్కగా దూసుకుపోయింది. దాని రెక్కలగాలికి ఆమె బుగ్గలు వికసించాయి. ఆనందం విరిసిన మందహాసం చేసింది. కాని మరుక్షణమే తనస్థితి జ్ఞాపకంరాగా ఒక దీర్ఘ నిశ్వాసం విడిచింది.

౨

మస్లోవా జీవితగాథ చాలా సామాన్యమైనది.

మస్లోవా తల్లి ఒక పల్లెటూరి ముసలమ్మకు పెళ్ళిగాని కూతురు. ఈ ముసలది భూకామందులైన ఇద్దరు దొరసాన్లకు దాసీ. ఈ దొరసానులు కూడా వయసు చెల్లినవాళ్లే. అయినా అవివాహితులు. వీరి పాడిగొడ్ల దగ్గర ఆ పల్లెటూరి ముసలది పనికి కుదిరింది. ఈ ముసలిదాని పెళ్ళిగాని కూతురుకు ప్రతియేటా ఒక పాపాయి! సామాన్యంగా ఇటువంటి సంతానానికి పట్టేగతి అందరికీ తెలిసిందే. శుద్ధి స్నానం అయిన మర్నాటినుంచీ తమ పనిపాటలకు సంపాదనకు అడ్డు వస్తారని యీ పిల్లల్ని సరిగా చూడరు తల్లి ప్రేమకు నోచని అభాగ్యతతో కృశించి, చితికిపోతారా బిడ్డలు. ఇలా అయిదుగురు చెల్లిపోయారు. ఆరవపిల్ల మస్లోవా. దాని జన్మకారకుడు ఒక బికారి, తిరుగుబోతు. ఈ పిల్లకు కూడా పై అయిదుగురి గతి పట్టేదే. కాని పురిటి పొత్తిళ్ళలో ఉన్నప్పుడే దొరసానమ్మగారి జాలిగుండెను ఆకర్షించగలిగింది. తమ

గొడ్ల సావిట్లో ప్రసవించినందుకు దొరసానికి కోపం వచ్చినా, పసికందును చూసేసరికి జాలికలిగింది. పిల్లకు రోజూ కేవిడిలో పాలు పోయించేది. తల్లికి కొంత డబ్బు కూడా ఇస్తూ ఉండేది, పిల్లను సాకేందుకు. ఇలా ఆ పిల్ల బ్రతికింది. 'చావుతప్పి బ్రతికిన పిల్ల' అని దొరసానులు మస్లోవాను గురించి అంటూ ఉండేవాళ్ళు.

మస్లోవాకు మూడేళ్ళు వచ్చాయి. తల్లి అకస్మాత్తుగా జబ్బుపడి మరణించింది. పసిదాన్ని అమ్మమ్మ ఏమి పోషించ గలుగుతుంది? దొరసాన్లే మస్లోవా పోషణ భారం వహించారు. కాటుక పిట్టలవంటి కన్నులతో ఆపిల్ల పెద్దగా పెరుగుతూన్న కొద్దీ అందగత్తె అయింది. ఆమె చలాకీ తనానికి దొరసానులు ఆనంద పడేవాళ్లు. ఆ పిల్లను ముద్దుగా కేటుకీనా అని పిల్చే వాళ్లు.

చిన్న దొరసాని సోఫియా హృదయం చాలా మెత్తన. పెద్దావిడ మేరీ కొంచెం గడుసరి. సోఫియా ఆ పిల్లకు మంచి మంచి గౌనులు ఇచ్చేది. విద్యావతిని చేయాలన్న తలంపుతో చదువను, వ్రాతను నేర్పుతూ ఉండేది. మేరీకి మాత్రం ఆ పిల్లను తమ ఇంట్లో అన్ని పనులూ చక్కగా నవిరించుకు పోయే మంచి పనికత్తెనుగా తయారుచేయాలని ఉద్దేశం. అందు కనుగుణంగా అన్ని పనులూ చేయిస్తూ ఉండేది. ఎక్కడైనా పొరపాటు వస్తే కోపంతో కొట్టేది కూడాను. ఇలా రెండురకాల వత్తిళ్ళకు లోనై ఆ పిల్ల కొంతవరకు గొప్ప ఇండ్ల సాంప్రదాయాలను, కొంతవరకు పరిచారికా సాంప్రదాయాలను అలవరుచుకో గలిగింది. కుట్టుపని నేర్చుకుంది. గదులు శుభ్రపరిచేది. పాత్ర లను శుభ్రపరిచేది. అప్పుడప్పుడు ఏవో పుస్తకాలు చదివి యజమాను రాళ్ళకు వినిపిస్తూ ఉండేది.

ఎన్నో సంబంధాలు వచ్చాయి. శ్రామిక వర్గానికి చెందిన యువకు లెందరో ఆమె ప్రేమను యాచించారు. ఎవర్ని పెళ్ళిచేసుకు నేందుకూ మొగ్గ లేదామె. దొరసానుల ఇంట్లో ఒక హాయైన జీవితానికి అలవాటు పడిన ప్రాణి కావటంచేత కష్టించి పనిపాటు చేయవలసిన ఒక శ్రామికుని భార్య అయిపోవటం ఆమె కిష్టం లేకపోయింది.

ఈ విధంగా ఆమె పదహారు వసంతాల పడుచు అయింది. ఒకనాడు దొరసాన్ల మేనల్లుడు దిగాడు; ఒక ధనిక జమీందారు. విశ్వవిద్యాలయంలో

పెద్ద చదువులు వెలిగిస్తున్నాడు. మేనత్తల్ని చూసిపోదామని వేంచేశాడు. మస్లోవా తనకు తెలియకుండానే అతన్ని ప్రేమించింది.

రెండేళ్ళ తరవాత మరోకసారి అతడే వచ్చాడు మేనత్తల్ని చూసి పోదామని. సైన్యంలో ఉద్యోగం దొరికింది. ఆ ఉద్యోగంలో చేరబోతూ వచ్చి నాలుగు రోజులే ఉన్నాడు. నాలుగోనాటి రాత్రి మస్లోవాను చెరచాడు. ఒక వంద రూబుల్సు నోటు ఇచ్చి మర్నాడు వెళ్ళిపోయాడు. తరువాత అయిదు నెలలయేసరికి తాను గర్భవతియని తేలిపోయింది. అక్కడి నుంచి ఆమెకీ ప్రపంచంలో ఏది చూసినా రోతగానే ఉండేది. రానున్న లోకాపవాదంనుంచి బైటపడటం ఎలాగ ? అన్న ఆలోచనే ఆమెను నిరంతరం బాధిస్తోంది. మునుపటిలాగ దొరసానులను శ్రద్ధగా సేవించలేకపోతోంది. అశ్రద్ధతోపాటు అవజ్ఞత కూడా చూపసాగింది. ఒకానొక సమయంలో వాళ్ళ యెడల చాలా అగౌరవంగా ప్రవర్తించింది. అందుకు తరువాత పశ్చాత్తాపపడి "ఇక నేను మీ కొలువులోనుంచి వెళ్ళిపోతాను; సెలవిప్పించండి" అన్నది. అసంతృప్తి కలిగి వాళ్లామెను వొదిలేశారు. ఆమె వెళ్ళిపోయి ఒక పోలీసు ఆఫీసరు ఇంట్లో పరిచారికగా కుదిరింది. కాని ఆమె అక్కడ మూడు నెలలు మాత్రమే ఉంది. ఆ పోలీసు ఆఫీసరు యాభైయేళ్లు దాటినవాడైనా ఆమెను లోగొన చూస్తూండేవాడు. ఒకసారి అతడు మానసోల్లాసం పట్టలేక చేరవచ్చినప్పుడామె "దుర్మార్గుడా! దయ్యమా!" అని యిష్టం వచ్చినట్టు తిడుతూ ఒక్క తోపు తోసింది. అతడు ఒరిగి పడిపోయాడు. దానితో ఆమె ఉద్యోగం పోయింది.

మరొక ఉద్యోగం కోసం ఆమె ప్రయత్నించలేదు. పురుడు వచ్చే రోజులు బయటపడుతున్నాయి. కనుక ఒకనాడు మంత్రసాని దగ్గరకు పోయింది. ఆ మంత్రసాని లైసెన్సు లేకుండా దొంగతనంగా సారాయం అమ్ముకుని కూడా ధనం సంపాదించుకుంటుంది. మస్లోవా తేల్గ్గానే ప్రసవించింది. కాని మంత్రసాని ఆ ఊళ్ళో ఒక జ్వరపు కేసు చూసివచ్చి, ఆ చేతులతోనే మస్లోవాను ముట్టుకోవటం చేతనో యేమో మస్లోవాకు కూడా జ్వరం అంటుకుంది. అందువల్ల పుట్టిన పసిపిల్లవాడిని అనాథ శరణాలయానికి పంపించవలసి వచ్చింది. పసిపిల్లవాడిని అనాథ శరణాలయానికి తీసుకుపోయిన యువతి వాడక్కడికి చేరగానే చనిపోయాడని చెప్పింది.

మస్లోవా మంత్రసాని వద్దకు నూట ఇరవైయేడు రూపాయల్లతో వచ్చింది. నూరు తన్ను చెరచినవాడు ఇచ్చినవి, ఇరవైయేడు తన సంపాదనలో దాచుకున్నవి. మళ్ళీ మంత్రసాని నుండి విడిచిపోయేనాడు ఆమెవద్ద ఆరు రూపాయల్సు మాత్రమే మిగిలాయి. డబ్బు దాచుకోటం ఆమెకు తెలియదు. ఇష్టం వచ్చినట్లు తనకోసం ఖర్చుచేసుకుంటుంది; అడిగినవాళ్ళకెల్లా ఇచ్చేస్తూ ఉంటుంది. రెండు నెలలు తన ఇంట్లో ఉంచుకున్నందుకు మంత్రసాని 40 రూపాయల్సు తీసుకుంది. కుర్రవాణ్ణి అనాథ శరణాలయానికి పంపించేందుకు 25 రూపాయల్సు ఖర్చు అయినవి. మరో 40 రూపాయల్సు మంత్రసాని ఆవును కొనుక్కుంటానని అప్పు తీసుకుంది. బట్టలకు తినుబండారాలకు మస్లోవా 20 రూపాయల్సుదాకా ఖర్చు చేసుకుంది. ఇక చేతిలో చిల్లిగవ్వకూడా లేక మళ్ళీ నౌకరీ కోసం ప్రయత్నించాల్సి వచ్చింది. చివరకు వొక పారెస్టర్ ఇంట్లో కుదిరింది. ఆతడు పెళ్ళి అయినవాడే. అయినా మస్లోవాను మొదటి రోజునుంచీ పీడింపు సాగించాడు. ఆమె అతన్ని అసహ్యించుకుని దూరదూరంగా తిరుగుతూ ఉండేది. ఏమైనా అతడు యజమాని; అనుభవజ్ఞుడు; మాయలమారి. బుట్టలో వేశాడు పిల్లను. కొన్నాళ్ళకు భార్యకు తెలిసిపోయింది. ఇద్దరూ ఏకాంతంగా గదిలోఉండగా వచ్చి పట్టేసింది. మస్లోవాను కొట్టింది; ఇన్నాళ్లు పని చేసినందుకు జీతం ఇవ్వకుండానే వెళ్ళగొట్టేసింది.

ఆ తరువాత ఆమె బస్తీలోఉన్న పినతల్లి దగ్గరకు వెళ్ళింది. ఆ పినతల్లి భర్త పుస్తకాల బైండింగు చేసి డబ్బు సంపాదించుకునేవాడు. చాలాకాలం అతనికి సుఖంగానే గడిచింది. కాని రాను రాను వతనుగా పనిఇచ్చేవాళ్లుమాని వేయటంచేత చితికిపోయాడు. పైగా త్రాగుడు అలవాటైంది. జేబులోవున్న డబ్బులు సారాకొట్లో దులుపుకుని రావటం మామూలైంది. ఇట్టి పరిస్థితుల్లో ఆ పిన తల్లి వొక ఇస్త్రీ దుకాణం పెట్టి, మొగుడి ఆసరా లేకపోయినా కుటుంబ పోషణ చేసుకుంటూ ఉంది. కావలిస్తే ఆ దుకాణంలోనే మస్లోవాను పని చేసుకుంటూ ఉండమంది. కాని ఆ షాపులో నౌకర్లు పడుతోన్న బాధలు చూసి ఆమె అందుకు వొప్పుకోలేదు.

కొన్నాళ్ళకు వొక ధనికురాలి ఇంట్లో పని దొరికింది. ఆ ధనికురాలికి ఇద్దరు పుత్రులు. వాళ్లు హైస్కూల్లో చదువుకుంటున్నారు. పెద్దవాడు నూనూగు మీసాల నూత్న యౌవనంలో వున్నాడేమో, ఇంట్లో

మస్లోవా కనిపించేసరికి రెప రెపలాడి పోయేవాడు. పుస్తకాలు మూసేసి, చదువు కట్టిపెట్టి ఆమెవెంట పడ్డాడు. ఆ తప్పు తప్పంతా మస్లోవాదేనని నిర్ణయించి, నౌకరీలోనుంచి బర్తరఫ్ చేసింది.

మళ్ళీ నౌకరీకోసం మస్లోవా ఎన్నో విఫలప్రయత్నాలు చేసింది. చివరకామెకొక స్త్రీ కనిపించింది. ఆమె మెడనిండా నగలే; వేళ్ళనిండా వుంగరాలే. నౌకరీకోసం తహతహలాడుతోన్న మస్లోవాను ఆమె ఆప్యాయంగా ఆదరించి, తనయింటికి తీసుకుపోయి రొట్టెలు, సారాయం ఆతిథ్యం ఇచ్చింది. ఒకచీటీరాసి ఎవరికో పంపించింది సేవకునిచేత. సాయంకాలానికల్లా ఒక పొడుగాటి మనిషి — కల, గడ్డం నెరిసినవాడు — సవిలాసంగా దయచేశాడు. మస్లోవాకు పక్కగా వచ్చి కూచున్నాడు. మిలమిల్లాడే కళ్ళతో ఆమెను తేరిపారచూచాడు. చిరునవ్వులతో ఇక సరసాలు ఆరంభించాడు. ఆ స్త్రీ అతన్ని పక్కగదిలోకి తీసుకుపోయి "పల్లెటూరినించి వచ్చింది, కొత్తపిట్ట" అని చెబుతూండగా మస్లోవా విన్నది. ఆ తరువాత ఆమె మస్లోవాను ఎడంగా పిల్చి — "ఈ వచ్చినాయన మంచికవి. బాగా డబ్బున్నవాడు. మనసు కుదిరితే నీ పని రొఖ్ఖమే" అని ఆశపెట్టింది. నిజంగానే ఆతని కామె నచ్చింది. ఒకపాలిక ఇచ్చాడు. తరచుగా వచ్చి కలుసుకుంటానని చెప్పాడు, వెళ్లాడు. ఆ పాతికా ఇట్టే మాయమైనాయి. కొంత పినతల్లి కిచ్చింది — వుంటానికి, తింటానికి. మిగిలినదంతా టోపీలు, రిబ్బనులు మొదలైన ఫాన్సీ వస్తువులకు అయిపోయింది. కొన్నాళ్ళకు మళ్ళీ ఒకసారి కబురంపాడు కవి. వెళ్ళి మరొక పాతిక తెచ్చుకుంది.

పినతల్లిగారింట్లో వుండవలసిన అవసరంలేకుండా వేరే ఒకగది అద్దెకు తీసుకుని కవిగారు మస్లోవాను అందులో పెట్టాడు. ఆ పక్కయింట్లోనే ఒక కుర్రదుకాణదారు వుంటున్నాడు. చూసీచూడ్డంతోనే మస్లోవా మనస్సు వాడిమీదికి పరిగెత్తింది — వాడుకూడా ఆమెను పెళ్ళిచేసుకుంటానన్నాడు. ఆ సంగతి ఆమె కవితో చెప్పింది. అతని అధీనంలోనించి బైటికి వొచ్చేసి వేరే ఒకగది స్వతంత్రంగా అద్దెకు తీసుకునివుంటోంది. కాని ఆ పెళ్ళిచేసుకుంటానన్న దుకాణదారు వ్యాపారంమీద నిజ్నీ వెళ్ళిపోయాడు. ఆ సంగతి ఆమెతో చెప్పకండానే వెళ్ళిపోయాడు. ఆమెను వొదిలించుకుందామనే అలా వెళ్ళిపోయివుంటాడు. ఇంతకూ మస్లోవా మళ్ళీ వొంటరిదైపోయింది.

రెండోదారి: ప్రభుత్వం అనుసరిస్తున్న బాహాటమైన ఒక ప్రవృత్తి. మస్తానీ ఈ రెండోదారినే అనుసరించింది. ఈ విధంగా ...తన్ని మొట్ట మొదట చెరపట్టిన కుర్ర జమీందారుమీద, తరువాత తన్ను మోసగించిన దుకాణ దారుమీద, తన్ను బాధించిన యింకా ఇతర్లమీద కసితీర్చుకోగలుగుతాననుకుంది. అదీగాక తాను ఎలాంటి దుస్తులు కావాలంటే అవే కొనుక్కోవచ్చునని ఆ పడుపుకత్తె చెప్పింది. మస్తానీ ఉవ్విళ్ళూరిపోయింది. ఒక పసుపు పచ్చని సిల్కు గౌను, నల్లటి మెరిసే అంచులది తొడుక్కుంటే తానెంత అందంగా ఉంటుంది! విలువైన, కోరిన దుస్తుల్లో తన భావి సౌందర్య రేఖను ఊహించుకుని ఆశపడింది. సరే నన్నది. ఆ సాయంత్రమే బండీమీద వకీ చేరుబడిన పడుపుకటింటికి చేరింది. ఆ పడుపుకటింటి యజమానురాలు కిటీవా.

భగవదాదేశాలను, మానవనీతికీ విరుద్ధమైన పాపపంకిలజీవితం ఆరంభమైంది మస్తానీకు ఆ నాటినించీ. ఇలాంటి జీవితాన్నే గడుపుతున్న స్త్రీలు లక్షలాదిగా ఉన్నారు. ప్రజాక్షేమాన్ని కాంక్షించే ప్రభుత్వం అట్టి విధానాన్ని సహిస్తోంది, చట్టబద్ధంచేసి అనుమతించింది. అలా జీవించే స్త్రీలలో పదింట తొమ్మిదిమంది ఘోరవ్యాధులకు, అకాల వృద్ధాప్యానికి, దుర్మరణాలకు గురిఐ పోతున్నారు.

పగలు ప్రొద్దు ఏటవాలేవరకూ నిద్ర. మూడు నాలుగుగంటల మధ్య లేవటం. పడకదుస్తులు విప్పకుండానే, కాఫీలు, సోడాలు తాగి ఇంట్లో పచార్లు. తెరలు తప్పించి కిటికీలగుండా చూడటం. ఒకరితో ఒకరు పనిలేని పోట్లాటలు. తరువాత స్నానాలు. అత్తర్లు పూసుకోటం. తలదువ్వటం. వంటికి సుగంధద్రవ్యాలు రాసుకోటం. కట్టుకోవలసిన గౌనులగురించి యజమానురాలితో ఘర్షణ. అద్దాల్లో తనివితీర చూచుకోటం. వెలగల మధురాహారం. ఖరీదైన సిల్కుదుస్తుల్ని అవయవసౌష్టవాన్ని మరుగుపరచకుండా ధరించటం. విటశిఖామణుల ఆగమనం, సంగీతాలు, నృత్యాలు, కామకేళీ విలాసాలు. పిన్నలతో, పెద్దలతో, బీదవాళ్ళతో, ధనవంతులతో, ఆరోగ్యవంతులతో, రోగిష్ఠులతో; జాతిమత వివక్షత లేకుండా, ఉదారంగా, సరసాలు, సల్లాపాలు, ముద్దులు, కేరింతలు, పక్కలమీద పొర్లాటలు, సౌఖ్యాలు, పోట్లాటలు — తెల్లవారేవరకూ ఇదే వరుస. ఇక అప్పుడూ నిద్ర.

గాఢనిద్ర. ఇది అక్కడ దైనందిన చర్య. వారాంతమున ప్రభుత్వ వైద్యులు వస్తారు. చక్కగా వైద్యపరీక్ష చేస్తారు. మళ్ళీ ఇలాగే మరో వారం గడపండి అని లైసెన్సు ఇచ్చివేస్తారు. సాగిపోతూ ఉంటుంది వకేరకమైన కథ ప్రతిరాత్రీ - ఇలా వత్సరాల తరబడిగా.

ఇటువంటి జీవితంలో మస్లోవా ఏడేళ్లు గడిపింది. రెండుమూడు పడుపుటిండ్లు మారింది. ఒకసారి ఆసుపత్రిపాలైందికూడా. ఆమె 28 వ యేట ఒక పడుపుటింట్లో జరిగిన వకానొక సంఘటనను పురస్కరించుకుని ఆమెను జైల్లో వేశారు. మూడు నెలలు కారాగారంలో దొంగలు, ఖూనీదార్ల మధ్య గడిపింది. ఇప్పుడు విచారణకు తీసుకువస్తున్నారు కోర్టుకు.

3

మస్లోవా సైనికుల వెంట నడచి నడచి-అలసిసొలసి కోర్టుకు చేరే సరికి జమీందారు నెఖ్లూదోవ్ ఇంకా మెత్తైన పరుపు దొంతరలమీద పవ ళించే ఉన్నాడు. అతనే మస్లోవాని చెరిచిన దొర. దూదిపింఛాలపైన గాలి పరుపులు, అసైన హంస. తూలికాతల్పము, దానిమీద ప్రభువులవారు. సుభ్రంగా యిస్త్రీచేసిన అంగీల సిల్కుచొక్కా రాత్రులు తొడుక్కునేది తొడి గాడు. సిగరెట్టు పిల్చుకుంటూ గతదినం జరిగిందేమిటి, యీ దినం చేయ వలసినదేమిటి—అని ఆలోచిస్తున్నాడు.

లోగడ దినం సాయంత్రం నెఖ్లూదోవ్ కోర్చిగిన్ వంశస్థుల ఇంట్లో గడిపి వచ్చాడు. కోర్చిగిన్ వంశం కూడా ఒక జమీందారీ వంశమే. ఆ ఇంటి ఆడపడుచును నెఖ్లూదోవ్ వివాహం చేసుకోబోతున్నాడని ఊరంతా పుకా రుగా వుంది. ఆ సంగతి జ్ఞాపకం రాగానే నెఖ్లూదోవ్ ఒక నిట్టూర్పు విడిచాడు. చివరంటు కాలిన సిగరెట్టు పారేశాడు. వెండి డబ్బాలోనుంచి మరొకటి తీసి ముట్టిద్దామనుకున్నాడు. కాని మనస్సు మార్చుకున్నాడు మళ్ళీ. మృదు వుగా వున్న తెల్లని పాదాల్ని క్రిందకి దించి చెప్పులు తొడుక్కుని మంచం దిగాడు. రాజలాంఛనమైన సిల్కు గౌను వెడల్పాటి భుజాలమీద వేలా తూడు. పక్క గదిలోకి నడిచి వెళ్ళాడు. పళ్ళపొడితో దంతధావన ముగిం చాడు. పన్నీరు పుక్కిలించి, ముఖం కడుక్కున్నాడు. తరువాత స్నానాల

గదికి వెళ్లాడు. పన్నీటి జలకం ఆడాడు. అందమైన దుస్తులు ధరించి, బూటు తొడుక్కుని అద్దం ముందు కూచున్నాడు; తల దువ్వుకున్నాడు.

అతని సిల్కు దుస్తులు, మెడ పట్టీలు, పిన్నులు—అన్నీ మేలురకానికి చెందినవి; ఖరీదైనవి; మన్నికగలవి. రకరకాల మెడ పట్టీలు ఉన్నాయి. చేతికందినది ఒకటి తీసి ధరించాడు.. ఈ విలాస వస్తువులమీద ఒకప్పుడతనికి చాలా మోజు ఉండేది. ఇప్పుడెంచేతో నిర్లక్ష్యంగా ఉంటున్నాడు.

ధరించిన దుస్తులమీద సెంటు పూసుకున్నాడు. ఇంకా నిద్రమత్తు పూర్తిగా వదల్లేదు. భోజనాల గదికి వెళ్ళాడు. అక్కడొక టేబిల్ వుంది. దాని కాళ్ళు నాలుగూ సింహాల పాదాలులాగ అందంగా చిత్రిక పట్టి వున్నాయి. రంగు దారాల అల్లికల డిజైనులుగల కరుకైన ఇస్త్రీ గుడ్డను దానిమీద పరిచారు. దానిపై ఒక కాఫీ కెటిల్, పంచదార డబ్బా, వేడి మీగడగల పళ్ళెం, రొట్టెల దొంతరలు, బిస్కట్లు—చాలా ఉన్నాయి. ఒక వార్తా పత్రిక, ఉత్తరాలు కూడా ఉన్నాయి అక్కడే.

నెఖ్లూదోవ్ ఉత్తరాలు తీసి చదువుకోబోతున్నాడు. ఇంతలో ఒక లావుపాటి నడివయసు స్త్రీ వచ్చింది. ఆమె ఒక అల్లిక టోపీ ధరించింది. ఆవిడ పేరు అగ్రఫేనా, నెఖ్లూదోవ్ తల్లిగారి పరిచారిక. నెఖ్లూదోవ్ తల్లి ఇటీవలనే ఆ ఇంట్లోనే మరణించింది. అగ్రఫేనా నెఖ్లూదోవ్‌ను కనిపెట్టుకుని ఇంటి పనులు దిద్దుకుంటూ అక్కడే ఉంటున్నది. ఒక పది సంవత్సరాలు ఆమె నెఖ్లూదోవ్ తల్లితో విదేశాలలో ఉండి వచ్చింది. కాగా వేషభాషల్లోనూ, నడతలోనూ గొప్పయింటి మనిషిలా కనిపిస్తుంది. తాను ఇంత పిల్లప్పటినుండినుంచీ వీళ్ళ ఇంట్లో పరిచారికగా ఉంటోంది. నెఖ్లూదోవ్‌ను చిన్నప్పటినుంచీ ఎరుగును. ఆమె చేతిలో ఏదో ఉండటం చూసి నెఖ్లూదోవ్ అడిగాడు. "ఏమిటది అగ్రఫేనా?"

"జమీందారుగారింటినుంచి వచ్చిన ఉత్తరం. తల్లిగారు రాసిందో, కూతురమ్మ రాసిందో మరి! వాళ్ళ దాసీ తెచ్చింది" అంటూ అగ్రఫేనా ఆ ఉత్తరాన్ని అతని కిచ్చింది అర్థవంతమైన మందహాసం చేస్తూ.

ఆ మందహాసానికి కోపం వచ్చినట్టు చురుగ్గా చూసి, "ఊహూఁ, ఏదీ" అని అందుకున్నాడు. ఉత్తరం కూతురమ్మ రాసిందేనని ఆ మందహాసంలోని

అంతరార్థం. నెఖ్లూదొవ్ కోర్చిగినా రాకుమార్తెనే వివాహం చేసుకుంటాడని ఆమె అనుకుంటోంది. ఆమె అలా అనుకోవటమే నెఖ్లూదొవ్‌కు బాధాకరం అయింది.

"అయితే ఆ వచ్చిన దాసీని ఇంకా సేపు ఉండమని చెబుతాను" అని అగ్రఫేనా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

సువాసనలు గుప్పుతోన్న ఆ లేఖను విప్పి చదువుతున్నాడు నెఖ్లూదొవ్. ఆ బూడిదరంగు దళసరి కాగితంమీద ఉత్తరం ఇది.

"ప్రస్తుతం నేను తమ జ్ఞాపకశక్తిగా పనిచేయవలసి వచ్చింది. ఇవాళ ఏప్రిల్ 28వ తేదీ. తమరు కోర్టులో ఉండాలి. జ్యూరీగా హాజరు కావలసిన రోజు. కాబట్టి మాతోపాటు చిత్రశాలకు ఎలా వస్తారు? వస్తానని నిన్న యథాప్రకారంగా మాట ఇచ్చారనుకోండి; కోర్టుకు హాజరు కాకపోతే ఇచ్చుకోవలసిన 300 రూబుళ్ళ జరిమానాను వొప్పుకుని రాగలరా? ఈ సంగతి నిన్నరాత్రి మీరు వెళ్ళిపోయాక గుర్తుకు వచ్చింది. కనుక జ్ఞాపకం చేయటమైనది—మీ కోర్చిగినా రాకుమారి."

వెనుకవైపు ఇలా రాసివుంది. "ఈ రాత్రి వరకూ తమ స్థానం తమ కోసమే ఖాళీగా ఉంచగలమని అమ్మ తమకు తెలియజేయమంటోంది. ఎంత ఆలస్యం అయినాసరే తప్పక దయచెయ్యండి—ఎం. కో."

నుదురుమీద రేఖలేర్పడేలాగు కనుబొమలెత్తాడు నెఖ్లూదొవ్. ఇందులో కొత్తేమీ లేదు. కోర్చిగినా రాకుమార్తె తన్ను గట్టిగా చిక్కించుకోటానికి నేర్పుగా వలపన్ని, చూపుతోన్న ఎరలో ఇదొకటి.

పెళ్ళాడే యీడు దాటిపోయిన తరువాత సాధారణంగా పురుషుడు—ఎవతెనైనా ఎంతగానో ప్రేమిస్తే తప్ప—పెళ్ళికి ఉబలాటపడడు. ఒకవేళ నెఖ్లూదొవ్ 'పోనీ, గార్హస్థ్యం స్వీకరిద్దాం' అని నిశ్చయం చేసుకున్నా, వెంటనే కోర్చిగినా రాకుమార్తెను వివాహం చేసుకుని ఇంటికి తెచ్చుకునే స్థితిలో లేడు. అందుకు చాలా కారణాలున్నాయి. ఎప్పుడో పది సంవత్సరాల క్రితం తాను మస్లోవా అనే పిల్లను చెరచి, మోసగించి విడిచి వచ్చిన సంఘటన మాత్రం ఆ కారణాల్లో ఒకటికాదు. ఆ విషయం అతనేనాడో మరచిపోయాడు. జ్ఞాపకంవున్నా, తాను పెళ్ళిచేసుకోటానికి అదొక ఆటం

కంగా అతడు భావించేవాడు కాదు. అసలు సంగతేమంటే—అతనికొక సంసార స్త్రీతో సంబంధం వుంది. ఆ సంబంధానికి తాను స్వస్తి చెప్పానని భావించినా, ఆమె మాత్రం వొదులుకునేట్టు లేదు.

ఒక జిల్లా అధికారి భార్య కొంచెం స్వేచ్ఛాప్రియ. ఏవో యెన్నికల సందర్భంలో నెఖ్లూడో ఆ వూరు రావటం సంభవించింది. స్వభావతః అతడు ఆడవాళ్ళ ముందు సిగ్గుపడతాడు. ఈ స్వభావమే జిల్లా అధికారి భార్యను పురికొల్పింది. ఎలాగైనా అతన్ని తలక్రిందు చేద్దామని నిశ్చయించుకుంది. నేర్పుగా అతన్ని ఆకర్షించింది. పరిచయం ప్రణయంగా పరిణతి చెందింది. ఎందులోనో చిక్కుకుంటున్నట్టు భావాసహ్యత అనుభవిస్తూనే నెఖ్లూడో లొంగిపోయాడు. అంతా అయిపోయిన తరవాత పాపం చేశాననుకున్నాడు. అయితే ఆమె సమ్మతి లేకుండా ఈ బంధం తెంపివేసుకోటానికి గుండె చాలటం లేదతనికి. కోర్చాగినా రాకుమారిని పెండ్లి చేసుకోటానికి అతన్ని ముందడుగు వేయనీకుండా వున్న అడ్డంకి ఇదే—

టేబిల్ మీద పడివున్న వుత్తరాల్లో ఒకటి ఆ ఇల్లాలి భర్త రాసింది. అతని దస్తూరి, పోస్టు ముద్ర చూసేసరికి నెఖ్లూడో ముఖం ఎర్రబడిపోయింది. ఏదో అపాయంలో పడనున్నప్పటివలె అతనిలోని అంతశ్శక్తులన్నీ మేల్కొంటున్నాయి కాని ఆందోళనకు తావేమీ లేదని తేలిపోయింది. ఆయన రాసిన విషయం వేరు; మే నెల ఆఖరులో ఒక మీటింగేదో జరుగనున్నదని తెలియజేస్తూ; స్కూళ్లు, రోడ్లు మొదలైన ప్రముఖ విషయాలను గురించిన చర్చలలో తనకు సాయం చేయవలసినదిగా కోరుతూ; తప్పకుండా ఆనాటికి రమ్మని ప్రార్థిస్తూ రాశాడు. ఆ జిల్లాలోనే నెఖ్లూడో జమీ వుంది పెద్దది. విప్లవ పక్షంవాళ్లు తీవ్రంగా వ్యతిరేకిస్తారేమోనన్న భయంచేత ఆ జిల్లా అధికారి నెఖ్లూడో సహాయాన్ని అర్థించాడు.

ఆ యధికారి లిబరల్ పక్షీయుడు. మూడవ అలెగ్జాండరు కాలంలో తీవ్రంగా ఉబికి వచ్చిన విప్లవ వుద్యమాన్ని పెరగనీకుండా కృషిచేస్తూ వుంటాడు తన యనుచరుల సహాయంతో. ఈ రకమైన గొడవలో మునిగి వుంటూ ఇంటి గుట్టు తెలుసుకోలేక పోయాడు.

ఈ పెద్ద మనిషితో సంబంధం వుండినంత కాలమూ నెఖ్లూడోకు దిన దిన గండంగానే వుండేది. వొకసారి అతడు తన గుట్టు కనిపెట్టి దెబ్బ

లాటుకే వస్తున్నట్టుగా తోచింది. అప్పుడు మద్రాసులో పనికి ఉత్తర గాలిలోకి వెళ్ళిపోవాలనుకున్నాడు. మరొకసారి ఆ ఆఫీసరు భార్య విశ్వనాథ్‌తో బావిలోపడి చచ్చిపోదామని వెళ్ళేటప్పటికి పట్టాత్తి పోయింది. తానే వెళ్ళి ఆమెను పట్టుకోవాలసి వచ్చింది.

ఈ సంగతులన్నీ గుర్తుకురాగా ఉత్తరం, కాని, తానిప్పుడు వెళ్ళను. ఆమె దగ్గరనుంచి జాబు రావాలి" అనుకున్నాడు. వారం క్రితం ఆమెకొక ఉత్తరం రాశాడు. అందులో తన అపరాధాన్ని ఒప్పుకుంటూ పశ్చాత్తాపాన్ని వెళ్ళడించాడు. ఇక ఆ సంబంధానికి ఇదివరకు స్వస్తి చెప్పుకోవటమే మంచిది. ముఖ్యంగా నీవు క్షేమాస్ను" అని రాశాడు. ఈ ఉత్తరానికి ఇంకా జవాబు రాలేదు. రాకపోవటమే సంతోషకరంగా కనిపించింది. ఒకవేళ పూర్వ సంబంధాన్ని త్రెంచివేసుకోటం ఇష్టంలేకపోతే వెంటనే జవాబు రాసేది; లేకపోతే తానైనా పరిగెత్తుకుంటూ వచ్చేది. అలా ఇదివరకు ఎన్నిసార్లు రాలేదు! ఇటీవల కొన్నాళ్ళనుంచి ఎవరో ఆఫీసరు ఆవిడమీద గాఢంగా కన్నువేసి వున్నట్టు తెలుస్తోంది. ఇది తనకు ఈర్ష్యాహేతువై, ఎవంత బాధాకరంగా వున్నా ఈ దుర్బంధంనుంచి బైటపడే అవకాశం దొరికిందని సంతోషించాడు.

ఆ తరువాతి ఉత్తరం తన దివాను దగ్గరనించి. అయన నెలకొకసారి ఎస్టేటు చూడ్డానికి వస్తుంటాడు. వచ్చి స్వాధీనపరచుకోమంటుంటాడు. ఎక్కువ లాభదాయకం కాని పద్ధతి మీద ఇన్నాళ్ళనించీ అప్పుల్లోవుంది. చనిపోయిన రాణీగారికికూడా ఇది లాభదాయకం కాదనే తాను సూచించి వున్నాడు. ఇప్పుడు యువరాజుగారికిచ్చే సలహాకూడా అదే. రైతులకు కౌలు కిచ్చేకంటే భూమిని సొం. తవ్యవసాయం కిందికి తెస్తుంటాము. ఈ పద్ధతే చాలా లాభదాయకమంటూ రాశాడు. ఒకటవతేదీనాటికే తాను చెల్లించవలసివుంటే, మూడువేల రూపాయల్స్ ఆదాయం ఇంకా చెల్లించనందుకు క్షమాపణ వేడుకున్నాడు దివాను. త్వరలో పంపుతానన్నాడు. ఇప్పటిదే పంపించకపోవటానికి కారణం రైతులదగ్గరనుంచి వసూలు కాకపోవటమే నట. వాళ్ళు ఎంతో నష్టాలపాలయ్యారట.

ఈ జాబు కొంత సంతోషాన్నే కాక విచారాన్నికూడా కలిగించింది. అంత పెద్ద ఎస్టేటుమీద అధికారం సంక్రమించటం ఆనందదాయకమే కాని

అక్రమం. నెగ్లాడో హెర్బర్ట్ స్పెన్సర్‌ను ఎంతో మెచ్చుకున్నాడు. హెర్బర్ట్ స్పెన్సర్ ఒక గొప్ప సామాజికవాదిగా పేరుప్రఖ్యాతులు గడించాడు. న్యాయంగా ఆలోచిస్తే సొంత భూఆస్తి వుండకూడదని హెర్బర్ట్ వలె వాదించడమే కాకుండా విశ్వవిద్యాలయంలో చదువుకుంటోన్నప్పుడు వ్యాసాలుకూడా రాశాడు నెగ్లాడో.

“చెప్పినట్లు చేద్దాం, చేసినట్లు చెప్పుదాం” అనే పట్టుదలగల యువకుడు కనుక తనకు తండ్రినుంచి సంక్రమించిన 500 ఎకరాల్ని రైతుల కిచ్చేశాడు. ఇటీవల తల్లిద్వారా సంక్రమించాయి పెద్ద ఎస్టేట్లు. ‘పదేళ్ళ క్రితం తనతండ్రినుండి సంక్రమించిన భూమిని రైతుల కిచ్చినట్లే ఈ ఎస్టేట్లను కూడా ఇచ్చివేయవలెనా? లేక నెమ్మదిగా వెనకటి భావాలన్నీ పొరపాట్లు తప్పులూను అని నమ్ముతూ స్థిమితపడవలెనా?’ అనేదే ప్రస్తుత సమస్య. మొదటిపద్ధతిని అనుసరించలేకపోయాడు నెగ్లాడో.

కారణం, ఈ ఎస్టేట్లు తప్ప అతనికి వేరే ఆధారంలేదు. ప్రభుత్వ నౌఖరీ అంటే ఇష్టంలేదు. పైగా తానొక భోగజీవితానికి అలవాటుపడిన వాడు. ఇప్పుడు మార్చుకోటమంటే అసాధ్యం. అదీకాక మునపటి భావాలు మరుగునపడిపోయాయి ఇప్పుడు. చిన్ననాటి ఆశయాలు, యౌవనంలో ఉన్నప్పటి పట్టుదల, అసాధారణ కార్యాచరణకైన ఉత్సాహం — అన్నీ సమసిపోయాయి. సొంత భూఆస్తి కలిగివుండటం అన్యాయమనేది తిరుగులేని వాదం. స్పెన్సర్ చేసిన స్పష్టమైన సాంఘికవాద నిరూపణలకు సమర్థనలు హెన్రీ జార్జి కృతులలో చూచాడు తర్వాత. ఆ వాదన అసమంజసమని కొట్టివేయటమూ అసంభవమే. కాగా ఇవాన్‌జీ రాసిన ఉత్తరం కొంత మానసిక ఆందోళనను కలిగించింది.

❀

నెగ్లాడో కాఫీ తాగి తన చదువుకునే గదికి బయలుదేరాడు. సమన్లు చూచి తానెన్నింటికి కోర్టుకి హాజరుకావాలో తెలుసుకోవాలి; రాకుమారికి జాబు రాయాలి. పోతూపోతూ చిత్రశాలలో ఆగాడు. అక్కడే పూర్తి కాని చిత్తరువు వొకటి స్టాండుమీద నిల్చివుంది. కొన్ని బొమ్మలు గోడమీద వ్రేలాడుతున్నాయి. అవన్నీ చూస్తోంటే ఈ కళారంగంలో పురోగమించ

చేమో నన్న ఆశ ఒకటి ఉంది. మిస్సీకి ఇప్పుడు ఇరవైరెండు యేళ్లు. ఇదే ప్రథమ ప్రణయం కాకపోవచ్చు. ఈ ఆలోచన కలిగినప్పుడల్లా బాధగా ఉంటుంది. ఇతఃపూర్వం ఆమె ఇంకెవరినైనా ప్రేమించియుండవచ్చునన్న ఊహ స్వాభిమానియైన అతనికి దుస్సహంగా ఉంది. ఇలాగ ఒకవంక పెళ్ళి చేసుకోమనీ, మరొకవంక వద్దనీ — ముందుకూ వెనక్కూ లాగుతూన్న రెండురకాల ఆలోచనలలో తల్లక్రిందులౌతూ — తన వ్యవహారం ఇంటికీ, రేవుకీ కాని కుక్కసామెతగా అయిందనుకుని నవ్వుకున్నాడు.

“ఏమయినా సరే, ఆ జిల్లాజడ్జిగారిభార్యదగ్గరనుంచి ఉత్తరం రావాలి. ఆ నింతో తెగతెంపులయేవరకూ నేను ఎటూ నిశ్చయించలేను” అనుకున్నాడు. ఈ సాకుతో సమస్యను వాయిదా వేసుకోగలిగినందున కాస్త మనశ్శాంతి చేకూరింది. బండి కోర్టుగేటు ముందు ఆగింది.

“ఇప్పుడీ ధర్మాసనములైన నా విధుల్ని మనస్ఫూర్తిగా నిర్వహిస్తాను. వస్తుతః కర్తవ్య చింత వేదాంతులు నేర్పేది కాదు. ఈ విధులు ఉల్లాసకరంగానూ వుంటాయి” అనుకుంటూ ద్వారపాలకుల్ని అతిక్రమించి కోర్టుభవనంలో ప్రవేశించాడు.

౨

కోర్టువరండాలు అప్పటికే సందడిగా ఉన్నాయి. డఫేదార్లు ఊపిరి రాడకుండా కాగితపు కట్టలు చంకను పెట్టుకుని అటూ ఇటూ తిరిగి సతమత మవుతున్నారు. ప్లీడర్లు, ప్రాసిక్యూటర్లుకూడా వ్యగ్రచిత్తులై తిరుగుతున్నారు. వాదులు, ప్రతివాదులు విచారంగా గోడలప్రక్కన నుంచుంటున్నారు; కొందరు కూచొని నిరీక్షిస్తున్నారు.

“కోర్టెక్కడ?” అడిగాడు శేఖరం ఓ బంట్రోతును.

“సివిలు కోర్టా, క్రిమినలు కోర్టా? ఏదండి?”

“నేను జూరీ సభ్యుణ్ణి.”

“అయితే క్రిమినలు కోర్టన్నమాట! ఇటు కుడివైపు పోయి ఎడమ ప్రక్క తిరగండి. ఆ రెండోద్వారమే” శేఖరం ఆ గుర్తుప్రకారం వెళ్లాడు. ఆ రెండోద్వారందగ్గిర ఇద్దరు పురుషులు నిల్చి నిరీక్షిస్తున్నారు. ఒకరు

పొడుగ్గా లావుగా ఉన్నాడు. తన బంగారాలు, పాసీయాలు తెచ్చుకున్నాడు - చాలా హుషారుగా ఉన్నాడు. రెండవవాడొక యూనానీయుడు సారావర్తకుడు.

"ఇదేనా జూరీసభ్యుల గది!" అని అడిగాను నెఖ్లూడో. వాళ్ళిప్పుడు ఊలు ధరగురించి మాట్లాడుకొంటున్నారు.

"అవునండీ! మా తోటివారేనా మీరూను. జూరీసభ్యులే కదూ?" అన్నాడా వర్తకుడు హుషారుగా కళ్ళార్పుతూ. నెఖ్లూడో 'అవు'నని తల ఊపి "ఐతే మనమంతా కలిసి పనిచేయాలన్న మాట" అన్నాడు.

"నా పేరు 'బక్లాషోవ్' అంటారండి. తమ నామధేయం తెలవిస్తారూ?" అని అడిగాడు వర్తకుడు.

నెఖ్లూడో తన పేరు చెప్పి జ్యూరీసభ్యుల గదిలోకి వెళ్ళాడు.

ఆ గదిలో పలురకాల మనుష్యులు పదిమంది వున్నారు. వాళ్ళంతా అప్పుడే వచ్చినట్లున్నారు. కొందరు సుఖాసీనులై ఉన్నారు - కొందరు అటు ఇటు పచార్లు చేస్తున్నారు. కొందరు పరస్పర సంభాషణకు దిగి, పరిచయం చేసుకుంటున్నారు. ఒక రిటైర్డు కల్నలు యూనిఫారంలోనే వచ్చాడు. కొందరు కోట్లు తొడిగారు. కొందరు మామూలు కోట్లు ధరించారు. వచ్చిన వాళ్ళలో చాలామందికి ఇలా కోర్టుకు రావలసినందున తమ వ్యాపారాలు పాడైపోతున్నాయని లోలోపల చింత బాధిస్తూన్నప్పటికీ పైకిమాత్రం వాళ్ళందరి ముఖాల్లోనూ ఒక ధర్మాన్ని నెరవేరుస్తున్నామన్న ఆత్మతృప్తి చిందులాడుతోంది.

వాళ్ళంతా వాతావరణం, వ్యాపారాల్లో లాభనష్టాలు మొదలైనవిషయాల్ని గురించి ఊహాగానం చేస్తున్నారు. నెఖ్లూడోతో పరిచయం లేనివాళ్ళు ఆయన ఎరికలో పడాలని తహతహలాడుతున్నారు, అదే ఓ పెద్దఘనతయైనట్లు! అలాగ ఇతర్లు వచ్చి తన పరిచయాన్ని యాచించటం నెఖ్లూడోకు గర్వకారణంగా ఉండేది. "వాళ్ళందరికన్నా నీలో ఉన్న గొప్పదనం ఏమిటి?" అని నిలవదీసి అడిగితే అతడేమీ జవాబు చెప్పలేడు. కొన్నాళ్ళనుంచీ అతడు అనుసరిస్తూన్న జీవనపద్ధతులు ఉత్కృష్టము లనటానికి వీల్లేదు. ఇక పోతే ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ భాషల్ని చక్కని ఉచ్చారణతో మాట్లాడగలడు. ధరించే సిల్కు దుస్తులు, మెడపట్టీలు చాల విలువైనవే కావచ్చు.

అయితే అంతమాత్రాన్నే అందరినీ మించిన ఆధిక్యత వచ్చేసినట్టేనా? కాదని అతనికే తెలుసు. అయినాకూడా తనకు ఏదో ఆధిక్యత ఉన్నదనే భావించాడు. అందరూ చూపించే గౌరవానికి తాను తగుదుననుకునేవాడు. ఎవరైనా అట్టి గౌరవం చూపకపోతే కించపడేవాడు. జ్యూరీసభ్యుల గదిలో అతన్ని కించపరచిన సంఘటన ఒకటి జరిగింది. జ్యూరీ సభ్యులలో ఒక వ్యక్తి కనిపించాడు. అతడు నెఖ్లూదోవ్ సోదరి పిల్లలకు ట్యూషను చెప్పేవాడు పూర్వం. నెఖ్లూదోవ్ అతన్ని బాగా ఎరుగును. ఇప్పుడాతడొక కళాశాలాధ్యాపకుడైనాడు. అతడిప్పుడు ముందుకువచ్చి నెఖ్లూదోవ్‌తో ఎంతో పూర్వపరిచయం కలవాడుగా, బెరుకులేకుండా మాట్లాడ్డం, పకపక నవ్వటం నెఖ్లూదోవ్ ఆత్మగౌరవానికి అఘాతంలా ఉంది. చాల అసహ్యించుకున్నాడు లోలోపల.

అధ్యాపకుడు పీటర్ ముందుకువచ్చి “ఓహో, నువ్వుకూడా ఈ బోనులో చిక్కుకున్నావన్నమాట!” అంటూ పకపకనవ్వులతో నెఖ్లూదోవ్‌ను పలుకరించాడు. “ఈ బోనులోనుంచి తప్పించుకుపోలేకపోయావన్నమాట!”

“తప్పించుకుపోవాలని నేనెప్పుడూ ప్రయత్నించలేదే!” అన్నాడు నెఖ్లూదోవ్ నిరుత్సాహంగా, గంభీరంగా.

“అదె, అదే నిజమైన సంఘసేవ అంటేను. కాని కాస్త ఆకలి అయే వరకూ – నిద్రమత్తు ముంచుకువచ్చేవరకూ ఆగు. అప్పుడింకో పదం పాడతావు.”

ఈ చర్చిలో పూజారికొడుకు పీటర్‌గాడు తనంతటివాణ్ణి ఏకవచనంలో సంబోధిస్తాడా అని నెఖ్లూదోవ్‌కు చాల విచారం కలిగింది. తనబంధువులంతా చనిపోయారన్న దుర్వార్త విన్నప్పటివలె చాల విచారపడ్డాడు. ముఖం తిప్పుకుని మరోవైపు నడిచిపోయాడు. అక్కడ ఎవరో పెద్దమనిషి– గడ్డం, మీసాలు నున్నగా గొరిగించుకున్నాడు– పొడుగ్గా ఠీవిగా ఉన్నాడు– సివిల్ కోర్టులో జరుగుతోన్న ఒక కేసునుగురించి రసవంతంగా చెబుతున్నాడు. జడ్జీలు, ప్లీడర్లు చాలమంది తనకు చిరపరిచితులైనట్టు లేత పేరకాయలు కోస్తున్నాడు. ఆ కేసులో జడ్జీగారి తీర్పుప్రకారం ఒక ముసలిసీమవతి— న్యాయం అంతా తనదే అయినా—చాల సొమ్ము తన ప్రతికక్షికి ఇచ్చుకోవలసి వచ్చిందట. అటువంటి తీర్పు ఇచ్చేలాగ మేధావియైన ప్లీడరు కేసును

వచ్చినవాడు న్యాయసభా సభ్యులలో ఒకడు. అతని కన్నులలోని అసంతృప్తి రేఖలు బంగారు అంచుల కళ్ళద్దాల్లోనుంచి తొంగిచూస్తున్నాయి.

"మాథ్యూనికిటిచ్ ఇవాళ కూడా రాలేదు సుమండీ" అన్నాడు.

"ఇంకా రాలేదూ?" అన్నాడు అధ్యక్షుడు యూనిఫారం ధరిస్తూ. "ఆయనగారెప్పుడూ ఆలస్యంగానే వస్తాడు."

"అతగాడికి సిగ్గన్నా లేదేమంటా?" అని కోపంగా పలుకుతూ ఆ వచ్చిన సభ్యుడు కుర్చీలో కూలబడి, సిగరెట్టు వెలిగించాడు.

ఈయన చాలా నిక్కచ్చి మనిషి. ఆ ఉదయమే పెళ్ళాంతో కాస్త పేచీ పడ్డాడు. ఆమెకు సొంత ఖర్చులకింద ఇచ్చిన డబ్బును నెల కాకముందే ఖర్చు చేసేసుకుంది. పైగా ఇంకా కొంత డబ్బును-పై నెల్లో ఇవ్వాల్సింది-ఇప్పుడే ఇవ్వమంటోంది. అతడు లొంగలేదు. దీనితో పెద్ద కలహం అయింది.

"అలాగైతే మీకు ఇంట్లో భోజనం ప్రాప్తిలేదు; దయచెయ్యండి" అని ఆమె తర్జించింది. అతడు ఇంట్లోనుంచి లేచివచ్చేశాడు. ఆమె ఎంతకైనా తగిన మనిషి. అన్నట్లు చేస్తుంది కూడాను. అని గుండె బెదురుతో ఉన్నాడు. "ఏదో నైతికంగా సంసారం గడుపుకు పోదాం" అనుకున్నవారి గతి ఇలాగే ఉంటుంది" అనుకుంటూ ఆరోగ్యవంతంగా, ఉల్లాసంగా ఉన్న అధ్యక్షునికేసి ఈర్ష్యగా చూస్తున్నాడు. అధ్యక్షుడు సవిలాసంగా తన జులపాలు సరిదువ్వుకుంటున్నాడు. "ఆయన చూడు, ఎంత ఆత్మతృప్తితో సముల్లాసంగా ఉన్నాడో! నేనో, నానా బాధలు పడుతున్నాను" అనుకున్నాడు.

ఇంతలో కార్యదర్శి వచ్చాడు దస్తావేజులు కావాల్సి పుచ్చుకుని.

"ముందు ఏ కేసు విచారిద్దాం?" అధ్యక్షుడు ప్రశ్నించాడు.

"ఆ విషప్రయోగపు కేసే" అన్నాడు కార్యదర్శి.

"అయితే సరే, మంచిదే" అన్నాడు అధ్యక్షుడు. నాలుగు గంటలు అయ్యేసరికి పని ముగించేసి వెళ్ళిపోవచ్చుగదా అని భావిస్తూ "అయితే మరి మాథ్యూనికిటిచ్ వచ్చాడా?"

"ఇంకా రాలేదు."

"మరి బ్రెవే?"

చేశాడు. అందుచేతనే గోజూకన్నా ఎక్కువసేపు ఇంటిదగ్గర ఉండిపోవలసి వచ్చింది. మంటపం ఎక్కుతూ ధ్యానముద్ర పట్టాడు. ఏ సమస్యనైనా పరిష్కరించటానికి అతడు కొన్ని విచిత్రమైన, ఎక్కడా లేని విధానాలను అనుసరిస్తాడు. అట్టి విధానాలలో ఫలితమే అప్పుడప్పుడతడు ప్రదర్శించే ఈ ధ్యానముద్రలు. ఈ కడుపునొప్పి రోగం నయం ఔతుందా, లేదా? ఇదీ అతనికి తేలవలసిన సమస్య ఇప్పుడు. ద్వారందగ్గరనుంచి మంటపంమీద తన కుర్చీదగ్గరకు వెళ్ళేసరికి ఎన్ని అడుగులు పడతాయో, ఆ సంఖ్య మూడుచేత నిశ్శేషంగా భాగింపబడితే తనరోగం కుదురుతుంది అని భావించాడు - కనుక జాగ్రతగా అడుగులు లెక్కపెట్టుకుంటూ వస్తున్నాడు - కుర్చీవద్దకు వచ్చేసరికి 26 అయినాయి. ఎలాగో మరో అడుగుకూడా వేసి 27 చేశాడు. 27 మూడుచేత నిశ్శేషంగా భాగింపబడుతుంది కాబట్టి ఈ కొత్త చికిత్సా విధానంవల్ల తనరోగం కుదరవచ్చునని సంతృప్తిపడ్డాడు.

యూనిఫారం దుస్తులు ధరించి, జరీఅంచుల మెడపట్టీలతో అధ్యక్షుడు, సభ్యులు ఠీవిగా ఉన్నారు. సహజంగా తాము చాల ఘనులమని వాళ్లే అనుకుంటూ ఉంటారు. వారు కూర్చున్న కుర్చీల ముందున్న మేజామీద ఒక త్రిభుజాకారపు దిమ్మ ఉంది. దానిమీద గద్దబొమ్మ ఉంది. ఇవిగాక కలాలు, సిరాబుడ్లు, అప్పుడే చెక్కిపెట్టిన పెన్సిళ్లూ ఉన్నాయి. జడ్జీలతో సహా పబ్లిక్ ప్రాసిక్యూటరుకూడా వచ్చాడు. ఒకచంకలో కాగితాల కట్టలు ఇరికించుకుని, మరో చేయి ఊపుకుంటూ వచ్చాడు. కిటికీదగ్గరవున్న తన డెస్కుదగ్గర ఆసీనుడై, ఒక్కనిమిషంకూడా వృధాపోనీయక కాగితాలు తీసి చదువుటలో నిమగ్నుడైనాడు. కేసు ఆరంభించేలోగా విషయమంతా హృదయస్థం చేసుకుని సిద్ధంగా ఉండాలని అతని ఆతృత. ఇతడు కొద్దికాలం కిందనే ఈ ఉద్యోగంలోకి వచ్చాడు. ఇంతవరకు నాలుగుకేసులు పట్టాడు. పదవీమోహం గల మనిషి. గబగబా ప్రమోషనులు సంపాదించాలని ఆశ. కనుక పట్టిన ప్రతికేసూ వృధాపోకుండా శిక్షపడేలాగు చూడాలని అతని పట్టుదల. విషప్రయోగపు కేసు వెనుకముందులు అవగాహన చేసుకున్నాడు. ఇవ్వవలసిన ఉపన్యాసాన్ని సిద్ధం చేసుకునే వున్నాడు. అయితే ఇంకా కొన్ని అంశాలు గుర్తుతెచ్చుకోవలసిన అవసరం ఏర్పడింది. కాగితాలు తిరగవేస్తూ గమనిస్తున్నాడు.

ఎదురుగా కాన్వాస్ కుర్చీ కూచుని వున్నాడు. కావలసిన రికార్డు, కాగితాలన్నీ సిద్ధంచేసి పెట్టుకున్నాడు. బహిష్కరింపబడిన పత్రికలోని ఒక వ్యాసాన్ని చూస్తూ కూచున్నాడు. లోగడ దినం ఎలాగో సంపాదించాడు దాన్ని. ఆ వ్యాసాన్ని గురించి ఆ కమ్యూనిస్టు సభ్యునితో చర్చించాలని అతని ఉబలాటం. ఇద్దరి ఊహలూ కొత్త కలుస్తాయి. కనుక ముందుగా ఒక సారి వ్యాసాన్ని పరికిస్తున్నాడు.

౨

ప్రెసిడెంటు కొన్ని కాగితాల్ని అవగాహన చేసుకుని, గుమాస్తాను కార్యదర్శిని కొన్ని ప్రశ్నలడిగి, సవ్యమైన సమాధానాలను పొందిన తరువాత ఖైదీల్ని హాజరు పెట్టవలసిందిగా ఆజ్ఞాపించాడు.

కొయ్య స్తంభాల వెనుకవున్న తలుపు తెరచుకుని ఇద్దరు పోలీసులు తళ తళలాడే కత్తులతో ప్రవేశించారు. వారి వెనకాలే—రాగి జుట్టుగల స్ఫోటకం మచ్చల పురుషుడొకడు, ఇద్దరు స్త్రీలు—మొత్తం ముగ్గురు ఖైదీలు వచ్చారు. ఆ పురుష ఖైదీ జైలు అధికార్లిచ్చిన చొక్కా తొడుక్కుని ఉన్నాడు. అది చాలా వొదులుగా ఉంది. పొడుగాటి చొక్కా చేతులు క్రిందికి జారిపోకుండా తన చేతుల్ని పక్కలకు అదుముకుంటూ లోనికి వచ్చాడు. జడ్జీలవంక చూడకుండా బెంచీమీద ఒక చివర వెళ్ళి కూచున్నాడు, మిగిలిన వాళ్ళకు బోలెడంత చోటు విడిచిపెట్టి. ప్రెసిడెంటుమీద చూపులు నిలిపి, ఏమో గొణుక్కుంటూన్నట్టు దవడలాడించాడు

అతని వెనకాలే వచ్చిన ఆడఖైదీ కూడా జైలు దుస్తుల్లోనే ఉంది. తలకొక రుమాలు చుట్టుకుంది. వయసు మళ్ళిన మనిషి. మొగం పాలిపోయి వుంది. కనుబొమలు లేవు. కనురెప్పలు బోసివి. జేవురించిన కళ్ళు. శాంత మూర్తిలా ఉంది. వస్తోంటే గౌను దేనికో తగుల్కుంది. తొందరపడకుండా జాగ్రత్తగా తప్పించి, వచ్చి కూచుంది.

మూడవ ఖైదీ మస్లోవా.

ఆమె రాగానే కోర్టులోని అందరికళ్ళూ అటువైపే పరుగెత్తాయి. అందరి చూపులూ ఆమె ముఖపద్మంమీదే, ఆమె కాటుక పిట్టలవంటి కన్నుల

మీకే, జైలువాసం తొందరగానిచ్చిన కిటికీలోంచి తొణుకుతోన్న సొమ్ముగినాడే తాండవసాగింది. అక్కడవ కాపలాగా నిలబడివున్న పోలీసువాడు కనబడ్డాడా. .. తన ముందునుంచి వెళుతోన్న ఆమెవైపు అలాగే చూస్తూ ఉండిపోయాడు. ఆమె వచ్చి బెంచీమీద కూర్చునేవరకూ అలాగే చూచి చూచి, చివరకు తన్నుతాను తెలుసుకుని, తప్పునుకుని, ముఖం తిప్పుకున్నాడు; ఏమెరగనట్టు కిటికీవైపు చూస్తూ నిల్చున్నాడు.

కోర్టులో ఇక జరగవలసిన తంతు ఆరంభమైంది. జ్యూరీ సభ్యుల్ని లెక్కించారు. రానివాళ్ళను గురించి వ్యాఖ్యానించారు. వాళ్ళు చెల్లించవలసిన జరిమానాను నిర్ణయించారు. మరి కొంతమంది రిజర్వు జ్యూరీలను నియమించారు.

చిన్న చిన్న కాగితాలమీద పేర్లు వ్రాసి పడవేసిన ఓ గిన్నెలో వేసి, జరీ అంచుగల చొక్కా చేతుల్ని పైకిలాగి—న్యాయమూర్తివలె ముఖభంగిమ పెట్టి - ఒక్కొక్క పేరే తీసి చదువుకొని - చొక్కా చేతుల్ని కిందికి లాగాడు ప్రెసిడెంటు. జ్యూరీసభ్యుల చేత ప్రమాణాలు చేయించమన్నాడు గురువుతో.

ఆ గురువుగారు ముసలివాడు - బూర్జువాని అతని మొహం పాలిపోయి వుంది. కాషాయరంగు గౌను, బంగారు శిలువ, ఓ చిన్న పతకం ధరించివున్నాడు. అతికష్టంమీద వ్యాసపీఠంవైపు నడిచివచ్చాడు. కూర్చున్న జ్యూరీసభ్యులందరూ లేచి గుమిగూడారు వ్యాసపీఠం దగ్గర.

శిలువకు హృదయానికి తాకుకొంటూ వాళ్ళంతా తనకు దగ్గరగా వచ్చేవరకూ ఆగాడు.

ఈ గురువు 43 ఏళ్ళనుండి పని చేస్తున్నాడు. మరో మూడేళ్ళలో జరగబోయే సువర్ణోత్సవానికి తయారవుతున్నాడు. ఈ క్రిమినలు కోర్టు పుట్టినప్పటినుంచీ ఈ స్థానాయన. లక్షలాదిమందిని ఇలా కోర్టులో ప్రమాణాలు చేయించి ఉండటమే ఆయనకొక గర్వకారణం. అంత ముసలి అయినా ఈ పదవీభారాన్ని చర్చి శ్రేయస్సు, పితృభూమి శ్రేయస్సు, కుటుంబ శ్రేయస్సు కోరి, మోస్తూనే ఉన్నాడు. తన తదనంతరం కుటుంబానికి ఒక ఇల్లు, మూడు వేల రూబుల్సు ఈ సొమ్ముమీద పెరుగుతోన్న వడ్డీ సంక్రమింపచేయ

ఈ ప్రమాణాలు పూర్తయిన తర్వాత ప్రెసిడెంటు జ్యూరీ సభ్యుల్ని తమలో ఒక పెద్దని ఎన్నుకోమన్నాడు. అంతట అందరూ బిల బిలా పక్క గదిలోకి పోయి సిగరెట్లు ముట్టించారు. ఒకడు ఆ దర్జా పురుషుణ్ణి పెద్దగా ఉపపాదించాడు. అందరూ ఏకగ్రీవంగా అతన్నే ఎన్నుకొన్నారు. అంటించిన సిగరెట్లన్నీ ఆర్పివారేసి అందరూ మళ్ళీ వచ్చి కూర్చున్నారు కోర్టులో.

దర్జాపురుషుడు తానే పెద్దగా ఎన్నుకోబడినట్లు, ప్రెసిడెంటు కెరిగించాడు.

ప్రతిదీ చకచకా సాఫీగా సాగిపోయింది. జరుగుతోన్న తంతులో గాంభీర్యం తొణుకుతోంది. ఈ క్రమం, గాంభీర్యం ఏదో సంతృప్తిని తోపింప చేస్తోంది. నెక్లూడో కూడా అలాగే భావించాడు.

జూరీ సభ్యులు తమ ఆసనాల్ని అధిష్ఠించిన తర్వాత ప్రెసిడెంటు ఒక చిన్న ఉపన్యాసం ఆరంభించాడు. వారి హక్కులు, బాధ్యతల గురించి మాట్లాడినంతసేపూ తన అంగ భంగిమలు మారుస్తూనే ఉన్నాడు; ఓసారి కుడివైపు ఒరువాలి, మరోసారి ఎడమ చేయి బల్లమీద మోపి, ఇంకోసారి కుర్చీని ఆనుకొని, అప్పుడప్పుడు కాయితాలలో కలంపుల్లలో ప్రమ్ముకుంటూ పలురీతుల విలాసాలు చూపించాడు.

జూరీలు సాక్షులను ప్రెసిడెంటు ద్వారా ప్రశ్నించవచ్చు. సాక్ష్యం కోసం పట్టితెచ్చిన వస్తువుల్ని పరీక్షించవచ్చు. వ్రాతకోతలు జరపవచ్చునట కూడా. న్యాయ నిర్ణయం వాళ్ళ విధి. కోర్టు రహస్యాలను బహిర్గతం చేసినా, ఇతరులతో గూడుపుఠాణీ చేసినా శిక్షార్హులౌతారు.

ఇలా జూరీల విధుల్ని గురించి అధ్యక్షుడు చేసిన ఉపన్యాసాన్ని అందరూ మర్యాదగా విన్నారు. వర్తకుడు బ్రాందీ తాగిన ఊర్పుల సువాసనను వ్యాపింపజేస్తూ, దగ్గుల్ని ఆపుకుంటూ ప్రతిమాటకీ తల ఊపుతూ శ్రద్ధగా విన్నాడు.

(5)



ఉపన్యాసానంతరం ప్రెసిడెంటు ఖైదీలవైపు తిరిగాడు. "సైమన్, నిలబడు !"

సైమను చటుక్కున లేచాడు. వొణుకుతున్నాయి అతని పెదవులు.

"నీ పేరు ?"

"సైమను" గబగబా చెప్పాడు జీరగొంతుకతో తయారుచేసిన జవాబులాగ.

"వర్గం ?"

"రైతు."

"నివాసం ?"

"క్రాపివెనోస్కీ జిల్లా, భోర్కీ గ్రామం."

"వయస్సు ?"

"ముప్ఫయి మూడు. 1008లో పుట్టాను."

"మతం ?"

"సనాతన సాంప్రదాయం; రష్యా మతం."

"పెళ్ళయిందా ?"

"లేదండి బాబూ !"

"నీ వృత్తి ?"

"హోటలు మారిటేనియాలో నౌకరీ."

"ఇదివరకు ఎప్పుడేనా కోర్టుకు ఎక్కావా ?"

"లేదండి. మా ఊళ్లో మా పూర్వపు బ్రతుకు—"

"అయితే ఇదివరకెప్పుడూ కోర్టుకు ఎక్కలేదన్న మాట !"

"దేవుని దయవల్ల లేదండి."

"కేసు కాగితం నీకు అందిందా ?"

"అందింది."

"కూర్చో."

"యూఫీమియా" అంటూ మరో ఖైదీని పిల్చాడు ప్రెసిడెంటు.

యూఫీమియాకు ముందు సైమన్ ఇంకా నిలబడే ఉండటం చూసి అతన్ని కూచోమని ఆజ్ఞాపించాడు; సైమను అలాగే ఉన్నాడు.

మళ్ళీ "సైమన్ కూచో" అని కేక వేశాడు.

గుమాస్తా వచ్చి తల నిక్కించి మిడిగుడ్లు చూపి "కూచో, కూచో" అని ఉరిమాడు భయంకరంగా. ఎంత గాభరాతో లేచాడో అంత గాభరాతో కూచున్నాడప్పుడు సైమను. మునుపటిలాగే అతని పెదవులు వొణికిపోతున్నాయి.

"నీ పేరు?" నిట్టూర్పుతో ఖైదీని అడిగాడు ఆమెవంక చూడకుండానే అధ్యక్షుడు ఏదో కాగితాన్ని చదువుకుంటూ - గబగబా పని పూర్తిఅవటం కోసం, అలా రెండేసిపనులు ఒకేసారి చేస్తూఉండటం ఆయనకు అలవాటైపోయింది.

యూఫీమియా నలభైమోడుసంవత్సరాల వృద్ధ. కోలమ్నా గ్రామస్థురాలు. సైమన్‌కువలెనే హోటలు మారిటేనియాలో నౌకరీ.

"నే నింతకుపూర్వం కోర్టుకు ఎక్కలేదు. కేసు కాగితం అందింది"—చాలా ధైర్యంగానే సమాధానం చెప్పిందామె, ఇదేం జడిసేరకం కాదన్నట్లు.

చివర ప్రశ్నకు జవాబు చెప్పేసి, అధికారి ఆజ్ఞకోసం ఆగకుండా కూచుండిపోయింది.

"నీ పేరు?" అన్నాడు రసికుడైన ప్రెసిడెంటు మూడో ఖైదీని చూస్తూ ఒక ప్రత్యేకమైన ఆదరణ ఒలికిస్తూ.

మస్లోవా లేవలేదు. అలాగే కూచుంది.

"లేచి నిలబడాలి"—అతిమృదువుగా అన్నాడు.

వెంటనే మస్లోవా లేచి నిల్చుంది. ఆమె రొమ్ము ఉబికింది. నల్లని కన్నుల్లో చిరునవ్వులు విరిశాయి. ప్రెసిడెంటును చూస్తూ అలాగే నిల్చుంది—

"నీ పేరు?"

"లూబోవ్"

నెహ్లూడోవ్ ముక్కుద్దాలు తగిలించాడు. ఖైదీలకేసి పరీక్షగా చూస్తూ కూచున్నాడు. "అయి వుండదు. అసంభవం" అనుకున్నాడు ఆమెకేసి చూస్తూ.

"లూబోవ్! ఎందుకొస్తుంది?" అనుకున్నాడు ఆమె తన పేరు చెప్పిన తరువాత.

ప్రెసిడెంటు మామూలుగా తన ప్రశ్న పరంపర విసురబోతున్నాడు. కళ్ళద్దాల సభ్యుడు అడ్డువచ్చి, కోపంగా ఆయన చెవిలో ఏదో చెప్పాడు. ఆయన తల ఊపి, ఖైదీని లక్ష్యించి "అదేమిటి? నీ పేరు లూబోవ్ అని లేదిక్కడ" అన్నాడు.

ఖైదీ ఏ జవాబూ చెప్పలేదు.

"నీ అసలు పేరు కావాలి"

"పుట్టినప్పుడు శుద్ధిస్నానం నాడు పెట్టిన పేరు కావాలి" అన్నాడు కళ్ళద్దాల సభ్యుడు కోపంగా.

"ఇదివరకు నన్ను కేటుకినా అని పిల్చేవాళ్ళు."

"ఊహుం-అయివుండదు" అనుకున్నాడు నెహ్లూడోవ్. కాని హృదయాంతరాళంలో పూర్తిగా తెలిసిపోయింది. ఈమె ఆ పిల్లే—తన మేనత్తల యింట్లో, అటు దాసీ కాకుండా, పూర్తిగా సంస్కారవతీ కాకుండా పెరిగిన ఆ పిల్లే—ఒకప్పుడు తాను కామించిన, నిజంగా ప్రేమించిన పిల్లే—పట్టరాని తమకంలో అవశుడైన ఒకక్షణాన తాను చెరచిన పిల్లే. అప్పటినుంచి మళ్ళీ ఈ నాటివరకూ ఆమెనుగురించి స్మరించనైనా లేదు తాను—స్మరిస్తే హృదయానికి నొప్పి కలుగుతుంది గనుక స్మరించలేదు. తానొక ఆత్మసంపత్తి, కులీనత గల వాడు. అలాగని గర్వపడతాడు తాను—అటువంటి తానే ఈ యువతిపట్ల అంత నీచంగా, అవమానకరంగా ప్రవర్తించియున్న విషయాన్ని జ్ఞాపకం తెచ్చుకోనటం బాధాజనకమే కదా!

ఈమె ఆమే. అదిగో, ఆ ముఖంలో ఒక చెప్పరాని, విచిత్రమైన ప్రత్యేకత! అందరిముఖాలవంటిది కాదా ముఖం! అటువంటిముఖం మరెక్కడా లేదు. దానికదే సాటి. విశిష్టమైన ప్రత్యేకత కలది - ప్రస్తుతం పాలిపోయి ఉంది. అయినా ఆ తియ్యని వైచిత్ర్యం, ప్రత్యేకత కనిపిస్తూనే ఉన్నాయి—పెదవుల్లో, మెల్లకంటి చూపుల్లో, కంఠధ్వనిలో...

"నీ వంశం పేరు ?"—ప్రెసిడెంటు అడిగాడు.

"మా తల్లిగారి యింటిపేరు మస్లోవా. నన్నూ అలాగే పిలుస్తారు."

"ఏ వర్గం ?"

"కూలీ"

"మతం ? సనాతన సంప్రదాయమేనా ?"

"చిత్తం"

"వృత్తి ? ఏ వృత్తిలో ఉన్నావు ?"

మస్లోవా మాటాడలేదు.

"ఏం నౌకరీ చేస్తున్నావు ?"

"ఒక వ్యాపారంలో"

"ఏం వ్యాపారం అది?"-కళ్ళద్దాల సభ్యుడు కోపంగా ప్రశ్నించాడు.

"మీకు తెలుసుగా !" అంటూ మస్లోవా మందహాసం చేసింది. తడ బడిపడుతూ ఒకసారి చుట్టూ చూచింది; మళ్లీ ప్రెసిడెంటు ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

ఆమె ముఖకవళికలలో ఒక అసాధారణ భావశబలత కనిపించింది ప్రెసిడెంటుకు. ఆమె పలుకుల్లో, నవ్విన చిరునవ్వులో, చుట్టూ చూచిన చూపులో కరుణరసం తొణుకుతున్నట్టుంది. ప్రెసిడెంటు కాసేపు ప్రాన్పడి పోయాడు. కోర్టంతా నిశ్శబ్దంగా ఉండిపోయింది. చివరకు ప్రేక్షకుల బెంచీలలో ఒకడు పక్కున నవ్వాడు. 'ఇశ్' అని నిశ్శబ్దం కోరుతున్న వాడులా ఒకడు అన్నాడు. తరువాత ప్రెసిడెంటు మళ్లీ తన ప్రశ్నపరంపర సాగించాడు.

"ఇదివరకెప్పుడేనా కోర్టుకెక్కావా ?

"ఎన్నడూ లేదు"—ఆమె ఒక నిట్టూర్పు విడిచింది.

"కేసు కాగితం అందిందా ?"

"ఆ !"

"కూచో,"

ఓ అందమైన స్త్రీ తన ఉత్తరీయపు కొంగు సర్దుకొనే వొయ్యారం చిలుకుతూ వెనక్కి వంగి గౌను అంచులు సర్దుకొని కూచుంది, తన తెల్లని చిన్న చేతుల్ని ఖైదీ దుస్తుల్లో తుడుచుకొంటూ - ఇంకా ప్రెసిడెంటు వైపే చూస్తోంది.

సాక్షుల్ని పిలిపించారు. నిపుణులుగా వైద్యవిద్యగల డాక్టర్ని పిలిచారు కోర్టులోపలికి.

కార్యదర్శి లేచి కేసు వివరాల్ని చదివి వినిపించాడు. 'ల,ర'లను ఒకేలా ఉచ్చరించినా ఖంగున, బిగ్గరగా చదివాడు. కాని అతడు వేగంగా చదవటంమూలాన్ని మాటలు కలిసిపోయినవి. అర్థం కొట్టుకుపోయింది, అయోమయంగా తయారైంది.

జడ్జీలు రకరకాల భంగిమల్లో కూచున్నారు—ముందుకు వెనక్కి వాలుతూ; ప్రక్కలకు ఆనుకొంటూ; కళ్ళు తెరుస్తూ, మూస్తూ. పోలీసు కెన్నోసార్లు ఆవలింత వచ్చింది. కాని అతికష్టంమీద ఆపుకొన్నాడు.

సైమన్ దవడ ఆడిస్తూనే ఉన్నాడు. యూఫీమియా నిశ్శబ్దంగా నిటారుగా కూచుంది, అప్పుడప్పుడు గోళ్ళతో తల గీరుకుంటూ.

మస్లోవా కదలకుండా మెదలకుండా నేరం వివరాలు చదివేవాని వేపు తేరిపార చూస్తోంది. అప్పుడు సమాధానం చెప్పాలన్న ఆతృత చేవలె కదిలేది, మళ్ళీ సిగ్గుపడి ఊరుకొనేది; దీర్ఘంగా నిట్టూర్చేది; చేతుల స్థానం మార్చి, చుట్టూ చూసి, మళ్ళీ కార్యదర్శివైపు చూపుల్ని కేంద్రీకరించేది.

నెఖ్ల్యూదోవ్ కళ్ళద్దాలు తీయకుండానే మస్లోవాను చూస్తూ కూచుండిపోయాడు ఎత్తయిన కుర్చీలో మొదటి వరుసలో. అతనిలో అతి భయంకరమైన అంతర్యుద్ధం చెలరేగింది.

## ౧౦

నేరం వివరాలివి:—

క్రీస్తుశకం 1088 వ సంవత్సరం జనవరి 17 వ తేదీన హోటలు మారిటానియా యజమాని పోలీసు రిపోర్టు ఇచ్చాడు; తన హోటలులో స్మెల్కోవ్ అనే వ్యాపారస్తుడు హఠాత్తుగా మరణించాడని. అతడు సైబీరియా నుంచి వచ్చాడట.

వెంటనే శవాన్ని డాక్టరు పరీక్షకు పంపారు. అధికంగా మద్యం సేవించటంవల్ల హృదయకోశం దెబ్బతిని మరణించాడని డాక్టర్ రాశాడు. తరువాత శవాన్ని పూడ్చేశారు యథావిధిగా.

స్మెల్కోవ్ చనిపోయిన నాల్గవనాడు అతని స్నేహితుడు, తోటి వర్తకుడు అయిన టిమోఖిన్ పీటర్స్‌బర్గునుంచి వచ్చాడు.

టిమోఖిన్ తన స్నేహితుని మరణవార్తను, అప్పటి పరిస్థితులూ విన్నాడు. స్మెల్కోవ్ పొందినది దుర్మరణమేనని అతడు అనుమానించాడు.

స్మెల్కోవ్ ఆధీనంలోని కొంత ధనం, వజ్రపు ఉంగరం అతని మరణానంతరం రాయబడిన అతని వస్తువుల జాబితాలో కనిపించటంలేదు. కాబట్టి కొందరు దుర్మార్గులు అతన్ని విషంపెట్టి చంపి, అవి కాజేసి ఉండవచ్చు అని తన అనుమానాన్ని పోలీసులకు తెలిపాడు. తర్వాత దర్యాప్తు చేయగా తేలిన విషయాలివి:—

1. స్మెల్కోవ్ వద్ద బ్యాంకునుండి తెచ్చుకొన్న 3800 రూబుల్సు వుండి వుండాలి. ఈ డబ్బు విషయం తెలిసినవారు హోటలు యజమాని, స్మెల్కోవ్ గుమాస్తా స్టారికోవ్ ఇద్దరే. ఆ గుమాస్తాకూ స్మెల్కోవ్‌కూ వ్యాపార వ్యవహారాలు నడిచాయి. స్మెల్కోవ్ మరణాంతరం సీలువేయబడిన అతని తోలు సంచిలో 312 రూబుల్సు 15 కోపెక్సు మాత్రమే వున్నాయి.

2. స్మెల్కోవ్ చనిపోయిననాటి క్రితం రోజంతా కూడా మస్లోవా అనే వేశ్యతో గడిపాడు. ఆ వేశ్య హోటల్‌లో అతని గదికి కూడా రెండు సార్లు వచ్చింది.

3. స్మెల్కోవ్‌కు చెందిన వజ్రపు వుంగరాన్ని ఈ వేశ్య తన యజమానురాలికి అమ్మింది.

4. స్మెల్కోవ్ మరణించిన మర్నాడే ఆ హోటల్లో పనికత్తె అయిన యూఫిమియా 1800 రూబుల్సు బ్యాంకులో తనపేర కరెంటు అకౌంటులో డిపాజిట్ చేసుకుంది.

5. హోటల్‌లో పని చేస్తున్న సైమన్ వేశ్యకు ఏదో పొడి ఇచ్చాడు. దాన్ని బ్రాందీలో కలిపి ఆ వేశ్య (మస్లోవా) వర్తకునిచేత త్రాగించింది. అలాగని మస్లోవాయే ఒప్పుకుంది.

క్రాసు పరీక్ష చేసినప్పుడు మస్లోవా చెప్పిన విషయాలు ఏమంటే:- "మస్లోవా వుంటోన్న పడుపుకొంపకి స్మెల్కోవ్ వెళ్ళాడు. డబ్బు కావల్సి వచ్చింది. హోటలులో తన గదికి వెళ్ళి తీసుకురమ్మని అతడు మస్లోవాను పంపించాడు. ఆమెకు తన తోలుపెట్టె తాళంచెవి కూడా ఇచ్చాడు. ఆమె వెళ్ళి తోలుసంచి తెరచి-ఆ వర్తకుడు చెప్పిన ప్రకారం 40 రూబుళ్ళు మాత్రమే తీసుకుంది. ఆమె పెట్టె తెరుస్తూ ఉన్నప్పుడు యూఫీమియా, సైమన్ కూడా వున్నారు. ఆమె ఆ 40 రూబుళ్ళు తప్పితే మరింకేమీ తీసుకోలేదు. అందుకు సైమన్, యూఫీమియా సాక్షులు.

మస్లోవా ఇంకా ఇలా చెప్పింది—"రెండోసారి తాను హోటల్లో ఆ వర్తకుని గదికి వచ్చినప్పుడు... సైమన్ యిచ్చిన పొడిని బ్రాందీలో కలిపి అతన్ని త్రాగించిన మాట వాస్తవమే. కాని అది ఒక మత్తుమందని తాను భావించింది. అది అతడు త్రాగి నిద్రావశుడైపోతే తాను స్వేచ్ఛగా పారిపోవచ్చుగదా అని అలా చేసింది. అంతేగాని, అతని సొమ్ము తానేమీ ముట్టుకోలేదు. తన్ను స్మెల్కోవ్ కొట్టాడు. అప్పుడు తాను ఏడుస్తూ వెళ్ళిపోతానని బెదిరించింది. అతడు తన్ను నిలుపుకుందామన్న కోరికతో ఆ వజ్రపు వుంగరాన్ని స్వయంగానే ఇచ్చాడు."

తిరిగి క్రాసుపరీక్ష చేయగా యూఫీమియా చెప్పినదిది:- "డబ్బు పోవడం సంగతి తనకేమీ తెలియనే తెలియదు. తాను స్మెల్కోవ్ గదిలోకైనా పోలేదు. మస్లోవా ఒక్కతే ఆ గదిలో తిరిగింది. దొంగతనం జరిగే వుంటే మస్లోవా వర్తకుని తాళంచెవి తెచ్చి పెట్టె తీసినప్పుడు ఆమే దొంగిలించి వుంటుంది."

ఈ సమయంలో మస్లోవా ఆత్రుతపడుతూ ఏదో చెప్పబోయి నోరు తెరచి, యూఫీమియా కేసి చూచింది-యూఫీమియా బ్యాంకులో సొమ్ము డిపాజిట్ చేసినట్లు బ్యాంకుపుస్తకము చూపించి 'అంత డబ్బు ఎక్కడి'దని అడిగాడు. అది తన 18 సంవత్సరాల కష్టార్జితమనీ, అందులో తాను వివాహమాడబోతున్న సైమను డబ్బుకూడా కొంతవున్నదనీ చెప్పింది యూఫీమియా.

సైమనుని మొదట పరీక్షించగా తేలిన సంగతులివి:— "తానూ, యూఫీమియా కలసి మస్లోవా ప్రోత్సాహంవల్ల డబ్బు దొంగిలించి ముగ్గురూ పంచుకొన్నాము. అందుకుగాని స్మెల్కోవ్ ప్రాణవిహీనుడైపోయేందుకు ...

పాడి మస్లోవాకు ఇచ్చాడు. రెండోసారి క్రాస్ పరీక్షలో కూడ వొంగలేనంతలో గాని మస్లోవాకు పొడి ఇవ్వటంలోగాని తనకేమీ ప్రమేయం లేదని, అదంతా మస్లోవా పనేనని చెప్పాడు. బ్యాంకులో డబ్బు వేయ్యటం సంగతి అడిగితే యూఫీమియా చెప్పినట్టే చెప్పాడు—తను 18 ఏళ్ళ హోటలు నౌకరీలో కష్టార్జితమనీ; హోటలు యజమాని - హోటలుకు వచ్చిపోతూ ఉండే ధార్మికులిచ్చిన మామూళ్లబాపతు అనీ..."

ఇంకా విషయాలు తేలటానికి శవపరీక్ష జరుపవలసివచ్చింది. డాక్టరు శవాన్ని కోసి, పేగులు పరీక్షించి స్మెల్కోవ్ విషప్రయోగంవల్ల మరణించాడని రిపోర్టు ఇచ్చాడు.

ఆ తరువాత ఫైళ్లను పరీక్షించటం, సాక్షుల దగ్గరనుంచీ వివరాలు రాబట్టటం జరిగింది

నేరారోపణ పత్రంలోని చరమ భాగంలో ఇలా వుంది—

'వైశ్యుడూ వర్తకుడైన స్మెల్కోవ్ వ్యభిచారానికి తాగుడుకు అలవాటు పడ్డాడు. కిటేలియా వదుపుగొన్న పడుపుకొంపలోని మస్లోవాతో సంబంధం పెంచుకున్నాడు. ఆమె అంటే సుమతి ఎక్కువైంది. తాను విలాసార్థం కొనదలచిన తిరుబండారాల కోసం 40 రూబుల్స్ తెమ్మని తాళపు చెవి ఇచ్చి పంపాడు మస్లోవాను. హోటలికి పోయిన మస్లోవా యూఫీమియా సైమనులతో కలిసి కుట్ర పన్నింది. స్మెల్కోవ్ ధనము దోచుకొందామనుకున్నారు ముగ్గురూ. అలాగే చేశారు"

కార్యదర్శి నేరారోపణ పత్రాన్ని ముగించకముందే. మస్లోవా చివాలున లేచి ఏదో చెప్పబోయింది. ఆమె మొహం కందిపోయింది. మళ్ళీ కార్యదర్శి చదువసాగాడు.

"మస్లోవా వాటాకు వజ్రపు ఉంగరం, మరికొంత ధనం వచ్చి ఉంటుంది. ఆమె ఆ రాత్రి బాగా తాగివున్న కారణంచేత తన వాటాను ఎక్కడో దాచుకొనియైనా ఉండాలి; లేదా పారేసుకొనైనా ఉండాలి. తరువాత ఈ ముగ్గురూ తమ నేరం బయటపడకుండా ఉండేందుకోసం—ఆ వర్తకుని పడుపుటింటినుంచి హోటలుకు రప్పించి—పాషాణం ఇచ్చి చంపేయాలని ఎత్తు వేశారు. సైమన్ దగ్గర పాషాణం వుంది. మస్లోవా పడుపుటింటికి పోయింది. వర్తకుని ప్రోత్సహించి హోటలుకు తీసుకువచ్చింది.

సైమన్ ఇచ్చిన పొడిని బ్రాందీలో కలిపి అతన్ని తాగించింది. అది తాగి నందువల్లనే స్మెల్కోవ్ మరణించాడు."

"కాగా బోర్కి గ్రామ కాపురస్తుడు సైమన్ (వయస్సు 33 ఏళ్లు) యూఫీమియా (వయస్సు 43 ఏళ్ళు) మస్లోవా (వయస్సు 28 ఏళ్లు) ఈ ముగ్గురూ పై నుదహరించిన స్మెల్కోవ్ అను వర్తకునికి చెందిన 2600 రూబుల్సును 1088-జనవరి 17 వ తేదీని దొంగిలించి, తమ నేరం బయటపడ కుండా వుండేందుకు విషప్రయోగం ద్వారా అతన్ని హత్య చేశారు. శిక్షా స్మృతి 1455 సెక్షను ననుసరించి ఈ ముగ్గురూ నేరస్థులుగా పరిగణింపబడి జిల్లా కోర్టులో విచారణకు అప్పగింపబడి వున్నారు."

ఇంత పెద్ద నేరారోపణ పత్రాన్ని చదివేసి కార్యదర్శి తన స్థానంలో ఆసీనుడైనాడు-కొన గోళ్ళతో జుట్టు సవరించుకుంటూ. "అమ్మయ్య" అని నిట్టూర్పు విడిచారు విని విని విసిగిపోయినవారు. ఇక విచారణ ఆరంభం కానున్నదికదా అని ఉత్సుకత పొందారు అందరూ. గూఢ రహస్యాలు బైటపడి న్యాయం జరుగుతుందిలే అని ఆశించారు. నెఖ్లూడోవు మాత్రం ఏతాదృశ్య భావాలు కలగలేదు. పది సంవత్సరాల క్రితం ఒక అమాయకు రాలుగా, విస్తారమైన అందంగల పిల్లగా ఉండిన మస్లోవా ఇలా మారిపోయి, ఇన్నిన్ని పనులు చేసిందా? అని నిర్ఘాంతపోయి కూచున్నాడు.



నేరారోపణ పత్రం చదవటం పూర్తి అయింది. అధ్యక్షుడు కాసేపు ఇతర సభ్యులతో సంప్రదింపులు సాగించాడు. తరువాత సైమన్‌ను లక్షించి 'సత్యాన్ని శోధిస్తాను పాతాళందాకా' అని కృతనిశ్చయుడైనట్టు చూస్తూ—

"సైమన్ !" అని పిల్చాడు ఎడమవైపుకు సవిలాసంగా వొంగి.

సైమన్ లేచి నిల్చున్నాడు. చేతులు దించేసుకున్నాడు. ముందుకు కొంచెంగా వొంగి దవడ యెముకలు ఆడిస్తున్నాడు.

"1088-జనవరి 17 న తేదీని స్మెల్కోవ్ వర్తకుని తోలుపెట్టెలో నుంచి నువ్వు, యూఫీమియా - మస్లోవాలతో కలిసి, డబ్బు దొంగిలించి

…షాణం కలిపిన బ్రాందీని మస్లొవా చేత అతనికి తాగటాని కిప్పించి, అతన్ని చంపేశావన్న నేరాన్ని నీ మీద మోపారు. నువ్వు నేరం వొప్పుకుంటావా ?" అడిగాడు ప్రెసిడెంటు కుడివేపుకు విలాసంగా వొంగి.

"కాదండి; నా కర్థంగదా! హోటలులో బసచేసేవాళ్ళకు పరిచర్యలు చేయటం మాని, అదీగాక—"

"ఆ విషయాలన్నీ తరువాత చెప్పుకుందువుగానిలే, ఇప్పుడు నేరం వొప్పుకుంటావా, లేదా ?"

"ఎబ్బే, లేదండీ–నేనూ—"

"ఆ గొడవంతా మరోసారి. ఇప్పుడు నేరం వొప్పుకుంటావా లేదా?" శాంతంగా, సూటిగా అడిగాడు ప్రశ్న.

"అలాంటి పని చెయ్యలేమండి. ఎందువల్లనంటే—" మరోకసారి కోర్టు గుమాస్తా ముందుకు వచ్చి సైమన్‌ను అసందర్భంగా వాగవద్దని నెమ్మదిగా మందలించాడు. కాగితం వున్న చెయ్యిని అహోలా తిప్పి, భంగిమ మార్చి యూఫీమియావైపు తిరిగాడు–సైమన్‌తో వ్యవహారం ముగిసిందన్నట్టు.

"యూఫీమియా ! 1088-జనవరి 17వ తేదీని నువ్వు, సైమన్-మస్లొవాతో కలిసి స్మెల్కోవ్ తోలుపెట్టెలోని డబ్బు, ఉంగరం తస్కరించి, మీలో మీరు పంచుకుని, అతనికి విషం పెట్టి చంపినట్టు నేరం ఆరోపితమైంది అపరాధం వొప్పుకుంటావా ?"

"నావల్ల ఏమీ అపరాధం లేదండి; నే నెప్పుడూ ఆ గది దగ్గరకైనా వెళ్ళలేదు. ఈ పాపాత్మురాలే వెళ్ళింది. అంతా ఈమే చేసింది" ధైర్యంగా, నిక్కచ్చిగా చెప్పేసింది యూఫీమియా.

"ఆ విషయాలన్నీ తరువాత చెబుదువుగానిలే ! కాబట్టి నువ్వు నేరం వొప్పుకోవన్నమాట !"

"నేను డబ్బు తీసుకోలేదు, విషం పెట్టలేదు; గదిలోకే వెళ్ళలేదు. వెళ్ళి వున్నట్టయితే దీన్ని బయటికి గెంటేసి వుందును."

"ఇంక నువ్వు నేరం వొప్పుకోవు."

"ఊహూం. ఎప్పటికీ వొప్పుకోను."

"సరే, మంచిదే" అని ప్రెసిడెంటు మస్లొవాను ఉద్దేశించాడు

"మస్లొవా! నీమీద ఆరోపితమైన నేరం ఏమిటంటే—నువ్వు వేశ్యావాటికనుంచి వర్తకుని తాళపు చెవితో హోటలుకి వచ్చావు. స్మెల్కొవ్ తోలుపెట్టెలోని కొంత ధనాన్ని, ఉంగరాన్ని తస్కరించావు" ఈ మాటలన్నీ అతడు కంఠస్థం చేసిన పిల్లవాడివలె చెప్పాడు. ఇంతలో ఎడమ వైపు కూర్చున్న ఓ సభ్యుడు అతని చెవిలో "సాక్ష్యానికోసం తెచ్చి ఉంచిన వస్తువులలో ఒక బుడ్డి మాయమైపోయింద"ని మెల్లిగా చెప్పాడు.

మళ్ళీ ప్రెసిడెంటు మొదలుపెట్టాడు. "తోలు సంచిలోని కొంత ధనాన్ని ఉంగరాన్ని అపహరించి మీరు ముగ్గురూ పంచుకున్నారు. హోటలు మారిటానియాకు స్మెల్కొవ్‌తో సహా నువ్వు తిరిగివచ్చి, విషం కలిపిన బ్రాందీని తాగించావు. తద్వారా అతణ్ని చంపావు. ఒప్పుకుంటావా నేరాన్ని?"

"నే నేమీ నేరం చేయలేదు" చకచకా చెప్పసాగింది మస్లొవా. "నే నింతకు పూర్వం చెప్పిందే తిరిగి చెబుతున్నాను. నేను తీసుకోలేదు, తీసుకోలేదు. నే నేమీ తీసుకోలేదు. ఉంగరం మాత్రం ఆయనంతట ఆయనే ఇచ్చాడు."

"2600 రూబుల్సు దొంగిలించినట్లు నేరం ఒప్పుకోవన్నమాట."

"40 రూబుల్స్ తప్ప నే నేం తీసుకోలేదు."

"సరే, పొడి కలిపిన బ్రాందీ వర్తకునిచేత తాగించినమాట ఒప్పుకొంటావా?"

"ఆc, అది ఒప్పుకుంటాను. వాళ్ళు చెప్పింది నమ్మాను. అది మత్తుమందే కాని, అపాయకారి కాదని చెప్పారు. చంపాలన్న తలంపుగాని, కోరికగాని నాకు లేదు. భగవత్ సాక్షిగా చెబుతున్నాను" అన్నదామె.

"కాబట్టి నువ్వు స్మెల్కొవ్ తోలుపెట్టె నుంచి డబ్బు దొంగిలించలేదు; కాని అతనికి పొడి కలిపిన బ్రాందీ ఇచ్చావంటావు. అంతేగా?" అన్నాడు ప్రెసిడెంటు.

"అవునండీ. అది నేనే వొప్పుకుంటున్నాను. నిద్రమత్తుకోసం ఇచ్చే జోడి అనుకున్నా. అతన్ని నిద్రపుచ్చటానికే ఇచ్చానది. ఇంత ఘోరం చెయ్యాలన్న తలంపుగాని, కోరికగాని నాకు లేదు."

ఇంతవరకూ బాగా నడిచిందనుకున్నాడు ప్రెసిడెంటు. "సరే! అదంతా ఎలా జరిగిందో చెప్పు."

మస్లావా ప్రెసిడెంటు ముఖంవంక చూస్తూనే వుంది. "చేసిన తప్పు చేసినట్టుగా వొప్పుకుంటేవా నీకే మంచిది" అన్నాడు.

"ఎలా జరిగిందా?" మస్లావా హఠాత్తుగా మొదలుపెట్టింది. "నేను హోటలుకి వచ్చాను. దారి చూపించారు అతని గదికి. అతడక్కడే వున్నాడు. అప్పటికే బాగా తాగి వున్నాడు" ఆమె 'అతడు' అనేమాటని వుచ్చరిస్తోన్నప్పుడు ఖంగారు పడుతోంది. "నేను వెళ్ళిపోదామనుకున్నాను. కాని అతడు వెళ్ళనీయలేదు." చెప్పదలచింది మరిచినట్లో, లేక మరో సంగతి జ్ఞాపకానికి వచ్చినట్లో ఆమె ఆగిపోయింది.

"ఊఁ. ఆ తరువాత?"

"ఆ తరువాతనా? నే నక్కడే కొంతసేపుండి తిరిగి ఇంటికి వెళ్లాను"

ఇంతలో పబ్లిక్ ప్రాసిక్యూటరు లేవబోయాడు. అది గమనించిన ప్రెసిడెంటు "ఏమైనా ప్రశ్న వేస్తారా? సరే అడగం"డని అనుజ్ఞ ఇచ్చాడు.

"సైమన్‌కూ మస్లోవాకూ పూర్వ పరిచయం వుందా?" అని అడగదలచాను. మస్లావా వంక చూడకుండానే ఈ మాటలు అన్నాడు. అని పళ్లు బిగపట్టి కోపం ప్రదర్శించాడు.

ప్రెసిడెంటు అదే ప్రశ్న అడిగాడు. మస్లావా ప్రాసిక్యూటర్ కేసి ఖంగారుగా చూచింది.

"సైమన్‌తోనా? పరిచయంవుంది."

"ఆ పరిచయం ఎటువంటిదో తెలిసికోదలచాను. మీరిద్దరూ తరచు కలుసుకుంటూ ఉంటారా?"

"పరిచయం ఎటువంటిదా ? వాళ్ళ హోటల్లో బస చేసినవాళ్ళ కోసం పిలిచేవాడు. నిజానికి అది పరిచయమే కాదు" మస్లోవా తన చూపుల్ని ప్రెసిడెంటునుంచి ప్రాసిక్యూటర్ మీదికి, తిరిగి ప్రెసిడెంటు మీదికి తిప్పుకుంటూ ఉండిపోయింది.

"సైమన్ మస్లోవానే ఎందుకు పిలవాలి, ఇంకా అనేకమంది పడుచులుండగా?" అర్థ నిమీలిత నేత్రుడై వక్రంగా నవ్వాడు ప్రాసిక్యూటరు.

"నాకు తెలీదు. నాకెలా తెలుస్తుంది, అతడు తనకి ఇష్టమైన వాళ్ళను పిలుస్తాడు" మస్లోవా భయంగా నాలుగు వైపులా చూచింది. చివరికా చూపులు ఆమూల నెఖ్లూడోవ్‌మీద వాలాయి.

"ఆమె నన్ను గుర్తించిందేమో !" అనుకున్నాడు నెఖ్లూడోవ్. అతని ముఖం రాగరంజితమై పోయింది. కాని మస్లోవా ఏమాత్రమూ గుర్తించ లేదు. మళ్ళీ ఆమెచూపులు ఆతృతగా ప్రాసిక్యూటరుమీదికి వెళ్ళి పోయాయి.

"కాబట్టి ఈమె సైమన్‌తో తనకేమీ సన్నిహితమైన సంబంధం లేదని చెబుతోంది. ఇక నే నడిగే ప్రశ్నలేమీ లేవు" అంటూ ప్రాసిక్యూటరు బల్లమీద పోటీపెట్టి ఉంచిన మోచేయి తీసివేసి ఏదో రాయటంలో పడ్డాడు. నిజానికి అతడేమీ రాయటంలేదు. ఇదివరకు రాసివుండిన అక్షరాలమీదే దిద్దుకుంటూ ఉన్నాడు. గొప్పగొప్పలాయర్లు మంచి తెలివైన ప్రశ్నలడిగి ఇలాగే రికార్డులో ఏదో గిలుక్కుంటూ వుండటం ప్రాసిక్యూటరు పలుసార్లు చూచాడు. తానూ అదే విధానాన్ని అనుకరించబోయాడు.

ప్రెసిడెంటు కాసేపు ఆగాడు. ఈలోగా కళ్ళద్దాల సభ్యుని అడిగాడు ; "పట్టీలో తయారుచేసివుంచిన ప్రశ్నలన్నీ అడుగుదామా?" అని.

"సరే, తరువాత ఏమైంది ?"

మస్లోవా ధైర్యం తెచ్చుకుని ప్రెసిడెంటుకేసే చూస్తూ ఇలా చెప్పింది— "తరువాత ఇంటికి వచ్చేశాను - తెచ్చిన డబ్బులు యజమానురాలికిచ్చి నిద్రపోయాను. కాసేపు అయేసరికి మా పడుపుకత్తెలలో బెర్తా అనే ఆమె వచ్చి నన్ను లేపింది. "అదుగో, నీ బేరగాడు మళ్ళీ వచ్చాడు, పో" అంది. నాకు ఇష్టంలేదు - కాని యజమానురాలు వెళ్లమంది. అతడు—

“పరిచయం ఎటువంటిదా ? వాళ్ళ హోటల్లో పని చేసినవాళ్ళ కోసం పిలిచేవాడు. నిజానికి అది పరిచయమే కాదు” మస్లావా తన చూపుల్ని ప్రెసిడెంటునుంచి ప్రాసిక్యూటర్ మీదికి, తిరిగి ప్రెసిడెంటు మీదికి తిప్పుకుంటూ ఉండిపోయింది.

“సైమన్ మస్లావానే ఎందుకు పిలవాలి, ఇంకా అనేకమంది పనుచులుండగా?” అర్థ నిమీలిత నేత్రుడై వక్రంగా నవ్వాడు ప్రాసిక్యూటరు.

“నాకు తెలీదు. నాకెలా తెలుస్తుంది, అతడు తనకి ఇష్టమైన వాళ్ళను పిలుస్తాడు” మస్లావా భయంగా నాలుగు వైపులా చూచింది. చివరికా చూపులు ఆమూల నెక్లూడోవ్ మీద వాలాయి.

“ఆమె నన్ను గుర్తించిందేమో !” అనుకున్నాడు నెక్లూడోవ్. అతని ముఖం రాగరంజితమై పోయింది. కాని మస్లావా ఏమాత్రమూ గుర్తించలేదు. మళ్ళీ ఆమె చూపులు ఆత్రుతగా ప్రాసిక్యూటరుమీదికి వెళ్ళిపోయాయి.

“కాబట్టి ఈమె సైమన్‌తో తనకేమీ సన్నిహితమైన సంబంధం లేదని చెబుతోంది, ఇక నే నడిగే ప్రశ్నలేమీ లేవు” అంటూ ప్రాసిక్యూటరు బల్లమీద పోటీపెట్టి ఉంచిన మోచేయి తీసివేసి ఏదో రాయటంలో పడ్డాడు. నిజానికి అతడేమీ రాయటంలేదు. ఇదివరకు రాసివుండిన అక్షరాలమీదే దిద్దుకుంటూ ఉన్నాడు. గొప్పగొప్పలాయర్లు మంచి తెలివైన ప్రశ్నలడిగి ఇలాగే రికార్డులో ఏవో గిలుక్కుంటూ వుండటం ప్రాసిక్యూటరు పలుసార్లు చూచాడు. తానూ అదే విధానాన్ని అనుకరించబోయాడు.

ప్రెసిడెంటు కాసేపు ఆగాడు. ఈలోగా కళ్ళద్దాల సభ్యుని అడిగాడు ; “పట్టీలో తయారుచేసివుంచిన ప్రశ్నలన్నీ అడుగుదామా ?” అని.

“సరే, తరువాత ఏమైంది ?”

మస్లావా ధైర్యం తెచ్చుకుని ప్రెసిడెంటుకేసే చూస్తూ ఇలా చెప్పింది— “తరువాత ఇంటికి వచ్చేశాను - తెచ్చిన డబ్బులు యజమానురాలికిచ్చి నిద్రపోయాను. కాసేపు అయేసరికి మా పడుపుకత్తెలలో బెర్తా అనే ఆమె వచ్చి నన్ను లేపింది. “అదుగో, నీ బేరగాడు మళ్ళీ వచ్చాడు, పో” అంది. నాకు ఇష్టంలేదు - కాని యజమానురాలు వెళ్ళమంది. అతడు—

'అతడు' అనే పదం ఉచ్చరించవలసి వచ్చినప్పుడల్లా ఖంగారు పడుతోంది. "అతడు ఖాద్యములు, మద్యములు తెప్పించి మా అందరితోనూ జల్సా చేస్తున్నాడు. తెచ్చిన డబ్బు అయిపోయింది. ఇంకా కావాల్సి వచ్చింది. యజమానురాలు అతన్ని విశ్వసించలేకపోయింది. అప్పుడాతడు తాళంచెవి యిచ్చి నన్ను పంపించాడు. డబ్బు ఎక్కడ వుందో, ఎంత తీసుకురావాలో చెప్పాడు - నేను వెళ్లాను."

ప్రెసిడెంటు తన ఎడమప్రక్కనున్న సభ్యుడితో ఏదో గుసగుసలాడుతున్నాడు, కాని తాను కడదాక వింటున్నట్టే నటిస్తూ "ఊఁ- వెళ్లావు; ఆ తరువాత ?" అని అడిగాడు ఆమె చివరమాటల్ని అందుకుని.

"వెళ్ళి అతడు చెప్పినట్టే చేశాను. అతని గదిలోకి నేను వొంటరిగా పోలేదు. సైమన్‌ను, ఈమెను పిలుచుకుపోయాను" అని యూఫీమియా వంక చూపించింది.

"అది అబద్ధం నేను లోనికి పోలేదు" అంటూ యూఫీమియా చెప్పసాగింది. కాని కోర్టువారు ఆమెను మాటాడనీయలేదు-

"వాళ్ళు చూస్తూవుండగానే నేను నాలుగునోట్లు తీశాను" అని మస్లోవా చెప్పసాగింది, యూఫీమియా వంక చూడకుండానే ముఖం చిట్లిస్తూ.

"అయితే, 40 రూబుల్స్ తీసేటప్పుడు తోలుపెట్టెలో ఎంత ధనం వున్నదీ ఖైదీ చూసిందా ?" ప్రాసిక్యూటరు మళ్ళీ అడిగాడు.

ప్రాసిక్యూటరు ప్రశ్నించేటప్పటికి గడగడలాడింది మస్లోవా. ఎందువల్లనో తెలియదు. ప్రాసిక్యూటరు తన్ను సాధించదలచుకొన్నట్టు మాత్రం ఆమెకు స్ఫురించింది.

"నేను లెక్కపెట్టలేదు కాని వంద రూబుల్సునోట్లు కొన్ని వుండటం చూచాను."

"ఊఁ-ఖైదీ వందరూబుల్సు నోట్లు ఉండటం చూచింది. అది చాలు"- అన్నాడు ప్రాసిక్యూటరు.

"ఊఁ - డబ్బుతీసుకుని యింటికి వచ్చావు. ఔనా ?" — ప్రెసిడెంటు అడిగాడు గోడమీద గడియారంకేసి చూస్తూ.

"ఔను - తెచ్చాను."

"అయితే తరువాత?"

"అతడు మళ్ళీ నన్ను హోటలుకు తీసుకువచ్చాడు."

"పొడి అతనికెట్లా ఇచ్చావు? సారాయంలో కలిపేనా?"

"ఎలా ఇచ్చానంటే - అందులో కలిపాను, ఇచ్చాను."

"ఎందు కిచ్చావు?"

మస్లోవా వెంటనే జవాబు చెప్పలేదు. ఒక పెద్దనిట్టూర్పు విడిచింది- "అతడు నన్ను ఇంటికి పోనీయలేదు. నేను అప్పటికే చాలా అలసిపోయి వున్నాను. బైటికి వచ్చి సైమన్‌తో చెప్పాను-'అతడు నన్ను విడిచిపెట్టటం లేదు; చాలా అలసిపోయాను' అని, 'మేముకూడ అతడంటే విసిగిపోయాం. వెంటనే నిద్రవచ్చి పడిపోయేమందు ఇవ్వాలనుకుంటున్నాం. అతడు మత్తు వచ్చి పడిపోయాక నువ్వు వెళ్ళిపోవచ్చు' అన్నాడు సైమన్ - 'మంచిదే' అన్నాను - అతడు ఒక పొట్లం ఇచ్చాడు. అది అంత అపాయకరమైనదని నే ననుకోలేదు - అది తీసుకుని గదిలోకి వెళ్ళాను. అతడు పడుకుని బ్రాందీ కావాలన్నాడు. ఒక బుడ్డి తీసి రెండుగ్లాసుల్లో పోశాను. ఒకటి అతనికి, రెండోది నాకు. అతనిగ్లాసులో పొడి కలిపాను, ఇచ్చాను. విషం అని తెలిస్తే ఇస్తానా?"

"అయితే మరి, అతని ఉంగరం నీ చేతుల్లోకి ఎలా వచ్చింది?"

"తనంతట తానే ఇచ్చాడు."

"ఎప్పుడు?"

"మళ్ళీ హోటలుకు తిరిగి వచ్చాము-అప్పుడు. నేను ఇంటికి పోతానని మారాం చేశాను. అతనికి కోపంవచ్చి నా తలమీద బలమైన దెబ్బ కొట్టాడు. నాకు చాలా కోపం వచ్చింది. వెంటనే తిరిగి వెళ్ళిపోతానన్నాను. అప్పుడు తన వేలికి ఉన్న ఉంగరం తీసి నా కిచ్చేశాడు.

ఈ సమయాన పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచి తానై స్వయంగా ఖైదీని కొన్ని ప్రశ్నలడగటానికి ప్రెసిడెంటు సమ్మతి పొందాడు. ఇలా ఆరంభించాడు తన ప్రశ్నలు.

"స్మెల్కోవ్ గదిలో ఖైదీ ఎంతసేపు ఉంది ?"

మస్లోవాకు మళ్ళీ భయం వేసింది. తన చూపుల్ని ప్రాసిక్యూటర్ ముఖం మీదినుంచి ప్రెసిడెంటు వైపు మళ్ళించుకుని గాభరాగా చెప్పింది. "ఎంతసేపు ఉన్నానో జ్ఞాపకంలేదు."

"స్మెల్కోవ్‌ను విడిచి వెళ్ళిన తర్వాత హోటల్‌లోనే ఇంకెక్కడికేనా వెళ్ళిందా ఖైదీ; జ్ఞాపకం ఉందా ?"

మస్లోవా కాసేపు ఆలోచించింది. "ఔను. అతని గదిపక్కనే ఒక ఖాళీగది ఉంది. అందులోకి వెళ్ళాను."

"ఎందుకు వెళ్ళావు అక్కడికి ?" ప్రాసిక్యూటర్ తన్ను తాను మరచిపోయి, ప్రథమ పురుష మానేసి, మధ్యమ పురుషలోనే అడగసాగాడు

"బండికోసం వెళ్ళిన నౌకరు తిరిగి వచ్చేవరకూ కాస్త విశ్రాంతి తీసుకుందామని వెళ్ళాను."

"ఆ ఖాళీ గదిలో ఖైదీతోపాటు సైమన్ కూడా ఉన్నాడా, లేదా ?"

"అతడు కూడా వచ్చాడు."

"ఎందుకు వచ్చాడు ?"

"వర్తకుడు తెచ్చిన బ్రాందీ ఇంకా కాస్త మిగిలివుంది. ఇద్దరమూ అవచేశాం."

"ఓహో, ఇద్దరూ కలిసి అవజేశారేం ! అయితే సరే; ఖైదీ సైమన్‌తో అప్పుడైనా మాట్లాడిందా ? ఏ విషయాల గురించి ?"

మస్లోవా కోపంగా చూసింది. కపోలాలు లజ్జారుణములైనాయి. గాభరాపడుతూ చెప్పింది. "ఏ విషయాలు గురించా ? ఏ విషయాన్ని గురించీ నేను మాట్లాడలేదు. నే నెరిగిందల్లా అంతే. నన్ను మీరేమైనా చేయండి. నే నేమీ నేరం చెయ్యలేదు."

"ఇక నేను అడిగేది ఏమీ లేదు" అని ప్రాసిక్యూటరు తాను ఇవ్వ దలచిన ఉపన్యాసంలో ఈ కొత్త అంశం కూడా రాసుకున్నాడు—ఖాళీ

గదిలో సైమన్‌తోపాటు మస్లోవా ఉన్నదీ అని, ఆ సంగతి ఆమే ఒప్పుకున్నదీ అని.

కాసేపు కోర్టు అంతా నిశ్శబ్దంగా ఉంది.

“ఇంకా నువ్వు చెప్పవలసిందేమీ లేదా ?”

“అంతా చెప్పానే చెప్పాను” మస్లోవా ఒక నిట్టూర్పు విడిచి కూచుంది.

ప్రెసిడెంటు ఏదో రాసుకున్నాడు. ఎడమపక్కన కూచున్న సభ్యుడేదో చెప్పింది విన్నాడు. పది నిమిషాలు విశ్రాంతి ప్రకటించి లేచాడు. పొడుగాటి గడ్డంగల సభ్యునికి కాస్త కడుపునొప్పి తిరగబెట్టింది. కాస్త మర్దన చేసుకుని, రెండు చుక్కలు మందు తాగాలి. ఈ సంగతే ప్రెసిడెంటుతో విన్నవించుకున్నాడు. అందుకనే పదినిమిషాలు విశ్రాంతి ప్రకటించవలసి వచ్చింది.

జడ్జీలు లేవటంతోనే ప్లీడర్లు, జ్యూరీలు, సాక్షులు-అంతా లేచారు. సగం విచారణ పూర్తి అయింది కూడా అన్న సంతోషంతో అంటూ అటూ ఇటూ తిరగనారంభించారు.

నెఖ్ల్యూదోవ్ జ్యూరీల గదిలోకిపోయి కిటికీవద్ద కూలబడ్డాడు.

## ౧౨

“ఔను, ఆమె మస్లోవాయే.”

నెఖ్ల్యూదోవ్-మస్లోవాల మధ్య నడిచిన వ్యవహారాలు ఇవీ—

తాను విద్యార్థి దశలో ఉండినప్పుడు ప్రప్రథమంగా మస్లోవాను చూచాడు. విశ్వవిద్యాలయంలో మూడోయేడు చదువుతూ ‘భూమి కౌలు విధానం’ అనే వ్యాసాన్ని తయారు చేస్తున్నాడు.

మాస్కోకు దగ్గరగా తన తల్లికి పెద్ద యెస్టేటు ఉంది. మామూలుగా వేసంగి సెలవులు అక్కడే తల్లితోనూ, చెల్లెలితోనూ గడుపుతూ ఉండే

వారు. కాని ఆ యేడు నెల్లీకి పెళ్ళి అయింది; ఆమె అత్తవారింటికి వెళ్ళింది. తల్లి ఆరోగ్యం కొరకు విదేశాలకు వెళ్ళింది. కనుక తానీసారి మేనత్తల ఇంటికి వెళదాం అని నిశ్చయించుకున్నాడు. మేనత్తల యెస్టేటులో ప్రశాంతంగా ఉంటుంది. చక్కగా వ్యాసం పూర్తిచేసుకోవచ్చు. విఘ్న కారణాలేమీ ఉండవు. మేనత్తలకూ అతనిమీద అపేక్ష యెక్కువ. ఆ పూర్వాచార పరాయణులైన ఆ యత్తలయెడ అతనికీ ప్రీతి ఉంది.

నెహ్లాడ్‌కు మేనత్తల యింట్లో వేసంగి సెలవులు మధురంగా, మిక్కిలి సుఖశాంతంగా గడచిపోయాయి. తానా యువకుడు. పైన అదుపు పెట్టేవాళ్ళెవరూ లేరు. ఆ రోజుల్లో అతడు మానవ జీవితంలోని సౌందర్యాన్ని, ప్రాముఖ్యతను ప్రప్రథమంగా గుర్తించాడు. ప్రతి మానవ జీవితానికీ సంబంధించిన కర్తవ్యాలలోని విశిష్టతను గమనించాడు. ప్రతిజీవి స్వయం వ్యక్తిత్వానికీ, ప్రపంచాభ్యుదయానికిగల విశాల-అవకాశాన్ని అర్థం చేసుకున్నాడు.

విశ్వవిద్యాలయంలో ఉంటూ స్పెన్సర్ రాసిన సాంఘిక శాస్త్రాన్ని అమూలాగ్రంగా చదివాడు. సొంత భూ ఆస్తులు కలిగివుండు విషయమై స్పెన్సర్‌కు గల భావాలు నెహ్లాడ్‌ను బాగా ఆకర్షించినై. నెహ్లాడ్ కూడా ఒక పెద్ద భూ ఆస్తికి వారసుడై ఉండటం అందుకు ముఖ్యహేతువు. అతని తండ్రి పెద్ద ఆస్తిపరుడేమీ కాదు. కాని తల్లికి పుట్టింటివారిచ్చిన పదివేల ఎకరాల భూమి ఉంది. సొంత భూ ఆస్తులు కలిగి ఉండటం అన్యాయమనీ, క్రూరమనీ అతడు విశ్వసించాడు. సహజంగా అంతరాత్మ బోధనలను అనుసరించి నడుచుకునే ఆదర్శవాది అతడు-అంతరాత్మ చేసే ప్రబోధాలకు తదితరములను బలి యిచ్చుకొనటంలోనే ఆధ్యాత్మికానందం ఉన్నదని నమ్మేవాడు. కనుక ఆస్తి హక్కుల్ని సమూలంగా వొదిలేసుకోవాలనీ, తన తండ్రివల్ల సంక్రమించిన భూ ఆస్తిని వ్యవసాయ కూలీల పరం చేసి వెయ్యాలనీ నిశ్చయించుకున్నాడు. ఇప్పుడీ భూసంస్కరణ విధానాలను గురించే పరిశోధక వ్యాసం తయారుచేస్తున్నాడు.

మేనత్తల ఎస్టేటులో ఉన్నంతకాలమూ-తెల్లవారుఝామునే, ఒక్కొక్కప్పుడు మూడుగంటలప్పుడే లేచేవాడు-కొండపక్కన ఏటిలో స్నానం చేసి వచ్చేవాడు. కాఫీతాగి తన వ్యాసం రాసుకునేవాడు సాగినంతమటుకు

బోలెడన్ని గ్రంథాలు ముందు పెట్టుకుని. లేకపోతే ఒక్కొక్కరోజున వ్యాసరచన కట్టిపెట్టేసి చుట్టూ పొలాల్లో స్వేచ్ఛగా తిరిగి వచ్చేవాడు. మధ్యాహ్నం భోజనసమయంలో ఉల్లాసంగా ఉన్నా, నాటి వెలుగూ అత్తల్ని నవ్వించేవాడు. సాయంత్రమయ్యేసరికి గుర్రంఎక్కి స్వారీ చేసేవాడు; లేకపోతే ఒక చిన్నపడవెక్కి నదిలో కొంతదూరం వెళ్ళేవాడు. రాత్రి కాసేపు చదువుకునేవాడు. లేదా అత్తలతో కబుర్లు చెప్పేవాడు.

అనేకరాత్రులు, ముఖ్యంగా వెన్నెలరాత్రులు అతనికి నిద్రపట్టేది కాదు. మధురభావావేశం తీవ్రతరం అయ్యేది- భావాల ప్రేరణతో ఏవేవో స్వప్నాలు ఊహించుకుంటూ, ఆకాశంలోని తారలతో సంభాషణ చేస్తూఉండేవాడు.

అలా ఆనందంగా, ప్రశాంతంగా ఒకమాసం గడిచిపోయింది. అటు పూర్తిగా పరిచారికా గాక, ఇటు పూర్తిగా సంపూర్ణవతి గాని - అందమైన మెల్లకంటి చూపుల - చురుకుచేతల - మస్లోవా అతన్ని ఆకర్షించలేదు. అప్పటి కతనికి పందొమ్మిదేళ్లు. తల్లిచాటున పెరిగినవాడు. ఇంతవరకూ పవిత్రజీవితానికి అలవాటుపడినవాడే. ఎన్నడైనా ఒక యువతి అతని కళ్ళలో కనిపిస్తే ఆమె అతనిభార్య - తాను పెళ్ళాడజాలని మిగిలిన యువతులంతా అతని దృష్టిలో యువతులు కాదు; మామూలు మనుష్యులు, అంతే.

మేనత్తల యింటిపక్కనే ఒకామె ఉంటోంది. ఆమెకు ఇద్దరు కూతుళ్లు (కాస్త పెద్దవాళ్ళే) ఒక బళ్ళోకి పోయొస్తూ ఉన్నారు. రైతుకుటుంబానికి చెందిన ఒక యువక చిత్రకారుడుకూడా వాళ్ళతో ఉంటున్నాడు. ఒక పండుగరోజున వీళ్ళంతాకూడా నెఖ్లూదోవ్ మేనత్తల యింటికివచ్చారు- ఆ నాడు అందరూ కలిసి కులాసాగా గడుపుదామని.

సాయంత్రమప్పుడు తేనీరు తాగి అందరూ ఇంటిముందున్న విశాలమైన ఆ గడ్డిమైదానంమీద ఆటకు జొరబడ్డారు. మస్లోవాకూడా ఆటకు వచ్చింది. అదొకరకమైన ఆట. జట్లు కలుస్తూ ఉంటారు; విడిపోతూ ఉంటారు. ఒకసారి ఆ పరిగెత్తటంలో నెఖ్లూదోవ్ మస్లోవాను పట్టుకున్నాడు. అప్పుడు వాళ్ళిద్దరూ ఒకజట్టు ఐనారు ఇంతవరకూ మస్లోవా చూపులు అతనికి పసందుగానే ఉండేవి; కాని ఆమెతోటి ఏ విధమైన దగ్గరసంబంధమూ అతడు ఊహించుకొని ఉండలేదు.

చట్టాపట్టాలు పట్టుకుని జట్టుగా నిల్చున్న సెర్గాడో - మస్లోవాలను చూపిస్తూ- "వీళ్ళు ఎక్కడేనా కాలుజారిపడిపోతే తప్ప పట్టుకోటం కష్టం" అన్నాడు చిత్రకారుడు. ఈసారి పరిగెత్తి పట్టుకోవలసినవంతు చిత్రకారునిది. అతని కాళ్ళు పొట్టివి, బలిష్ఠములు; అతడు లేడిలా పరుగెత్తగలడు.

"మవ్వేమిటీ, పట్టుకోలేకపోవటమేమిటి ?" అన్నది మస్లోవా.

"ఒకటి... రెండు ..మూడు" అన్నాడు చిత్రకారుడు.

మస్లోవా గలగలనవ్వుతూ చిత్రకారుని వెనకాల వెళ్ళి నిల్చుని అతని లావైన చేతికండరాలను తన కోమల హస్తాలతో నొక్కిపట్టి, వెంటనే ఎడమవైపుకు గబగబా పరిగెత్తిపోయింది. చిత్రకారునికి దొరక్కుండా పోదామన్న ఊహతో సెర్గాడో మరోవైపు పరిగెత్తాడు. కొంతదూరం పోయి వెనక్కు తిరిగి చూచాడు. అతను తన్ను వెంబడించటంలేదు. మస్లోవాను పట్టుకోవాలని పరుగుదీస్తున్నాడు. ఆమె అతనికి చిక్కకుండా గబగబా పరుగెత్తిపోతోంది. అక్కడ ఒక మల్లెపొద ఉంది. పొదవెనుక వచ్చి తన్ను కలుసుకోమని మస్లోవా సెర్గాడోకు సైగచేసింది. అలా వచ్చి కలుసుకుని మళ్ళీ చెట్టాపట్టాలు పట్టేస్తే ఇక వాళ్ళ నతడు తాకకూడదు. అది ఆటలోని పగతు. సెర్గాడో ఆమె సైగను అందుకున్నాడు. పొద వెనక్కు పరుగెత్తుకు వచ్చాడు. కాని అక్కడొక చిన్న గుంట ఉన్న సంగతి ఆతడెరగడు. గబగబా వచ్చి అందులో పడ్డాడు. అయినా వెంటనే లేచి నవ్వుతూ నిల్చున్నాడు.

తుమ్మెదలవంటి చంచలనేత్రాలతో, ఆనందపరిఫుల్లమైన ముఖంతో మస్లోవా అతనిదగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చింది. ఇద్దరూ చెట్టాపట్టాలు పట్టేశారు.

"బాగా దెబ్బ తగిలిందనుకుంటానే!" అన్నదామె, చెదరిపోయిన తన ముంగురులను సరిచేసుకుంటూ, రొప్పుతూ, సూటిగా అతని ముఖంలోకి చూస్తూ, ఒకచిత్రమైన మందహాసం చేస్తూ.

"ఇక్కడొక గుంట ఉందని నాకు తెలియనే తెలియదు" అన్నాడు సెర్గాడో అలాగే నవ్వుతూ - ఆమె చేయిని ఇంకా విడువలేదు. ఆమె వెనక్కు పోలేదు. తనచేతిలోని ఆమె హస్తాన్ని మృదువుగా నొక్కుతూ,

పెదవుల్ని ముద్దుపెట్టుకున్నాడు నెక్లూదోవ్ - "అదిగో, అదేం పని!" అంటూ ఒక్క ఊపులో చెయి విడిపించుకుని, అక్కడనుంచి వెళ్ళిపోయింది.

పూలమొగ్గలు విచ్చుతోన్న మల్లెపూల కొమ్మ విరిచి రాగరంజితమై, చిరుచెమట పోసిన ఆమె బుగ్గలమీద విసురుకుంది - మాటిమాటికీ వెనక్కు తిరిగి అతడికేసి చూచుకుంటూ, ముందుకు సాగిపోయింది.

ఆ తరువాత నెక్లూదోవ్ - మస్లోవాల సంబంధాలు పరస్పర పవిత్ర ప్రణయాకర్షితులైన నవవధూవరుల మధ్యవలె నడిచినై.

మస్లోవా గదిలోకి వచ్చినప్పుడే కాక, ఎంతదూరాన ఆమె అలికిడి వినిపించినా నెక్లూదోవ్‌కు ఈ ప్రపంచమంతా తేజోమయంగా కనిపించేది - ప్రతి సూర్యోదయమూ అతనికి ఆనందహేతువైంది. జీవితమంతా ఆనందమయంగా కనిపించింది - ఆమెకూ అలాంటి అనుభూతే కలిగింది - ఒకరి సమక్షంలో ఒకరున్నప్పుడే కాదు - ఒకరినొకరు మనసారా తలచుకున్నప్పుడు కూడా ఒక అలౌకికానందానుభూతి కలిగేది ఇద్దరికీ.

తల్లిదగ్గిర్నించి ఒక నిరానందపూరితమైన ఉత్తరం వచ్చినా - తన వ్యాస రచన కుంటుపడినా - యువకులకు సహజమైన నిర్వేదం అప్పుడప్పుడు తన్ను ముంచుకొన్నా - మస్లోవాను స్మరించుకుంటే సరి - ఆమెను చూడాలని వాంఛిస్తే సరి - మళ్ళీ ఉత్సాహ-ఉల్లాసాలు కలిగేవి.

మస్లోవాకు ఇంట్లో పనిపాటలు తక్కువగా లేవు. అయినా అప్పుడప్పుడు కాస్త వీలుచేసుకుని ఏమన్నా చదువుకుంటూ ఉండేది. నెక్లూదోవ్ ఆమెకు మంచి మంచి పుస్తకాలు చదవమని యిచ్చేవాడు - వరండాలోనో, మెట్లలోనో, దొడ్లోనో అప్పుడప్పుడు ఇద్దరు ఎదురుపడినప్పుడల్లా కాసేపు ఏమేమో గుసగుస లాడుకునేవారు.

మైత్రేనా ఆ యింట్లో ఒకముసలి పనిమనిషి. ఆమెగదిలో అప్పుడప్పుడు నెక్లూదోవ్ మస్లోవాతో చాలాసేపు సంభాషణ జరుపుతూ ఉండేవాడు. అవి మధురక్షణాలుగా గడిచేవి. ఒంటరిగా ఉన్నప్పుడు అతనికి గాని, ఆమెకుగాని నిరానందంగా ఉండేది - పరస్పరం ఎదురుపడినప్పుడు వాళ్ళ పెదవులు పలికేమాటల్లో కంటే వాళ్ళచూపుల్లో మించిన అర్థం ఉండేది - మాటాడినంతసేపూ పెదవులు వొణికేవి - ఏదో భయం తోచేది. మళ్ళీ విడిపోయేవాళ్లు.

ఆ వేసంగిలో నెఖ్లూదోవ్ అక్కడ ఉన్నన్నాళ్ళూ ఇద్దరి కథా అలాగే సాగింది. మేనత్తలు పసిగట్టారు. భయపడ్డారు. అతని తల్లికి ఎరుకపరుస్తూ ఉత్తరం రాశారు – నెఖ్లూదోవ్ మస్లోవాతో అవినీతికరంగా ప్రవర్తిస్తాడేమో నని మేరీ భయపడ్డది. కాని నెఖ్లూదోవ్‌కు మస్లోవాయెడగల ప్రేమ పవిత్రమైనది – ఆ ప్రేమలోనే తన క్షేమం, ఆమె క్షేమం ఇమిడివున్నట్టు తలచేవాడు–పాశవికమైన తీవ్రవాంఛలేమీ అతనికి లేవు అట్టి వాంఛలు ఏ నిమిషమందైనా స్ఫురించినా ఛీఛీ అనుకునేవాడు. 'కుర్రవాడు పట్టుదలగలవాడు; ఈ పిల్లను ప్రేమిస్తున్నాడు; దాని కులాన్ని పాటించకుండా, దాని సామాజిక స్థితిని గమనించకుండా అమాంతం పెళ్ళాడేస్తాడేమో కదా!—'అని రెండో మేనత్త సోఫియా భయపడ్డది. మేరీ ఊహకంటే సోఫియా ఊహ సరైనదని చెప్పాలి.

నెఖ్లూదోవ్‌కు తాను మస్లోవాను ప్రేమిస్తున్నానన్న జ్ఞానం ఉండినా – మేనత్తలు వచ్చి దాసీపిల్లతో నీవంటివాడికి సంబంధం తగునా? అని గట్టిగా మందలించినా – ఈ ప్రేమగాథ మరొకరకంగా నడిచేది. అతడు కల్లాకపటంలేని యువకుడు. తానొక బాలికను ప్రేమిస్తున్నప్పుడు ఆమెనే పెళ్ళాడుటకు ఒక అభ్యంతరం ఎందుకుండాలి? ఉండకూడదను అని స్థిరనిశ్చయానికివచ్చి వుండేవాడే–కాని మేనత్తలు తాము కన్న భయాలను బయటపెట్టలేదు. తాను మస్లోవాను ప్రేమిస్తున్న సంగతి తనకు తెలియకుండానే నెఖ్లూదోవ్ సెలవుల అనంతరం వెళ్ళిపోయాడు. మస్లోవా సమక్షంలో తనకొక అనిర్వచనీయ–అనుభూతి కలుగుతున్న సంగతి మాత్రం అతనికి తెలుసు. అపాదమస్తకమూ తనలో నిండిపోయిన జీవితానందపు జాలు అది అనుకున్నాడు. ఈ ఆనందాన్నే ఆమెకూడా తనతోపాటు పంచుకుని అనుభవిస్తోంది అనుకున్నాడు. చివరకు తాను వెళ్ళిపోయేనాడు ఆమెకూడా మెట్లలో మేనత్తల వెనుక అశ్రువులు కమ్మిన నేత్రాలతో తన్ను అవలోకిస్తూ నిల్చుంది. తనకు మళ్ళీ సంభవపడబోని ఒక అందమైన, విలువైన ఏదో ఒకవస్తువును విడిచిపోతున్నట్టు విచారపడ్డాడు.

"వెళ్ళిపోతున్నాను మస్లోవా!" అన్నాడు బండీ ఎక్కుతూ మేనత్తల వెనకనే వున్న పిల్లను చూచి.

బండీ కదులుతోంది. "శాంతా! రండి" అన్నాడు సుదర్శనం. హఠాత్తుగా కన్నీళ్ళు ఆపుకుంటూ, దుఃఖభరితమైన కంఠస్వరాన — అని నిశ్చయంగా హోటల్లోకి వెళ్ళిపోయింది, అక్కడ ఏకాంతంగా ఏడ్చి హృదయభారాన్ని దింపి వేయటానికి.

## ౧౩

తరువాత రెండేళ్ళకు పైగా సెల్వాడో మళ్ళీ రాను చూడలేదు. మిలిటరీ ఆఫీసరుగా హోదా పెరిగినప్పుడు ఉద్యోగంలో చేరబోతూ మన తల్లిని చూడ్డానికి వచ్చాడు. అప్పుడు మళ్ళీ మళ్ళీ వారిని చూడ్డం తటస్థించింది. ఈ మూడేళ్ళలో అతడు చాలా మారిపోయాడు. మూడేళ్ళకిందటి సెల్వాడో నిజాయితీ మనిషి; స్వార్థరహితుడు; ఒక సదాశయంకోసం ఎంత త్యాగానికైనా వెనుదీయని ఆదర్శవాది. ఇప్పుడతను ఆధునిక నాగరికతలో తయారైన అహంభావి; నైతిక పతితుడు; ఆత్మసంతృప్తినే ప్రధానంగా చూచుకునేవాడు.

ఆనాడతనికి ఈ భగవత్సృష్టి యావత్తూ ఒక దుర్గ్రాహ్యమైన సమస్యగా గోచరించేది. పట్టుదలతో, ఉత్సాహంతో ఈ అనంత జగద్రహస్యాన్ని అవగతం చేసుకోవాలని అన్వేషిస్తూ ఉండేవాడు — ఈ నాడు అతనికి మానవజీవితరహస్యం అంత నిగూఢమైనదిగా తోచటం లేదు. బట్టబయలుగా కనిపిస్తున్నట్టుగానే ఉంది. తాను అవలంబిస్తున్న జీవనపద్ధతులే సర్వోత్కృష్టములైనవని భావిస్తున్నాడు. ఆనాడు తాను ప్రకృతితో తాదాత్మ్యము పొందవలసిన ఆవశ్యకతను గుర్తించాడు; ప్రాచీనులైన కవుల, వేదాంతుల భావాల వైశిష్ట్యాన్ని అనుభవించవలసిన అవసరాన్ని కూడా గమనించాడు. ఇప్పుడతనికి ఈ మానవనిర్మితసంస్థలు, తోటివారితోటి సంబంధాలు — ఇవే ప్రముఖములు, ఆవశ్యకములు అయినవి — పూర్వం స్త్రీ వ్యక్తి అంటే అతని దృష్టిలో ఒక అవర్ణనీయమైన రమ్యవస్తువు — ఇప్పుడతనికి ఆడదాని ఉపయోగం ఫలానా అని నిర్దిష్టమైపోయింది. ఇదివరకే అనుభవించి వున్న ఒక ఆనందలబ్ధికి స్త్రీలు మంచి సాధనాలు. ఆ రోజుల్లో కాంచనం అంటే అంత మమత లేదు. తనకు తల్లి పంపిస్తూ ఉండిన డబ్బులో మూడో వంతుమాత్రంతో సరిపెట్టుకోగలిగేవాడు; తన తండ్రివల్ల సంక్రమించిన

ఆ స్త్రీని తాను తీసుకోకుండా రైతుకూలీల పరం చేయగలిగాడు. కాని ఇప్పుడో! తనకు ఇవ్వబడుతోన్న నెలకు 500 రూబుల్సు భత్యం చాలటం లేదు; ఈ విషయమై ఇటీవల తల్లితో కొంత ఘర్షణపడ్డాడుకూడాను.

మునుపు అతనికి 'నే'నంటే ఆత్మ స్ఫురించేది. కాని ఇప్పుడు 'నే' ననగానే అతనిలోని పశుత్వం వ్యక్తమవుతోంది. ఈ భయంకర పరిణామ మంతా అతడు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి పరులను నమ్మటం చేతనే కలిగింది. ఆత్మవిశ్వాసంతో జీవించటం కష్టం. అలా జీవించాలంటే ప్రతి ఐహిక సమస్యనూ స్వబుద్ధ్యా నిర్ణయించుకోవాలి. అట్టి స్వయం నిర్ణయం సద్యస్తృప్తికోసం ప్రాకులాడే పశుత్వానికి అనుకూలంగా ఉండదు. దానికి వ్యతిరేకంగానే ఉంటుంది. ఇతర్లను నమ్మటం మొదలుపెడితే మనం నిర్ణయించుకోవలసింది ఏమీ ఉండదు. ప్రతిదీ ఇంతకు పూర్వమే పాశవిక భౌతికానంద లబ్ధికి అనుకూలంగానే, ఆధ్యాత్మిక సుఖానికి వ్యతిరేకంగానే నిర్ణీతమై ఉంది. అంతేకాదు; ఆత్మవిశ్వాస పరుడై, స్వబుద్ధితో నడిచేవాడు. ఇతర్ల నిందలకు, విమర్శనలకు గురికావలసి వస్తుంది. ఇతర్లనే అనుసరించి పోతూవుంటే అందరూ 'శేష్, భళీ' అంటారు.

అలాగే నెఖ్లూడో ఇదివరకు విశిష్ట సమస్యల్ని గురించి—అంటే భగవంతుడు, సత్యం, సంపద, దారిద్ర్యం మొదలైన అంశాలు గురించి ప్రసంగిస్తూ ఉంటే అందరికీ హాస్యాస్పదంగా ఉండేది. "అసందర్భ విషయాలను గురించి వాగుతాడేం" అనుకున్నారు. మేనత్తలు కూడా వ్యంగ్యంగా అతన్ని మెట్టవేదాంతం కింద కట్టేసి ఎగతాళి చేసేవాళ్లు. కాని తానుకూడా నవలలు చదవటం మొదలుపెట్టి—అసందర్భపు గాథలు చెబుతూ—ఫ్రెంచి నాటక ప్రదర్శనాలకు హాజరై—అందరూ హర్షించే చౌకబారు హాస్యపు మాటల్నే విసురుతూ ఉంటే—యావన్మందీ అతన్ని పొగడుతున్నారు, ప్రోత్సహిస్తున్నారు.

ఖర్చులు తగ్గించుకోవటమే మంచిదని భావించి, ఒక పాత ఓవర్ కోటు మాత్రమే వేసుకుని, సారాయం తాగటం మానుకుని—జాగ్రత్తగా జీవితం గడుపుకుంటున్నప్పుడు అదంతా నటన, భేషజం అని అందరూ తూరుపార పట్టినవాళ్ళే. కాని వేటలకూ, విలువైన పుస్తకాల బీరువాల కోసమూ, ఇతర ఆడంబరాల కొరకూ విరివిగా ధనం ఖర్చుచేస్తూ ఉంటే

'ఆహా! మంచి అభిరుచి గల వ్యక్తి' అని ప్రశంసిస్తున్నారు, బహుమానాలిస్తున్నారు ప్రజలు.

పెళ్ళి అయేవరకూ వ్యభిచరించ కూడదని పవిత్రంగా ఉన్నంత కాలమూ—'పాపం, వీడు ఆరోగ్యం పాడుచేసుకుంటున్నాడే' అని మిత్రులంతా ఆతృత ప్రకటించేవాళ్లు. తరువాత కొన్నాళ్ళకు అతను ఒక ఫ్రెంచి యువతి సావాసాన్ని సంపాదించినప్పుడు-'భేష్, నా కొడుకు మగాడనిపించుకున్నాడు' అని తల్లి కూడా సంతోషించింది. నీగ్రోవాళ్ళతో అతని సంబంధం విన్నప్పుడు-'అయ్యో, దాని పిల్లను పెళ్ళాడుతాడేమో కదా!' అనే ఆమె భయపడ్డది. కాని అవినీతికి దిగుతాడేమోనని కాదు.

ఇలాగే వెనక నెఖ్లూడోవ్ సొంత ఆస్తి ఉండటం తప్పని చెప్పి తండ్రి ద్వారా సంక్రమించిన ఎస్టేటును రైతులకు పంచిపెట్టినప్పుడు-ఆ పని ఎవళ్ళకీ నచ్చలేదు. అతని బంధుమిత్రులంతా విచారించారు. దీనివల్ల దెప్పేవాడికి దెప్ప సందు, నవ్వేవాడికి నవ్వ సందు అయింది. ఇంత ఆస్తి పొందినా రైతులేమీ బాగుపడలేదనీ, పైగా మరింత దరిద్రులైనారనీ, పని మానేసి బాహాటంగా తాగి తిరుగుతున్నారనీ అంతా విమర్శించారు.

కాని నెఖ్లూడోవ్ సైన్యంలో చేరి పెద్ద పెద్ద కులీనులనబడే వాళ్ళతో పేకాటలూ జూదాలూ ఆడి పెద్ద మొత్తాలే కోల్పోయినా, మూలధనం కదిలించవలసి వచ్చినా విచారపడలేదు అతని తల్లి. పైగా సంతోషపడేది, అదంతా సహజమూ, నాగరిక లక్షణమూ అని భావించి.

పూర్వం తాను చెడ్డగా తలంచిందంతా మంచిదంటుంది ప్రపంచం. తాను మంచిదనుకున్న దానిని ఆమూలాగ్రం దోషభూయిష్టమంటుంది. మొదట్లో నెఖ్లూడోవ్ చాలా బాధపడ్డాడు. క్రమంగా ఆ బాధ తీవ్రత తగ్గింది. నెఖ్లూడోవ్ మెత్తబడిపోయాడు. ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయాడు. ఇతర్లను నమ్మటం మొదలుపెట్టాడు. మొదట్లో కొంత అసహ్యంగా ఉంటున్నా రాను రాను ఆ వెగటు తగ్గింది. ఈ పరిణామ దశలో పొగ తాగటం, బ్రాంది సేవించటం అలవాటయింది. ఆ విధంగా వెగటుపోయి ఎంతో హాయి అనుభవిస్తున్నాడు ఇప్పుడు.

ఉద్వేగ పూరితుడైన నెఖ్లూడోవ్ ప్రపంచమంతా ఆమోదించే నూత్న నాగరిక పద్ధతికి అతుక్కుపోయాడు. దానిని కాదని, దాని కతీతమైన దేనినో కోరే అంతరాత్మని సైతం పీక నొక్కాడు.

ఈ మార్పు అతడు పీటర్సుబర్గు వెళ్ళటంతో ఆరంభమై, మిలిటరీ ఉద్యోగంలో చేరటంతో ఉన్నత అవధిని చుంబించింది.

సాధారణంగా మిలిటరీ జీవితం అవినీతికి పుట్టిల్లు. సోమరితనానికి మొదటి మెట్టు. వివేకాన్ని చూపించగల, ఉపయోగకరమైన పనిపాటలు ఉండవు. సాధారణ మానవ ధర్మాలనుంచి విముక్తి లభిస్తుంది. జీవంలేని దైనందిన కార్యక్రమం మాత్రం నడుస్తూ ఉండాలి. ఇతర్లమీద పరిపూర్ణాధికారం లభిస్తుంది కాని తాము కూడా తమ పై ఆఫీసర్ల ముందు బానిసలకన్నా హీనాతి హీనస్థితిలోకి దిగజారిపోతారు.

హింసలు, హత్యలు, అత్యాచారాలు—ఈ మొదలైన సమస్త అవినీతి కార్యాచరణలకు మిలిటరీ ఉద్యోగం ఒక లైసెన్సు. అధికార గర్వానికి ధనమదాంధత తోడౌతుంది. రాచకులం వారితో సన్నిహిత సంబంధం కూడా ఏర్పడుతుంది. ఏ తత్ఫలితం సంపూర్ణ స్వార్థపరత్వమే. ఇదే నెఖ్లూడోవ్ ను ఉద్యోగంతోపాటే ఆవహించింది. తోడి ఆఫీసర్లలాగే తానూ తయారైనాడు. చేసేపని ఏమీ లేదు. యూనిఫారం దుస్తుల్ని నౌకర్లు బ్రష్‌తో సాఫుచేసి అందిస్తారు. తాను ధరిస్తాడు. కత్తుల్ని సేవకులే తుడిచి చేతికిస్తారు. మాలిష్ చేసి గుర్రాన్ని ఎవరో తెచ్చి ముందుంచుతారు. తాను దాన్ని అధిరోహించి సైన్యపర్యవేక్షణకు వెడతాడు. అక్కడ కత్తి నాలుగుసార్లు ఝుళిపిస్తాడు; రెండు తుపాకులు పేలుస్తాడు. ఆ పనులే ఇతర్లకు బోధిస్తాడు. ఇంతకంటే అతడు చేసే ఘనకార్యాలేమీ లేవు. అయినా పెద్దలందరూ చక్రవర్తి కూడా ఈ ఉద్యోగాన్ని నిలువబెట్టారు, అవసరమన్నారు, ప్రశంసిస్తున్నారు.

ఇవిగాక అతడు చేయవలసిన ప్రముఖ కార్యాలు ఇంకా కొన్ని ఉన్నాయి. అవి పెద్ద పెద్ద హోటళ్ళలో స్వేచ్ఛగా తినటం, తాగటం, ఎక్కడినుంచో వచ్చి పడుతున్న డబ్బును విచ్చలవిడిగా ఖర్చుపెట్టటం, నాటకశాలకు, నృత్యశాలలకు, సంబరాలకు హాజరుకావటం, సారాయంతో, స్త్రీలతో, పేకాటతో కాలక్షేపం చేయటం-ఇత్యాదయః.

ఈ రకమైన జీవితం మిలిటరీ వాళ్ళను ఇతరులకంటె అధ్వాన్నంగా చేస్తుంది. మిలిటరీవాడు కాక మరొకడైతే ఇలాంటి జీవితం గడుపుతూన్నప్పుడు కనీసం హృదయాంతరాళాల్లోనన్నా సిగ్గుపడతాడు. కాని మిలిటరీ వాడో! ఇటువంటి జీవితాన్ని గడుపుతూన్నందుకే గర్వపడతాడు. యుద్ధ సమయమైతే మరీనూ. నెఖ్లూడొవ్ తురకలతో యుద్ధం సంభవించిన తర్వాత సేనలో చేరాడు. "మేము మా జీవితాల్ని సైతం యుద్ధభూమిలో అర్పించబోతున్నాం. కాబట్టి మేము ఇలాంటి ఆనందదాయకమూ, నిర్లక్ష్య పూరితమూ అయిన జీవితాన్ని గడపటం క్షంతవ్యమే కాదు, అత్యవసరం కూడాను. కనుకనే మే మిలా గడుపుతాం" అంటారు వాళ్ళు.

ఇలాంటి అపరిపక్వములైన 'అభిప్రాయాలతో' అభిరుచులతో ఉన్నాడు నెఖ్లూడొవ్ ఇప్పుడు. పూర్వం తానేర్పరచుకున్న నైతిక నిబంధనలను సడలించుకొంటూ తానొక స్వేచ్ఛాజీవి ననుకొని ఆనందపడుతూన్న దశ ఇది. సంపూర్ణ స్వార్థపరత్వం కరుడుకట్టిపోయింది అతనిలో.

మూడేళ్ళ తరువాత మళ్ళీ ఒకసారి మేనత్తల్ని చూడ్డానికి వచ్చినప్పటి నెఖ్లూడొవ్ స్థితి ఇదీ.

## ౪

ముందు పోయిన సైన్యాల్ని చేరుకోటానికి తాను పోయే మార్గంలో దగ్గరగా ఉంది కదా అని మేనత్తల ఊరు వచ్చాడు నెఖ్లూడొవ్. రమ్మని వాళ్ళెంతో బ్రతిమాలుతూ ఉత్తరాలు రాశారు. అదీగాక ముఖ్యంగా మస్లావాను చూడాలన్న కోరికకూడా ఉంది. అతనికి బహుశః అతని హృదయాంతరాళంలో అదుపుమీరిన పశుత్వం ఆకాంక్షించే పాపచింతలు ఉండి ఉండవచ్చును. కాని ఆ సంగతి అతనికి పైకి తెలిసి ఉండకపోవచ్చు. ఒకప్పుడు తానా ఊళ్ళో ఎంతో హాయిగా వేసంగి సెలవులు గడిపాడు – కనుక మళ్ళీ ఒకసారి అక్కడికి వెళ్ళాలన్న కోరిక కలగటం సహజం. తన్ను ఆప్యాయంగా చూచే మేనత్తల్ని చూడబోతున్నాననుకున్నాడు. గుండెలో ఒక మూల మస్లావా మెదులుతూనే ఉంది. ఆమెనుకూడా చూడబోతున్నాననుకున్నాడు.

మార్చి చివరవారంలో వచ్చాడు – వర్షం కుంభపోతగా కురుస్తోంది – తాను తడిసి ముద్దైనాడు. అయినా ఉత్సాహవంతుడు. నూతన నీగస

పడేటు – ఒక వంక పక్కతో వొంచుకుతూ కూడా మేనత్తలయింటిముందు బండిదిగాడు. దిగుతూ, "ఆమె ఇంకా ఇక్కడే వున్నదో, లేదో" అనుకున్నాడు.

బండీ చప్పుడు వినగానే ఆమె బయటికి వస్తుందనుకున్నాడు. కాని ఆమె రాలేదు. ముఖద్వారము దగ్గరైనా ఆమె ఎదురుపడలేదు. ఎవడో ఒక సేవకుడు గోడలు తుడుస్తూ కనిపించాడు. దొడ్డివైపు గదిలోకి వెళ్ళిన తర్వాత మేనత్త సోఫియా కన్పించింది.

"వచ్చావు నాయనా" అంటూ సోఫియా స్వాగతం ఇచ్చింది.

"అయ్యో మరీ తడిసిపోయావే! చప్పున గదిలోకి పోయి దుస్తులు మార్చుకో......మీసాలుకూడా వచ్చాయిరా అబ్బాయి నీకు!" అన్నది సోఫియా. అని ఆత్రుతగా మస్లావాను కేకవేసి, పిలిచి, తొందరగా వేడివేడి కాఫీ తయారుచేసి తీసుకురమ్మని పురమాయించింది "ఇదిగో ఒక నిమిషంలో తెస్తాను" అంటూ ఒక పరిచితమైన మధురకంఠధ్వనితో ఆ వెనుక మెల్లగా వినిపించింది. "అమ్మయ్య ఆమె ఇక్కడే వున్నదన్నమాట!" అని నెఖ్లూడొవ్ హృదయము స్పందించింది. మేఘాల్లోనుంచి సూర్యబింబం బయటికి వచ్చినట్లయింది.

నెఖ్లూడొవ్ తనగదిలోకి వెళ్లాడు. అతనివెంట ఇంటినౌకరు టిఖాన్ కూడా వచ్చాడు. మస్లావా క్షేమసమాచారాలూ, ఆమె ఏమిచేస్తోన్నదీ, ఆమెకు పెళ్ళిసంబంధాలు ఏమైనా వస్తున్నాయేమో—ఈ విషయాలన్నీ టిఖానును అడుగుదామనుకున్నాడు. కాని వాడిముఖంలో ఒక గంభీర ముద్ర వుంది. వాడు మంచి మర్యాదస్తుడుకూడాను. నెఖ్లూడొవ్ అడగదల చిన విషయాలు అడగలేకపోయాడు. చివరకు అతని మనుమల్ని గురించి, కుక్కల్ని గురించి, గుర్రాల్ని గురించి అడిగాడు. ఒక్క కుక్కమాత్రం గడచిన వేసంగిలో చచ్చిపోయిందని టిఖాన్ చెప్పాడు.

నెఖ్లూడొవ్ తడిదుస్తులు తీసివేశాడు. పొడిదుస్తులు ధరిస్తున్నాడు. బైట పరిచితమైన అడుగుల చప్పుడు వినిపించింది. బైటినుండి తలుపుతట్టిన చప్పుడయ్యింది. ఆ సవ్వడి ఎవరిదో అతనికి తెలుసు. అలా నడవటం, తలుపు తట్టటం ఆమెకే.

తోటు బుజాలపూడి లగిలించుకొని ఉబ్బితబ్బిబ్బయాడు. "నా [illegible]" స్నాడు.

ఆమె మస్లావాయే. పూర్వంకన్నా అందంగా వుంది. కొంచెము ల్ల వున్న ఆ కాటుకకళ్లు పూర్వంలాగే అతని ముఖంలోకి చూస్తున్నవి. నుపటిలాగే ఒక తెల్ల గౌను తొడుక్కుంది. ఆమె అతనికోసం ఒక సువా ర సబ్బు, రెండుతుండ్లు తెచ్చింది. ఆ సబ్బు అప్పుడే పెట్టెలోనుంచి తీసిన త్తది. దానిమీద కంపెనీ పేరు తెలిపే అక్షరాలు మెరుస్తున్నవి. తుండ్లు స్త్రీచేసి పరిశుభ్రంగా వున్నాయి. ఆమెకూడా ఎంతో ఆహ్లాదకరంగా ంది. అతన్ని చూడగానే ఆపుకోలేకపోయిన చిరునవ్వు ఆమె పెదవుల్ని పింపజేసింది.

"బాగున్నారా ?" అని ఆమె ఎంతో కష్టంమీద ఉచ్చరించింది, మె బుగ్గల్లో గులాబీలు పూచినవి.

"నువ్వు కులాసాగా, ఆరోగ్యంగా వుంటున్నావా ?"—సెక్లాడో గాడు తానుకూడా సిగ్గుపడుతూ.

"భగవంతుని దయవల్ల. ఇదిగో మీ కిష్టమైన సబ్బు బిళ్ళ, తుండ్లు ్కడ పెడుతున్నాను. మీ అత్తగారు పంపించారు" అని చెప్పి వాటిని ్కడొక కుర్చీమీద పెట్టేసి ఆమె వెళ్ళిపోయింది.

టిఖాన్ స్నానానికీ, తరువాత అలంకరణానికీ వలసిన సామగ్రి అంతా పరచివుంచాడు. సెక్లాడో హృదయం వెలుగులు చిమ్మింది. ఆనందం ్గింది.

మేనత్తలకు సెక్లాడో మీద అపేక్ష యెక్కువ. ఈ సారి అతనిని ాధికమైన ఆప్యాయతతో ఆదరించారు. ఇప్పుడు సెక్లాడో యుద్ధభూమికి ుతున్నాడు. గాయాలే తగలవచ్చు; మరణమే సంభవించవచ్చు; కాబట్టి ్తల మనస్సు చాల మెత్తబడింది ఈ సారి.

సెక్లాడో మొదట ఓ పగలూ, రాత్రి మాత్రమే వుందామను న్నాడు. కాని మస్లావాని చూచేసరికి మనసు మారింది. ఈష్టరు పండు వెళ్ళేవరకూ ఇక్కడే ఉండాలనిపించింది. తోటి ఆఫీసరయిన స్కోన్

బక్సు తానే పోయి 'వడేసా'లో కలియవలసింది. అతన్నే వచ్చి తన మేనత్తల యింటిదగ్గర కలుసుకొమ్మని తంతిపంపాడు.

మస్లొవాను చూచినప్పటినుంచి మనసులో మునుపటిభావాలే పొడసూపినాయి. మునుపటివలెనే ఆమె తెల్లటిగౌను కనిపించేసరికి మనసు జల్లుమంటూంది. ఆమె పదధ్వని, కంఠస్వరం, నవ్వు కలకలము ఎంతో ఆనందాన్ని ఇస్తున్నాయి. ఆమె నల్లటి కళ్ళని చూస్తూవుంటే గుండె వెన్నవలె అయిపోతున్నది. అన్నిటికంటేకూడా, తాము ఎదురుపడినప్పుడు ఆమె సిగ్గరితనము అతణ్ణి చకితుణ్ణి చేస్తూంది. తానామెను ప్రేమిస్తున్నాననుకున్నాడు. కాని పూర్వంవలె కాదు. మూడేళ్ళనాడు ఈ ప్రేమ ఏదో అనిర్వాచ్యంగా వుండేది. తాను ప్రేమిస్తూన్నట్లు తనకే తెలిసివుండలేదు. ప్రేమించటం జీవితానికి ఒకసారే అని ఆ నాటి తనసూత్రం. కాని ఈ నాడు తాను ప్రేమిస్తున్నానని తెలిసి ప్రేమిస్తున్నాడు; అందుకు సంతోషిస్తున్నాడుకూడాను. ఈ ప్రేమ ఎటువంటిదో, ఎంతవరదాక తీసుకుపోగలదోకూడా అతనికి (విస్పష్టం కాకపోయినా) తెలుసు. ప్రతిమానవునిలోవలె నెఖ్లూడోలోకూడా రెండుశక్తులు వున్నాయి. మొదటిది ఆధ్యాత్మికం. అది సర్వులశ్రేయస్సుకు దారిచూపే ఆత్మసుఖాన్ని మాత్రమే కోరుతుంది. రెండవది పాశవికము. అది స్వసుఖాన్ని మాత్రమే కోరుతుంది. స్వార్థంకోసం విశ్వశ్రేయాన్ని బలిగొనడానికి సిద్ధపడుతుంది. పీటర్స్‌బర్గులో వుంటున్నప్పుడు ఈ పాశవికశక్తి నెఖ్లూడోలో తలెత్తి, క్రమేణా మిలిటరీ వుద్యోగములోచేరిన తరువాత విజృంభించింది. ఇప్పుడదే ఆధ్యాత్మికశక్తిని అణగత్రొక్కి విశృంఖలంగా రాజ్యం చేస్తున్నది.

ఇప్పుడు మస్లొవాను చూచినప్పుడు పూర్వంవలెనే మధురభావాలు కల్గుతున్నాయి. ఆ నాటి ఆధ్యాత్మికశక్తి మరొకసారి ఉబికి పైకి రావటానికి ప్రయత్నించింది. రెండురోజులు అతనిహృదయంలో రెండు శక్తులకూ అవిరామమైన సంఘర్షణ జరిగింది.

నిజానికి మేనత్తల యింట్లో తాను ఎక్కువరోజులు వుండటానికి తగినంతకారణం ఏమీలేదు. ఆ సంగతి అతనికే తెలుసు. ఉన్నందువల్ల ప్రయోజనమూ లేదు. కాని ఉన్నందువల్ల హాయిగా ఆనందంగా ఉంది - అన్నీ ఎరిగివుండికూడా ఆత్మప్రతారణతో అక్కడే ఉండిపోతున్నాడు.

ఆ నాడు ఈస్టరుపండుగ. మూడుమైళ్ళదూరాన చర్చిలో వుంటున్న మతగురువు కాలినడకన దొరసాని యింటికి అర్చనకోసం వచ్చారు. అందరు ప్రార్థనకు హాజరైనారు. మస్లావా కర్పూరాలు మొదలైన వస్తువులను తెచ్చి తలుపుప్రక్కన కాచుంది. ప్రార్థన జరిగినంతసేపూ నెఖ్లూడో మస్లావా వైపే చూస్తున్నాడు. ఆ రాత్రి మెస్సేనా చర్చికి పోవాలని సిద్ధపడు తోంది. తానుకూడా వెడదామని బయలుదేరాడు నెఖ్లూడో.

చర్చికి పోయేమార్గం దుర్గమమైనది. మూడుమైళ్ళదూరం వుంటుంది. బండీపోదు. నడవటం కష్టం. మేనత్తల యింట్లో కష్టంలేకుండా సొంత యింట్లోలాగ వుంటున్నాడు కాబట్టి, వాళ్ళ గుర్రాన్ని జీను తగిలించి తీసుకు రమ్మని నౌకరును ఆజ్ఞాపించాడు — తాను కోటు తగిలించుకుని బయలు దేరాడు — ఆ ముసలిగుర్రం దారిపొడుగునా సకిలిస్తూనే వుంది. మంచు పడుతోంది — చెట్లచేమలగుండా ఆ చిమ్మచీకట్లో సాగిపోయాడు.

## ౧౫

ఆ చీకటిలో స్వారీ చేసుకుంటూపోయి చర్చి ఆవరణలో ప్రవే శించాడు. చుట్టూ దీపాలు వెలుగుతున్నాయి. లోపల ప్రార్థన అంతకు మునుపే ఆరంభమైంది. అక్కడవున్న రైతులు అతన్ని గుర్తించారు. తమ దొరసాని మేనల్లుడని ఆదరంగా ఎదురు వచ్చారు. స్వాగత వాక్యాలు పలి కారు. గుర్రాన్ని తీసుకుపోయి సురక్షితమైన చోట కట్టివేసి, మేత వేశారు. అతన్ని చర్చిలోనికి వెంటబెట్టుకు తీసుకుపోయారు.

లోపల జనులు క్రిక్కిరిసి ఉన్నారు. కుడివైపున అంతా రైతులు కూచున్నారు. ముసలివాళ్లు ముతకబట్టలు కట్టుకొని ఉన్నారు. యువకులు కొత్త దుస్తులు ధరించి, నడుములకు రంగు రంగుల పటకాలు పెట్టుకున్నారు.

ఎడమవైపున అంతా యువతులు నిల్చున్నారు. తలలకు ఎర్రని సిల్కు రుమాళ్లు చుట్టారు. నలుపురంగు వెల్వెట్ జాకెట్లు తొడుక్కున్నారు. ఎర్రని, ఆకుపచ్చని, నీలపు—రంగు రంగుల గౌనులు ధరించారు. మందపాటి తోలుబూట్లు తొడుక్కున్నారు. యువతుల వెనుక ముసలమ్మలు ఉన్నారు. వీరు నిరాడంబరమైన, స్వయంగా వడికి నేసుకున్న దుస్తులే ధరించి,

మామూలు తెల్లని రుమాళ్లు తలకు చుట్టారు. అందమైన దుస్తులు ధరించి చిన్నపిల్లలు లోపలికి వస్తూ, బైటికిపోతూ హడావిడిగా ఉన్నారు.

పురుషులు తలలు వంచి, ప్రార్థనా నిమగ్నులై కొంతసేపు అలాగే ఉన్నారు. చివరకు మామూలుగా తలెత్తి కూచున్నారు.

స్త్రీలు-ముఖ్యంగా ముసలివాళ్లు చుట్టూ దీపాలు ఉన్న ఒక శిలువ వంక తదేకంగా చూస్తున్నారు. హృదయంపై శిలువ గుర్తు రచించుకుని మోకరిల్లి ఏదో జపించారు. చిన్నపిల్లలు పెద్దల్ని అనుకరిస్తూ-ఇతర్లు తమను కనిపెడుతున్నారని తెలిస్తే మాత్రం అత్యంత శ్రద్ధాభక్తులతో ప్రార్థనలు చేశారు. చివరకు అంతా కలిసి భక్తి గీతాలు పాడారు.

నెఖ్లూడో ముందుకు సాగివచ్చాడు. చర్చి మధ్యభాగంలో ఆ ప్రాంతపు ధనికవర్గంవారు కొందరున్నారు. భార్యా పుత్రులతో సహా ఒక భూస్వామి, పోలీసు ఉద్యోగి, టెలిగ్రాఫ్ ఆఫీసు గుమాస్తా, ఎత్తయిన బూట్లు తొడుక్కున్న వర్తకుడు, పతకం ఒకటి ధరించిన ఊరిపెద్ద— వీరంతా వరుసగా కూచున్నారు. భూస్వామి భార్యకు వెనకాల మెత్రేనా ఉంది. ఆమె ప్రక్కనే తెల్లటి గౌను తొడుక్కుని మస్లొవా ఉంది. ఆమె నల్లని కేశబంధముపై ఒక యెర్రని అర్థచంద్రాకారపు ఆభరణం ఉంది.

పండుగకు తగినట్టుగా అంతా అందంగా, తేజోయుతంగానే ఉంది. బంగారు శిలువలు పుచ్చుకుని మతగురువు-చక్కగా దువ్వుకున్న తలలతో, అందమైన దుస్తులతో గాయక శిఖామణులు, హృదయంగమములైన పాటలు, అందర్నీ మతగురువు ఆశీర్వదించటము అంతా బాగానే ఉంది. వీటన్నింటి కంటే తెల్లని దుస్తులు ధరించి, నల్లటి జుత్తులో ఎర్రని ఆభరణం ధరించి, విచిత్ర శోభావంతములైన చూపులుగల మస్లొవా సమ్మోహనకరంగా ఉంది.

నెఖ్లూడో ఆమె పక్కనుంచే ముందుకు సాగిపోయాడు. ఆమె తనకేసి చూడకపోయినా తన గాలిసోకిన రీతులు ఆమెలో చూశాడు. తానామెతో చెప్పవలసిన సమాచారమేమీ లేదు నిజానికి. అయినా ఊరుకోలేకపోయాడు. "మా మేనత్త ప్రార్థనలైపోవటంతోనే ఉదయానికల్లా ఉపవాస వ్రతం మానేసి పారణ చేస్తుందిట" అని నెమ్మదిగా ఆమె చెవిలో ఊదాడు ఆ పక్కగా వెడుతున్నప్పుడు.

మస్లావా బుగ్గలు రాగరంజితములైనాయి. అతన్ని చూసినప్పుడల్లా ఆమె కంతే. ఆ కాటుక పిట్టల్లాంటి కళ్లు నవ్వుతూ అతని ముఖంమీద వాలాయి.

"ఆ సంగతి నాకు తెలుసు" అన్నది ఆమె.

ఆ సమయాన చర్చి గుమాస్తా పవిత్రజలం వున్న పాత్ర పుచ్చుకుని అటువైపే వెడుతున్నాడు. దొరసాన్ల మేనల్లుడైన నెక్లూడోను తప్పుకుని దూరంగా వెడదామన్న ఆతృతలో మస్లావాను రాసుకుంటూ వెళ్ళాడు. నెక్లూడో ఆశ్చర్య చకితుడైనాడు. ఈ చర్చిలోని ప్రతివస్తువూ-అంతేకాదు ఈ ప్రపంచంలోని సర్వమూ ఆమె కొరకే సృష్టింపబడినది. ఈ సంగతి ఆ గుమాస్తాకు ఏమి తెలుస్తుంది? దేనియెడలనైనా అవజ్ఞతో చూపవచ్చు. కాని ఈ సమస్తమునకూ కేంద్రమైన మస్లావాపట్ల అవజ్ఞత చూపవచ్చునా? ఆ బంగారు శిలువల మెరుపు ఆమెకొరకే. ఆ దీపాల ప్రకాశం ఆమె కోసమే. ఈ భక్తి గానాలన్నీ ఆమె కొరకే. ప్రపంచంలోని అందమంతా ఆమెకోసమే నన్న సంగతి మస్లావాకు కూడా తెలుసునని నెక్లూడో భావం. తెల్లని దుస్తుల్లోని ఆ సుందర విగ్రహాన్ని, ఆమె ముఖబింబంలోని ఆనంద రేఖల్ని చూసినప్పుడు, నెక్లూడోకు తన హృదయంలోని పాటే ఆమె హృదయంలో కూడా గేయమానమౌతున్నట్టు తోచింది.

ప్రార్థన ముగిసింది. నెక్లూడో బైటికి వచ్చాడు. రైతులు పక్కలకు ఒత్తిగిలి తోవ యిచ్చారు.

మెట్ల దగ్గర ఆగాడు. బిచ్చగాళ్ళు చుట్టూ మూగారు. తన దగ్గర వున్న చిల్లర యావత్తూ వాళ్ళకు పంచిపెట్టేశాడు. ఇక మెట్లుదిగి వచ్చేశాడు. అరుణోదయం ఔతోంది. చాలామంది చర్చి ఆవరణలోని గోరీల దగ్గర మూగారు. మస్లావా ఇంకా చర్చిలోనే వుంది. నెక్లూడో ఆమెకోసమే ఎదురు చూస్తూ వున్నాడు.

ఒక ముసలివాడు మెడ ఊపుకుంటూ సమీపించాడు. ఒకప్పుడతడు నెక్లూడో మేనత్తల యింట్లో వంటవాడుగా వున్నాడు. ఈ పండుగనాడు సౌహార్ద్ర చిహ్నంగా ఒకరొకళ్ళు ముద్దుపెట్టుకోటం ఆచారం. ఆ ముసలివాడు నెక్లూడోను పండుగ ముద్దు పెట్టుకున్నాడు. అతని భార్య నెక్లూడోను

పసుపురంగు వేసిన కోడిగుడ్డును బహుమతి చేసింది. ఇంతలో మరొక రైతు యువకుడు వచ్చి వుల్లాసంగా నెఖ్లూడోను ముద్దు పెట్టుకుని ఒక గోదుమ రంగు పూసిన కోడిగుడ్డును వుపహారంగా ఇచ్చాడు.

ఈ సమయాన అల్లంత దూరాన మెట్రేనా కనిపించింది. ఆమె ప్రక్కనే ఎర్రని ఆభరణంగల నిగనిగలాడే వేణీబంధం కూడా కనిపించింది.

తన ముందున్న వాళ్ళ తలల మీదుగా నెఖ్లూడోను చూసింది మస్లోవా. ఆమె ముఖవికాసాన్ని అతడు చూచాడు.

మెట్రేనాతో సహా అక్కడ ఆగింది మస్లోవా బిచ్చగాళ్ళకు ధర్మం చెయ్యటానికి. ఒక బిచ్చగాడికి ముక్కు లేదు. దానిస్థానే ఒక పుండు వుంది. వాడు చేతులు చాచి మస్లోవా ముందు నిలబడ్డాడు. ఆమె అతనికేదో ఇచ్చింది. ఇచ్చి ఏమాత్రమూ అసహ్యించుకోకుండా అతన్ని మూడుసార్లు పండగముద్దులు పెట్టింది. ఆ సమయంలో ఆమెచూపులు నెఖ్లూడో వైపు ప్రసరించాయి. అతడామె వైపే చూస్తున్నాడు. "నేను చేస్తున్న పని సరియైనదేనా ?" అని అడుగుతున్నట్టు వున్నాయి ఆమె చూపులు. "ఔను, ప్రేయసీ! అది సవ్యమైన పనే, సర్వం శివమే. సుందరమే, ప్రేమే" అని సమాధానం చెబుతున్నట్టున్నాయి. అతనిచూపులు.

మెట్రేనా మస్లోవాలు వచ్చి నెఖ్లూడోను కలుసుకున్నారు. నెఖ్లూడో వాళ్ళకు పండుగ ముద్దులిచ్చే కోరికలో లేడు. ఆమెకు దగ్గరగా వుండాలని వుత్సుకుడయినాడు.

"ఈ నాడు వర్గ వ్యత్యాసాలు పాటించరాదు. అందరం సమానమే"-అన్న భావం కనబరుస్తూ-మెట్రేనా చేతిరుమాలుతో తుడుచుకున్న పెదవుల్ని ముందుకు చాచింది, నెఖ్లూడో ముఖంలోకి చూస్తూ, పండగముద్దులకోసం.

నెఖ్లూడో వంగి ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. వెంటనే మస్లోవా కేసి చూచాడు. ఆమె సిగ్గుపడుతూ దగ్గరకు వచ్చింది. పరస్పరం రెండుసార్లు ముద్దుపెట్టుకున్నారు. కాసేపు ఆగారు. మూడో ముద్దుకూడా అవసరమా అని ఆలోచిస్తున్నట్టు. అవసరమేనని తేల్చుకుని మూడోసారికూడా ముద్దుపెట్టుకున్నారు - మందహాసాలు చేశారు.

"మతగురువుగారింటికి వెళ్ళవా ?" అని అడిగాడు నెఖ్లూడో.

"ఊహుఁ - ఇక్కడే కాసేపు కూచుందాం" అని - అవంచపోతునైన ఒకబరువైన పనిచేసి అలసిన దానివలె- ప్రయత్నపూర్వకంగా పలికింది. ఉన్నత వక్షసీమ ఉబికి పడిపోతూ ఉంది - ఆమె అతనికేసి చూస్తోన్న చూపులలో భక్తితత్పరత, పవిత్ర కన్యాత్వం, ప్రేమ తొణికిసలాడుతూన్నై.

స్త్రీ పురుష ప్రేమ ఎప్పుడో ఒక మధురక్షణాన ఉచ్చస్థాయిని అందుకుంటుంది. అది అపార పారవశ్యస్థితి, విమర్శనకు తావుళేని అద్భుతస్థితి; ఇంద్రియాతీతమైనది. ఈ యీస్టరుపండుగనాటిరాత్రి అట్టి మధురక్షణమే నెక్లూడోకు సంప్రాప్తమైంది. ఇప్పుడు మళ్ళీ మస్లోవాను స్మరిస్తే ఆ మధుర క్షణమే స్మృతిపథాన్ని ఆక్రమించేసింది. మరేదీ చోటూనికి తావులేదు. ఆ మెత్తని నిగనిగలాడే నల్లనిజుట్టు—వొంటికి బిగుతుగా హత్తుకుపోయి యౌవనచిహ్నితాలైన అవయవసౌష్టవాన్ని చూపుతోన్న తెల్లనిగౌను - అప్పుడప్పుడే ఔన్నత్యాన్ని కూర్చుకుంటోన్న వక్షోభాగం- కాటుకకళ్ళు - లజ్జారుణకపోలాలు - పవిత్రప్రేమవాహినులనే చిమ్ముతోన్న ఆ మధురాకృతి నిండిపోయింది స్మృతిపథాన. ఆ మధురాకృతి ప్రసరించే పవిత్రప్రేమ అతనికోసమే కాదు (నెక్లూడోకు తెలుసు ఆ సంగతి) ప్రతివాని కోసమూను; అందమైన వస్తువులపట్లనే కాదు, ప్రపంచములోని సర్వముపట్లనూ—ఆమె ముద్దుపెట్టుకున్న బిచ్చగాని పట్లకూడాను.

అటువంటిప్రేమ ఆమెలో వున్నదని అతనికి తెలుసు. ఆ రాత్రి, ఆ మర్నాటి ఉదయం అది అతనిలోకూడా ఉంది. అట్టి ప్రేమలోనే తానామెతో తాదాత్మ్యము పొందినట్టు తెలుసుకున్నాడు - ఆ రాత్రి అది అందుకున్న స్థాయిలో అక్కడే ఆగిపోయి ఉంటేనా! "ఔను, ఆ ఘోర వ్యవహారమంతా ఆ పండుగనాటిరాత్రే జరగలేదు" అనుకున్నాడు నెక్లూడో జూరీసభ్యుల గదిలో కిటికీదగ్గర కూలబడివుండి.

## ౧౬

చర్చినుంచి యింటికిరాగానే మేనత్తలతోపాటు ఉపవాసవ్రతాన్ని ముగించి అల్పాహారాలు సేవించాడు. ఇంత సారాయంకూడా పుచ్చుకున్నాడు. మిలిటరీ ఉద్యోగంలో చేరినతరువాత ఈ తాగుడు బాగా అలవాటైపోయింది. తనగదిలోకిపోయి దుస్తులు మార్చుకోకుండా, అలాగే పడి

నిద్రపోయాడు. కొంతసేపటికి ఎవరో తలుపు తట్టుతూంటే విని లేచాడు. ఆ తట్టేది ఆమేనని గుర్తించాడు. కళ్లు నులుముకుంటూ ఒళ్ళు విరుస్తూ "నువ్వేనా ? మస్తాన్ ! లోపలికి రా" అన్నాడు.

ఆమె తలుపు తోసింది. "భోజనం తయారైంది" అంటూ ఒకసువార్త చెబుతున్నదానివలె, నవ్వుతూ అతనికేసి చూచింది. ఆ తెల్లగానే తోడుక్కుంది. జుట్టులో ఆ ధనురాకారపు ఆభరణంమాత్రం లేదు.

"వస్తున్నాను" అంటూ లేచి, తల దువ్వుకునేందుకు దువ్వెన అందుకున్నాడు.

ఆమె ఇంకా అక్కడే నిల్చుంది. అతడది గమనించి, దువ్వెన అవతలపెట్టేసి, ఆమెపైపు రెండడుగులు వేశాడు. వెంటనే ఆమె వెనక్కు తిరిగి లేడిపిల్లలా వెళ్ళిపోయింది.

"అరె, బుద్ధిలేదు నాకు - పట్టుకుని ఆపితే బాగుండిపోయేది"-అనుకున్నాడు. ఆమె వెనకాలే రివ్వున పరిగెత్తాడు. సమీపించాడు.

ఆమెను ఎందుకు వెంబడించాడో తనకే తెలియదు. ఆమె తన గది ముందుకు వచ్చినప్పుడు - సాధారణంగా అట్టి సమయంలో అందరూ చేసే పని యేదో - తానూ చేసియుండవలసినది. చేయలేదు. అది లోటైంది.

"మస్తానా ! కాస్త ఆగు."

ఆమె ఆగింది. "ఏం కావాలి మీకు ?"

"ఏమీ లేదు. కొంచెం——" అట్టిస్థితిలో మామూలుగా పురుషులు ఏం చేస్తారో జ్ఞాపకం తెచ్చుకుని- తన హస్తాన్ని నడుంచుట్టూ పోనిచ్చాడు, ప్రయత్నపూర్వకంగా.

ఆమె అతని కన్నుల్లోకి చూస్తూ కదల్లేదు, మెదల్లేదు.

"వద్దండీ, వద్దు"- అన్నదామె సిగ్గుపడుతూ. కన్నులు అశ్రుసిక్తములైనాయి. గట్టిగా అతనిచేయిని తోసివేసింది. నెక్లాడో ఆమెను వొదిలిపెట్టాడు. అతనికి భావాసహ్యత కలిగింది. సిగ్గుపడ్డాడు. తనపై తనకే విసుగు కలిగింది. హృదయాంతరాళంలో అణగిమణగియుండిన ఉన్నత ఆశయస్ఫూర్తి జాగృతమైన కారణంచేతనే ఈ భావాసహ్యత, సిగ్గు తనకు

సంభవించాయన్న సంగతి అతడు గమనించియుండవలసింది. కాని అది తన చేతగానితనంవల్ల సంభవించిన దుష్ఫలితాలనుకున్నాడు. అందరు పురుషులలా ఆ స్థితిలో ఎలా ప్రవర్తిస్తారో తానూ అలాగే ప్రవర్తించియుండవలసినదని అనుకున్నాడు. మళ్ళీ ముందుకు పరిగెత్తి ఆమె బుగ్గలమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఆ నాడు మల్లెపొదచాటున పెట్టుకున్న ముద్దువంటిది కాదిది. నేటి తెల్లవారుఝామున చర్చి ఆవరణలో ముద్దుపెట్టుకున్న ముద్దువంటిదీ కాదిది. ఇదొక భయంకరమైన ముద్దు. దానిలోని భయదవృత్తిని ఆమె అనుభవించింది.

అతడు భోజనశాలలోనికి వచ్చాడు. మేనత్తలు ఉచితక్రియని ముస్తాబై వున్నారు. ఇంటివైద్యుడు, మరొక పొరుగింటి పెద్దమనిషికూడా వున్నారు. అంతా మామూలుగానే ఉంది. నెఖ్లూడో హృదయంలో మాత్రం ఒకతుపాను రేగుతోంది. భోజనంముందు ఎవరేమి మాట్లాడుతున్నారో అతనికి అర్థం కావటంలేదు. తన్నెవరైనా ఏదైనా ప్రశ్నవేస్తే ఏదో తోచిన జవాబు చెప్పేస్తున్నాడు. ఎప్పుడూ మస్లోవానుగురించే ఆలోచన! తోటలో ఆమెను పట్టుకుని ముద్దుపెట్టుకున్నప్పటి ఆవేశ తీవ్రతనే స్మరిస్తూవున్నాడు. తదితరమేమీ అతనిమనస్సును చేరటంలేదు. అతడు గదిలోకివచ్చినప్పుడు చుట్టూ కలయచూడలేదు. కాని ఆమెకూడా అక్కడే ఉన్నట్టు తెలుసుకున్నాడు. అక్కడ వున్నంతసేపూ ఆమెవైపు చూడకుండా ఉండటానికి విశేషప్రయత్నం అవసరమైంది.

భోజనానంతరం తనగదిలోకి వెళ్ళాడు. అటూఇటూ పచార్లుచేశాడు. ఇంట్లో ఏ కాస్త అలికిడి అయినా వొళ్ళంతా చెవులై వింటున్నాడు. పరిచితమైన ఆమె అడుగు సవ్వడులకు ఎదురుచూస్తున్నాడు. అతనిలోని పశుత్వం పూర్తిగా విజృంభించింది; మూడేళ్ళనాటి అతనిలోని ఆధ్యాత్మిక తత్వాన్ని, ఆ తెల్లవారుఝామున తలెత్తిన ఆధ్యాత్మిక తత్వాన్ని ఈ పశుత్వం అణచివేసింది. ఇప్పుడీ పశుత్వమే అతనిలో ఏకచ్ఛత్రాధిపత్యం వహించింది.

రోజంతా ఆమెకోసం తహతహ పడుతూవున్నా ఆమెను కలుసుకోటం తటస్థించలేదు. ఆమె తన కంటపడకుండా వైదొలగి తిరుగుతోంది కాబోలు!

సాయంత్రమప్పుడు ఆమె అతని గదికి ప్రక్కనే ఉన్న మరో గదిలోకి రావలసి వచ్చింది. ఇంటి వైద్యుణ్ని ఆ రాత్రి అక్కడే ఉండిపొమ్మన్నారు. ఆయనకు పక్క వెయ్యటానికి వచ్చింది మస్లావా. ఆమె వెనకనే నెహ్లూడోవ్ కూడా గదిలోకి వెళ్ళాడు. మెల్లిగా అడుగులు వేసుకుంటూ, ఊపిరి బిగబట్టి వెళ్ళాడు ఏదో మహానేరం చేయబోతున్నవాడులాగ.

ఇంటి వైద్యునికోసం వేసిన పక్కమీద దిండు అమర్చబోతూ ఉన్నదామె. ముందు దానికి శుభ్రమైన గలీబు తొడగబోతూ ఉంది. గలీబు తెరచి రెండు మోచేతుల వరకూ దానిలో పెట్టింది. ఇంతలో వెనక్కు తిరిగి నవ్వింది. అది పూర్వంవలె ఆనంద సూచకమైన మందహాసంగా కాదు. భయగ్రస్తం, దయనీయం అయిన చిరునవ్వు. "నువ్వు చేయబోయేది తప్పు" అని ప్రబోధిస్తున్నదా చికిలినవ్వు. అతడు కాసేపు ఊగులాడుకున్నాడు. గుండెలో అప్పటికీ సత్-అసత్తుల పెనగులాటకు అవకాశం ఉండింది. పవిత్ర ప్రేమ ఆమె తరఫున వకాల్తా పుచ్చుకుని, ఆమె ఆశయాల్ని గురించీ, భావిజీవితాన్ని గురించీ—మెల్లిగానైనా వాదించింది. దానికి ప్రతిశక్తిగా మరోవాణి బయలుదేరింది. "జాగ్రత ! సుఖం, భోగం లభించగల ఈ అవకాశాల్ని జారవిడుచుకోవద్దు" ఈ రెండోవాణి మొదటి దాన్ని పీకనొక్కేసింది. అతడు కృతనిశ్చయుడై ఆమెను సమీపించాడు. అదుపు మీరిన ఒక ప్రబల-భయంకర పాశవిక మోహం అతన్ని ఆవేశించింది.

ఆమె నడుముచుట్టూ చెయి పైనవేచి మంచంమీద కూచోబెట్టాడు. ఇంకా చేయవలసిందేమో ఉన్నదన్నట్టు ఆమె పక్కనే తానూ కూచున్నాడు.

"వొదిలిపెట్టండి, నన్ను పోనీయండి" అని ఆమె దయనీయంగా పలికింది. "అదిగో మెట్రేనా వస్తోంది" అన్నది. ఎవరో నిజంగా వస్తున్నట్టే ఉంది.

"అయితే సరే, ఈ రాత్రి నీ దగ్గరకు వస్తాను. ఒంటరిగానే ఉంటావు కదూ !"

"ఏమిటి మీ ఉద్దేశం ! ఎన్నే ! ఊహుం. ఊహుం" అన్నదామె. కాని అవి పెదవులమీదనుంచి వచ్చినమాటలే. ఆపాద మస్తకమూ నాతనా వేళ వికంపితమైన ఆమె శరీరం చెబుతోన్న కథ వేరు.

"మిత్రేనా వచ్చింది. ఆమె ఒక సర్వెటీ తెచ్చింది. నెఖ్లూడోవ్ వైపు మందలిస్తున్నట్టుగా చూసింది. సరిగ్గా మాటవరుసకైనా ఎవరి సమ్మతో తీసుకు వచ్చినందుకు మస్లోవాను కోపం చేసింది.

నెఖ్లూడోవ్ మాటాడకుండా బైటికి వచ్చేశాడు. ఏమయినా పడలేదు. మిత్రేనా చూపులోని మందలింపు గ్రహించాడు. ఆ మందలించటానికి తగిన కారణం ఉన్నదని అతనికి తెలుసు. తాను తప్పు చేస్తున్నట్లు గ్రహించాడు. కాని మస్లోవా యెడల ఉండవలసిన పవిత్ర ప్రేమను అణగద్రొక్కేసి ఒక క్రొత్త పాశవికశక్తి ఒక్కటే ఇప్పుడు మనస్సులో ఏకచ్ఛత్రాధిపత్యం వహించి ఉంది. ఈ పశుత్వ తృప్తికోసం అవశ్యం తానేదో చేయాలి. అందుకు అవకాశాన్ని ఎలా పొందుతానా అని ఆలోచిస్తున్నాడు.

ఆ సాయంత్రమంతా తన గదిలోకీ, బైట వరండాలోకీ— అటూ ఇటూ తిరిగాడు. ఆమెను ఏకాంతంగా ఎలా కలుసుకోవాలన్నది ఒక్కటే ఆలోచన ! కాని ఆమె అతని కంట పడలేదు. పైగా మిత్రేనా ఆమెమీద ఒక కన్ను వేసే ఉంచింది.

## ౧౩

బాగా చీకటి పడింది. ఇంటి వైద్యుడు వెళ్ళి తన గదిలో పడుకున్నాడు. మేనత్తలు తమ గదిలో విశ్రమించారు. మిత్రేనా కూడా వాళ్ళ దగ్గరే ఉన్నదని నెఖ్లూడోవ్‌కు తెలుసు. కాబట్టి పరిచారికల గదిలో మస్లోవా ఏకాంతంగానే ఉంటుందని ఊహించాడు. వెంటనే వసారాలోకి వచ్చాడు. అంతా చీకటిగా ఉంది. పొగమంచు వ్యాపించి ఉంది. వంద అడుగుల దూరాన కొండ పక్కగా ప్రవహిస్తోన్న నది విచిత్రంగా శబ్దిస్తోంది. అది మంచుగడ్డలు పగులుతోన్న చప్పుడు. నెఖ్లూడోవ్ మెట్లు దిగి పరిచారికలుండే గది కిటికీవద్దకు వచ్చాడు. గుండె విపరీతంగా కొట్టుకుంటోంది. తన హృదయ ఘటీ ధ్వనులు తనకే వినిపిస్తున్నాయి. నిట్టూర్పులు పుచ్చుతున్నాడు. గదిలో ఒక చిన్న దీపం వెలుగుతోంది. టేబిల్ ముందు కూచుంది మస్లోవా. ఏమో ఆలోచిస్తోంది. నెఖ్లూడోవ్ కిటికీ దగ్గరే చాలాసేపు నిల్చున్నాడు. ఆమె ఏమిచేస్తుందో చూడాలని కోరిక. ఒకటి రెండు నిమిషాల వరకూ ఆమె కదల్లేదు. చివరకు ముఖం ఎత్తింది. నవ్వుకుంది. తన్ను తాను మందలించుకుంటూ

న్నట్టుగా తల ఊపింది. కూచున్న భంగిమ మార్చింది. చేతులు బల్లమీద పెట్టి ఎదురుగా చూస్తూ కూచుంది తదేకంగా. అతడక్కడే నిల్చుని ఆమెను పరికిస్తూ ఉన్నాడు. తన గుండె చప్పుడు, దూరాన్నివస్తున్న నదీ తరంగ రవాలు వింటున్నాడు. ఆ నది దగ్గర, పొగ మంచులో ఏదో నిరంతరపు ప్రకృతి వ్యాపారం సాగుతోనే ఉంది. మంచుగడ్డలు ఒకదాని కొకటి డీకొని, ముక్కలు ముక్కలుగా పగిలిపోతూ, వింత వింత శబ్దాల్ని పుట్టిస్తున్నాయి. అవి నీళ్ళలో జారి పడిపోతూ చప్పుడు చేస్తున్నాయి. ఈ చప్పుడులన్నీ కలిసి ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నట్టుగా తోపిస్తున్నాయి.

మస్లొవా ముఖ కవళికలో ఏదో గంభీరత! ఏదో బాధ! తీవ్రతరమైన హృదయ మథనం వ్యక్తమౌతున్నది. అది చూసి నెక్లూడో జాలిపడ్డాడు. కాని అదేమిటో మరి, ఈ జాలి అతని వాంఛన్ని మరింత మండించాయి. గాఢవాంఛ అతన్ని ఆవేశించింది.

వెళ్ళి తలుపు తట్టాడు. విద్యుచ్ఛక్తి సోకినట్టు ఆమె ఉలికిపడిపోయింది; శరీరమంతా కంపించింది. భీతావహంగా చూసింది. చివాలున లేచి కిటికీ దగ్గరకు వచ్చింది. గాజుపలక గుండా అతన్ని చూసి గుర్తించింది. ఆమె ముఖంలో ఎన్నడూ లేని గంభీరాన్ని నెక్లూడో చూశాడు. అతని చిరునవ్వుకు బదులుగా ఆమె కూడా చిరునవ్వు నవ్వింది. కాని ఆమె హృదయంలో భయమే కాని నవ్వులేదు. సైగచేసి పిల్చాడు ఆమెను-పెరటులోనికి రమ్మని - ఆమె తల అడ్డంగా తిప్పి, కిటికీదగ్గరే నిల్చుంది. గాజుపలకకు దగ్గరగా ముఖం పెట్టి ఆమెను పిలువబోయాడతడు. కాని ఆమె ద్వారం కేసి తిరిగింది. ఎవరో ఇంట్లోనుంచి ఆమెను పిల్చారు - నెక్లూడో కిటికీ దగ్గరనుంచి కదలిపోయాడు.

పొగమంచు దట్టంగా వుంది. నాలుగడుగులుదాటి వెళ్ళితే కిటికీ కనుపించదు. దీపపు వెలుగుమాత్రం ఎర్రని ముద్దలా కనిపిస్తుంది. నది దగ్గరనుంచి మంచుపెళ్ళలు పగిలి, నీళ్లలో రాలుతూన్న చప్పుడు వినిపిస్తూనే వుంది. దూరాన పొగమంచులో ఒక కోడి కూసింది. దానికి జవాబుగా మరొక కోడి కూసింది. దానితో ఊళ్లోవున్న కోళ్లన్నీ కూయసాగినవి. వాటి అన్నింటి కూతలు కలిసి ఒక్క కూతగా పరిణామం చెందాయి. ఆ రాత్రి కోళ్లుకూయటం అది రెండోసారి.

కాసేపు నెఖ్లూడోవ్ యింటి వెనుకవైపు మూలపచార్లు చేశాడు. చివరకు మళ్ళీ కిటికీదగ్గరకు వచ్చాడు. దీపం వెలుగుతూనేవుంది. ఏం చేయాలో తోచక ఆమె అలాగే కూచుని ఆలోచిస్తూనేవుంది. అతడు రాగానే ఆమె తలయెత్తింది. అతడు గాజుపలకమీద చప్పుడు చేశాడు- అది ఎవరోకూడా తెలుసుకోకుండానే ఆమె గదిలోనుంచి పారిపోయింది. వెనకవైపు తలుపు తెరచినట్టు చప్పుడైంది. ఆ పక్కన వసారాలో ఆమెకోసం కాచుకుని వున్నాడు. రాగానే మాటాడకుండా సందిట పట్టుకున్నాడు. ఆమె అతన్ని కరుచుకుంది. మొగమెత్తి, పెదవులిచ్చి, ముద్దుల్ని స్వీకరించింది. పక్కవసారాలో ఒకమూల నిల్చివున్నారిద్దరూ. తీరని విపుల వాంఛాకలిక అతన్ని బాధిస్తోంది.

మళ్ళీ లోపల తలుపు తెరచిన చప్పుడైంది. "మస్లావా!" అని కోపంగా కేకవేస్తోంది మెట్రేనా.

ఆమె అతని కౌగిలి చీల్చుకొని గబగబా పారిపోయింది పరిచారికల గదిలోకి. లోపల తలుపు గడియవేసిన చప్పుడైంది. మళ్ళీ అంతా నిశ్శబ్దం! దీపపు వెలుగు మాయమైంది. పొగమంచు మాత్రం తీవ్రంగా వ్యాపించుకొస్తోంది. నది దగ్గర ధ్వనులు యథాపూర్వంగానే ఉన్నాయి. నెఖ్లూడోవ్ తిరిగివచ్చి ముఖద్వారంగుండా ఇంట్లోకి వెళ్ళాడు. కాని నిద్రపట్టదు. మళ్ళీ లేచి బయలుదేరాడు. మెట్రేనా తన గదిలో గుర్రు తీస్తోంది. ఆ పక్క గది ముందుకు వెడుతున్నాడు. ఇంతలో మెట్రేనా దగ్గింది, అతని గుండె ఆగిపోయింది. ఒక అయిదు నిమిషాలు అక్కడే మొద్దులా ఉండిపోయాడు. మళ్ళీ గుర్రుతీయసాగింది. మెల్లిగా మస్లావా గది ద్వారందగ్గరకు చేరాడు నెఖ్లూడోవ్. లోపల నిశ్శబ్దంగా ఉంది. ఆమె మేల్కొనే ఉండాలి; లేకపోతే ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వినిపించేవే. మెల్లిగా "మస్లావా!" అని పిల్చాడు. ఆమె చివాలున లేచింది. వెళ్ళిపొమ్మని కోపగించుకుంటున్నట్టుగా ఇలా పలికింది.

"ఏమిటి మీ ఉద్దేశం? ఏం చెయ్యాలనీ? మీ మేనత్తలు వింటారు సుమీ!" ఇవీ ఆమె పలికిన మాటలు. కాని, "నేను నీ దాన్ని" అని చెబుతున్నట్టుగా ఉంది ఆమె శరీరం యావత్తూ. ఇదే అతనికి వినిపించింది.

"తలుపుతీ! ఒక్క నిమిషం! బ్రతిమాలుతున్నాను" ఏమి పలుకుతున్నాడో కూడా అతనికి తెలియును.

లోపలనుంచి మాటమాట లేదు. ఆమె చేయి గడియమీద వాలిన సుశబ్దం వినిపించింది. గడియ తీసిందామె. అతడు లోపల ప్రవేశించాడు. పవిట దుస్తుల్లో ఉన్న ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. అమాంతం ఎత్తుకుని బైటికి తీసుకువచ్చాడు.

"ఏమిటండి? ఏం చేస్తున్నారు?" అన్నదామె నిమ్మళంగా. అతడామె మాటల్ని లెక్కచేయలేదు. తన గదిలోకి ఎత్తుకుపోయాడు.

"ఊహుం. వద్దు. నన్ను పోనీయండి" అంటూందామె అతన్ని గట్టిగా కరచి పట్టుకుని.

* * *

కొంతసేపటికి ఆమె వణుకుతూ, అతని మాటలకు సమాధానం చెప్పకుండా, మౌనముద్ర వహించి—అతన్ని వదిలి వెళ్ళిపోయిన తరువాత, అతడు మళ్ళీ వసారాలోకి వెళ్ళాడు - జరిగిన సంఘటనలోని అంతరార్థాన్ని అవగతం చేసుకునేందుకు.

తెల్లవారబోతున్నట్టుంది. నది దగ్గర రోదన ధ్వనులు జాస్తి అయిపోయినాయి. పొగమంచు బాగా కిందకి దిగింది. పైన చంద్రబింబం మసకమసకగా వెలుగుతోంది.

"ఈ జరిగిన వ్యవహారంలోని భావం ఏమిటి? అపార సుఖాన్ని అనుభవించానా? దురదృష్టపు కూపంలో పడ్డానా?" తన్ను తాను ప్రశ్నించుకున్నాడు సెల్లాడో.

"ఇది అందరికీ కలిగే అనుభూతే. అందరూ ఇలాగే చేస్తారు" అని తనకుతానే సమాధానం చెప్పుకున్నాడు; వెళ్ళి పడుకుని నిద్రపోయాడు.

## ౧౮

వర్నాడు స్టోన్‌బక్ వచ్చాడు. మంచి హుషారైన మనిషి. మర్యాద రీతులు తెలిసినవాడు. అతని నాజూకు తనానికి, ఉదారస్వభావా

నికి, చలాకీతనానికి, ముఖ్యంగా అతనికి నెఖ్ల్యుడోవ్ పట్ల ప్రేమకు మేనత్తలు సంతోషించారు.

స్కోన్‌బక్ చూపిన ఔదార్యానికి మేనత్తలు సంతోషించారు కాని, అది మరీ అతిగా ఉండడం వాళ్ళకు వింతగా తోచింది. వాళ్ళింటికి ఎవరో గుడ్డివాళ్ళు వస్తే స్కోన్‌బక్ వాళ్ళకు ఒక రూబుల్ ఇచ్చాడు. ఇంట్లో పనివాళ్ళందరికి 15 రూబుల్స్ మామూళ్ళ క్రింద పంచిపెట్టాడు. సోఫియా పెంపుడు కుక్క కాలికి దెబ్బతగిలి నెత్తురు కారుతూవుంటే తన జరీ అంచుల సిల్కు జేబురుమాలు చించి కట్టు కట్టాడు. ఆ రకపు రుమాళ్ళు డజను 15 రూబుల్స్ ఖరీదు ఉంటాయని సోఫియాకు తెలుసు. ఇంత పెద్ద ఔదార్యాన్ని ఆ యింటి ముసలి దొరసాన్లు ఇదివరకెన్నడూ చూసి వుండలేదు. స్కోన్‌బక్ లోకులకు 2 లక్షల రూబుల్స్ బాకీ ఉన్నాడని-ఆ బాకీని తన జీవితంలో చెల్లించబోవటం లేదని-ఆ ముసలి దొరసాన్లకు తెలియదు. అలాంటప్పుడు ఒక పాతిక, ముప్పయి రూబుల్స్ అతనికొక లెక్కలో విషయంకాదు.

స్కోన్‌బక్ వచ్చిననాటి పగటిపూట మాత్రమే ఉన్నాడు. ఆ రాత్రే అతడూ, నెఖ్ల్యుడోవ్ కలసి బయలుదేరారు. వాళ్ళ సైన్యం చాలా ముందుపోయి ఉంటుంది. వాళ్ళకున్న సెలవులు కూడా అయిపోయాయి.

ఆనాడు నెఖ్ల్యుడోవ్ హృదయంలో రెండు భావాలు అవిరామంగా పెనగులాడినవి. గతరాత్రి సంఘటన మరపురానిది. తనివి తీరకపోయినా కొంతవరకైనా నెరవేరిన ఆ తీవ్ర పాశవిక వాంఛాసంబంధమైన ఆలజడి ఒకటి రేగుతూనే వుంది. తానేదో తప్పుచేశానని-ఆ సుఖంకోసం కాకపోయినా తనకోసమైనా దానిని సరిదిద్దుకోవలసిన అవశ్యకత వున్నదను ప్రేరేపణ కూడా రేగింది.

నెఖ్ల్యుడోవ్ స్వార్థము పారం ముట్టిన దశ అది. తన్ను గురించే తప్ప తదితరమైన ఆలోచనే లేదతనికి. తాను చేసిన పనికి పరులు నిందిస్తారేమో అని భయం తప్ప మస్లోవా సంగతేమిటి? ఆమె గతి ఏంకావాలి? అనే సంగతే అతనికి తట్టలేదు.

ఆమె తోటి తనకుగల సంబంధాన్ని స్కోన్‌బక్ పసిపట్టినట్లు తోచింది నెఖ్ల్యుడోవ్‌కు. అందుకతడు సిగ్గుపడలేదు. గర్వించాడు.

షోన్‌బక్ మస్లొవాను చూసిన తర్వాత నెఖ్లూడోవ్‌తో ఒకసారి ఇలా అన్నాడు. "ఓహో! నీ మేనత్తల ఇంటిమీద ఎందుకు ఇంత ప్రీతో — వారం రోజులు గడచినా ఎందుకు ఇక్కడనుంచి కదలలేకపోతున్నావో నా కర్థం అయిందిలే. అవును ఆశ్చర్యమేముంది? నేనైనా అలా చేసేవాడినే. ఆమె చెడ్డ అందగత్తె సుమీ!"

మస్లొవాపై తనకుగల మోహం పూర్తిగా తీరకుండానే వెళ్ళిపోవడం నెఖ్లూడోవ్‌కు కించగానే వుంది. కాని తప్పనిసరిగా వెళ్ళిపోవలసిన పరిస్థితి ఏర్పడటం కూడా ఒకందుకు మంచిదిగానే తోచింది. మస్లొవాతో ఇలాంటి రహస్య బాంధవ్యాన్ని ఎంతకాలమో కొనసాగించలేడు గదా! ఇప్పటిదానికి యీ విధంగా స్వస్తి జరగడం మంచిదే ననుకున్నాడు. కొంత డబ్బు ఆమెకివ్వటం మంచిదని తోచింది. ఆమె కోరిందని కాదు, ఆమెకు కావాలనికాదు, ఆమెను తాను ఉపయోగించుకొన్న తర్వాత ఏమీ ఇవ్వకుండా తాను వెళ్ళిపోవడం తన నిజాయితీకి భంగం అనుకున్నాడు.

సాంఘికంగా తనకున్న హోదాను, ఆమె స్థితిని పోల్చి చూసుకుని ఎంత ఇస్తే ఔదార్యమనిపించుకుంటుందో నిర్ణయించుకున్నాడు. మధ్యాహ్న భోజనానంతరం ఆమెకోసం పక్క వసారాలో కాచివున్నాడు. ఆమె అతన్ని చూచి, బుగ్గలు జేవురించి ముందుకు సాగిపోయింది, 'పరిచారికల గది తీసేవుంది జాగ్రత' అన్నట్లుగా ఆ దిక్కుకు కనురెప్ప లెగురవైచి. కాని అతడామెను ఆపి "నేను వెళ్ళిపోతున్నాను. నీకు చెప్పిపోవడానికి వచ్చాను" అన్నాడు-తన చేతులోవున్న కవరు ఊపుతూ. ఆ కవరులో ఒక వంద రూబుల్సునోటు ఉంచాడు.

ఆమె అతని భావం గ్రహించింది. చెయ్యి అడ్డంగా ఊపింది. ఈయ వచ్చిన అతని చేయిని వెనక్కు తోసింది.

"తీసుకో, తీసుకోవాలి తప్పదు" అని గొణుగుతూ, కవరును ఆమె గౌనుకు వున్న పక్కజేబులో తోసి, గబగబా తన గదికి పరుగెత్తుకు పోయాడు ఏదో దెబ్బ తగిలిన వాడివలె. చాలాసేపటి వరకు అటూ-ఇటూ ఏదో బాధపడుతున్న వాడివలె గొణుక్కుంటూ పచార్లు చేశాడు. "ఇంతకంటె నే నేమి చేయగలను? అందరికీ కలిగే అనుభూతి వంటిదే ఇది. షోన్‌బక్‌కు పంతులమ్మతో జరగలేదూ? గ్రిషాబాబాయికీ జరిగింది. నా

తండ్రి పల్లె ప్రాంతంలో ఉంటున్నప్పుడు ఒక రైతుపిల్లతో సంబంధం ఏర్పడింది. ఆమెకు ఒక కొడుకు కూడా కలిగాడు. వాడికేసు 'ఘటింకా' ఇప్పటికీ బతికే వున్నాడు. ప్రతివాడూ అలాగే చేస్తున్నప్పుడు నేను చేసిందిమాత్రం తప్పేముంది?" ఇలా అనుకుంటూ మనశ్శాంతిని పొందుదామని వ్యర్థప్రయత్నం చేశాడు. జరిగిన సంఘటన అతని అంతరాత్మను దగ్ధంచేసివేసింది.

నిజానికి తాను నీచంగా, క్రూరంగా, పిరికివాడుగా ప్రవర్తించినట్టు అంతరాత్మ లోతుల్లో ధ్వనిస్తూ వుంది. ఈ సంఘటన తనకు జ్ఞాపకం ఉన్నంత కాలమూ తాను లోకం ముఖం చూడలేడు; ఇతరుల తప్పుల్ని ఎంచలేడు; ఇదివరకులాగ తానొక ఉన్నతాశయాలుగల ఉదార వ్యక్తిననుకుంటూ ధైర్యంగా, కులాసాగా జీవితం గడపలేడు. కాబట్టి ఈ సన్నివేశాన్ని గురించి తలచుకోకూడదు. దాన్ని మరచిపోవడంలో విజయం పొందాడు నెక్లూడొవ్. తన ఉద్యోగం, కొత్త పరిసరాలు, నూతన మిత్రవర్గం అందుకు సహాయ భూతములైనాయి. రోజులు గడిచినకొద్దీ యీ విషయ స్మరణ తగ్గిపోయింది; చివరికి తను పూర్తిగా మరచిపోయాడు.

యుద్ధానంతరం నెక్లూడొవ్ ఒకసారి మస్లొవాను కలుసుకుందామన్న కోరికతో మేనత్తల యింటికి వచ్చాడు. ఆ పిల్ల తమ కొలువులోనుంచి అప్పుడే వెళ్ళిపోయిందనీ, ఎక్కడో ఒక శిశువును ప్రసవించిందనీ, ఆ తరువాత మనిషి పూర్తిగా చెడిపోయిందనీ మేనత్తలు చెప్పారు. అదంతా విని నెక్లూడొవ్ చాలా బాధపడ్డాడు. ఆమె ప్రసవించిన కాలాన్నిబట్టి పుట్టిన బిడ్డ తనదే అయివుండవచ్చు; కాకపోనూ వచ్చు. మేనత్తలు మస్లొవాను గురించి చాలా చెడుగా చెప్పారు. తల్లి బుద్ధే దానికి సంక్రమించిందన్నారు. ఈ మాటలు నెక్లూడొవ్‌కు సంతోషాన్నే ఇచ్చాయి. ఎందువల్లనంటే, తన తప్పు ఎగిరిపోయింది. అపరాధం అంతా తన మీదనుంచి తొలగిపోయింది.

"మొట్టమొదట ఆమె, ఆమె బిడ్డ ఎక్కడ వున్నారో తెలుసుకుందామని కొంత ప్రయత్నించాడు. కాని ఆమెను గురించి స్మరించినప్పుడల్లా ఒక బాధ, సిగ్గు కలుగుతున్నందువల్ల ఆ ప్రయత్నం మానివేశాడు. మళ్ళీ ఆ పాపాన్ని తలచుకోకుండా మరచిపోదామనే ప్రయత్నించాడు.

ఇప్పుడు మళ్లీ కోర్టులో మస్లొవా ప్రత్యక్షం అయిన కారణాన వెనుకటి గాథ అంతా నెక్లూడొవ్‌కి మనస్సులో త్రవ్విపోసినట్లయింది. ఈ మహా

పాపం అంతరాత్మలో మోస్తూ పదిసంవత్సరాలు గడిపాడు. తన నిర్దాక్షిణ్యతను, క్రూరతను, పిరికితనాన్ని ఒప్పుకుని తీరవలెననిపించింది. కాని అంత ధైర్యం, నైతికబలం లేవు. ఈ పూర్వగాథ అంతా ఆమెగాని, ఆమె ప్లీడరుగాని కోర్టులో బయటపెడతారేమో—ఇంతిమందిలో తన్ను సిగ్గుపరుస్తారేమో—అన్న భయం అతనిలో సందడిస్తూనే వుంది.

౧౩

ఇటువంటి మనస్థితిలో నెక్లాడో కోర్టువిడిచి బైటికి వచ్చాడు. జూరీల గదిలోకిపోయి, కిటికీవద్దగ కూచున్నాడు. చుట్టూ జూరీలందరూ పిచ్చాపాటీ మాటాడుకుంటూ ఉంటే నెక్లాడో వింటూ సిగరెట్లు కాలుస్తున్నాడు.

వర్తకశిఖామణి స్మెల్కోవ్ గురించీ, అతనికి భోగ వనితలమీద గల ఆసక్తినిగురించీ విమర్శిస్తున్నాడు. జూరీలపెద్ద ఏవో సొరకాయలు కోస్తున్నాడు. పీటరు యూదీయునితో హాస్యాలు ఆడుతున్నాడు; ఇద్దరూ పగలబడి నవ్వుకుంటున్నారు - ఎవరైనా ఏదైనా అడుగుతున్న ప్రశ్నలకు నెక్లాడో టూకీజవాబులు చెప్పేసి ఊరుకుంటున్నాడు.

సహజమైన వంకరనడకలతో గుమస్తా వచ్చి - జూరీలందరూ మళ్ళీ కోర్టుకు హాజరుకావలసిందిగా కోరాడు - నెక్లాడోకు భయం కలిగింది. విచారించటానికి కాదు- విచారింపబడటానికి తాను కోర్టుకు వెళ్ళుతున్నట్టనిపించింది - నలుగురిలో తలయెత్తుక తిరిగే తాహతు లేని పరమదుర్మార్గుడు తానననిపించింది. కాని అలవాటు చొప్పున సహజ ఠీవిని తెచ్చుకుని కోర్టులో ప్రవేశించాడు. మంటపంమీద తన కుర్చీలో, కాలుమీద కాలు వేసుకుని, చేతిలో కళ్ళజోడు విలాసంగా పట్టుకుని కూచున్నాడు.

ఖైదీలుకూడా తిరిగివచ్చి యథాస్థానాల్లో కూచున్నారు. కొన్ని మాత్రం కొత్తముఖాలు కనిపిస్తున్నాయి. వాళ్లు సాక్షులు - కొయ్యస్తంభాల ముందు ఒక లావాటి స్త్రీ కూచుని ఉంది. మస్లావా ఆమెనే తదేకంగా చూస్తూఉండటం నెక్లాడో గమనించాడు. వెల్వెట్ జాకెట్టు, సిల్కు-గౌను - వేషం ఆడంబరంగా ఉంది. తలకొక ధనురాకారపు ఆభరణం

ఉంది; పట్నంలోని పెద్ద పడుపుగింటి యజమానురాలు ఆవిడే. ఆ పడుపుగింటిలోనే మస్లావా ఉంటోంది. ఇప్పుడామెను సాక్ష్యంకోసం పిలిపించారు.

సాక్ష్యాలు తీసుకోటం ఆరంభమైంది. సాక్ష్యులంతా తమపేర్లు, మతం మొదలైన వివరాలన్నీ చెప్పారు. సాక్ష్యులకూడా ప్రమాణాలు చేయాలా? అక్కర్లేదా? అని కొంతసేపు వివాదం జరిగినమీదట—వృద్ధ మతగురువు శిలువ పుచ్చుకుని, మహాఘనకార్యం చేస్తున్నానన్న విశ్వాసంతో తయారైనాడు. అందరిచేతా ప్రమాణాలు చేయించాడు.

ప్రమాణాలు అయిన తరువాత పడుపుగింటి యజమానురాలు ఒక్క కిటీవాను తప్ప మిగిలిన సాక్షులందర్నీ బైటికి తీసుకుపోయారు. కేసును గురించి ఆమెకు తెలిసినదంతా చెప్పమని కోర్టు ఆజ్ఞాపించింది. ఆమె ప్రతి వాక్యానికీ తలఊపుతూ, మందహాసాలు చిలుకుతూ, తెలివితేటలతో ఆమూలాగ్రం చెప్పింది - మొదట హోటలు నౌకరు సైమన్ వచ్చి, సైబీరియా వర్తకునికోసం ఒకపిల్లను పంపించమని అడిగాడు. తాను మస్లావాను పంపింది. మరి కాసేపటికి మస్లావా తిరిగివచ్చింది వర్తకునితో సహా. అప్పటికే అతడు బాగా భ్రమలెక్కి వున్నాడు—ఈ మాట అంటూ ఆమె నవ్వింది—ఇష్టం వచ్చినట్టు తాగుతూ పడుపుపిల్లలతో జల్సా చేస్తున్నాడు. డబ్బు అయిపోయింది. మస్లావాను తనగదికి పంపాడు - ఆ పిల్లంటే ఆప్యాయత—ఈ మాట అంటూ ఆవిడ మస్లావాకేసి చూచింది.

ఈ సందర్భంలో మస్లావా నవ్వినట్టు నెహ్లూదొవు తోచింది. అతని కసహ్యం అనిపించింది. ఏదో బాధతో కూడిన భావావేశానికి లోనైనాడు.

"మస్లావానుగురించి నీ యభిప్రాయం ఏమిటి?"—మస్లావా తరఫు ప్లీడరు అడిగాడు భిడియపడుతూ. జడ్జీ కావాలని ప్రయత్నిస్తున్న ప్లీడరాయన.

"ఆమె చాలమంచిది. చదువుకుంది. మాట, మర్యాద తెలిసినపిల్ల. ఒక గొప్పయింట్లో పెరిగింది. ఫ్రెంచిభాష బాగా చదువుతుంది. అప్పుడప్పుడు ఒకచుక్క ఎక్కువగా తాగుతుంది. కాని వొళ్ళుమరచి వుండదెన్నడూను. చాలా మంచిపిల్ల."

మస్లావా కిటీవా ముఖంలోకి చూస్తూ ఉంది. అకస్మాత్తుగా జూరీ సభ్యులవైపు చూపులు తిప్పింది. చివరకవి నెహ్లూదొమీద వాలాయి. ఆమె

ముఖం గంభీరంగా మారిపోయింది. ఒక క్షణం మెల్లిగా. రెండు కళ్ళచూపులూ తదేకంగా నెల్లూడో మీదే ప్రసరించాయి. అతనికి లోలోపల భయం భయంగా ఉంది. కాని ఆ తేజోవంతమైన కళ్ళమీదినుంచి తనచూపులు మరల్చుకోలేకపోయాడు.

నాటి భయంకరరాత్రి జ్ఞాపకం వచ్చింది. ఆ పొగమంచు - నది దగ్గర మంచుపెళ్ళలు పగిలిన రోదన ధ్వని— తెల్లవారుఝామున ఉదయించిన మసకచంద్రబింబం——అన్నీ స్మృతిపిధిలో తళుక్కుమన్నాయి - రెండు నేత్రాలూ ఆ యావత్తునూ స్ఫురణకు తెచ్చాయి.

"ఆమె నన్ను గుర్తించే వుంటుంది"—అనుకున్నాడు నెల్లూడో. ఏదో ఒక ఆఘాతాన్ని తప్పించుకోటానికన్నట్టు వెనక్కి ఒరిగాడు. కాని ఆమె అతన్ని గుర్తించలేదు. ఒక్క చిన్న నిట్టూర్పు విడిచి, ప్రెసిడెంటుకేసి చూచింది. నెల్లూడో కూడా ఒక్కనిట్టూర్పు విడిచాడు.

"అబ్బ, ఈ వ్యవహారం చప్పున ముగిస్తే బాగున్ను" అనుకున్నాడు.

తుపాకి పుచ్చుకుని పొలాల్లోకి వెళ్ళినప్పుడు గాయపడిన పిట్టను చంపవలసివస్తే ఎంతజాలి, అసహ్యం కలుగుతుందో...ఇప్పుడు నెల్లూడోకు అలాగే ఉంది - గాయపడ్డ పిట్ట బుట్టలో తన్నుకులాడుకుంటూ ఉంటుంది. ఎవరికైనా జాలి కలుగుతుంది - చప్పున దాన్ని చంపేసి, ఆ విషయాన్ని మరచిపోదామనిపిస్తుంది.

అట్టి పరస్పర విరుద్ధభావ పరంపర నెల్లూడో హృదయంలో సంఘర్షిస్తున్నది.

## ౨౦

నెల్లూడోను ఏడిపించాలన్నట్టుగా విచారణ ఎంతకూ ముగియటం లేదు. సాక్ష్యుల విచారణ చాలాసేపు జరిగింది. పబ్లిక్ ప్రాసిక్యూటరు, ఇరుపక్షాల ప్లీడర్లు బోలెడన్ని అనవసర ప్రశ్నలు వేశారు. సాక్ష్యుల విచారణ ముగిసినతర్వాత ప్రెసిడెంటు జ్యూరీలను పిల్చి సాక్ష్యంకోసం తీసుకురాబడిన వస్తువుల్ని పరీక్షించమన్నాడు. చూపుడువేలికి పెట్టుకునే రత్నపు

ఉంగరం - పోషీని డాక్టర్లు పరీక్షించిన ఒక గాజుగొట్టము-ఈ మొదలైనవి ఇంకా వస్తువులు వున్నాయి.

ఈ వస్తువుల్ని పరిశీలించే ముందు-శవాన్ని పరీక్షించి డాక్టరు తేల్చిన విషయాల్ని చదవాలి అని పబ్లిక్ ప్రాసిక్యూటరు కోరాడు. ఈ తంతు అంతా చకచకా ముగించేసి స్విన్ పడుచు వ్యగ్రతా వెపదా: అని ప్రెసిడెంటు తొందర పడుతున్నాడు. డాక్టరు నివేదికను చదవటంవల్ల కాలనోక్షిప్తకాలయాపం భోజనానికి ఆలస్యం అవటం తప్ప ప్రయోజనం ఉండదని అనుకున్నాడు. కాని ఇప్పుడు ప్రాసిక్యూటరు దాన్ని చదవాలి అంటున్నాడు. ప్రెసిడెంటు కాదనలేక సరేనని ఒప్పుకున్నాడు. సెక్రటరీ లేచి చదవవలసి వచ్చింది.

బాహ్యపరీక్షవల్ల తేలిన అంశాలు.

1. స్మెలోక్కొవ్ ఎత్తు 6 అడుగుల 5 అంగుళాలు.

"అబ్బ చాలా ఎత్తుసుమీ!" అన్నాడు వర్తక శిఖామణి నెక్లూడొ చెవిలో.

2. 40 యేళ్ళవాడుగా కనిపిస్తుంది.

3. శరీరం ఉబ్బినట్లుగా ఉంది.

4. మాంసం ఆకుపచ్చగా వుంది; అక్కడక్కడ నల్లటి మచ్చలున్నాయి.

5. చర్మంమీద బొబ్బలు (కొన్నిచోట్ల చాలా పెద్దవి) ఉన్నాయి.

6. జుట్టు రాగి రంగులో వుంది. వెంట్రుకలు దట్టంగా ఉన్నాయి. కాని ముట్టుకుంటేనే రాలిపోతున్నాయి.

7. గుడ్లు ముందుకు తోసుకొచ్చాయి.

8. ముక్కుల్లోనుంచి, చెవుల్లోనుంచి, నోట్లోనుంచి ఒకరకమైన ద్రవం / ఊరుతోంది.

9. రొమ్ము, ముఖం బాగా ఉబ్బిపోయి మెడ కనిపించటమేలేదు.

... ... ...

ఈ విధంగా శవపరీక్షకు సంబంధించిన విషయ విస్తృతి నాలుగు పేజీలు 27 పేరాలలో ఉన్నది. మృతకళేబర వర్ణనతో నెక్లూడోకు

పూర్తిగా చిరాకెత్తిపోయింది. మస్తాన్ బ్రతుకు—శవం ముక్కులోనుంచి ఏదో ద్రవం ఊరటం - గుడ్లు పొడుచుకురావటం - తాను మస్తానును ఆదరించిన విధం - ఇవన్నీ ఒకేరకానికి చెందిన—అంశాలే ఈ ఒకేరకానికి చెందిన అంశాలలో నిమగ్నుడైపోయాడు.

బాహ్యపరీక్ష వివరాలు ముగిశాయి. ప్రెసిడెంటు ఒక్క నిట్టూర్పు విడిచాడు. గొడవ అయిపోయింది కదా అనుకున్నాడు. కాని సెక్రటరీ ఆంతర పరీక్షాఫలితాలను చదవసాగాడు. ప్రెసిడెంటు మళ్ళీ తలవాల్చి అర చేతిలో ముఖము అదిమిపట్టాడు. సెక్రటరీకి పక్కన కూచున్న వక్తకుడు నిద్ర ఆపుకోలేకపోతున్నాడు. కునుకుపాట్లు తీస్తూ మాటిమాటికీ ముందుకు తూలుతూ ఉన్నాడు.

ఆంతర పరీక్షా ఫలితాలు :

1. ఫుప్ఫుసరెమ్మలమీదనుంచి చర్మం తేలిగ్గా వొచ్చేసింది.

2. ఫుప్ఫుసరెమ్మలు ఉండవలసినంత మందంగానే ఉన్నాయి. సరియైన స్థితిలోనే ఉన్నాయి.

3. మెదడులో నాలుగంగుళాల పొడవున మచ్చలు ఉన్నాయి.

... ... ...

ఇంకా ఇలా 13 పేరాల గ్రంథం ఉంది. చివర డాక్టర్ల సంతకాలు ఉన్నాయి. డాక్టర్లిచ్చిన అభిప్రాయం చివరి పేరాలో ఉంది; "కడుపు లోనూ, పేగుల్లోనూ, కిడ్నీలలోనూ కనుపించిన మార్పుల్ని బట్టి...విషం కలిపిన సారాయం కడుపులోకి పోయినందువల్లనే స్మైలోక్ మరణించివుంటాడని చెప్పటానికి ఎక్కువ అవకాశాలు కనిపిస్తున్నాయి. ఎటువంటి విషం చేత చచ్చిపోయాడు అనే విషయం తేల్చిచెప్పటం కష్టం. కాని పొట్టలో ఎక్కువగా సారాయమే కనిపిస్తున్నందువల్ల విషం కలిపిన సారాయంచేతనే మరణించివుంటాడని అనుకోక తప్పదు."

"పొట్టలో అంత సారాయం ఉన్నదంటే బాగా తాగగల శక్తిమంతుడన్న మాట!" - అన్నాడు వక్తకశిఖామణి అప్పుడే నిద్రమత్తు వొదిలి.

ఈ నివేదిక చదవటానికి పక్కాగంట పట్టింది. అయినా ప్రాసిక్యూటరు తృప్తిపడ్డట్టులేదు. "ఇంకా లోపలి అవయవాల పరీక్ష చదవనక్కర్లే

దనుకుంటాను" అని ప్రెసిడెంటు అన్నాడు. "ఎస్సే, చదవాల్సిందే" అన్నాడు ప్రాసిక్యూటరు. చదివింపించటం తనహక్కు అయినట్లూ, ఆ హక్కు తాను పొంది తీరవలసిందేనన్నట్లూ, ఆ హక్కు మంజూరు కాక పోతే అపీలు చేసుకుంటానన్నట్లూ అతని ముఖ కవళిక చెబుతోంది.

పొడుగాటి గడ్డంగల కోర్టు సభ్యుడు అసలే కంఠశోష్టిలో బాధ పడుతున్నాడేమో పూర్తిగా విసిగిపోయాడు.

"ఇవన్నీ చదవటంవల్ల ఏమిటి ప్రయోజనం? కాలహరణమే గాని ఏమన్నా ఉందా? ఈ కోర్టు ఆఫీసర్లంతా ఇంతే. అనవసర కాలక్షేపం చేస్తూ ఉంటారు" అన్నాడు.

బంగారపుఅంచుల ముక్కద్దాలు గల సభ్యుడు ఏమీ మాటాడకుండా నే కూచున్నాడు – తనభార్యవల్లగాని, ప్రపంచంవల్లగాని తనకేమీ మేలు చేకూరబోయేది లేదన్నట్లుగా విచారంగా చూస్తున్నాడు.

రిపోర్టు చదవటం ఆరంభం అయింది:

"1088 ఫిబ్రవరి 15 వ తేదీని ఈ క్రిందసంతకం చేసిన నేను మెడికల్ డిపార్టుమెంటువారి అనుజ్ఞ ప్రకారం 638 నంబరు పరీక్ష చేశాను"— గొంతెత్తి బిగ్గరగా చదువసాగాడు కార్యదర్శి, అక్కడే చాలామందిని ఆవరించిన నిద్రమత్తును పారదోలుదామన్న నిశ్చయంతో–"అసిస్టెంటు మెడికల్ ఇన్‌స్పెక్టరు సమక్షంలో అంతర – అవయవాల పరీక్షను కొనసాగించాను.

1. కుడిపైపు ఊపిరితిత్తి, గుండెకాయ (ఆరుపౌనుల గాజుకూజాల్లో ఉన్నాయి.)

2. కడుపులోని భాగాలు (6 పౌనుల జాడీలో.)

3. పొట్ట (6 పౌనుల జాడీలో.)

4. పేగులు (తొమ్మిదిపౌనుల జాడీలో.)

5. కాలేయము, ప్లీహము, కిడ్నీలు ( 9 పౌనుల జాడీలో )

ప్రెసిడెంటు సభ్యుల అనుమతి తీసుకుని అన్నాడు—

"ఈ రిపోర్టు అంతా చదవటం అనవసరమని కోర్టువారు భావిస్తున్నారు" కార్యదర్శి చదవటం ఆపివేసి కాగితాలు మడిచేశాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు కోపంగా ఏమిటో రాసుకోటం మొదలుపెట్టాడు.

"జూరీసభ్యులు ఇక సాక్ష్యంకోసం వచ్చిన సామగ్రిని పరిశీలించవచ్చు" అన్నాడు ప్రెసిడెంటు. జూరీల పెద్ద, ఇంకా మరికొందరు లేచి టేబిల్ దగ్గరకు వెళ్ళారు. ఏమిచేయాలో వాళ్ళకే తెలియటంలేదు. ఉంగరం కేసి, గాజుజాడీల కేసి, గాజుకొట్టాం కేసి చూస్తూ నిల్చున్నారు. వర్తక శిఖామణి ఆ వుంగరం తన వేలికి సరిపోతుందేమో చూచుకున్నాడు.

"ఉంగరం చాలపెద్దదయ్యా! ఆ సైబీరియా షావుకారు వేలు దోసకాయంతలావు ఉంటుందనుకుంటా" అన్నాడు. అతడు మనోవీధిలో భావించుకున్న సైబీరియా వర్తకుని రాక్షసరూపం వింతగొలిపింది.

## ౨౧

వస్తువుల్ని పరీక్షించటం అయిపోయింది. ప్రెసిడెంటు విచారణ అయినట్టేనని ప్రకటించాడు. తరువాత ప్రాసిక్యూటరు ఉపన్యాసం ఉంది. 'కాని'మ్మన్నాడు ప్రెసిడెంటు. "ప్రాసిక్యూటరు కూడా మనిషేగదా! పొగ తాగాలనో భోజనం చేయాలనో ఉండదా? చప్పున ముగించి అందరి మీదా దయ చూపించకపోతాడా" అనుకున్నాడు ప్రెసిడెంటు. కాని ప్రాసిక్యూటరు ఇతర్లమీదేకాదు, తనమీద కూడా దయ చూపలేదు. అతడో మూర్ఖుడు. దీనికి తోడు పాఠశాలలో చదువు ముగించే నాటికి దురదృష్టవశాత్తు బంగారు పతకం బహుమానం పొందాడు. విశ్వవిద్యాలయంలో రోమనుల న్యాయశాస్త్రాన్ని చదివేప్పుడు తాను 'దాస్యం' గురించి వ్రాసిన వ్యాసానికి బహుమానం వచ్చింది. ఇక అతనికి స్వీయసామర్థ్యంలో గట్టి నమ్మకం ఉంది. మితిమీరిన ఆత్మతృప్తితో ఆత్మవిశ్వాసంతో వ్యవహరిస్తాడు. ఆడవాళ్ళతోటి వ్యవహారాల్లో కూడా కలుగుతున్న జయాలు ఆత్మాభిమానాన్ని బలపరచినవి. దానితో అతని మూర్ఖత విశ్రుతిమించిపోయింది.

అతడు నెమ్మదిగా లేచి ఠీవిగా నిలబడ్డాడు. ఒక చేయి టేబిల్ మీద మోపి, చుట్టూ కలియచూశాడు. తల కొంచెం వంచి, ఖైదీల చూపుల్ని పరిహరించి—నివేదికలు చదువుతున్నప్పుడు తాను సిద్ధం చేసుకుని వున్న ఉపన్యాసాన్ని ఆరంభించాడు.

"జూరీ మహాశయులారా! ఇప్పుడు తమ ముందు విచారణ జరుగు తున్న ఈ కేసు చాలా ప్రముఖమైనదని చెప్పాలి—"

పబ్లిక్ ప్రాసిక్యూటరు ఉపన్యాసం కూడా—పేరు ప్రతిష్టలు పొందిన పెద్ద పెద్ద అడ్వకేటుల ఉపన్యాసాలవలె, ప్రజలందరూ గ్రహించ దగిన ప్రాముఖ్యత కలదిగా ఉండాలని అతని కోరిక. అయితే అక్కడికి వినవచ్చిన ప్రజలు ఎంతోమంది లేరు. ఒక కుట్టుపనికత్తె, ఒక వంటలక్క, సైమన్ సోదరి ఒకతె, ఒక గుర్రపు బండివాడు వీళ్లు నలుగురే ఉన్నారు. అయితే యేం? పెద్ద పెద్ద వక్తల వలెనే తానూ ఆరంభించాడు. తాను ఆమె వున్న మనో వైజ్ఞానికపు లోతులు తరచి, సంఘానికి వేరు గ్రాలా దొంగ ఉన్న అంశాలను బైట పెట్టాలి. ఇది ప్రాసిక్యూటరుగారి ప్రధాన తాత్పర్యం పెట్టటానికి

"జూరీ మహాశయులారా! ఇప్పుడు తమ ముందున్న ఈ కేసు మన ఈ శతాబ్దాంతమున పెచ్చు పెరిగిపోతున్న అవినీతికి అనుకూలంగా ఉన్నది. నేటి మన సంఘము ఈ అవినీతి కీలికలకు బలియైపోతూ ఉంది."

ఇలాగ చెప్పదలుచుకున్న అంశాలలో ఒక్కటీ కూడా విడిచిపెట్ట కుండా, ఎక్కడా గుక్కతిప్పుకోకుండా, గంటుంబావు వరకూ అనర్గళ వాగ్ధారా ప్రవాహాన్ని చిమ్మేశాడు.

మధ్యలో ఒక్కసారి మాత్రం నీళ్లు నములుతూ కాసేపు ఆగాడు. కాని మళ్ళీ వెంటనే అందుకుని ధాటీగా ఉపన్యసించాడు. ఒక్కొక్కప్పుడు జూరీలవైపు చూస్తూ లలిత లలితమైన పదోచ్చారణతో పలికాడు. మరొకప్పుడు పుస్తకంలో చూసుకుంటూ విషయాల్ని గుర్తుకు తెచ్చుకుని మాటాడాడు. మరింకొకప్పుడు ప్లీడర్లవైపు తిలకిస్తూ బిగ్గరగా గొంతెత్తి చాతుర్యం చూపాడు. కాని ఒక్కసారి కూడా ఖైదీలకేసి మాత్రం చూడలేదు; వాళ్లు మాత్రం అతని ముఖంలోకే తదేకంగా చూస్తూ వింటున్నారు. అతడు తన ఉపన్యాసంలో వివిధ వైజ్ఞానిక వాదాలను, సమస్యలను స్పృశించాడు. పరిణామ వాదం, పిత్రీయ - పరిసరప్రభావాలు, హిప్నాటిజమ్ మొదలైన వన్నీ వచ్చాయి.

ఇంతకూ పబ్లిక్ ప్రాసిక్యూటరు దృష్టిలో స్మెల్కోవ్ ఉత్తమోత్తముడైన రష్యన్ పౌరుడు; ఉదారశీలి; అందర్నీ తేలిగ్గా నమ్మే స్వభావం కలవాడు, అవినీతిపరుల-నీచుల చేతుల్లో చిక్కి ప్రాణాలు కోల్పోయాడు.

సైమన్ ఒక నౌకరు. దాస్యవృత్తి వాడికి వంశ పారంపర్యంగా వచ్చింది. వాడు మూర్ఖుడు, నీతి నియమాలెరుగడు, బుద్ధిహీనుడు, వాడికొక మతమంటూ ఏమీలేదు. యూఫీమియా వాడి ఉంపుడుకత్తె. వంశక్రమాను గతమైన అవినీతి ఆమెలో మూర్తి కట్టింది. ఈ కేసులో ప్రధానపాత్ర మస్లోవా. ఒక వ్యక్తి ఎంతవరకు పతితం కావచ్చునో ఆమె బ్రతుకు చెబుతున్నది. ఈ సందర్భంలో ప్రాసీక్యూటరు ఆమెవైపు చూస్తూ ఇలా చెప్పాడు. "ఈవిడ—ఆ పడుపుకటింటి యజమానురాలు చెప్పినట్టు—చదువుకున్న అనాధ బాలికగా పెరిగింది. పుట్టుకతోనే అవినీతి బీజాలు ఈమెకు ... యుండవచ్చు. ఒక గొప్పవాళ్ళ ఇంట్లో పెరిగింది, చదువుకుంది, ...డిపోతే బాగుపడేదేమో! కాని తన్ను పెంచి పెద్దచేసిన వాళ్ళను ...ంది. తనలో రేగిన కామానికి, మోహాలకి లొంగిపోయింది. ఒక ...ంట్లో చేరింది. అక్కడ ఉండే భోగవనిత లందరిలోకీ...కాస్త అయినా చదువుకున్న మనిషి కాబట్టి, ప్రత్యేకత సంపాదించుకోగలిగింది. జూరీ 'కాని' శయులారా! ఇందాక ఆమె యజమానురాలు చెప్పగా విన్నారుకదా! ...గను వచ్చిన విటులను మాట మర్యాదలతో వశం చేసుకోగలను. దాన్నే మీరా హ్నాటిజమ్ అంటారు. ఛార్కాట్ వైజ్ఞానిక పరిశోధనల ద్వారా కని ప్రా... శక్తి అదే. ఈ శక్తి ప్రభావంతో...దాక్షిణ్య మూర్తియైన వర్తకుని మూర్ఖంగా లోబరుచుకున్నది. అతని నంచితనాన్ని అవకాశంగా తీసుకుని ధనాన్ని దోచేసింది, చివరకు నిర్దాక్షిణ్యంగా చంపివేసింది."

"అట్టే పెంచేస్తున్నాడు ఉపన్యాసాన్ని" అన్నాడు ప్రెసిడెంటు పక్కనవున్న 'గార్హస్థ్య సుఖంలేని' సభ్యునితో.

"బుద్ధిలేని పుండాకోరు" అన్నాడాయన కోపంతో.

పబ్లిక్ ప్రాసిక్యూటరు ధోరణి సాగిపోతూనే వుంది.

"జూరీ మహాశయులారా!" కాస్త వొయ్యారం వొలికించాడు. ఆ నిబ్బన్న భంగిమలో—"మీరు ఇవ్వబోయే నిర్ణయంమీద ఈ వర్తకుల భవిష్యత్తేకాదు సంఘ భవితవ్యం కూడా ఆధారపడి ఉంది. కనుక ఈ నేరం లోని లోతులు బాగా గమనించండి. మస్లోవావంటి అవినీతిపరులైన వ్యక్తుల వల్ల సంఘానికి గల ఆపదను గుర్తించండి. ఈ జాడ్యం పాకిపోకుండా

సంఘాన్ని రక్షించండి. సంఘంలోని నిర్దోషులు, మర్యాదస్థులు ఈ దౌష్ట్యాలకు గురికాకుండా కాపాడండి."

తన ఉపన్యాసానికి తానే మురిసిపోతూ, ఇవ్వవలసిన తీర్పును భావిస్తూ ప్రాసిక్యూటరు కుర్చీలో కూచున్నాడు.

మహావక్తృత్వలక్షణ చిహ్నాతమైన అతని వుపన్యాస సారాంశం ఇదీ; 'హిప్నాటిజమ్ అనే శక్తిచేత మస్లొవా వర్తకుని పూర్తిగా లోబరుచుకుంది. అతడామెను పూర్తిగా విశ్వసించాడు. అతని తాళంచెవి తీసుకుని ఆమె అతని గదికి వెళ్ళింది. డబ్బంతా కాజేయాలనే ఆమె వుద్దేశం. అలా దొంగతనం చేస్తోంటె సైమన్, యూఫీమియా వచ్చి చూశారు. అందు చేత వాళ్ళకు కూడా ఆ కాజేసిన డబ్బులో భాగం పెట్టింది. చేసిన నేరం కప్పిపెట్టటానికి ఆమె మళ్ళీ వర్తకునితో హోటలుకు వచ్చి, అక్కడ అతన్ని విషం పెట్టి చంపింది."

ప్రాసిక్యూటరు ఉపన్యాసం ముగియగానే ఒక ప్లీడరు- నడివయసులో ఉన్నవాడు—లేచివచ్చి, సైమన్, యూఫీమియా నిర్దోషులంటూ ఒక ఉపన్యాసం ఇచ్చాడు. వాళ్ళదగ్గర 300 రూబుల్సు ఫీజు పుచ్చుకున్న ప్లీడరీయన. వాళ్లు నిర్దోషులని వాదిస్తూ నేరం అంతా మస్లొవామీద మోపాడు. తాను తోలుపెట్టెలోనుంచి డబ్బు తీస్తున్నప్పుడు సైమన్, యూఫీమియా దగ్గరే వున్నారని మస్లొవా చెప్పినమాట అబద్ధం అని చెప్పాడు. విషంపెట్టి చంపినట్టు నేరం ఆమెమీద ఉంది. కాబట్టి ఆమె మాటలన్నీ యథార్థాలుగా తీసుకోకూడదని వక్కాణించాడు. సైమన్, యూఫీమియా-ఇద్దరూ హోటళ్లలో కష్టపడి, చాకిరీచేసుకుంటున్నవాళ్లు; హోటళ్లలో బసచేయటానికి వస్తూవుండే ధనవంతులు రోజుకు 5 రూబుల్సువరకూ మామూళ్ళు ఇస్తూఉంటారు. కాబట్టి వాళ్లు బ్యాంకులో వేసుకున్న 1800 రూబుల్సు వాళ్ళ స్వార్జితమే. అంత డబ్బు వాళ్ళు ఆర్జించుకోలేరనటానికి వీల్లేదు. వర్తకుని డబ్బు మస్లొవాయే దొంగిలించివుండాలి. ఆ డబ్బు ఆమె ఎవరికైనా ఇచ్చిందో, లేక తాగిన మత్తులో పారేసుకుందో. ఒక్క మస్లొవాయే విషంపెట్టి వర్తకుని చంపింది. కాబట్టి సైమన్-యూఫీమియాలమీద దొంగతనంకేసు కొట్టివేయమనీ- ఒకవేళ దొంగతనం చేసినట్టు కోర్టువారు నిర్ధారించేట్టయితే విషప్రయోగంలో మాత్రం వాళ్ళకేమీ సంబంధంలేదని తీర్పు

యివ్వాలనీ – జూరీలను కోరుతూ ప్లీడరు తన ఉపన్యాసాన్ని ముగిస్తూ ప్రాసిక్యూటరు వాదాన్ని ఖండించాలని ఇలా చెప్పాడు :

"వంశపారంపర్యంగా అవినీతి యూఫీమియాకు సంక్రమించినట్టు ప్రాసిక్యూటర్ గారు – తమ మనోవైజ్ఞానిక శాస్త్రపాండిత్యాన్ని ప్రదర్శిస్తూ–చేసిన వాదన అంగీకరించటానికి వీల్లేదు. ఎందుచేతనంటే యూఫీమియా తల్లిదండ్రులెవరో ఎవరికీ తెలియదు."

ప్రాసిక్యూటరు కోపంగా మారి ఏదో రాసుకున్నాడు. ప్లీడరుగారి వాదాన్ని అవజ్ఞ చేస్తున్నట్టుగా భుజాలెగురవేశాడు.

తరువాత మస్లొవా తరఫు ప్లీడరు లేచాడు. మస్లొవా డబ్బు దొంగతనం చేసిందన్న అంశాన్ని అతడు ఖండించబూనుకోలేదు. స్మెల్కోవ్‌ను విషంపెట్టి చంపాలన్న పాపచింత ఆమెకు లేనే లేదనీ – అతన్ని నిద్రావివశుని చేద్దామన్న కోరికతోనే పొడిగలిపి సారాయం ఇచ్చిందనీ–చెప్పాడు. మస్లొవా ఇలా వ్యభిచారంలో దిగటానికి ఒక పురుషుడు కారణం అనీ–ఆ పురుషుడు అశిక్షితుడై వున్నాడనీ–అతనిమూలాన ఈమె పతితయై పాపం అంతా భరించవలసి వచ్చిందనీ–చెప్పాడు. కాని ఈ విషయాలన్నీ ఎవరికీ నచ్చలేదు; పైగా అసందర్భాలుగా కనిపించాయి. పురుషుని మర్మాగ్గం, అబలల నిస్సహాయత్వం–ఇత్యాది విషయాల్ని చెబుతూ మనోవైజ్ఞానికాంశాలను వివరిస్తూ ఉన్నాడు. అప్పుడు ప్రెసిడెంటు విసిగెత్తి—"అసలు కేసువిషయాల్ని గురించి మాటాడండి" అని మందలించాడు.

చివరకు పబ్లిక్ ప్రాసిక్యూటరు మళ్ళీ లేచాడు. మొదటిప్లీడరు చెప్పిన అంశాన్ని ఖండిస్తూ తన్ను సమర్థించుకోటానికి ప్రయత్నం చేశాడు. "యూఫీమియా తల్లిదండ్రులెవరో తెలియనంత మాత్రాన– వంశానుక్రమంగా గుణాలు సంక్రమిస్తాయను సత్యాన్ని త్రోసివేయుటానికి వీల్లేదు. వంశాన్ని బట్టి గుణాలను చెప్పినట్టే, గుణాల్నిబట్టి వంశాన్ని చెప్పవచ్చు" అన్నాడు.

"ఇక రెండోప్లీడరుగారు–మస్లొవా యెవరో 'లేనివ్యక్తి'చేత చెరచబడి, పతితురాలైందని చెబుతున్నారు. ఇంతవరకు దొరికిన సాక్ష్యాల్నిబట్టే ఆమె అనేకుల్ని భ్రమింపజేసి, మోసగించి, లోబరుచుకున్నదని తెలుస్తున్నది"– ఈ మాటలు పలికి విజయగర్వంతో ప్రాసిక్యూటరు కూచున్నాడు.

తరువాత ఖైదీలు తమకు తోచింది చెప్పుకోవచ్చునని కోర్టు ప్రోత్సహించింది. యూఫీమియా లేచి, ఇదివరకు చెప్పినట్టే, తనకేమీ తెలియదని, ఇందులో తనకేవిధమైన సంబంధమూ లేదనీ చెప్పి నేరం అంతా మస్లోవామీదకి నెట్టేసింది. 'ఇక మీదయ' 'నేను నిరపరాధిని' 'ఇది అన్యాయం' అన్నమాటలు పదేపదే పలికింది. మస్లోవా ఏమీ మాట్లాడలేదు. "ఏమన్నా చెప్పుకోవచ్చు" అన్నాడు ప్రెసిడెంటు. కాని ఆమె అతనికేసి చూచి, చుట్టూ ఒకసారి వేటకుక్కలు తరుముతున్న మృగంలా కలయజూచి, తల వంచుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

బలవంతాన పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూన్న నెఖ్లూదోవ్ గొంతుక నుంచి ఒక విచిత్ర శబ్దం వెలికి వచ్చింది. అది విన్నాడు వర్తక శిఖామణి. "ఏమిటేమిటి?" అని ఆత్రుతగా ప్రశ్నించాడు. తన కన్నీళ్ళకు కారణం నరాల బలహీనత అని చెప్పాడు నెఖ్లూదోవ్. ఆ కన్నీళ్లు అందరికీ కనిపించకుండా కళ్ళజోడు తగిలించుకున్నాడు. జేబురుమాల తీసి నెమ్మదిగా తుడుచుకున్నాడు.

తన పూర్వగాథ, తన అమానుష ప్రవర్తన కోర్టులో అందరి ముందూ బయటపడితే తనకెంత అవమానమౌతుందోనన్న భయం తీవ్రతరంగా వుంది అతనికి.

౨౨

ఖైదీలు మాట్లాడ్డం పూర్తిఅయిన తర్వాత జూరీలను అడగవలసిన ప్రశ్నలు తయారైనాయి. అంతట ప్రెసిడెంటు కేసు సారాంశాన్ని చక్కగా ముద్దుగా వుపన్యసించాడు.

"దొంగతనం దొంగతనమే. దోపిడీ దోపిడీయే. తాళం వేసిన ఇంట్లో దొంగలుపడి దోచుకుపోతే, తాళం వేసిన ఇంట్లో దొంగతనం జరిగిందంటాం" తాళం వెయ్యని యింట్లో జొరబడి దోచుకుపోతే, తాళం వెయ్యని యింట్లో దొంగతనం జరిగిందంటాం" ఇలా చెబుతూ చాలాసార్లు నెఖ్లూదోవ్ కేసి చూశాడు. తాను చెబుతున్న ఈ మహాసత్యాల్ని అతడు ముఖ్యంగా అర్థం చేసుకుని, తరువాత జ్యూరీలందరికీ కూడా తెలియజెప్పాలని ఆ చూపుల

భావం. ఈ సత్యాన్ని జ్యూరీలందరూ గ్రహించారని తోచిన మీదట అతడు మరో సత్యాన్ని వుద్ఘాటించాడు. "హత్య అనేది ఒక కార్యం. దాని ఫలితం ఒక మనిషి చావు. కాబట్టి విషం పెట్టి చంపటం కూడా హత్య అన్నమాట. ఈ సత్యాన్ని కూడా జ్యూరీలు అర్థం చేసుకున్నారన్న నమ్మకం తోచిన మీదట ఇలా చెప్పాడు—"దొంగతనము, హత్య-రెండూ ఒకేసారి జరిగినట్టయితే దాన్ని 'హత్యతో కూడిన దొంగతనము' అంటాం."

ఉపన్యాసం దబ్బున ముగిద్దామనే వుంది లోపల. స్విస్ పడుచు తనకోసం ఎదురుచూస్తూ వుంటుందనీ తెలుసు. అయినా ఉపన్యాసం ఆరంభించాక దబ్బున ఆపలేడు. ఉద్యోగ ధర్మంలో అలా అలవాటైపోయాడు. చెప్పుకు పోతున్నాడు..."ఖైదీలు నేరస్థులని తోస్తే నేరస్థులనే చెప్పాలి; నిరపరాధులని తోస్తే నిరపరాధులనే చెప్పాలి. ఒక అంశంలో నేరస్థులనీ మరొక అంశంలో నేరస్థులు కాదనీ తోస్తే ఒక అంశంలో మాత్రమే నేరస్థులనీ రెండవ అంశంలో నేరస్థులు కావనీ చెప్పాలి.. యీ నిర్ణయించే హక్కు జ్యూరీలకు ఉన్నది. అయితే వారు దాన్ని వివేకంగా వుపయోగించాలి."

ఇలాంటి ప్రముఖమైన సూచనలు జ్యూరీలకు ఇంకా ఇవ్వాలని ఉత్సాహం అయితే వుంది—కాని గడియారం కేసి చూశాడు. మూడింటికి అయిదు నిమిషాలు వుంది. కాబట్టి "నేను ఎక్కువగా చెప్పనక్కర్లేదు; మీరంతా బుద్ధిమంతులు, అర్థం చేసుకోగలరు" అని కేసు వివరాలను, పబ్లిక్ ప్రాసిక్యూటరు, ప్లీడరు పలుసార్లు చెప్పివున్న సంగతులను, మళ్ళీ ఏకరు పెట్టాడు.

సభ్యులంతా ఆయన ఉపన్యాసాన్ని శ్రద్ధగానే విన్నారు. మధ్య మధ్య చేతి గడియారాలు చూసుకుంటూ. ఉపన్యాసం చాలా దీర్ఘంగా ఉన్నదేగాని మొత్తంమీద బాగుంది. ఉండవలసిన రీతిగా వుంది. పబ్లిక్ ప్రాసిక్యూటరు, లాయర్లు; కోర్టులో వున్న యావన్మందీ అలాగే అభిప్రాయపడ్డారు.

ఇదివరకు చెప్పిన విషయాలే మళ్ళీ చెబుతున్నాడు. అయితేనేం? ఉపన్యాసం చేయవలసిన హక్కు వదులుకుంటాడా? తన కంఠ మాధుర్యం

తన ఉచ్చారణలోని విశిష్టత—తన వక్తృత్వం తన్నే సుస్పష్టపరుస్తోంది. చప్పున ముగించ బుద్ధి పుట్టటంలేదు. జ్యూరీలకిచ్చిన అధికారాల ప్రాముఖ్యతను గురించి వారా యధికారాలను దుర్వినియోగం చేయకుండా సక్రమంగా వినియోగించవలసిన బాధ్యత గురించి, జ్యూరీ అంటే సంఘానికి అంతరాత్మ వంటి వారనీ, ఇలా చాలా సంగతులు వాక్రుచ్చాడు.

ప్రెసిడెంటు మాట్లాడుతున్నంతసేపూ మస్లోవా అతనికేసి చూస్తోంది. ఒక్క ముక్క కూడా మిస్ కాకుండా వింటోంది. కానీ తన కేసి చూస్తున్న భయం నెఖ్లూదోవ్‌కు తప్పిపోయింది. ఇక ఎప్పుడూ ఆమె వైపే చూస్తూ కూచున్నాడు. ఒక మనిషిని మనం చాలా కాలం అయిన తరువాత చూడటం తటస్థిస్తే మొట్టమొదట కాల ప్రభావంవల్ల కలిగిన మార్పులు కొన్ని ఆ ముఖంలో కనిపిస్తాయి. క్రమశః ఆ మార్పులు అంతర్హితములైపోతాయి. ఆ ముఖం పూర్వం మనం ఎరిగి యుండినప్పుడు వలెనే కనిపిస్తుంది. చివరకు ఆ వ్యక్తిలోని ప్రత్యేక, అసాధారణ, ఆధ్యాత్మిక వ్యక్తిత్వమే మన అంతర దృష్టికి వ్యక్తమైపోయింది. మస్లోవాను అలాగే చూస్తున్న నెఖ్లూదోవ్‌కు ఈ దశలన్నీ కలిగాయి.

ఇప్పుడు జైలు దుస్తులు ధరించింది. వక్షోభాగం పూర్వంకన్నా వున్నతమయింది. ఫాలభాగాన ముడతలు ఏర్పడ్డాయి. కళ్లు కొంత ఉబ్బుగా ఉన్నా అయినా ఈమె ఆనాటి మస్లోవాలాగే, ఈస్టర్ పండుగనాటి రాత్రి అమాయికంగా పండుగ ముద్దుకోసం తన ముందు నిల్చుని తన ముఖంలోకి చూస్తున్న మస్లోవాలాగే కనిపించింది. ఆనందం, జీవం పొర్లు వారుతోన్న ఆనాటి నేత్రాలే అవి.

"ఇన్నాళ్ళనుంచీ ఈమెను నేను చూడలేదు. చివరకీనాడు నేను జ్యూరీ సభ్యుడుగా రావటం, ఈ కేసు విచారణకు రావటం విచిత్రంగానే వుంది. ఇప్పుడామెను ఖైదీల బెంచిమీద చూస్తున్నాను. ఇది ఎలా పర్యవసిస్తుందో! అబ్బ! చప్పున ముగిస్తే బాగుండును."

లోలోపల పశ్చాత్తాప రేఖలేవో పొడచూపుతున్నాయి. కాని అతడు వాటికి లొంగలేదు. "ఇలా ఇది కాకతాళీయంగా సంభవించింది. తన జీవితాన్ని స్పృశించకుండా దాని దారిన అదే పోతుంది" అనుకున్నాడు.

యజమాని కుక్కపిల్ల మెడమీద జూలు గట్టిగా పట్టుకుని లేవనెత్తి వస్తుంటే అది ముట్టె ఊపుతుంది; కుయ్యిమని అరుస్తుంది. కాళ్లు తన్నుకుంటుంది; పట్టు తప్పించుకుని పారిపోదామని చూస్తుంది. కాని దయలేని యజమాని దాన్ని విడిచిపెట్టడు. అట్టి కుక్కపిల్ల స్థితిలో ఉన్నాడు నెఖ్లూడో.

నెఖ్లూడో తాను చేసిన పాడుపనిలోని నైచ్యాన్ని గ్రహించుకున్నాడు. భగవంతుని ప్రభావాన్ని తెలుసుకున్నాడు- కాని ఇదంతా తాను ఆ నాడు చేసిన దాని ఫలితమేనని అంగీకరించటానికి మనసు ఇష్టపడటంలేదు. కాని నిర్దయుడైన భగవంతుడు తన్ను గట్టిగా తన పట్టులో ఇముడ్చుకున్నట్టు అనుభవిస్తున్నాడు - ఇక తప్పించుకునే మార్గం లేదని తోచింది. అయినా ఇంకా ధైర్యం సడలకుండా, ఠీవిగా, కాలుమీద కాలు వేసుకుని, చేతిలో కళ్ళజోడు విలాసంగా పట్టుకుని ముందువరుసలో, ఎత్తుకుర్చీలో కూచునే ఉన్నాడు-హృదయాంతరాళంలో ఆ నాటి తన క్రూరత్వం, నైచ్యం, పిరికితనమే కాదు-అహంకార భూయిష్ఠమైన తనజీవితంలో అవినీతిని యావత్తూ చూస్తూనే ఉన్నాడు. తన యీ మహాపాపంపై ఈ పదేళ్ళనుంచీ ఉండిన ఆచ్ఛాదనం చెదరిపోతూ ఉంది; దానిచాటున ఏమి వున్నదో మసకమసకగా చూడగలుగుతున్నాడు.

## ౨౩

ప్రెసిడెంటు తన ఉపన్యాసాన్ని ముగించాడు. ప్రశ్నల జాబితాను జ్యూరీ పెద్దకు అందజేశాడు-అది పుచ్చుకుని జ్యూరీలందరూ-ఒకరివెంట ఒకరు లేచి-కోర్టువిడిచి కాసేపు స్వేచ్ఛగా ఉండవచ్చు కదా అన్న సంతోషంతో-దేనికో సిగ్గుపడుతున్న వాళ్ళలాగ - ఏమి చెయ్యాలో తెలియక - చర్చాగృహానికి పయనమై వెళ్ళారు. సైనికుడు వరనుంచి తీసిన కత్తిపుచ్చుకుని ద్వారందగ్గర నిలబడ్డాడు. జడ్జీలు లేచి బైటికి వెళ్లారు. ఖైదీలను కూడా బయటికి తీసుకువెళ్లారు.

చర్చాగృహం చేరగానే జూరీలందరూ సిగరెట్లు ముట్టించారు. కోర్టులో ఉన్నంతసేపూ అసహజమైన పరిస్థితుల్లో ఉన్నట్టుగా ఉంది. తాముతాము కానట్టనిపించింది. బైటికివచ్చేసి సిగరెట్లు పీలుస్తుంటే మామూలు ధోరణిలో పడ్డట్టు అనిపించింది. చలాకీగా సంభాషణకు దిగారు.

"ఆ పిల్లది తప్పేమీ లేదు. అనవసరంగా ఇంటలో చిక్కించారు. దయతలచి విడిచిపెట్టమని మనం సిఫార్సు చేద్దాం"—అన్నాడు వర్తకశిఖామణి, జాలి ప్రకటిస్తూ.

"మనం ఆలోచించి నిర్ణయించవలసిన సమస్య అదే. వ్యక్తిగత అభిప్రాయాలకు ప్రాధాన్యం ఇవ్వకూడదు"-అన్నాడు జ్యూరీ పెద్ద.

"ప్రెసిడెంటు ఉపన్యాసం మాత్రం శ్లేషగ్గా ఉంది, చెప్పద్దూ!" అన్నాడు కల్నల్.

"శ్లేషగ్గా అంటావేమిటి ? నాకు నిద్రవచ్చేస్తేను!"

"మస్లోవా హోటల్ నౌకర్లతో కలిసి చేసిన పనై ఉండాలి. లేకపోతే వాళ్ళకు డబ్బు సంగతి తెలిసివుండటానికి అవకాశంలేదు. ఈ ముఖ్య సంగతి మనం గమనించాలి" అన్నాడు యూదు జాతీయుడు.

"అయితే ఆమే దొంగతనం చేసిందంటావా?" - అడిగాడు మరొక జ్యూరీ సభ్యుడు.

"ఎబ్బే, నేను నమ్మను. అదంతా ఆ ఎర్రకళ్ల దెయ్యం (యూఫేమియా) పనే"-అన్నాడు వర్తకుడు.

"అంతా అందరే; భలేవాళ్లు"-అన్నాడు కల్నల్.

"తాను గదిలోకి వెళ్ళలేదని చెబుతోందే అది!"

"ఓ, అయితే దానిమాటే నమ్ముతావా?"

"నేను దానిమాట చచ్చినా నమ్మను."

"నువ్వు నమ్మటం, నమ్మకపోవటంతో సమస్య పరిష్కారంకాదు"-అన్నాడు యూదీయుడు.

"ఆ పిల్ల తాళంచెవి తెచ్చింది"- అన్నాడు కల్నల్.

"ఏం తెస్తే?"-వర్తకుడు అడిగాడు.

"ఉంగరంకూడా ఆమెకే చిక్కింది."

"ఎలా చిక్కిందో అంతా ఆమే చెప్పిందిగా!"-అన్నాడు వర్తకుడు మళ్ళీ-"వాడు శాస్త్ర కోపదారి మనిషి. పైగా డోసు ఎక్కువైంది. ఆ

పిల్లను లాగికొట్టాడు. తరువాత పశ్చాత్తాపపడ్డాడు. 'ఏం అనుకోకుసుమీ! ఇదిగో ఇది తీసుకో' అని ఇచ్చాడు. నిజాయితీపరుడవలేమా! 6 అడుగుల 5 అంగుళాల ఎత్తుట. కనీసం 280 పౌనుల బరువైనా ఉంటాడని నా నమ్మకం."

"అసలు అదికాదు సమస్య. ఈ సన్నాహం అంతా పన్ని, ఇంతపనీ చేసింది ఆ పిల్లా? లేక ఆ హోటల్ నౌకర్లా? అదీ ఆలోచనీయాంశం—" అన్నాడు పీటర్.

"నౌకర్లే అంతపనీ చేసివుండటానికి వీల్లేదు. తాళపుచెవి ఆ పిల్లదగ్గర ఉంది."

ఇలా చాలాసేపు ఎవరికిష్టం వచ్చినట్లు వాళ్ళు మాటాడారు. చివరకు జ్యూరీ పెద్ద అన్నాడు—"బాబులూ! క్షమించాలి. మనం టేబిల్ దగ్గర మన మన ఆసనాల్లో కూచుని ఈ విషయాన్ని చర్చిద్దాం"— అని అందర్నీ పిల్చి తాను అగ్రాసనాధిపత్యం వహించాడు.

"కాని అబ్బ! ఈ లంజలు ఎంతకైనా తగుదురు"—అని యూదీయుడు చెబుతూ—మస్లావారే దీనికంతకూ మూలం అని నిరూపించటానికి—ఒక పశుపుకర్త తన మిత్రుని జేబుగడియారాన్ని దొంగిలించిన కథ ఒకటి ఆమూలాగ్రం చెప్పాడు.

కల్నల్ కూడా అటువంటిదే మరోకథ ఏకరువు పెట్టాడు.

జ్యూరీపెద్ద బల్లమీద పెన్సిల్‌తో చప్పుడు చేస్తూ—

"బాబులూ! ఇప్పుడు మనమీ ప్రశ్నలపై దృష్టివుంచాలి" అని జ్ఞాపకంచేశాడు అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

ఆ ప్రశ్నలు ఇవీ :

1. బోర్కి గ్రామకాపురస్థుడు, 33 ఏళ్ళ వయసుగల సైమన్ 1088-జనవరి 17 తేదీని స్మెల్కోవ్ అను వర్తకునికి విషం కలిపిన బ్రాందీ ఇచ్చి చంపి, అతని సొమ్ము 2600 రూబుల్సు, ఒకవజ్రపు ఉంగరమూ కాజేశాడా?

2. 43 సంవత్సరాల వయసుగల యూఫీమియా పై నుదహరించిన నేరాలు చేసిందా?

3. 28 ఏళ్ళ వయసుగల మస్లోవా పై నుదహరించిన నేరాలు చేసిందా ?

4. యూఫేమియా పై నుదహరించిన నేరాన్ని చేసియుండకపోతే— హోటలులో స్మెల్కోవ్ బసచేసిన గదిలో వున్న అతని తోలుపెట్టె తానొకతాళంచెవి తెచ్చి తీసి 2600 రూబుల్సు దొంగిలించిందా ?

జ్యూరీ పెద్ద మొదటిప్రశ్న చదివాడు. "ఏమంటారు ?" అని ప్రశ్నించాడు.

దీనికందరూ వెంటనే సమాధానం చెప్పేశారు. డబ్బు దొంగిలించటం, వర్తకుని చంపటం—ఈ రెండు నేరాలూ సైమన్ చేశాడు అని ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు. ఒక్క ముసలి కార్మికనాయకుడు మాత్రం ఒప్పుకోలేదు. అతనికి సరిగా కేసు అర్థంకాలేదు కాబోలని జ్యూరీ పెద్ద అతనికీ విషయాన్ని బోధించటానికి పూనుకున్నాడు. సైమన్ నేరస్థుడనటానికి గల కారణాలను అతనికి చెప్పటానికి ప్రయత్నించాడు. అప్పుడా కార్మికనాయకుడన్నాడు. "నాకు అంతా బాగానే అర్థం అయింది. అయినా మనం వాళ్ళమీద దయచూపాలి. మనం మాత్రం ఋషులమా ఏమిటి ?"— కార్మికనాయకుడు తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు

యూఫేమియా నేరస్థురాలా, కాదా ? అన్న విషయంమీద చాలాసేపు వివాదం రేగింది. విషప్రయోగంలో ఆమెకు ప్రమేయం ఉన్నట్టు రుజువులు లేవు. ఆమె ప్లీడరు కూడా ఆ సంగతే నొక్కి చెప్పాడు. కనుక చివరకు 'నేరస్థురాలు కాదు.' అని నిశ్చయించారు. మస్లోవాను విడిపించాలన్న కోరికతో వర్తక శిఖామణి యూఫేమియా మీదనే నేరాన్ని యావత్తూ నిలుపుదామని చూశాడు. ఇంకా మరి కొందరు సభ్యులు కూడా అతన్నే బలపరిచారు. కాని యూఫేమియాకు విషప్రయోగంలో ఏ విధమైన సంబంధం లేదు అని గట్టిగా వాదించాడు జూరీ పెద్ద. చాలాసేపు వాదోపవాదాలు జరిగాయి. చివరకు జూరీ పెద్ద చెప్పిన మాటే నెగ్గింది.

నాలుగవ ప్రశ్న తీసుకున్నారు. యూఫేమియా నేరస్థురాలే అని తేల్చారు. కాని ఆమెను దయదలచి విడిచిపెట్టవలసిందిగా కార్మిక నాయకుని పట్టుదలమీద సిఫారసు చేశారు.

మస్లొవాకు సంబంధించిన మూడో ప్రశ్న మీద చాలాసేపు భీషణ చర్చ జరిగింది. ఆమె దొంగతనమూ చేసింది, విషం పెట్టి చంపింది-అన్నాడు జ్యూరీ పెద్ద. వర్తకుడు మాత్రం దానికి వొప్పుకోలేదు. కల్నల్, యూదీయుడు, కార్మిక నాయకుడు వర్తకుని అభిప్రాయంతో ఏకీభవించారు. మిగతా వాళ్లూ అటూ ఇటూ ఊగులాడుతూ ఉన్నారు. ఈపాటికి జ్యూరీ సభ్యులంతా చర్చల్లో అలసిపోయారు. ఏదో విధంగా ఈ తీర్పు ముగిస్తే చాలనుకున్నారు. చప్పున యీ గొడవలోనుంచి బయటపడితే చాలునను కున్నారు. కాగా జ్యూరీ పెద్ద ఇచ్చిన అభిప్రాయానికి బలం చేకూరుతూ వచ్చింది.

మస్లొవా ఎలాంటి మనిషో నెహ్లూడొవ్ ఎరిగివున్నాడు. కోర్టులో ఆమె వైఖరి చూచాడు. "ఆమె దొంగతనం చేయలేదు. విషం పెట్టి చంపనూ లేదు. ఆమె నిర్దోషి" అనుకున్నాడు. జ్యూరీలంతా అదే అభిప్రాయానికి వస్తారనుకున్నాడు. వర్తకుడు మస్లొవా అందాన్ని మెచ్చుకుని (ఆ సంగతి దాచటానికికూడా అతడు ప్రయత్నించడు) ఆమె తరఫున వాదిస్తున్నాడు. ఆ వాదన సహేతుకంగా లేదు. జ్యూరీ పెద్ద తన అభిప్రాయమే నెగ్గాలని పట్టుగా ఉన్నాడు. మిగతా జ్యూరీలంతా పిసిగెత్తి ఉన్నారు. మస్లొవా నేరస్థురాలే అని నిర్ణయం జరిగిపోయేలా ఉంది. ఈ సందర్భంలో నెహ్లూడొవ్ తన అభిప్రాయాన్ని చెబుదామనుకున్నాడు. అలా చెబితే—మస్లొవాతో తనకుగల సంబంధం బయటపడుతుందేమోనని భయపడ్డాడు. అయినా అలా సాగిపోనివ్వటం సబబు కాదనిపించింది. ఏదో మాటాడబోయాడు. ముఖం ఎర్రబడింది. మళ్ళీ పాలిపోయింది. ఇంతలో పీటర్ లేచాడు. అతనికి జ్యూరీ పెద్ద అధికారిక కంఠధ్వని నచ్చలేదు. లేచి నెహ్లూడొవ్ చెప్పదలచిన మాటలే పీటర్ చెప్పేశాడు: "ఒక్క నిమిషం నేను చెప్పే మాట వినండి. తాళంచెవి ఆమెదగ్గర ఉన్నంతమాత్రాన దొంగతనంచేసింది ఆమేనని మీరు తలుస్తున్నారు. నౌకర్లు దొంగ తాళంచెవి పెట్టి తోలుపెట్టె తీసియుండకూడదా?"

"ఔను, ఔను"—అన్నాడు వర్తకశిఖామణి.

"ఆమె డబ్బు కాజేసివుండదు. తానున్న స్థితిలో అంతడబ్బు తీసుకుపోయి, దానితో ఏమిచెయ్యాలో ఆమెకు తెలియదు"

"ఔను. ఆ మాటే నేనూ చెప్పదలచుకున్నాను" అన్నాడు వర్తకుడు.

"ఆమె డబ్బుకోసం హోటలుకు వచ్చినప్పుడు-తోలు పెట్టెలో డబ్బు మనమే కాజేస్తే బాగుండునన్న ఆలోచన అకస్మాత్తుగా కలిగి ఉండవచ్చు. అవకాశాన్ని ఉపయోగించుకుని, అపరాధాన్ని ఆ పిల్లమీద త్రోసేశాడు."

ఇంత వ్యతిరేకంగా మాట్లాడుతున్నాడని జ్యూరీ పెద్దకు కోపం వచ్చింది. పీటర్ పలికిన రీతికూడా అతనికి కోపకారణం అయింది. అందువల్ల తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళని మొండిపట్టు పట్టాడు. పీటర్ సహేతుకంగా మాట్లాడాడు. మస్లావా డబ్బు దొంగిలించలేదనీ, ఉంగరాన్ని వర్తకుడే ఆమెకు స్వయంగా ఇచ్చాడనీ వాదించాడు. అధిక సంఖ్యాకుల చేత ఒప్పించాడు. కాని—

విషప్రయోగాన్ని గురించిన సంగతి చర్చకు వచ్చినప్పుడు "విషం తాగించాలన్న దురుద్దేశం ఆమెకు లేదు కనుక ఆమెను విడుదల చెయ్యాల్సిందే" అన్నాడు వర్తక శిఖామణి. కాని జ్యూరీ పెద్ద వీల్లేదన్నాడు—పొడి కలిపి యిచ్చినట్టు ఆమే స్వయంగా ఒప్పుకుందని చెప్పాడు.

"ఒప్పుకుంది, నిజమే. కాని అది నల్లమందనుకుని ఇచ్చింది" అన్నాడు వర్తకుడు.

"నల్లమందు కూడా మనిషి ప్రాణం తీసేయగలదు"—అంటూ కొంత కాలంకింద తన బావమరది భార్య నల్లమందు డోసు ఎక్కువై ప్రాణంపోయేటంత పనైందని ఒక కథ ఆరంభించి-తీపిగా, రసవత్తరంగా చెప్పాడు. అదంతా అనవసర కథాకథనం అయినప్పటికీ అతన్ని ఆపమని చెప్పటానికి ఎవరికీ సాహసం లేకపోయింది. ఆ యూదీయుడు కల్నల్‌ను అనుకరించి తాను కూడా ఒక కథ చెబుదామన్న ఉద్దేశంతో "కొంతమంది నల్లమందు ఉండలు కుంకుడు కాయంతవి కూడా మింగగల మహామహులు ఉన్నారు. మా బంధువుల్లో ఒకడు—"అంటూ ఆరంభించాడు. కాని కల్నల్ అతన్ని మాట్లాడనీయకుండా తన బావమరది భార్యను గురించే ఇంకా చాలా వివరాలు చెప్పుకుపోయాడు.

"అయిదు గంటలైపోతోంది, చూశారా ?" అన్నాడొక జ్యూరీ.

"ఔను. ఏమి రాద్దాం ? ధనాన్ని దొంగిలించకుండా నేరస్థురాలు అని రాద్దామా ?" జ్యూరీపెద్ద అడిగాడు.

తన పాయింటు నెగ్గిందికదా అని పీటరు సంతోషించి అందుకు ఒప్పుకున్నాడు.

"ఆమెను కూడా దయతలచి విడిచిపెట్టవలసిందిగా సిఫార్సు చేద్దాం" అన్నాడు వర్తకుడు.

అందరూ ఒప్పుకున్నారు. ఆ ముసలి కార్మిక నాయకుడు మాత్రం 'ఆమె నిర్దోషి' అని నిక్కచ్చిగా రాయాలని పట్టుపట్టాడు.

"ఔను, ధనాన్ని దొంగిలించకుండా అని రాస్తున్నాంగా. అంటే నేరస్థురాలు కాదన్నమాటే !" అంటూ జ్యూరీపెద్ద అతనికి నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు.

"ఔను, అంతే. దయదలచి విడిచిపెట్టవలసిందని సిఫార్సు చేద్దాం చాలు" అన్నాడు వర్తకుడు.

అంతా అలసిపోయి ఉన్నారు. బుర్రలు తికమక పడిపోయాయి చర్చలవల్ల. 'బ్రాందీలో పొడి కలిపి యిచ్చిందిగాని, ప్రాణం తీద్దామన్న దుర్బుద్ధి ఆమెకు లేదు' అని రాయవలసిన ఆవశ్యకత ఎవరికీ తోచలేదు. మనస్సు బాగా–వివిధ భావాలచేత–విచలితమై వున్న నెహ్లూడోవ్ కూడా ఆ సంగతి గమనించలేదు. పైన అనుకున్న ప్రకారం ప్రశ్నల పెట్టెలో జవాబులు రాసి కోర్టులోకి పట్టుకెళ్ళారు.

ఒక లాయరు చట్టాలన్నీ చెప్పుకొచ్చాడు. 20 పేజీల లాటిన్ భాషలో రాసిన చెత్త చదివాడు. చివరకు ఇన్ని గవ్వలు గుప్పెట్లో తీసి, లెక్కపెట్టి, జేసి అయితే వాదిది న్యాయమనీ, సరిఅయితే ప్రతివాదిదే న్యాయం అనీ నిర్ణయించి తీర్పు ఇవ్వవలసిందిగా జడ్జీకి సలహా ఇచ్చాట్ట.

అలాగే వుంది ఈ కేసు తీర్పుకూడా. అందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. కాబట్టే కాదు ఈ నిర్ణయం తీసుకున్నది. కల్నల్ తన బావమరది గాథ వివరించాడు. నెహ్లూడోవ్ విచలిత మనస్కుడై 'ప్రాణం తీద్దామన్న చెడు తలంపు ఆమెకు లేదు' అనే వాక్యం రాయవలసిన ఆవశ్యకతను మరచిపోయాడు. జవాబులన్నీ రాసిన తరువాత ఒకసారి అన్నీ చదివేటప్పుడు

పీటర్ అక్కడ లేడు, బైటికి వెళ్లాడు. అందరూ బాగా అలసిపోయి, చప్పున ఇళ్ళకు పోదామన్న ఆతృతలో వుండి, ఏదో ఒకరకంగా, ఈ వ్యవహారం ముగిసిపోతే చాలనుకున్నారే గాని, తీర్పు సక్రమంగా వున్నదా, లేదా అని ఎవరూ ఆలోచించనే లేదు. జ్యూరీలు గంట మోగించారు. పోలీసు కత్తి పుచ్చుకుని ద్వారం దగ్గర పక్కకు తొలిగాడు. జడ్జీలు ఆసీనులైనారు. జ్యూరీలు ఒక్కొక్కరే లోనికి వచ్చారు.

జ్యూరీలు రాసితెచ్చిన సమాధానపత్రాన్ని జ్యూరీపెద్ద ప్రెసిడెంటుకు అందించాడు. ఆయన దాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. "దొంగతనం చేసే ఉద్దేశంలేదు." అనే వాక్యం వుంది కాని 'ప్రాణం తీయాలన్న ఉద్దేశం లేదు.' అనే వాక్యం జ్యూరీలు రాయలేదు. దీనినిబట్టి 'మస్లోవా' దొంగతనం చేయలేదు; కాని కారణం ఏమీ లేకుండానే విషంపెట్టి ఒకమనిషిని చంపింది-అని జ్యూరీల నిర్ణయమైనట్టు స్పష్టం...

"చూడండి, ఈ జ్యూరీలు యెంత అసంబద్ధపు నిర్ణయానికి వచ్చారో! ఆమెకు సైబీరియాకు ప్రవాసశిక్ష, నిర్బంధ బానిసత్వం తప్పదు. పాపం నిర్దోషి" అన్నాడు ప్రెసిడెంటు తనపక్కన గంభీరముద్ర వహించివున్న సభ్యునితో.

"ఐతే మీరు ఆమె నిర్దోషి అనే భావిస్తున్నారా."

"అవును. ఆమె నిస్సందేహంగా నిర్దోషి. 817 సెక్షన్ ప్రకారం— జ్యూరీల నిర్ణయం అన్యాయం అని తోస్తే కోర్టువారు దాన్ని తోసివేయవచ్చు. ఏమంటారు మీరు?" అని ప్రెసిడెంటు మరొకసభ్యుని ప్రశ్నించాడు.

కడుపునొప్పితో బాధపడుతున్న ఆ దయార్ద్రహృదయుడైన ఆ సభ్యుడు తనముందు వున్న కాగితములమీది ఒకసంఖ్యను చూచి, దానిలోని అంకెలను కూడాడు. ఆ మొత్తము మూడుచేత భాగారించాడు. నిశ్శేషముగా పోలేదు. నిశ్శేషముగా పోతే ప్రెసిడెంటు అభిప్రాయంతో ఏకీభవిద్దామనుకున్నాడు. కాని మెత్తని మనస్సు కలవాడు కాబట్టి నిశ్శేషంగా పోకపోయినా ప్రెసిడెంటు చెప్పినమాటకు ఒప్పుకున్నాడు.

"అవును మీరు చెప్పినట్టే చేయడం మంచిదనుకుంటాను" అన్నాడు.

"మరి మీరేమంటారు?" అని ప్రెసిడెంటు గంభీరముద్ర వహించి వున్న సభ్యుని ప్రశ్నించాడు.

"ఊహుఁ, నేను ఒప్పుకోను."

ప్రెసిడెంటు తన చేతిగడియారంవైపు చూశాడు. టైము పరుగెత్తుతోంది. సమాధానపత్రాన్ని జ్యూరీపెద్దకిచ్చి చదవమన్నాడు. అతడు ఒకసారి దగ్గి, గొంతు సవరించుకొని చదివాడు. ప్లీడర్లు, పబ్లిక్ ప్రాసిక్యూటర్, కార్యదర్శి-కోర్టు అంతా ఆశ్చర్యపోయింది. ఖైదీలు అర్థంగాక బల్లలమీద అతుక్కుపోయి కూర్చున్నారు. ప్రెసిడెంటు లేచి "ఖైదీలకు యెటువంటి శిక్షలు వేయాలి?" అని ప్రాసిక్యూటర్‌ని అడిగాడు.

ప్రాసిక్యూటరు, మస్లోవాకు శిక్ష వేయించగలిగానని - అదంతా తన మహోపన్యాస ప్రభావమే అని-చాల గర్వించాడు. లేచి యిలా చెప్పాడు.

"సైమన్‌కు 1452—1453 ఆర్టికిల్ ప్రకారమూ-యూఫీమియాకు 1659 ఆర్టికిల్ ప్రకారమూ-మస్లోవాకు 1454 ఆర్టికిల్ ప్రకారమూ శిక్షలు విధించాలి."

ఈ శిక్షలన్నీ తీవ్రతరమైనవి.

శిక్షల్ని గురించి ఆలోచించేందుకు ప్రెసిడెంటు సభ్యులతో సహా లేచాడు.

నెఖ్లూడోవ్‌తో జ్యూరీలపెద్ద యేమో చెపుతున్నాడు. పీటర్ అక్కడకు వచ్చి "చూశారా, మనము ఎంత సిగ్గుచేటుపని చేశామో! ఆమెను సైబీరియాకు ప్రవాసం పంపిస్తున్నాము" అన్నాడు.

"అంటే?" నెఖ్లూడో ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏముంది? ప్రాణం తీయాలన్న వుద్దేశం ఆమెకు లేదు, అనే వాక్యాన్ని రాయడం మనం మరచిపోయాం. ప్రాసిక్యూటర్ ఆమెను పదిహేను సంవత్సరాల నిర్బంధ బానిసగా సైబీరియాకు పంపించే వుద్దేశంలో వున్నాట్ట. ఆ సంగతి కార్యదర్శి నాకిప్పుడే చెప్పాడు."

"మరి అలాగే నిర్ణయించాంగా!" అని జ్యూరీపెద్ద పలికాడు

"ఆమె, దొంగతనం చేయలేదని మనం నిర్ణయించాం. కాబట్టి వర్తకుని చంపాలన్న దురుద్దేశ్యం ఆమెకు వుండదు. ఆ సంగతే సమాధాన పత్రంలో రాయటం మనం మరచిపోయాం."

"మరి నేను రాసిన సమాధానాలన్నీ బిగ్గరగా చదివానుగా! ఎవరూ అభ్యంతరం చెప్పలేదే అప్పుడు."

"నే నప్పుడే బయటకు వెళ్ళాను" అంటూ పీటర్ నెఖ్లూడోవ్ వైపు తిరిగి "ఎలాగైతే మనకేంలే, అని నిర్లక్ష్యంగా వుండి వుంటారు మీరు" అన్నాడు.

"నేను అనుకోలేదు..." అని ఏమో చెప్పబోయాడు నెఖ్లూడోవ్.

"అవును మీరు అనుకోరు."

"మళ్ళీ ఇప్పుడు సరిజేయించుదాం" అన్నాడు నెఖ్లూడోవ్.

"వుహుః. లాభంలేదు. అయిపోయింది."

నెఖ్లూడోవ్ ఖైదీలకేసి చూశాడు. వాళ్ళు అక్కడ సైనికులముందు చలనం లేకుండా కూచున్నారు. మస్లోవా చిరునవ్వు నవ్వుతూనే వుంది. హృదయంలో ఒక పాపచింత పొడచూపింది. ఇంతసేపటినుంచి ఆమె విడుదల అవుతుంది; పట్నంలోనే వుంటుంది; కాబట్టి ఇక ముందు ఆమెతో నెఖ్లూడోవ్ తనకు ఎలాటి సంబంధం వుంటుంది? అనే సంధిగ్ధావస్థలో వున్నాడు. ఎట్టి సంబంధం పెట్టుకున్నా కష్టమే. నిర్బంధ బానిసగా ఆమె సైబీరియాకు ప్రవాసమే వెళ్ళేట్టయితే, ఇక ఆమెతో ఏ విధమైన సంబంధం వుండదు. తుపాకి దెబ్బతిన్న పిట్టను బుట్టలో వేసుకున్న తర్వాత అది లోపల గిల గిల తన్నుకుంటూ వున్నా, అది బతికి వున్నట్టు లెక్కకాదు.

## — ౨౪

పీటర్ చెప్పినట్టే జరిగింది.

జడ్జీల సంప్రదింపుల గదిలోనుంచి ప్రెసిడెంటు తిరిగి వచ్చాడు. చేతిలో కాగితం పుచ్చుకుని ఇలా చదివాడు.

"శ్రీశ్రీశ్రీ జార్ చక్రవర్తిగారి జిల్లా క్రిమినల్ కోర్టులో జ్యూరీల నిర్ణయాన్ని అనుసరించి, క్రిమినల్ చట్టం 771, 776, 778 కారికల ప్రకారం సైమన్, మస్లోవా తమ ఆస్తి హక్కుల్ని కోల్పోయి, సైమన్

ఎనిమిది సంవత్సరాలు, మస్లొవా నాలుగు సంవత్సరాలు సైబీరియాలో నిర్బంధ ఖైదీలుగా వుండవలెనని తీర్పు చెప్పడమైనది. యూఫీమియా తన పిత్రార్జితమైన, స్వార్జితమైన ఆస్తులపై హక్కులు కోల్పోయి మూడు సంవత్సరాలు కారాగార శిక్ష అనుభవించాలని తీర్పు చెప్పటమైనది.

సైమన్ చేతులు పక్కల కొరిగించుకుని, పెదవులు కదుపుతూ నిల్చున్నాడు. యూఫీమియా ప్రశాంతంగానే వుంది. మస్లొవా ముఖం కందగడ్డ అయింది. "నేను నేరం చెయ్యలేదు. నా తప్పేమీ లేదు" అని హఠాత్తుగా హాలంతా ప్రతిధ్వనించేట్లు అరిచింది. "నే నేమీ చెయ్యలేదు. నే ననుకోను కూడా లేదు. నిజంగా చెబుతున్నాను" అంటూ బెంచీమీద కూలబడి, బిగ్గరగా వెక్కి వెక్కి ఏడవసాగింది. సైమన్ యూఫీమియా బైటికి వెళ్ళిపోయారు. మస్లొవా మాత్రం అలాగే వుండి ఏడుస్తూ వుంది కొంతసేపటివరకూ.

నెఖ్లూడోవ్ హృదయంలోని పాపచింతలన్నీ మటుమాయమైనాయి. వరండాలో ఆమెను కలుసుకుందామని వెళ్ళాడు. ఎందుకో తెలియదు; ఆమె నొకసారి చూడాలని కోరాడు—తలుపు దగ్గర గుంపుగా వున్నారు జనం. ప్లీడర్లు, జూరీలు ఎలాగో బెడద వదిలింది కదా అని సంతోషంగా వెళ్ళిపోతున్నారు గబగబా. నెఖ్లూడోవ్ వాళ్ళంతా వెళ్ళిందాకా ఆగి, వరండాలోకి వచ్చాడు. కాని ఆమె చాలా ముందుకు వెళ్ళింది. ఆమె వెనకనే అతను కూడా వెళ్ళాడు. అందరూ అతనికేసి చూశారు. కాని అతను లెక్క చేయలేదు. ఆమెను సమీపించాడు. ఆమెకన్నా ముందు వెళ్ళి ఆగాడు. ఆమె ఏడుపు కొంచెంగా తగ్గింది. కందిపోయి, అశ్రుసిక్తమైన ముఖాన్ని తుడుచుకుంటూ...అతన్ని గమనించకుండానే సాగిపోయింది. నెఖ్లూడోవ్ గబగబా ప్రెసిడెంటు దగ్గరకు వెళ్ళాడు. ఆయన అప్పుడే కోర్టు విడిచి బయలుదేరాడు. అయినా వెంబండించి పట్టుకున్నాడు.

"ఈ కేసును గురించి నాలుగు మాటలు మీతో మాట్లాడదామనుకున్నాను. నేను ఒక జ్యూరీ సభ్యుణ్ణి."

ప్రెసిడెంటు తన వెండి పొన్నుకర్ర సేవకుని చేతుల్లోనుంచి అంది పుచ్చుకుంటూ అన్నాడు. "ఎందుకు మాట్లాడకూడదూ! నెఖ్లూడోవ్! నీతో మాట్లాడ్డం నాకు సంతోషం. మనం ఇదివరకొకసారి కలుసుకున్నాం కదూ!" కొంత కాలం క్రింద ఒక సాయంత్రంపూట ఇద్దరూ కలుసుకోటం సంభ

చును, వెళ్ళి దర్శించటానికి ఇంకా ముప్పావుగంట కాలం వుంది, అంతే. కావలిస్తే ప్లీడరుతో మాటాడి, అప్పీలుకు అవకాశాలు వుంటే ఆలోచించండి. అట్టి అవకాశాలు ఎప్పుడూ తేలిగ్గానే దొరుకుతాయి" అని తుది సలహా చెప్పి ప్రెసిడెంటు ఒక జట్కావాణ్ణి పిల్చాడు. "దోర్యన్స్కియా హోటల్‌కు వెళ్ళాలి. ముప్ఫయి కోపెక్‌లు ఇస్తాను; నే నెప్పుడూ అంతకంటే ఎక్కువ ఇవ్వను" అన్నాడు.

"చిత్తం; ఎక్కండయ్యా బండి."

"నాతో ఏమన్నా అవసరం వస్తే మా ఇంటికి రండి" అని నెహ్లూడోవు తన చిరునామా చెప్పి, బండి యెక్కి వెళ్ళిపోయాడు.

## ౨౫

ప్రెసిడెంటుతో మాటాడిన తరువాత, కాసేపు ఆ సాయంత్రపు చల్లని గాలులు సోకిన మీదట, నెహ్లూడో హృదయవేగం కాస్త తగ్గింది.

"జరిగిన వ్యవహారమంతా చాలా విచిత్రంగా వుంది — వీలైనంత వరకు కనీసం ఆమె శిక్షను తగ్గించడానికైనా నేను శక్తివంచన లేకుండా పని చెయ్యాలి" అనుకున్నాడు. పట్నంలో పెద్ద ప్లీడరుగా పేరు గాంచిన ఫానరిన్, మికీషిన్‌లను తలచుకున్నాడు. వెంటనే వెళ్ళి వాళ్ళతో సంప్రదించాలని నిశ్చయించుకున్నాడు. వాళ్ళకోసం మళ్ళీ కోర్టులోకి వచ్చాడు. మేడమీదికి వెళ్ళాడు. అక్కడే ఫానరిన్ దర్శనం అయింది. "ఒక వ్యవహార సందర్భంలో మాటాడ్డానికి వచ్చాను" అన్నాడు నెహ్లూడో.

ఫానరిన్ నెహ్లూడోను గుర్తించాడు. "నే నిప్పుడు అలసివున్నాను. నువు వచ్చినపని చప్పున తేలేదైతే చెప్పండి ఇక్కడే" — అంటూ నెహ్లూడోను ఒకగదిలోకి తీసుకుపోయాడు. బహుశః అది ఒక జడ్జీగారి విశ్రాంతి గది అయివుంటుంది. ఇరువురూ ఒక టేబిల్ ముందు కూచున్నారు.

"చెప్పండి; ఏమిటా వ్యవహారం ?"

"మొదట మీరిదంతా రహస్యంగా ఉంచాలి. ఇందులో నేను శ్రద్ధ చూపుతున్నానని ఎవరికీ తెలియకూడదు."

"సరే, దానికేం ?"

"ఇవాళ నేను జ్యూరీ హోదాలో కోర్టుకు హాజరైనాను. ఒక నిరప రాధిని సైబీరియాకు ప్రవాసం పంపించాం. అది నాకు చాల బాధగా ఉంది"– నెహ్లూడోవ్ లజ్జాన్వితుడైనాడు. కాస్తంత తికమకపడ్డాడు. తటస్థితి తనకే ఆశ్చర్యం కలిగించింది. ఫానరిన్ అతనిముఖంమీదినుంచి చూపులు తప్పించి, నేలకేసిచూస్తూ వింటున్నాడు.

"నిరపరాధిన్రైన స్త్రీకి శిక్ష పడింది. హైకోర్టుకు అపీలుచేయాలని నా ఊహ."

"అంటే, సెనేటుకేగా !"

"ఔను. మీరే ఈ కేసులో వకాల్తా పుచ్చుకోవాలి. ఖర్చులన్నీ, ఎంతైనా సరే, నేనే భరిస్తాను."

"ఓ, దానికేం ? ఏర్పాటుచేసుకుందాం లెండి"—అంటూ వ్యవహార సందర్భాల్లో నెహ్లూడోవ్ ఎక్కువ అనుభవజ్ఞుడు కాకపోయినందుకు మంద హాసం చేస్తూ—"ఏమిటా కేసు ?" అడిగాడు.

జరిగిందంతా చెప్పాడు నెహ్లూడోవ్.

"సరే, కేసు యావత్తూ రేపు అధ్యయనం చేసుకుంటాను. మీరెల్లుండి రాండి. ఊహుఁ, గురువారం రాండి పోనీ - మీకు నేను సలహా చెబుతాను. ఇప్పటికిక మనం వెడదాం; నాకు వేరేపని ఉన్నదిక్కడ."

సెలవుపుచ్చుకుని నెహ్లూడోవ్ వెళ్ళిపోయాడు.

న్యాయవాదితో మాటాడిన తరువాత - మస్లోవాకు సాయంచేయాలన్న తలంపుతో కొంతవరకు ఉపక్రమణికే సాగించుకోవటం-నెహ్లూడోవ్‌కు మరి కాస్త ప్రశాంతత చేకూరింది. వీధిలోకి వచ్చాడు. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది - వసంతపవనమును తనివితీర పీల్చాడు - బండివాళ్ళు కేకలు బెట్టారు. కాని కాలినడకనే వెళ్లాడు. మస్లోవాతోటి తన పూర్వగాథ యావత్తూ మళ్ళీ బుర్రలో తిరిగింది. హృదయం కుంగిపోయినట్టయింది. అంతా విచారమయంగా కనిపించింది. "ఈ గొడవంతా తరువాత ఆలోచిస్తాను. ప్రస్తుతానికి వెగటుగా ఉంటున్న ఈ ఆలోచనలన్నీ మరిచిపోవాలి" అనుకున్నాడు.

కోర్చాగిన్ రాకుమారి ఆహ్వానం జ్ఞాపకం వచ్చింది. భోజనసమయం దాటకుండా వెళ్ళివచ్చుననుకున్నాడు గడియారం చూచుకుని. ఒక ట్రాము బండి కనిపించింది. పరిగెత్తి అందులో ఎక్కాడు. పెద్దబజారులో దిగాడు. అక్కడినుంచి బండీ చేసుకుని కోర్చాగినుల భవనానికి వెళ్ళాడు.

## ౨౭

"దయచేయండి, బాబూ, రండి" అంటూ ద్వారపాలకుడు స్వాగతవాక్యాలు పలికాడు. తలుపులు తెరచాడు. "మీకోసం ఎదురుచూస్తున్నారండి, భోజనాలకు కూచోబోతున్నారు. మీరు వస్తే లోపలికి దయచేయ్యమని శెలవిచ్చారు బాబూ!" అన్నాడు.

"కొత్తవాళ్ళు ఎవరన్నా వచ్చారేమిటి?"- నెహ్లూడోవ్ ప్రశ్నించాడు.

"కొలోసోవ్, మైకేల్, ఇంటివారు - మరెంకెవరూ లేరు బాబూ!"

నెహ్లూడోవ్ మెట్లెక్కి మేడమీదికి వెళ్ళాడు-అతి వైభవోపేతంగా ఉన్న నృత్యమందిరాన్ని దాటి, భోజనశాలలో ప్రవేశించాడు. కోర్చాగిన్ కుటుంబం అంతా టేబిల్ చుట్టూ ఉంది. మొదట ముసలి కోర్చాగిన్ కూచున్నాడు. ఆయనకు ఎడమపక్కన డాక్టరు కూచున్నాడు; కుడిపక్కన కొలోసోవ్ కూచున్నాడు. కొలోసోవ్ ప్రస్తుతం ఒక బ్యాంకు డైరెక్టరు. కోర్చాగిన్ కు కావలసిన స్నేహితుడు; లిబరల్ పక్షీయుడు-ఆ తరువాత ఎడమ పక్కన రేనర్ కన్య కూచుంది. ఈమె మిస్సీ చెల్లెలికి పంతులమ్మ. మిస్సీ చెల్లెలు నాలుగేళ్ళపిల్ల - పంతులమ్మ పక్కనే కూచుంది. వీళ్ళకెదురుగా మిస్సీ తమ్ముడు 'పెట్యా' కూచున్నాడు. ఇతడు హైస్కూల్లో ఆరవతరగతి చదువుతున్నాడు. అతని పరీక్షలు ఇంకా కాలేదు. అందుకనే కుటుంబం ఇంకా పట్నంలోనే ఉంది. అతని పక్కనే అతనికి ట్యూషన్ చెబుతున్న ఒక విశ్వవిద్యాలయ విద్యార్థి ఉన్నాడు - మిస్సీ పినతండ్రి కొడుకు మిషా, నలభైయేళ్ళ కన్య ఒకతె కూడా ఉన్నారు. టేబిల్ చివర మిస్సీ కూచుంది. ఆమె పక్కనే ఒక ఖాళీ కుర్చీ ఉంది.

"వచ్చావా? కూచో, ఇంకా మేము చేపలకూరదగ్గరే ఉన్నాంలే"- అన్నాడు ముసలి కోర్చాగిన్ నెహ్లూడోవ్ కు స్వాగతవాక్యంగా, కష్టించుకున్న

పళ్ళమీద కూరముక్కలు పరపర నములుతూ–బట్లర్ని పిలిచి ఖాళీగావున్న కుర్చీముందు టేబిల్ మీద కన్నులతో సైగచేసి చూపించాడు. నోటినిండా తురుముకుని నములుతున్నాడు; మాట్లాడే వీలులేదు. నెజ్దానోవ్ ఈ ముసలి కోర్చిగిన్‌ను బాగానే ఎరిగివున్నాడు. భోజనంముందు అనేక్ని సార్లు ఇదివరకు చూచేవున్నాడు. కాని ఈ పూట చూస్తూంటే అసహ్యం కలిగింది. ఆతని క్రూరస్వభావం అప్రయత్నంగా తలపుకువచ్చింది. మిలిటరీ కమాండరుగా ఉన్నప్పుడీ పెద్దమనిషి అనేకమందిని కొరడాదెబ్బలు కొట్టించాడు; ఉరితీయించాడు–ఎందుకయ్యా అంటే తాను ధనవంతుడు గనుక – ఇతర్ల అనుగ్రహాలు తన కక్కర్లేదు గనుక.

బట్లర్ అన్నీ వడ్డించిన వెండిప్లేటు తెచ్చి ఉంచాడు. నెజ్దానోవ్ ఒకసారి బల్లచుట్టూ నడిచి అందరితోనూ కరస్పర్శచేసి, పలకరించాడు. తాను ఇదివరకెన్నడూ మాటాడి కూడా ఉండనివాళ్లు కొందరున్నారు. ఇలా అందర్నీ పరామర్శించవలసిన ఆచారం అతనికి కొంత వెగటుగా అనిపించింది. వచ్చి ఖాళీ కుర్చీలో కూచున్నాడు. తినటం ఆరంభించిన తరువాతగాని, తన కాకలి ఔతున్నట్టు తెలుసుకోలేకపోయాడు. వెన్నలో కలిపి రొట్టె తింటున్నాడు.

"బాగా సమాజపు పునాదులు పెళ్ళగించేశారా ? నేరస్థుల్ని వొదిలేసి, నిరపరాధుల్ని శిక్షించారా ?" అంటూ వ్యంగ్యంగా కొలోసోవ్ ప్రశ్నించాడు నెజ్దానోవ్‌ను ఉద్దేశించి. పునాదులు పెళ్ళగించటం అనేది... ఒక వార్తా పత్రికలో ఇటీవల ...జ్యూరీ పద్ధతిని నిరసిస్తూ రాసిన వ్యాసంలో వాడిన పదం. ఆ వ్యాసాన్ని దృష్టిలో ఉంచుకుని కొలోసోవ్ హాస్యంగా పలికాడు. కొలోసోవ్ తెలివితేటల్లోనూ, పాండిత్యంలోనూ విశేష విశ్వాసంగల కోర్చిగిన్ జమీందారు– 'పునాదులు పెళ్ళగించటం' అను పదాన్ని తాను కూడా రెండుసార్లు ఉచ్చరించి పకపక నవ్వాడు.

మొరటుగా జవాబు చెప్పటం యిష్టంలేక, నెజ్దానోవ్ మాటాడలేదు. వేడివేడి పులుసు నంజుతున్నాడు.

"భోజనం చేయనీయండి అతన్ని" అన్నది మిసెస్ నవ్వుతూ. తనకు నెజ్దానోవ్‌తో గల సన్నిహిత పరిచయాన్ని నలుగురూ గ్రహించాలన్న ఉద్దేశంతో 'అతన్ని' అనే సర్వ నామాన్ని ఉపయోగించింది.

ఆ తర్వాత కోలోసోవ్ జ్యూరీల పద్ధతిని నిరసిస్తూ పత్రికలో పడిన వ్యాసంలోని విషయాలను ఏకరువు పెట్టాడు. మిస్సీ పినతండ్రి కొడుకు మిషా కూడా ఆ పత్రికలోనే పడిన మరో వ్యాసంలోని విషయాలను చెబుతూ కోలోసోవ్‌ను సమర్థించాడు. మిస్సీ విలువైన దుస్తులు ధరించి ఠీవిగా కూచుంది.

"నీకు బాగా ఆకలైందనుకుంటాను" అన్నదామె నెహ్లూడోవ్‌తో.

"మీరు సినిమాకు వెళ్లారా ?"

"లేదు మానేశాం. టెన్నీసు ఆడాం-క్రూక్స్ బాగా ఆడతాడు సుమీ !"

ఏదో మనశ్శాంతి చిక్కుతుందని నెహ్లూడోవ్ వచ్చాడు. ఈ ఇంటిలోని నాగరికతా లక్షణాలు అతనికి బాగుంటాయి. ఈ ఇంట్లోవారికి అతని యెడ గౌరవం వుంది. అతన్ని మెచ్చుకుంటారు. కాని ఈనాడు అతనికి ఈ యింట్లో ప్రతిదీ-ద్వారపాలకుని దగ్గరనుంచి మిస్సీ వరకు-ఇంటిలోని ప్రతి అలంకరణమూ వెగటుగా, అసహజంగా కనిపించింది. ఆత్మ గౌరవం పొంగిపోతూ మాటాడిన కోలోసోవ్ కంఠధ్వని అసహ్యంగా ఉంది. ఎద్దులాంటి విగ్రహం తానూ - కోర్చిగిన్ కూడా అతనికి నచ్చలేదు. ముఖ్యంగా అతన్ని అని మిస్సీ ఉపయోగించిన సర్వనామం అతనికి బాధ కలిగించింది. ఒకొక్కప్పుడు ఆమెలో అతనికి - వెన్నెలలోవలె విశుద్ధ సౌందర్యమే కనిపిస్తుంది. కాని ఇప్పుడామె సూర్యోదయానంతరం వెల వెలబోయే చంద్ర బింబంలా కనిపిస్తున్నది. ఆమెలోని లోపాలే చూడగల్గుతున్నాడు. ఆమె ముఖంలోని ముడతలు, తలలో నెరసిన వెంట్రుకలు, తోసుకు వచ్చిన మోచేతి ఎముకలు, బాగా పెరిగిన బొటనవేలి గోరు-ఇవన్నీ కనిపిస్తున్నాయి అతనికి.

"టెన్నిస్ ఆట్లు విసుగు పుట్టిస్తుంది" అన్నాడు కోలోసోవ్.

అందుకు మిస్సీ ఒప్పుకోలేదు. టెన్నీసు ఆట చెడ్డ ఆహ్లాదకరంగా ఉంటుందని ఆమె వాదించింది. ఓ పెద్ద చర్చ ఆరంభమైంది. పంతులమ్మ, హైస్కూలు కుర్రవాడు, పిల్లలు తప్ప మిగిలినవారంతా చర్చలో పాల్గొన్నారు.

"ఎందుకు వచ్చిన వాదోపవాదాలు ఇవన్నీను ?" అంటూ భోజనం ముగించి కోర్చాగిన్ జమీందారు లేచి వెళ్లాడు అక్కనితోపాటే అందరూ లేచి మరొక టేబిల్ వద్ద కూచుని, సారాయం తాగుతూ సంభాషణ ఆరంభించారు.

టెన్నిస్ ఆటను గురించి తాను వెల్లడించిన అభిప్రాయాన్ని సమర్థిస్తూ నెఖ్లూడోవ్ చేత మాటాడించాలని మిస్సీ కోరిక. కాని అతడు పరాఙ్ముఖంగా ఉండుట ఆమె కనిపెట్టింది. అతృప్తి సూచకములుగా ఉన్నాయి అతని చూపులు. కారణం తెలుసుకోవాలని ఆమె ఆతృత పడ్డది.

"మా అమ్మ దగ్గరికి వెళదామా ?" అని అడిగింది.

"అవును, వెళదాం" అని అన్నాడేగాని అతని కంఠధ్వనిలో వ్యతిరేకార్థము స్ఫురించింది. అతడు సిగరెట్ తీసి వెలిగించాడు.

మిస్సీ అతనికేసి ప్రశ్నార్థకంగా చూస్తోంది. అతడు ఆమె భావాన్ని గమనించాడు. వాళ్ళింటికి వచ్చి వాళ్ళకు కష్టం కలిగించటం భావ్యం కాదనుకున్నాడు. "మీ అమ్మగారికి అభ్యంతరం లేకపోతే ఎందుకు రాను ?" అన్నాడు.

"ఆమె నీ రాకకు సంతోషిస్తుంది. అక్కడే సిగరెట్టు తాగవచ్చు. కోలోసోవ్ కూడ అక్కడే వుంటాడు."

కోర్చాగిన్ దొరసాని ఆ రాత్రి అందరితోపాటు భోజనానికి రాలేదు. ఆమె రోగిష్టి మనిషి. ఎనిమిదిసంవత్సరాలనుంచి ఆమె ఎక్కడగా బయటికి వెళ్ళదు. మరీ ముఖ్యమిత్రులను తన గదిలోనికే రప్పించుకొని మాటాడుతుంది. అక్కడే ఒక్కతే భోజనం చేస్తుంది.

ఈ 'మరీ ముఖ్యమిత్రుల'లో నెఖ్లూడో ఒకడని చెప్పవచ్చును. అతడు తెలివైనవాడు. అతని తల్లి కోర్చాగిన్ కుటుంబంతో చాల పరిచయం కలిగి వుండేది. మిస్సీ నెఖ్లూడోవ్‌ను వివాహమాడటం వాంఛనీయం. కాబట్టి అతడు కోర్చాగిన్ దొరసాని సమక్షంలోనికి నిస్సందేహంగా రావచ్చు.

మిస్సీ నెఖ్లూడోవ్‌ను తల్లిగారి గదికి తీసుకుపోతూ మధ్యహాల్లో ఆగింది. ఆగి ఒక కుర్చీ చేయిమీద తన అరచేతులు నొక్కిపట్టి నిల్చుంది. ఆమె

పెళ్ళికి తహతహలాడుతోంది. నెఖ్లూడొవ్ సంబంధం మంచిదే. తనకుకూడ అతడంటే యిష్టమే. ఐతే అతను 'తన సొత్తు' కావాలన్న కోరికేగాని, తాను 'అతనిసొత్తు' అవాలన్న ఉద్దేశంలేదు.

"నువ్వు యివాళ అదోలా వున్నావు. ఏం జరిగిందో చెప్పాలి" అని ప్రశ్నించిందామె.

అతనికి ఆ నాడు కోర్టులో వ్యవహారాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. సిగ్గుపడ్డాడు. అబద్ధం చెప్పలేక—"జరిగింది మొత్తానికి ఒక అసాధారణ సంఘటన" అన్నాడు.

"ఏమిటది? చెప్పవా?"

"ఇప్పుడు కాదు...నేను చెప్పలేను. దాన్ని గురించి నేనే యింకా పూర్తిగా ఆలోచించలేదు"—అతడు మరీ సిగ్గుపడ్డాడు.

ఆమెకు కోపం వచ్చింది. కనుబొమ్మ కదిలింది. "చెప్పవన్నమాట!" అంటూ పట్టుకున్న కుర్చీని అవతలికి తోసేసింది.

"ఊహుఁ—చెప్పలేను"—నిజంగా ఒక అసాధారణ సంఘటనే జరిగిందని విశ్వసించాడు నెఖ్లూడొవ్.

"అయితే యికరా!" అని పలికి, మిస్సీ ముందుకు నడిచింది, మామూలుకన్న తొందరగా. ఆమె కన్నీళ్ళు ఆపుకోటానికి ప్రయత్నిస్తున్నట్టుగా కనిపించింది. తానామెకు బాధ కలిగించినందుకు సిగ్గుపడ్డాడు. ఆ సమయంలో తాను ఏమాత్రం దౌర్బల్యం చూపినా—అది ప్రమాదహేతువౌతుంది. తానామెకు కట్టుబడిపోవలసివస్తుంది. ఇటువంటి భయం అతని కప్పుడు జాస్తిగా వుంది. నెమ్మదిగా ఆమెవెంట నడుస్తూ కోర్చిగిన్ దొరసాని గదిలోకి వెళ్ళాడు.

## —౨౭

మిస్సీ తల్లి కోర్చిగిన్ దొరసాని అప్పుడే భోజనము ముగించింది. ఆమె ఎప్పుడూ ఒంటరిగానే భోంచేస్తుంది. ఆమె పక్కదగ్గర మేజామీద గిన్నెలో కాఫీ వుంది. ఆమె పొడుగ్గా, సన్నగా వుంటుంది. నల్లనిజుట్టు.

కళ్ళుకూడా నల్లనివే. పళ్ళు కొంచెము పొడుగు. యౌవనం గడచని మనిషి లాగా నటిస్తుంది.

ఇటీవల ఆమెకు, డాక్టరుకు గల పరిచయాన్ని గురించి ఎక్కువగా మాట్లాడుకుంటూ ఉంటారు. నెక్లూడొవ్ కూడా విన్నాడు. ఇప్పుడా డాక్టరు ఆమె పక్కనున్నాడే...గడ్డం నున్నగా దువ్వుకొని కూర్చున్నాడు. నెక్లూడొవ్‌కు లోకులు అనుకుంటూవున్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. అతనికి చిరాకెత్తిపోయింది. టేబిల్ దగ్గర, దొరసాని దగ్గరగా, ఒక పడకకుర్చీలో కోలోసోవ్ కూచుని తన కాఫీ గిన్నెలో చంచా తిప్పుతున్నాడు. టేబిల్ మీద సారా బుడ్డి ఒకటివుంది. నెక్లూడొవ్‌ను అక్కడకు తీసుకువచ్చిన మిస్సీ వస్తూనే—

"అమ్మకు విసుపుపుట్టి మిమ్మల్ని తరిమేస్తే, అప్పుడు నా దగ్గరికి రండి"—అని కోలోసోవ్‌ను నెక్లూడొవ్‌ను లక్షించి పలికి నవ్వుతూ వెళ్ళిపోయింది.

"కులాసాగా వున్నావుటయ్యా! కూచో" అని నెక్లూడొవ్‌కు స్వాగతం చెప్పి నవ్వింది దొరసాని. ఆ పొడుగాటి కట్టించుకున్న పళ్లు బయటపడ్డాయి. "కోర్టునుంచి చిరాకుగా వచ్చావని విన్నాను. హృదయంగల వాడికి కోర్టు వ్యవహారాలు కల్లోలంగానే ఉంటాయి" అన్నది.

"అవును. ఇంకొకర్ని విచారించడానికి మనకేమి హక్కున్నది అని పిస్తుంది."

అతని వాక్యంలోని సత్యాన్ని ఆమోదిస్తున్నట్టుగా ఆమె తల ఊపింది. "మరి నువ్వు రాస్తున్న చిత్రం ఎంతవరకు వచ్చింది? తయారైన తర్వాత చూడాలని నాకెంతైనా ఉబలాటంగా ఉంది. రోగిష్టిదాన్ని అయినాను. లేకపోతే ఎప్పుడో వచ్చి చూసేదాన్నే."

"నేను బొమ్మ గియ్యడం మానేశాను" అని నెక్లూడొవ్ నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు. ఆమె పలికిన మాటలు కేవలం పొగడ్త కోసమేనని తెలుసుకున్నాడు. ఆమె పైకి నటిస్తున్న యవ్వనం ఎంత అబద్ధమో, తన్నామె పొగుడుతూవున్న మాటలు కూడా అసత్యాలే. అందుచేత నిర్లక్ష్యంగా అలా జవాబు చెప్పాడు.

"అరే, ఎంత విచారకరమైన మాట! ఇతనికి మంచి కళాభిజ్ఞత వున్న దని రెపిన్ కూడా చెప్పగా విన్నాను. మానేయడం దేనికి?" అంటూ దొరసాని కోలోసోవ్ వైపు తిరిగి పలికింది.

ఈమె ఇలాంటి పచ్చి అబద్ధాలు సిగ్గు లేకుండా ఎలా పలుకుతుందో! అని లోలోన కోపగించుకున్నాడు నెఖ్లూదోవ్.

నెఖ్లూదోవ్ కోపంగా వున్నాడని, అతన్ని ఏ విధంగానూ ఉల్లాస పర్చడం సాధ్యం కావటంలేదనీ దొరసాని గుర్తించింది. అప్పుడామె కోలో సోవ్ వైపు తిరిగి—కొత్తగా ప్రచురితమైన ఒక నాటకాన్ని గురించి అతని అభిప్రాయం ఏమిటని ప్రశ్నించింది. అతని విమర్శలు విశిష్టములని ఆమె ఉద్దేశ్యం. కోలోసోవ్ నాటకాన్ని, నాటక కర్తను తీవ్రంగా విమర్శించి తన అభిప్రాయాలను ఏకరువు పెట్టసాగాడు. ఇంతవరకు ఆ నాటకం చాలా బాగుందని అనుకుంటోన్న ఆమె అతని అభిప్రాయాలకు లొంగిపోయింది. నెఖ్లూదోవ్ వింటూ కూర్చున్నాడు. కాని అతనికేమీ అర్థం కాలేదు. బుద్ధి ఎక్కడో వుంది.

కాసేపు కోలోసోవ్ కాసేపు దొరసాని మాటాడుతూ ఉన్నారు. వాళ్లు నాటకాన్ని లెక్క చేయలేదు. వారిలో వారికి పరస్పరమూ గౌరవం లేదు. కుతికల వరకు తిన్నారు కాబట్టి అది అరిగేవరకు పెదవు లాడించా లన్న కోరికే తప్ప మరేమీ లేదు. కోలోసోవ్ ఒక గ్లాసు ఎక్కువగా తాగాడు. అయినా తాగుడు అలవాటైనవాడే కాబట్టి తూలలేదు; అసంద ర్భంగా వాగలేదు; ఆవేశంగా మాత్రం మాటాడాడు. అప్పుడప్పుడు దొర సాని మాత్రం విసుగ్గా కిటికీవైపు చూస్తోంది. కిటికీలోనుంచి ఒక సాయం సూర్య కిరణం పాకి వస్తోంది, ఆమె ముసలి మొగాన్ని వెలిగించేందుకు.

"ఆహా! ఎంత బాగా చెప్పారు" అని కోలోసోవ్ చెప్పిన ఒక అభి ప్రాయాన్ని హర్షిస్తూ గంట మోగించింది దొరసాని. డాక్టరు లేచి మాటాడ కుండా వెళ్ళిపోయాడు. వెడుతోన్న అతనికేసి చూస్తూ దొరసాని కోలో సోవ్‌తో మాటాడుతూనే ఉంది.

గంటువిని నౌకరు వచ్చాడు. కిటికీ తెరకిందికి లాగి ఉంచమని ఆమె ఆజ్ఞాపించింది.

"ఏమైనా చెప్పండి. అతని మాటల్లో రహస్య వాదం వుంది. రహస్య వాదం లేకుండే కవిత్వం లేదు. కవిత్వం లేకుండా రహస్య వాదం ఒక మూఢ నమ్మకం అవుతుంది. రహస్యవాదం లేని కవిత్వం కవిత్వం కాదు, గద్యమే" ఆమె అంది. తెరదించి వెళ్ళిపోతున్న నౌకరువైపు కోపంగా చూస్తూ, "ఆ తెర కాదు, ఈ పెద్ద కిటికీ తెర" అని గర్జించింది ఏదో బాధ అనుభవిస్తూ. నౌకరుచేత ఒక పని చేయించటానికి యిన్ని మాటలు తాను మాట్లాడవలసి రావటమే ఆ బాధకు కారణము. ఆ ఆక్షేప శమనానికి ఒక సువాసన సిగరెట్టు తీసి వెలిగించింది.

ఆ సేవకుడు తన పొరపాటుకు క్షమాపణ చెప్పుకుంటూ పెద్ద కిటికీ దగ్గరకు వచ్చి, కిటికీలోనుంచి వచ్చే సూర్య కిరణాలు ఆమె ముఖంమీద పడకుండా తెర సవరించాడు. కాని అప్పటికీ ఆమె తృప్తిపడలేదు. మళ్ళీ రహస్య వాదమును గురించిన తన ఉపన్యాసాన్ని ఆపి అతన్ని మందలించవలసి వచ్చింది. వాడు తన ప్రాణాల్ని తీసివేస్తున్నాడు. ఎంత చెప్పినా అర్థం చేసుకోడు.

సేవకునికి కోపం వచ్చింది. వాడి కళ్ళు మెరిశాయి. సెర్గాడో ఇదంతా కనిపెడుతూ వున్నాడు. "దీన్ని దయ్యం ఎత్తుకుపోను. దీనికి కావలసిందేమిటి" అని ఆ సేవకుడు లోలోన భావిస్తున్నట్టు సెర్గాడో ఊహించాడు.

"డార్విన్ చెప్పిన వాదంలో చాలవరకు సత్యం వుంది. కాని అతిగా వెళ్ళాడు చాలచోట్ల"—అన్నాడు కోలోసోవ్ పడక కుర్చీలో వాలి, మత్తుగా దొరసానికేసి చూస్తూ.

"నీ సంగతేమిటి? వంశపారంపర్యంగా గుణాలు సంక్రమిస్తాయనే వాదాన్ని నువ్వు అంగీకరిస్తావుటయ్యా!"—దొరసాని సెర్గాడోను ప్రశ్నించింది. ఇంతసేపటినుంచీ అతడు మౌనంగా ఉండటం ఆమెకు నచ్చలేదు.

"ఉహుం—నేను ఒప్పుకోను". ఈ సమయాన ఏవేవో విచిత్రభావాలు అతనిలో రేగుతున్నాయి. బలిసిన కండరాలతో శరీర సౌష్ఠవం కలిగి

ఆ నౌకరుముందు కోలాసోవ్-పెద్ద నిమ్మకాయంత పొట్టతో, బట్టతలతో, కండపట్టని చేతులతో-నిజంగా కళాస్పృష్టిలాగే వున్నాడు. సిల్కుదుస్తుల్లో దాగిన దొరసాని అవయవాలుకూడా నిజరూపంలో అతని భావవీధిని పొడ చూపినవి. అతనికి అసహ్యం కలిగింది ఈ ఆలోచనల్ని రానీయకుండా తోసివేయ ప్రయత్నించాడు.

దొరసాని నెఖ్లూడోను చూచి, అతడు పరధ్యానంగా ఉండటం గమనించింది. "మిస్సీ నీకోసం చూస్తున్నది కామాలు, వెళ్ళి ఆమెను కలుసుకో. ఆమె నీతో చదరంగం ఆడాలనుకుంటోంది."

"ఆమె నేమీమీ ఆడాలనుకోటంలేదు. ఈమె పచ్చిఅబద్ధం చెబుతోంది" అనుకొన్నాడు నెఖ్లూడో-దొరసాని సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

ఇందాక భోజనశాలలో ఉండిన 40 యేళ్ళ కన్య అతనికి హాల్లో ఎదురైంది.

"జ్యూరీసభ్యుడుగా మీరు నిర్వహించిన విధులు మిమ్మల్ని చికాకు పరచినట్టు కనిపిస్తున్నది. ఔనా ?"

"ఔను, క్షమించాలి. నేను చాల నిరుత్సాహంగానే ఉన్నాను. నా నిరుత్సాహంతో ఇతర్లని బాధించటం నా కిష్టంలేదు."

"ఎందుకూ నిరుత్సాహం ?"

"ఆ మాట అడగద్దు. నేను చెప్పలేను."

"నిజం చెప్పాలంటారుగా మీరే. ఇదివరకు ఎన్ని భయంకరసత్యాలు చెప్పారు కాదు ! ఇప్పుడు చెప్పకూడదా ?...ఏం, మిస్సీ ఏమంటావు" న్నదామె అప్పుడే అక్కడకు వచ్చిన మిస్సీని తిలకించి.

"అప్పుడు ఆటల్లో వున్నాం. ఆటలో నిజం చెప్పవచ్చు. కాని వాస్తవికంగా మనం చాల చెడ్డవాళ్ళం-అంటే, నేను చెడ్డవాడినన్న మాట - నిజం చెప్పలేకపోతున్నాను" ఈ మాటలు గంభీరంగా ఉచ్చరించాడు నెఖ్లూడో.

ఆ నలభైయేళ్ళ కన్య అతని గంభీరతను గమనించలేదు. "మనము నుకు అంత చెడ్డవాళ్ళమో చెప్పండి."

"నేను నిరుత్సాహంగా వున్నానని చెప్పుకోటంకంటే చెడ్డపని మరొకటి వుండదు. నే నెప్పుడూ అలా చెప్పుకోను. కనుక ఎప్పుడూ ఉత్సాహంగానే వుంటాను. సరే, యిప్పుడు మాతో వస్తావా? నిరుత్సాహాన్ని పటాపంచలు చేస్తాం"- అన్నది మిస్సీ.

కళ్లెం తగిలించి జీను వెయ్యటానికి కొంతసేపే ముస్తాబుచేసుకొని పోయే గుర్రంవలె అయినాడు నెక్లాడో. కాని తమాయించుకొని, యింటికి వెళ్ళిపోవడానికి ఏదో సాకుచెప్ప బయలుదేరాడు. వీడ్కోలు తీసుకున్న సమయంలో మిస్సీ మామూలువలె, అతనిచేయిని పట్టుకు విడువలేదు. "నీ బాధ నీ మిత్రులకుకూడా బాధే అని గుర్తుంచుకో. రేపు వస్తావా?" అని అడిగింది.

"బహుశః రాను" అని పలికి నెక్లాడో వెళ్ళిపోయాడు.

"ఏమిటో ఆశ్చర్యంగా వుందే! ఇదేదో తెలుసుకోవాలి. ఏదైనా ప్రేమబాధేమో అనుకుంటాను. పాపం బహు సున్నితమైన మనస్సు కలవాడు." అన్నది నల్లబైయేళ్ల కన్య.

"ఏదో అధమరకపు ప్రేమ వ్యవహారమై వుంటుంది" అని మిస్సీ అనబోయింది. కాని అనలేదు. ఆమె కన్నుల్లో కాంతి మాయమైపోయింది. ముఖం పూర్తిగా మారిపోయింది. "మనందరికీ జీవితంలో మంచిరోజులు వున్నాయి; చెడురోజులూ ఉన్నాయి" అని మాత్రం పలికింది.

"అటువంటివాడుకూడా మోసంచేస్తాడా? ఇంతవరకు వచ్చాక అతడలా చేస్తే, అది దుర్మార్గమే" అని ఆ నల్లభైయేండ్ల కన్య అన్నది.

"ఇంతవరకు వచ్చినతర్వాత" అనే వాక్యభాగానికి సరియైన అర్థం మిస్సీకూడ చెప్పజాలదు. కాని అతడు తనలో ఆశలు రేకెత్తించినట్లు ఇంచుమించు పెండ్లాడుతానని వాగ్దానము చేసినట్లు ఆమెకు తెలుసు. ఈ విషయమై నిశ్చితమైన మాటలేమీ యిద్దరిమధ్య జరిగివుండలేదు. చూపులు, చిరునవ్వులు, సూచనలు మాత్రమే జరిగాయి. అయినా అతడు 'తనసొత్తే' నని ఆమె భావించింది. ఇప్పుడతన్ని పోగొట్టుకొనడం దుఃఖహేతువు.

## ౨౮

"ఛీ, ఛీ, సిగ్గుచేటు." అని పలుసార్లు అనుకున్నాడు సెక్లాడ్ యింటికిపోతూ. మిస్సీతో మాటాడినప్పుడు తనలో కలిగిన కంగుబాటు మరపుకు రావటంలేదు. అయినా తాను చేసిన తప్పేముంది? ఆమెతో తానేవిధంగానూ కట్టుబడిపోలేదే? పెళ్ళిచేసుకుంటానని మాట యివ్వలేదే! కాని ఒకరకంగా తానామెకు కట్టుబడియున్నట్టు, మాట యిచ్చినట్టుగానే లోలోపల స్ఫురిస్తోంది.

"ఛీ, ఛీ, సిగ్గుచేటు" అనుకున్నాడు సెక్లాడ్. మిస్సీతో తనకుగల సంబంధాన్ని మాత్రమే పురస్కరించుకొని కాదు-ప్రతిదీ సిగ్గుచేటుగానే కనిపించిందాతనికి. అదేమాట అనుకుంటూ తన యింటి వసారాలో అడుగు పెట్టాడు. రాత్రి భోజనం చేయనని నౌకరుకు చెప్పాడు. ఇంటికి వెళ్ళిపొమ్మన్నాడు కాని కార్నీ వెళ్ళలేదు. వాడు అదివరకే భోజనం తయారుచేసి టేబిల్ మీద అమర్చివుంచాడు. వాడిప్పుడు అవన్నీ తీసేస్తున్నాడు. అతన్ని చూస్తోంటే సెక్లాడ్‌కు కోపంగా వుంది. అందరూ కలసి తన్ను బాధిస్తున్నారనిపించింది. కార్నీ వెళ్ళిపోయిన తరువాత సెక్లాడ్ మేడమీదికి వెళ్ళి తేనీరు కలుపుకోబోతున్నాడు. అప్పుడు ఆగ్రనెవరో వస్తున్నట్టు అడుగుల చప్పుడయింది. వెంటనే సెక్లాడ్ అక్కడినుంచి పక్కగదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. ఆ గదిలోనే మూడు నెలల క్రితం తన తల్లి చనిపోయింది. అక్కడ రెండు విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. గోడలమీద తల్లిచిత్రం ఒకటీ, తండ్రిచిత్రం ఒకటీ వున్నాయి. చివరరోజుల్లో తల్లితో తనకుగల సంబంధాల్ని స్మరించాడు. అవి అసహజంగానే వుండేవి. అది కూడా సిగ్గుచేటైన విషయమే. ఆమెకు జబ్బుచేసినప్పుడు, చప్పున ఆమె చనిపోతేనే బాగుండుననుకున్నాడు. ఆమె బాధలు అంతమై, సుఖంగా ఆమె స్వర్గంలో వుండాలన్న సద్భావంచేతనే అలా కోరానని అనుకున్నాడు. కాని నిజానికి ఆమెబాధ చూడలేక, ఆమె చచ్చిపోతేనే తనకు సుఖం అని భావించి అలా కోరాడు.

గోడమీది తల్లి ఫోటోను 5000 రూబుల్సు యిచ్చి ఒక ప్రఖ్యాత చిత్రకారునిచేత గీయించాడు. మెడవొంపులు కనిపించేట్టుగా భుజముల

అందం ద్యోతకం అయ్యేలాగు పల్చటి దుస్తులు ధరించినట్లుగా చిత్రం గీశాడు. వక్షోభాగం సమున్నతంగా, ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. ఇలా అర్ధనగ్నంగా తనతల్లి చిత్రం గీయడం పాటుగా తోచింది. చిత్రంలో ఇంత శోభావంతంగా వున్న ఆ స్త్రీ మూడు నెలల క్రితం శల్యావశిష్టయై, ఆ గది లోనే కాదు, ఇంటినిండా దుర్వాసన కొట్టేలాగు వ్యాధిగ్రస్త అయింది. ఆ వాసన యిప్పుడుకూడా ముక్కుపుటాల్ని కొరికివేసింది. అవసానదశలో ఆమె అతని చేయిపట్టుకొని "బాబూ నేనేదైనా చేయవలసినపనిచేసి వుండకపోతే నన్ను నిందించకు సుమా" అంటూ కన్నీళ్లు కార్చింది.

ఇదంతా స్మరిస్తూ మరోసారి చిత్రంలోని తల్లి యొక్క అర్ధనగ్న వక్షసీమను చూశాడు. అప్పుడతనికి మిస్సీ జ్ఞాపకం వచ్చింది. ఒకసారి ఆమె ఇలాగే తన వక్షస్సీమ బయటికి కనుపించేలాగు దుస్తులు ధరించి అతన్ని తన గదిలోకి రమ్మని పిల్పించి, అప్పుడామె నృత్యమందిరానికి వెళ్ళబోతోంది. అందుకు తగిన దుస్తులు వేసుకుంది. ఆ దుస్తులలో తన్ను అందము చూడాలని పిలిచింది. ఇప్పుడామె మెడ, భుజాలు, వక్షము తలపుకు వస్తే రోతగా ఉంది. ఆమె తండ్రి సాక్షాత్తు ఒక జంతువు; ఎన్నో దుష్ట కృత్యాలు చేశాడు. రోగిష్టి తల్లి సౌశీల్యం అనుమానాస్పదం. ఈ అంశాలన్నీ అతనికి తలపుకు వచ్చి రోత కలిగించాయి. ఛీ, ఛీ, సిగ్గుచేటు !

తనకు స్వేచ్ఛ కావాలి. కోర్ట్సిగన్‌లతోడి యీ అసహజపు సంబంధాలనుంచి విడుదల పొందాలి. స్వేచ్ఛగా, హాయిగా ఊపిరి పీల్చుకో గలిగిన స్థితి కావాలి. రోము నగరానికి వెళ్ళిపోయి, తన చిత్రాన్ని గీసుకుంటూ కాలక్షేపం చేయకూడదూ ! కాని తనకు కళారంగంలో అంత పెద్ద తెలివితేటలేమీ లేవు. పోనీ, అలా విదేశాలకు పోతే హాయిగా ఊపిరి పీల్చుకునే అవకాశమైనా లభిస్తుందిగా ! మొదట కాన్‌స్టాంటినోపిల్‌కు వెళ్ళాలి. ఆ తరువాత రోమ్ నగరానికి-అయితే ఈ లోపున ప్లీడరుతో అన్ని విషయాలూ మాటాడి కేసు వొప్పజెప్పాలి.

వెంటనే అతని భావ వీధిలో మస్లావామూర్తి ప్రస్ఫుటంగా పొడ సూపింది. కోర్టులో తీర్పు విన్న తరువాత ఆమె వెక్కి వెక్కి యేడ్చిన దృశ్యం కన్నుల గట్టినట్లయింది. కాలుస్తున్న సిగరెట్టు నేలకు నొక్కి ఆర్పేశాడు. మరొకటి తీసి వెలిగించాడు. అటూ, ఇటూ పచార్లు ఆరంభించాడు.

ఒక్కొక్కటిగా—ఆమెతో తనకు కలిగిన అనుభవాలన్నీ జ్ఞప్తికి వచ్చాయి. తీవ్ర దారుణ ఉత్కంఠ తన్ను ఆవేశించిన నాటి రాత్రి గుర్తుకు వచ్చింది. తన పశువాంఛ తీర్చుకున్నా ఆశాభంగమే కలిగింది. తరువాత ఈస్టరు పండుగ నాటి తెల్లవారు ఝామున, చర్చిలో ప్రార్థనల అనంతరం చేకూరిన అనుభవం గుర్తుకు వచ్చింది. తెల్లని గౌను తొడుక్కుని, సిగలో ధనురాకారపు ఎర్రని ఆభరణం పెట్టుకున్న మస్లొవామూర్తిని స్మరించాడు. నిజంగా తానా రాత్రి ఆమెను హృదయపూర్వకంగా ప్రేమించాడు. ఆ ప్రేమ పవిత్రమైనది. అంతకు పూర్వం కూడా తానామెను ప్రేమించే ఉన్నాడు. మొదట వేసంగి సెలవుల్లో వ్యాసం వ్రాస్తూ మేనత్తల యింట్లో వుంటున్నప్పుడు కూడా తానామెను ప్రేమించాడు. అప్పటి తనస్థితి జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. ఆనాటి తన పవిత్రమైన ప్రథమ యవ్వన దశ స్మరించుకుని చింతాక్రాంతుడైనాడు.

ఆనాటి మస్లొవాకూ, పడుపుకత్తెల్లో ఉంటూ విషప్రయోగ నేరం మీద ప్రవాస శిక్షకు గురియైన ఈనాటి మస్లొవాకూ ఎంత వ్యత్యాసం ఉందో—ఆనాటి తనకూ, ఈనాటి తనకూ అంత వ్యత్యాసం ఉంది. ఆనాడు తాను స్వేచ్ఛాజీవి; నిర్భయుడు; అనర్ఘ్యవంతమైన భవిష్యత్తుకోసం అన్వేషిస్తున్నవాడు. ఈనాడు తానొక నిరుపయోగమైన—శూన్యమైన—విలాసమయ జీవితంలో నిర్బంధితుడు, ఇందులోనుంచి బైటపడదామన్న కోరికే లేదు లేదు; ఒకవేళ అలా కోరినా బైటపడే మార్గం లేదు—ఆనాడు తాను సగర్వంగా తలెత్తుకు తిరిగాడు; నిష్కల్మషంగా ఉండేవాడు; సత్యమే పలికేవాడు. ఈనాడు తాను భయంకరమైన అసత్యాలలో మునిగి ఉన్నాడు. ఈ అసత్యాలనే తన చుట్టూ ఉన్నవాళ్ళంతా సత్యాలని ఆమోదిస్తున్నారు. వాటిలోనే తాను కుత్తుకబంటి మునిగి ఉన్నాడు; వాటికే అలవాటు పడిపోయాడు. వాటిలోనుంచి బైటపడే మార్గం లేదు.

కోర్చగిన్ దొరసానితోనూ, ఆమె భర్తతోనూ తనకున్న సంబంధాన్ని తొలగించుకోటం ఎలాగ? మిస్సీ చేతుల్లోనుంచి విడుదల పొందటం ఎలాగ? సొంత భూ ఆస్తి అంటూ ఉండరాదని తాను విశ్వసించాడు. కాని తల్లినుంచి సంక్రమించిన పెద్ద భూ ఆస్తిని అనుభవిస్తూనే ఉన్నాడు. ఆశయానికీ, ఆచరణకూ మధ్య ఏర్పడిన ఈ వ్యాఘాత దోషాన్ని పోగొట్టు

కోటుం ఎలాగ? మస్లొవాపట్ల తాను కావించిన పాపానికి నిష్కృతి ఏమిటి? ఆమెను తాను ప్రేమించాడు. ఇప్పుడామెను వొదిలివేయవచ్చా? సైబీరియా నిర్బంధ కారాగారంనుంచి ఆమెను తప్పించేందుకు తాను ఒక ప్లీడరును మాట్లాడి, అతనికి ఫీజు చెల్లించినంత మాత్రాన సరిపోతుందా? డబ్బు చెల్లించి పాపపరిహారం పొందవచ్చా? తొలిసారి కలుసుకొన్న ఆనాడు ఆమెకు డబ్బు ఇచ్చాడు. ఆ సన్నివేశం ఇంకా పచ్చిగా బుర్రలో తటుక్కుమన్నది.

వసారాయందు ఆమెను ఆపి, వంద రూబుళ్ళ నోట్ల కట్టను ఆమె గౌను జేబులో పెట్టేసి గబగబా పరిగెత్తి పోయినాడు ప్రాకారంలో. అంతటి బాధ ఇప్పుడూ ప్రత్యక్షమైనది. "నీచుడు, దుర్మార్గుడే అలాంటిపని చేస్తాడు. ఆ దుర్మార్గుడను, నీచుడను నేనే" అని ఆవేశంలో పైకే ఉచ్చరించాడు. కాసేపు ఆగాడు. తాను నిజంగా నీచుడూ, దుర్మార్గుడూనా...? కాదు తనకంటే నీచుడూ, దుర్మార్గుడూ ఇంకెవరు ఉన్నారు...? ఇదొక్కటేనా? కోర్చగిన్ దొరసానితోనూ, ఆమె భర్తతోనూ తన సంబంధాలు నీచమైనవి కాదూ? డబ్బుమీద తనకుగల ప్రీతి అసహ్యకరమైనది కాదూ? తల్లి యిచ్చి పోయిన డబ్బును స్వేచ్ఛగా ఖర్చుపెట్టుకుంటున్నాడే! అది స్వార్జితం ఎలాటిది? సోమరియై, సౌఖ్యంగా బతుకుతున్నాడు. ఇన్ని మాటలెందుకు? మస్లొవా యెడ తాను కావించిన అపచారం చాలు. తాను నీచుడు, దుర్మార్గుడు అనటానికి అంతకన్నా ఏంకావాలి...? ప్రపంచం తన్ను గురించి ఎలాగైనా అనుకోని. తాను ప్రపంచాన్ని మోసగిస్తే మోసగించవచ్చు. తన్ను తాను మోసగించుకోలేడు.

కోర్చగినా దంపతుల యెడల, కాన్ని యెడల, మిస్సీ యెడల— అందరి యెడలా తనకు అసహ్యం కలిగింది. ఎందువల్ల? తనమీదే తనకు అసహ్యంకలిగింది - ఎందువల్ల? తనమీదే తనకు అసహ్యం ఉంది. దీని ఫలితమే ఇతర్లపై అసహ్యం. ఇలాగ తన నైచ్యాన్ని తానే అంగీకరించటంలో ఒక రకమైన బాధ ఉన్నా ... సంతోషప్రదమూ, శాంతిదాయకమూను.

నెహ్లూదొవ్ జీవితంలో 'ఆత్మపరిశుద్ధి' అనేది ఒకేసారి కాదు, పలుసార్లు జరుగుతూ ఉంటుంది. అంటే—కొంతకాలం ఏవో ప్రభావములకు లోనై

సత్యపథమునుంచి వైదొలగి నడుస్తాడు. చివరకు తెలుసుకుని తన జీవితంలో చేసుకున్న తప్పులంతా కడుక్కుని, మళ్ళీ కొన్ని సిద్ధాంతాల్ని ఏర్పరచుకుంటాడు; తదనుగుణంగానే నడుస్తానని నిశ్చయించుకుంటాడు. ఈ సారి ఇక తప్పుడు దారికి దిగను అని గట్టిగా సంకల్పిస్తాడు, డైరీ రాయటం మొదలుపెడతాడు. ఇలా ఆరంభించిన కొత్త జీవితం మారదు అని ఆశిస్తాడు. దీన్నే అతడు 'జీవితంలో నూతనాధ్యాయం' అంటాడు. కాని ప్రతిసారీ ప్రపంచపు మాయావాగులలో పడిపోతూ ఉంటాడు. పూర్వంకన్నా అధఃపతితుడౌతూ ఉంటాడు.

ఇటువంటి ఆత్మపరిశుద్ధి అతనికి చాలాసార్లు అయింది. మేనత్తలతో వేసంగి గడుప వచ్చినప్పుడు మొదటిసారి. దాని ఫలితం కొన్నాళ్ళు ఉంది. తరువాత సివిల్ సర్వీసు వొదిలిపెట్టి, యుద్ధసమయంలో ఆత్మత్యాగానికి కూడా సిద్ధమై మిలిటరీలో చేరినప్పుడు రెండోసారి – కాని ఈ సారి త్వరలోనే పతితుడైనాడు. తరువాత మళ్ళీ మిలిటరీ ఉద్యోగం విడిచి కళాభిరుచితో విదేశాలకు వెళ్ళినప్పుడు మరొకసారి ఆత్మపరిశుద్ధి చేసుకున్నాడు.

అప్పటినుంచి ఇప్పటివరకూ చాలాకాలం గడిచింది. ఈ మధ్య ఎప్పుడూ ఆత్మపరిశుద్ధి జరుగలేదు. కాబట్టి అంతరాత్మ ఆదేశాలకూ, గడుపుతున్న జీవనవిధానానికీ పెద్దఅంతరం ఏర్పడివుంది. ఈ మహాదంతరాన్ని చూచి గాభరాపడిపోయాడు. ఇక 'నూతనాధ్యాయం' మనేది అసంభవం అనుకున్నాడు. "అనేకసార్లు ఆత్మపరిశుద్ధి చేసుకున్నావు కాదూ? ఏమి లాభం కలిగింది?" అని ఒక శబ్దం నిలవదీసి అడిగింది అతనిలోంచి "మరొకసారి ప్రయత్నించి మాత్రం ఏం ప్రయోజనం? నువ్వు ఒక్కడివేనా? అంతా అంతే. జీవితం అంటే అంతే" – అని గొణిగింది ఆ వాణి. కాని సత్యము, శాశ్వతము, అనంతము అయిన ఆధ్యాత్మిక-అంతర్వాణి నెఖ్లూడోలో జాగృతమైంది. అందుకోవలసిన ఆదర్శానికీ, ఉన్న అధమస్థితికీ మహాదంతరమే ఉన్నా-అతనిలో మేల్కొన్న ఆధ్యాత్మికశక్తికి నిరుత్సాహం కలగలేదు.

"ఏమైనా సరే, ఇప్పుడు నన్ను బంధించివున్న కట్లు తెంపేస్తాను-సత్యమే చెబుతాను. మిస్సీతో నిజం చెప్పేస్తాను. నేను అవినీతిపరుడిననీ, ఆమెను పెళ్ళాడజాలననీ చెప్పేస్తాను-ఆమె తల్లితోకూడా చెప్పేస్తాను...

ఆమెకు చెప్పేదేమీ లేదు. ఆమె తండ్రితో చెప్పేస్తాను; నేను వట్టి ధూర్తుడిననీ, ఇన్నాళ్ళనుంచీ వాళ్ళను మోసగిస్తున్నాననీ-సంక్రమించిన ఆస్తిని ఆశయాలకు అనుగుణ్యంగా ఏదో చెయ్యాలి. మస్లోవాదగ్గరకు పోయి... ఆమె యెడల మహాపాపం చేశానని... నేను వట్టి నీచుణ్ణని చెబుతాను; క్షమాపణ వేడుకుంటాను..."

"ఔను, ఆమె క్షమాపణ యాచిస్తాను. అవసరమైతే ఆమెను వివాహం చేసుకుంటాను" ఒక చిన్న పిల్లవాడిలా చేతులు కట్టుకున్నాడు. కళ్ళు పైకెత్తి ఎవరినో ఉద్దేశించి ఇలా పలికాడు—"ప్రభూ! నా కిప్పుడు సాయపడు. మంచి మార్గాన్ని ప్రబోధించు. నీవు నాలో ఉపవిష్టుడవు కావాలి; నన్ను పవిత్రుని చేయాలి."

ఈ ప్రార్థన ఫలితం ఇదివరకే చేకూరింది. భగవంతుడతనిలో మేల్కొన్నాడు. అతను భగవంతునితో తాదాత్మ్యాన్ని అనుభవించాడు; స్వేచ్ఛను పరిపూర్ణతను, ఆనందాన్ని చూరగొన గలిగాడు. కర్మపరత అతనికి లభించింది. అతని కన్నులు అశ్రుపూర్ణములైనాయి. ఇన్నాళ్ళనుంచీ అతనిలో నిద్రాణమై యున్న ఆధ్యాత్మికశక్తి మేల్కొన్నందున కలిగిన మహదానంద ప్రస్రవాలు ఆ కన్నీళ్లు.

శరీరం వేడెక్కినట్టయింది. కిటికీ తలుపులు తెరచాడు. అవతల తోట ఉంది. బైట ప్రశాంతంగా చక్కని వెన్నెల్లు కాస్తోంది. చెట్ల ఆకులు కాస్త గలగల శబ్దించాయి. ఆమీద అంతా నిశ్శబ్దం. అతను నిల్చున్న కిటికీకి ఎదురుగావున్న ఆ పట్టాపేసిన నేలమీద ఒక ఆకు రాలిన చెట్టు నీడ స్పష్టంగా కనిపిస్తోంది. అటు ఎడమవైపు గుర్రపుశాల పై కప్పు వెన్నెల్లో తెల్లగా ప్రకాశిస్తోంది. తోట చుట్టూ ఉన్న ప్రహారీగోడ నీడ చెట్ల కొమ్మల సందుల్లోనుంచి దృశ్యమాన మౌతున్నది. గుర్రపుశాల పై కప్పుకేసి, వెన్నెల్లోని వనశోభను, చెట్ల నీడల్నీ చూస్తూ... ఉల్లాసాన్ని యిచ్చే ఆ మంద పవనాల్ని తనివితీర తాగాడు.

"ఆహా! ఎంత హాయి! భగవంతుడా, ఎంత హాయి!" అన్నాడు. తనలో సాగిపోతున్న పరివర్తనను లక్షించే అలా పలికాడు.

మస్లోవా తిరిగి తన ఖైదుగది చేరేప్పటికి సాయంత్రం ఆరుగంటలైంది. నడక అలవాటులేదు. కంకర రోడ్డుమీద ఆనాడు పది మైళ్ళదాకా నడిచింది. పాదాలు నొప్పులు పెడుతున్నాయి. కఠినశిక్షను విధిస్తూ కోర్టు యిచ్చిన తీర్పు ఆమెను కుంగదీసింది. పైగా కడుపులో ఆకలి. మొదట కాసేపు విచారణ ఆపి, అందరూ బైటికి పోయినప్పుడు సైనికులు తాము తెచ్చుకున్న రొట్టెలూ, ఉడకబెట్టిన గుడ్లు తింటున్నారు. అది చూసి మస్లోవాకు నోరూరింది; తనకూ ఆకలిగా ఉన్న సంగతి తెలుసుకుంది. కాని వాళ్ళను అడుక్కోవటం పరువుతక్కువ పని అని ఊరుకుంది. మరి మూడు గంటలైన తర్వాత పూర్తి ఆకలి కాస్తా చచ్చిపోయింది. నీరసంగా మాత్రం ఉంది. తరువాత కోర్టు తీర్పు పిడుగు పాటు లా వచ్చింది. మొదట తీర్పును అపార్థం చేసుకున్నానేమో ననుకుంది. తనకు ప్రవాస శిక్ష పడుతుందని ఎన్నడూ అనుకోలేదు, తన చెవుల్నే తాను నమ్మలేక పోయింది. కాని జడ్జీలు, జ్యూరీలు ప్రశాంతంగా కూచున్నారు. వాళ్ళందరికీ ఈ తీర్పు సహజంగానే కనిపించింది; అనుకుంటూ ఉన్నదే. అప్పుడామెకు వొళ్లు మండి పోయి బిగ్గరగా తాను నిర్దోషినని అరిచింది. ఆ అరుపు కూడా వాళ్ళకు సహజమే అనిపిస్తుంది. చెప్పిన తీర్పును మార్చగల శక్తి ఆ అరుపుకు లేదని తెలుసుకున్న తర్వాత నిస్పృహతో వెక్కి వెక్కి ఏడవసాగింది. ఈ జరిగిన ఘోర అన్యాయానికి బలియైపోవలసిందే. గత్యంతరం లేదు—అని కుంగిపోయింది.

ఇంతకూ ఆశ్చర్యకరమైన సంగతేమంటే—తనవంక సాపేక్షగా చూసిన ఆ యువకులే (యువకులు కాకపోయినా ముసలివాళ్ళు మాత్రం కారు) తన కిటువంటి శిక్ష విధించారు. విచారణ కాకముందు తాను ఖైదీల గదిలో కూచుంది. అప్పుడు వీరంతా ఏదో వంకపెట్టుకుని అటుకేసి పోతూనో, లేక గదిలోకి వచ్చో తనకేసి అదేపనిగా, సాపేక్షగా చూశారు. ఆ తరువాత వాళ్లు ఏ కారణంచేతనో తనకు ప్రవాసశిక్ష విధించారు. మొదట ఆమెకు ఏడుపు వచ్చింది. కాని క్రమేణా మనిషి మొద్దుబారిపోయి, నిశ్చలంగా ఖైదీల గదిలో కూచుంది తిరిగి జైలుకు తీసుకుపోయేందుకు సైనికులు వచ్చే వరకూ. సిగరెట్లు కాల్చాలన్న రుచి మాత్రం బాధిస్తోంది. ఈ సమయంలో

సైమన్, యూఫీమియాలూ నవ్వారు. మాకర్ గానే యూఫీమియా మస్లోవాను బడబడ తిట్ట నారంభించింది.

“ఊఁ. ఏం లాభం పొందగలిగావు? నేరస్థురాలివి కావని ఋజువు చేసుకోగలిగావా? చింకిరి గుడ్డలవాళ్ళా? దొరసాని తీర్పే పొందావులే! సైబీరియాలో నీ కీ కులుకులన్నీ అణిగిపోతాయిలే.”

మస్లోవా నిశ్శబ్దంగా అలానే కటకటాలలోకి చూస్తూ కూచుంది.

“ఎందుకు నన్ను బాధిస్తావు? నిన్ను నే నేమన్నా అన్నానా?” అని మాత్రం పలికింది. మరి మాట్లాడలేదు. పిదప జైలర్లు వచ్చి సైమన్ యూఫీమియాలను తీసుకుపోయారు. అప్పుడు మస్లోవా సుఖంగా కాస్త నిశ్వసించింది, ఎవరో ఒక సైనికుడు మూడు రూబుల్సు చేతిలో పెట్టుకొని తెచ్చాడు. “నువ్వేకదూ, మస్లోవా అంటే. ఒకామె నీ కిమ్మంది” అంటూ ఆ డబ్బు ఆమె కిచ్చాడు.

“ఎవరామె?”

“నువ్వు డబ్బు తీసుకో, నేను వెళ్ళిపోవాలి.”

పడుపుకొంపటి యజమానురాలు కెటీవా పంపించిందా డబ్బు. కోర్టు మూసివేశాక “మస్లోవాకు కాస్త డబ్బు ఇవ్వొచ్చా?” అని కోర్టు గుమాస్తాను అడిగి–అతడు అనుమతించగా–ఆమె మూడు రూబుల్సు తీసి యిచ్చింది. గుమాస్తా ఆ డబ్బును నౌకరు చేతికి ఇచ్చి పంపించాడు. “మస్లోవాకు ఇవ్వాలి. అంతా ఇవ్వాలి సుమా!” అన్నది కెటీవా. ఆమె అంత అపనమ్మకంగా మాట్లాడినందుకు నౌకరుకు కోపం వచ్చి మస్లోవాకు సరైన సమాధానం చెప్పకుండా దాటిపోయాడు.

డబ్బుచూచి మస్లోవా సంతోషించింది. ఇప్పుడు తనకు కావలసిన సిగరెట్లు కొనుక్కోవచ్చు. సిగరెట్టు పొమ్ముకోసం తహతహలాడుతోంది ప్రాణం. బైట యెవరో పొగ పీలుస్తున్నారు. ఆ వాసన గాలికి గదిలోకి కూడా వచ్చింది. ఆమె నాసికారంధ్రాలు జల్లుమన్నాయి. కాని చప్పున బైటికిపోయే యోగ్యత కనిపించలేదు. ఆమెను తీసుకుపోవచ్చునన్న ఆజ్ఞ సెక్రటరీదగ్గర్నుంచి రావాలి. కాని ఆయనగారు ఖైదీలసంగతే మర్చిపోయాడు.

ప్రభుత్వం నిషేధించిన వ్యాపాన్ని గురించి ఒక ప్లీడరుతో వివాదపడు తున్నాడు.

అయిదుగంటలకు ఆజ్ఞ వచ్చింది. సైనికులు ఆమెను తీసుకుని బయలు దేరారు. వీధిలోకి వచ్చాక మస్లోవా ఒక సైనికునికి డబ్బిచ్చి రొట్టెలు, సిగరెట్టు తెచ్చిపెట్టమని అడిగింది. సైనికుడు నవ్వాడు. డబ్బు తీసుకుని ఆమె కోరినవి తెచ్చియిచ్చాడు; మిగిలిన చిల్లర ఆమె కిచ్చేశాడు - కాని దారిలో సిగరెట్టు పీల్చరాదని నిషేధించటంవల్ల, తీరని కుతితో నడవ సాగింది. చివరకు జైలుగేటు సమీపించారు. రైలుమీద తెచ్చిన నూరు మంది ఖైదీలను లోపలికి తీసుకుపోతున్నారు. అంతమంది రకరకాల ఖైదీలు గుంపుగా వెడుతోంటే గలగలశబ్దం లేచింది; దుమ్ము రేగింది. ఆ ఖైదీలందరూ లోనికి వెడుతూ మస్లోవాను సాపేక్షగా చూచినవాళ్ళే. కొందరామెను రాచుకుపోవటానికికూడా ప్రయత్నించారు.

"భలేపిట్ట ఉందిరా ఇక్కడ!" అన్నాడొకడు.

మరొకడు ఆమెను కన్నుకొట్టి పలుకరించబోయాడు.

నల్లటిమనిషి ఒకడు-కాళ్ళకు సంకెళ్లు ఉన్నాయి - ఆమెముందు ఆగి, చూచిమాటి ఆట్టె కావలించుకున్నాడు. ఆమె అతన్ని బలంగా తోసేసింది. "ఎందు కింత కోపం? నన్నెరగవూ? గొప్పకు పోతావెందుకు? రా, రా" అంటూ నవ్వుతూ పళ్ళు చూపాడు వాడు.

"ఏమిటిరా, కుంకా? అది?" - అంటూ వెనుకనుంచి ఇన్‌స్పెక్టరు గర్జిస్తూ వచ్చాడు; అప్పుడు వాడు భయపడి ముందుకు సాగిపోయాడు.

"ఇక్కడేం చేస్తున్నావు?"—అని ఇన్‌స్పెక్టరు మస్లోవాను ప్రశ్నించాడు.

తాను అప్పుడే కోర్టునుంచి తీసుకొనిరాబడినట్లూ; అలసిపోయి, మాటాడలేకుండా ఉన్నాననీ ఆమె చెప్పదలచుకుంది.

"ఈమెను ఇప్పుడే కోర్టునుంచి తీసుకొచ్చామండి"—అన్నాడు సైనికుడు ఇన్‌స్పెక్టరుకు సలాం చేస్తూ.

"అయితే పెద్దవార్డరుకు వొప్పగించేయండి, ఇక్కడెందుకూ? ఇటు వంటి వ్యవహారాలు నాటకానికి పెక్తే ఇక్కడ"—అంటూ పెద్దవార్డరు కేక వేశాడు.

పెద్దవార్డరు సాకొలోవ్ వచ్చాడు. మస్లావాను ఒక్క గెంటుగెంటి తనవెంటనే రమ్మని సైగచేశాడు. స్త్రీల వార్డులో ప్రవేశించింది మస్లోవా. వార్డరు ఆమెను సోదా చూశాడు. నిషేధవస్తువులేవీ ఆమెదగ్గర కనిపించ లేదు. సిగరెట్టు పెట్టెను రొట్టెల ముక్కలో దాచేసిందామె. ఉదయాన ఆమెను ఏ గదిలోనుంచి బైటికి తెచ్చారో ఆ గదిలోనికే ఆమెను పొమ్మని తలుపువేశారు.

## 11

## ౩౦

మస్లోవా ఉన్న కారాగారం పెద్దదే. 21 అడుగుల పొడవు, 16 అడుగుల వెడల్పుగల గది. రెండుకిటికీలు ఉన్నాయి. నిండా బల్లచెక్కలున్నాయి. ఖైదీలు పడుకోవలసింది వాటిమీదనే - ఎడమవైపున. ఒక పెద్ద నీళ్ళతొట్టి ఉంది. ఇందులో 15 మంది ఖైదీలు ఉన్నారు. ముగ్గురుపిల్లలు కూడా ఉన్నారు. బాగా చీకటిపడలేదు. అప్పుడే ఇద్దరు స్త్రీలు పడక వేశారు. వారిలో ఒకతె క్షయరోగి. ఏదో దొంగతనం చేసిందని ఆమెను ఖైదుచేశారు. ఆమె నిద్రపోవటంలేదు. కళ్ళు తెరచుకుని అలాగే పడుకుని ఉంది. గొంతుకు ఎగదట్టుతోన్న కఫాన్ని ఆపుకుంటూ దగ్గుల్ని అణచు కుంటూ పడుకుంది-మరొకతె పాస్‌పోర్టు లేనందుకుగాను అరెస్టు అయింది.

మిగతావాళ్ళు చాలామంది కిటికీలోనుంచి కొత్తగా తీసుకురాబడు తోన్న ఖైదీలకేసి చూస్తున్నారు. ముగ్గురుమాత్రం కుట్టుపని చేసుకుంటు న్నారు. వారిలో కోరబ్లెవా ఒకతె. ఉదయాన మస్లోవాను కోర్టుకు సాగ నంపుతూ సలహాయిచ్చినది ఈమే. పొడుగ్గా ఉంటుంది. గంభీరమైన ముఖం. కణతలదగ్గర జుట్టు నెరిసింది-గండకించిన గండభాగం. కనుబొమలు కలిసే ఉంటాయి. ఆమెభర్త తనకూతుర్ని కామించాడని అతన్ని చంపేసింది - ఆ నేరాని కామెకు సైబీరియా ప్రవాసశిక్ష విధించారు. ఆ గదిలోని ఖైదీల కామె నాయకురాలైంది. వాళ్ళ సహాయంతో అక్కడే ఆమె సారా వ్యాపారం సాగించగలుగుతోంది. ఆమె పక్కన కూచున్న యువతి

కాన్వాస్ సంచీ అల్లుతోంది—ఒక రైల్వే గేటు కాపలావాని భార్య. రైలు పోతున్నప్పుడు జెండా పుచ్చుకుని రాలేదుట. అందువల్ల ఒక చిన్న ప్రమాదం సంభవించింది. తత్ఫలితంగా మూడు నెలల కారాగారశిక్ష అనుభవిస్తోంది. ఆమె పొట్టిగా ఉంటుంది. చట్టిముక్కు. నల్లని చిన్నికళ్ళు, కొంచెం వదులుబోతు. గుండె మెత్తన, కష్టపనిలో వున్న మూడవ ఖైదీ థియొకోసియా. వయసు చిన్నది. చాల అందగత్తె. పసిపిల్లల కళ్ళలాంటి ఆమె నేత్రాలు ప్రభావంతాలు. నిగనిగలాడే సొగవెంట్రుకల్ని చుట్టి ముడివేసుకుంది. భర్తను విషంపెట్టి చంపటానికి ప్రయత్నించిందన్న నేరంమీద ఆమెను జైల్లో పెట్టారు. ఆమెకు పదహారోయేట పెళ్ళి అయింది. ఆమె యిష్టం తెలుసుకోకుండా ఆ పెళ్ళి చేశారు. పెళ్ళి అయిన కొద్దిరోజులలోనే ఈ నేరం చేసింది. మొదట 'బేలు' మీద వొదిలిపెట్టారు. అప్పుడామె ఎనిమిదినెలలు ఇంటిదగ్గరే ఉంది. ఈ కాలంలో భార్యాభర్తల మధ్య పొరపులు పోయాయి. ఎంతో సఖ్యత ఏర్పడింది. ఇద్దరి ఆత్మలూ కలిసిపోయాయి. భర్తకు, మామగారికి, ముఖ్యంగా అత్తగారికి ఆమె అంటే ఎంతో యిష్టత ఏర్పడింది. ఆమెను విడుదల చేయించుకోవాలని విశ్వప్రయత్నాలు చేశారు. కాని లాభంలేకపోయింది. సైబీరియాలో నిర్బంధ బానిసగా ఆమెను పంపించటానికి తీర్పు అయింది. ఆమె చలాకీపిల్ల; ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. ఆమెకు మస్లొవాతో మంచి సాన్నిహిత్యం ఏర్పడింది. ఇద్దరూ బల్లచెక్కలు పక్కపక్కనే వేసుకుని పడుకుంటారు ఎప్పుడూ. మస్లొవాకు పరిచర్య చేయటం తన విధిగా భావిస్తుంది, థియొకోసియా.

పనిపాటలేమీ లేకుండా ఇద్దరుస్త్రీలు తమ బల్లచెక్కలమీద కూచుని వున్నారు. ఒకతెకు 40 ఏళ్ళు ఉంటాయి. ముఖం పాలిపోయింది. ఒకప్పుడు చాల అందగత్తెయై ఉండవచ్చు—ఒక పసిబిడ్డను గుండెకదుముకుని కూచుంది. ఒకసారి ఈమె మేనల్లుణ్ణి సైన్యంలో చేర్చటానికి బలవంతాన గుర్రంమీదెక్కించుకుని తీసుకుపోతున్నారు పోలీసులు. గ్రామస్థులంతా అది అక్రమమని అడ్డగించారు. ఈమె...ఆ కుర్రవాణ్ణి మోసుకుపోతున్న గుర్రపు కళ్ళాల్ని పట్టుకుని ఆపేసిందట. ఊళ్లో రైతులంతా పోలీసులదే తప్పు అని సాక్ష్యం ఇచ్చినా ఆమెకు జైలుశిక్ష తప్పలేదు. మరొకతె ముసలిది. నడుము వొంగిపోయింది. తలంతా ముగ్గుబుట్ట అయింది. అటూ యిటూ గంతులు

ఎవరి వంకా చూడటంలేదు. గోడవరసగా నడిచి, టక్కున వెనక్కు తిరుగు తోంది. తన పసిపిల్లను నూతిలో వేసిందని ఆమెమీద నేరం.

౨౧

మస్లోవా గదిలో ప్రవేశించే సరికి అందరూ ఆమెవైపు చూశారు. మతోద్యోగి కూతురు కూడా పచార్లు ఆపి, కనుబొమలెత్తి ఆమెవైపు చూసింది. అయితే ఏమీ పలుకరించలేదు. మళ్ళీ యథాపూర్వంలా పచార్లు సాగించింది.

సంచీ అల్లుతోన్న కొరాబ్లెవా సూదిని సంచికి గుచ్చేసి, కళ్ళద్దాలలో నుంచి మస్లోవాకేసి ప్రశ్నార్థకంగా చూసింది. "అయ్యో, భగవంతుడా! మళ్ళీ వచ్చావేం? నిన్ను వొదిలేస్తారనుకున్నా సుమీ" అన్నదామె కటువైన పురుష కంఠస్వరాన. కళ్ళద్దాలు, అల్లుతోన్న సంచీ తన చక్కబల్ల మీద పెట్టింది.

"నిన్ను తప్పకుండా వొదిలేస్తారనే నేనూ, ఆ ముసలమ్మ అనుకున్నాం. ఒక్కొక్కప్పుడు అలాగూడా జరుగుతుంది, నిజమే. ఒక్కొక్కప్పుడు డబ్బుకూడా ఇచ్చి వొదిలేస్తారు. అదృష్టాన్నిబట్టి ఉంటుంది. ఇంతకూ మేం అనుకున్నదంతా తలకిందైనట్టుందే! భగవంతుని ఉద్దేశం వేరు కామాలు!"–అన్నది దీర్ఘాలు తీస్తూ రైలుగేటు కాపలావాని భార్య.

"ఏమిటీ? నీకుకూడా శిక్ష పడిందా? నిజమే!"—థియొడోసియా ఆత్రుతగా ప్రశ్నించింది, మస్లోవాకేసి తన పసిపిల్లలవంటి నేత్రాలతో చూస్తూ. శోభావంతమైన ఆమె మోముతీరు మారిపోయింది. బావురున ఏడవబోతున్నట్టు కనిపించింది.

మస్లోవా ఎవరికీ ఏ విధమైన జవాబూ చెప్పలేదు. తన స్థానంలో వెళ్ళి కూచుంది, కొరాబ్లెవాకు చేరువగా.

"పొద్దున్నించీ ఏమన్నా తిన్నావా?"—అంటూ థియోడోసియా లేచి ఆమెదగ్గరకు వచ్చింది.

రాగిజుట్టు కురూపి వొళ్ళంతా కదిలిపోయేలాగు నవ్వుతూ-"చలిమిడి గుడ్డెలా తల గీయించుకుని వాడు చూడు ఏంచేస్తున్నాడో!" అంటూ కిటికీ చువ్వలు పట్టుకుని బండబూతులేమో ఆడుతోంది.

"ఛీ, ఆ లావాటి బోండాం ఎలా పగలబడి నవ్వుతోందో!" అని విసుక్కుని కోరాబ్లేవా మస్లోవా కేసి తిరిగి "ఎన్నేళ్ళేమిటి?" అని ప్రశ్నించింది.

"నాలుగు" మస్లోవా చెక్కులమీద కన్నీళ్ళు కాలువలు కట్టాయి. ఒక కన్నీటి చుక్క సిగరెట్టుమీద పడింది. ఆమె ఆ సిగరెట్టును కోపంగా నేలమీద నలిపి విసిరిపారవేసి మరొకటి తీసింది.

రైలుగేటు కాపలావాని భార్యకు సిగరెట్ పీల్చే అలవాటు లేదు. అయినా మస్లోవా పారేసినదాన్ని తీసి, వంకరపోతే సరిచేస్తూ కూచుని వాగుతూనే ఉంది.

"చూడమ్మాయి! సత్యాన్ని పెంటకుప్పమీద పారేసి, వాళ్ళను తోచినట్టు ఆడుతూ ఉంటారు. నిన్ను వొదిలిపెట్టేస్తారనే మేమిక్కడ ఊహిస్తూ కూచున్నాం. నిన్ను వొదిలేస్తారని కోరాబ్లేవా చెప్పింది. నాకు మాత్రం అనుమానంగానే ఉంది. వాళ్ళు నీమీద దెబ్బ కొడతారనే అనుకున్నాను. అట్లాగే అయింది" అంటూ ఏమేమో వాగింది, తన కంఠ మాధుర్యానికి తానే ఆనందపడుతూ.

ఇంతసేపటినుంచీ కిటికీవద్ద నిల్చున్న స్త్రీలు కూడా మస్లోవా దగ్గరకు [illegible]సాగారు. బైటి కోలాహలం అణగిపోయింది. లైసెన్సు లేకుండా సారాయం అమ్ముతోన్నందుకు జైల్లో పడ్డ యువతి, ఆమె ఏడేళ్ళ కూతురూ మొదట వచ్చారు. "అంత కఠినశిక్ష వేశారే, మరీను" అన్నదామె గబగబా మేజోళ్లు కుట్టుకుంటూ, మస్లోవా పక్కనే చేరగిలబడి.

"వెయ్యరూ మరి! డబ్బులేనివాళ్ళం గనుక వేస్తారు. డబ్బుండి, వాళ్ళ ఎత్తుల్ని తలతన్నే ఎత్తులు ఎత్తగల ప్లీడర్ని పెడితే...మస్లోవాను వొదిలేసేవారే. ఆయన పేరేమిటీ? వొంటినిండా వెంట్రుకలు, పొడుగాటి ముక్కు—ఆయన్ను గనుక పట్టివుంటే నిన్ను తప్పకుండా విడిపించేవాడే.

"అత్తగార్ని పడేశావా? అమ్మో! వెయ్యి రూపాయిలకు తక్కువైతే నీ ముఖాన ఉమ్మి కూడా వెయ్యను" అన్నది ఒకర్తె.

ఇల్లు తగులబెట్టినందుకు జైలుకి వచ్చిన ముసలమ్మ అందుకుని ఇలా అన్నది. "నువ్వు కూడా దురదృష్టవంతురాలివేనమ్మా...! చూడూ, ఆ కుర్రాడి పెళ్ళాన్ని మరిగి వాడ్ని జైల్లో వెయ్యటం; నన్ను కూడా ఈ ముసలితనంలో..." ఆమె తనకథ ఇలా చెప్పటం మొదలెట్టాది "నిష్కృతి వేశ్యావాటిక, లేకపోతే జైలు. ఈ రెండూ అపోహలు తప్పేవరకూ ఆగవు" అని ముగించింది.

"అంతేనమ్మా అంతే" అన్నది లైసెన్సు లేకుండా సారాయం అమ్మి జైలుకు వచ్చిన స్త్రీ. ఇంతలో పిల్లదాని తలమీద దృష్టి పడ్డది. మేజోళ్లు కుట్టటం ఆపి, సామాన్లు అవతల పెట్టేసి, పిల్లదాన్ని ఒళ్ళోకి తీసుకుని జాగ్రత్తగా పేలు చూస్తూ–"సారాయం అమ్ముకొంటున్నామంటే ఎందుకమ్ముతున్నాం? పిల్లల్ని పోషించుకోవటం ఎలాగని?" అన్నది.

ఈ మాటలు వినగానే మస్లోవాకు కాస్త సారాయం దొరికితే బాగుండు ననిపించింది.

గోను అంచుతో కన్నీళ్లు తుడుచుకుంటూ "కాస్త సారాయం ఏమన్నా?" అని అడిగింది కొరాబ్లేవాను.

"సరే, కానీ" అన్నది కొరాబ్లేవా.

## ౩౨

మస్లోవా రొట్టెల పొట్లంలో దాచి తెచ్చిన డబ్బుతీసి కొరాబ్లేవాకు ఇచ్చింది–రెండు రూబుల్సు యాభై కోపెక్కులు. అది తీసుకుని, పై కిటికీ వరకూ ఎగబాకింది ఆమె. ఒక చిన్న సారాయం బుడ్డీ దాచి పెట్టిందక్కడ. మస్లోవా చుట్టూ మూగినవాళ్లు చాలామంది తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు. మస్లోవా అంత దూరం నడిచి వచ్చినందువల్ల దుమ్ము కొట్టుకున్న దుస్తుల్ని దులుపుకుని రొట్టెల్ని తినటానికి కూచుంది.

"నీ తేనీరు నీకే అట్టిపెట్టాను. కాని చల్లారిపోయి ఉంటుంది" అంటూ థియోడీసియా అలమరలోనుంచి తేనీరు పోసిపెట్టిన పాత్ర, ఒక కప్పు తెచ్చింది. ఆమె చెప్పినట్టు అది బాగా చల్లారిపోయింది. తేనీటి సువాసనే లేదు. పాత్ర కంపు కొడుతోంది. అయినా అదే యింత కప్పులో పోసుకుని తాగుతూ, మధ్య మధ్య రొట్టె నములుతూ ఉంది. "ఓహో నువ్వు ఇక్కడే ఉన్నావా బాబూ!" అంటూ తన మూతికేసి చూస్తోన్న ఆ నాలుగేళ్ళ పిల్లవానికి రొట్టెముక్క ఒకటి తుంచి యిచ్చింది.

ఇంతలో కొర్నేలియా సారాబుడ్డి పట్టుకొచ్చింది. మస్లోవా తాను కొంత తాగి, మిగిలింది కొర్నేలియాకూ, నల్లటి పొట్టిదానికీ ఇచ్చింది. వీళ్లు ఆ గదిలోకెల్లా 'ఒక ధనికవర్గం'గా ప్రతిష్ఠ పొందారు. వాళ్ళదగ్గర కాస్త డబ్బుంది. వాళ్ళలో వాళ్ళు భేదం లేకుండా ఖర్చుపెట్టుకుంటూ ఉంటారు. కాసేపు అయేసరికి మస్లోవాకు ఉషారు కలిగింది. కోర్టులో జరిగిన సంగతులన్నీ ఉత్సాహంగా బడబడా వాగేసింది. మధ్య మధ్య పబ్లిక్ ప్రాసిక్యూటరును అనుకరిస్తూ అందర్నీ నవ్వించింది. ముఖ్యంగా కోర్టుకు వచ్చిన వాళ్ళంతా తనకేసే అస్తమానం సాపేక్షగా చూస్తూ ఉండటం ఖైదీల గదిలో తాను వున్నంతసేపూ వాళ్లు ఏదో వంకమీద అటుకేసే వస్తూ ఉండటం ఈ సంగతుల్ని వివరంగా చెప్పింది. "అక్కడ కాపలావాడు కూడా అనే వాడు 'నిన్ను చూడ్డానికే వీళ్ళంతా రావటం' అని. ఒకడు వచ్చేవాడు 'ఫలానా కాగితం ఎక్కడుంది?' అనుకుంటూ. కాని వాడికి కావలసింది కాగితం కాదు. ఎగాదిగా నన్ను చూడ్డమే! ఆ చూపులతో నన్ను మింగేయ దలచుకున్నాడా అనిపించేది. అందరూ అంతే, రసిక శిఖామణులు!"

వెంటనే రైల్వే కూలివాని భార్య అందుకుంది: "అంతే, అంతే; బెల్లానికి చీమల్లా ముసురుతారమ్మా. మరేను, ఏం పోయేకాలమోగానీ" రాగాలు తీసుకుంటూ పలికింది.

"కోర్టునుంచి ఇక్కడికి వచ్చాక మాత్రం? గేటుదగ్గర వున్నాను. ఖయిదీల గుంపు వొస్తోంది. దారిని ఊరికే పోయారా వాళ్లు? ఏమిటీ వెధవ గొడవ అనుకుంటూ, ఏమి చెయ్యాలో తోచక అలాగే నిల్చుండి పోయాను. అప్పుడు ఇన్‌స్పెక్టరు వచ్చి అదమాయిస్తే — వాళ్లు తలకాయలు వంచుకు పోతారు! వాళ్ళలో ఒకడు మాత్రం వచ్చి అమాంతం మీదేపడ్డాడ్రా!"

"వాడు ఎలా వుంటాడో చెప్పు" రాగిజుట్టు పొట్టిది అడిగింది.

"నల్లగా వుంటాడు; మీసాలు వున్నాయి."

"అయితే వాడే."

"వాడంటే?"

"వాడే, స్కొగ్లోవ్; ఇప్పుడే [illegible]!"

"స్కొగ్లోవ్ అంటే?"

"అరె, స్కొగ్లోవ్‌ను ఎరగవా? రెండుసార్లు జైలునుంచి పారిపోయాడు. ఇప్పుడు పట్టుకొచ్చారు. మళ్ళీ పారిపోతాడు, సందేహంలేదు. వాడంటే వార్డర్లకే భయం" రాగిజుట్టు పొట్టిదానికి ఈ సమాచారమంతా తెలిసింది. ఆమె మగ ఖయిదీలతో అప్పుడప్పుడు పిచ్చాపాటీ మాటాడుతూ ఉంటుంది. అందుచేత ఆమెకు జైలుకు సంబంధించిన సమాచారాలు చాలా తెలుసు. "వాడు తప్పకుండా పారిపోతాడు; ఏం అనుమానం లేదు" అని ధోరణి ముగించింది.

"సరే, వాడు పారిపోతే, మనల్నేమీ తీసుకుపోడుకదా!" అని పలికి కొరాబ్లేవా మస్లావావైపు తిరిగి అడిగింది. "అప్పీలు చేసుకోటం గురించి ప్లీడరేమంటాడు. పిటీషన్ పెట్టవలసింది ఇప్పుడే అనుకుంటానే!"

తనకా విషయం ఏమీ తెలియదని మస్లావా జవాబు చెప్పింది.

ఇందాక కిటికీ దగ్గర వెకిలి నవ్వులు నవ్వుతూ ఉండిన మొగం మచ్చలావిడ రెండు చేతులా తల బరుక్కుంటూ ముందుకు వచ్చింది. "సేకెందుకు, నేను చెప్పినట్లు చెయ్యవే మస్లావా! ఈ తీర్పు అన్యాయమని పిటీషన్ రాయి; జైలు ఏజంటుకు నోటీసు ఇచ్చెయ్యి"—అని చెప్పసాగింది.

"అసలు నువ్వు ఎందుకొచ్చావిక్కడికి. సారాయం పనిపట్టావేమిటి? నీ వాగుడు మా కక్కర్లేదు, నీ సలహాతో మాకు పనిలేదు" కోపంగా అన్నది కొరాబ్లేవా.

"అనవసరంగా నువ్వు కల్పించుకు వస్తావెందుకూ? నీతో నేను మాట్లాడ్డం లేదే!"

"నీకు సారాయం కావాలి. అందుకోసమే తిప్పుకుంటూ వచ్చావు."

"పోనీ, కాస్త ఇద్దూ" అన్నగి మస్లావా. తన దగ్గర ఏదివున్నా కాస్త ఇతర్లకి పెట్టాలన్న బుద్ధే ఆమెకు. "పోనీ, నేనే ఇస్తాలే" అన్నది.

"ఏదీ కాస్త ఇవ్వు మరైతే" అంటూ ఆ మొగం మచ్చలావిడ కోరాబ్లేవా వైపు తిరిగి—"నీవంటి వాళ్ళను చూసి భయపడతాననుకుంటున్నావేమిటి? అన్నది.

"పోవే దొంగదానా !" తిట్టింది కోరాబ్లేవా.

"చూశావా, ఎలాంటి మాటలంటోందో !"

"ఛీ, చింపిరి గుడ్డలదానా !"

"నేనా చింపిరి గుడ్డలదాన్ని ? ఖూనీ ముండా !"

"నువ్వు ఇక్కడనుంచి వెళతావా, లేదా !" కసిరింది కోరాబ్లేవా. కాని ఆ మొగం మచ్చలావిడ ఇంకా ముందుకు వచ్చింది. కోరాబ్లేవా ఒక దెబ్బేసింది దాని గుండెమీద. అది వెంటనే కోరాబ్లేవా జుట్టొక చేత్తో పట్టుకుని, మరోచేత్తో చెంపమీద కొట్టింది. కోరాబ్లేవా ఆ చేయి చిక్కించుకుంది. మస్లావా, పొట్టిపిల్ల-ఇద్దరూ మొగం మచ్చలదాన్ని రెక్కలు పుచ్చుకుని ఇవతలకు లాగెయ్యాలని ప్రయత్నించారు. కాని ఆవిడ జుట్టు వొదిలేసి, పిడికిలి బిగించి మరో దెబ్బ కొట్టబోయింది. కోరాబ్లేవా మొగం పక్కకు పెట్టుకుని, ప్రతికక్షిని గబగబ కొడుతూ, దాని చెయ్యిని కొరకబోయింది. మిగతా వాళ్ళంతా చుట్టూ మూగి, అరుస్తూ, ఇద్దర్నీ విడదీయటానికి ప్రయత్నం చేశారు. క్షయరోగికూడా వచ్చి, దగ్గుతూ, పోట్లాట చూస్తోంది. పిల్లలు ఏడుపు మొదలెట్టారు. ఈ కోలాహలం అంతా విని ఆడ వార్డరు, జైలరూ పరుగెత్తుకువచ్చి ఇద్దర్నీ విడదీశారు. పోట్లాటలో త్రెస్సిపోయిన వెంట్రుకల్ని దులుపుకుంటూ కోరాబ్లేవా—చినిగిపోయిన గౌను రొమ్ము దగ్గర సర్దుకుంటూ మొగం మచ్చలావిడ—కోప తీవ్రతతో ఏమిటేమిటో వాగుతున్నారు.

"ఇదంతా సారాయం మూలాన వొచ్చింది. ఉండండి, రేపు ఇన్స్పెక్టరుతో చెప్పేస్తాను. ఆయనే ఇస్తాడు మీకు మంచి సారాయం. నాకు వాసన వెయ్యటం లేదనుకున్నారా? ఉండండి, ఈ పోట్లాటలూ యివీ

ఏమిటో చూస్తాంలే. జాగ్రత ! మీ పోట్లాటలకి మీరు పోతారా, లేదా ?" అంటూ వార్డరు కేకలు వేసింది.

కాని గోల వెంటనే చల్లారలేదు, చాలా సేపటిదాకా తప్పెవరిది అనే సమస్యను గురించి కేకలు ఘర్షణలు జరిగాయి. చివరకు వార్డరూ, జైలరు వెళ్ళిపోయారు. శాంతి ఏర్పడింది. అంతా పడుకున్నారు ముసలమ్మ మోకరిల్లి ప్రార్థన చేసుకుంటోంది.

"జైలు పక్షులు రెండూ కలిశాయి" అన్నది ముఖం మచ్చల మనిషి ఎత్తిపొడుపుగా, ఒకమూల తన బల్లపక్కమీద పడుకుని, కసితీరక, కొన్ని అనరాని మాటలు కూడా విసిరింది.

"జాగ్రత ! మళ్ళీ అంటూన్నా నా చేతిలో, ఏమిటనుకున్నావో !" అంటూ కొరాబ్లేవా జవాబిచ్చింది. తిట్లకు తిట్టు వొప్పజెప్పింది.

"వాళ్ళు వచ్చి విడదీశారు గాని, లేకపోతేనా, నీ గుడ్లు పెరికేసేదాన్ని"

కొరాబ్లేవా దానికీ తగిన జవాబే చెప్పింది. ఇలా ఆగి ఆగి కాసేపు మాటలనుకున్నారు– ఆగి ఆగి మధ్య మధ్య మేఘాలు ఉరిమినట్లు చివరకు అంతా నిశ్శబ్దం. జడివాన కురిసి వెలసినట్లయింది.

అంతా పక్కల మీద పడుకున్నారు. కొందరు గుర్రులు కూడా తీస్తున్నారు. ముసలమ్మ ఇంకా ప్రార్థన ముగించలేదు. మతోద్యోగి కూతురు మళ్ళీ పచార్లు ఆరంభించింది. పోట్లాటను జ్ఞాపకం తెచ్చుకుని మస్లోవా విచారగ్రస్త అయింది. ఈ సంగతిని ఆమెకు గుర్తుకు తెచ్చింది యూఫీమియా, ముఖం మచ్చలావిడ. సైబీరియా ప్రవాసం ! నిర్బంధ బానిస ! మస్లోవా ఈ ఆలోచన్ని తట్టుకోలేకపోయింది. ఆమె ప్రక్కనే పడుకున్న కొరాబ్లేవా కదిలింది.

"చూడు, ఎప్పుడైనా అనుకున్నామా, ఇలా అవుతుందని ?" మస్లోవా మెల్లిగా అన్నది.

"ఏం భయంలేదులే; సైబీరియాలో మాత్రం మనుష్యులు బ్రతకటం లేదూ ! అక్కడా నీకేదైనా సాయం దొరక్కపోదు" కొరాబ్లేవా ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించింది.

"చచ్చిపోనులే, అది శ్రేయస్సు. అయినా ఎంత అవస్థో చూడు! ఇన్నాళ్ళ సంఘీ హాయిగా కాలక్షేపం చేశావా! ఇక ముందు బానిసనై—"

క్లారాబ్లేవా ఒక నిటూర్పు విడిచింది. "ఇంకెవరూ విధిరాత తప్పించుకోలేం." కాసేపటివరకూ ఎవరూ మాటాడలేదు.

ఇంతలో అటువైపు మూలనుంచి ఒక విచిత్ర ధ్వని వినిపించసాగింది. "విన్నావా, ఆ గయ్యాళిది ఏం చేస్తోందో!" అని క్లారాబ్లేవా మస్లోవా చెవిదగ్గర నెమ్మదిగా పలికింది.

అది ఆ మొగం మచ్చలావిడ వెక్కి వెక్కి యేడుస్తున్న చప్పుడు. బాగా తిట్లూ తిన్నది; కావలిసిన సారాయం దొరకలేదు. అసలు తన బతుకంతా ఇతర్లచేత చివాట్లు తింటూ ఉండటమే! అందరూ తన్ను పరిహాసం చేస్తారు. ఏడిపిస్తారు. ఇదందా జ్ఞాపకం తెచ్చుకుని ఏడుపు మొదలెట్టింది. కాసేపు ఏడ్చి, దుఃఖోపశమనానికి గాను, తాను మొదటిసారి ప్రేమించిన ఫాక్టరీకూలీ 'ఫెడ్కా'ను స్మరించుకుంది. వెంటనే ప్రేమగాథ ఏవిధంగా ముగిసిందో కూడా జ్ఞాపకం వచ్చింది. ఒకనాడు ఫెడ్కా బాగా తాగివచ్చి, తమాషా కోసం ఇంత మహాద్రావకం ఆమె శరీరంమీద (సున్నితమైన భాగంలో) పూశాడు. బాధతో ఆమె మెలికలు తిరిగి ఏడుస్తోంటే, వాడు మిత్రులతో సహా పగలబడి నవ్వుతూ గంతులువేశాడు. ఇదంతా జ్ఞాపకం వచ్చి ఆమె ఇప్పుడు పసిపిల్లలా ఏడవసాగింది, ఎవరూ తన్ను చూడ్డంలేదు కదా అని, ముక్కుచీమిడి తుడుచుకుంటూ, కన్నీళ్ళు దిగమింగుతూ.

"దాన్ని చూస్తే నాకు జాలివేస్తుంది" అన్నది మస్లోవా.

"ఔను, జాలేవేస్తుంది. కాని అలా విసిగిస్తుం దెందుకూ?" అన్నది క్లారాబ్లేవా.

## 33

ఆ మర్నాటి ఉదయం—తనలో ఏదో మార్పు వచ్చినట్టు గుర్తిస్తూనే నెఖ్లూడోవ్ మేల్కొన్నాడు. ఆ మార్పేమిటో తెలుసుకోకముందే—అది చాలా మంచిదనీ, ప్రముఖమైనదనీ తెలుసుకొన్నాడు.

ఔను. తానిక అబద్ధం ఆడటం మానెయ్యాలి. నిజం యావత్తూ చెప్పెయ్యాలి.

కాబట్టే ఇంత పెద్ద భవనంలో ఉంటూ, ఇన్ని ఖర్చులు భరాయిస్తున్నాడని అనుకోవచ్చు ఎవరైనా. ఇప్పుడతడు ఈ యిల్లు అక్కర్లేదనటంలో ఏదో అంతరార్థం ఉంది. అగ్రఫేనా ఆశ్చర్యంగా అతని ముఖంలోకి చూచింది.

"అగ్రఫేనా! నువు నాపట్ల చూపుతూవచ్చిన శ్రద్ధకు కృతజ్ఞుణ్ణి. ఇక నాకీ యిల్లూ, నౌకర్లూ అక్కరలేదు. సామానాలన్నీ - మా అమ్మ బ్రతికి వున్నప్పుడెక్కడెక్కడ ఉండేవో-అలాగే సర్ది పెట్టు. మా సోదరి నటాషా వచ్చాక ఆమే చూచుకుంటుంది."

"సర్దటం దేనికి ? మళ్ళీ అవసరం వొస్తాయేమో!"

"ఊహుఁ, అనవసరం రావు. అందులో సందేహం ఏమీలేదు. కార్నితో కూడా చెప్పు. రెండు నెలలజీతం ఊరికే ఇచ్చేస్తాను; ఇక వాడు నౌకరికి రానక్కరలేదు."

"ఒకవేళ మీరు విదేశాలకు పోదామనుకున్నా-మళ్ళీ వచ్చాక ఇల్లూ వాకిలీ, సామాలు కావాలి కదా!"

"నువు పొరపాటు పడుతున్నావు అగ్రఫేనా? నేను విదేశాలేమీ పోవటంలేదు. ఎక్కడికేనా వెడుతున్నానంటే-మరో మార్గంలో వెడుతున్నానన్నమాట"—నెఖ్లూడోవ్ ముఖం లజ్జారుణమైంది. "ఔను, ఈమెకు చెప్పేయావలసిందే. దాపరికం ఉండరాదు. ఎవరికైనా చెప్పెయ్యవలసిందే" అనుకున్నాడు. "నిన్న ఒక ప్రముఖమైన విచిత్రసంఘటన జరిగింది. మా మేనత్త మేరీని ఎరుగున్నావు కదూ! ఆమె దగ్గర పెరిగిన మస్లావా తెలుసా?"

"ఎరక్కేం. ఆమెకు నేను కుట్టుపని నేర్పాను."

"ఆమెమీద ఒక కేసు వచ్చింది. నిన్న కోర్టులో విచారణ జరిగింది. జ్యూరీ సభ్యుల్లో నే నొకణ్ణి."

"అయ్యో, పాపం! ఆ పిల్లమీద ఏమి కేసు వచ్చింది ?"

"హత్యానేరం! దానికంతకూ కారణం నేను."

"బాగుంది! మీరు కారణం ఎలా ఔతారు?"-అగ్రఫేనా కన్నుల్లో మెరుపు కనిపించింది. ఆమెకు తెలుసు మస్లావా-నెఖ్లూడోవ్‌ల సంబంధం.

"ఔను. నేనే మూలకారణం. అందుకే...నాభావాలే నా పద్ధతు లన్నీ మారిపోయాయి."

"అది మిమ్మల్ని ఎలా మారుస్తుంది?"—అప్రశ్నించా ఒక విచారవ్యూహ అణచుకుంది.

"ఎలాంటి మార్పంటే-ఆమె అటువంటి మార్గంలో పడిపోవటానికి నేనే కారణం కాబట్టి - ఆమె కిప్పుడు నా చేతనైనంత సాయమూ చేసి తీరాలి."

"మీ మాటలు మీ సహృదయానికి అనుగుణంగానే ఉన్నాయి. కాని అక్కడ మీ తప్పేమీ ప్రత్యేకంగా లేదు - మామూలుగా అందరికీ జరుగుతాయి అటువంటి సంఘటనలు. వివేకం కలిగి, మీరో సమాధానపడి, మరచిపోవాలి"-గంభీరంగానే చెప్పిం దీ మాటలు అపర్ణ. "ఆ తప్పంతా మీదేనని ఎందుకనుకోవాలి? అనుకోవలసిన పనిలేదు. ఆమె తప్పుదారి పట్టిందని విన్నాను. అదెవరి తప్పు?"

"నాదే. కనుకనే దాన్ని దిద్దుకోవాలనుకుంటున్నాను."

"దిద్దుకోవటం చాలా కష్టం."

"కష్టమో, తేలికో అది నా పని. ఇక పోతే, ఇక్కడ నాకేర్పడిన తర్వాత నీ సంగతిగురించి—మా అమ్మ ఏమి చెప్పిందంటే—"

"ఎప్పుడో, ఆ సంగతి నేనాలోచించటం లేదు. ఉన్నన్నాళ్లు నా కిక్కడ లోపంలేకుండానే జరిగింది. పెళ్ళి అయిన మేనకోడ లొకతె ఉంది నాకు. ఆమె నన్ను చాలారోజులనుంచీ రమ్మంటోంది; ఇక్కడ నాతో మీకు పనిలేకపోతే అక్కడే పోయివుంటాను. కాని నా విచారం ఏమంటే-అందరికీ మామూలుగా జరుగుతూండే ఒక సన్నివేశాన్ని పురస్కరించుకుని అనవసరంగా బాధపడుతున్నారే అని."

"నేను మాత్రం అలా సమాధానపడలేకపోతున్నాను మరి....వస్తువు లన్నీ సర్ది వెయ్యటంలోనూ, ఇంటిని ఎవరికైనా అద్దెకిచ్చే యేర్పాట్లు చెయ్యటంలోనూ నువు నాకు సాయం చెయ్యాలి. నామీద కోపపడకు సుమీ! నువు ఇన్నాళ్ళు చేసినదానికి చాలా చాలా కృతజ్ఞుణ్ణి."

తానే చెడ్డవాడు, ఇతర్లను విసుగుపుట్టించే స్వభావం తనలోనే ఉంది—అని తెలుసుకున్న తర్వాత నెఖ్లూడోవు ఇతర్లలోని చెడ్డతనం, కరకుతనం కనిపించటం మానేశాయి. ఇప్పుడు అగ్రఫేనా అంటేనూ, కార్నీ అన్నా కరుణతో కూడిన ఆదరణే కలుగుతోంది. కార్నీతో కూడా తన సమాచారం యావత్తూ వెళ్ళి చెబుదామనుకున్నాడు. కాని అగ్రఫేనాకు ఉన్నంత చనువు వాడికి లేదు—కనుక చెప్పలేకపోయాడు.

కోర్టువైపు బయలుదేరాడు. నిన్నటి జట్కాలోనే వెడుతున్నాడు. అదే బాట. కాని తాను మాత్రం నిన్నటి నెఖ్లూడో కాదు. ఈ సంగతి తనకే ఆశ్చర్యమనిపించింది. నిన్నటివరకూ సంభవమే అనిపించిన 'మిస్సీతో తన పెళ్ళి' ఇవాళ అసంభవమైపోయింది. నిన్నటివరకూ పెళ్ళి జరగటం, జరక్కపోవటం తన యిష్టాయిష్టంమీద ఆధారపడివున్నదనీ – తన్ను పెళ్ళి చేసుకోటంవల్ల ఆమె నిస్సందేహంగా సుఖపడితీరుతుందనీ భావించాడు. కాని ఇవాళ, ఆమెను పెళ్ళాడటానికే కాదు, ఆమెతో మామూలు సఖ్యత కలిగివుండటానికికూడా తగనని నిశ్చయించుకున్నాడు. "నేనెటువంటి వాడినో తెలుసుకుంటే ఆమె నా ముఖం చూడదు. నిన్ననే ఆమె శీలాన్ని కూడా శంకించాను. ఆమె నన్ను పెళ్ళాడినా నాకు శాంతిఉంటుందా? సుఖం మాట దేవుడెరుగును. మస్లోవా జైల్లో ఉంది; నేడో, రేపో సైబీరియాకు పంపించేస్తారు. నా వల్ల సర్వనాశనం పొందిన ఆ యువతి నిర్బంధ బానిసగా సైబీరియాకు వెడుతుందీ? నేను కొత్తపెళ్ళాంతో కులుకుతూ మిత్రుల అభినందనాల్ని స్వీకరిస్తూ ఉంటానూ? లేకపోతే ఆ జిల్లా అధికారి భార్యతో కలసి...స్కూళ్ళు, రోడ్లు, మొదలైన ప్రముఖ విషయాలపై మీటింగులో వచ్చే వోట్లు లెక్కపెడుతూ ఉంటానూ? లేకపోతే ఈ జీవితంలో తాను పూర్తిచేయలేని ఆ బొమ్మ ముందు పెట్టుకుని కుంచెతో గిలుకుతూ ఉంటానూ? అటువంటి పనుల్లో కాలం వృధా చేయజాలనిప్పుడు. ప్రస్తుతం వెళ్ళి ప్లీడర్ని కలుసుకోవాలి. అతడేమి నిర్ణయిస్తాడో తెలుసుకోవాలి. తరువాత...తరువాత జైలుకు పోవాలి; మస్లోవాను చూడాలి; అంతా ఆమెకు చెప్పాలి." ఈవచ్చిన తనలోని మార్పుకు నెఖ్లూడో సంతోషించాడు.

తాను వెళ్ళి ఆమెకు ఎలా చెప్పాలో; ఆ విషయం ఆమె ముందు ఎలా అంగీకరించాలో; ఇదంతా ఊహించుకున్నప్పుడు — తాను చేసిన పాపానికి పరిహారం చేసినట్లు కాదు; అంతేకాదు నైతికంగా కూడా తన సంస్కృతను ఊహించుకున్నప్పుడు – ఆనందాతిశయం కలిగి నేత్రాలు అశ్రుసిక్తములైనాయి.

౩౨

నెఖ్లూదోవ్ కోర్టులో ప్రవేశించగానే కోర్టు గుమాస్తా ఎదురైనాడు. నిన్న విచారణకు వచ్చిన ఖైదీ ఏ జైల్లో ఉంటున్నదీ; వాళ్ళను కలుసుకోవాలంటే ఎవరి అనుజ్ఞ పొందవలసిందీ; ఈ వివరాలు అడిగి తెలుసుకున్నాడు.

ఖైదీలతో మాట్లాడాలంటే వేర్వేరు అనుజ్ఞ కావాలి. "కావలిస్తే కోర్టులో పని అయిపోవటంతోనే మిమ్మల్ని అధికారి దగ్గరకు తీసుకుపోతాను. కాసేపు ఆగండి. లోపలకు దయచేయండి" అని మర్యాదగా చెప్పాడు గుమాస్తా.

నెఖ్లూదోవ్ జ్యూరీల గదికి వచ్చాడు. జ్యూరీలంతా అప్పుడే చేరారు కోర్టులోకి వెళ్ళటానికి. వర్తకశిఖామణి అప్పుడే కాస్త ఫలహారంచేసి నిన్నటిలాగే చాలా ఉషారుగా ఉన్నాడు. నెఖ్లూదోవ్‌ను చూచి ఒక పాత స్నేహితునివలె ఆప్యాయంగా పలుకరించాడు. పీటర్‌ను చూస్తే అతని అతి పరిచయానికీ, వెకిలితనానికీ ఈ నాడు నెఖ్లూదోవ్‌కు కోపంగాని, అసహ్యం గాని కలుగలేదు. తనకూ నిన్నటి ఖైదీకి గల సంబంధాన్ని జ్యూరీలందరికీ చెప్పేద్దామనుకున్నాడు నెఖ్లూదోవ్–అసలు నిన్ననే, విచారణ జరుగుతూ ఉన్నప్పుడే తాను లేచి, తన నేరాన్ని కోర్టులో, అందరి సమక్షాన ఒప్పుకొని యుండవలసింది.

అందరితోపాటు నెఖ్లూదోవ్ కూడా కోర్టులో ప్రవేశించాడు. అన్ని తంతులు నిన్నటిలాగే సాగిపోయాయి. 'కోర్టువారు వస్తున్నారు' అని ఉద్ఘోషించటం–ముగ్గురు వ్యక్తులు ఠీవిగా మెట్లెక్కి వేదికమీదికి రావటం – ఎత్తయిన కుర్చీలమీద జ్యూరీలు ఆసీనులు కావటం – ఆ పోలీసులే – ఆ మతగురువే –

అంతా నిన్నటిలాగే. సాక్ష్యాల ప్రమాణస్వీకారణ, వారికి ప్రెసిడెంటుగారి ప్రబోధాత్మక ఉపన్యాసం మాత్రం ఇవాళ లేవు.

నేటిది ఒక దొంగతనపుకేసు. ఇద్దరు పోలీసులు కత్తులెత్తి పట్టుకుని ఖైదీని లోనికి తెచ్చారు. వాడు గోధుమరంగుకోటు తొడుక్కున్నాడు. ముఖంలో రక్తం లేదు; వెలా వెలా బోతోంది-సన్నగా ఉంటాడు. రొమ్ము బలంలేదు. ఇరవై యేళ్ళ కుర్రవాడు. బల్లమీదకూచుని కోర్టులోకి వస్తోన్న ప్రముఖవ్యక్తులందర్నీ రెప్పలార్పకుండా చూస్తున్నాడు - వీడూ, ఇంకో కడూ కలిసి ఒక షెడ్డుతాళం తీసి—ఒక్కొక్కటి మూడురూబుల్సు అరవై యేడు కోపెక్కులు ఖరీదుచేసే—అనేక పాతచాపల్ని దొంగిలించారని నేరారోపణ. చాపలు ఎత్తుకుపోతోంటే ఒక పోలీసు పట్టుకున్నాడనీ - ఆ యిద్దరూ తాము వాటిని దొంగతనం చేసి, తీసుకుపోతున్నట్టు ఒప్పుకున్నారనీ-నేరారోపణ పత్రంలో ఉంది. ఈ ఖైదీ 'తోడుదొంగ' జైల్లో మరణించాడు. కనుక ఇప్పుడీ ఒక్కడినే విచారించబోతున్నారు. ఆ పాతచాపలు సాక్ష్య సామగ్రిగా టేబిల్ మీద పడివున్నాయి.

సాక్షులు, ప్రమాణాలు, ప్రశ్నలడగటం, క్రాస్ పరీక్షలు-అన్నీ నిన్నటి లాగే సాగిపోతున్నాయి వ్యవహారాలు. ప్రెసిడెంటు, ప్రాసిక్యూటరు, వకీలు ఎవరు ఎన్ని ప్రశ్నలు అడుగుతూఉన్నా ఆ పోలీసువాడు (ఒకసాక్షి) "అంతేనండి" అనో, లేక 'నాకు తెలియదు' అనో జవాబులు చెబుతూ వచ్చాడు. కోర్టులో అనుసరించవలసిన క్రమశిక్షణలో అతడొక యంత్రమై పోయాడు. చాలావరకు భయపడివున్నాడు - అయినా నేరస్థుని అరెస్టువిషయమై మాత్రం వివరాలు చెప్పటానికి ఇష్టపడటంలేదు. అది అతనిముఖంలో గోచరిస్తూనే ఉంది. షెడ్డు యజమాని రెండవసాక్షి; కోపదారి మనిషి. "ఈ చాపలు నీవేనా?"—అని ప్రాసిక్యూటర్ అడిగినప్పుడు, కొంతవరకు వెనుకాడుతూ అతడు తనవేనని చెప్పాడు. "అయితే ఆ చాపలు నీకెందుకు? ఏం చెయ్యదలచుకున్నావు?"—అని అడిగినప్పుడతనికి కోపంవచ్చింది-అన్నాడు: "వాటిని ఏ దయ్యం ఎత్తుకుపోతే నాకేం? అవి నాకక్కరలేదసలు. ఇంత గొడవపడాల్సి వుంటుందని తెలిస్తే, వాటికోసం వెతికేవాణ్ణే కాదు-వాటితోపాటు ఇంకో పదిరూబుల్సుకూడా ఇచ్చి దణ్ణంపెట్టి ఊరుకుండేవాణ్ణి. ఇలా ఇక్కడికి లాక్కొచ్చి ఇన్ని ప్రశ్నలడుగుతారని నే

చాడు. ఉన్నవాళ్లే సంఘానికి సేవ ప్రత్యేకంగా ప్రారంభించి-వాళ్లనుంచి సంఘాన్ని రక్షించాలని కోర్టువారు చెప్పి పడుతున్నారు.

కోర్టులో జరుగుతూన్న లంచం గూర్చి చూస్తూ చూశాడు నెఖ్లూడో. "నిన్నటి వ్యక్తులలాగే పెద్దా సంఘానికి చాలా అపాయకరులే. వాళ్ళంతా అపాయకరులు! వాళ్ళని విచారించే మేము మాత్రం అపాయకరులం కాము! వట్టి వ్యభిచారిని, మోసగాణ్ణి అయిన నేనూ; నేను ఇలాంటి వాడినని తెలిసి కూడా, నన్ను ఏ మాత్రం అసహ్యించుకోకుండా, పైగా గౌరవిస్తూన్న వాళ్ళంతానూ అపాయకరులు కాము!

"ఈ పిల్లవాడేమీ ప్రత్యేకమైన ప్రమాదకరుడు కాడు. మామూలు కుర్రవాడు. ఆ సంగతి అందరికీ కనిపిస్తూనే ఉంది. పరిస్థితుల్నిబట్టి ఇలా తయారైనాడు. ఇటువంటి కుర్రవాళ్లు తప్పుదారిలో పడకుండా ఉండాలంటే అటువంటి పరిస్థితులు ఏర్పడకుండా చూడాలి. పేదరికంవల్ల వాడు పట్నం వెళ్ళవలసి వచ్చినప్పుడు ఏ ప్రభుత్వమైనా ఇంత జాలిపడి కావలసిన సాయం చేసి వున్నట్టయితే సరిపోయేది" అనుకున్నాడు నెఖ్లూడో ఆ కుర్రవాని వ్యాధిగ్రస్తమూ, భయగ్రస్తమూ అయిన ముఖాన్ని చూస్తూ. "కాని, ఆ తరువాత పైనాసరే-పన్నెండు గంటలు పొగాకు ఫ్యాక్టరీలో పనిచేసి, తోడి పని వాళ్ళ సహాయంతో సారాకొట్టుకు అలవాటు పడ్డప్పుడు ఏ సుజ్ఞుడైనా వచ్చి-'తప్పు బాబూ! వెళ్ళకూడదు' అని హితోపదేశం చేసి ఉన్నట్టయితే వాడు వెళ్ళటం మానేసేవాడు. చెడుదారి పట్టేవాడు కాడు. ఇలాంటి తప్పులు చేసేవాడు కాదు.

"వాడు పట్నంలో ఒక చిన్న జంతువులా బతికాడు. పేలు పడకుండా జుట్టు పొట్టిగా కత్తిరించుకుని ఫ్యాక్టరీలో చాకిరీ చేస్తూ ఉండేవాడు. ఆ కాలంలో వాడిమీద ఇంత జాలి చూపేవాడే లేకపోయాడు. అదీగాక వాడు పట్నం వచ్చాక తన తోడి పనివాళ్ళను-పెద్దల్ని, పిన్నల్ని చూసి నేర్చుకున్న దేమిటీ అంటే 'ఇతర్లను మోసం చేసేవాడు, తాగేవాడు, అవసరమైతే దెబ్బలాటకు సిద్ధపడేవాడు, పోకిరిగా తిరిగేవాడే మనిషి' అని.

"అనారోగ్యకరమైన పనిపాటులచేత, తాగుడు మూలాన, వ్యభిచారం వల్ల శరీరం చెడిపోయి—పట్నంలో విచ్చలవిడిగా తిరుగుతూ-స్వప్నంలోలాగ తికమక పడిపోయి-ఎక్కడో ఒక షెడ్డులో జొరబడి, ఎవరికీ కొర

గాని పాత చొక్కాలేవో ఎత్తుకుపోతాడు—మరి ఇక్కడ కూడా—పాపం, వాడి నలా తయారుచేసిన పరిస్థితుల్ని నిర్మూలనం చెయ్యటానికి ప్రయత్నించము. వాణ్ణి శిక్షించి పరిస్థితుల్ని చక్కదిద్దామని చూస్తాం. ఘోరం!"

ఈ ధోరణిలో ఆలోచిస్తున్నాడు నెక్లూడో. కోర్టులో జరిగిన వ్యవహారాల్ని గమనించలేదు. జరిగిన విషయాల్ని తరువాత తెలుసుకుని నిర్ఘాంతపోయాడు. ఇంత ఘోరాన్ని తానింతవరకు ఎందుకు చూడలేకపోయాడో, ఇతర్లయినా ఎందుకు చూడలేకపోతున్నారో అతనికి ఆశ్చర్యంగా ఉంది.

## ౩౦

విశ్రాంతిసమయంలో నెక్లూడో జైలుకి వచ్చాడు. మళ్ళీ లోనికి వెడదామన్న ఉద్దేశం లేదతనికి. వాళ్ళు లోపల ఏమయినా చేసుకోనీ, తాను మాత్రం ఆ భయంకరమైన, బుద్ధిహీనమైన తైతక్కలాటల్లో పాల్గొన దలచలేదు.

జైలు ఏజంటుగారి అభ్యంతర మందిరం ఎక్కడో తెలుసుకుని వెళ్ళాడు. అక్కడున్న నౌకరు అతన్ని లోనికి పంపించటం ఇష్టంలేక "అయ్యగారు చాలా పనిమీద ఉన్నారు" అని చెప్పాడు. కాని నెక్లూడో అతనిమాటలు లెక్కచేయలేదు. గదివైపుకు సాగిపోయాడు. గుమాస్తా ఎదురైనాడు. "నేను జ్యూరీ సభ్యుణ్ణి; మీ అయ్యగారితో నేను వచ్చానని చెప్పు; ఒక ప్రముఖమైన విషయాన్ని గురించి మాటాడాలి" అన్నాడు.

నెక్లూడో ధరించిన దుస్తులు, అతని హోదా చూచి గుమాస్తా మారు మాటాడకుండా లోనికి వెళ్ళి అయ్యగారితో చెప్పాడు. నెక్లూడో లోనికి రావటానికి అనుమతి అయింది. అతడెంత పట్టుపట్టి లోనికి రావటం జైలు ఏజంటుకు కోపం కలిగించింది. అందుచేత "ఏం కావాలి తమకు?" అని తీక్షణంగా ప్రశ్నించాడు.

"నేను జ్యూరీసభ్యుణ్ణి. నా పేరు నెక్లూడో అంటారు. ఖైదీగా ఉంటోన్న మస్లోవాను నేను చూడాలి. చాల అవసరం"—అన్నాడు గట్టిగా, రవంత సిగ్గుపడుతూ, వేగంగా, ఇప్పుడు తాను వేయబోతోన్న అడుగు తన భవిష్యజ్జీవితాన్ని రూపొందింప జాలినదిగా గుర్తిస్తూ.

జైళ్ళ ఏజంటు పొట్టిగా, నల్లగా ఉంటాడు. చిన్న కొప్పు; మెరిసే కళ్ళు. కింది దవడ పొడుచుకొచ్చినట్టు ఉంటుంది.

"మస్లోవా? ఔను, ఎరుగుదున్నాను. విషప్రయోగపు కేసులో అరెస్టు అయింది. తమరు ఆమెను చూడవలసిన పనేముంది?" అని పలికి ఆ ప్రశ్న కటువుగా ఉంటుందేమోనని – ఊహించి, కటుత్వం తగ్గించాలన్న ఊహతో "కారణం తెలుసుకోకుండా మీకు అనుమతి ఇవ్వజాలను" అన్నాడు.

నెఖ్లూడోవ్ ముఖం ఎర్రబారింది. "ప్రముఖమైన కారణమే ఉంది."

జైళ్ళ ఏజంటు నెఖ్లూడోవ్ కేసి పరీక్షగా చూస్తున్నాడు. "ఆమె కేసు విచారణ అయిందా, లేదా?"

"నిన్న విచారణ జరిగింది. నాలుగు సంవత్సరాలు నిర్బంధ బానిసగా శిక్షితురాలైంది, అన్యాయంగా. ఆమె నిరపరాధిని.

మస్లోవా నిరపరాధిని అన్న అంశంమీద ధ్యానం నిలపకుండా జైలు ఏజంటు చెప్పాడు "నిన్ననే విచారణ జరిగివుంటే ఆమె ముందు వున్న జైల్లోనే ఉండాలి. అక్కడికి వెళ్ళి ఖైదీలను చూడాలంటే, ఏవో కొన్ని రోజులు ప్రత్యేకంగా ఉన్నాయి, ఆ రోజుల్లోనే వెళ్ళాలి. అక్కడికి వెళ్ళి కనుక్కోండి.

"కాని నేనామెను వీలైనంత తొందరలో చూడాలి" నెఖ్లూడోవ్ దవడలు వణికాయి. తన భవిష్యత్తును నిర్ణయించే నిమిషం రాబోతున్నది.

"ఎందువల్ల?" జైళ్ళ ఏజంటు కనుబొమలు చిరాకును సూచిస్తున్నాయి.

"ఎందువల్లనంటే–ఆమె నిర్దోషి. అన్యాయంగా శిక్షితురాలైంది. తప్పంతా నాది" నెఖ్లూడోవ్ కంఠధ్వని వణికింది. చెప్పరాని విషయాన్ని చెబుతున్నానా అనుకున్నాడు.

"ఎలాగ?"

"ఎలాగంటే–నేనామెను ఒకప్పుడు చెరచి, యీ స్థితికి తీసుకొచ్చాను. నేను నా పని చేయకుండా ఉంటే ఆమె ఈ నేరారోపణకు గురి అయ్యేది కాదు."

"అయితే అయివుండవచ్చు. అంత మాత్రాన మీరిప్పుడు నామెను చూడవలసిన అవసరం నాకేమీ కనిపించటం లేదు."

"అవసరం ఉంది. నేను నామెను అనుసరించి వెళ్ళవలెననుకున్నాను. ఆమెను పెళ్ళిచేసుకోదలిచాను" అన్నాడు నెఖ్లూడొవ్ తడబడుతూ. అతనికి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది.

"అరె, అయ్యో, ఎప్పుడూ కని విని యెరుగని వ్యవహారమే యిది! మీ కోరిక చాలా విపరీతంగా ఉందే సుమండీ" కనపడీ కనపడని ఒక చిరునవ్వు రేఖ అతని పెదవుల్లో దాగింది.

"పోనీండి, ఇంతకూ అనుమతి ఇస్తారా లేదా?" కోపంగా అడిగాడు నెఖ్లూడొవ్.

"అనుమతి కావాలంటారా? ఇప్పుడే ఇస్తాను, కూర్చోండి దయచేసి" నెఖ్లూడొవ్ నిల్చునే ఉన్నాడు.

జైళ్ళ ఏజంటు ఒక అనుమతి పత్రాన్ని రాసి యిచ్చి, నెఖ్లూడొవ్ వైపు విచిత్రంగా చూశాడు.

"ఇక నేను నీ కోర్టు సమావేశాల్లో కూడా పాల్గొనదలచలేను."

"అందుకు సరియైన కారణాలు కోర్టువారికి తెలియజేసుకోవాలి తమరు. మీకు తెలియని దేముంది?"

"ఈ కోర్టు విచారణ లనేవి నిరుపయోగములు, నీతి రహితములు. అదే నా కారణం."

జైళ్ళ ఏజంటు పెదవుల్లో మళ్ళీ ఆ కనబడీ కనబడని చిరునవ్వు రేఖ తొంగి చూసింది—ఆ కారణం హాస్యాస్పదం అని చెప్పటానికా అన్నట్టు. "కాని ఈ విషయంలో...జైళ్ళ ఏజంటుగా ఉంటూ నేను మీతో ఏకీభవించనని మీరు గ్రహిస్తారనుకుంటాను. కాబట్టి మీరు కోర్టువారికి తెలియబరచుకోండి. మీరు చెప్పిన కారణాలు సరియైనవో కావో, వాళ్ళే నిర్ణయిస్తారు. సరియైనవి కాకపోతే జరిమానా వేస్తారు. కోర్టుకి తెలియబరచండి"

"నా నిశ్చితాభిప్రాయం చెప్పాను. ఎవరికీ తెలియబరచుకో నక్కర్లేదు" అన్నాడు నెఖ్లూడొవ్ కోపంగా.

"అయితే చిత్రం; సెలవు" ఈ విచిత్ర వ్యక్తిని చప్పున వొదిలించుకుందామని అతని ఉద్దేశం.

నెఖ్లూడోవ్ వెళ్ళిపోయాడు. ఆ వెంటనే ఒక కోర్టు సభ్యుడు జైళ్ళ ఏజంటు గదిలోకి వచ్చి-"ఎవరిప్పుడు మీతో మాట్లాడి పోతున్నది ?" అని అడిగాడు.

"నెఖ్లూడోవ్. జ్యూరీల సభ్యుడు. ఖైదీలలో ఒక తె-పిల్లో, పెద్దో— ఉందట. దానికి నిర్బంధ బానిసగా నాలుగేళ్లు శిక్ష వేశారట, తాను దాన్ని ఎప్పుడో చెరిచాట్ట, ఇప్పుడు పెళ్ళిచేసుకోదలచాడు."

"నిజంగానా ?"

"అతడే చెప్పాడు. విచిత్రమైన ఆవేశంతో పైగా."

"ఈ కాలపు యువకుల్లో ఏదో ఒక అసాధారణ తత్వం ఉంటున్నది సుమీ !"

"మరీ అంత యువకుడేమీ కాదే ఆయన !"

"కాదనుకో. కాని అటువంటి వాళ్ళను ఇష్టం వచ్చినట్టు పోనీకూడదు. కళ్ళెం బిగించి లాగుతూ ఉండాలి. లేకపోతే నిజంగా విప్లవకారులుగా తయారౌతారు."

## ౩౬

నెఖ్లూడోవ్ అక్కడనుంచి బయలుదేరి-సాధారణంగా విచారణ కాక ముందు ఖైదీలను ఉంచే జైలుకు వెళ్ళాడు. కాని అక్కడ మస్లోవా లేదు. ఒకవేళ పాత జైల్లో ఉందేమోనని అభిప్రాయ పడ్డాడు.

ఆ పాత జైలు అక్కడనుంచి చాలా దూరంలో ఉంది. నెఖ్లూడోవ్ అక్కడికి చేరుకునేసరికి సాయంత్రం అయింది. అదొక లంకంత పురాతనపు కొంప. నెఖ్లూడోవ్ ద్వారం ముందుకు రాగానే దౌవారికుడతన్ని ఆపి గంట మోగించాడు. ఆ గంట విని ఒక జైలరు వచ్చాడు. నెఖ్లూడోవ్ తాను తెచ్చిన ప్రవేశాధికార పత్రం చూపించాడు. కాని ఇన్‌స్పెక్టరు అనుమతి ఉంటేతప్ప లోనికి రానీయజాలనని జైలర్ చెప్పాడు. నెఖ్లూడోవ్ ఇన్‌స్పెక్టరును చూడ్డానికి వెళ్ళాడు. మెట్లెక్కి వెడుతూంటే ఎవరో పియానో వాయిస్తున్నట్టు

వినిపించింది. ఒక పరిచారిక వచ్చి తలుపు తెరిచింది. ఆమె కంటికేసో కట్టు కట్టుకుంది. తలుపు తెరవగానే పాట మరింత విశదంగా వినిపించింది. అది ఒక పాతపాట. అందరికీ విసుగెత్తిపోయిన్న పాట. ఏదో గాని దానాన్నే వాయిస్తున్నారు. కాని పూర్తిగా వాయించటం లేదు. ఒక చరణమే వాయించాక మళ్ళీ మొదలెత్తుకుంటున్నారు.

"ఇన్‌స్పెక్టరుగారు ఉన్నారా?" నెఖ్లూడో పరిచారికను ప్రశ్నించాడు.

"లేరు."

"మళ్లీ యిప్పుడొస్తారా?"

సంగీతం కాసేపు ఆగింది. మళ్ళీఆరంభమయింది బిగ్గరగా, విసురుగా. కాని ఒక్క చరణం మాత్రమే.

"అడిగివచ్చి చెబుతానుండండి" అంటూ పరిచారిక లోనికి పోయింది.

సంగీతం ఉచ్ఛస్థాయిలో సాగుతోంది. కాని ఆ చరణం పూర్తిగాక ముందే మధ్యలో ఆగింది. పియానో ధ్వనిగాక ఒక యువతి కంఠం వినిపించింది.

"ఇంట్లో లేరని చెప్పు. ఇవాళంతా ఇంటికి రారని చెప్పు. ఎందుకూ గొడవగా వచ్చారు.

మళ్ళీ సంగీతం ఆరంభమయింది. మళ్ళీ ఆగింది. కుర్చీ తోసినట్టు చప్పుడయింది. సమయంగాని సమయంలో వచ్చి సంగీతానికి అంతరాయం కలిగించిన వ్యక్తిని చీవాట్లు పెడదామని ఆ పియానో వాయిస్తూన్న మనిషి కోపంగా రావటం లేదుకద!"

"మా నాన్న ఇంట్లో లేడు" ఆమె ముఖం పాలిపోయింది. జబ్బు మనిషిలా కనిపించింది. ముంగురులు కళ్ళ కడ్డంగా పడుతున్నాయి. ఇవతల గదిలోకి వచ్చి నెఖ్లూడోను చూడగానే మెత్తపడి, పై మాటలు పలికింది. అంతటితో ఆగక—"దయచేయండి...ఏం కావాలి తమకు?" అని అడిగింది.

"జైల్లో ఒక ఖైదీని చూడబోదామని వచ్చాను."

"రాజకీయ ఖైదీ కామాలేం?"

"రాజకీయ ఖైదీ కాదు. జైళ్ళ ఏజంటు దగ్గరనుంచి అనుమతి తెచ్చు కున్నాను."

"నా కేమీ తెలియదు. నాన్న బైటికెళ్ళాడు. కాని దయచెయ్యండి... లోపలికి రండి... లేకపోతే, అసిస్టెంటు ఇప్పుడు ఆఫీసులోనే ఉంటాడు, ఆయనతో మాటాడచ్చు... మీ పేరేమిటండీ?"

ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా నెహ్లూడొవ్ వెళ్ళిపోయాడు. వెన కాల తలుపు మూసిన చప్పుడయింది. మళ్ళీ పియానో సంగీతం ఆరంభమైంది. వెడుతూన్న నెహ్లూడొవ్‌కు ఆవరణలోనే ఒక ఉద్యోగస్థు డెదురుపడ్డాడు. అతడే, అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు. నెహ్లూడొవ్ తెచ్చిన 'ప్రవేశాధికారి పత్రాన్ని' చూశాడు. కాని దానితో పాత జైల్లోకి వెళ్ళటానికి వీల్లేదన్నాడు. "అయినా వేళ దాటిపోయింది ఇవాళ. దయచేసి రేపురండి. రేపు పదిగంట లకు ఎవరైనా వచ్చి చూడవచ్చు. అప్పుడు రండి. ఇన్‌స్పెక్టరుగారు కూడా ఇంట్లోనే ఉంటాడు. మీరు కోరిన ఖైదీతో ఉమ్మడి సావిడిలోగాని— యిన్‌స్పెక్టరుగారు ఒప్పుకుంటే ఆఫీసులోగాని—మాటాడవచ్చు."

ఇంతకూ ఆ రోజున మస్లోవాను చూడ్డం పడలేదు. నెహ్లూడొవ్ ఇంటికి పోయాడు. మస్లోవాను చూడాలి అన్న కోరికచే కలిగిన ఆవేశంలో కోర్టును గురించేమీ ఆలోచించలేదు. వీధులవెంట వెడుతూ జైళ్ళ ఏజంటుతోనూ అసిస్టెంటు ఇన్‌స్పెక్టరుతోనూ జరిగిన సంభాషణ నెమరు వేసుకుంటు న్నాడు.

మస్లోవాతో సంభాషించాలని ఆకాంక్షించాడు. జైళ్ళ ఏజంటుతో కూడా ఆ సంగతి చెప్పాడు. ఆమెను చూడ్డానికి రెండు జైళ్ళకు వెళ్ళాడు. ఇంత జరిగిన తర్వాత అతనికి చాలా కలతగా ఉంది. చప్పున శాంతి చేకూర లేదు. ఇంటికి వెళ్ళిన తర్వాత డైరీ తీశాడు. చాలా రోజులైంది డైరీ ముట్టు కోక. ఇప్పుడు దాన్ని తెరచి, రెండు మూడు వాక్యాలు చదివి, ఈ విధంగా రాశాడు.

"రెండు సంవత్సరాలనుంచీ నేను డైరీ రాయటం లేదు; అటువంటి తెలివి తక్కువపని మళ్ళీ చెయ్యనక్కర్లేదనుకున్నాను. నిజానికి అది తెలివి తక్కువపని కాదు; నా ఆత్మతో సంభాషించుకోటం; ప్రతి మనిషిలోనూ

ఉండే పరమాత్మతో సంభాషించటం అన్నమాట. ఇన్నాళ్ళనుంచీ ఈ ఆత్మ నిద్రపోయింది; కాబట్టి నేను సంభాషించ లేకపోయాను. ఏప్రిల్ 28 వ తేదీని కోర్టులో, నేను జ్యూరీ సభ్యుడుగా ఉండేటప్పుడు, ఒక అసాధారణ సన్నివేశం జరిగింది. దానితో నాకు మేలుకువ కలిగింది. ఒకప్పుడు నేను చెరచిన మస్లావా ఖైదీ దుస్తుల్లో, ఖైదీలు కూచునే బల్లమీద నాకు కనిపించింది. ఒక పొరపాటువల్ల, ముఖ్యంగా నా అపరాధంవల్ల నిర్దయంగా బానిసగా శిక్షిత అయింది ఆమె. ఇప్పుడే జైళ్ళ ఏజంటును సందర్శించి జైలుకు వెళ్ళాను. కాని నన్ను లోపలికి పోనియ్యలేదు. కాని ఎలాగైనా నా ఆమెను చూడాల్సిందే, నా తప్పును ఆమె ముందు ఒప్పుకోవల్సిందే, అవసరమైతే పెళ్ళాడైనా సరే పాపనివృత్తి పొంది తీరాల్సిందే. భగవంతుడు నాకు సాయపడుగాక! నా హృదయంలో శాంతి నెలకొన్నది; ఆనందం నిండివుంది.

## ౩౨

ఆ రాత్రి మస్లావాకు చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. మతోద్యోగి కూతురు పచార్లు చేస్తున్న ద్వారంవైపు అదేపనిగా చూస్తూ ఆలోచిస్తున్నది. తానీ మగఖైదీలలో ఒకర్ని పెళ్ళిచేసుకోటం అసంభవం. జైలుకు సంబంధించిన ఉద్యోగస్థులలో ఒకరితోనో, గుమాస్తాతోనో, వార్డర్తోనో ఎవరితోనో పొత్తు సంపాదించటం మంచిది. వాళ్ళంతా అలాంటివాళ్ళేగా!

ప్లీడరు తనకేసి ఎలా చూచాడు! ప్రెసిడెంటు మాత్రం చూడలేదూ! కనిపించిన ప్రతిమగవాడూ చూచాడు. ఏదో పనిమీద కోర్టుకు వచ్చిన ప్రతివాడూ తన్ను సాపేక్షగా చూడకుండా పోలేదు. కొన్నాళ్ళ కింద తన్ను బెర్తా చూడ్డానికి వచ్చింది. వచ్చి ఆ విద్యార్థినిగురించి చెప్పింది. కిటీవా దగ్గర వున్నప్పుడు తానతన్ని ప్రేమించింది. అతను ఇటీవల తన సంగతి విని జాలిపడ్డాట్ట; బెర్తా చెప్పింది... ముఖం మస్లావాతో జరిగిన పోట్లాట జ్ఞాపకం తెచ్చుకుని జాలిపడ్డది తాను. ఇలా చాలామంది జ్ఞాపకంవచ్చారు. నెఖ్లూడోవ్ మాత్రం జ్ఞాపకంరాలేదు. తన చిన్నతనప్పుడు రోజులు, ప్రథమయౌవన దశ, నెఖ్లూడోవ్ మీది ప్రేమ—ఇవి మాత్రం జ్ఞప్తికి రావు. వస్తే బాధాకరములు కావూ? అవన్నీ ఎక్కడో హృదయాంతరాళంలో నిద్రాణములై ఉన్నాయి. తానతన్ని పూర్తిగా మరచిపోయింది; ఎప్పుడూ స్మరించుకో

లేదు. కలలోనైనా చూడలేదు. ఇవాళ కోర్టులో అతన్ని చూచికూడా గుర్తించలేకపోయింది. ఆ రోజుల్లో అతను యూనిఫారంలో ఉన్నాడు; నూనూగుమీసాలే ఉండేవి; ఒత్తుగా, ఉంగరాలు తిరిగిన జుట్టు ఉండేది. ఇప్పుడు బట్టతల అయిపోయింది. గుర్తించలేకపోవటానికి ఇదే కారణం కాదు; అసలెప్పుడూ ఆమె అతన్ని గురించి తలచుకోనేలేదు. భయంకరమైన ఆ నాటిరాత్రే ఆమె అతన్ని గురించిన స్మరణ అణచేసుకుంది. సైన్యంలోనుంచి తిరిగివస్తూ అతను మేనత్తల ఊళ్లో దిగలేదు; ఎకాయెకి వెళ్ళిపోయాడు. అప్పుడు తాను గర్భవతినని ఆమె తెలుసుకుంది. అతను మళ్ళీ తిరిగివస్తాడన్న ఆశ ఉన్నంతకాలమూ ఆమెకు కడుపులోని బిడ్డ భారంగా కనిపించలేదు. పిండం గర్భంలో తిరుగుతూ ఉంటే చిత్రంగా ఉండేది; ఏవో భావాలు సంచలించేవి. కాని సైన్యంలోనుంచి తిరిగివచ్చేస్తూ స్టేషన్లో అక్కడ దిగకుండా వెళ్ళిపోయాడని తెలిసినతర్వాత మాత్రం అంతా మారిపోయింది. కడుపులో బిడ్డ భారమే అయింది.

తమ ఊళ్లో దిగి; చూచి వెళ్ళమని మేనత్తలు ఉత్తరాలు రాశారు. కాని తొందరగా పీటర్స్‌బర్గ వెళ్ళాల్సిన పనివుంది కాబట్టి దిగజాలనని తంతి యిచ్చాడు. ఈ సంగతి మస్లోవాకు తెలిసింది. ఆ రాత్రి రైలు వచ్చేసమయానికి స్టేషనుకు వెళ్దామనుకుంది. రాత్రి పన్నెండింటికి వస్తుంది రైలు. దొరసానులకు చేయవలసిన పరిచర్యలన్నీ చేసేసింది. వాళ్ళు పడుకున్న తరువాత వంటలక్క కూతురును (చిన్నపిల్లను) వెంటబెట్టుకుని, పాతబూట్లు తొడుక్కుని, ఒక కంబళీ కప్పుకుని స్టేషనుకు వెళ్ళింది. అది చలికాలం. వర్షం కురిసి కురిసి వెలిసింది.

పొలాల్లోనుంచి త్రోవ సరిగా కనిపించటంలేదు. చీకటి బలిసివుంది. మస్లోవాకు దారి బాగానే తెలుసు. అయినా ఆ కారుచీకటిలో దోవ తప్పి ఒక చిన్న స్టేషన్ చేరుకుంది. అక్కడ రైలు మూడునిమిషాలు మాత్రమే ఆగుతుంది. రైలు వచ్చినప్పుడు మస్లోవా గబగబా ప్లాట్‌ఫారంమీదికి వెళ్ళింది. మొదటితరగతి పెట్టెలో కిటికీవద్ద అతను కనిపించాడు. ఆ పెట్టె విద్యుద్దీపాల కాంతిలో దేదీప్యమానంగా ఉంది. పట్టు పరుపులమీద ఇద్దరు ఆఫీసర్లు ఎదురు

బోముసగా కూచుని చీట్లుఆడుతున్నారు. ఇద్దరిమధ్య ఉన్న టేబిల్ మీద రెండు కొవ్వొత్తి దీపాలు వెలుగుతున్నాయి. ఒకపట్లాము, తెల్లని చొక్కా ధరించివున్నాడు. సీటులో వెనక్కి చేరగిలబడి కూచుని ఎందుకో నవ్వుతున్నాడు. నెఖ్లూదోవు మస్లోవా గుర్తించింది. కిటికీని తట్టింది మొద్దుబారిపోయిన తన చేత్తో. ఇంతలో గంటమోగింది. రైలు మెల్లగా కదిలింది. చీట్లాటలోంచి లేచి ఒకడు బైటికి చూచాడు. ఆమె మళ్ళీ కిటికీతలుపు తట్టింది, తన ముఖాన్ని ఆ తలుపుకు ఆనించి. బండి సాగిపోతోంది. తానూ లోపలికి చూస్తూ పక్కగా నడుస్తోంది. బైటికి చూచిన ఉద్యోగి కిటికీ దించేయటానికి ప్రయత్నించాడు. చేతగాలేదు. అప్పుడు నెఖ్లూడో అతన్ని తప్పుకోమని తానే దించటానికి ప్రయత్నించాడు. రైలువేగంగా కదిలిపోతున్నది. ఆమె కూడా త్వరత్వరగా నడవక తప్పలేదు. రైలువేగం హెచ్చింది. చివరకు కిటికీతలుపును దించేయటం జరిగింది. కాని ఆ సమయాన గార్డు ఆమెను వెనక్కి నెట్టేసి లోపలికి ఎగిరి అడుగువేశాడు. మస్లోవా ప్లాట్ ఫారం మీద అలాగే పరిగెత్తుతూనే ఉంది. ప్లాట్ ఫారం అంతా తడిసిపోయివుంది. ప్లాట్ ఫారం చివరదాకా పరిగెత్తింది. అక్కడ మెట్లున్నాయి. ఆ మెట్ల మీద ఆమె పడిపోయేంతపని జరిగింది. ఈ సరికి మొదటితరగతి పెట్టెలు దాటిపోయాయి; రెండోతరగతి పెట్టెలూ దాటిపోయాయి. తరువాత మూడో తరగతి పెట్టెలూ గబగబా దాటిపోయాయి. ఆమె పరుగెత్తుతూనే ఉంది. ఆఖరికి చివరిపెట్టెకూడా ముందుకు దాటిపోయింది. దానివెనుక ఎర్రలైట్లు మెరిశాయి. విసురుగాలి వీచింది. ఆమె కప్పుకున్న కంబళి జారిపడిపోయింది. ఆమె ఇంకా పరిగెత్తుతూనే ఉంది.

"కంబళి పడిపోయింది; కంబళి" అంటూ ఆమె వెనకనే పరిగెత్తుకొస్తూన్న పిల్ల అరిచింది.

మస్లోవా ఆగింది, వెనక్కి తిరిగి కంబళి అందుకుంది; వెక్కివెక్కి ఏడువసాగింది.

వెళ్ళిపోయాడు.

"అతడు విద్యుద్దీపాలు వెలుగుతూన్న మొదటితరగతిపెట్టెలో, పట్టు పరుపుల్లో కూచుని, తాగుతూ, విలాసంగా నవ్వుతున్నాడు. నేను చీకట్లో; బురదలో, వానలో నిల్చుని ఏడుస్తున్నాను"—అనుకుంది ఆమె. నేలమీద

కూచుని పెద్దపెట్టున ఏడువసాగింది. ఆ పిల్లకు భయంవేసి, దగ్గరకువచ్చి, మెడ కావిలించుకుని "ఇక పోదాం, ఇంటికి" అన్నది.

"రైలు పోతున్నప్పుడు దానికింద పడుకుంటే పీడా వొదిలిపోతుంది"- అనుకుంది మస్లోవా. పిల్ల దానిమాట లామె చెవికి తగల్లేదు.

అలాగే చేయాలని నిశ్చయించుకుంది. మనస్సు ఒక తీవ్రమైన అలజడికి లోనైనప్పుడు సాధారణంగా అలాగే అనిపిస్తుంది. అతడు, కడుపులోబిడ్డ- అతనిబిడ్డ-అకస్మాత్తుగా వొణికింది; ఒకతోపు తోసింది. సన్నని, సుతి మెత్తని దేనితోనో పొడిచింది. అప్పుడు...ఒకనిమిషం కింద తానిక బతకలే ననిపించిన బాధ మాయమైపోయింది; ఆతనిపట్ల కలిగిన కోపం శమించింది. తాను చచ్చిరైనా సరే కసి తీర్చుకోవలసిందే అన్న భావం తొలగిపోయింది. ఆమె శాంతించింది. లేచి, కంబళి కప్పుకుని యింటికి పోయింది.

వానకు తడిసింది; బురద కొట్టుకున్నాయి దుస్తులు; తాను అలసిపోయింది. చివరకు ఇల్లు చేరుకుంది. ఆ నాటినుంచీ ఆమెలో ఒక మార్పు ఆరంభమైంది. దాని పరిణామమే ఈ నాటి దశ. ఆ రాత్రినుంచీ ఆమెకు భగవంతునిలో నమ్మకంపోయింది. మంచితనంలో విశ్వాసం నశించింది. పూర్వం తనకు భగ వంతునిమీద నమ్మకం వుంది. ఇతర్లంతా కూడా భగవంతునియందు నమ్మకం కలిగివున్నారనుకుందేది. ఆ రాత్రి అనుభవం అయాక ఎవ్వరికీ భగవంతు నిలో విశ్వాసం లేదనీ—భగవంతునిగురించి ఈ చెప్పేమాటలన్నీ అబద్ధాలు, మోసం అనీ—నమ్మింది. తాను ప్రేమించిన వ్యక్తి (ఔను, ఆ సంగతి తనకు తెలుసు)—తన్ను అనుభవించి తన్నిపారేశాడు, తన ప్రేమను అవమానిం చాడు. అయినా తానెరిగినవాళ్ళందరిలోకీ అతడే యోగ్యుడు. మిగిలిన వాళ్లు అంతకన్నా అధములే. తరువాత జీవితంలో కలిగిన అనుభవాలన్నీ ఈ తన విశ్వాసాన్నే బలపరిచాయి-అతని మేనత్తలు-పవిత్రురాళ్లే-ఆ పిల్ల ఇక తమను పూర్వంలాగ సేవించలేదని తెలుసుకున్నప్పుడు వెళ్ళగొట్టేశారు. తరు వాత ఆమె తన జీవితంలో కలుసుకున్నవాళ్ళంతా—ఆడవాళ్ళే అయితే తన ద్వారా డబ్బు సంపాదించాలని చూచారు; మగవాళ్ళయితే- ముసలి పోలీసు ఆఫీసరు దగ్గర్నుంచి జైలువార్డరువరకూ-ప్రతివాడూ తన్నొక భోగవస్తువు నుగా చూచారు. ప్రపంచంలో ప్రతివాడికీ కావలసింది ఆ భోగమే ముఖ్యంగా. ఈ పాఠాన్నే బాగా నేర్పిపెట్టాడు ఆ కవి. స్వేచ్ఛాజీవితం

ఆరంభమైన తరువాత రెండోసంవత్సరం అమె ఆకవిస్తున్న ఉన్నప్పుడు— ఇదే జీవితసౌఖ్యం అనీ, కళాత్మకం అనీ, ఆహార్యశోభ అనీ ఖచ్చితంగా చెబుతూ ఉండేవాడు.

ప్రతివాడూ స్వార్థపరుడు, స్వీయసౌఖ్యమే కోరుకుంటూ వుంటాడు. భగవంతుడనీ, సద్వర్తనమనీ చెప్పే మాటలన్నీ పచ్చి మోసం. ప్రపంచమంతా ఎందుకింత దౌర్భాగ్యంగా ఉన్నదనీ—మానవుల ఒకరి నొకరు పీడించు కుంటూ, అందరూ దుఃఖభాజనులై పోతున్నారెందుకనీ — ఇలా ఏదైనా అనుమానం వస్తే—అటువంటి విషయాల్ని గురించి ఎక్కువగా ఆలోచిం చటం మంచిది కాదని మా నేసింది. మనస్సుకు విచారంగా ఉంటే సిగరెట్టు వెలిగించేది. లేకపోతే సారాయం తాగేది. లేదా ఏ మగవాడితోనన్నా ప్రేమకలాపం సాగించేది. విచారం, గిచారం ఎగిరిపోయేది.

## 30

ఆదివారం తెల్లవారుఝామున అయిదు గంటలకు స్త్రీల వార్డు వసారాలో ఈలమోత వినిపించింది. అప్పటికే మేల్కొనివున్న కోరాస్లేవా మస్లోవానుకూడా నిద్రలేపింది.

మస్లోవా లేచి 'ఎవరినో కొత్త ఖయిదీని తెస్తున్నారు కామాలు' అను కుంది. గాలి జోరుగా వీస్తున్నది. మస్లోవా తనివితీర గాలి పీల్చుకుంది లోప లికి. మళ్ళీ పడుకుని ఏ గొడవా ఉండని నిద్రావస్థలో జారుకుందామా అను కుంది. కాని భయంవల్ల నిద్ర పట్టలేదు లేచి కూచుని చుట్టూ చూసింది. అందరూ అప్పటికే లేచివున్నారు. పెద్దపిల్లలుమాత్రం ఇంకా నిద్రలోనే ఉన్నారు. వాళ్ళకు మెలుకువ రాకుండా, మెల్లిగా వాళ్ల పడుకున్న పక్క గుడ్డల్ని లాగుతోంది ఇవతలికి—లైసెన్సు లేకుండా సారాయం అమ్మినందుకు అరెస్టు అయిన స్త్రీ. పసిబిడ్డ పాత్తిగుడ్డల్ని ఆరగట్టుతోంది రైలుగేటువాని భార్య. పసిబిడ్డ గుక్కపట్టి ఏడుస్తూంటే థియోడోసియా ఎత్తుకుని లాలి స్తోంది. క్షయరోగి గుండెలమీద చేతులదుముకుని, ముఖమంతా ఎర్రబడేట్టు దగ్గుతోంది—మధ్య మధ్య పెద్ద పెద్ద నిట్టూర్పులు విడుస్తూ, మూలుగుతూ. మొహంమచ్చల యువతి వెల్లకితలా బల్లచెక్కమీద పడుకునే ఉండి, తనకు

వచ్చిన ఒక కల అందరికీ బిగ్గరగా చెబుతోంది. ముసలమ్మ మోకరిల్లి ప్రార్థన చేసుకుంటోంది – అతి చాదస్తంగా, చదివిన ప్రార్థనే మళ్ళీ చదువుతూ. మతోద్యోగి కూతురు బల్లచెక్కమీద కూచుని – నిద్రమత్తు వదల్లేదింకా— ముందు శూన్యంలోకి చూస్తోంది. నల్లటి పొట్టియువతి తన నల్లని బిరుసు వెంట్రుకల్ని వేళ్ళకు చుట్టుకుంటూ కూచుంది.

బైట అడుగుల చప్పుడు వినిపించింది. జైలుతలుపులు తెరువబడినవి. ఇద్దరు ఖయిదీలు వచ్చి గదిలోని నీళ్ళతొట్టిని బైటికి తీసుకుపోయారు. బైట ఖాళీస్థలంలోవున్న పంపుల దగ్గరకు ముఖాలు కడుక్కోటానికి వెళ్ళారు ఆడఖయిదీ లంతా. మరో గదిలోవుండే యువతితో పోట్లాట వేసుకుంది ముఖంమచ్చలావిడ. తిట్లూ, ఆడిపోతలు, కేకలు......

"నిన్ను ఒక్కతెనూ ప్రత్యేకంగా ఒక గదిలో ఉంచాలల్లే వుందే!" అంటూ కోపంగావచ్చి ముసలిజైలరు ముఖంమచ్చలావిడను వీపుమీద బాగా కొట్టాడు. ఆ దెబ్బ ప్రతిధ్వనించింది. "జాగ్రత్త! మళ్ళీ అటువంటి పనులు చెయ్యకు" అన్నాడు.

"ముసలాడికి సయ్యాటలెందుకయ్యా!" అందామె, ఆ కొట్టటం తన్ను గిలిగించటానికి ఆతడు చూపిన విలాసక్రియగా భావించి.

"ఊఁ, తొందరగా కానీయండి. ప్రార్థనకు సిద్ధంకండి."

తరువాత తనిఖీచేయటానికి ఇన్స్పెక్టరు తన నౌకర్లతోసహా వచ్చాడు. తల దువ్వుకోని, దుస్తులు ధరించటానికి చాలినంత వ్యవధానం లేకపోయింది మస్లొవాకు.

"తనిఖీకి హాజరుకండి" అని అరచాడు జైలరు.

ఇతర గదుల్లోని ఖయిదీలుకూడా వచ్చారు. అందరూ రెండు వరుసలుగా నిల్చున్నారు. ప్రతి ఖయిదీ తనముందున్న ఖయిదీ భుజాలపై చేతులుంచి నిల్చోవాలి. అందర్నీ లెక్కించారు.

తనిఖీ అయినతరువాత స్త్రీవార్డరు ఖయిదీలందర్నీ చర్చికి తీసుకుపోయింది. అన్ని గదుల్లోని స్త్రీఖయిదీలు కలిసి నూరుమంది ఒక వరుసలో నిల్చుని వెళుతున్నారు. ఆ వరసలో మధ్య వున్నారు థియోడోసియా, మస్లొవా. అందరూ తెల్లనిజాకెట్లు తొడుక్కున్నారు; తెల్లని రుమాలు తలకు

చుట్టుకున్నారు. రంగుదుస్తులు సొంతవి ఉన్నవాళ్ళు ధరించారు. ఇలా సొంతవి రంగుదుస్తులు కలవాళ్ళు—సైబీరియాకు ప్రవాసం పోతున్న నేరస్తులైన పురుషుల భార్యలు; భర్తలతోసహా సైబీరియాకు పోతున్నవాళ్లు—అంతా ఒక వరుసలో వెళుతున్నారు. మెల్లగా అడుగులు వేస్తున్న చప్పుడు; వాళ్ళలో వాళ్ళు గుసగుస లాడుతున్న ధ్వనులు, మధ్య మధ్య ఎవరో నవ్వుతున్న కిలకిలలు! అల్లంత దూరాన యూఫేమియా వెళుతోంది. మస్లావా వేలుపెట్టి చూపించింది దాన్ని థియోడోసియాకు. చర్చిలో ప్రవేశించిన తరువాత ఎవరూ మాట్లాడలేదు. కుడివైపున ఉన్నాయి వీళ్ళకు సీట్లు. ఒకరినొకరు తోసుకుంటూ సీట్లకోసం కాసేపు గలభా పడ్డారు.

ఆ తరువాత మగఖయిదీలు వచ్చారు. ప్రవాసశిక్ష విధింపబడినవాళ్లు, కారాగార శిక్ష అనుభవిస్తున్నవాళ్లు, రకరకాల నేరస్థులు ఉన్నారు. వీళ్ళంతా చర్చిలో ఎడమవైపునా, మధ్యభాగంలోనూ ఆక్రమించుకుని నిల్చున్నారు.

చర్చిలో ఒకమూల ప్రత్యేకంగా నిర్బంధ బానిసలుగా సైబీరియాకు తీసుకుపోబడవలసిన నేరస్థులు ఉన్నారు. వీళ్ళను ముందుగానే తీసుకొచ్చి అక్కడ నిలబెట్టారు. వీళ్ళకు బుర్రలు సగం గొరిగిపెట్టారు. వాళ్ళకు సంకెళ్లు ఉన్నాయి. ఇంకా విచారణ జరగని ఖయిదీలు మరోప్రక్క ఉన్నారు. వీళ్ళకు బుర్రలు గొరిగించరు, సంకెళ్ళూ ఉండవు.

జైలు ఆవరణలోని ఈ చర్చిని ఒక ధనిక వర్తకుడు కొన్ని లక్షల రూబుల్సు ఖర్చుపెట్టి నిర్మించాడు; వలసిన అలంకరణాన్ని సమకూర్చాడు. అది రంగు రంగుల కాంతులతో, బంగారు తళతళలతో మెరుస్తూ ఉంటుంది.

కాసేపు అంతా నిశ్శబ్దంగానే ఉంది. అయితే దగ్గులు, చీదటాలు, పిల్లల ఏడుపు, సంకెళ్ళ చప్పుడు వినిపిస్తూనే ఉన్నాయి. మధ్య ఉన్న ఖయిదీలు అటూ ఇటూ సర్దుకుని నడుమన ఒకదారి ఏర్పడేలాగు చేశారు. ఆ దారిన జైలు ఇన్స్పెక్టరు నడిచిపోయి ముందర అందరికీ కనిపించేలాగు తన ఆసనంలో కూచున్నాడు.

# ౩౮

ప్రార్థన ఆరంభం అయింది...

మత గురువు జరీబట్టలు ధరించాడు. ఒక రొట్టె ముక్కను చిన్న చిన్న ముక్కలుగా కోశాడు. వాటిలో చాలా ముక్కల్ని ద్రాక్షసారాయం వున్న ఒక గిన్నెలో వేస్తూ ఏవేవో చాలా మంత్రాలు చదివాడు. ఇంతలో మరొక మతోద్యోగి కొన్ని అర్థంగాని ప్రార్థనలు గబగబా చదివాడు. తరువాత ఖయిదీలతో కలిసి వాటినే గానం చేశాడు. చక్రవర్తికీ, చక్రవర్తి కుటుంబానికీ క్షేమం కలగాలన్న కోరిక ఆ ప్రార్థనలలో వ్యక్తమౌతున్నది. అవే ప్రార్థన శ్లోకాలు ఒక్కొక్కరుగా, సమిష్టిగా, మోకరిల్లి గానం చేశారు. తరువాత మతగురువు జాన్ సువార్తలో కొంత భాగాన్ని చదివాడు. ఆ చదివిన దాని సారాంశం ఇది: ఏసుక్రీస్తు చనిపోయిన తరువాత—స్వర్గంలోని తన తండ్రి కుడిచేయి పక్కన వెళ్ళి కూచునే ముందు-నిజాకృతిలో లేచివచ్చి మేరీకి కనిపించాడు. ఆమెలోనుంచి ఏడు దయ్యాలను పారదోలాడు. తన శిష్యులకు కూడా కనిపించాడు. ఆ సందేశాన్ని విశ్వసించనివాడు నశిస్తాడు. విశ్వసించినవాడు సురక్షితుడౌతాడు...

ఈ తంతు యావత్తూ యథావిధిగా జరిపితే-మతగురువు మొట్టమొదట కోసి, ద్రాక్ష సారాయపు గిన్నెలో వేసిన రొట్టె ముక్కలన్నీ భగవంతుని రక్తమాంసాలుగా మారతాయని వాళ్ళ నమ్మకం. ఈ మహనీయమైన మార్పు తీసుకురాగల తంతు అంతా మతగురువు శ్రద్ధాభక్తులతో చేయాలి. చేతులు పైకెత్తుతాడు. మోకాళ్ళపై నిల్చుంటాడు. ముందున్న బల్లను, బల్లమీద వస్తువుల్ని ముద్దు పెట్టుకుంటాడు. ఒక చిన్నగుడ్డ అంచులు పట్టుకుని గిన్నె మీద అటు ఇటు ఊపుతాడు. అప్పుడు రొట్టె ముక్కలు, ద్రాక్ష సారాయం భగవంతుని రక్తమాంసాలుగా తయారైపోతాయి. కనుక ఈ తంతును చాలా పవిత్రమైనదిగా విశ్వసిస్తారు.

తరువాత మేరీ కన్యను గూర్చి స్తోత్ర గీతాలు ఆరంభించారు. మేరీ కన్యగావుండి క్రీస్తు ప్రభువును ప్రసవించింది. కాని ఆమె కన్యాత్వానికి ఏమాత్రమూ భంగం కలుగలేదు. కాబట్టి ఆమె అధిక గౌరవానికి అర్హురాలు. అప్పటికి ఆ మహనీయమైన మార్పు నిస్సందేహంగా జరిగిపోయినట్టే. ఒక

ముక్క తీసుకుని మతగురువు నోట్లో వేసుకున్నాడు. అంటే భగవంతుని రక్తమాంసాలు తాను పారణ చేశాడు. ఆ గిన్నె చేతపుచ్చుకుని ముందుకు వచ్చి, తనలాగే పారణ చేయదలచినవా రెవరైనా వుంటే రమ్మని అడిగాడు. ఎవరూ రాలేదు. ఇద్దరు ముగ్గురు పిల్లలు మాత్రం వచ్చారు.

వచ్చిన పిల్లల్ని మతగురువు కేక్లు అడిగి, బహు జాగ్రత్తగా ద్రాక్ష సారాయంలో నానిన రొట్టె ముక్కల్ని చంచాతో తీసి, పిల్లల నోళ్లలో వరుసగా వేశాడు. పిల్లలంతా భగవంతుని మాంసాన్ని తింటున్నారనీ, భగవంతుని నెత్తురును పారణ చేస్తున్నారనీ, మరొక చర్చి వృద్యోగి గీతం పాడాడు. ఆ తరువాత మతగురువు ఆ గిన్నెను చాటుకు తీసుకుపోయి మిగిలిన భగవంతుని రక్తమాంసాలను స్వాహా అన్నాడు. వెంటనే చెప్పులు చప్పుడు చేసుకుంటూ అందరి ముందుకూ వచ్చాడు. ఇంతటితో చర్చిలో సాంప్రదాయకమైన తంతు ముగిసినట్టే. కాని ఖయిదీలకు కాస్త ఓదార్పు చెబుదామన్న వుద్దేశంతో మరో తంతు ఆరంభం చేశాడు.

ఆ పక్కనే గిల్టుచేయబడిన ఒక విగ్రహం వుంది. దానిచుట్టూ ఆరు కొవ్వుదీపాలు వెలుగుతున్నాయి. ఎవరి రక్తమాంసాలను మతగురువు పారణ చేశాడో ఆ భగవంతుని విగ్రహమే అది మతగురువు ఆ విగ్రహం ముందుకు వచ్చి, నిల్చుని ఈ కిందివిధంగా ప్రార్థన చేశాడు.

"ఏసుప్రభూ! మధురమూర్తి! సమస్త దేవతలకూ వంద్యుడవు; సర్వశక్తిమంతుడవు; నన్ను రక్షించు. రక్షకుడా! అని నిన్ను పిలుచువారిపై దయాదృష్టి ప్రసరించు. సౌందర్యమూర్తి! సాధుసజ్జనులను, ప్రవక్తలను సంరక్షించి, వారికి సాయుజ్యము ప్రసాదించుము. ప్రేమమూర్తి! ఏసుప్రభూ!........"

మతగురువు ప్రార్థన ఆపివేశాడు. ఊపిరి తీసుకున్నాడు. విగ్రహం ముందు మోకరిల్లి, అర్ధనిమీలిత నేత్రుడైనాడు. ఇన్‌స్పెక్టరు, వార్డర్లు, ఖైదీలు—యావన్మందీ అతన్ని అనుకరించారు. మళ్ళీ మతగురువు కంఠం విప్పాడు.

"ప్రభూ! దేవాదులను సృష్టించినది నీవే—మహిమాన్వితుడవు. సర్వ రక్షకుడవు—సర్వశక్తిమంతుడవు—రాజుల వైభవము, బలము నీవే. త్యాగ మూర్తుల త్యాగశక్తి నీవే. నీ లీలలు విచిత్రములు. బ్రహ్మచారుల తేజస్సు

నీవే. యోగీశ్వరుల తపస్సు నీవే. పాపాత్ములను క్షమించి, మోక్షము ప్రసాదింపగల అపారదయాసముద్రుడవు నీవే. మమ్మల్ని కటాక్షించు."

"ప్రభూ, ప్రభూ" అని మధ్య మధ్య పదిసార్లు ఎంతో భక్త్యావేశం పొంగిపోయేలాగు ఉచ్చరించాడు. చివరకు ప్రార్థనవాక్యాలు ముగించి, మోకరిల్లి, అర్ధనిమీలిత నేత్రుడై మళ్ళీ ఆరంభించాడు: "ఏసుప్రభూ! భగవంతుని కుమారుడా! నాపై కరుణింపుము."

అతనికిమల్లేనే ఖయిదీలందరూ కూడా మోకరిల్లి, మళ్ళీ లేచి నిల్చున్నారు. వాళ్ళ కాళ్ళను బిగించిన సంకెళ్ళు శబ్దం చేసినవి.

తరువాత భగవంతుని స్తుతిస్తూ గీతాలు పాడారు. కొన్ని గీతాలను మతగురువు పుస్తకంలోనుంచి చదివాడు. ఒక్కొక్క వాక్యం ముగియగానే ఖయిదీలు తలలువంచి ధ్యానమగ్నులౌతూ వచ్చారు. చివరకు మతగురువు పుస్తకం మూసేసి, నిట్టూర్పు విడిచి, లోనికిపోయాడు. ఇంకా వ్యవహారం ముగియలేదు. మరొక అంకం మిగిలివుంది.

మతగురువు గిల్టుచేసిన ఒక సిలువను పుచ్చుకుని వచ్చాడు. మొదట ఇన్‌స్పెక్టరు, తరువాత జైలర్లు; ఆ తరువాత జైలర్లు ఒకరి నొకరు తోసుకుంటూ, తిట్టుకుంటూవచ్చి ఆ సిలువను ముద్దుపెట్టుకున్నారు. మతగురువు ఇన్‌స్పెక్టరుతో మాట్లాడుతూ సిలువను, దగ్గరకు వచ్చినవాళ్ల నోళ్ళకూ, ముక్కులకూ అంటిస్తూ ఉన్నాడు. వాళ్లు దాన్నీ, మతగురువు చేతినీ ముద్దు పెట్టుకోటానికి, తమలో తాము తొక్కులాడుకుంటూ చాలా అవస్థపడ్డారు. సాంఘిక సభ్యతనుంచి దూరము తొలగిపోయిన ఈ సోదరుల మనశ్శాంతి నిమిత్తం ఏర్పరుపబడిన ఈ మతవిషయికమైన తంతు ఇలా ముగిసింది చివరకు.

## ౪౦

వ్రతప్రసక్త ఏసుక్రీస్తు పేరును చాలసార్లు ఉచ్చరించాడు. ఎంతో ఘనంగా కీర్తించాడు. ఆ యేసుప్రభువే ఇటువంటి అర్థంలేని...చర్చి భవనంలో జరుగుతూన్న తంతుల్ని నిషేధించి వున్నాడు. ఇలా గుళ్ళలో గుంపులుగూడి ప్రార్థనలు చేయవద్దని కచ్చితంగా చెప్పాడు. అసలు గుళ్లు గోపురాల్ని ధ్వంసం చేసేందుకే తాను అవతరించినట్టు చెప్పుతున్నాడు. గుళ్ళు కట్టవద్దని ఆదేశించాడు. ఎవరికివారు ఏకాంతంగా ప్రార్థనాదికాలను

చేసుకోవలసిందిగా ప్రబోధించాడు. ఇప్పుడు ప్రపంచంలో మనం చూస్తున్న ఈ విచారణలు, ఖయిదుచేయటాలు, బాధించటం, హత్యలు చేయటం — ఇలాంటివన్నీ ఏసుప్రభువు నిషేధించాడు. హింస ఏ రకమైనా పనికిరాదన్నాడు. బంధితులకు విమోచనం ప్రసాదించేందుకే తాను అవతరించానని చెప్పుకున్నాడు. ఈ సంగతులన్నీ చర్చిలో సమావేశమైనవారిలో......ఇన్‌స్పెక్టరు మొదలు మస్తాన్ వరకూ...ఎవరికీ తెలియవు.

క్రీస్తుదేవుని పేరుమీద జరుగుతూన్న ఈ తతంగమంతా ఆ దేవుణ్ణి అగౌరవపరచటమే, అవహేళన చేయటమే అని అక్కడికి వచ్చివున్న వాళ్లలో ఎవరికీ తెలియదు—అందరూ ముద్దుపెట్టుకునేందుకుగాను మతగురువు ముందుకు చాచిన ఆ సిలువ దేనికి చిహ్నము? ఇటువంటి ఘోరాల్ని, మోసాల్ని మానివెయ్యండని ప్రబోధించినందుకే ఏసుక్రీస్తు చిత్రవధ చేయబడిన విషయాన్ని గుర్తుకు తెస్తున్న చిహ్నం అది. ఆ సంగతి అక్కడ సమావేశమైనవారి కెవరికీ తెలియదు—రొట్టెముక్కలు తిని, సారాయం తాగి, ఏసుక్రీస్తు రక్తమాంసాల్ని పారణ చేస్తున్నట్టు భావిస్తున్న ఈ మతగురువులు అనేకమంది సామాన్య దీనప్రజల్ని మోసం చేస్తున్నారు, వాళ్లను నానాయాతనలకు గురిచేస్తున్నారు. ఏసుక్రీస్తువాళ్ళకోసం తెచ్చిన అమూల్యసందేశాన్ని వాళ్ళకు చెప్పకుండా దాచేశారు. ఈ సంగతు లక్కడ హాజరై వున్న వారిలో ఎవరికీ తెలియవు.

మతగురువు తన కార్యకలాపం అంతా నిస్సంకోచంగా నిర్వర్తించేశాడు. చిన్నప్పటినుంచే అదే సంప్రదాయంలో పెరిగినవాడాయె. ఈ సంప్రదాయాన్నే తన పూర్వులంతా అంగీకరించారు. చర్చిలో ఆచరణీయం అయింది. ప్రభుత్వంకూడా కావాలంటోంది. రొట్టెముక్క ఏసుప్రభువు రక్తమాంసాలుగా మారిపోగలదనిగాని—అంతసేపు సాగిన ప్రార్థనలు, పారాయణలు ఆత్మోన్నతికి కారణములనిగాని—తాను నిజంగా భగవంతుని ఆహారించినట్టుగాని—మతగురువుకు విశ్వాసం ఏమీలేదు—ఎవరూ విశ్వసించరు. అయినా అందరూ విశ్వసించాల్సిందేనని అతనిపట్టు. ఇంతగా ఈ పట్టుదలకు కారణం ఏమిటయ్యా అంటే—ఇలా ఈ తంతు యావత్తూ చర్చిలో నిర్వహిస్తూ పద్ధెనిమిదిసంవత్సరాలనుంచీ మంచి ఆదాయమే గడింపగలుగు

తున్నాడు. ఒక కొడుకునూ, కూతుర్నీ హైస్కూలుకు పంపించి, చదువు చెప్పించుకోగలుగుతున్నాడు.

చర్చిలో వున్న ఇంకో మతోద్యోగి వ్యవహారం కూడా అంతే. శవాల్ని పాతేసేటప్పుడు చదివే ప్రార్థనలు మొదలైనవి అతనికి బాగా వచ్చు. అవి చదివినందుకు నిర్ణీతమైన రుసుము క్రైస్తవులయినవారు తప్పకుండా చెల్లిస్తారు. పవిత్ర సూత్రాల అంతరార్థం అతడేనాడో మర్చిపోయాడు. జ్ఞాపకం వున్నట్లా అటువంటి ప్రార్థనాదికాలే. అవే ఇతర్లకు అత్యావసరాలన్న నమ్మకంతో అమ్ముతూ వుంటాడు. బంగాళీ దుంపలు, పిండి, కట్టెపుల్లలు అమ్మే వాళ్ళు అవి ఇతర్లకు అత్యావసరాలన్న గట్టి నమ్మకం కలిగి వున్నట్టు.

జైళ్ళ ఇన్‌స్పెక్టరుగాని, వార్డర్లుగాని ఈ మత సిద్ధాంతాల అంతరార్థాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నించరు. చర్చిలో జరిగే ఈ తంతులకు గురించి కూడా యాథార్థ్యం వాళ్ళకేమీ తెలియదు. జార్ చక్రవర్తి, పై అధికారులూ ఇటువంటి సాంప్రదాయాల్ని విశ్వసిస్తున్నారు కాబట్టి తామూ విశ్వసిస్తున్నారు. ఈ విశ్వాసమే తమ క్రూర వుద్యోగాల నిర్వహణలో సహాయ భూతం ఔతున్నట్టు వాళ్ళకు ఏ కాస్తో అనుభూతి వుండి వుంటుంది. ఈ విశ్వాసమే లేనినాడు తాము తమ అధికారాల్ని ఉపయోగించి, ప్రజల్ని-నిరాఘాటంగా, అంతరాత్మకు చీమ కుట్టినట్టయినా అనిపించక హింసించగలగటం చాలా కష్టం. కష్టమేమిటి, అసంభవం. ఇన్‌స్పెక్టరు స్వభావంలో జాలి వుంది. ఈ విశ్వాస బలమే లేకపోతే ఇలా తన అధికా [illegible] వుండేవాడు కాదు. కనుకనే నిశ్చలంగా నిల్చున్నాడు. ఆ పూజా సమయాల్లో కన్నులు మూసి, మోకరిల్లి, భక్త్యావేశాన్ని తెచ్చుకునేందుకు ప్రయత్నం చేశాడు. సారాయంలోని రొట్టెముక్కల కోసం పిల్లలు ముందుకు వచ్చినప్పుడు ఒక చిన్నవాణ్ణి పైకి ఎత్తి పట్టుకుని మత గురువు ముందుంచాడు.

ఖయిదీలంతా చాలామంది-ఆ గిన్నెలు, సిలువలు, కొవ్వొవత్తి దీపాలు విగ్రహాలు, పఠనాలు, పారాయణాలు-ఇత్యాదులన్నీ ఈ లోకంలోనూ కొన్ని సదుపాయాల్ని కలిగింప జాలిన శక్తిమంతములు కావాలని భావించారు. ఎవరో కొద్దిమంది మాత్రం ఈ మోసాన్ని గ్రహించి, తమలో తాము నవ్వు కున్నారు. మిగిలిన అధిక సంఖ్యాకులు మాత్రం కొంతవరకు విశ్వసించి,

తాము కోరిన సమపాయాలకై ప్రార్థనాదికాలు సలిపి, నిరాశ కలిగి, తమ ప్రార్థనలు ఫలించకపోగా—పెద్ద పెద్ద సమవుదాన్నవాళ్ళే ఈ పద్ధతులనూ, వాటిలో జరిగే తంతులనూ మన్నిస్తున్నారు కదా, వాటిలో ఏ మాత్రమైనా మహత్తు లేకపోలేదని భావించి—బహుశః ఈ లోకంలో కాకపోయినా, పరలోకంలోనైనా వుపయోగపడకపోతాయా ? అని సమాధాన పడ్డారు.

మస్లావా కూడా అలాగే అనుకుని సమాధాన పడ్డది. ఏదో కొంత శాంతి, జడత్వం అనుభవించింది. మొదట ఆమె గుంపులో వెనక పక్కనెక్కీ కనిపించకుండా వుండాలనుకుంది. మత గురువు చేతిలోని సిలువను ముద్దు పెట్టుకునేందుకు అందరూ ముందుకు సాగిపోతూన్నప్పుడు ఆమె, ఫియోడోసియా కూడా ముందుకు నడిచి వచ్చారు. ఇన్‌స్పెక్టరు వెనకాల జైలర్లలో ఒక రైతు యువకుడు—అందమైన జుట్టూ అతనూ నిల్చుని వున్నాడు. అతడు ఫియోడోసియాభర్త. భార్యవైపు తదేకదృష్టిని మార్చకనిల్చున్నాడు. మత గురువు ప్రార్థన చేస్తున్నప్పుడే మస్లావా అతన్ని కనిపెట్టింది. అవునా, కాదా అని ఆలోచిస్తూ ఫియోడోసియాతో గుస గుస లాడుతూ వుంది. అందరూ మోకరిల్లి ప్రార్థనకు దిగినప్పుడు ఆమె కూడా మోకరిల్లి కళ్ళు మూసింది.

## ౭౧

నెఖ్లూడోవ్ వుదయాన్నే ఇల్లు విడిచి బయలుదేరాడు. "పాలో పాలమ్మ పాలు" అని అరుచుకుంటూ పక్క సందులో వెళుతున్నాడొక రైతు.

వసంత ఋతువు ప్రథమ వర్షం ఆ లోగడ దినమే కురిసింది. గచ్చు చేయని ప్రదేశాల్లో గడ్డి పచ్చగా మొలిచి వుంది. తోటల్లో చెట్లు చిగిర్చి, పుష్పించి అందంగా వున్నాయి. దుకాణాల్లోనూ, నివాస గృహాల్లోనూ నౌకర్లు కిటికీలు శుభ్రపరుస్తూ వున్నారు. పాతదుస్తులూ, చౌకరకపు వస్తువులూ అమ్మే అంగడిముందు జనం గుంపులు కూడివున్నారు. పాతబూట్లు చంకల్లో పెట్టుకొని కొందరు; పాతకోట్లు, పాతచొక్కాలు బుజాలమీద వేసుకుని కొందరు అమ్ముకుంటున్నారు.

ఆ నాడు ఆదివారం. ఫాక్టరీలకు సెలవుదినం. పరిశుభ్రమైన కోట్లు, మెరుస్తోన్నబూట్లు తొడుక్కొని యువకులు—అందమైన గౌనులు ధరించి,

తలకు సిల్కు రుమాళ్ళు చుట్టుకుని స్త్రీలు—అంగళ్ళు చుట్టూ మూగారు. పోలీసులు పిస్తోళ్లు పుచ్చుకుని ఎక్కడేమి గలభా జరుగుతుందా అని ఎదురు చూస్తూ ఉన్నారు. గడ్డి నేలమీద బాలబాలికలు పరుగులు పెడుతూ తమ కుక్క పిల్లలతో ఆడుకుంటూ ఉన్నారు. దాసులు అంగళ్ళముందు ఉన్న బల్లల మీద కూచుని పిచ్చాపాటీ మాటాడుకుంటున్నారు. బండ్లు, ట్రాములు అటూ యిటూ తిరుగుతూనే ఉన్నాయి. ప్రార్థనకు రమ్మని పిలుస్తున్నట్టుగా చర్చిలలో గంటలు మోగుతున్నాయి. ఆదివారం గనుక ప్రజలు ఉన్నంతలో అందమైన దుస్తులు ధరించి చర్చిలకు వెడుతూ ఉన్నారు.

ఈ అందర్నీ చూస్తూ ఆ దారినే వెళ్లాడు నెఖ్లూడొవ్ బండీ యెక్కి. బండివాడు యెకాయెకి జైలు వరకూ తోలుకుపోలేదు. చివరి మలుపు దగ్గర బండి ఆపేశాడు. అక్కడికి జైలు ఇంకా ఒక వంద అడుగులు ఉంటుంది.

ఆ మలుపు దగ్గరే చాలామంది స్త్రీ పురుషులు చిన్న చిన్న మూటలేవో పుచ్చుకుని నిల్చుని ఉన్నారు. కుడిచేతి వైపు చెక్కలతో కట్టిన చిన్నచిన్న యిళ్లు ఉన్నాయి. ఎడమవైపున రెండంతస్తుల భవనం ఒకటి ఉంది. ఎదురుగా కనిపించే ఆ యిటుకల కట్టడమే జైలు. ఎవరినీ లోనికి పోనీయటంలేదు. గేటు దగ్గర ఒక కాపలావాడు నిల్చుని దగ్గరకు వచ్చిన వాళ్లను అదలిస్తూ ఉన్నాడు.

కుడివైపున ఉన్న చెక్క యిళ్లన్నీ ఒకే ఆవరణలో ఉన్నాయి. ఆవరణకు ఒక గేటు వుంది. ఆ గేటు దగ్గర–అంటే కాపలావాడికి ఎదురుగా ఒక జెయిలరు కూచున్నాడు. అతని చేతిలో ఒక నోటుపుస్తకం ఉంది. వచ్చిన వాళ్ళంతా అతనివద్దకు పోయి, తాము ఎవర్ని చూడ్డానికి వచ్చారో ఆ ఖైదీల పేర్లు చెప్పుకుంటున్నారు. అతడా పేర్లను నోటుపుస్తకంలో రాసుకుంటున్నాడు–నెఖ్లూడొవ్ కూడా అతనివద్దకు వెళ్లి మస్లొవా పేరు చెప్పాడు. అతడు రాసుకున్నాడు.

"మమ్మల్ని లోపలికి ఎందుకు పోనీయరు?"—నెఖ్లూడొవ్ అడిగాడు.

"చర్చిలో ప్రార్థనలు జరుగుతున్నాయి. ప్రార్థనలు ముగిసిన తర్వాత పోనిస్తాం."

నెఖ్లూడోవ్ గుంపులోనుంచి పక్కకు తొలగి నిల్చున్నాడు. చింకి దుస్తులు ధరించిన ఒకడు గుంపులోనుంచి గబగబా ముందుకు తోసుకుపోతున్నాడు జెయిలు ఆవరణలోకి.

"ఎక్కడికి తోసుకుపోతున్నావు?" - అన్నాడు కాపలావాడు తుపాకి ఎత్తిపట్టుకుని.

"నీకెందుకూ?" అని పలికి అతడు వెనక్కు తిరిగిచూచి, "వెళ్లనీక పోతే ఆగుతాం. ఎందుకూ అలా గోలచేస్తావు, పెద్దసైన్యాధిపతివైనట్టు" అన్నాడు.

అక్కడ ఉన్నవాళ్లంతా నవ్వారు. ఆ వచ్చినవారిలో చాలామంది బీదరికాన్ని వ్యక్తంచేస్తున్న దుస్తుల్ని ధరించినవాళ్ళే. కొందరు మరీ చిరిగిన పాతదుస్తులు వేసుకుని ఉన్నారు. అయితే కొద్దిమంది కులీనత కనిపించే స్త్రీ పురుషులూ ఉన్నారు. నెఖ్లూడోవ్ పక్కనే ఒక లావుపాటి యువకుడు నిల్చునివున్నాడు. అతనిచేతులో ఒకమూట ఉంది. అందులో బనీనలూ, చొక్కాలూ ఉన్నాయి. "నువ్వు ఇక్కడికి రావటం ఇదే మొదటిసారి కామాలేం?" అని నెఖ్లూడోవ్ అతన్ని అడిగాడు. ప్రతి ఆదివారమూ వస్తూ ఉంటానని అతడు జవాబు చెప్పాడు. సంభాషణ సాగిపోయింది. అతడొక బ్యాంకులో దౌవారికుడు. అతని సోదరుడు ఫోర్జరీ చేసినందుకు ఖయిదులో పడ్డాడు. ఇలా తన కథ యావత్తూ చెప్పుకుపోతున్నాడు. ఇంతలో గుఱ్ఱపు బండీ ఒకటి వచ్చి అక్కడ ఆగింది. అందులో ఒక విద్యార్థి, మేలిముసుగు వేసుకున్న ఒకయువతి ఉన్నారు. దాణా లోటులేకుండా బాగా బలిసి వుంది గుఱ్ఱం. విద్యార్థిచేతిలో ఒక పెద్దబుట్ట ఉంది. అతడు బండి దిగి నెఖ్లూడోవ్ దగ్గరకువచ్చాడు. ఖయిదీలకు రొట్టెలు పంచిపెట్టాలని ఆ యువతి కోరింది; ఆమె తల్లిదండ్రులు అంగీకరించి పంపించారు. వాటిని ఇప్పుడెలాగ పంచిపెట్టటం? నెఖ్లూడోవ్ను అడిగాడు.

"నేనైనా ఇక్కడికి రావటం ఇదే మొదటిసారి. నాకేమీ తెలియదు. అయినా అతన్ని అడగండి—" అంటూ అటు కుడివైపున...చేతిలో నోటు పుస్తకం పట్టుకు కూచున్న జైలరును చూపించాడు నెఖ్లూడోవ్.

ఇంతలో ఆ పెద్ద యినుపతలుపు తెరుచుకుంది. ఒక ఆఫీసరు, ఆయన వెనకాలే ఒక జైలరు బైటికి వచ్చారు. ఖయిదీలను చూడవచ్చినవారు దయ

చేయవచ్చును అని నోటుపుస్తకం పట్టుకున్న ఖైదీలను ఉద్ఘాటించాడు. దానితో చాలామంది ముందుకు తోసుకువచ్చారు. మరో ఖైదీను పక్కనే నిల్చొని "పదహారు, పదిహేడు..." అని లెక్కిస్తూ ఉన్నాడు. తలుపు అవతల నిల్చున్న మరొక జెయిలు అధికారి కూడా... లోనికి వస్తున్నవాళ్ళ వీపులపై తట్టుతూ, మళ్ళీ లెక్కపెడుతూ వున్నాడు. నెఖ్లూదొవ్ వీపుమీద కూడా అతని చెయ్యి పడ్డది. కాని తాను వచ్చినపని తలచుకుని సిగ్గుపడుతూ, కోపగించుకోటానికి అది సమయం కాదని, స్ఫురించి, ముందుకు సాగిపోయాడు.

ముఖద్వారం దాటగానే కనపించే ఒక పెద్ద విశాలమైన గది సమావేశాలకు ఏర్పాటు చేయబడినది. అక్కడే ఏసుక్రీస్తు సిలువవేయబడినట్టు గీసిన పెద్ద బొమ్మనుచూసి నెఖ్లూదొవ్ నిలిచిపోయాడు.

"ఎందుకిక్కడ ఈ బొమ్మ?" అనుకున్నాడు. ఇది మానవజాతి బంధనిమోచనకు సంబంధించినటువంటిది. నిర్బంధానికి సంబంధించింది కాదే!

నెమ్మదిగా ముందుకు సాగిపోయాడు. అతనికన్నా వెనుక ఉన్నవాళ్లు కూడా ముందుకు దాటివెళ్ళారు. ఆ జెయిలులో నిర్బంధితులై యుండే మహాపరాధులను తలచుకుని అసహ్యించుకున్నాడు. నిన్న కోర్టులో విచారణ జరిగిన ఆ కుర్రవాడు, మస్లొవా నిరపరాధులే అయినా ఈ జెయిల్లోనే నిర్బంధితులన్న సంగతి జ్ఞాపకం రాగానే జాలిపడ్డాడు – తానిప్పుడు మస్లొవాతో మాట్లాడ్డానికే వచ్చాడు. సిగ్గుపడ్డాడు, అవతల ద్వారంవద్ద ఉన్న జెయిలరు ఏమో చెప్పాడు. కాని నెఖ్లూదొవ్ తన మనోభావాలలో మునిగిపోయి వినిపించుకోలేదు. పోయిపోయి .....ఆడఖయిదీలు ఉండేవైపుకు పోవలసినవాడు...మగఖయిదీలు ఉండేవైపుకు వెళ్ళాడు.

ఆత్రుతపడుతూన్న వాళ్ళను ముందుపోనిచ్చి, చివరకు తానూ సమావేశమందిరం ప్రవేశించాడు. అక్కడ రణగుణధ్వనిగా ఉంది. దాని అర్థం ఏమిటో తెలియటంలేదు. ఆ గదికి మధ్యగా రెండు పెద్దతెరలు ఉన్నాయి. ఒక తెరకు అవతలవైపు ఖైదీలు ఉన్నారు. రెండవ తెరకు యివతలవైపు వాళ్ళను చూడవచ్చిన బంధుమిత్రాదులున్నారు. వీళ్ళంతా తెరలకు దగ్గరగా తోసుకుంటూ వచ్చి గలభా చేస్తున్నారు. ఈ వచ్చినవాళ్ళు ఈ తెరలగుండా వస్తువులూ ఖైదీలకు అందజేయకుండా కనిపెట్టివుండేందుకు పోలీసు

కాపలా ఉంది. ఈ పోలీసులు ఆ రెండు తెరలమధ్య పహారా చేస్తున్నారు. ఇవతలవాళ్ళు అవతలవాళ్ళతో మాట్లాడాలంటే గట్టిగా అరిస్తేగాని వినబడదు. అందుచేత అంతా గోలగా ఉంది.

భార్యాభర్తల, తండ్రీకొడుకుల, తల్లీకూతుళ్ళ ముఖాలు తెరలకు అంటుకుని ఉన్నాయి. ఇవతలవాళ్లు అవతలవాళ్ళనూ, అవతలవాళ్ళు ఇవతలవాళ్ళనూ చూచుకుని, పలకరించుకోవాలని ఆతృతపడుతున్నారు. అనేకమంది అలా ఒక్కసారిగా మాట్లాడుతూ ఉండటంవల్ల గందరగోళంగా ఉంది. కాగా ఎవరిమాటా విస్పష్టంగా వినిపించటంలేదు. ప్రతిమాటను బట్టి గాక ముఖవైఖరులనుబట్టి మాత్రమే భావాలను, వాళ్ళ ముట్టడికాంక్షల్ని గ్రహించుకోవాలి. నెఖ్లూడోవ్ పక్కనే ఒక ముసలమ్మ నిల్చుంది. ఆమె తెరకావల వైపున వున్న ఒక యువకునితో ఏమో ఆతృతగా మాట్లాడుతూంది. ఆమె పక్కనే ఒక రైతు. అవతలవైపునుంచి తన్ను పోలివున్న ఒక కుర్రవాడు ఏమిటో చెబుతూంటే జాగ్రత్తగా వింటున్నాడు. అతని పక్కన చిరుగుల బట్టలు ధరించిన ఒకవ్యక్తి చెయి ఊపుతూ, నవ్వుతూ ఉన్నాడు. అతనిపక్కన ఒక స్త్రీ భుజంమీద శాలువా వేసుకుని, ఒళ్లో పిల్లవాణ్ణి పెట్టుకుని కూచుని ఏడుస్తోంది; తెరకు అవతలవైపున ఆ తల నెరిసిన ఇందాక నెఖ్లూడోవ్‌తో మాట్లాడిన దౌవారికుడు ఉన్నాడు; పెద్దగా అరుస్తున్నాడు తెరఅవతల నిల్చున్న ఒక వయసుమళ్ళిన ఖైదీని చూస్తూ.

ఇట్టి పరిస్థితులు చూచాక...తాను కూడా మస్లోవాతో ఇలాగే మాట్లాడవలసి వుంటుందని నెఖ్లూడోవ్‌కు స్ఫురించింది, అధికారులమీద అతనికి కోపం వచ్చింది. ఇట్టి అమానుష పరిస్థితులను అక్కడ ఎవరూ ఏవగించుకుంటున్నట్టే లేదు. పైగా ఇదే సర్వసహజమైనట్లు ఇన్‌స్పెక్టరూ సైనికులూ, ఖైదీలుకూడా భావిస్తున్నట్టు కనిపించింది. నెఖ్లూడోవ్ ఆశ్చర్యపోయాడు.

అతనికి చాలా నిరుత్సాహం కలిగింది. ఒక అయిదునిమిషాలపాటు అక్కడే నిల్చున్నాడు. ఇట్టి అస్తవ్యస్తపు పరిస్థితుల్ని మార్చగల అధికారం తనకేమీ లేదు. ఏదో ఒక నైతికసంక్షోభమైన జాడ్యం తన్ను కుంగదీస్తున్నట్లు అనుభవించాడు.

## ౪౨

నెఖ్లూడోవ్ ధైర్యాన్ని తెచ్చుకున్నాడు. "ఎందుకు వచ్చానో ఆ పని నెరవేర్చుకుని మళ్ళీ వెళ్ళవలసిందే" అనుకున్నాడు. మరి ఇప్పుడు చేయవలసిన పనేమిటి? ఎవరైనా ఉద్యోగస్థుడు కనిపిస్తాడేమోనని అటూ ఇటూ చూశాడు. ఆ ప్రజల గుంపుకు వెనకగా ఒక ఆఫీసరు...ఎక్కువ పలచని మనిషి పచార్లు చేస్తూ ఉన్నాడు. నెఖ్లూడోవ్ అతన్ని సమీపించి, మర్యాద లక్షణాల్ని బలవంతాన పాటిస్తూ అడిగాడు.

"అయ్యా! ఆడఖైదీలు వుండేదెక్కడ? వాళ్ళతో మాటాడాలంటే ఎక్కడికి పోవాలి?" అని.

"ఆడఖైదీలు ఉండేచోటికి తమరు వెళ్ళాలా?"

"ఔను, ఒక ఆడఖైదీని చూడాలనుకుంటున్నాను."

"అయితే, ఆ సంగతి హాల్లోనే తమరు చెప్పుకుని ఉండాల్సింది. మీరు చూడదలచిన ఖయిదీ యెవరండీ?"

"ఆమె పేరు మస్లోవా."

"రాజకీయ ఖయిదీ కామోసేం?"

"కాదు; ఆమె కేవలం—"

"ఊఁ, విచారణ జరిగి, శిక్ష పడిందా?"

"పడింది. నిన్నగాక మొన్ననే"—అణకువగా సమాధానంచెప్పాడు నెఖ్లూడోవ్, మంచిగా మాటాడుతూన్న ఆఫీసరుకు కోపం రాకుండా ఉండేందుకని.

"ఆడఖయిదీలతో మాటాడాలంటే మీరు అలా వెళ్లాలి"—అంటూ ఆఫీసరు...నెఖ్లూడో వేషభాషలనుబట్టి అతడొక పెద్దమనిషి యని గుర్తించి...ఒక పోలీసును పిలచి "వీరిని ఆడఖయిదీలు ఉండేచోటికి తీసుకుపో" అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం" అన్నాడా పోలీసు, మీసాలు మెలివేస్తూ, కోటుమీద పతకాల్ని సవరించుకుంటూ.

దగ్గర ఎవరో నిల్చుని వుండటం చూశాడు నెఖ్లూడోవ్. ఆమే మస్లొవా అని పోల్చుకున్నాడు. అతని ఊపిరి ఆగిపోయింది. హృదయం దడదడా కొట్టుకో సాగింది. తన భవిష్యత్ జీవిత పథాన్ని నిర్ణయించే నిమిషం సమీపించింది. ఆమె థియొడోసియాకు వెనగ్గా నిల్చుని, ఆమె పలుకుతోన్న మాటలు వింటూ నవ్వుకుంటోంది. ఖైదీ దుస్తులు ధరించలేదు. తెల్లని, బిగుతైన గౌను తొడుక్కుంది. నడుముకు వున్న పట్కా బిగువువల్ల వక్షసీమ ఔన్నత్యం ప్రస్ఫుటంగా వుంది. తలమీద రుమాలువుంచి నల్లని ముంగురులు తొంగి చూస్తున్నాయి.

"ఒక్క నిమిషంలో అంతా తేలిపోయింది. నేను ఆమెను ఎలా పిలవను ? ఆమే వస్తుందా ?" అనుకున్నాడు నెఖ్లూడోవ్.

ఆమె తన్ను చూడ్డానికి బెర్గా వస్తాడేమోనని ఎదురు చూస్తోంది. తన్ను చూడ్డానికి నెఖ్లూడోవ్ పనికట్టుకు వస్తాడని ఆమె ఎన్నడూ అనుకో లేదు.

"ఎవరు కావాలి తమకు ?" ఇనుపతెరల మధ్య కాపలా కాస్తున్న స్త్రీ వార్డరు అడిగింది నెఖ్లూడోవ్‌ను సమీపించి.

"మస్లొవా" అన్నాడు నెఖ్లూడోవ్ అతి కష్టంమీద మాట తెచ్చుకుని.

"మస్లొవా ! నీ కోసం ఎవరో వచ్చారు" అన్నది వార్డరు ఆమెవైపు తిరిగి.

మస్లొవా ఒకసారి చుట్టూ కలియచూచింది. రొమ్ము విరిచి ఇనుప తెరను సమీపించి, ఇద్దరు ఖైదీలకు మధ్యగా సందు చేసుకుని, ముఖం ముందుకుపెట్టి ఆశ్చర్యాన్వితయై, ప్రశ్నార్థకంగా నెఖ్లూడోవ్‌వైపు చూసింది. అతడు ధరించిన దుస్తుల్ని బట్టి ఎవరో గొప్ప ధనవంతుడై వుంటాడని తెలుసుకుంది; మందహాసం చేసింది.

"నా కోసమేనా ?" ఆమె అడిగింది. ఆ మందహాస వదనం, మెల్ల కన్ను తెరకు అంటి వున్నాయి.

"నే...ను; నే...ను నిన్ను చూడాలనుకున్నాను. నేను నిన్ను చూడాలనుకున్నాను. నేను..." మామూలుకన్నా హెచ్చు స్థాయిలో మాట్లాడలేకపోయాడు.

మస్లొవాకు అతని మాటలేమీ వినిపించలేదు. తాను స్పష్టంగా తెమ్మన్నా నిష్టంలేని ఏదో విషయాన్ని జ్ఞాపకం చేస్తున్నట్టున్నాడని అతని చూస్తోంది. ఆమె పెదవులమీది మందహాసం మాయమైపోయింది. ఒక తీవ్ర విచారరేఖ ఆమె నుదుటిమీద పొడచూపింది.

"మీరు చెబుతున్నది నాకు వినిపించటంలేదు" అన్నదామె కనుబొమలు కుంచించి.

"నేను రావటం..." అర్ధోక్తిలో ఆగిపోయాడు. ఔను, ఈన ప్రాయశ్చిత్తం తాను నెరవేరుస్తున్నాడు. తన పాపాన్ని అంగీకరిస్తున్నాడు. ఈ ఆలోచనతో అతని కన్నులు చెమ్మగిల్లినవి. గొంతు గద్గదిక పొందింది. చేతిలో వున్న చువ్వాన్ని గట్టిగా పట్టుకుని, దుఃఖం పొంగి రాకుండా తన్ను తాను సంబాళించుకున్నాడు.

"ఆమె ఖులాసాగా వుంటే నేను రావటం ఎందుకూ?" అంటున్నా రెవరో అతని పక్కన.

"భగవంతుడే సాక్షి. నేనేపాపం ఎరగను"— అంటున్నాడో ఖయిదీ.

మస్లొవా అతని భావావేశాన్ని కనిపెట్టింది. అతన్ని గుర్తించింది.

"మీరు...ఊహుఁ, ఏమో; నాకు జ్ఞాపకం రావటంలేదు" అని బిగ్గరగా అరిచింది మస్లొవా అతనివైపు చూడకుండానే. వికసించి వుండిన ఆమె ముఖం వాడిపోయింది.

"నన్ను క్షమించమని అడగటానికి వచ్చాను"— పాఠం వొప్పజెప్పినట్టు పలికాడు నెఖ్లూడొవ్. ఆ మాటలు పలికి సిగ్గుపడుతూ అటూ ఇటూ చూచాడు. మళ్ళీ అనుకున్నాడు: "ఔను, ఇది లజ్జపడవలసిన సమయం. పడవలసిందే" స్వరం హెచ్చించి "నన్ను క్షమించు. నీకు నేను ఘోర అపచారమే చేశాను"— అన్నాడు.

ఆమె కదల్లేదు, మెదల్లేదు. ఆమె మెల్లకంటిచూపు అతని ముఖం మీదినుంచి తిరగలేదు.

అతడిక మాటాడలేకపోయాడు. తెరపక్కనుంచి ఇవతలకు వచ్చి గొంతుకడ్డం పడుతోన్న దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నించాడు.

ఇన్స్పెక్టరు, ఆఫీసరు గదిలోకి వచ్చారు. నెహ్లూడోవ్ ఆగమనం వాళ్ళ కుతూహలాన్ని రేకెత్తించింది. నెహ్లూడోవ్ తెరదగ్గర లేడు. ఇవతలే తారట్లాడుతూ ఉండటం చూచి "మీరు ఎవర్ని చూడ్డానికి వచ్చారో, ఆమెతో మాట్లాడ్డం లేదేం?" అని ప్రశ్నించారు.

నెహ్లూడోవ్ ముక్కు, తెగ చీదీ, తన శాంతత తెచ్చిపెట్టుకుని "ఈ తెరల్లో నుంచి మాట్లాడ్డం కష్టంగా ఉంది. ఒక్కమాటా వినిపించదు"—అన్నాడు.

ఇన్స్పెక్టరు ఒక్క నిమిషం ఆలోచించాడు. "అలాగా! అయితే ఆమెను బైటికి రప్పిస్తాను" అన్నాడు. వెంటనే మస్లొవాను ఇవతలకు పంపించవలసిందిగా స్త్రీ వార్డరును ఆజ్ఞాపించాడు.

౪

మళ్ళీ కాసేపటికి మస్లొవా మెల్లిగా నడుచుకుంటూ వచ్చి నెహ్లూడోవ్ ముందు ఆగింది. అతని ముఖంలోకి చూస్తూ నిల్చుంది. నల్లని ఉంగరాల జుట్టు; ముంగురులు నుదుటిమీద దోబూచులాడుతున్నాయి; అనారోగ్య చిహ్నాలతో ఉన్నా ఆమెముఖం ప్రశాంతంగా, ఆకర్షకంగానే వుంది - కను రెప్పలు కొంచెం ఉబ్బిగా వున్నాయి. కాని కాటుకపెట్టినట్లు కళ్ళు మెరుస్తూనే వున్నాయి.

"మీరు ఇక్కడ మాట్లాడుకోవచ్చు"-అంటూ ఇన్స్పెక్టరు పక్కగా తొలగివెళ్ళాడు. నెహ్లూడోవ్ గోడపక్కన వున్న ఒక్క బల్లదగ్గరకు నడిచాడు.

మస్లొవా ఒకసారి ఇన్స్పెక్టరువైపు ప్రశ్నార్థకంగా చూచింది. ఆశ్చర్యపడుతూ భుజాలు ఎగురవేసింది. నెహ్లూడోవ్ పక్కన బెంచీమీద ఆసీన అయింది, గౌను సర్దుకుని.

"నువు నన్ను క్షమించజాలవని నాకు తెలుసు..." కన్నీళ్ళు పొర్లి వచ్చి, కంఠం గాద్గదికపొంది, మాట్లాడలేక కాసేపు ఆగాడు. మళ్ళీ తన్ను తాను సంబాళించుకుని అన్నాడు—"జరిగినదాన్ని చేత్తో తీసివెయ్యలేను. అయినా శక్తివంచన లేకుండా ఇకముందు చేయదగినదంతా చేస్తాను. చెప్పు మరి..."

దీనికామె సూటిగా సమాధానం చెప్పలేదు. ఆమె కళ్ళు అతని కేసి చూస్తున్నట్టుగా లేదు; చూడనట్టుగా లేదు. "మీరు నా జాడ ఎలా తెలుసుకోగలిగారూ?" — అని అడిగింది.

ఆమె ముఖం మారిపోయింది. అర్థమైనట్టుగా లేదు. అతడు ఆమెవైపు చూస్తూ, ఏమి చెయ్యాలో తెలియక, ధైర్యంచేసి స్మరించి అన్నాడు— "మొన్న జ్యూరీ సభ్యుడుగా కోర్టులో కన్పించాను. మీరు నన్ను గుర్తించలేదా?"

"ఉహుఁ, నేను గుర్తించలేదు. గుర్తించేందుకు వ్యవధి ఏదీ? చూడనైనా లేదు."

"బిడ్డ పుట్టింది కాదూ?" — ఈ ప్రశ్న అడిగి అతను సిగ్గుపడ్డాడు.

"భగవంతుని దయవల్ల బిడ్డడు అప్పుడే పోయాడు" — అన్నదామె కోపంగా, అతని నుంచి ముఖం తిప్పేసి.

"అదేమిటి? ఎందువల్ల?"

"నాకే చాల జబ్బు చేసింది. చచ్చి బ్రతికాను." ఆమె తలెత్తి అతని ముఖంలోకి చూడలేదు.

"మా మేనత్తలు నిన్ను ఎందుకు వెళ్ళగొట్టవలసి వచ్చింది?"

"గర్భవతినైన నన్ను ఎందుకు అట్టిపెట్టుకుంటారూ? ఆ సంగతి తెలియగానే నన్ను వెళ్ళిపొమ్మన్నారు. ఆ సంగతులన్నీ తలుచుకుని లాభం ఏమిటి? నేనంతా మరచిపోయాను. అయిపోయింది."

"అయిపోలేదు. నా పాపానికి ప్రాయశ్చిత్తం చెప్పుకుంటాను."

"ప్రాయశ్చిత్తం చెప్పుకునేందుకేముంది? అయిందేదో అయిపోయింది" — అంటూ ఆమె అతనికేసి చూసిన చూపు విచిత్రంగా వుంది. ఆమె అలా చూస్తుందని అతనెప్పుడూ అనుకోలేదు. అతన్ని గిజుకించాలని చూచిన చూపు అది. అతనికది అసహ్యకరంగానే ఉంది. కాని ఆ చూపు జాలిగొలిపేట్టుగానూ ఉంది.

అతన్ని తిరిగి చూడగలుగుతానని మస్లావా ఎన్నడూ అనుకోలేదు. ఈ జైలు ఆవరణలో, ఇప్పుడు కలుసుకోగలుగుతానని అసలే అనుకోలేదు. అతన్ని చూసి, గుర్తించినప్పుడు... తాను మరచిపోయిన... గుర్తుకు తెచ్చు[illegible] నిష్టపడని స్మృతులను పైకి రాకుండా అణచుకోలేకపోయింది. ఒకప్పు[illegible]

తానతన్ని ప్రేమించింది. అతడు తన్ను ప్రేమించాడు. అందంగల యువకుడు. మధురాతి మధురమైన భావాలు పొంగిన ఒక దివ్యలోకం అప్పుడామె సృష్టించుకుంది. ఆ లోకం ఇప్పుడొకసారి స్మృతిపథంలో తళుక్కుమన్నది. వెంటనే అతడు తన్ను విడిచిపెట్టిపోయిన క్రౌర్యం, ఆ తరువాత తానను భవించిన బాధలు, అవమానాలు స్ఫురణకు వచ్చాయి. ఆమె హృదయం కుంగిపోయింది. కాని దాని హేతువును తర్కించి, అవగతం చేసుకోలేకపోయింది. కనుక ఇన్నాళ్ళనుంచీ అలవాటైపోయిన ప్రవర్తనే చూపింది. తన ఆనాటి మధుర స్మృతులను ఒక జార జీవితపు ముసుగులో కప్పిపెట్టుకున్నది. తన పక్కన కూచున్న నెస్లాడో...ఇటీవల తన్ను కామించిన యువకుడిలా భావించుకుంది. కాని ఈ భావన బాధాకరంగా పరిణమించగా దాన్ని రద్దు చేసుకుంది. ఇప్పుడీ విలువగల, సెంటు వాసనలు గక్కుతున్న దుస్తులు ధరించిన నెస్లాడో...అలనాటి, తన్ను ప్రేమించిన, తాను ప్రేమించిన; నెస్లాడో కాదు. తనవంటి వాళ్ళను, అవసరం కలిగినప్పుడు ఉపయోగించుకునే విలాస పురుషుల్లో ఒకడు. తనవంటివాళ్ళు ఒక్కొక్కప్పుడు వీలైనంత లాభదాయకంగా ఉపయోగించుకోవలసిన పురుషుల్లో ఒకడు. అందుకనే ఆ గిరుకంచే చూపు విసిరింది. అతన్ని ఎలాగ వీలైనంత లాభకరంగా ఉపయోగించుకోవటమా అని ఆలోచిస్తూ మౌనంగా కూచుంది.

"నువ్వు నిర్దోషివి. ఆ సంగతి నాకు నమ్మకంగా తెలుసు."

"నిర్దోషినా? ఔను. నేను దొంగను, దోపిడికత్తెను కాలేను. అంతా లాయరుమీద ఆధారపడి ఉంటుందని చాలామంది చెబుతారు-ఒక పిటీషన్ రాయమంటారు. కాని అది డబ్బుతో కూడిన విషయం."

"ఔను. నేను లాయరుతో అంతా మాటాడాను."

"లాయరు మంచివాడై ఉండాలి. అదీగాక మనం డబ్బుకు వెనకా ముందు చూడకూడదు."

"చేతనైనంత చేస్తాను."

కాసేపు నిశ్శబ్దం. మళ్ళీ ఇదివరకులాగే మందహాసం చేసింది మస్లావా.

"మరి మిమ్మల్ని నేను అడిగేదేమంటే...కాస్త డబ్బు ఇవ్వగలరా? ఎక్కువక్కర్లేదు...ఒక పది రూపాయలు..." అన్నదామె హఠాత్తుగా.

"ఔనౌను" అంటూ నెఖ్లూదొవ్ తికమకపడుతూ జేబులో చేయి పెట్టాడు.

అటూ ఇటూ పచార్లు చేస్తున్న ఇన్‌స్పెక్టరువైపు చూసింది మస్లొవా. "అతడు చూస్తుండగా ఇవ్వకండి. అతనే లాక్కేస్తాడు అదికాస్తా."

ఇన్‌స్పెక్టరు మరోవైపు చూస్తున్నప్పుడు నెఖ్లూదొవ్ జేబులోనుంచి పది రూబుళ్ళ నోటు తీశాడు. కాని ఇన్‌స్పెక్టరు మళ్ళీ ఇటువైపు తిరిగి వస్తున్నాడని గమనించి నోటును గుప్పెట్లో అణచేశాడు.

"ఈమె వొక జీవచ్ఛవం" అనుకున్నాడు నెఖ్లూదొవ్. వొకప్పుడామె ముఖం ఎంత అందంగా ఉండేది! ఇప్పుడది అపవిత్రం అయిపోయింది. ఆ నల్లని కన్నుల్లో వొక మాలిన్యం గూడు కట్టింది. నోటు దాచిన అతని గుప్పెటకేసీ, ఇటు ఇన్‌స్పెక్టరుకేసీ తిరుగుతున్నాయి ఆ కళ్ళు. ఇద్దామా, వద్దా అని కాసేపు సంకోచించాడు నెఖ్లూదొవ్. నూతన నిశ్చయాలనుంచి మళ్ళీ మామూలు జీవితంలోకి అతన్ని దించివేయాలన్న ప్రయత్నంతో అతనిలో వొక కంఠస్వరం బయలుదేరింది.

"ఈమెను పురస్కరించుకుని నువ్వేమి చేయగలవు? ఈ మెడకామె వొక గుదిబండలాగ తగులుకొని నిన్ను అగాధానికి గుంజుకుపోతుంది. నీవిక ఎవరికీ ఏ విధంగానూ ఉపయోగ పడలేవు. ఇప్పుడు నీ దగ్గర వున్న డబ్బు అంతా ఆమె కిచ్చివేసి, శాశ్వతంగా సెలవు తీసుకుని వెళ్ళిపో. ఇక ఆమెతో ఏవిధమైన సంబంధమూ పెట్టుకోకు.

ఏదో వొక ప్రముఖ పరివర్తన తన ఆత్మలో జరుగుతూన్నట్టు అతనికి స్ఫురించింది. తన నూతన ఆశయాలు, సిద్ధాంతాలు అన్నీ నిలవలేక తూలుతున్నాయి. ఏ గాలి తాకిడుకో తూలిపోయి, ఏ ప్రవాహంలోనో కొట్టుకుపోవచ్చు. లోగడ దరిసం భగవంతుని అస్తిత్వాన్ని అనుభవించి ఉన్నాడు. ఆ భగవంతుని సహాయాన్ని ఈ క్షణాన అర్థించాడు. ఆ భగవంతుడిప్పుడు కూడా తన పిలుపు ఆలించాడు. వెంటనే తన తలపులన్నీ ఆమెకు చెప్పివేద్దామని నిశ్చయించుకున్నాడు నెఖ్లూదొవ్.

"మస్లొవా! నన్ను క్షమించమని అడిగేందుకు వచ్చాను.. నువ్వు క్షమించావా? క్షమిస్తావా ఏనాటికైనా?"

ఆమె అతని మాటల్ని వినిపించుకోలేదు. అతనికేసీ, యినస్పెక్టరుకేసీ చూపులు తిప్పుతూ ఉన్నది. చివరకు ఇన్స్పెక్టరు ముఖం చాటు కాగానే చెయిచాచి, ఆ నోటు అందుకుని, గబ బెల్టులోకి దాచేసుకుంది.

"ఆ దేమిటి? మీరు విచిత్రంగా మాట్లాడుతున్నారు" అన్న దామె వొక చిరునవ్వుతో. ఆ చిరునవ్వులో ఏదో ఏహ్యభావం స్ఫురించిందతనికి.

ఆమె హృదయంలో అతనియెడ ప్రతికూలత్వం ఏదో ఉంది. అతడామె హృదయం లోపలికి వెళ్ళటానికి వీల్లేకుండా అది అడ్డుపడుతూంది. ఆలాగని అతనికి స్ఫురించింది. కాని చిత్రం ఏమంటే—అతడు నిరుత్సాహంతో మరలిపోవటంలేదు. ఒక చిత్రమైన, నూతనమైన శక్తి అతన్ని ఆమె వైపుకు లాగుతోంది. ఆమె ఆత్మను జాగృతం చేయాలని అతని తలంపు. అది అత్యంతకష్టతరమైన పని. ఆ కష్టమే అతన్ని ఆకర్షిస్తోంది. ఇప్పు డతనికి ఆమెపట్ల కలుగుతూన్న భావంవంటిది తానెప్పుడూ ఇదివరకు, ఎవరియెడలా అనుభవించిఉండలేదు. ఈ భావంలో స్వార్థం ఏమీలేదు. ఆమెవల్ల తాను కోరుతున్నదేమీ లేదు. ఆమె ఇప్పుడున్నట్లుగా ఉండకుండా, ఇదివర కొకప్పుడు వుండినట్లుగా వుండాలని అతని కోరిక.

"మస్లోవా, నువ్వు అలా మాట్లాడతావేమిటి? నేను నిన్నెరుగుదును. నువ్వు నాకు బాగా గుర్తే. పానోవోలో ఆ నాటిరోజులు నేను మరచిపోలేదు."

"జరిగిపోయినదాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని ఏం ప్రయోజనం?"

"జరిగినదాన్ని సరిచేయటానికే జ్ఞప్తికి తెస్తున్నాను. జరిగిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను." తాను ఆమెను పెళ్ళిచేసుకుంటాననికూడా చెప్పివేద్దామనుకున్నాడు. కాని ఆమెచూపుల్లో ఏదో భయంకరమైన స్థితి కనిపించింది. అతనికది ఏహ్యంగా పొడకట్టింది. చెప్పదలచినమాట చెప్పలేకపోయాడు.

అప్పటికి ఖయిదీలను చూడవచ్చిన వారంతా తిరిగి వెళ్ళిపోతున్నారు. ఇన్స్పెక్టరు నెఖ్లూడోవ్ దగ్గరకు వచ్చి—"ఇక టైము అయిపోయిం"దని చెప్పాడు.

"అయితే ఇక వెళుతున్నాను. ఇంకా నేను నీకు చెప్పవలసిన సంగతులు చాలా వున్నాయి. ఇప్పుడవి చెప్పటం అసంభవం. మరోసారి వస్తాను"—అన్నాడు నెఖ్లూడోవ్.

మస్లావా లేచింది వెళ్ళిపోడానికి. "అంతా చెప్పేశారనే అనుకుంటాను" అన్నది.

"ఊహుఁ, మరొకసారి కలుసుకోటానికి ప్రయత్నిస్తాను. అప్పుడు చెబుతాను-చాలా ముఖ్యమైన సంగతి."

"అయితే రండి. ఎందుకు రాకూడదు?" అంటూ ఆమె మందహాసం చేసింది. తాను సంతోషపెట్టదలచిన పురుషులకేసి సాధారణంగా విసరే మందహాసం అది.

"నువ్వు నాకొక తోబుట్టువును మించిన వ్యక్తివి."

"మీరేమిటో చిత్రంగా మాటాడుతున్నారు"—అని తల ఊపుకుంటూ మస్లావా వెళ్ళిపోయింది.

౪౪

త్రన్ను చూడగానే-ఆమెకు సహాయం చేయాలన్న తన ఉద్దేశాన్ని తెలుసుకోగానే-మస్లావా సంతోషిస్తుందని నెహ్లూడో అనుకున్నాడు. ప్రస్తుత ప్రవర్తనను మార్చుకుని పూర్వపు మస్లావాగా మారిపోగల అవకాశం దొరుకుతుందనుకున్నాడు. కాని పూర్వపు మస్లావా ఆమెలో అసలు కనిపించనే లేదు. ఆ మస్లావా చనిపోయినట్లు స్ఫురించింది. ఇది అతనికి ఆశ్చర్యకరమూ, దుఃఖదాయకమూ అయింది.

ఆమె తన ప్రస్తుత స్థితికి లజ్జపడటంలేదు. ప్రస్తుత స్థితి అంటే ఖైదీ అవటం కాదు. ఖైదీ అయినందుకు సిగ్గుపడుతూనే ఉంది. కాని ఒక జారిణి అయిపోయిన తన బ్రతుక్కు సిగ్గుపడటంలేదు. పైగా సంతృప్తి వహించి ఉంది. అందుకు గర్వపడుతూకూడా ఉంది. అది సహజమే మాకూడా. ఎవరైనా సరే తన వృత్తి ప్రముఖమూ, మంచిదీ అని తలుచుకుంటే తప్ప వ్యవహారం సాగదు. కనుక ఎట్టి స్థితిలో ఉన్న వ్యక్తిఅయినా ప్రపంచజీవితాన్ని గురించి ఒక ప్రత్యేక దృక్పథాన్ని అలవరచుకుంటాడు; దాన్ని అనుసరించి తన వృత్తి మంచిదిగా, ప్రముఖంగా గోచరిస్తూ ఉంటుంది.

దొంగ, హంతకుడు, లంజ—ఈ మొదలైనవారంతా తమ తమ వృత్తులు దుష్టములని గుర్తించుకుని, సిగ్గుపడితీరుతారు అని మామూలుగా

అనుకుంటాం. కాని అది అపోహ. విధికృతంవల్ల, స్వాపరాధాలవల్ల కొందరు కొన్ని విపరీత పరిస్థితుల్లోకి దిగజారిపోతారు; కాని ప్రపంచజీవితాన్నిగురించి ఒక ప్రత్యేక దృక్పథాన్ని అలవరచుకొని, ఆ రీత్యా తమ స్థితిగతులు స్వాభావికములేనని, మంచివేనని భావిస్తూఉంటారు. ఈ దృక్పథం చెదరిపోయి, తమకు దుఃఖం కలగకుండా ఉండేందుకుగాను తమలాంటి వ్యక్తులతోనే - తమ భావాలవంటి భావాలను కలిగివున్నవారితోనే మెలగుతూ ఉంటారు. అందుకనే దొంగలు తమ చాకచక్యాన్నిగురించి; విటులు, విటకత్తెలు తమ విలాసాలను, హంతకులు తమ క్రౌర్యాల్ని గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. అటువంటివాళ్ళు అల్పసంఖ్యాకులుగా ఉండటంచేత, వాళ్ళకు మనం దూరంగా వేరే వలయంలో వుంటున్నందుచేత మనకు అదంతా విచిత్రంగా కనిపిస్తూ వుంటుంది. ఇదేవిధం మరొక రూపంలో సభ్య ప్రపంచం అనేచోటకూడా కనిపిస్తుంది. ధనికులు తమ సంపత్తును గూర్చి గొప్పలు చెప్పుకుంటూరు. అది దోపిడిచేసిన సొమ్ముకాదా? మహా విజయాలు సాధించామని సైన్యాధిపతులు బడాయిలు పోతారు. వాళ్లు చేసినవి హత్యలు కాక మరేమిటి? ఉన్నతాధికారులు అధికారాలు చలాయిస్తున్నారు. ఇది హింసకాదా? ఇట్టి వారందరి దృక్పథాలలోని వైపరీత్యాన్ని మనం అంతగా గమనించలేకపోతున్నామంటే - వీరు దేశంలో అధికసంఖ్యాకంగా ఉన్నారు; అట్టివారి వర్గంలోనే మనమూ తరచు మెలగుతూ వున్నాము. కనుక విపరీతంగా కనిపించటంలేదు.

మస్లొవా జీవిత దృక్పథంకూడా ఇలాగే రూపొందింది. ఆమె ఒక లంజ. సైబీరియాకు ప్రవాసశిక్ష విధించారు ఆమెకు. కాని తన ప్రస్తుత స్థితిగతులతో సంతృప్తిపడేవుండగల ఒక జీవనదృక్పథం ఆమెకు ఉంది. దానిద్వారా తన ప్రస్తుత స్థితికి గర్వపడగల మానసికస్థితికూడా ఏర్పడిపోయింది.

ఆమె దృక్పథాన్ని అనుసరించి యువకులు, వృద్ధులు, విద్యార్థులు, ఉద్యోగస్థులు—వీరంతా కాస్త రూపసులైన యువతులతో సంభోగించి, ఆనందించటమే ప్రధాన లక్ష్యం. వారు ఏయే యితర వ్యాసంగాలలో నిమగ్నులై ఉన్నట్టు నటించినా, ఇంతకన్నా వారు కోరే మరొక ఆనందంలేదు. తాను అందగత్తె; రూపసి; వాళ్ళను సంతోషపరచటం, పర

చకపోవటం తన అధీనంలోవున్న విషయం. కాబట్టి సంఘంలో తనకొక కీలక స్థానం వుంది; తన ఉనికి అత్యవసరం. ఈ విధంగా ఈమె పూర్వచరిత్ర, ప్రస్తుత ప్రవర్తన ఈ దృక్పథాన్ని అనుసరించే వుంది.

మొదట నెక్లూడో, తరువాత ఆ పోలీసు ఉద్యోగిదగ్గరనుంచి ఇప్పటి జైలులోని జైలర్లవరకూ-చాలామంది తన్ను వాంఛిస్తూనే వచ్చారు. గత పది సంవత్సరాలనుంచి అది తన అనుభవంలో వున్న విషయం. తనతో అవసరం లేని వాళ్ళవైపు ఆమె చూడనేలేదు; వాళ్ళ ఊసు ఎత్తుకోలేదు. కాగా ఈ ప్రపంచ ప్రజలంతా మోహతృష్ణా వివశులనీ, మోసగించో, బెత్తుల ఉప యోగించో, హింసించో, డబ్బు ఇచ్చో తన్ను చిక్కించుకోటానికి ప్రయ త్నించేవాళ్ళేననీ ఆమెకొక స్థిరాభిప్రాయం కలిగిపోయింది. ఈ అభిప్రా యాన్ని పురస్కరించుకుని తన ఉనికి సంఘానికి అవసరమైనదనీ, ప్రముఖ మైనదనీ ఆమెకు విశ్వాసం చిక్కింది. దాన్నే అంటిపెట్టుకుని ఉంది. అంటి పెట్టుకుని వుండకపోతే అది తనకిచ్చిన ప్రాముఖ్యత జారిపోతుంది మరి. అది జారిపోతే తనకు బ్రతుకే లేదు. కాబట్టి దానికే అంటిపెట్టుకుని ఉంది; అట్టి ఊహాలు గల యువతుల పజ్జనే చేరి కాలక్షేపం చేసింది.

ఇట్టి తన జీవితవలయంలోనుంచి మరో ప్రపంచంలోకి నెక్లూడో తీసుకుపోతున్నాడని ఆమెకు స్ఫురించింది. కనుక అంగీకరించలేకపోయింది. ప్రస్తుతం తనకున్న స్థానం, ఆత్మగౌరవం, ఆత్మతృప్తి శిథిలమైపోవటం ఆమె కిష్టంలేదు. కాబట్టి తన ప్రథమయౌవనదశనూ, ఆ నాటి నెక్లూడోతోటి తన పరిచయాల్నీ స్మృతిపథంలోనుంచి తొలగించుకోటానికే ప్రయత్నించింది. ఈ స్మృతులు తన ప్రస్తుత జీవనపద్ధతులకు అనుగుణ్యంగా లేవు. కాబట్టి స్మృతిపథంలోనుంచి పరిభ్రష్టములైనాయి; లేనా అక్కడే అణగుతూ, మళ్ళీ లేవకుండా పూడ్చిపెట్టబడి ఉన్నాయి. కనుక ఇప్పుడు తన్ను సమీ పించిన నెక్లూడో ఒకప్పుడు తాను పరిశుద్ధంగా ప్రేమించియుండిన నెక్లూడో లాగ కనిపించలేదు. ఇతడొక ధనికుడు. ఇతన్ని...అందరు మొగాళ్ళలాగే ఉపయోగించుకోవాలి. ఇంతే ఆమె అనుకుంది.

"అసలు ముఖ్యమైన విషయాన్నే ఆమెకు చెప్పలేకపోయాను"— అనుకున్నాడు నెక్లూడో ఇంటికి వెడుతూ—"నేను ఆమెను పెళ్ళిచేసుకో దలచిన విషయాన్ని చెప్పనేలేదు; చెప్పితీరాలి"-అని నిశ్చయించుకున్నాడు.

ద్వారందగ్గర వున్న జైలర్లు చూడవచ్చినవారినందరినీ ఒక్కొక్కరినే వీపుమీద తట్టుతూ బైటికి పంపించేస్తూ వున్నారు. నెఖ్లూడోవ్ వీపుమీద కూడా ముద్రపడ్డది. కాని ఈ సారి అతడది గమనించ లేదు.

## ౪౨

తన జీవిత విధానంలో కొన్ని సంస్కరణలు తీసుకు రావాలని నెఖ్లూడోవ్ ఆశించాడు. నౌకర్లను పంపించివెయ్యటం; ఆ పెద్ద భవనం వొదిలేసి ఎక్కడేనా ఒక చిన్న యిల్లు అద్దెకు తీసుకుని ఉండటం—ఈ మొదలైనవి అతని ఆశయాలు. ఇలాంటి మార్పులన్నీ చలికాలం వచ్చేవరకూ ఆపుచెయ్యాల్సిందేనని అగ్రఫేనా సలహా ఇచ్చింది. ఆ భవనం ఇప్పుడు వొదిలేస్తే—ఎండాకాలంలో ఎవరు అద్దెకు తీసుకుంటారు? ఎవరూ లేకుండా అందులో సామానంతా ఏంకావాలి? కాగా ఒక నిరాడంబర-సామాన్య జీవితవిధానంలో పడిపోదామని నెఖ్లూడోవ్ తలపెట్టిన ప్రయత్నాలు ఫలించలేదు. పరిస్థితులు యథాపూర్వకంగానే సాగిపోతున్నాయి. పైగా ఇంట్లో ఒక కొత్త హంగామా బయలుదేరింది. 'ఊలు' దుస్తులన్నీ బయటికి తీసి, ఆరవేస్తున్నారు నౌకర్లు. ఇదివరకెన్నడూ ఎవరూ ఉపయోగించి ఉండని 'ఊలు' సరుకులన్నీ పెట్టెల అడుగునుంచి బైటికివచ్చి దండేలకు వేలాడుతున్నాయి. తివాచీలన్నీ కూడా బైటికి తెచ్చి నౌకర్లు దుమ్ము దులుపుతున్నారు. ఇంటి కాపలావాడు, నౌకరు కుర్రాడు, కార్నీ, వంటవాడు—యావన్మందీ ఈ పనిలో నిమగ్నులై ఉన్నారు. పెట్టెలన్నీ తెరచి, బట్టలన్నీ బయటికి తీసిన కారణాన ఇల్లంతా కలరావుండల వాసన కొడుతోంది.

ఈ వ్యవహారమంతా చూశాడు నెఖ్లూడోవ్. నిత్యజీవితంలో ఉపయోగపడకుండా వున్న ఆడంబర వస్తువులు తన యింట్లో అసంఖ్యాకంగా వున్న సంగతి తెలుసుకున్నాడు. అప్పుడప్పుడు వాటిని బైటికితీసి దుమ్ము దులుపవలసిన ఉపక్రియలో ఇంటి నౌకర్లకు తగినంత శరీర వ్యాయామం కల్పించటమే వాటి ప్రయోజనం!

“ఇప్పుడు మన జీవిత విధానాన్ని మార్చుకోటం—మస్లోవా వ్యవహారం తేలకుండా ఉన్నంత వరకూ—సాధ్యంకాదు. చాలా కష్టం. ఆమె విడుదల అయిన తర్వాత—లేదా ఆమెతోపాటు నేను సైబీరియాకు ప్రవాసం

వెళ్ళవలసి వచ్చినప్పుడు-దానంతట అదే మారుతుంది—" అనుకున్నాడు సెక్లాడో.

అనుకున్న రోజుకు ఫాంసరిన్ ఇంటికి వెళ్ళాడు సెక్లాడో. చాలా గొప్పగా ఉంది ఇల్లు. పెరడులో కొబ్బరిచెట్లు, ఇంకా అనేక రకాల మొక్కలూ అందంగా ఉన్నాయి లోపల చిత్ర విచిత్రాలైన యవనికలు ఉన్నాయి. ఇంట్లోవున్న విలాస వస్తువులన్నీ ...ఏ పనీ చేయకుండా సోమరిగా ఉన్నా వచ్చిపడే సదమంత్రపు సిరిని సూచిస్తున్నాయి. బైటి గదిలో మేజా బల్లలముందు చాలామంది క్లయింట్లు కాచుకుని ఉన్నారు. ఏవో పత్రికలు తిరగవేస్తూ అడ్వకేటు ఫాంసరిన్‌గారి దర్శనాన్ని అపేక్షిస్తూ ఉన్నారు. వారందరి ముఖాలూ విచారగ్రస్తంగానే ఉన్నాయి. ఆ గదిలోనే ఒక ఎత్తుబల్లముందు ప్లీడరుగారి గుమాస్తా కూచుని వున్నాడు. అతను సెక్లాడోను గుర్తించి లేచివచ్చి స్వాగతం ఇచ్చాడు. "ఇప్పుడే వెళ్ళి ప్లీడరుగారికి మీ రాక ఎరిగిస్తాను" అని బయలుదేరాడు. కాని ఇంతలో ఆ పక్క తలుపు తెరుచుకుంది. ఆవేశంగా ఏమో మాటాడుతూ ఒక నడిమి వయస్సు పెద్దమనిషి బయటికి వచ్చాడు. అతడు లావుగా ఉన్నాడు. ఒక వర్తకుడై ఉంటాడు. ముఖం కందిపోయి ఉన్నది. దట్టమైన మీసకట్టు. నూతన దుస్తులు ధరించి ఉన్నాడు. అతని వెనుకనే ఫాంసరిన్ కూడా ఏవో మాటలు విసురుతూ వచ్చాడు. ఇద్దరి ముఖాల్లోనూ...ఏదో లాభకరమైన—కాని ఒక మోసభూయిష్టమైన-పనిని కొనసాగించినప్పటి భావం వ్యక్తమౌతూ ఉంది.

"అంతా మీదే తప్పు. తెలిసిందాండి" చిరునవ్వుతో అంటున్నాడు ఫాంసరిన్.

"తప్పులే చెయ్యకపోతే అందరమూ స్వర్గానికే వెడతాం."

"ఔనౌను. ఆ విషయం మనందరికీ తెలిసిందే."

ఇద్దరూ అసహజంగా నవ్వారు.

అడ్వకేటు సెక్లాడోను చూశాడు. "ఓ, మీరా! రండి—" అని వర్తకుని వీడ్కొని-తన గదిలోనికి తీసుకుపోయాడు. ఇద్దరూ ఎదురు బొదురుగా కుర్చీల్లో ఆసీనులైనారు.

అంతకుముందే ఆ వర్తకునితో ముగించిన లాభసాటి సంభాషణ ప్లీడరుకు మనసునుంచి తొలగిపోలేదు. తనలో తిరిగి సంతోషం పొంగుతోంది. చిరునవ్వు అణచుకుని "సిగరెట్ కాలుస్తారా" అన్నాడు.

"వద్దులెండి, మస్లొవా కేసువిషయం మాటాడి పోదామని వచ్చాను."

"ఔనౌను, మాటాడదాం. కాని...ఈ బలిసిపోయిన ధనవంతులు... అబ్బ...ఎలాంటి చిలిపివాళ్ళుగా ఉన్నారు! ఆ మనిషిని మీరు చూశారుగా! వాడికి నూటఇరవై లక్షల రూబుల్సు ఆస్తి ఉంది. స్వర్గం, పాపాలు గురించి మాటాడతాడు. మీ దగ్గరనుంచి ఒక ఇరవై అయిదు రూబుల్సు, వీలుగా ఉంటే కాజేయటానికి వెనుదీయడు.

"వాడు స్వర్గం, పాపం అంటాడు. ఒక పాతిక రూబుల్సు ఎవడి దగ్గరో కాజెయ్యి అని నువ్వు బోధస్తావు" ఈ మాటలు నెహ్లూడొవ్ లోలోపలే అనుకున్నాడు. తన క్లయింట్లంతా ఒక కింది అంతస్తుకు చెందిన వారన్నట్లూ, తనూ, నెహ్లూడొవ్ ఒక పై మెట్టుకు చెందిన వారన్నట్లూ ధ్వనించి మాటాడుతూన్న ఆ ప్లీడరును చూస్తుంటే నెహ్లూడొవ్‌కు అసహ్యం కలక్క పోలేదు.

"అబ్బ, వాడు నా ప్రాణం తీశాడు—దుర్మార్గుడు!" అంటూ ప్లీడరు మళ్ళీ పునస్థిమితాన్ని తెచ్చుకుంటున్న వాడులా నటించి—"ఊఁ. ఇక మనకథ. కేసు అంతా శ్రద్ధగా చదివాను. తీర్పు చాలా అసంతృప్తిని కలిగించింది— అపీలుకు తగినంత కారణం లేకుండా ఆ అడ్వకేటు కేసును తగలేసి కూచున్నాడు."

"మరి ఇప్పుడేమి చేద్దామంటారు"?

ఇంతలో గుమాస్తా లోనికి వచ్చాడు. ఫానరిన్ అతనికేసి తిరిగి అన్నాడు—"నే నన్న మాటకు తిరుగులేదని అతనితో చెప్పు. అందుకతను ఒప్పుకుంటే సరే. లేకపోతే పోనీ—"

"అతను ఒప్పుకోటంలేదు."

"అయితే పోనీ" ఫానరిన్ ముఖం కోపంతో కందళించింది.

అన్నాడు దూకుడుగా..."ప్లీడర్లకు డబ్బు ఉచితంగా ఇస్తున్నాం అని వీళ్ళ ఉద్దేశం,.." అని కాసేపు ఆగాడు. మళ్ళీ ముఖంలో మామూలు

శాంతం తెచ్చుకున్నాడు. మళ్ళీ అన్నాడు..."ఒక దివాలా తీసినవాణ్ణి... అతడు లోకులకు చాలా బాకీ ఉన్నాడు...అతన్ని ఒక అదృష్టపు నేరారోపణనుంచి తప్పించిన తర్వాత వీళ్ళంతా నా చుట్టూ తిరగటం మొదలు పెడుతున్నారు. అలాంటి కేసు ఎంతో ఖర్చు అవుతుంది. మేం మాత్రం ఇక్కడ ఊరికే కూచున్నా మేమిటి...? సరే, ఇక మీ కేసుకు వద్దాం. అంటే మీరు శ్రద్ధ తీసుకుంటూన్న కేసన్నమాట! కేసును చాలా ఘోరంగానే పడేసారు చెప్పద్దూ. అపీలుకు ఏమాత్రం అవకాశం లేకుండా తగలేశారు. అయినా శిక్షను కొట్టివేయించటానికి ప్రయత్నం చెయ్యొచ్చు. నేను గమనించిన విషయం అదీ-" అంటూ కొన్ని రాసిన కాగితాలేవో తీసి గబగబా అక్కడక్కడ ఇలా చదివాడు. "క్రిమినల్ డిపార్టుమెంటుకు సంబంధించిన అపీలుకోర్టువారి దివ్యసముఖమునకు:—కింది కోర్టు ఫలానా తీర్పు ననుసరించి, మస్లోవా అనే యువతి స్మెల్కోవ్ అనే వర్తకుని విషం యిచ్చి చంపిందన్న నేరం రుజువై పీనల్ కోడ్ 1454 కారిక ప్రకారం సైబీరియాకు నిర్వాసిత కావలెనని తీర్మానం అయింది" ఇక్కడ ఆ పాడు ప్లీడరు తాను తయారుచేసిన అపీలును చదువుతూ ఒకరకమైన ఆత్మతృప్తి అనుభవించాడు. కాసేపు ఆగి మళ్ళీ చదవటం ఆరంభించాడు: "ఈ తీర్మానం అనేక పొరపాట్లు, తప్పిదాల ఫలితం అయివుంది. ఈ తీర్పును కొట్టివేయటానికి తగినన్ని ఆధారాలు ఉన్నాయి. మొదటిది: స్మెల్కోవ్ ప్రేవులకు సంబంధించిన వైద్యపరీక్షా ఫలితాల్ని చదువ నారంభించినప్పుడు ప్రెసిడెంటు ఆదిలోనే అటంక పరిచాడు" అని నెహ్లూడోవ్ వైపు చూసి "ఇది మొదటి పాయింటు" అన్నాడు.

ఆ మాటకు నెహ్లూడోవ్ ఆశ్చర్యపోయాడు. "కాని అది చదవవలసిందేనని కోరింది ప్రాసిక్యూటరేకదా!"

"అయితే కావచ్చు. అది చదవవలసిందేనని కోరటానికి డిఫెండెంటుకు కూడా తగినన్ని కారణాలు ఉండవచ్చు."

"అందుకేమీ కారణాలు ఉండేవు."

"ఏమైనా కానీ, అపీలుకు అదొక పాయింటే. ఇంకా వినండి" అని మళ్ళీ చదవటం ఆరంభించాడు : "ఇక రెండో విషయం; మస్లోవా తరఫున వాదిస్తోన్న ప్లీడరు ఆమె స్వభావస్వరూపాల్ని గురించి మాటాడుతూ, ఆమె పతితకావటానికి కారణభూతాలైన సన్నివేశాల్ని వర్ణిస్తూన్నప్పుడు ప్రెసి

డెంటు అడ్డువచ్చి 'అనవసర-అసందర్భ' ప్రసంగాల్ని వద్దన్నాడు. కాని క్రిమినల్ కేసులలో నేరస్థుల గుణగణాల్ని, వారి నైతిక స్థితిగతుల్ని విశద పరచటం చాలా అవసరం"-అంటూ నెహ్లూడొవ్ ముఖంలోకి చూచి "ఇది రెండో పాయింటు" అన్నాడు.

"కాని ఆ ప్లీడరు తను మాటాడేది ఎవరికీ అర్థంకాకుండా చాలా అసహ్యంగా మాటాడాడు"-అన్నాడు నెహ్లూడొవ్ మరింత ఆశ్చర్యపడుతూ.

"ఔను, అతడొక బుద్ధిహీనుడు. అర్థయుతంగా మాటాడ్డం అతనికేం చాతనౌతుందీ?" అని ప్లీడరు నవ్వుతూ "అయినాసరే, అపీలుకు అదొక పాయింటే. "ఇక మూడో పాయింటు : చివరకు విచారణ వివరాలను తెలియజేస్తూ ప్రెసిడెంటు 1 వ సెక్షను 801 అంశం ప్రకారం...ఆమె నేరం చేసిందనటానికి ఏయే విచారణాంశాలు తోడుపడుతున్నాయో...జూరీలకు చెప్పాలి; కాని ఆయన అలా చెప్పలేదు. స్మెల్కోవ్‌కు మస్లోవా విషం యిచ్చినప్పటికీ...అతని ప్రాణాల్ని తీయాలన్న కోరిక ఆమెకు వున్నదని చెప్పటానికి తగిన నిదర్శనాలు లేవు కనుక...జ్యూరీలు ఆమెపై హత్యానేరాన్ని రుద్దనక్కరలేదు; 'ఆమె అజాగ్రత్తగా, నిర్లక్ష్యంగా ప్రవర్తించింది; తత్ఫలితంగా వర్తకుడు చనిపోయాడు. కాని అతని మృత్యువును ఆమె కోరలేదు' అని చెప్పటానికి జ్యూరీలకు హక్కు వున్నది—అనే సంగతినికూడా ప్రెసిడెంటు జ్యూరీలకు చెప్పియుండవలసింది. కాని అతడు చెప్పలేదు' ఇది చాల ముఖ్యమైన పాయింటు."

"ఔను. కాని, ఆ సంగతి మేమైనా తెలిసికొని వుండాల్సింది. అది మా తప్పు."

"ఇక నాలుగో పాయింటు : జ్యూరీలు తయారుచేసి యిచ్చిన తీర్పులోనే వ్యాఘాతం ఉంది. అసలు బుద్ధిపూర్వకంగా ఆశాపాతకురాలై మస్లోవా వర్తకుని చంపింది అని నేరారోపణ. అసలు ధనాశే ఆ హత్యకు ఏకైక కారణం అయివుండాలి. కాని వర్తకుని డబ్బు కాజెయ్యాలన్న ఉద్దేశం మస్లోవాకు లేదని జ్యూరీలు అంగీకరించారు. వర్తకునివద్ద వున్న విలువైన వస్తువుల్ని దొంగిలించుకుపోవాలన్న ఆశకూడా ఆమెకు లేదని జ్యూరీలు అంగీకరించారు—అంటే ఆమె హత్య చెయ్యలేదన్న దానికికూడా ఒప్పుకోవటానికేసిద్ధపడ్డారన్న మాట. కాని వారు తీర్పులో అలాగేనిక్కచ్చిగా

రాయలేకపోవటానికి కారణం: ప్రెసిడెంటువారికి విచారణాంశాలను వివరంగా చెప్పలేకపోవటమే. ఇటువంటి పరిస్థితులలో 817; 833 కారికల ననుసరించి ప్రెసిడెంటు జ్యూరీలకు వారి పొరపాటును తెలియచెప్పవలసి వుంటుంది. జ్యూరీలు మళ్ళీ పర్యాలోచించుకుని మరొక తీర్పు ఇవ్వవలసివుంటుంది."

"మరి ప్రెసిడెంటు అలా ఎందుకు చెయ్యలేదు?"

"ఎందుకు చెయ్యలేదో నేనూ తెలుసుకోగోరుతున్నాను"—అన్నాను.

"అయితే ఈ పొరపాటును సెనేటు సవరిస్తుందంటారా?"

"అది ఆ సమయాన సెనేటు పక్షను అధ్యక్షత వహించే వ్యక్తిమీద ఆధారపడివుండే విషయం. ఇంకా ఒక మాట వుంది: 'ఈ విధంగా జ్యూరీలు ఇచ్చిన తీర్పునుపట్టి ముద్దాయిని నేరస్థుడుగా పరిగణించి శిక్షించడానికి కోర్టువారికెట్టి అధికారమూ లేదు; ముద్దాయి కేసును 771 కారిక 3 వ సెక్షనుతో ముడిపెట్టేందుకేమీ వీలులేదు. క్రిమినల్ చట్టము ప్రాతిపదిక సిద్ధాంతాలకే విరుద్ధంగా జరిగింది. ఈ పై అంశాలను పురస్కరించుకుని 909 కారిక, 910 కారిక 2 వ సెక్షను; 912, 928 కారికల ప్రకారం ఈ కేసును అదే కోర్టులో మరొక డిపార్టుమెంటుకు తిరిగి విచారించేందుకు పంపించవలసిందిగా కోరుతూ అపీలు చేసుకుంటున్నాను'—విన్నారా! నేను చేయతగినదంతా చేశాను. కాని చెప్తున్నా, మంచిఫలితం సాధించగలమని ఎక్కువ నమ్మకంతో చెప్పలేను. ఆ సమయాన సెనేటులో హాజరయ్యే సభ్యులను బట్టి వుంటుంది. మీకు పలుకుబడివుంటే వెళ్ళి ప్రయత్నం చెయ్యవచ్చు."

"ఎరిగివున్నాను కొంతమందిని."

"భేష్, అయితే తొందరపడండి. చాలా కేసులంటే వాళ్ళంతా ఏ మూలనో వ్యాధులు బాగుచేయించుకోవటానికి వెళ్ళిపోతారు. మూడువారాలకుగాని రారు మళ్ళీ. అక్కడా నెగ్గలేకపోతే ఇక చక్రవర్తికి అపీలు చేసుకోవాలసిన అవసరం ఏర్పడుతుంది - అప్పుడు నాకూ కొంత తెరవెనక భాగోతం ఆడాల్సి వుంటుంది. చివరదాకా నేను వున్నాను కదా, అంటే పిటిషన్లు రాసిపెడుతూ వుండటానికే-తెరవెనక భాగోతాలకు కాదు."

"కృతజ్ఞుణ్ణి. ఇక మీ ఫీజు విషయం..."

"మా గుమాస్తా మీకు పిటిషన్ తయారుచేసి ఇస్తాడు. అతను చెబుతాడు."

"మరొక్క విషయం : నేను ఆమెను జైల్లో వెళ్ళి చూడ్డానికి ఒక ఆజ్ఞాపత్రం సంపాదించాను. కాని జైలు అధికార్లు నిర్ణయించే సమయాల్లో కాక మరొకప్పు డామెతో మాట్లాడ్డానికిగాని, వేరే ఇంకో గదిలో ఆమెతో సంభాషించటానికిగాని ఆ అజ్ఞాపత్రం చాలదని వాళ్ళు అంటున్నారు. అందుకు గవర్నరుగారి అనుమతి కావాలిట. నిజమేనంటారా ?"

"ఔను, నిజమేననుకుంటాను. గవర్నరు ప్రస్తుతం ఊళ్ళో లేడు. ఆయన అధికారాన్ని డిప్యూటీ గవర్నరు నిర్వహిస్తూ ఉన్నాడు. కాని అతడు వట్టి మూర్ఖుడు. అతనివల్ల మీకేమీ పని జరగదు.

"డిప్యూటీ గవర్నర్ అంటే మాస్లన్నికోయేనా ?"

"ఔను, అతడే."

"అయితే అతన్ని నేను ఎరిగివున్నాను"—అంటూ నెహ్లూడో వెళ్ళిపోడానికి లేచాడు. ఆ సమయాన ఒక అనాకార యువతి బిరబిర లోనికి దూరవగా వచ్చింది. పొట్టిశరీరం, చట్టిముక్కు, విరూపమైన ముఖకవళిక. ఆమె అడ్వకేటుగారి భార్య. తన కురూపతకు ఏమాత్రమూ కించపడుతున్నట్టు లేదామె.

వస్త్రధారణలో ఆమె తన గొబ్బు చూపించింది. వెల్వెట్, సిల్కు వస్త్రాల్లో చుట్టిపెట్టిన ఒక నీలిరంగు గిన్నె సాంలా వుంది. పలుచనిజుట్టు ఒకరీతిగా దువ్వి ముడిచింది. ఆమె ఏదో విజయగర్వంతో గదిలో ప్రవేశించింది. ఆమె వెనకనే ఒక మందహాసవదనుడుకూడా వచ్చాడు. ఒకసిల్కు కోటు, తెల్లని మెడపట్టీ ధరించి వున్నాడు. అతడొక గ్రంథకర్త. నెహ్లూడో అతన్ని చూడగానే గుర్తించాడు.

ఆమె పక్కగది తలుపుతీస్తూ భర్తను ఆప్యాయంగా పిల్చి, "మీరు కూడా రావాలి. సైమన్ కవి వచ్చాడు. ఈ కావ్యపఠనం చేస్తాడు. తప్పకుండా రండి" అన్నది.

ఆ తరువాత ఆమె తనభర్తచెవిలో ఏదో చెబుతూవుండటం నెహ్లూడో చూశాడు. అది తన్నుగురించే అయివుంటుందని ఊహించాడు. వెంటనే

అచ్చోటు వీడి వెళ్ళిపోడానికి ఉద్యుక్తుడైనాడు కాని ఆమె అతన్ని వారించింది-"క్షమించాలి; మిమ్మల్ని నేను ఎరక్కపోలేదు-మీరుకూడా వస్తూ వుండి మా సాహిత్య వ్యాసంగంలో పాల్గొనాలి. చాలా ఉత్సాహకరంగా వుంటుంది. మా వారు ఎంత చక్కగా మాట్లాడతారనుకున్నారేమిటి?" అంది.

"నాకిప్పుడు ఎంతపని వున్నదో చూశావా?"-అన్నాడు అడ్వకేటు మందహాసంచేస్తూ—అంత చక్కని మహాయిల్లాలి కోరికను చెల్లించకుండా వుండటం చాలా కష్టం అన్న భావాన్ని ప్రకటిస్తూ.

నెఖ్లూడో ఒక విచారసూచకమైన చూపుతో...ఆ యిల్లాలి ఆహ్వానాన్ని మృదువుగా నిరాకరించి...అచ్చోటు వీడి వెళ్ళిపోయాడు.

"అదోరకం మనిషిలా వున్నాడే!"-అన్నదామె అతన్నిగూర్చి అతడు వెళ్ళిపోయాక.

బైటగదిలో అడ్వకేటు గుమాస్తా తయారుచేసిన పిటిషన్ నెఖ్లూడో చేతికిచ్చి - ఫీజు వెయ్యిరూబుల్సు ఔతుందండి. మా అడ్వకేటుగారు సాధారణంగా ఇలాంటి కేసులు పట్టరు. అయినా మీరు కాబట్టి పుచ్చుకున్నారు" అని చెప్పాడు.

"మరి ఈ పిటిషన్ మీద ఎవరు సంతకం చెయ్యాలి ?"

"ఖైదీగా వుంటున్న ఆమె చెయ్యవచ్చు. అది సంకష్టపడకపోతే అడ్వకేటుగారే చేస్తారు. ఐతే ఆమెతరఫున పవర్ ఆఫ్ అటార్నీ వుండాలి."

"అక్కరలేదు. అక్కడికే తీసుకుపోయి ఆమెచేతనే సంతకం పెట్టిస్తాను"-అంటూ నెఖ్లూడో కదలి వెళ్ళిపోయాడు—ఈ వంకనైనా ఆమెను కలుసుకునే అవకాశం లభించిందని సంతోషిస్తూ.

౪౨

యథాసమయాన జైలరు ఈల. జైలు గదుల ఇనుప తలుపుల చప్పుడు. పదధ్వనులు. పాకీపనికి నియోజితులైన ఖైదీలు తొట్లు పుచ్చుకుని తిరుగుతూ వాతావరణాన్ని దుర్గంధ కలుషితం చేశారు. ఖైదీలు ముఖప్రక్షాళనాదికాలు ముగించుకున్నారు. అధికార్ల తనిఖీ అయింది. తేనీరు కలుపుకునేందుకు నీళ్ళు కాచుకుంటున్నారు ఖైదీలు.

ఆ ఉదయం ప్రతి గదిలోనూ ఖైదీల సంభాషణ—నాడు కొరడా దెబ్బలు తినవలసియున్న ఇద్దరు ఖైదీలను గురించి సాగుతోంది. ఆ ఇద్దరిలో వసీలే అనే యువకుడొకడు. అతను కొద్దిగా చదువుకున్నాడు. గుమాస్తా పని చేస్తూ ఉండేవాడు. ఈర్ష్యాగ్రస్తుడై కోపావేశంలో భార్యను హత్య చేశాడు. మిగతా ఖైదీలకు అతనంటే అభిమానం కుదిరింది. హాస్యరసప్లుతంగా మాటాడతాడు. ఉదారమైన స్వభావం. జైలు అధికార్లతో భయంలేకుండా నిష్కర్షగా ప్రసంగించగలడు. జైలుకు సంబంధించిన చట్టాలన్నీ అతనికి బాగా తెలుసు. అధికార్లు వాటిని అనుసరించి నడుచుకోవలసిందేనని అతడు గట్టిగా వాదిస్తాడు. అందుచేత అధికార్లకు అతనంటే ద్వేషం.

మూడు వారాల క్రితం ఒక జైలు పాకీవాడు ఫ్రుసుగిన్నె పట్టుకు పోతూ కొంత వొలుకబోయటం జరిగింది. అది జైలర్ ధరించిన కొత్త దుస్తులపై పడ్డది. అతడు పాకీవాణ్ణి చేత్తో కొట్టాడు. వసీలే పాకీవాని పక్షం వహించి అలా కొట్టటం న్యాయ విరుద్ధం అని గట్టిగా వాదించాడు. "నీకు న్యాయపాఠాలు నేర్పుతాలే ఉండు" అంటూ జైలర్ అతన్ని నానా మాటలూ అన్నాడు. వసీలేకూడా అంతే ఏమీ తగ్గకుండా మాటకు మాట సమాధానం చెప్పాడు. జైలరుకు వొళ్ళు మండి కొట్టబోయాడు. వసీలే అతను యెత్తిన చేతుల్ని అలాగే గట్టిగా నొక్కి పట్టుకున్నాడు. పట్టిన చేతుల్ని అలాగే పట్టుకుని వుండి అతన్ని బలంగా తలుపవతలకు నెట్టివేశాడు. జైలరు వెళ్ళి ఇన్‌స్పెక్టరుకు ఫిర్యాదు చేసుకున్నాడు. వసీలేను ప్రత్యేకం ఒక గదిలో ఉంచమని ఇన్‌స్పెక్టరు ఆజ్ఞాపించాడు.

ఈ ప్రత్యేక గదులు చాలా చీకటిగా ఉంటాయి. వీటికి జైలర్లు బైట తాళం వేస్తారు. పడుకోటానికి పక్కగాని, కుర్చీగాని, టేబిల్ గాని ఉండవు. ఒట్టి నేలమీద పడి ఉండాల్సిందే. ఎలుకలు మీదనుంచి దాటిపోతూ ఉంటాయి. ఆ గదుల్లో ఎలుకలు అసంఖ్యాకంగా ఉంటాయి. గడుసు ఎలుకలు కూడాను. ఖైదీల రొట్టెల్ని జబర్దస్తీగా ఎత్తుకుపోతూ ఉంటాయి. వసీలే ఇటువంటి గదిలోకి వెళ్ళటానికి ఇష్టపడలేదు. తనేమీ తప్పు చెయ్యలేదని వాదించాడు. అధికార్లు బలప్రయోగం చేసినప్పుడు తీవ్రంగా పెనగులాడాడు. అప్పుడతనికి ఇద్దరు ఖైదీలు మద్దతుగా వచ్చారు. జైలర్లంతా ఏకమైనారు. వారిలో పెట్రోవ్ అనేవాడు భీమబలుడని పేరుపడ్డవాడు.

అందరూ కలిసి ఖయిదీలను ఆ చీకటి గదుల్లో బంధించేశారు. ఖయిదీలంతా బ్రహ్మాండంగా తిరుగుబాటు చేస్తున్నారంటూ గవర్నరుకు సమాచారం పంపించారు. వెంటనే ప్రముఖ నాయకులనదగిన వసీలి, పెట్రోవ్స్కియాప్-ఇద్దర్ని వేముబెత్తంతో ముప్పయి దెబ్బలు కొట్టవలసిందిగా ఆజ్ఞ జారీ అయింది.

ఈ సంగతి అందరికీ తెలిసిపోయింది. ప్రతిచోటా ఖయిదీలు ఈ విషయాన్ని గురించే చెప్పుకుంటూ ఉన్నారు. కొరాబ్లేవా, ఫియోదోసియా, మస్లోవా ఒక మూల కూచుని టీనీరు తాగుతున్నారు. సారాయం కూడా సేవించారు. అందుమూలాన ముఖాలు బాగా ఎర్రబడి ఉన్నాయి. ఉత్సాహంగానూ ఉన్నారు. ఇప్పుడు మస్లోవాకు సారాయం బాగానే సరదాయి అవుతోంది. స్నేహితురాళ్ళకూ ధారాళంగా పోస్తూ ఉంది.

"పాపం, అతడు విప్లవం లేవదీయలేదు, తిరుగుబాటూ లేవదీయలేదు. ఈ కాలంలో ఖయిదీలమీద చేయి వేసుకోకూడదట. అందుకని 'రూలు' ప్రకారం గట్టిగా మాట్లాడాడు; అంతే" అన్నది కొరాబ్లేవా తన గట్టి దంతాల మధ్య రొట్టెముక్క కొరుకుతూ.

"అతడు చాలా మంచివాడు కూడాను; విన్నాను" అన్నది ఫియోడోసియా, టీనీరు కలిపిన గిన్నె కెదురుగా ఒక దూలంముక్కమీద కూచుని.

"ఇదిగో, నువ్వు ఈ విషయం ఆయనతో చెబితే!" అన్నది రైల్వే కూలివాని భార్య మస్లోవాతో 'ఆయన' అంటే నెఖ్లూడోవ్ అని ఆమె భావం.

"అయితే చెబుతాను. ఆయన నాకోసం ఏమైనా చేస్తారు" అన్నది మస్లోవా తల ఆడిస్తూ, మందహాసం చేస్తూ.

"మరి ఆయన ఎప్పుడొస్తారూ? అప్పుడే అతన్ని తీసుకుపోయారు బెత్తపు దెబ్బలు కొట్టటానికి. ఎంత ఘోరం!" అన్నది ఫియోడోసియా.

"మా పల్లెటూళ్ళో ఒకసారి ఒక రైతును బెత్తపు దెబ్బలు కొట్టటం కళ్ళారా చూశాను. మా మామగారు ఊరి మునసబుగారింటికి ఏదో పని మీద పంపితే వెళ్ళాను. అక్కడ..." అంటూ రైల్వే కూలివానిభార్య ఒక పెద్దకథ ఆరంభించింది. ఇంతలో ఆ పక్క వరండాలో కంఠధ్వనులూ, పదధ్వనులూ వినిపించాయి. కథ అంతటితో ఆగిపోయింది.

ప్రసంగం మానేసి స్త్రీలంతా వింటూ కూచున్నారు.

"అతన్నే లాక్కుపోతున్నారు. రాక్షసులు! అతన్ని పాపం చంపేస్తారు; సందేహంలేదు. జైలర్లకు అతనిమీద పచ్చికోపం వుంది. అతడు వాళ్ళకెప్పుడూ లొంగేవాడు కాదాయెను"-అన్నది హొరోషోకా అను మరో యువతి.

కాసేపు నిశ్శబ్దం. మళ్ళీ తన కథ సాగించింది రైల్వే కూలివానిభార్య. ఊరి మునసబుగారింటో ఒక రైతును చావుదెబ్బలు కొట్టటం, తానా దృశ్యం చూడలేక మూర్ఛపోవటం—ఈ మొదలుగాగల సన్నివేశాలన్నీ చిత్రించింది - ఎంత కొడుతున్నా, పాపం ఆ రైతు ఒక్కమాటకూడా పలుకలేదనీ-ఏమేమో చాల చెప్పింది. థియోడోసియా తేనీటి సగంజామా సర్దింది. కొరాబ్లెవా, రైల్వే కూలివానిభార్య కుట్టుపనిలో నిమగ్నులైనారు. మస్లావా మోకాళ్ళచుట్టూ చేతులు పోనిచ్చి గుప్పటిమీద కూచుంది నిరుత్సాహంగా. పడుకుని నిద్రపోదామనుకుంది. కాని ఇంతలో జైలువార్డను వచ్చి "నీతో ఎవరో మాట్లాడ్డానికి వచ్చారు" అని చెప్పింది.

మస్లావా లేచింది - ఒక మాసిన అద్దంముందు నిల్చుని తలమీద రుమాలు సర్దుకుంది. "ఇదిగో, ఆయనతో మా సంగతి చెప్పటం మరచిపోకుసుమీ !"-అన్నది మెన్షోవా ముసలమ్మ—"మేము ఇల్లు తగులబెట్టలేదు. ఆ రాక్షసుడే చేశాడాపని. అతడు నిప్పు అంటిస్తూవుండగా అతని సేవకుడే చూచాడు. వాడు నిజం దాచి పాపం మూటగట్టుకోడు. ఆయన్ని మా మిత్రీని ఒకసారి కలుసుకోమని చెప్పు - మిత్రీ అంతా ఉన్నది ఉన్నట్టు చెప్పేస్తాడు. ఏ పాపం ఎరక్కపోయినా మేము చూడు, ఎలా ఈ జైల్లో అవస్థపడుతున్నామో! ఆ రాక్షసుడు మాత్రం మరొకడి భార్యను పెట్టుకుని అక్కడ హాయిగా కులుకుతూ వున్నాడు!"

"అది న్యాయంకాదు"—అన్నది కొరాబ్లేవా.

"చెబుతాను; ఆయనకు చెబుతాను...ఇప్పుడు నేనొక చుక్క మళ్ళీ వేసుకుంటే! కాస్త వుత్సాహంగా వుంటుందిగా !"—అన్నది మస్లోవా, కళ్ళతో కులుకుతూ. కొరాబ్లేవా ఒక అరగ్లాసెడు పోసి ఇచ్చింది. అది మస్లావా తాగేసి..."కాస్త ఉత్సాహంగా ఉంటుంది"...అని అనుకుంటూ వార్డన్ వెంట బయలుదేరి వెళ్ళింది, తల ఊపుకుంటూ, విలాసంగా నవ్వుతూ.

## ౬౭

నెఖ్లూదోవ్ హాల్లోకి వచ్చేసరికి పని వేళాకేసమయింది. నెఖ్లూదోవ్ అక్కడకు రాగానే ద్వారం దగ్గర ఉన్న జైలరుకు తాను తెచ్చిన అనుమతి పత్రాన్ని చూపించాడు.

"ఎవర్ని చూడాలి తమరు?"

"మస్లోవాను; ఆమె ఇక్కడ ఖయిదీ."

"ఇప్పుడు వీలుకాదు - ఇన్‌స్పెక్టరుగారు వేరే పనిమీద ఉన్నారు."

"ఆయన ఆఫీసులో ఉన్నారా?"

"ఊహుఁ. ఆ పక్కగదిలో ఉన్నారు."

"వారిని నేను ఒకసారి సందర్శించాలి."

"అయితే కాసేపు ఆగండి. వారు బైటికి వచ్చాక మాటాడుదురు గాని."

అప్పుడే పక్కనున్న ద్వారంగుండా ఒక సార్జంటు మేజరు వచ్చాడు. మొగం నున్నగా మెరుస్తోంది. మీసాలు పొగాకు చుట్టల వాసనను ఆచికొన్నాయి. అతడు ధరించిన యూనిఫారం దుస్తులు మెరుస్తున్నాయి. "ఎవర్నిబడితే వాళ్ళను లోపలికి రానిస్తున్నావేమిటి?" అంటూ జైలరును తీవ్రంగా మందలించాడు.

సార్జంటు మేజరు ముఖకవళికలోని విలక్షణతను నెఖ్లూదోవ్ చూశాడు. "ఇన్‌స్పెక్టరుగారు ఇక్కడున్నారని వినివచ్చాను" అన్నాడు. అప్పుడు ఆ లోపటి తలుపు తెరచుకుని పెట్రోవ్ వచ్చాడు. అతడు ఆవేశంగా ఉన్నాడు. వొళ్ళంతా చెమట పోస్తున్నది. — "జీవితాంతం జ్ఞాపకం ఉంచుకుంటాడు" అన్నాడు సార్జంటు మేజరువైపు చూస్తూ. సార్జంటు మేజరు కన్నుగిలికాడు...ఎవరో క్రొత్తవ్యక్తి ఉన్నాడని తెలుపుతున్నట్టు. పెట్రోవ్ అది గమనించి, కనుబొమలు కుంచించుకుని వెళ్ళిపోయాడు.

"జ్ఞాపకం ఉంచుకునేది దేన్ని? ఎవరా జ్ఞాపకం ఉంచుకునేది? సార్జంటు మేజరు ఎందుకు కంటిసైగ చెయ్యాల్సి వచ్చింది?" నెఖ్లూదోవ్ ఆలోచనలో పడ్డాడు.

"ఇన్‌స్పెక్టరుగారిని మీరు ఇక్కడే కలుసుకోలేరు. దయచేసి ఆఫీసులోకి పదండి" అన్నాడు సార్జంటు మేజరు నెహ్లూడోవును ఉద్దేశించి.

నెహ్లూడోవ్ ఆఫీసువైపు తిరిగి వెళ్ళబోతున్నాడు. ఇంతలో ఆ వెనుక తలుపు తెరుచుకుని ఇన్‌స్పెక్టరు వచ్చాడు. అతడు నెహ్లూడోవు చూడ్డంతోనే జైలువైపు తిరిగి—"స్త్రీల వార్డు 5 వ నంబరు గదిలో వున్న మస్లోవాను ఆఫీసుకు పంపించు" అని ఆజ్ఞాపించాడు—మళ్ళీ నెహ్లూడోవ్ వైపుతిరిగి—"దయచేసి ఇటు నాతో రండి" అన్నాడు. ఇద్దరూ మెట్లెక్కి ఒకగదిలో ప్రవేశించారు. ఆ గదికి ఒకే కిటికీ వుంది.

"ఇవి ఎంత కష్టతరమైన బాధ్యతలనుకున్నారు? అబ్బబ్బ!"—అంటూ ఇన్‌స్పెక్టరు సిగరెట్ తీశాడు.

"అవును మీరు చాలా అలసిపోయినట్టే కనిపిస్తున్నారు."

"అలసిపోవటమా, అలసిపోవటమా! ఇక్కడ అందరికన్నా నాకే ఎక్కువ బాధ. ఎలా ఈ గొడవలోనించి బయటపడదామా అని చూస్తున్నాను. అబ్బ. ఎంతకష్టం! ఎంతకష్టం!"

నిజానికి అతనికష్టమేమిటో నెహ్లూడోవుకు తెలియదు. కాని ఆ సమయాన అతడు చాల నిరుత్సాహంగా – చూస్తే ఎవరికేనా జాలి కలిగేట్టు ఉన్నాడు. "ఔను, మీ బాధ్యతలు చాలా కష్టతరమనే తోస్తున్నది. అయితే మరి మీరీ వుద్యోగం చెయ్యకపోతేనేం?" అన్నాడు నెహ్లూడోవ్.

"కుటుంబాన్ని ఏంచెయ్యను? పోషించవద్దూ!"

"మరి అంత కష్టతరమైనప్పుడు—"

"ఇటువంటి కష్టతరమైన ఉద్యోగంలోకూడా నేను దేశానికి కొంత ఉపయోగపడుతున్నానుగా! చేతనైనంతవరకు ఇక్కడ బాధ్యతలను సుళువుగానే నిర్వహిస్తూ వుంటాను. నేనుగాక మరొకడైతే తల్లకిందైపోవలసిందే. ఇక్కడ రెండువేలమంది జనం ఉన్నారు. ఎటువంటి జనం అనుకున్నారు? వాళ్ళను అదుపులో పెట్టటం తెలిసివుండాలి. మాటలు చెప్పటం కాదు; సామర్థ్యం ఉండద్దూ! ఇంతేకాక వాళ్ళంతా మానవమాత్రులే. వాళ్ళపట్ల జాలిపడక తప్పదు." ఇలా తన ధోరణిలో ఆయన ఇటీవల ఖైదీలలో ఒక పోరాటం జరిగిందనీ, అందులో మనిషి చచ్చిపోయాడనీ, వివరంగా చెప్పసాగాడు. ఇంతలో మస్లోవాను వెంటపెట్టుకుని జైలరువచ్చాడు.

జైలరు వెనకాల వస్తున్న మస్లోవాను నెక్లూడో చూశాడు. ఆమె విలాసంగా తల ఊపుకుంటూ నడిచివస్తున్నది. ఆమె ముఖం ఉత్సాహవంతంగా ఉంది. కాని ముందుకువచ్చి ఇన్స్పెక్టరును చూడ్డంతోనే ఆమె ముఖ కవళిక మారిపోయింది. అతనివైపు బెదురుగా చూడసాగింది. వెంటనే తన్ను తాను సంబాళించుకుని, నెక్లూడోను ఉద్దేశించి— "కులాసాగా ఉన్నారా?" అని ప్రశ్నించింది. మొదటిసారి వలెగాక, ఈ సారి ఉల్లాసంగా, చిరునవ్వుతో కరచాలనం చేసింది.

ఈసారి ఆమెచూపిన చొరవకు ఆశ్చర్యపోతూ—"పిటీషన్ తెచ్చాను; నువ్వు సంతకం పెట్టాలి. అడ్వొకేటు పిటీషన్ తయారు చేశాడు. నువ్వు సంతకంచేస్తే పీటర్స్‌బర్గు పంపిద్దాం—" అన్నాడు నెక్లూడో.

"అయితే సరే, మీ ఇష్టప్రకారమే—" అన్నదామె కళ్ళు తిప్పుతూ, మందహాసం చేస్తూ.

నెక్లూడో జేబులోనుంచి ఒక మడిచివున్న కాగితాన్ని తీసి టేబిల్ దగ్గరకు నడిచాడు. "ఆమె ఇక్కడ సంతకం చేయవచ్చునా?" అని ఇన్స్పెక్టరువైపు చూచి అడిగాడు.

"చేయవచ్చు. కూచోండి ఇదిగో కలం...నీకు రాయటం చేతనౌనా?" అని అడిగాడు మస్లోవాను.

"ఒకప్పుడు రాసేదాన్నే" అని మందహాసం చేస్తూ, దుస్తులు సర్దుకుని, టేబిల్ దగ్గర కూచుంది మస్లోవా. తన చిన్నచేతిలో కలం గట్టిగా పట్టుకుంది. నవ్వుతూ నెక్లూడో కేసి చూచింది.

ఏమి రాయాలో నెక్లూడో చెప్పాడు; ఎక్కడ సంతకం చేయాలో చూపించాడు.

ఆమె ఒక నిట్టూర్పు తీసి, కలం సిరాలోముంచి, కొంచెం పాళీమీది సిరా దులిపి, జాగ్రతగా తన పేరు రాసింది. "అయిందా?" అని అడిగింది. ఆమె చూపులు నెక్లూడోమీదినించి ఇన్స్పెక్టరుమీది గా కా పయనించాయి.

నెక్లూడో ఆమెచేతినుంచి కలం తీసుకున్నాడు "నీతో నాలుగు మాటలు చెప్పాలి" అన్నాడు.

"సరే, చెప్పండి" మరుక్షణమే ఆమె ఏదో జ్ఞాపకం వచ్చిన దాని లాగా గంభీరవదన అయింది. మత్తుగా ఉండిపోయింది. ఇన్‌స్పెక్టరు లేచి, గదివిడిచి వెళ్ళిపోయాడు.

## ౪౮

మాస్లోవాను తీసుకువచ్చిన జైలరు అల్లంత దూరాన కిటికీ అంచు మీద కూచున్నాడు:

నెఖ్లూడోవ్ భావి జీవిత విధానాన్ని నిర్ణయించే సమయం వచ్చింది. మొదటిసారి వచ్చినప్పుడే అసలు సంగతిని ఆమెకు చెప్పలేకపోయినందుకు తన్ను తాను చాలసార్లు నిందించుకున్నాడు—"నిన్ను నేను పెళ్ళాడుతాను" అని చెప్పివెయ్యాలని నిశ్చయించుకున్నాడు. టేబిల్ అవతల అంచున కూచుని ఉన్నదామె. ఆమె కెదురుగా ఇవతల అంచున కూచున్నాడు నెఖ్లూడోవ్. గదులో వెలుతురు బాగానే ఉంది.

ఆమె ముఖం ప్రస్ఫుటంగా కనిపించింది. ఆమె కన్నుల నలుపు, మూతి దగ్గర వొంపులు, ఉబ్బివున్న కనురెప్పలు చూచాడు. అతనికి జాలి కలిగింది. టేబిల్ మీద ముందుకు వంగి, నెమ్మదిగా, కిటికీదగ్గరవున్న జైలరుకు వినిపించకుండా ఇలా అన్నాడు:

"ఈ పిటీషన్ వల్ల కూడా ప్రయోజనం కలక్కపోతే చక్రవర్తికి అపీలు చేద్దాం. చేయవలసిందంతా చేద్దాం."

"ఔనౌను. మొదటినించీకూడా ఒక మంచి ప్లీడరువుంటే ఎంత బాగుండేది. అప్పుడు నా తరఫున వాదించిన ప్లీడరు ఎంత చిలిపి మనిషి! అస్తమానం నా అందాన్ని పొగడటం తప్ప ఆయన చేసిందేమీ లేదు—" ఆ మాట చెప్పి ఆమె ఫక్కున నవ్వింది-మళ్ళీ అందుకుని—"నాకు మీతో పరిచయం ఉన్నట్టు అప్పుడు తెలిసివుంటే మరో విధంగా ఉండేది. ప్రతివ్యక్తీ దొంగేనని వాళ్ళ అభిప్రాయం" అన్నది.

ఈ సారి ఆమె తీరు విచిత్రంగా కనిపించింది నెఖ్లూడోవ్‌కు. తన మనసులో మాట చెప్పివేద్దామని ఉద్యుక్తుడైనాడు. కాని ఆమె మళ్ళీ తన ధోరణి సాగించింది.

"మీకొక సంగతి చెప్పాలి: ఇక్కడొక ముసలమ్మ ఉంది-ఆమె చాల మంచిదిలెండి. ఆమెది విచిత్రమైన గాథ. ఏమీ నేరం చెయ్యకపోయినా ఆమెనూ, ఆమె కొడుకునూ జైల్లో పెట్టేశారు. వాళ్ళు ఓ ఇంటికి నిప్పంటించి, తగలపెట్టారని అబద్ధపు నేరం మోపారు వాళ్ళు నిర్దోషులని అందరికీ తెలుసు. చూచారా! మీతో నాకు చాలా పరిచయం వున్నదని తెలిసి నా ద్వారా ఆమె మీకొక విన్నపం పంపించింది. మీరు ఆమె కుమారుని వెళ్ళి కలుసుకోవాలట." ఈ మాటలు చెబుతూ మస్లోవా తల అటూ, ఇటూ త్రిప్పి, అతన్ని క్రీగంట చూచింది. "వాళ్ళది మెన్షోవ్ వంశం. చాల మంచి ముసలమ్మ. మీరు చూస్తే, ఆమె ఒట్టి నిర్దోషి అని, మీ నోటిమీదిగానే అనేస్తారు. ఆమె కొడుకును వెళ్ళి చూస్తారు కదూ! మీరు చాల మంచివారు" అంటూ మందహాసం విసిరి, క్రీగంటచూచి, తల వంచుకుంది.

ఆమె అంత చొరవగా, చనువుగా మాటాడుతూ ఉండటం చూచి నెఖ్లూడొవ్ మరింత ఆశ్చర్యాన్వితుడైనాడు. "సరే కనుక్కుంటాను కాని నన్ను గురించి నీకు కొన్ని సంగతులు చెబుదామని వచ్చాను. ఆనాడు నేను చెప్పిన విషయం జ్ఞాపకంఉందా?" అని అడిగాడు.

"ఆ నాడు మీరేమేమో చాల చెప్పారు. ఏంచెప్పారు!" అంటూ చిరునవ్వు చిలకరిస్తూ ఈ పక్కనుంచి, ఆ పక్కకు తల తిప్పింది.

"నువ్వు నన్ను క్షమించవలసినదిగా కోరాను..."

"దానివల్ల ఏం ప్రయోజనం. క్షమించటం, క్షమించటం, ఏం లాభం? ...మీరు..."

"కేవలం మాటలవల్లే కాదు. క్రియారూపానకూడా నా పాపానికి పరిహారం చెప్పుకుంటాను. నిన్ను పెళ్ళి చేసుకోటానికే నిశ్చయం చేసుకున్నాను.

ఆమె ముఖకవళిక అకస్మాత్తుగా మారిపోయింది. భయగ్రస్త అయినట్టు కనిపించింది. ఆమెకన్నులు అతని ముఖంమీదే నిల్చిఉన్నాయి. కాని ఆమె అతన్ని చూస్తున్నట్టులేదు.

"ఎందుకూ?" అన్నదామె కోపంగా చూస్తూ.

"భగవంతుడు సాక్షిగా-అది నా విధి అని నమ్ముతున్నాను."

"మీరు ఇప్పుడు ప్రత్యక్షమైనాడా భగవంతుడు ? తెలిసే మాటాడు తున్నారా ? ఎవరా భగవంతుడు ? ఆ భగవంతుడు మీరు ఆనాడే స్మృతికి వచ్చియుండవలసింది" ఆమె అక్కడ ఆగి అలాగే నోరు తెరచుకుని నిల్చిపోయింది. సారాయపు వాసన కొట్టింది. ఆమె అంత ఉద్రిక్తయై ఉండటానికి కారణం నెఖ్లూడో అప్పుడు గ్రహించాడు.

"కొంచెం సంబాళించుకుని శాంతపడు."

"ఎందుకు శాంతపడాలి ? సారాయపు కైపులో ఉన్నాననుకుంటున్నారా ? కైపులోనే ఉన్నాను. ఐనా నే నేమి మాటాడుతున్నానో నాకు తెలుసు" ఆమె ముఖం కందగడ్డ అయింది. మళ్ళీ దూకుడుగా అన్నది—
"నే నొక ఖైదీని; లంజను. మీరు కులీనులు, మర్యాదస్తులు. నన్ను స్పృశించి మీరు మలినపడ నవసరం లేదు. మీరు మీ రాణీగారి దగ్గరకు వెళ్ళండి. ఒక పది రూబుల్సుతో నా రాజును నేను కొనుక్కోగలను"

"నువ్వు ఎంత క్రూరంగా మాటాడినా, నా భావాల్ని గ్రహించలేవు. నీ పట్ల ఎంత ఘోర నేరస్థుడినిగా నన్ను నేను ఊహించుకుంటున్నానో నీవు తెలుసుకోలేవు."

"నేరస్థులని తెలుసుకున్నారా ? ఆనాడు తెలుసుకోలేదే ! నూరు రూబుల్సునోటు విసిరేసి వెళ్ళిపోయారు. నా కిమ్మతు" అన్నదామె కోపంగా.

"ఔనౌను. నాకు తెలుసు. కాని ఇప్పుడేమి చెయ్యాలి ? ఇక నిన్ను విడిచిపెట్టను. అది నా నిశ్చయం. నేను ఇందాక అన్నట్టు చేస్తాను"

"ఏమీ వద్దు. అక్కర్లేదు" ఆమె బిగ్గరగా నవ్వింది.

"మస్లొవా !..." ఆమె చెయిపుచ్చుకుని చెప్పబోయాడు.

"ఇక మీరు వెళ్ళిపొండి—నేను ఖయిదీని, మీరు మర్యాదస్తులు. మీ కిక్కడేమీ పనిలేదు"—అంటూ ఆమె తన చేయిని వెనక్కు లాగేసుకుంది. కోపంతో ఆమె రూపం యావత్తూ మారిపోయింది.

"మీ పాపాన్ని పోగొట్టుగోటానికి నన్నే ఉపకరణంగా చేసుకోవాలని చూస్తున్నారన్నమాట. ఈ లోకంలో నా ద్వారా కావలసిన సుఖం పొందారు. ఇక పరలోక సుఖాన్ని కూడా నా ద్వారానే పొందగోరుతున్నారేం ? మిమ్మల్ని చూస్తే అసహ్యం పుడుతోంది - ఆ కళ్ళజోడూ,

కొవ్వెక్కి మరణ భూయిష్టమైన ... కోర్తున్నా–ఎంత అదృష్టం! హా, హా"—
అంటూ పిచ్చిగా కేకలు వేసి నవ్వింది.

జైలరు వెంటనే అక్కడికి వచ్చాడు. "ఏమిటి హంగామా చేస్తున్నావు. అలా ఎగిరి పడటం పనికిరాదు..."

"పోనీలే, ఆమె నేమీ అనకు"...అన్నాడు నెక్లూడోవ్.

"అలా వొళ్ళు మరచిపోతున్నారేం?" - అన్నాడు జైలరు.

"కొంచెం ఓపిక పట్టు"-అన్నాడు నెక్లూడోవ్. జైలరు మళ్ళా ద్వారంలో వెళ్ళి కూచున్నాడు.

మస్లోవా మళ్ళీ ఆసీనురాలైంది. నేలవైపు దృష్టి సారిస్తూ-తన రెండు చేతుల్నీ గట్టిగా పెనవేసుకుని కూచుంది.

"నీకు నా మాటమీద నమ్మకం లేదా?"-కొంచెం ముందుకు వంగి ప్రశ్నించాడు.

"నన్ను పెళ్ళిచేసు కోవాలన్న మీ కోరికనా? ఊహుం. అలా జరగటానికి వీల్లేదు. నేను ప్రాణత్యాగం చేస్తాను."

"కానీ, నీకు సాయం చేస్తూనే ఉంటాను"

"అది మీకు సంబంధించిన విషయం. కాని మీ చేతినించి నేనేమీ కోరను. ముమ్మాటికీ అంతే... అయ్యో; నేను ఆనాడే చచ్చిపోకుండా ఇంత కాలం ఎందుకు బ్రతికి ఉండాలి!..." అంటూ జాలిగా ఏడవసాగింది.

నెక్లూడోవ్ మరేమీ మాటాడలేక పోయాడు. ఆమె ఏడుపుకు విచలితుడైనాడు-ఆమె కళ్ళెత్తి అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూచింది. నెమ్మదిగా తన రుమాలుతో కన్నీళ్ళు తుడుచుకుంది.

జైలరు మళ్ళీ వచ్చాడు. ఇక వెళ్ళి పోవలసిన సమయం అయిందని జ్ఞాపకం చేశాడు; మస్లోవా లేచింది.

"నువు కొంచెం భావావేశంలో పడిపోయావు. వీలు చిక్కితే రేపు మళ్ళీ వస్తాను. తీరిగ్గా ఆలోచించుకో"-అన్నాడు నెక్లూడోవ్.

మస్లోవా అందుకు జవాబేమీ చెప్పలేదు. తల యెత్తనే లేదు. జైలరును అనుసరించి వెళ్ళిపోయింది.

మస్లావా తన జైలుగదిలో ప్రవేశించిన తరవాత......

"మంచిదే అనుకున్నప్పుడల్లా అవకాశాలు రావు. అతనికి నీ మీద బాగా మోజు కలిగినట్టు తెలుస్తూనే ఉంది. అతడు నీవెంట బడుతూన్న రోజుల్లోనే ఫలితం సంపాదించెయ్యాలే పిల్లా! అతడు నిన్ని జైల్లోనించి బయట పడవేయగలడు. ధనవంతులు ఎంతపనైనా చెయ్యగలరు. తెలుసా?" అన్నది కరోల్లేవా.

వెంటనే రైల్వేపనివాని భార్య అందుకుంది. "ఔను, నిజమే-ఒక బీద వాడు పెళ్ళి చేసుకోవాలనుకుంటే బోలెడన్ని విఘ్నాలు వచ్చి పడతాయి. భాగ్యవంతుడైతే అనుకుంటే చాలు; అయిపోతుంది పని."

"ఇంతకూ మా సంగతి ఆయనకు చెప్పావా?"-ముసలమ్మ అడిగింది.

మస్లావా ఎవరికీ ఏమీ జవాబు చెప్పలేదు. అలాగే పక్కమీద పడుకుని ఉంది సాయంత్రం వరకూ...ఇంటి కప్పువైపు ఒక మూలను దృష్టి నిలిపి—

ఆమె హృదయంలో ఒక బాధా జనకమైన యుద్ధం సాగింది. నెహ్లూడో మాటలవల్ల అలనాటి తన జీవన ప్రపంచం జ్ఞప్తికి వచ్చింది. దాన్ని తాను పూర్తిగా అర్థం చేసుకోకుండా, అసహ్యించుకుని బైటికి వచ్చేసింది. ఇప్పుడు తన మైకపు అవస్థలోనుంచి మెలుకువ కలిగింది. కాని విస్పష్టంగా స్మృతి పథంలో ఉన్న ఈ గతాన్ని చూస్తూ బ్రతికి వుండటం అసంభవమని తోచింది. బ్రతికివున్నా అపరిమితమైన బాధే. కాగా సాయంత్ర మయ్యేసరికి సారాయం తెచ్చి, తన సఖురాండ్రతో కూడా అప్యాయంగా తాగేసింది.

## ౪౯

నెహ్లూడో జైలు ఆవరణవిడిచి వెడుతున్నాడు. తానుచేసిన నేరం ఎంత ఘోరమైనదో ఇప్పుడతనికి బాగా బోధపడింది. తన నేరానికి పరిహారం చెప్పుకోవాలన్న తలంపే లేకపోతే, అది అంత ఘోరమైనదని తనకు బోధ పడివుండేది కాదు. తన విషయమే కాదు; ఆమె కైనా తనకు జరిగిన మహాపచారంలోని ప్రాశస్త్య సంపూర్ణంగా తెలుసుకుని ఉండేది కాదు. ఇంతవరకూ అతడు తనకు కలిగిన పశ్చాత్తాపాన్ని తలచుకుని తన్ను తాను

ప్రశంసించుకుంటూ ఉన్నాడు. కాని ఇప్పుడు అతని హృదయం తనపై తనకు కలిగిన అసహ్యభావంతో నిండిపోయింది. ఆమెను తాను [illegible] చిక్కుల్లో పడవేసి వెళ్ళి ఊరుకోలేడు. కాని ఈ కొత్త సంబంధమువల్ల ఫలితాలు ఎలా ఉండబోవునో ఊహించుకోలేక పోతున్నాడు.

అతడు జైలు ఆవరణ దాటిపోతూ ఉండగా ఒక జైలరు వెనుకనుంచి వచ్చి అతనికొక చీటీ ఇచ్చాడు. జైలరు ముఖం చూడ్డానికి ఇంపుగా లేదు. అతని చొక్కామీద పతకాలు వేలాడుతున్నాయి. [illegible] అన్నాడు-"ఈ చీటీ తమకెవరో ఇవ్వమని ఇచ్చిపోయారు."

"ఎవరూ ?"

"చదువుకోండి, తెలుస్తుంది. ఒక రాజకీయ ఖయిదీ. నేను ఆ వార్డులోనే ఉంటాను. ఆమె నన్నీపని చేసిపెట్టమన్నది. ఈ పని జైలు నిబంధనలకు వ్యతిరేకమే ననుకోండి- అయినా మానవత్వాన్ని పురస్కరించుకుని..." జైలరు కంఠధ్వని అసహజంగా ఉంది.

నెఖ్లూడోవుకు ఆశ్చర్యం కలిగింది. రాజకీయ ఖయిదీల వార్డులో ఉండే జైలరు, జైలు ఆవరణలోనే, అందరూ చూస్తూవుండగానే రహస్యపు ఉత్తరాలు అందిస్తూ ఉంటాడా? అతడు జైలరేగాక, ఒక రహస్య పరిశోధకుడు కూడానని నెఖ్లూడోవు అప్పటికి తెలియదు. జైలు ఆవరణ దాటి వెళ్ళిపోతూ చీటీ విప్పి చదువుతున్నాడు. అందులో ఇలా ఉంది.

"తమరు ఒక క్రిమినల్ ఖయిదీ విషయంలో పరిశ్రమించుచుని జైలుకు వస్తూ పోతున్నారని తెలిసింది. మిమ్మల్ని చూడాలని కోరిక కలిగింది. తమరు నన్ను వచ్చి చూడ్డానికి అనుమతిపత్రం సంపాదించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. అది లభించగలదు. ఆ క్రిమినల్ నేరస్తురాల్ని గురించీ, ఇంకా నాకు సంబంధించిన వార్తల్ని గురించీ చాలా వివరాలు మీకు నివేదిస్తాను. ఇట్లు...వీరా దుఖోవా."

దుఖోవా ఒక పల్లెటూళ్ళో పంతులమ్మ. ఒకసారి ఎలుగుబొంట్లను వేటాడే నిమిత్తం నెఖ్లూడోవ్ ఆ ప్రాంతానికి వెళ్ళిఉన్నాడు. అప్పుడతనూ, కొందరు స్నేహితులూ కలిసి ఆ పల్లెటూళ్లో ఉండటం జరిగింది. ఆ గోష్ఠుల్లో దుఖోవా నెఖ్లూడోవును సందర్శించి, విశ్వవిద్యాలయంలో చదువుకునే నిమిత్తం కొంతధనం కావాలని ఆశ్రయించింది. నెఖ్లూడోవ్ ఆమెకు అప్పుడు ధన

విప్లవకారిణిగా దుఖోవా తైపీ అయివుంటుంది; సందేహంలేదు. తప్పకుండా వెళ్ళి చూడవలసిందే. మస్లొవానుగురించిన సందర్భంలోకూడా ఆమె ఏమో సలహాయిస్తానని రాసిందిగా !

## ౫౦

మర్నాడు ఉదయాన్నే లేవగానే లోగడదినం తన చర్యఅంతా ఒక్కసారి తలపుకు వచ్చింది. భయవిచలితుడైనాడు. కాని మరుక్షణమే... తాను ఆరంభించినదాన్ని కొనసాగించి తీరాలిసిందే నని దృఢనిశ్చయుడైనాడు.

ధర్మదీక్ష తొందరచేయగా ఇల్లువిడిచి బయలుదేరాడు. జైల్లో మస్లొవాను వెళ్ళి చూడ్డానికీ, మెన్షోవ్ వంశీకులైన తల్లీ కొడుకుల్ని కలుసుకోడానికీ, మస్లొవా విషయంలో చెబుతానని చీటీ రాసిన దుఖోవాను కలిసి మాట్లాడ్డానికీ .అనుమతిపత్రం సంపాదించటానికి వైస్‌గవర్నరు ఇంటికి బైలుదేరాడు.

వైసుగవర్నరు అయిన మాస్లన్నికోను నెహ్లూడోవ్ ఇతఃపూర్వం ఎరిగి వున్నాడు. ఒకప్పుడు ఇద్దరూ కలిసి సైన్యంలో పనిచేశారు. మాస్లన్నికో కోశాధికారిగా ఉండేవాడు. దాక్షిణ్యబుద్ధి ఉంది. ఉద్యోగధర్మాన్ని శ్రద్ధగా నిర్వహిస్తూఉండేవాడు. తన ఉద్యోగానికి సంబంధించిన అ చిన్నవలయాన్నీ, రాజకుటుంబాన్నీ తప్ప అతడేమీ యెరగడు. ఇతరాన్ని తెలుసుకోవాలన్న కుతూహలమూ అతని కుండేదికాదు. కొన్నాళ్ళనుంచీ అతడావుద్యోగం విడిచి పరిపాలనశాఖలో చేరి పనిచేస్తున్నాడు. ఈ ఉద్యోగం మార్పుకు అతనిభార్య ప్రోత్సాహం కారణం. ఆమె ఒక ధనవంతులయింటిబిడ్డ. మంచి ఉత్సాహవంతురాలు. ఆమె తన భర్తను ఒక పెంపుడు జంతువులాగ ఆదరించేది. అతన్ని పరిహాసంచేసి ఆడిస్తూ, బుజ్జగిస్తూ ఉండేది–ఒకసారి శీతాకాలంలో ఈ దంపతుల్ని వెళ్ళి సందర్శించాడు నెహ్లూడోవ్. కాని మళ్ళీ ఇంత వరకూ మరోసారి వెళ్ళటానికి అతనికి మనస్కరించలేదు.

నెహ్లూడోవ్‌ను చూడగానే మాస్లన్నికో ముఖం విప్పారింది. పూర్వంలాగే ఆ ముఖం కందగడ్డలాగ కొవ్వెక్కి ఉంది. మిలిటరీ పనిచేస్తున్నప్పటి వలెనే పరిశుభ్రమైన దుస్తులు ధరించి ఉల్లాసంగా ఉన్నాడు. ఆ రోజుల్లో

అప్పటి ఫ్యాషనుకు తగినట్టు చెక్కు చెదరని మిలిటరీ దుస్తులు... ఎదురు రొమ్ము దగ్గర గట్టిగా బిగిసిపట్టే చొక్కా - తొడుక్కునేవాడు. ఇప్పుడు సివిల్ ఉద్యోగానికి తగినట్టుగా వేషధారణ వుంది. ఇప్పటి చొక్కా కూడా ఎగువరొమ్ముదగ్గర గట్టిగా పట్టేసి, ఛాతీ వెడల్పును ప్రదర్శిస్తోంది. ఆధునిక ఫ్యాషనులకు తగినట్టే వుంది వస్త్రధారణ. అతనికి నలభైసంవత్సరాల వయస్సు వుంటుంది. వయస్సులో అంతరం ఉన్నా, పరస్పరం సన్నిహితంగానే వుంటారు.

"ఓహో, ఎంత మంచివాడివయ్యా! మా ఆవిడ లోపల ఉంది. వెళదాం, రా. ఇంకా మీటింగుకు పదినిమిషాలు వ్యవధి ఉందిలే. గవర్నరు ఊరికి వెళ్ళారు. ఇప్పుడు ప్రభుత్వ బాధ్యతలన్నీ మనవే, తెలుసుగా!" - అన్నాడు మాస్లన్నికొ మిత్రుని ఆగమనంవల్ల కలిగిన తృప్తిని వెల్లడిస్తూ.

"నేను ఒకపనిమీద వచ్చాను."

"ఏమిటది?" - అన్నాడు మాస్లన్నికొ బెదిరిపోయి, ముఖంలో గాంభీర్యం తెచ్చుకుని.

"మీ జైల్లో ఒక వ్యక్తిని..." 'జైల్లో' అను శబ్దం వినగానే మాస్లన్నికొ ముఖంలో కాఠిన్యం వచ్చేసింది. "ఒక వ్యక్తిని అప్పుడప్పుడు నేను వెళ్ళి కలుసుకుంటూ ఉండాలి. మామూలుగా అందరూ వెళ్ళే ఖయిదీలతో మాట్లాడ్డానికి నిర్దేశితమైన హాల్లోకాదు; ఆ నిర్దిష్ట సమయాల్లోనే కాదు. ఎప్పుడుపడితే అప్పుడు, ఆఫీసులో, ఆ వ్యక్తిని నేను కలుసుకుని మాట్లాడాలి. అది మీవల్ల అవుతుందని చెప్పారు."

"ఔనౌను. మన ఆజ్ఞ లేకుండా మామూలు పద్ధతులకు భిన్నంగా ఎలా జరుగుతుందీ? నీ కోసం ఏమైనా చేస్తాను. కాని మన రాజరికం తాత్కాలికమే సుమీ!" అన్నాడు మిత్రుని వీపు దువ్వుతూ.

"ఆమెను వెళ్ళి చూడ్డానికి అవసరమైన మీ అనుమతి పత్రాన్ని ఇప్పిస్తారు కదూ!"

"ఆడమనిషా ఏమిటి?"

"ఔను."

"జైల్లో ఎందుకున్నదీ?"

"ఎవరినో విషంపెట్టి చంపిందన్న నేరంమీద, ఆమెను అన్యాయంగా శిక్షించారు."

"న్యాయబద్ధమైన పంచాయతీ పద్ధతిమీదనే జరిగిందిగా అది. యిక దాన్ని మార్చటానికి వీల్లేదు. ఆ మాట నువ్వు ఒప్పుకోవనుకుంటాను. అయినా నా నిశ్చితాభిప్రాయం అదే!" ఈ నిశ్చితాభిప్రాయం ఆయన గత పన్నెండు మాసాలనుంచీ ఒక కన్సర్వేటివ్ పక్ష పత్రికలో చదువుతూ వస్తున్నదే. స్వంతం కాదు. "నువ్వు లిబరల్ పక్షంవాడి వనుకుంటానే!" అన్నాడు.

ఒక వ్యక్తిమీద తీర్పు చెప్పేముందు ఆ వ్యక్తి వాదన కూడా వినాలనీ-ఒక వ్యక్తిమీద నేరం ఋజువయ్యే వరకూ ఆ వ్యక్తి ఇతరులతోపాటు సన్మానార్హుడేననీ-ఏ వ్యక్తినీ, ముఖ్యంగా విచారణ జరిగి నేరం ఋజువు కాని ఏ వ్యక్తినీ అవమానించరాదు, కొట్టరాదు, అనీ-నెఖ్లూడోవ్ అభిప్రాయం. ఇటువంటి అభిప్రాయం కలిగి ఉన్నందున చాలామంది అతన్ని లిబరల్ పక్షీయుడంటారు. అలాగ తన్ను ఒక రాజకీయ పక్షానికి చెందిన వాణ్ణిగా వాళ్లు కేటాయించటం అతనికి ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంటుంది. అన్నాడు నవ్వుతూ..."నేను లిబరల్ పక్షంవాడినో, కానో నాకు తెలియదు. కాని ప్రస్తుతం పంచాయితీ పద్ధతి ఎంత లోపభూయిష్టంగా ఉన్నా...పూర్వపు నిరంకుశ విధానాలకంటే నయమేనని నాకు తెలుసు."

"మీ వకీలెవరు?"

"ఫానరిన్‌తో సంప్రదించాను."

"అరె, ఫానరినా?" అన్నాడు మాస్లెన్నికో బిత్తరపోతూ. గత సంవత్సరం ఒక కేసులో సాక్షిగా తాను కోర్టుకు హాజరుకావలసి వచ్చింది. అప్పుడు ఫానరిన్ తనను క్రాస్‌పరీక్ష చేస్తూ, ఒక అరగంటసేపు బహు నాజూకుగా పీడిపించి విడిచిపెట్టాడు. "ఫానరిన్‌తో నువ్వు ఏ సంబంధమూ పెట్టుకోకు అబ్బాయి! అతడు మహా చెడ్డమనిషి సుమీ!" అన్నాడు.

ఆ మాటకు నెఖ్లూడోవ్ సూటిగా సమాధానం చెప్పలేదు. అన్నాడు-"నాది మరొక మనవి కూడా ఉంది. నేను చాలా కాలంనుంచీ ఎరిగివున్న మరొక యువతి కూడా ఉంది. ఆమె ఉపాధ్యాయిని. పాపం, దయనీయమైన మనిషి. ఆమెను కూడా జైల్లో వేశారు. ఆమె నన్ను చూడాలను

కుంటోంది. ఆమెను కూడా నేను వెళ్ళి కలుసుకోటానికి మీరు అనుమతించాలి."

మాస్లెన్నికోవ్ తల పంకించి ఆలోచించాడు. "ఆమె రాజకీయ ఖయిదీ అనుకుంటాను."

"ఔను, అలాగే చెప్పారు."

"ఔనా? చూచావా! రాజకీయ ఖయిదీలను వెళ్ళి చూడాలంటే వాళ్ళ చుట్టాలకే అనుమతి ఇస్తారు. అయినా నేను నీకు అనుమతి ఇస్తాను. దాన్ని దుర్వినియోగం చెయ్యవని నా నమ్మకం. ఆమె పేరేమిటి? మెడోవా కదూ! అందగత్తెనా?"

"వట్టి కురూపి."

మాస్లెన్నికోవ్ ఆముదం తాగినవాడులా ముఖంపెట్టి, టేబిల్ దగ్గరకు పోయి, ఒక కాగితంమీద ఇలా అనుమతి పత్రాం రాసి ఇచ్చాడు: "ఈ అనుమతి పత్రాన్ని తెస్తున్న నెఖ్లూదోవ్ జైల్లోవున్న మస్లోవానూ, మెడోవానూ చూడవచ్చును. జైలు అధికారులు అతన్ని అటంకపెట్ట నవసరంలేదు."

"ఇంకేం, ఇక నువ్వు ఇది పుచ్చుకుని వెళ్ళవచ్చు. జైల్లో ఎలాగ మేము క్రమశిక్షణ నెరపుతున్నామో నువ్వు చూడగలుగుతావు. నిజానికి అక్కడ క్రమశిక్షణ నెరపటం చాలా కష్టమే. ఎంతోమంది ఖయిదీలాయెను — పైగా ప్రవాస శిక్ష విధించినవాళ్ళున్నారు. కాని నే నక్కడ విధులన్నీ సక్రమంగా కొనసాగిస్తున్నాను. ఆ పని అంటే నాకు యిష్టం. ఖయిదీలంతా చాలా హాయిగా, తృప్తిగానే ఉంటున్నారు. చూస్తావుగా! కాని వాళ్ళతో మెలగటం తెలిసి ఉండాలి. కొద్ది రోజుల క్రితం వాళ్ళతో ఒక తిప్పలు వచ్చింది. చెప్పిన మాట వినలేదు కొందరు. చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించారు. మరొకడైతే దాన్ని 'తిరుగుబాటు' అని చెప్పేసి, ఘోరంగానే శిక్షించేవాడు. కాని ఆ పరిస్థితుల్ని అదుపులోనికి తెచ్చి, శాంతి నెలకొల్పాం. ఒక వంక జాలి ఉండాలి; మరొక వంక అధికారాన్ని పట్టుదలతో చలాయిస్తూ ఉండాలి" అంటూ గట్టిగా పిడికిలి మూశాడు. వేళ్ళ ఉంగరాలూ, చొక్కా కమీజులమీది బంగారు గుండీలూ కనిపించేట్టు.

"ఓ, అలాగా! నాకేం తెలుసునూ! రెండుసార్లు వెళ్ళి చూశాను. చూసి చాలా నిరుత్సాహపడ్డాను."

"షాసెక్ రాణీగారిని ఎరిగి వున్నావా? ఆమెను నువ్వు ఒక్కసారి చూసి తీరాలి. ఆమె జైల్లో చాలా సేవచేస్తున్నది. చాలా మంచిపనులు చేస్తుంటేతే! అంతా ఆమె కృషే. తరువాత నా కృషినీన్నీ. చాలా మార్పులు తీసుకొచ్చాం. పూర్వం ఉంటూ ఉండిన ఘోర పరిస్థితులు ఇప్పుడేమీ లేవు. ఖయిదీలంతా చాలా హాయిగా ఉంటున్నారు. నువ్వు చూస్తావుగా! ఇక ఫానరిన్ సంగతి! అతన్ని నేను బాగా ఎరగను. సంఘంలో అతని స్థానం వేరు. అందుచేత మాకు ఎప్పుడూ ఎదమేనచుకో. కాని అతడు మహా చెడ్డమనిషి సుమీ! అతడు కోర్టులో స్వతంత్రించి ఎటువంటి సంగతులు ఎత్తుతాడనుకున్నావు! అబ్బ! ఆ సంగతులూ, వాడూ..."

"కృతజ్ఞుణ్ని, ఇక వెళ్ళి వస్తాను"–అని ఆతడిచ్చిన అనుమతిపత్రాన్ని తీసుకుని, ఇక అతనిమాటల్ని వినిపించుకోకుండా నెహ్లూడో పోబోతున్నాడు.

"లోపలికి వచ్చి మా ఆవిడతో మాటాడిపోవూ?"

"క్షమించాలి; ఇప్పుడు వ్యవధి లేదు."

"నువ్వు వచ్చికూడా ఆమెను చూడకుండా వెళ్ళిపోయావని తెలిస్తే ఆమె నా మీద విరుచుకుపడుతుందే!" అంటూ మాస్లెన్నికోవ్ నెహ్లూడోవ్‌ను మెట్లుదిగి కిందివరకూ పంపించటానికి వచ్చాడు. అక్కడ ఆగి – "లోపలికి ఒకసారి రాకూడదూ!" అన్నాడు.

కాని నెహ్లూడో తనకు వ్యవధిలేదని గట్టిగా చెప్పాడు.

"అయితే వచ్చే గురువారం తప్పకుండా రా. నువ్వు వస్తావని ఆమెతో చెబుతాను"–అంటూ మాస్లెన్నికోవ్ మెట్లెక్కి పైకి పోయాడు.

## ౫౧

నెహ్లూడో బండీ యెక్కి జైలుకు వెళ్ళాడు. ఇన్‌స్పెక్టరుగారి ఇంట్లోకి దారితీశాడు. ఆ నాటివలెనే పియానో వాయిస్తున్న ధ్వనులు వినిపించాయి. కంటిమీద కట్టు కట్టించుకున్న ఒక నౌకరువచ్చి, ఇన్‌స్పెక్టరుగారు ఇంట్లోనే వున్నారని చెప్పాడు. నెహ్లూడోవ్‌ను ఒక గదిలోనికి తీసుకుపోయాడు. అక్కడ ఒకసోఫా ఉంది. ఆ సోఫాముందొక టేబిల్ మీద ఒక పెద్దలాంతరు ఉంది. ఇన్‌స్పెక్టరు విచారకరములూ, అలసట సూచించునవీ అయిన చూపులతో

వచ్చాడు. "రావోండి, ఏం కావాల తమకు?" అన్నాడు నెఖ్లూదోవు ఉద్దేశించి, తాను తొడుక్కున్న కోటు గుండీ పెట్టుకుంటూ.

"వైస్ గవర్నరుగారివద్దనుంచి ఈ అనుమతి పత్రం తెచ్చాను. నేను మస్లోవాను చూడాలి."

"మస్లోవా?" - అన్నాడు ఇన్‌స్పెక్టరు పియానో వాయింపువల్ల సరిగ్గా వినపడక.

"మస్లోవా."

"ఓహో, ఔను"-ఇన్‌స్పెక్టరు లేచి పియానో వాయించబడుతున్న గదిగుమ్మందాకా వెళ్లాడు. వెళ్ళి అన్నాడు-"మేరీ! ఆ వాయించటం ఒక్క క్షణం మానెయ్యకూడదూ! పెద్దలెవరన్నా వచ్చి మాటాడుతూంటే వినిపించద్దూ." సంగీతమంటే తన ప్రాణానికెంత బాధాకరమో ఆ కంఠధ్వనిలో సూచించాడు.

పియానో ఆగింది. గదిలోని వ్యక్తి గుమ్మందాకా వచ్చి తొంగి చూడ్డం జరిగింది. పియానో ఆగినందుకు ఇన్‌స్పెక్టరు ముఖంలో కాస్త మన శ్శాంతి వచ్చింది-ఒక సిగరెట్టు వెలిగించాడు. మరొకటి తీసి నెఖ్లూడోవుకు ఇవ్వబోయాడు.

నెఖ్లూడో పుచ్చుకోలేదు. "నేను చూడగోరుతున్నది మస్లోవాను"- అన్నాడు.

"మస్లోవా! ఆమెను ఇవాళ మీరు చూడ్డం బాగుండదు."

"ఎందువల్ల?"

"అంతా మీరు చేసిందే"-అని చిరునవ్వు చిలికి ఇంకా ఇలా అన్నాడు- "ఇదిగో. మీరావిడకు డబ్బు యివ్వకండి. లేకపోతే నా కివ్వండి. ఆమె కోసం నేను దాచిపెట్టి ఉంచుతాను. నిన్నను మీరేదో కాస్త పైకం ఇచ్చి వుంటారు; దానితో బాగా సారాయం తెప్పించేసుకుంది-జైల్లో ఖయిదీలు సారాయం తెప్పించుకుని తాగుతూవుండటం చెడ్డ అలవాటు అయిపోయింది. మేం దాన్ని మాన్పించలేకపోతున్నాం-ఇవాళ మస్లోవా తప్పతాగి మత్తెక్కి వుంది; మరీ రెచ్చిపోయివున్నది కూడాను."

"నిజంగానా ?"

"ఔను. నేను కొంచెం కఠినంగాకూడా ప్రవర్తించవలసివచ్చింది. ఆమెను ప్రత్యేకం ఒక వేరేగదిలో ఉంచాల్సివచ్చింది. మామూలుపరిస్థితిలో ఆమె మంచిమనిషే. కాని మీరు డబ్బు ఇవ్వకండి. ఖయిదీలంటే మహా చెడ్డ......"

లోగడదినం మస్లావాతో తాను కావించియున్న సంభాషణ యావత్తూ నెఖ్లూడోవు స్ఫురించింది. భయవిచలితుడైనాడు.

"రాజకీయ ఖయిదీ దుఖోవాను చూడవచ్చునా ?"

"కావలిస్తే చూడండి పోనీ."

ఇంతలో అయిదారేళ్ళపిల్ల ఒకతె గదిలోనికి వచ్చింది. ఆమె ఇన్‌స్పెక్టరు కూతురే. తండ్రిదగ్గరకు వస్తోంది. నెఖ్లూడోవైపు దృష్టులు నిగిడ్చి నేలవైపు చూడకుండా గబగబా నడిచివస్తోంది. అక్కడ పడివున్న దుప్పటిలో ఆమె కాలు చిక్కుకోటం చూచి ఇన్‌స్పెక్టరు "పడతావు సుమీ" అంటూ లేచి, గబగబా వెళ్ళి పిల్లను ఎత్తుకున్నాడు. ఆ పిల్ల ఇంకా నెఖ్లూడోవైపే బెరుగ్గా చూస్తోంది. ఇన్‌స్పెక్టరు ఆ పిల్లను తీసుకుపోయి, లోపల దించేసి, తిరిగి వచ్చాడు.

మళ్ళీ పియానో ఆరంభమైంది. ఇద్దరూ జైలుకుపోవటానికి లేచారు. "ఆమెకు సంగీతమంటే చెడ్డ యిష్టం లెండి" అంటూ ఇన్‌స్పెక్టరు నెఖ్లూడోను జెయిలుకు తీసుకువెళ్లాడు.

వాళ్ళిద్దరినీ చూచి నౌకర్లు జెయిలుగేటు తెరిచారు. జెయిలర్లు ఇన్‌స్పెక్టరుకు సలాములుచేసి, నమ్రతగా నిల్చారు. తల సగం గొరిగించుకున్న ఖయిదీలు కామాలు బొచ్చెలలో ఏదో మోసుకుపోతూ, ఇన్‌స్పెక్టరును చూసి, భయం భయంగా సాగిపోయారు. ఆ ఇద్దరిలో ఒకడు కోపంగా చూశాడు. అప్పుడతని నల్లని కన్లు ఉరిమి చూశాయి.

"నిజానికి ఒక కళలో అభిరుచి ఉన్నప్పుడు దానికి మనం దోహదం ఇవ్వాలి; అణచివెయ్య కూడదు. కాని ఇల్లు చిన్నదైనప్పుడు ఆ స్థానం పియానో మోత చాలా ఘోరమనిపిస్తుంది" అంటూ ఇన్‌స్పెక్టరు జైలర్లను

గాని, ఖైదీలనుగాని గమనించకుండా ఏవో చెబుతూ ముందుకు సాగిపోయారు. చివరకు ఇద్దరూ హాల్లో ప్రవేశించారు.

"మీరు ఎవర్ని చూడాలన్నది ?"

"దుఖోవా."

"ఓహో, ఆమె కొట్టుఖయిదులో ఉంది. కొంచెం ఆగాలి."

"ఈ లోగా మెన్షోవ్ వంశీకురాలైన స్త్రీ కొడుకులను చూస్తాను. ఇళ్లకు తగలబెట్టారన్న నేరంమీద వాళ్ళు ఖయిదీలయినారు."

"చూడండి, 21వ గది. లేకపోతే ఇక్కడికే పిలిపిస్తాను."

"వద్దులెండి, అక్కడికే వెళ్ళి చూస్తాను."

"అక్కడికి వెళ్ళటంకంటే, ఇక్కడికే వాళ్ళను పిలిపిస్తే బాగుంటుంది."

"వద్దు; అక్కడికి నేనే వెడతాను. బాగుంటుంది."

"అయితే మీ ఇష్టం" అంటూ...అక్కడికి అప్పుడే వచ్చియున్న తన కింది ఆఫీసరును ఉద్దేశించి-"వీరిని మెన్షోవ్ ఉన్న 21 వ నంబరు గదిలోకి తీసుకు వెళ్లు. ఆ తరువాత ఆఫీసుకు తీసుకురా. అక్కడికి ఆమెను పిలిపిస్తాను ఆమె పేరేమన్నారూ ?"

"దుఖోవా."

చిన్న ఆఫీసరు యువకుడు, అందగాడు. అతని దుస్తులు అత్తరు వాసన కొడుతున్నాయి. ఆదరపూర్వకమైన మందహాసం వెలిగిస్తూ, "ఇటు దయచెయ్యండి; వెడదాం. మీకు ఖయిదీల పరిస్థితులు తెలుసుకోవాలని కుతూహలం కలిగిందా !" అన్నాడు నెఖ్లూడోవ్‌ను ఉద్దేశించి.

"ఔను, కుతూహలమే కలిగింది. అదిగాక ఏమీ నేరం చేయక పోయినా శిక్షపడి ఖయిదీ అయివున్న ఒక్క వ్యక్తికి సాయం చేయటం నా విధి అని భావిస్తున్నాను."

ఆఫీసరు బుజాలెగరవేశాడు. "ఔను, ఒక్కొక్కప్పుడు అలాగూ జరగటం కద్దు. ఒక్కొక్కప్పుడు వాళ్లు అబద్ధాలూ చెబుతారు."

జైలు గదుల తలుపులు తెరిచే వున్నాయి. కొందరు ఖయిదీలు వరండాలో ఉన్నారు. ఆఫీసరు జైలర్ల నమస్కారాలు స్వీకరిస్తూ, ఖయిదీలకేసి క్రీగంట చూశాడు. వాళ్లు భయంగా వెనకడుగులు వేసి, తమ తమ గదుల్లోకి చల్లగా జారుకుని, నమ్రతగా నిల్చుని, ఆఫీసరును చూస్తున్నారు. అక్కడినుంచి ఆఫీసరు నెఖ్లూడోవ్‌ను ఎడమచేతివైపు వున్న వార్డులోనికి తీసుకుపోయాడు. ఈ వార్డు చాలా ఇరుకుగా ఉంది. దుర్వాసన కూడా ఎక్కువగానే ఉంది. ఇక్కడ కాపలావున్న జైలరు ముసలివాడు; ముఖమంతా ముడతలుపడి ఉంది-అతన్ని ఉద్దేశించి "మెన్షోవ్ ఎక్కడ?" అని ప్రశ్నించాడు ఆఫీసరు.

"ఈ ఎడమవేపు ఎనిమిదో గది."

"మరి ఇవి? వీటిలో కూడా ఖయిదీలు ఉన్నారా?" నెఖ్లూడోవ్ అడిగాడు.

"ఒక్క గదిలో తప్ప అన్నింట్లో ఉన్నారు."

౫౨

ఈ వార్డులోని జెయిళ్ళ తలుపులకు సుమారు ఒక అంగుళం వ్యాసం గల రంధ్రా లున్నవి.

"లోపలకు చూడవచ్చునా?"-నెఖ్లూడోవ్ ఆఫీసరును అడిగాడు.

"ఓ, చూడండి, ఫరవాలేదు" - అన్నాడు ఆఫీసరు-అని, అక్కడి జెయిలర్ వైపు తిరిగి ఏవో ప్రశ్నలు వేస్తున్నాడు.

నెఖ్లూడోవ్ ఒకరంధ్రంలోనుంచి చూచాడు. లోపల ఒక పొడుగాటి యువకుడు-నల్లటిగడ్డం ఉంది-అటూఇటూ పచార్లు చేస్తున్నాడు. రంధ్రంలోనుంచి ఎవరో చూస్తున్నట్లు గమనించి, ఒకసారి అటువైపు కోపంగా చూచాడు-మళ్ళీ పచార్లు చేస్తూనేఉన్నాడు.

నెఖ్లూడోవ్ మరొక రంధ్రంలోనుంచి చూచాడు. లోపలనుంచి ఆ రంధ్రంలోనుండా తనవైపు చూస్తున్న ఒక భయవిచలితమైన విశాలనేత్రం ఎదురైంది. నెఖ్లూడోవ్ అడుగు వెనక్కువేసి వచ్చేశాడు. మూడోగదిలో

ఒక పొట్టిమనిషి, నిండా దుప్పటి కప్పుకుని పడుకుని వుండటం చూశాడు-నాలుగో గదిలో ఒక వెడల్పాటి ముఖంగల పెద్దమనిషి, మోకాళ్ళమీద మోచేతులానించి, తలవాల్చుకుని కూచున్నాడు-బయటి అడుగుల చప్పుడు వినగానే తలయెత్తి చూశాడు. అతని విశాలనేత్ర గోళాల్లో విచారం, నిస్పృహ ఉన్నాయి. ఆ వచ్చేది ఎవరో తెలుసుకుందామన్న కుతూహలం కూడా అతనికున్నట్టు లేదు. ఎవరొస్తే నేమిటి? తనకేమీ వొరిగేది లేద న్నట్టుగా కూచున్నాడు. అతన్ని చూచి నెఖ్లూడోవ్ విచలితుడైనాడు. మరింకే గదిలోకీ తొంగిచూడలేదు. సరాసరి 21వ నెంబరు గదివరకూ వెళ్ళాడు. జైలరు తలుపు తెరచాడు. ఒక యువకుడు-పొడుగాటి మెడ, కండలుదేరిన శరీరం, చిన్నతల, గుండ్రని దయాభరితమైన నేత్రాలూ- తొట్రుపాటుగా లేచి, ఆగంతుకుల వైపు చూశాడు - భయాన్ని, తొట్రుపాటునూ సూచిస్తూ, ప్రశ్నార్థకంగా నెఖ్లూడోవ్ వైపు, జైలరువైపు, ఆఫీసరువైపు చూపులు విసురుతున్న అతని గుండ్రని, దయాభరితమైన నేత్రాలు నెఖ్లూడోవ్‌ను ఆకర్షించాయి.

"నీ పరిస్థితులు తెలుసుకోవాలని వీరు వచ్చారు."

"కృతజ్ఞుణ్ని."

"ఔను, నీ సంగతి విన్నాను. అసలు ఆ కేసు అంతా నీ నోటి ద్వారానే వినాలని వచ్చాను"-అన్నాడు నెఖ్లూడోవ్ కిటికీవద్దకు నడుస్తూ.

మెన్షోవ్ కూడా కిటికీదగ్గరకువచ్చి తన కథ చెప్ప నారంభించాడు. మొదట ఆఫీసరునుచూచి కొంచెం సంకోచించినా, క్రమేణ ధైర్యం తెచ్చుకుని అంతా చెప్పాడు. కాసేపు ఉండి ఆఫీసరుకూడా జైల్లోకేవో పనులు విధించు నిమిత్తం బైటికి వెళ్ళిపోయాడు.

ఒక సాధారణ రైతుబిడ్డనికి సహజమైన ఉచ్చారణలో, రీతిలో తన కథ అతడు చెప్పాడు. ఆ కథ...అవమానకరమైన జైలుదుస్తులు ధరించిన ఒక ఖయిదీ నోటి ద్వారా వ్యక్తం కావటం నెఖ్లూడోవ్‌కు విచిత్రంగా ఉంది. ఒకవంక అతని కథ వింటూనే ఆ జైలుగదిని కలయచూచాడు. గడ్డిపరుపు పరచిన ఒక చిన్నమంచం! మందపాటి ఇనుప చువ్వల కిటికీ! చెమ్మ గక్కుతూ మురికిగా ఉన్న గోడలు! జైలు దుస్తులు ధరించి, దయనీయమైన ముఖంతో నిరుత్సాహియై యున్న

అభాగ్యుడు ! నెక్లూడోవ్ చాలా విచారించాడు. ఆ విచారంలో...అతడు చెప్పేదంతా పచ్చి అబద్ధం అని భావించేసి, వినకుండా వెళ్ళిపోడానికి ఉద్యుక్తుడయ్యేవాడేమో ! ఒక వ్యక్తిని ఏమీ కారణం లేకుండా...కేవలం తానే ఇతర్లవల్ల చావుదెబ్బలు తిన్నవాణ్ణి బలవంతాన పట్టుకొచ్చి, జైలు దుస్తులు తొడిగి, ఇలా ఒక అమానుష ప్రదేశంలో బంధించటం ఘోరం ! పట్టి అమాయకుడు, నెమ్మదస్తుడు అయిన అతడు చెబుతున్న కథ సత్యం కాదేమో నని అనుమానించటం అంతకన్నా ఘోరాతి ఘోరం !

అసలు కథ ఇది : పెళ్ళి కాగానే ఈ యువకుని భార్యను ఆ ఊరి హోటలు యజమాని మాయజేసి వశపరచుకున్నాడు. యువకుడు న్యాయం కోసం కోర్టులకు వెళ్లాడు. హోటలువాడు ఉద్యోగస్తులకు లంచాలిచ్చి తప్పించుకున్నాడు. చివరకొకనాడు అతడు వెళ్ళి తన భార్యను బలవంతాన ఇంటికి లాక్కొచ్చాడు. కాని ఆ మర్నాడే ఆమె మళ్ళీ హోటలు యజమాని యింటికి పారిపోయింది. తానూ వెళ్ళి, తన భార్యను తనకు ఒప్పగించవలసిందిగా కోరాడు. ఆ పిల్ల తన యింట్లో కనిపిస్తూనే ఉన్నా—"నీ భార్య నా యింటో లేదు; నువ్వు ఇక్కడినుంచి వెళ్ళిపో" అని గద్దించాడు హోటలు వాడు. యువకుడు వెళ్ళలేదు. హోటలువాడు, అతని నౌకర్లు కలిసి అతన్ని చితకగొట్టారు. ఆ మర్నాడు హోటలుకు నిప్పంటుకుంది. ఆ యువకుడూ, అతని తల్లీ కలిసి హోటలుకు నిప్పంటించారని నేరం మోపారు. నిజానికి అతడు నిప్పంటించలేదు. ఆ సమయాన అతడొక మిత్రుని చూడబోయాడు.

"హోటలు తగలబెట్టింది నువ్వు కాదన్నమాట. నిజమేనా ?"

"అటువంటి ఆలోచన నాకు కలలోకూడా లేదు బాబూ ! నా శత్రువు వాడే చేసుకుని వుంటాడాపని. కొద్దిరోజుల క్రితమే ఇన్సూరు చేశాడని విన్నాను. మా అమ్మ, నేనూ కలిసి చేశామట ! అంటున్నారు. అలా చేస్తామని ముందుగానే భయపెట్టామట కూడా ! నేను కోపంగా ఆయనగారింటికి ఒకసారి వెళ్ళినమాట నిజమేనండి. కడుపులో మండి వెళ్ళాను. కాని యిల్లు తగలబెట్టేపని ! నేను చెయ్యలేదు. ఆయనే తగుల బెట్టుకుని మా మీద నేరం వేశాడు."

"ఇదంతా నిజమేనా ?"

"భగవంతుడు సాక్షిగా చెబుతున్నారు. నిజమేనండి...దయ ఉంచండి" అంటూ అతడు నెక్లూడోవ్ పాదాలమీద వాలిపోయాడు. అతి కష్టంమీద నెక్లూడోవ్ అతన్ని లేవనెత్తాడు. "క్షమించండి; నే నిక్కడ అకారణంగా చచ్చిపోతున్నాను" అంటూ అతడు వెక్కి వెక్కి ఏడవ నారంభించాడు-మాసిపోయిన చొక్కా అంచుల తన కన్నీళ్ళు తుడుచు కుంటూ.

"వస్తారా, బాబూ!" అన్నాడు ఆఫీసరువచ్చి.

"వస్తున్నాను"అని పలికి మెన్షోవ్ వైపు తిరిగి "దిగులుపడకు. ధైర్యంగా ఉండు-నాకు చేతనైన సాయం చేస్తాను" అని ఆప్యాయంగా ఓదార్పు వాక్యం పలికి, అచ్చోటు వీడి వెళ్ళిపోయాడు. జైలరువచ్చి తలుపులు మూసే శాడు. మెన్షోవ్ తలుపులకు అనుకుని ఆ రంధ్రంలోనుంచి చూస్తూనే నిల్చున్నాడు.

## 23

వార్డు విడిచి నెక్లూడోవ్ తిరిగి వస్తున్నప్పుడు దారిలో చాలామంది ఖైదీలు నిక్కృష్టమైన దుస్తుల్లో, దీన వదనాలతో కనిపించారు. మధ్యాహ్న భోజన సమయం అయింది. జైలు గదుల తలుపులన్నీ తెరచే ఉంచారు. వాళ్ళు తనకేసి సకౌతుకంగా చూస్తున్నారు. వాళ్ళపట్ల జాలి, వాళ్ళను అలా అక్కడ బంధించి యుంచిన అధికార్లపట్ల నిరసన-వివిధ భావాలు అతనిలో సందడించాయి. వాళ్ళ విచారకర పరిస్థితులను అలా తాను పరీక్షగా చూస్తూ ఉన్నందుకు తనమీద తనకే ఏహ్యమనిపించింది.

ఒక గదిలోనుంచి చాలామంది ఖైదీలు గుంపుగా తోసుకుని వచ్చి నెక్లూడోవ్‌కు సలాంచేసి దీనంగా అరిచారు-"అయ్యా! బాబూ! మా వ్యవహారం చప్పున తేల్చండి సామీ!"

"నేను మీ అధికారిని కాదు; నాకేమీ తెలియదు."

"అయినా మీరు పెద్దమనుషులు. అధికార్లతో కాస్త చెప్పండి" అని కోపంగా ఒక కంఠస్వరం.

"మీరూ మానవులే. కాస్త దయచూడండి. మే మీ అవస్థలో దిగబడి ఇది రెండోనెల. నిష్కారణంగా మా కీ గతి పట్టింది."

"అదేమిటి ? మీ మాటలు నా కర్థంకావటంలేదు."

"మాకే అర్థంకావటం లేదండి. మమ్మల్ని ఇక్కడ బంధించేశారు. ఇది రెండో నెల."

ఆఫీసరు చెప్పాడు : "ఔను, నిజమే. పాసుపోర్టులు లేకుండా ప్రయాణాలు చేస్తున్నందుకు వీళ్ళను పట్టుకున్నారు. వెంటనే వాళ్ళ రాష్ట్రానికి వాళ్ళను పంపించేయవలసింది. కాని అక్కడ జైలు తగులబడిపోయింది. అక్కడి స్థానికాధికారులు వీళ్ళను పంపించవద్దని కోరుతూ ఇక్కడికి రాశారు. పాసుపోర్టులు లేకుండా ఉన్న ఇతర్ల నందర్నీ వాళ్ళ వాళ్ళ రాష్ట్రాలకు పంపించేశాము. వీళ్ళను మాత్రం ఇక్కడే ఉంచాం."

"అంతమాత్రానికేనా ?"-అంటూ నెఖ్లూడొవ్ నిర్ఘాంతపోయాడు.

ఇంతలో మరో నలభైమంది ఖైదీలు తోసుకువచ్చి నెఖ్లూడొవ్‌ను, ఆఫీసరును చుట్టుముట్టారు - అందరూ ఏకకంఠంతో ఏవో చెప్పటం సాగించారు. ఆఫీసరువాళ్ళను అదలించి-"ఎవరో మీలో ఒక్కరు మాటాడండి"-అన్నాడు.

ఒక పొడుగాటి రైతు-నలభైయేళ్ళు ఉంటాయి; కంకరరాళ్ళు కొట్టుకుని జీవిస్తూ ఉండేవాడు. సుజనుడులాగే కనిపిస్తున్నాడు-ముందుకు వచ్చి "మమ్మల్ని అందరినీ ఇళ్ళకు పంపించేయవలసిందిగా ఆజ్ఞలు వచ్చాయండి. కాని పాసుపోర్టులు లేవని మమ్మల్ని ఇక్కడ బంధించారు. పాసుపోర్టులు అసలే లేకపోలేదు; ఉన్నాయండి; కాని ఒక పక్షంరోజులు గడువు మించి దాటాయండి. ప్రతియేటా ఇదే కథ. కొత్త పాసుపోర్టులు ఇవ్వరు; పాత వాటికి గడువైపోయిందని శిక్షిస్తారు. ఈ సంవత్సరం వీళ్లను రెండు నెలల నుంచి క్రిమినల్ నేరస్థులనులాగా ఇలాగే బాధిస్తున్నారు" అని చెప్పాడు.

"మేమంతా తాపీపని చేసుకుని బతికేవాళ్ళమండీ- మా వూళ్ళో జైలు తగలబడిందని మాకు సమాధానం చెబుతున్నారండి. అది మా అపరాధమా?"

నెఖ్లూడొవ్ అంతా విన్నాడు. విన్నదంతా అర్థం చేసుకున్నాడో లేదో తెలియదు. ఆ చెబుతున్న తాపీ మేస్త్రీ చెంపమీద పాకుతున్న ఒక పేను మీద అతనిదృష్టి బద్ధమై వుంది. చివరకు ఆఫీసరువైపు తిరిగి "అదేమిటండి; అంతమాత్రానికే వీళ్ళ నిలా బాధిస్తున్నారా ?" అని అడిగాడు.

"ఔను, వీళ్ళను ఇంగ్లండుకు పంపించేసెయ్యవలసింది. కాని అధికార్లు మరచిపోయారో ఏమో తెలియదు"—శాంతంగా జవాబు చెప్పాడు ఆఫీసరు.

ఆఫీసరు వాక్యం ముగియకముందే ఒక దుర్బలుడైన సన్నపాటిమనిషి—అతడూ ఖైదీయే—ముందుకు వచ్చి, కళ్లలో తిరుగు తున్న బాష్పాల్ని చెప్ప బోయాడు—పెదవులు వింతగా కదిలిస్తూ—"కుక్కలకంటే హీనముండి బాబూ..." అన్నాడు.

"మరీ గోడవెక్కువైందే! నోరుమూసుకో, జాగ్రత!"—ఆఫీసరు గర్జించాడు.

"ఇంతకూ మా నేరం ఏమిటో చెప్పండి" అన్నాడతను ఏమైనా గానీ అన్న తెగువతో.

"నోరు ముయ్యి" అని ఆఫీసరు గర్జించాడు. అతను జంకి వెనక్కు తగ్గాడు.

"దీని యర్థమేమి తిరుమలేశ!" అనుకున్నాడు నెఖ్లూడో.

అలా బంధిఖానాలలో నికృష్టపు బ్రతుకు వెళ్ళబోస్తూన్న ఈ యభాగ్యపు ఖైదీలను వందలాదిగా చూస్తూ—ఆఫీసరు వెంట నడచిపోతున్న నెఖ్లూడొవు తానేదో మహాశిక్ష అనుభవిస్తున్నవాడిలాగా తలపోశాడు.

"ఇలా నిరపరాధులు శిక్షితులౌతున్నారన్నమాట!"

"మమ్మల్ని ఏం చెయ్యమంటారు సార్! అలా అబద్ధాలాడుతారువాళ్లు. వాళ్లమాటలు వింటే అంతా నిరపరాధుల్లాగే కనిపిస్తారు" అన్నాడు ఆఫీసరు. అని చివరకు—"నిజానికి కొందరు నిరపరాధుల్ని కూడా బంధించటం జరుగుతుంది లెండి"—అని కలిపాడు.

"ఔను, పాపం, వీళ్ళేమీ నేరం చెయ్యలేదుగా!"

"ఔను. ఆ మాట ఒప్పుకోవాల్సిందే, కాని వాళ్లు బాగా చెడిపోయారులెండి—వీళ్ళలో కొందరున్నారు; అన్నిటికీ తెగించిన ఉద్దండులు. వాళ్ళను కఠినంగా చూడాల్సిందే. అటువంటివాళ్ళను నిన్న ఇద్దర్ని శిక్షించాల్సి వచ్చింది."

"ఎలా శిక్షించాకేమిటి ?"

"పేము బెత్తంతో పీపులమీద కొట్టించాం. అలా ఉత్తరువైంది."

"అటువంటి శిక్షలు రద్దుచేశారు కామాలు !"

"ఇటువంటివాళ్ళు అనుభవించవలసిందే."

నెక్లూడో హాల్లో కూచుని తాను చూచినపరిస్థితులన్నీ నెమరుకు తెచ్చుకున్నాడు-అక్కడి దండన విధానాలను తెలుసుకున్నాడు. హృదయం చాలా బాధపడ్డది. నిరుత్సాహం, దుఃఖం, జాలి ఆవరించాయి.

తరవాత అతడు ఆఫీసరు చెబుతున్న మాటల్ని వినిపించుకోకుండా సరాసరి ఆఫీసుగదిలోకి వెళ్ళాడు. అక్కడ ఆఫీసరు ఏవో కాగితాలు పరిశీలించటంలో నిమగ్నుడై వున్నాడు. దుఖోవాకు కబురు చెయ్యటం కూడా మరచిపోయాడు. నెక్లూడో రాగానే ఆ సంగతి జ్ఞాపకం వచ్చింది. "దయచేసి కూచోండి, ఆమెను ఇప్పుడే పిలిపిస్తాను" అన్నాడు.

## ౨౪

ఆఫీసులో రెండు గదులున్నాయి. మొదటిదానిలో ఒక పాత కుంపటి వుంది. కిటికీలు దుమ్ము కొట్టుకుని వున్నవి. ఒకమూల ఖైదీల ఎత్తు కొలిచేందుకు నల్లని కొయ్యస్టాండు వుంది. మరోమూల క్రీస్తుదేవుని పటం వ్రేలాడుతోంది. ప్రజల్ని హింసించే ప్రతిచోటా ఈ క్రీస్తుదేవుని పటం ఉంచటం ఆచారమయిపోయింది. ఈ గదిలో చాలా మంది జైలర్లు నిలుచుని యున్నారు. మరోగదిలో సుమారు ఇరువదిమంది గుంపుగా కూచుని నెమ్మదిగా మాటాడుకొంటున్నారు. కిటికీ దగ్గర రాతిబల్ల వుంది.

ఇన్‌స్పెక్టరు టేబిల్ దగ్గర కుర్చీలో కూచున్నాడు. నెక్లూడో అతని పక్కనే ఉన్న కుర్చీలో ఆసీనుడై, ఆ గదిలోవున్న మనుష్యుల ముఖాలు అవలోకిస్తున్నాడు.

ఆ గుంపులో ఒక యువకునిపై నెక్లూడో చూపు పడ్డది. అతని ముఖము ఉత్సాహవంతముగా నున్నది. పొట్టిచొక్కా తొడుక్కున్నాడు. నల్లని కనుబొమ్మలుగల ఒక నడిమి వయస్సు స్త్రీతో, చేతులు తిప్పుతూ మాటాడుతున్నాడు. ఆ యిద్దరి పక్కనే ఒక ముసలివాడు నీలపు కళ్ళద్దాలు

"సేనా ! మా అమ్మతో. ఆమె రాజకీయ ఖైదీ !"

నెఖ్లూడో ఆ కుర్రవానితో ప్రసంగించటం చట్టవిరుద్ధం అని ఇన్‌స్పెక్టరు గ్రహించి కేకవేశాడు; "మేడీ పావ్‌లోనా! ఈ కుర్రవాణ్ణి తీసుకువెళ్లు" అని. నెఖ్లూడో అక్కడికి వచ్చినప్పు డతని దృష్టిని ఆకర్షించి యుండిన ఆ అందగత్తే వేరీపావ్‌లోనా. ఆమె కూచున్న చోటునించి లేచింది. మంచి పొడగరి. ఒక యువకుడులాగ గంభీరంగా నడుస్తూ వచ్చింది.

"మా వాడు మిమ్మల్ని ఏమిటో అడుగుతున్నట్టున్నాడే !" - నెఖ్లూడోను ఉద్దేశించి, మందహాసపూర్వకంగా ప్రశ్నించిందామె. ఆమె చూపులు కల్మషరహితాలు. ఆమె ముఖం చూస్తే ఎవరికీ చెడుతలంపులు కలుగనేరవు.

నెఖ్లూడో కుర్రవానివైపు నవ్వుతూ చూస్తూ జవాబు చెప్పాడు—

"ఈ పసివాడికి అన్ని విషయాలు కావాలట్లే ఉంది. నేనెవర్ని చూడ్డానికి వచ్చానో అతనికి కావాలిట !"

ఇక ఇన్‌స్పెక్టరు కలుగజేసుకున్నాడు-"ఇక్కడ అపరిచితులతో నువ్వు వచ్చి మాటాడ్డం చట్టవిరుద్ధం" అన్నాడు.

"చిత్తం, చిత్తం" అంటూ ఆమె కుర్రవాని చెయిపుచ్చుకుని - అతని తల్లివున్న చోటుకు తీసుకుపోయింది. నెఖ్లూడో ఆమె వెడుతున్న వైపే చూస్తూ, ఇన్‌స్పెక్టరును ఉద్దేశించి "ఆ పసివాడు ఎవరు ?" అని ప్రశ్నించాడు.

"అతనితల్లి ఇక్కడొక రాజకీయఖైదీ. ఆమె వాణ్ని జైల్లోనే ప్రసవించింది" అని సగర్వంగా...తన జైలు ఎంత గొప్పసంస్థో సూచిస్తున్నట్టుగా జవాబిచ్చాడు.

నెఖ్లూడో ఆశ్చర్యపోయాడు.

"ఆమె భర్తకూడా ఆమెతో సైబీరియా వెడుతున్నాడు" అని చెప్పాడు ఇన్‌స్పెక్టరు.

"మరి ఆ అమ్మాయి ?"

ఇన్‌స్పెక్టరు బుజాలు ఎగురవేశాడు : "ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేను. అదీగాక-అదిగో దుఖోవా వచ్చింది."

## ౨౨

గదికి వెనుకవైపున ఉన్న ద్వారంగుండా దుఖోవా వయ్యారంగా నడిచి వచ్చింది - బక్క పలచని మనిషి, ప్రసన్నత చిలికే కళ్ళు.

"మీరు వచ్చినందుకు కృతజ్ఞురాల్ని. నేను జ్ఞాపకం ఉన్నానా"— అన్నదామె నెఖ్లూడోవ్‌తో కరచాలనం చేస్తూ.

"నిన్ను ఈ స్థితిలో చూస్తానని నేనెప్పుడూ అనుకోలేదు."

"నే నిప్పుడు సుఖంగానే వున్నాను. చాలా హాయిగా వుంది. ఇంతకంటే కోరదగిందేమీ లేదు"-సహజంగా బెదురుపాటును సూచించే ఆ పెద్ద, గుండ్రని కన్నులు నెఖ్లూడోవ్ ముఖఫలకంమీద నిలిపి—సన్నని మెడవొంపులు గులుకరిస్తూ.

ఆమె ఎట్టిపరిస్థితులలో ఖయిదీ అయిందో తెలుసుకోవాలని నెఖ్లూడోవ్ కోరాడు.

దుఖోవా తన పరిస్థితులు యావత్తూ ఆవేశంగా చెప్పింది. 'ప్రచారము' 'సంఘటుపరచుట' 'సాంఘికవిభేదాలు' 'వర్గాలు'- ఈ మొదలైన పద జాలం ఆమె ఎక్కువ ఉపయోగిస్తూ ప్రసంగించింది-'విప్లవసంఘా'నికి సంబంధించిన రహస్యాలు చాలా చెప్పింది. అవి విని నెఖ్లూడోవ్ సంతోషిస్తాడని ఆమె అనుకుంది. శరీర దుర్బలతను సూచిస్తున్నది ఆమె సన్నని మెడ. ఆమె కేశములకు ఎన్నాళ్ళయిందో సంస్కారమే లేదు. నెఖ్లూడోవ్ ఆమెను పరికించి చూస్తున్నాడు-ఈ వ్యక్తి అసలెందుకు ఇటువంటి వ్యవహారాల్లో పడిందో! ఇప్పుడవన్నీ తనకెందుకు చెబుతున్నదో! అతనికి ఆశ్చర్యం అయింది. జాలి కలిగింది. ఈ జాలివేరు; అకారణంగా నిర్బంధితుడైయుండే మెన్షోవ్ యెడల ఇంతకుముందే కలిగిన జాలి అది వేరు. దుఖోవాకు విస్పష్టమైన భావాలు ఉన్నట్లు కనిపించదు. ఆమె మనస్సు గగ్గోలుగా వుంది. తన కార్యక్రమ నిర్వహణలో ప్రాణత్యాగం చెయ్యటానికైనా సిద్ధంగా ఉన్న నాయకురాలుగా ఆమె తన్ను తాను భావించుకుంటోంది. కాని ఆ కార్యక్రమం ఏమిటో, దాని సాఫల్యం ఎట్లు సాధ్యమో ఆమె విస్పష్టంగా చెప్పలేక పోతున్నది. అందుకే నెఖ్లూడోవ్‌కు జాలి కలిగింది.

దుఖోవా [illegible] ఎందుకు [illegible] దంటే—తన స్నేహితురాలొకతె [illegible] నెలల క్రితం [illegible] అరెస్టు అయింది. ఆమెను [illegible] ఒక కోటలో బంధించారు. ఆ అమ్మాయి [illegible] ఆత్మహత్యం [illegible]. [illegible] ఆత్మహత్యం ఆమెది కాదు. [illegible] ఆ బాలిక అరెస్టు కావటానికి [illegible] దుఖోవా బాధ పడుతోంది. [illegible] ఆమెకు తెలుసు. ఎలాగైనా [illegible] విడిపిస్తా దేమోనని ఆమె [illegible]—

పీటర్సుబర్గులోని ఆ కోటలోనే కారాగారశిక్ష అనుభవిస్తున్న గుర్కేవిచ్ అనే మిత్రుడొకడున్నాడు. అతన్ని చూడ్డానికి అతని తల్లికి అనుమతి సంపాదించిపెట్టమనీ—అతనూ ఉపయుక్తపడాలికి కొన్ని వైజ్ఞానిక గ్రంథాలు సమకూర్చి పెట్టమనీ—దుఖోవా నెహ్లూడొవ్‌ను కోరింది.

పీటర్సుబర్గు వెళ్ళినప్పుడు తాను ఈ విషయాల్లో చేతనైనంత సాయం చేస్తానని నెహ్లూడొవ్ మాటయిచ్చాడు. ఇక దుఖోవా గాథ : మంత్రసాని పరీక్ష ప్యాసైన తర్వాత ఆమెకు ఒక విప్లవసంఘంతో సంబంధం ఏర్పడ్డది. కొన్నాళ్ళదాకా బాగానే సాగింది. కాని వాళ్లు కరపత్రాలు ప్రచురించి, కర్మాగారాలలో ప్రచారం సాగించారు. విప్లవసంఘంలోని ప్రముఖసభ్యు డొకడు అరెస్టు అయినాడు. వాళ్ళ రహస్యకరపత్రాలు కొన్ని పట్టుబడ్డాయి. ఇంకా చాలామంది సంఘసభ్యులు అరెస్టు అయినారు. అప్పుడు తాను (దుఖోవా)కూడా అరెస్టు అయింది—బహుశః ప్రవాసశిక్ష విధిస్తారు. అయితే యేం ? తనకేమీ విచారంలేదు – ఈ గాథ అంతా చెప్పి ఒక జాలిరకమైన నవ్వుతో ముగించింది.

తరవాత నెహ్లూడొవ్ మేరీపావ్‌లోనా గురించి వివరాలు అడిగి తెలుసు కున్నాడు. మేరీపావ్‌లోనా ఒక సైన్యాధికారి కూతురు—విప్లవకారులతో ఆమెకు సంబంధం ఉంది. ఒక ఉద్యోగిని హత్యచేసిందన్న నేరంమీద ఆమె నిర్బంధితి అయింది. కొందరు విప్లవకారులు, ఆమె ఒక ఇంట్లో ఉండేవాళ్ళు. ఆ యింట్లో ముద్రణాయంత్రం ఉండేది. పార్టీ వాఙ్మయం రహస్యంగా అక్కడే ప్రచురితం ఔతూవుండేది. ఒకనాటిరాత్రి పోలీసులు పసిపట్టి దౌర్జన్యంగా

మరీ జాలికరంగా ఉంది. ఆ యువకుడు కాగితం ముక్క వేళ్ళకు ఇంకా చుట్టుకుంటూనే ఉన్నాడు; అతని ముఖం కోపచిహ్నితంగానే ఉంది; తల్లి చూపే వాత్సల్య వాహినులకు విచలితుడు కాకుండా ఉండేందుకు మిక్కిలి ప్రయత్నిస్తున్నాడు. విడిపోవలసి వచ్చెనేయన్న దుఃఖంతో తల్లి అతని భుజం మీద ముఖంపెట్టి, వెక్కి వెక్కి ఏడువసాగింది. ఆ పెద్ద పెద్ద కన్నులగల బాలిక ఆ తల్లికి ఎదురుగా నిల్చుని ఏవో సాంత్వన వాక్యాలు పలుకుతోంది. నీలపు కళ్ళద్దాలుగల ముసలివాడు కూతురి హస్తాన్ని అలాగే పుచ్చుకుని విచారంగా...ఆమె చెప్పతున్న మాటలకు తల ఊపుతున్నాడు-ప్రేమీ ప్రేమికులు లేచారు; ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ మౌనంగా నిల్చున్నారు.

"వాళ్ళే కాస్త ఇక్కడ ఆనందంగా కనిపిస్తున్నవాళ్లు" అన్నాడు నెఖ్లూడోవు దగ్గరగా నిల్చున్న...ఒక పొట్టికోటు తొడుకున్న వ్యక్తి... ఆ ప్రేమీ ప్రేమికుల వైపు వేలుపెట్టి చూపిస్తూ—

నెఖ్లూడోవ్ చూపులూ, ఆ పొట్టికోటు తొడుకున్న వ్యక్తి చూపులూ తమవైపే ఉండటం గమనించి, ఆ ప్రేమీ ప్రేమికులు మరింత ఉల్లాసంగా చెట్టాపట్టాలు పుచ్చుకుని నృత్యంచేయ నారంభించారు.

"ఈ రాత్రి వాళ్ళిక్కడ జైల్లో పెళ్ళి చేసుకోబోతున్నారు. ఆమె అతనితో కూడా సైబీరియాకు వెడుతుంది" అన్నాడా వ్యక్తి.

"అతనెవరు?"

"ఎవరో నేరస్థుడే-సైబీరియాకు పంపించేస్తున్నారు - ప్రవాస శిక్ష. ఏదో పాపం కాస్త సంతోషం! లేకపోతే ఏముంది వాళ్ళ జీవితాలు!"

ఇన్‌స్పెక్టరు కంఠం మళ్ళీ వినిపించింది. "దయచేసి మీరంతా వచ్చిన వెళ్ళిపోండి. లేకపోతే నే నేదో కఠినమైన చర్య తీసుకోవలసి వస్తుంది. చాలా సేపయింది; ఇక ఇక్కడ ఎవరూ ఉండటానికి వీల్లేదు" ఇలా అంటూ అయిపోయిన సిగరెట్టు పారేసి కొత్త సిగరెట్టు ముట్టించాడు ఇన్‌స్పెక్టరు. ఇతర్లకు చెరుపుచేసే మార్గాలు చాలా ఉన్నాయి. ఒక వంక ...ర్లను బాధ పెడుతూనే, ఆ బాధపెడుతున్నది. నిజంగా తాను కా... కనిపింపజేసే నేర్పు, విధానం ఉన్నాయి. అయినా ఆ గదిలో ఉన్న...దరి బాధకూ

తానొక ఉత్కృష్టమయిన ప్రయోజనార్థం నిగ్రహిస్తున్నట్టు నిర్వచిస్తాడు. అన్నిటికన్నా [illegible] భయంకరమైన [illegible] వ్యవహారం. అతడు జబ్బుగానివున్నట్లు వున్నాడు. [illegible] హృదయంలో రవంతదయ అంటూ ఉండదు. కాని ఇప్పటికీ తాను చేయవల్సిన పని చేస్తూనే ఉన్నాడు. తల్లి తాతల్లా, ఇంద్రియాలకు దాసుడై, [illegible] పోతూనే ఉన్నాడు. ఇలా తన క్రౌర్యానికి గురిఔతూన్న వాళ్లంతా—తనలాంటివాళ్ళే, తన పిల్లలాంటివాళ్ళే—అయితే మాత్రం?

"ఈ జైళ్ళు — ఈ వ్యవహారమంతా దేనికోసం?" తన్ను తాను ప్రశ్నించుకున్నాడు సెక్లాడ్. మానసికంగా కలిగిన ఈ బాధ అతని శరీరానికికూడా ప్రాకినట్టయింది — అతనెప్పుడు ఈ చోటికి వచ్చినా ఇలానే బాధపడుతూ వుంటాడు. ఆ ప్రశ్నకు మాత్రం జవాబు లభించటంలేదు.

## ౫౭

మర్నాడు సెక్లాడ్ అడ్వోకేటును చూడ్డానికి వెళ్లాడు. మెన్షోవు వంశీకుల కేసునుగురించి చెప్పాడు. వాళ్ల తరఫున వకాల్తా పుచ్చుకుని పని చేయవలసిందిగా అభ్యర్థించాడు. అడ్వోకేటుకూడా...ఆ కేసుకు సంబంధించిన వివరాలన్నీ బాగా తెలుసుకుంటాననీ...సెక్లాడ్ చెప్పిన అంశాలన్నీ సత్యములని తనకు తోచినట్టయితే...వాళ్ళ తరఫున దస్తీమీ పుచ్చుకోకుండానే పనిచేసి పెడతాననీ...వాగ్దానం చేశాడు. ఏమీ తప్పు చేయకపోయినా, వాకానొక పొరపాటువల్ల ఖయిదు చేయబడివున్న ఆ నూటముప్పయిమందిని గురించికూడా సెక్లాడ్ అడ్వోకేటుకు చెప్పాడు. "దానికి బాధ్యులెవరు? తప్పెవరి దంటారు?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు సరైన జవాబు చెప్పాలన్న తలంపుతోనే అడ్వోకేటు కొంత నిమిషంసేపు మౌనంగా ఉండి "తప్పెవరిదా? ఎవరిదీ కాదు. గవర్నరును అడగండి, ప్రాసిక్యూటర్ని నిందిస్తాడు; ప్రాసిక్యూటర్ని అడగండి, గవర్నరును దూషిస్తాడు; ఎవర్నీ ఏమంటానికీ వీల్లేదు" అన్నాడు.

"నేనిప్పుడు గవర్నరును చూడ్డానికి వెడుతున్నాను. ఆయనతోనే చెబుతాను."

అడ్వొకేటు పరిహాసం చేశాడు.

"[illegible], అందువల్ల ప్రయోజన మేమీ [illegible] - [illegible]— మీకు మిత్రుడు గాని చుట్టంగాని కాదు కద!—[illegible] అయినా మాంచి జిత్తులమారి జంతువులెండి."

ఈ అడ్వొకేటును గురించి ఇదివరకు మాస్లన్నికోవ్ [illegible] గుర్తుకువచ్చి నెఖ్లూడోవ్ మరేమీ ప్రసంగించలేదు. అడ్వొకేటుకు [illegible] పుచ్చుకుని మాస్లన్నికోవ్ ఇంటికి వెళ్ళాడు. మాస్లన్నికోవ్‌ను [illegible] సంగతులు అడగాల్సి ఉంది. ఒకటి: మస్లోవాను [illegible] విషయం. రెండు: పాస్‌పోర్టులు లేక జైలు [illegible] మంది అభాగ్యులను గురించి - మాస్లన్నికోవ్ అంటే [illegible]. అటువంటివానిదగ్గరకు పోయి ఆ పనీ, ఈ పనీ చేసిపెట్టమని అర్థించటం మనస్కరించని పని. అయినా తన ఉద్దేశం నెరవేరాలంటే [illegible] గత్యంతరం కనిపించటంలేదు.

మాస్లన్నికోవ్‌గారి భవనంముందు చాలా బగ్గీలు ఆగివున్నాయి. నాడు గవర్నరుగారి భార్య విందు చేస్తోంది. విందుకు తనకు కూడా ఆహ్వానం వచ్చిన సంగతి నెఖ్లూడోవ్‌కు జ్ఞాపకం వచ్చింది. అతను [illegible] దిగాడు. అంతకుముందే ఒకబండిలోనుంచి దిగిన ఒక యువతికి [illegible]కుడు మర్యాదగా లోనికి దారి చూపుతున్నాడు. ఆమె [illegible] అంచులు నేలమీద జీరాడి మట్టి గొట్టుకోకుండా కొంచెం ఎత్తిపట్టుకుని నడుస్తోంది. ఆమె సీలమండలు [illegible]. నల్లని [illegible] స్లిప్పర్లు తొడుక్కుంది. ఆ పక్కనవున్న బగ్గీలమధ్య [illegible] వున్న బండీ ఒకటి ఉంది. అది కోర్చాగిన్ వంశీకులదని నెఖ్లూడోవ్ [illegible] పట్టాడు. ఆ బండీవాడినికూడా తానెరుగును. వాడి నెరిసిన [illegible], ఎర్రని బుగ్గలు తనకు పరిచితాలే. వాడు ముందుకువచ్చి, టోపీ తీసి...[illegible]డైన స్నేహితునివలె...అయినా మిక్కిలి మర్యాదాపూర్వకంగా సలాం చేశాడు. మాస్లన్నికోవ్ ఎక్కడున్నదీ [illegible] అడిగి తెలుసుకుందామనుకున్నాడు నెఖ్లూడోవ్. కాని అతడే కనిపించాడు [illegible] ఆ మెట్ల మీద. అతనితోపాటు ఒక ప్రముఖవ్యక్తికూడా ఉన్నాడు. ఇద్దరూ మెట్లు దిగివచ్చారు. ఆ ప్రముఖవ్యక్తి ఒక మిలిటరీ ఉద్యోగి; [illegible]

పట్నంలో స్థాపించవలసిన ఆవశ్యకతను గురించీ, వాటి నిర్వహణఖర్చులకు గాను ఒక లాటరీ ఏర్పాటు చేస్తే బాగుంటుందనీ, ఆ పని అంతా స్త్రీలు పూనుకుని చెయ్యాలనీ, అది వారికి ఒక చక్కని వ్యాసంగంగా ఉండగలదనీ... ఫ్రెంచిభాషలో చెబుతున్నాడు. ఇంతలో నెఖ్లూడో కనిపించగానే... "ఓహో! నెఖ్లూడో! ఎలా ఉంటున్నావు, ఏం కథ! ఈ మధ్య పూర్తిగా అదృశ్యుడివై పోయావే? ఊఁ చప్పున లోనికిపోయి అమ్మగారి దర్శనం చేసుకో-కోర్చగిన్ వంశీయులంతాకూడా వచ్చారు, తెలుసునా? పట్నంలోని అందమైన భామలంతాకూడా వేంచేశారు" అంటూ చెబుతూనే ప్రక్కన దర్వానును చూచి చేతులెత్తాడు; మిలిటరీకోటును వొంటికి తగిలించమని దాని భావం. ఆ తరువాత మాస్లన్నికోతో కరస్పర్శ చేశాడు, వీడ్కోలు నిమిత్తం.

"వచ్చావూ? చాలా సంతోషం - పైకి పోదాం పద!" అంటూ ఆప్యాయంగా పలుకుతూ మాస్లన్నికో నెఖ్లూడో చెయిపుచ్చుకుని గబగబా మెట్లెక్కించి తీసుకుపోయాడు. ఆ మిలిటరీ ఉద్యోగివంటి ఒక ప్రముఖ వ్యక్తి తన యింటికి వచ్చాడన్న ఉత్సాహంలో ఉన్నాడు మాస్లన్నికో. ఒక కుక్కను దాని యజమాని దువ్వినప్పుడు గాని, చెవిగోకినప్పుడు గాని సాధారణంగా దానికి కలిగేటువంటి ఆనందంలాంటిదే అతని ఆనందమూను. అటువంటప్పుడు కుక్క తోక ఊగులాడిస్తుంది; ఆనందంగా మూలుగుతుంది; గంతులేస్తుంది; యజమాని తొడమీద ముట్టెవేసి రుద్దుతుంది. గుండ్రంగా తిరుగుతుంది. మాస్లన్నికోకూడా అలాగే చెయ్యాలనిపిస్తున్నది ఆ సమయాన. నెఖ్లూడో ముఖంలోని గంభీరముద్రను అతడు గమనించలేదు; అతని మాటల్ని వినిపించుకోలేదు; గబగబా మెట్లెక్కించి డ్రాయింగురూమ్‌లోకి తీసుకుపోయాడు నెఖ్లూడో అనుసరించి వెళ్ళాడు. ఏం జేస్తాడు?

"వ్యవహార విషయాలు తరువాత మాటాడుదాం. నీకేం కావాలన్నా నేను చేసిపెడతాను" అన్నాడు మాస్లన్నికో నర్తనశాలలోనుంచి వెడుతోన్నప్పుడు. "నెఖ్లూడో రాజకుమారుడు వచ్చాడని చెప్పు" ఆజ్ఞాపించాడు మాస్లన్నికో అక్కడి ద్వారపాలకుడ్ని. వాడు గబగబా లోనికి వెళ్ళాడు.

"ఇక నీ ఆజ్ఞ ఏమిటో చెప్పు. కాని నువ్వు మా ఆవిడను చూడాలి. మొన్న వచ్చినప్పుడు ఆమెను కలుసుకోకుండానే వెళ్ళిపోయావు. అందుకావిడ నామీద చాలా కోప్పడింది" అన్నాడు మాస్లన్నికో.

ద్వారపాలకుడు వెళ్ళి నెఖ్లూదొవ్ ఆగమనవార్త దొరసానిగారికి చెప్పనే చెప్పాడు. అదే సమయాన నెఖ్లూదొవ్ మ్యాస్లెన్నికొవ్‌తో సహా డ్రాయింగ్ రూమ్‌లో ప్రవేశించాడు. గవర్నరుగారి భార్యపేరు అన్నా. ఆమె చుట్టూ చాలామంది యువతులు పరివేష్టించి యున్నారు. చిరునవ్వు మెరిసే వదనం ఎత్తి ఆమె నెఖ్లూదొవ్ వైపు చూసింది. ఆ డ్రాయింగ్ రూములో ఒక వంక కొందరు యువతులు ఒక టేబిల్ చుట్టూ ఆసీనులై టీని సేవిస్తున్నారు. వారి పక్కనే కొందరు మిలిటరీలో పనిచేస్తున్న యువకులు నిల్చుని ఉన్నారు. మగవాళ్ళ, ఆడవాళ్ళ కంఠధ్వనులు అవిరామ కోలాహలంగా ఉన్నాయి.

"వచ్చావా? నువ్వు మమ్మల్ని పూర్తిగా మరచిపోయావనుకున్నాం సుమీ! నీకు మేము ఏమి అపరాధం చేశాం చెప్పు—" అని...నిజంగా లేని ఆప్యాయతను వ్యక్తంచేసే మాటలతో ఆమె నెఖ్లూదొవ్‌కు స్వాగతం చెప్పింది. వెంటనే ప్రక్కనవున్న ఒక యువతిని చూసి "మన నెఖ్లూదొవ్‌ను నువ్వు ఎరిగి ఉన్నావుగా! దగ్గరకువచ్చి కూచో" అన్నది. అప్పటికీ ఊరుకోకుండా అవతల టేబిల్ వద్ద ఉన్న ఒక యువతిని పిల్చి "రావమ్మా! మిస్సీ! వచ్చి మా టేబిల్ దగ్గర కూచో. నీ టీనీరు ఇక్కడికే తెప్పిస్తాలే" అన్నది.

"నీ మాట నేను ఒక్కనాటికీ ఒప్పుకోను. బట్టబయలుగా కనిపించటంలేదూ? ఆమె ప్రేమించనేలేదు—" అంటూ ఒక స్త్రీ కంఠం వినిపించింది.

"ఆమెకు పుల్లని పదార్థాలమీద ప్రేమ ఉంది."

"మీ పరాచకాలకు అంతులేకుండా ఉందే!" అన్నది పట్టువస్త్రాలూ బంగారు ఆభరణాలూ ధరించిన ఒక యువతి.

"ఈ చిన్న బిస్కట్లు చాలా రుచిగా ఉన్నాయి సుమీ! మరోటి పుచ్చుకుంటాను."

"సరేగాని, నువ్వు త్వరలోనే పట్నం విడిచేసి వెళ్ళిపోతున్నావేమిటి?"

"ఔను. ఇవాళే ఆఖరురోజు. అందుకే ఇలా వచ్చాం. అందర్నీ ఒకసారి చూడ్డం వీలుపడుతుందికదా అని."

"పల్లెల్లో ఎంత ఆనందంగా ఉంటుంది! ఈ వసంతం హాయిగా గడుపుతాం."

మిస్సీ తలమీద టోపీ ఉంది. అది ఆమెకు బాగా తగివుంది. ఆమె మంచి రూపసిగా కనిపిస్తోంది. నెఖ్లూడోవ్‌ను చూడగానే ఆమె చెక్కిలు సిగ్గుతో రాగరంజితాలైనవి. నెఖ్లూడోవ్‌ను చూడగానే "మీరు ఊరు విడిచి వెళ్ళిపోతున్నారా" అన్నది.

"వెళ్ళిపోయేవాడినే. కొన్ని వ్యవహారాల్నిబట్టి ఆగవలసి వచ్చింది. ఆ వ్యవహారాల నిమిత్తమే వచ్చానిక్కడికి."

"మా అమ్మను చూడ్డానికి ఒకసారి మా యింటికి రారూ! ఆమె చాలా సంతోషిస్తుంది" అన్నది మిస్సీ. కాని తాను అన్నమాట అసత్యమని తనకు తెలుసు. నెఖ్లూడోవ్‌కు కూడా తెలుసునని తనకు తెలుసు. ఆమె మరింత సిగ్గుపడిపోయింది.

ఆమె సిగ్గుపడటం తాను గుర్తించినట్టుగా నటిస్తూ..."ఏమో, నాకు తీరిక ఉండదనుకుంటాను" అన్నాడు నెఖ్లూడోవ్.

మిస్సీకి కోపం వచ్చింది. చురుగ్గా చూసింది. బుజాలు ఎగురవేసింది. పక్కన ఉన్న ఒక ఉద్యోగివైపు చూసింది. అతడు ఆమె చేతిలోని ఖాళీ కప్పును అందుకున్నాడు. తాను మరో తేనీటి కప్పును పుచ్చుకుని విసురుగా ఇంకో టేబిల్ వద్దకు అంగలు పంగలు వేసుకుంటూ వెళ్ళిపోయింది.

"శిశుపోషణాలయానికి నువ్వు చందా ఇవ్వాలి సుమీ!"

"ఇవ్వనన్నానేమిటి? కాని ముందు లాటరీ వ్యవహారం చూడాలి."

"ఏదో చూడండి మరి" అంటూ ఒక తెచ్చికోలు నవ్వు.

గవర్నరు భార్య 'అన్నా'కు ఆనందం హద్దులుదాటి ప్రవహిస్తోంది. ఆమె యిల్లు రకరకాల అతిథులతో కళకళ లాడిపోతోంది.

"నువ్వు ఏదో ఖైదీలకు సంబంధించిన వ్యవహారంలో మునిగి ఉన్నావని మావారు చెప్పారులే. నీ హృదయం నేను ఎరక్కపోలేదు. మా వారి దగ్గర చాలా లోపాలే ఉండవచ్చు. కాని...నువ్వు ఎరగవూ...? ఆయనది మెత్తని హృదయం. పాపం ఆ దిక్కుమాలిన ఖైదీలందర్నీ తన బిడ్డలులాగే

చూచుకుంటూ ఉండకో" అన్నా కాసేపు మౌనంగా ఉంది. భర్త ఆజ్ఞన్ని పురస్కరించుకుని జైలు కాపలాదారులు శిక్షలను బెత్తాలు పట్టుకుని కొడతారు. అటువంటి తన భర్త ఔదార్యాన్ని ఇంకా ఎక్కువగా ప్రశంసించేందుకు పదాలు దొరకలేదామెకు, చిరునవ్వు నవ్వింది. ఇంతలో ఒక ముసలావిడ అక్కడకు వచ్చింది. అన్నా ఆమెకేసి తిరిగింది.

మామూలుగా అటువంటి సమావేశాల్లో అవసరమైన అభివాదపు లైనమాటలు చాల క్లుప్తంగా మాట్లాడి నెఖ్లూడో మాస్లెన్నికోవ్ దగ్గరకు వెళ్లాడు.

"మీతో నాలుగునిమిషాలు మాట్లాడాలి."

"ఓ, తప్పకుండా. రా, ఆ గదిలోకి పోదాం."

జపానీయుల పద్ధతిలో నిర్మితమైన ఒక చిన్నగదిలోకి వెళ్ళారిద్దరూ.

౫౮

"ఒక సిగరెట్టేమన్నా కాలుస్తావా? కాని ఉండు. ఇక్కడే మనం జాగ్రత్తగా ఉండాలి. ఏమాత్రం ఖరాబు చెయ్యకూడదు" అంటూ మాస్లెన్నికోవ్ ఒక చిన్నగిన్నెలాంటిది తెచ్చాడు... కాల్చిన సిగరెట్టు మసి రాల్చటానికి- "ఊఁ. ఇక కానీ" అన్నాడు.

"నేను మిమ్మల్ని రెండు విషయాలు అడగాలి."

"ఊఁ. అడుగు."

మాస్లెన్నికోవ్ ముఖంలో ఒకరకమైన నిరుత్సాహం కనిపిస్తోంది చెవి వెనకాల యజమాని గోకినప్పుడు కుక్కకు కలిగే ఆనందంలాంటిది అతనిలో ఇప్పుడు లేదు. డ్రాయింగురూములోనుంచి ఆయా యువతుల, పురుషుల సంభాషణలు ఇక్కడికి వినిపిస్తూనే వున్నాయి. మాస్లెన్నికోవ్ ఒకచెవితో డ్రాయింగురూమ్‌లోని కలకలాన్నీ, మరో చెవితో నెఖ్లూడో మాటల్నీ వింటూ కూచున్నాడు.

"మళ్ళీ ఆ అమ్మాయినిగురించే మీతో మాటాడిపోదామని వచ్చాను" అన్నాడు నెఖ్లూడో.

"ఔను. గుర్తుంది. నేరస్థురాలు కాకపోయినా శిక్షితురాలయిన ఆవిడనుగురించి కదూ!"

"ఆమెను జైలుఆసుపత్రిలో పనిపాటలు చేసేందుకు నియమించవలసిందిగా మిమ్మల్ని కోరటానికి వచ్చాను. అలా చెయ్యటానికి వీలుంటుందని విన్నాను."

మాస్లెన్నికో పెదవులు బిగించి కాసేపు ఆలోచించాడు. "అలాచెయ్యటానికి వీలుండదేమో అనుకుంటాను. అయినా ఆలోచించి చూస్తాను. ఏ సంగతీ తంతిద్వారా రేపే నీకు తెలుపుతాను."

"ఆసుపత్రిలో చాలామంది రోగులు ఉన్నారనీ, సేవాదికాలు చెయ్యటానికి పనిమనుషులు అవసరమనీ విన్నాను."

"నిజమే-నిజమే. ఏ సంగతీ రేపు తెలుపుతానన్నానుగా!"

"చిత్తం."

డ్రాయింగురూములోనుంచి కిలకిల నవ్వులు వినిపించాయి.

"అతని పేరు విక్టర్. ఉత్సాహవంతుడైన మనిషి. చక్కనిమాటకారి."

"నేను తమకు మనవి చేయదలచుకొన్న మరో విషయం ఏమంటే- పాస్‌పోర్టులు పంపించటం ఆలస్యమైన కారణాన నూటముప్పయిమందిని జైల్లో పెట్టి ఉంచారు. ఒక నెలనుంచీ వాళ్ళు జైల్లో మగ్గుతూ ఉన్నారు"— అంటూ నెహ్లూడో ఆ కేసునుగురించిన వివరాలన్నీ నివేదించాడు.

"ఈ విషయాలన్నీ నీ కెలా తెలిశాయి—" మాస్లెన్నికో ప్రశ్నించాడు. తానీ సంభాషణ ఏవగించుకుంటున్నట్టుగా కనిపించాడు.

"నేనొక ఖైదీని చూడ్డానికి వెళ్ళాను. అప్పుడు వాళ్ళంతా నా చుట్టూ మూగి అడిగారు......"

"ఏ ఖైదీని చూడ్డానికి వెళ్ళావు?"

"ఏ పాపం ఎరక్కపోయినా ఖైదులో ఉంచబడిన ఒక రైతును, అతనిపక్షాన వకాల్తా పుచ్చుకుని పనిచేయవలసిందిగా ఒక ప్లీడరుగార్ని ఏర్పాటుచేశాను. ప్రస్తుత విషయం అదికాదు. పాస్‌పోర్టులు పంపించటం

ఆలస్యమైన కారణంచేత నిరపరాధులైన వాళ్ళను అలా జైళ్ళలో తోసెయ్యటం బాగుందా? అని అడుగుతున్నాను. అసలైతే—"

మాస్లెన్నికోవ్‌కు కోపం వచ్చింది. "అదంతా న్యాయాధికారులకు సంబంధించిన వ్యవహారం. జైళ్ళలోకి వచ్చినవాళ్ళు, ఖైదీలంతా న్యాయంగా శిక్షించబడినవారేనా అని నిర్ధారించవలసింది పబ్లిక్ ప్రాసిక్యూటర్లు. కాని వాళ్ళా పని చెయ్యరు."

"కాబట్టి మీరీ విషయంలో చెయ్యగలిగిందేమీ లేదనేనా నేను అర్థం చేసుకోవలసింది?" నెఖ్లూడో నిరుత్సాహంగా అడిగాడు. కేసంతా కదల్చమని పబ్లిక్ ప్రాసిక్యూటరుమీదికి తోస్తాడని అడ్వొకేటు ఇదివరకే చెప్పాడు.

"ఏదో చేస్తాను - వెంటనే ఆలోచిస్తాను ఆ విషయమై."

డ్రాయింగురూములోనుంచి...స్త్రీలూ, పురుషులు ఎత్తైన గొంతులుగా పరస్పరం పరాచికాలాడుకుంటూ గందరగోళంగా నవ్వుతూన్న చప్పుడు.

"సరే, నువ్వు చెప్పిన విషయమై చెయ్యగలిగినదంతా చేస్తాను" అని మరొకసారి చెప్పాడు మాస్లెన్నికోవ్—చెప్పి, ఇక మనంకూడా...అక్కడంతా ఉన్నారు...పోదాం పద" అంటూ తన ఉంగరాలవేళ్ళసందున ఉన్న సిగరెట్ ఆర్పివేశాడు.

ఇద్దరూ బయలుదేరి డ్రాయింగురూమ్ద్వారందాకా వెళ్ళారు. "ఒక్క నిమిషం ఆగండి. నిన్న కొందరు ఖైదీల్ని బెత్తంతో తీవ్రంగా కొట్టారని విన్నాను—నిజమేనా?" నెఖ్లూడో అడిగాడు.

మాస్లెన్నికోవ్ చిన్నబోయాడు. 'ఓహో, అదా సంగతి! నిన్ను జైలు ఆవరణలోకి రానివ్వటం తప్పే సుమీ! ప్రతివిషయమూ నీకే కావాలట్లే ఉందే. పద—అన్నా పిలుస్తోంది పోదాం" అంటూ ఆవేశంగా నెఖ్లూడో చెయి పుచ్చుకుని లోనికి లాక్కుపోదామని చూశాడు. అది ఆనందావేశం కాదు; ఒక విధమైన ఆతృత.

నెఖ్లూడో పట్టు విడిపించుకున్నాడు. 'వెళ్తా'నని ఎవరితోనూ చెప్పలేదు. మౌనంగా తల వంచుకుని, నిరుత్సాహంగా డ్రాయింగ్ రూములో

నుంచి వెళ్ళిపోయాడు మెట్లు దిగి హాల్లోకి వచ్చాడు. ద్వారపాలకుడు పక్కకు ఒదుక్కున్నాడు. నెక్లూడోవ్ గబగబా దాటిపోయాడు.

“ఏమిటి అతని వ్యవహారం. మీ రేమన్నా రేమిటి?” అన్నా అడిగింది భర్తను.

“అతనెప్పుడూ అంతేలెండి” అన్నా రెవరో ఒక మూలనుంచి.

“అదొక రకమైన పిచ్చిలెండి” అని హేళనగా ఒక కంఠం.

“పిచ్చా? ఉన్మాదమా?” అని మరో కంఠం.

ఆ తరువాత చాలాసేపటివరకూ అందరూ నెక్లూడోవ్ గురించే మాట్లాడుకున్నారు, నవ్వుకున్నారు.

ఆ మర్నాడే నెక్లూడోవ్‌కు మాస్లెన్నికోవ్ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. చక్కని, మందపాటి గ్లేజు పేపరుమీద రాసిన ఉత్తరం సీలుచేసిన కవరులో వచ్చింది. మస్లొవాను ఆసుపత్రిలో పనికత్తెగా చేర్చుకునే విషయం ప్రస్తావిస్తూ డాక్టరుకు ఉత్తరం రాశాననీ-నెక్లూడోవ్ కోరిక సానుకూలం కావచ్చుననీ-రాశాడు మాస్లెన్నికోవ్. కింద మాస్లెన్నికోవ్ సంతకం కళాత్మకంగా ఉంది. ‘నీ మిత్రుడు మాస్లెన్నికోవ్’ అని అడుగున ఉన్న మాటల్ని చదివినప్పుడు “బుద్ధిహీనుడు” అని పైకే అప్రయత్నంగా ఉచ్చరించాడు నెక్లూడోవ్. తానొక ఉచ్చమైన పదవిలో ఉన్నట్టూ, ‘నీ మిత్రుడు’ అని రాయటంలో తానొక మెట్టుదిగి వచ్చినట్టు మాస్లెన్నికోవ్ అభిప్రాయం కామోలు! తాను చేస్తున్న ఈ ఉద్యోగం నిజంగా మలినమైనది. సిగ్గుచేటైన పదవి అది. అయినా కూడా తానొక ప్రముఖ వ్యక్తియని మాస్లెన్నికోవ్ భావిస్తున్నాడు. ‘నీ మిత్రుడు’అని రాయటంలో నెక్లూడోవ్‌ను అభినందించుదామనా! లేక ‘నేనంత గర్విష్ఠిని కాదు’ అని పరోక్షంగా ప్రకటించుకోటానికా?

౨౭

ఒక్కొక్క మనిషి ఒక్కొక్క రకమైన ప్రత్యేక గుణగణాల్ని కలిగి ఉంటాడని అనుకుంటూ ఉంటాము. అది సరికాదు. ఫలానా మనిషి దయగలవాడని గాని, క్రూరుడని గాని, బుద్ధిహీనుడని గాని, చురుకైనవాడని గాని, సోమరి అనిగాని వాకొంటూ ఉంటాము. కాని మనుషులలా ఉండరు.

ఆడవాళ్ల విజిటింగ్ రూములో నెక్లాడో-మస్లోవాలకు సమావేశం ఏర్పాటు చేశాడు ఇన్‌స్పెక్టరు.

ఇన్‌స్పెక్టరు నెక్లాడోపట్ల ఆదరంగానే ప్రవర్తించాడు. కాని యిదివరకులాగ ఎక్కువగా మాటాడలేదు. చూడవచ్చిన వారితో ముక్తసరిగా మాటాడి పంపించేయవలసిందిగా కొత్తగా ఆర్డరు జారీ చేయబడింది. నెక్లాడో ఇళ్ళి మాస్లన్నికోత్‌తో మాటాడిన తరువాత వచ్చిన ఫలితం ఇది.

"మీరామెను చూడవచ్చు. అభ్యంతరంలేదు. కాని డబ్బు విషయమై నేనదివరకు చెప్పినమాట గుర్తుంచుకోండి. ఆమెను ఆసుపత్రికి మార్పించే విషయమై గవర్నరుగారికి మీరు రాశారు. డాక్టరుగారు ఒప్పుకోవచ్చు. అది జరిగించవచ్చు. కాని ఆమెడే ఒప్పుకోటంలేదు. 'ఆసుపత్రిలో రోగిష్టి మారి కుంకలకందరికీ నేను నీళ్లూ, తొట్టెలు తీసుకుపోయి అందిస్తూ ఉంటానా?' అంటున్నదామె. వీళ్ళ సంగతి మీకు బాగా తెలియదండీ!" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

అందుకు నెక్లాడో జవాబేమీ చెప్పలేదు. మస్లోవాతో సమావేశం ఏర్పాటు చేయవలసిందిగా మాత్రం కోరాడు. ఇన్‌స్పెక్టరు ఒక జైలర్ను పిల్చాడు. నెక్లాడో ఆ జైలరువెంట ఆడవాళ్ళ విజిటింగ్ రూముకు వెళ్లాడు. అక్కడ మస్లోవా స్క్రీన్ వెనకాలనుంచి మెల్లగా భయంభయంగా వచ్చి అతని ముఖంలోకి చూడకుండానే—"మొన్న మీరు వచ్చినప్పుడు ఏమేమో మాటాడేశాను. క్షమించండి" అన్నది.

"నేను గాదు నన్ను క్షమించవలసింది" అన్నాడు నెక్లాడో.

"ఏమైనా ఇక మీరు మాత్రం నా విషయం ఏమీ పట్టించుకోకండి" ఆమె కళ్లల్లో పూర్వపుకోపం వ్యక్తమైంది.

"ఎందువల్ల?"

"ఔను-అంతే."

"ఏం?"

ఆమె మరోసారి అతని ముఖంలోకి చూచింది. పూర్వంలాగే ఆ కోపపు చూపు!

"ఔను—అని అంతే. ఇక [illegible] నిశ్చయించుకుంది—నా కోసం మీరేమీ ఆలోచించకండి—" అని పెదవులు [illegible]. [illegible] మాసంగా వుంది. "నిజం చెబుతున్నా—నేను ఉదాసీనుణ్ణి కా[illegible]" అన్నా[illegible]

ఆ నెలలో సీనా ఒక అసహ్యకరమైన [illegible] అందులోనే ఒక సద్భావం కూడా [illegible] వరకూ ఇలాగే నిరాకరించింది. ఇప్పుడూ నిరాకరి[illegible] యంలోని అనుమానాలన్నీ మాయమైపోయాయి. [illegible] ఒక తీవ్రమైన హృదయావేశం ప్రదర్శిస్తోంది.

"మస్లావా? ఇదివరకు [illegible] చెప్పకపోయినా మళ్ళీ చెబుతున్నాను. నన్ను వివాహం చేసుకోవలసిందిగా నిన్ను కోరుతున్నాను. [illegible] మండా ఉన్నంత కాలం నేను నిన్ను అనుసరిస్తానే ఉంటాను—నిన్ను వాళ్ళు ఎక్కడికి పంపిస్తే అక్కడికే నేనుకూడా వస్తాను."

"ఇక మీ యిష్టం—నేను చెప్పేదేమీ లేదు." మస్లావా పెదవులు మళ్ళీ కంపించాయి.

అతడుకూడా మరికొంతసేపటివరకూ ఏమీ మాటాడలేకపోయాడు. చివరకు అన్నాడు: "నేను మా పల్లెటూళ్ళకేసి వెళతాను. అక్కడనుంచి పీటర్స్‌బర్గు వెడతాను. నీ...నువకేసు ప్రకారం విచారింపబడి, ఈ శిక్ష తప్పిపోయేలాగు నా శాయశక్తులా ప్రయత్నం చేస్తాను."

"ఒకవేళ శిక్ష తప్పించకపోతే అయ్యేట్టయితే మాత్రం మీరేమీ విచారపడక్కర్లేదు. శిక్షను అర్హురాలినే నేను—ఈ విధంగా కాకపోయినా మరోవిధంగానైనా నాను." పొర్లివచ్చే కన్నీళ్ళు ఆపుకోటం చాలా కష్టమైంది మస్లావాకు. తన హృదయవేగాన్ని దాచుకుని అడిగింది: "మెన్షోవ్‌ను చూచారా? నిజంగా వాళ్లు నిర్దోషులు."

"ఔను—నేనూ అలాగే అనుకుంటున్నాను."

"చాలా మంచి ముసలమ్మ!"

మెన్‌షోవ్‌నుగురించి తాను తెలుసుకున్న వివరాలన్నీ చెప్పాడు నెహ్లూడోవ్. "నీకేమన్నా కావాలా?" అని అడిగాడు చివరకు.

"నాకేమీ అక్కర్లేదు."

ఇద్దరూ నిశ్శబ్దంగా వున్నారు కాసేపు - హఠాత్తుగా మస్లొవా మొగమెత్తి "నేను ఆసుపత్రిలో చేస్తాను మాట... మీ కిష్టమైతే వెళతాను- వోడ్క నేను త్రాగను కూడాను."

మా
నెక్ల

నెఖ్లూదొవ్ ఆమె కళ్లలోకి చూశాడు-అవి నవ్వుతున్నాయి.

"చాలా మంచిది. మంచిమాట!" అని మాత్రం అన్నాడు నెఖ్లూదొవ్. ఆ తరువాత ఆమెను వీడ్కొని వెళ్ళిపోయాడు.

"ఔను-ఈమె పూర్తిగా మారిపోయింది" అనుకున్నాడు నెఖ్లూడొవ్. ఇతఃపూర్వం అతనికెన్నో అనుమానాలు కలిగివున్నాయి. కాని ఇప్పుడు... తానిదివరకెన్నడూ ఎరగని ఒక కొత్త అనుభూతి కలిగినట్టయింది. ప్రేమ అజేయం అన్న సత్యాన్ని గుర్తించినట్టనిపించింది.

మస్లొవా తిరిగి తన జైలుగదిలోకి వచ్చేసింది. అక్కడంతా గందరగోళంగా మాటాడుకుంటున్నారు. ఆమె తాను తొడుక్కున్న పైకోటు విప్పేసింది. చేతులు ఒడిలో ముడి పెట్టుకుని బల్లచెక్కమీద కూచుంది- క్షయవ్యాధితో బాధపడుతున్న ఆ స్త్రీ; వ్లాడిమిర్ యువతి, ఆమెబిడ్డ, మెన్షోవ్ ముసలితల్లి, కాపలా నౌకరు భార్య—అంతా ఉన్నారక్కడ. పూజారికూతురుకు పిచ్చెత్తిందని నిర్ణయమైపోయింది; రెండురోజుల క్రితమే ఆమెను ఆసుపత్రిలో చేర్పించారు. ఇంకా కొందరు యువతులు అల్లంత దూరాన తమతమ దుస్తులు ఉతుక్కుంటున్నారు. ముసలమ్మ నిద్రపోతోంది; జైలుగది తలుపులు తీసే వున్నాయి; కాపలానౌకరు పిల్లలు బైట వరండాలో ఆడుకుంటున్నారు. వ్లాడిమిర్ స్త్రీ బిడ్డనెత్తుకుని మస్లొవా వద్దకు వచ్చింది-కాపలానౌకరు భార్య స్టాకింగులు కుట్టుకుంటూ మస్లొవాకు ఎదురుగా వచ్చింది.

"ఆయనతో మాటాడేవా ?" అడిగారంతా.

ఎత్తుబల్లమీద కూచుని, నేలకు ఆనకుండా - ఉన్న కాళ్ళు ఊగిస్తూ ఉంది మస్లొవా.

"విచారించి ఏమిలాభం ? పొరిగేదేమీ లేదు. సంతోషంగా ఉండు మస్లొవా ?" అన్నదా కాపలా నౌకరు భార్య స్టాకింగు కుట్టుకుంటూ.

మస్లావా ఏమీ జవాబు చెప్పలేదు.

"ఆడవాళ్ళంతా బట్టలు కుతుక్కుంటూ ఇక్కాళ్ల చాలా దబ్బులు ధర్మంచేశారని చెప్తుకుంటున్నారే?" అన్నది ప్లాకిమిక్ స్త్రీ.

"ఫినాష్కా...! ఈ చిన్న బొంకడు ఎక్కడికెళ్ళాడూ?" విసుక్కుంది కాపలా నౌకరు భార్య వెంటనే నూని, స్టాకింగ్‌లో కుక్కేసి బయటికి వెళ్ళిందామె.

ఇంతలో బైట కొంతమ యువతుల కంఠధ్వనులు వినిపించాయి. చివరకు వాళ్ళు జైలు గదిలోకి వచ్చారు. వాళ్లూ ఖైదీలే. అందరికీ జైలు చెప్పులున్నాయి. స్టాకింగులులేవు. వారిచేతుల్లో ఒకటిరెండు రొట్టెలు ఉన్నాయి. థియోడోసియా మస్లావా దగ్గరకు వచ్చి నిల్చుంది.

"ఏమిటి కథ! ఏదో జరిగినట్టుందే!" అంటూ మస్లావాకేసి తన చిక్కని నీలి కన్నులతో ప్రేమగా అవలోకిస్తూ "ఇటు చూడు-మనం తేనీరు తాగే ముందు తింటానికి" అంటూ తాను తెచ్చిన రొట్టెలు బీరువామీద పెట్టింది.

"ఏమైందీ? అతను నిన్ను పెళ్ళిచేసుకునే ఉద్దేశం మార్చుకున్నాడేమిటి?" కొరాబ్లెవా అడిగింది.

"ఆయన మార్చుకోలేదు. కాని నాకే ఇష్టంలేదు. అలాగనే చెప్పానాయనతో" అన్నది మస్లావా.

"నీ కేమన్నా మతిపోయిందా!" గొణిగింది కొరాబ్లెవా.

"అడుగో మీ ఆయన. అతను కూడా నీతో వొస్తున్నాడుకదూ?" కాపలా నౌకరు భార్య అడిగింది.

"ఔను. మా పెళ్ళి ఇదివరకే అయింది" థియోడోసియా జవాబు చెప్పింది.

"అత డీమెతో కలిసి ఉండటానికి ఇష్టంలేకపోతే ఈ అవస్థ అంతా ఎందుకు పడుతున్నాడు?" థియోడోసియా అడిగింది.

"అతడీమెను పెళ్ళి చేసుకున్నాడంటే బంగారపు గనిలో కూచుందన్నమాటే" అన్నది కొరాబ్లెవా.

"నన్ను జైలు అధికారులు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికే నాతో కూడా వస్తానంటున్నాడాయన. అలా వొస్తే మంచిదే. రాకపోయినా మంచిదే. కాని నాకు నేనై రమ్మని ఆయన్ని కోరను. ప్రస్తుతం పీటర్స్బర్గ్ పోయి ఈ కేసు వ్యవహారం తేల్చుకొస్తానంటున్నాడు. మంత్రులంతా ఆయనకు చుట్టాలే. కాని అయినా ఆయనతో నా కవసరం లేదు" అన్నది మస్లొవా.

"ఔను. ఆ మాటా నిజమే–" అన్నది కొరాబ్లేవా తన సంచి విప్పి అందులోని వస్తువులు పరిశీలిస్తూ, మరేదో విషయాన్ని గురించి ఆలోచిస్తూ, అన్యమనస్కురాలై. "సరేగాని, ఒక చుక్క వేసుకుందామేమిటి?" అని అడిగింది చివరకు–

"నువ్వు కానిస్తే కానీ–నేను తాగను" అన్నది మస్లొవా.



(31)



ఒక పక్షం రోజుల్లో మస్లావా కేసు సెనేట్‌లో విచారణకు రానై వుంది. అప్పీలుకు అంత బలం లేదనీ, కాబట్టి సెనేట్‌లో అప్పీలు ఓడిపోయే పక్షంలో చక్రవర్తికి అర్జీ పెట్టుకునేందుకు సిద్ధమై వుండటం మంచిదని వకీలు అభిప్రాయపడుతున్నాడు. కనుక ఆ సమయానికి నెహ్లూదొవ్ పీటర్స్‌బర్గ్ పట్నంలో హాజరై వుండాలి. మస్లావాతో కూడా ఆ నేరస్థులు జూన్ నెల ఆరంభంలో బయలుదేరవచ్చు. మస్లావాను అనుసరించి సైబీరియాకు వెళ్ళడానికే నెహ్లూదొవ్ గట్టిగా నిశ్చయించుకున్నాడు. అందుచేత ఈ లోగా వొకసారి వెళ్ళి తన ఆస్తి పాస్తులన్నీ చూచుకుని రావటం అవసరం. వ్యవహారాలు కొన్ని చక్కచేసుకుని రావలసి వుంది. మొదట కుజ్మిన్‌స్కోకి వెళ్ళాడు. అతనికి వున్న ఆస్తిలో చాలా భాగం అక్కడే వున్నది.

అతని బాల్యమూ, యవ్వనంలో చాలా భాగమూ అక్కడే గడిచాయి. ఇటీవల రెండు పర్యాయాలు అక్కడికి వెళ్లటం కూడా సంభవించింది. వొకసారి తల్లి కోరిక మీద జర్మన్ గుమాస్తాను తీసుకుని ఆదాయ వ్యయాలు చూసుకుని వచ్చాడు. అక్కడ కౌలుదార్లకూ యజమానులకూ మధ్య గల సంబంధాలు అతనికి బాగానే తెలుసు. వ్యవసాయ కూలీలు యజమానుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండవలసిందే. విశ్వవిద్యాలయంలో చదువుకుంటూ వున్నప్పుడు అతనికి హెన్రీజార్జి సిద్ధాంతాలపై మక్కువ వుండేది. వాటిని ప్రబోధిస్తూ వుండేవాడు. వాటిని అనుసరించి పిత్రార్జితమైన తన భూమిని రైతులకు ఇచ్చివేశాడు. తరువాత సైన్యంలో పనిచేసి వచ్చాడు; సంవత్సరానికి ఇరవై వేల రూబుల్సు చొప్పున ఖర్చుపెట్టుకుంటూ భోగజీవితానికి అలవాటు పడ్డాడు. చదువుకుంటూన్నప్పుడు తాను ప్రచారం చేసిన సిద్ధాంతాలను పూర్తిగా మరచిపోయాడు. ప్రతినెలా తల్లి తనకు పంపిస్తూన్న ధనం ఎక్కడనుంచి వస్తున్నదా? అన్న ప్రశ్నే అతనికి స్ఫురించలేదు. అయితే తల్లి చనిపోయిన తరువాత, ఆస్తి తన చేతుల్లోకి వచ్చాక, తానే యాజమాన్యం చేస్తూ వుండవలసిన పరిస్థితుల్లో పునరాలోచన బయలుదేరింది. తనకూ తనసొంతం అనబడే ఆస్తికీ సంబంధం

ఎంతదెబ్బ కూడబెట్టాడనుకున్నా రేమిటి? ఒక పెద్ద ఆస్తి కొనేశాను కదా!"

తన జర్మన్ గుమాస్తా ఎలా మేనేజిమెంటు చేసుకొస్తున్నదీ తానెన్నడూ పట్టించుకోక పోవటంవల్ల అతనెంత లాభం కొట్టేస్తున్నదీ తనకు తెలుసు. పలుసార్లు అనుకుంటూనే వుండేవాడు. బండివాని మాటలు చెవికి ఇంపుగా ఎలా వుంటాయి ?

నల్లని మేఘాలు కమ్ముకొచ్చి సూర్యబింబాన్ని కప్పేశాయి. 'ఓట్సు' ధాన్యపు పొలాల్లో కలుపు తీస్తున్నారు రైతులు. పచ్చగడ్డి మొలిచి మైదానాలు చూడ్డానికి అందంగా వున్నాయి, పైన పిట్టలు ఎగురుతూ వుంటేను. బూరుగుచెట్లు తప్ప తక్కిన వృక్షజాలమంతా చిగురు తొడిగింది. బీళ్ళలో పశువులు మేస్తున్నాయి. దూరాన కొన్ని పొలాలు దున్నుతూ వున్నారు. ప్రకృతి అంతా ఇంత సౌందర్యమయంగా వున్నా ఎక్కడో ఏదో అసౌఖ్యంగా వున్నట్టు నెఖ్లూడొవు స్ఫురిస్తూ వుంది మాటిమాటికీ. ఏమిటా అని తరచి చూసుకున్నాడు. కన్నుల యెదుట పొడగట్టింది బండివాని కథ. చివరకు ఇల్లు చేరుకుని వ్యవహారాల్లో దిగిన తరువాత యీ విచారపు తెర వీడిపోయింది.

ఆఫీసు పుస్తకాలన్నీ తనిఖీచేశాడు. తమక్రింద పనిచేస్తూన్న కృషికులకు సొంతభూమి అంటూ ఏమైనా ఉన్నా అది చాలా స్వల్పం అనీ, ఆ స్వల్పమైనా తమ భూముల మధ్యలోనే ఉన్నదనీ, అందువల్ల తమకు చాలా లాభం కలదనీ జర్మన్ గుమస్తా ఇచ్చకాలు చెప్పాడు. అతనిమాటలు విన్న తరువాత, ఆఫీసు పుస్తకాలు చూచిన తరువాత నెఖ్లూడొవు తనభూమిని యావత్తూ కృషికులకు కౌలు కిచ్చివేయటానికే కృతనిశ్చయుడైనాడు.

ఆఫీసు పుస్తకాలనుబట్టీ, జర్మన్ గుమాస్తా మాటలనుబట్టీ నెఖ్లూడొవు తెలుసుకున్న విషయాలు ఇవి: తనకుగల సుక్షేత్రమైన భూమిలో మూడింట రెండు వంతులు యంత్ర సహాయమున సాగుబడి ఔతున్నది. మిగిలిన మూడవ పాలును కూలివాళ్ళు సాగుచేస్తున్నారు. మూడు యెకరాలను సాగు చేస్తే వాళ్ళకు ఇచ్చే కూలి అయిదు రూబుల్సు మాత్రమే. మూడు ఎకరాలనూ మూడుసార్లు దున్నాలి, యెదపెట్టాలి, కాపలా ఉండాలి. పంటకు వచ్చాక కొయ్యాలి; ధాన్యం బస్తాలకెత్తి యజమానికి వొప్పగించాలి; ఇంతేసి [illegible]

మంగా అయితే అయిదు రూబుల్సు మాత్రం వొస్తుతాయి. ఇక వాళ్ళకు కావలసిన తిండి గింజలకు, కూరాకులకు, వంట కట్టెలకు భూకామందులవారికి ఆధారపడుతుంగా బాకీపడుతూ ఉంటారు. ఇలా కూలిచేత సాగుబడి పొతున్న భూమిగాక రైతులు కౌలుకు తీసుకుని సాగుబడి చేస్తున్న భూమి కూడా ఉన్నది. అట్టి రైతులు చెల్లిస్తున్న కౌలుధనం...వాళ్ళు సాగు చేసే భూమి విలువపై 6% వడ్డీకి నాలుగు రెట్లు ఉంది.

ఈ ఘోర పరిస్థితులన్నీ నెఖ్లూదోవ్‌కు తెలియనివి కాదు. వీటిని అంతెం తొలగించాలని అతని ప్రస్తుతపు ఆలోచన. భూమిని యావత్తూ కూలి జనానికి కౌలుకు ఇచ్చివేసేట్టయితే చాలా నష్టాలు ఉన్నాయని జర్మన్ గుమాస్తా చెప్పాడు. వ్యవసాయపు పనిముట్లు ఇంట్లో వృథాగా పడివుండ వలసి వస్తుంది. ఒకవేళ వాటిని అమ్ముకున్నా నాలుగో వంతు ధర కూడా రాదు. అదీగాక ఆ కూలీలు భూమిని జాగ్రత్తగా చూడక నిస్సారం చేసే స్తారు. నెఖ్లూదోవ్ చాలా నష్టం వాటిల్లుతుంది కాని ఈ సాకులన్నీ నెఖ్లూదోవ్ కోర్కె నిశ్చయాన్ని దృఢతరం చేశాయి. తన ఆదాయం తగ్గిపోయినా సరే, భూమిని కూలి జనానికి కౌలుకు ఇచ్చివేయటం చాలా మంచిపని యని విశ్వసించాడు. ఆ పని తాను అక్కడ ఉన్నప్పుడే త్వరలో ముగించేయా లని నిశ్చయించుకున్నాడు. పైరు కోసి అమ్మటం, వ్యవసాయపు పనిముట్లూ, ఇంకా కొన్ని అక్కరకు రాని ఇళ్ళూ వగైరాలను అమ్మివేయటం—ఈ మొదలైన పనులన్నీ జర్మన్ గుమాస్తా కాలక్రమాన నిర్వహిస్తాడు. కుస్మింస్కీ సమీపంలో ఉన్న మూడు పల్లెలలోని కూలిజనాన్ని సమావేశ పరచవలసిందిగా జర్మన్ గుమాస్తాను ఆదేశించాడు. ఆ సమావేశంలో తాను తన భూమిని వాటికి ఏ షరతులపై కౌలుకు ఇచ్చేదీ చెప్పదలచుకున్నాడు.

తరువాత అతడు ఆఫీసునుంచి బయలుదేరి ఇంటి ఆవరణలో పచారు చేశాడు, తన భావి కార్యక్రమాన్ని గురించి ఆలోచించుకుంటూ. పూల తోటలో ప్రవేశించాడు. ఇప్పుడా పూలచెట్ల పెంపకాన్ని గురించి ఎవరూ పట్టించుకున్నట్టు లేదు. ఇక్కడి పూలచెట్ల అంట్లన్నీ జర్మన్ గుమాస్తాగారి యింటి ఆవరణలోకి వెళ్ళిపోయాయి. ఇక్కడి ఈ పూలమొక్కలన్నీ ఎండి పోతున్నవి. అక్కడినుంచి నెఖ్లూదోవ్ నిమ్మచెట్ల వరుస దగ్గరకు వెళ్లాడు. ఇదివరకు కాతడు ఈ ప్రదేశంలోనే వచ్చి చుట్ట కాల్చుకుంటూ ఉండేవాడు. తన తల్లిని చూసిపోయేందుకు వస్తూండే అందకత్తె కిరిమోవాతో ఇక్కడే

సరస సల్లాపాలు ఆడుతూ ఉండేవాడు. కూలి జనుల సమావేశంలో తాను ఇవ్వదలచుకున్న ఉపన్యాసాన్ని టూకీగా మనసులో తయారు చేసుకున్నాడు. తరువాత వచ్చి కాసేపు గ్రీన్ గుమాస్తాతో కాస్త ప్రసంగించాడు. ఆ పైని టీ త్రాగి తన సామానంతా సర్దుకుని, తనకోసం ప్రత్యేకించిన గదిలోకి వెళ్లాడు.

గది పరిశుభ్రంగా ఉంది. గోడలమీద తెలిసిన పత్రికల్లోంచి కత్తిరించిన పటాలు వేలాడుతున్నాయి. రెండు కిటికీల మధ్యన ఒక నిలువుటద్దం ఉంది. పరుపు పరచిన స్ప్రింగు మంచం ఉంది. పక్కన టేబిల్ మీద ఒక అద్దం, తాను తెచ్చిన చిన్న పెట్టె వున్నాయి. ఆ పెట్టెలో తాను తెచ్చుకున్న పుస్తకాలు స్ఫురణకు వచ్చాయి. వాటిలో ఒకటి రష్యన్ భాషలో వ్రాసిన "నేరములు-వాటి స్వభావము" గురించిన ఒక మనస్తత్వ పరిశోధక గ్రంథం. కాని ఇప్పుడు చదివేందుకు సమయం కాదు. వెంటనే పడుకుంటే ముందుగా లేవచ్చు; లేచి కూలి జనుల సమావేశానికి ఆయత్తం కావచ్చు.

ఆ మూల ఒక విలువైన పడక కుర్చీ కనిపించింది. అది తన తల్లిగారి పడకటింట్లో ఉంటూ ఉండేది. దాన్ని చూడ్డంతోనే అతని హృదయంలో ఒక భావావేశం పొడచూపింది: తలవని తలంపుగా ఒక దుఃఖపు తెర ఆవరించినట్టు అయింది. ఈ పెద్ద ఇల్లు పాడు పెట్టవలసిందేనా? తోట అంతా చిట్టడవిగా మారిపోవలసిందేనా? ఈ పొలాలు, పశువుల శాలలు, గుర్రాలు గొడ్డు, గోద—ఇవన్నీ సంపాదించటానికీ, పోషించటానికీ...తాను గాక పోయినా ఎవరో ఒకరు ఎంతో శ్రమించి వున్నారు. ఇదంతా వొదిలివేయటం, ఆదాయాన్ని పోగొట్టుకోవటం అనుకున్నంత తేలికా?

"ఊహుఁ. నాకు సొంత భూ ఆస్తి ఉండనక్కర్లేదు. ఇల్లు, వాకిలి కూడా అవసరం లేదు. నేను సైబీరియా వెళ్ళిపోతున్నాను. ఇల్లు, ఆస్తి నా కేమీ అక్కర్లేదు" అని అతనిలోనుంచి ఒక శబ్దం.

"అంతా బాగానే ఉంది. అయితే యావజ్జీవం నువ్వు సైబీరియా లోనే ఉండబోవటం లేదుగా! పెళ్ళిచేసుకుంటావు; పిల్లల్ని కంటావు; ఆ పిల్లలకు ఈ ఆస్తిఅంతా సక్రమమైన స్థితిలో వొప్పజెప్పటం నీ విధి. పాడు చేయటం తేలికే; సంపాదించటం కష్టం కాదూ! ముఖ్యంగా నీ భవిష్యత్తునుగురించి ఆలోచించుకుని తదనుగుణంగా నీ ఆస్తిపాస్తుల వ్యవహారాల్ని

నడుచుకోవాలి. నిజంగా నీ అంతరాత్మ చెప్పేదాని ప్రకారమే చేస్తున్నావా? లేక ఆడంబరంకోసం మాత్రం చేస్తున్నావా?" అని ప్రశ్నోత్తరం లోలోపల ధ్వనించింది. కొంత ఆత్మావలోకనం చేసుకున్నాడు... నిజానికి ఇతర ప్రశ్నలను చూడగోవాలన్న కోరికే ఈ విధమైన నిర్ణయానికి కారణం అని ఇంతకు తాను అంగీకరించాడు. ఈ విషయమై ఆలోచించిన కొలదీ అనేక ప్రశ్నలు ఎదురౌతూ సాగినవి. అవి మరింత పరిష్కారాసాధ్యాలుగా ఉన్నవి.

ఈ భావాలన్నిటినుంచీ తప్పించుకునేందుకు నిద్రపడితే బాగుండు ననుకున్నాడు. తెల్లవారి లేవాక మెదడు పరిశుభ్రంగా వుంటుంది; ఈ విషయాలన్నీ సాకల్యంగా ఆలోచించుకోవచ్చు ననుకున్నాడు. కాని చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు. కిటికీగుండా, వెన్నెల వెలుగుతోపాటు కప్పల రొదకూడా గదిలో ప్రవేశిస్తోంది. పక్షిసంతతుల కలకలారావం వినిపిస్తోంది. దానితో ఇన్‌స్పెక్టరుగారి కూతురి సంగీతమాధుర్యం గుర్తుకువచ్చింది. తరువాత మస్లొవా జ్ఞప్తికి వచ్చింది. "నువ్వు అది సర్వమూ వొదిలిపెట్టేయాలి" అని ఆమె ఆ నాడు చెబుతూంటే పెదవులు ఎలా వొణికాయో!—సైతం బెకబెకమంటున్న ఆ కప్పల పదపదలవలె. అంతట ఆ జర్మన్ గుమాస్తా ఆ కప్పలున్న వైపుకు జారిపోతున్నట్టు లీలగా కనిపించసాగింది. అతన్ని పట్టుకుని ఆపవద్దూ! కాని అతడు వెళ్ళనే వెళ్ళాడు. వెళ్ళటమే కాదు; మస్లొవాగా మారిపోయి నెఖ్లూదొవ్‌ను ఉపాలంభిస్తూ "నువ్వు జమీందారు బిడ్డవు. నేను నేరస్థురాల్ని" అనటం వినిపించింది. "ఎబ్బే, నే నా నిశ్చయాన్ని పాటించితీరాలి, వెనక్కు తగ్గకూడదు. నేను చేస్తున్నది తప్పా, ఒప్పా? నాకు తెలీదు. అయినా ఆ విచారణ నాకు అక్కరలేదు. ఏమైనా గానీ. ఇప్పుడు నేను నిద్రపోవాలి—" ఈ రకమైన ఆలోచనా పరంపర సాగిసాగి... ఇన్‌స్పెక్టరు, మస్లొవా కనిపించిన ప్రదేశంవరకూ అతని మనస్సు వెళ్ళింది. అంతే, ఆ తరువాత ఏమీ లేదు.

౨

ఉదయాన తొమ్మిదింటికి నిద్రనుంచి లేచాడు నెఖ్లూదొవ్. ఆఫీసు నౌకరు ఆయన బూట్లను చక్కగా పాలిష్‌చేసి తీసుకొచ్చాడు. అంతగా అవి ఎన్నడూ తళతళలాడుతూ ఉండలేదు. చల్లని పరిశుభ్రమైన ఊటజలం

కూడా ఆ నౌకరు తెచ్చి ముందుంచాడు; కార్మికజనం సమావేశం ఔతున్నారన్న వార్త చెప్పాడు. వెంటనే నెహ్లూడోవ్ పక్కమీదినుంచి లేచాడు. తన ఆలోచనలన్నీ మనసులో ఏకత్రితం చేసుకున్నాడు. తన భూఆస్తిని యావత్తూ కార్మికజనానికి పంచియిచ్చే విషయంలో గతరాత్రి తనలో పొడచూపిన సంకోచభావం ఇప్పుడు లేశమాత్రమూ లేదు. అటువంటి భావం తనలో ఎందుకు పొడచూపిందో తనకే ఆశ్చర్యంగా వుంది. తాను చేయదలుచుకున్న పనియెడల ఉత్సాహం తొణికింది. సగర్వంగా లేచాడు.

కిటికీలోనుంచి అటు కెస్నెసు ఆదేశస్థలంవైపు చూచాడు. అక్కడే తన రైతాంగం సమావేశమౌతూవుంది. గతరాత్రి కప్పలు ఎక్కువగా అరిచాయంటే...ఔను మరి; మందంగా ఉండింది వాతావరణం, గాలి లేదాయెను. ఉదయాన కాస్త చిటిపాటి చినుకులు పడ్డట్టుంది. చెట్లమాకుల మీద, గడ్డిపోచలమీద నీటిబిందువులు నిల్చివున్నాయి. కొత్తగా మొలచిన మొక్కల సువాసనతోపాటు, ఇంకా వర్షం కావాలన్న కోరికను తెలుపుతూన్న చెమ్మనేలవాసన కిటికీగుండా లోనికి వస్తోంది.

దుస్తులు వేసుకుంటూ నెహ్లూడోవ్ పలుసార్లు అటు కెస్నెసు ఆదేశస్థలంవైపు చూచాడు. ఒక్కొక్కరే వస్తున్నారు కూలీలు. ఒకరొకరు పలుకరించుకుని కూచుంటున్నారు. చేతికర్రలను తడుముకుంటూ పరస్పరం ఏమేమో సంభాషించుకుంటూ వున్నారు-ఇంతలో...అసంఖ్యాకములైన బొత్తాములు గల చొక్కా తొడుక్కున్న నౌకరు వచ్చి అయ్యగారికి మనవి చేశాడు—కూలీలంతా వచ్చివున్నారనీ, 'టీ'యో, కాఫీయో, అయ్యగారు తమ కిష్టమైనది పుచ్చుకుని వెళ్ళేవరకూ వాళ్లు వేచివుంటారనిన్నీ.

"ఊహుఁ- నేను ఇప్పుడే వెళ్ళి వాళ్ళను చూడాలి" అన్నాడు నెహ్లూడోవ్. అంటూ ఉండగానే అతనిలో ఒక లజ్జాభావం అంకురించింది. చాలా తక్కువ కౌలుకు తన భూమిని వారికి ఇవ్వబోతున్నాడు. ఇలాంటి సంఘటనను వాళ్లు ఎప్పుడూ ఊహించుకునైనా ఉండరు. ఇది ఒక వరప్రసాదం వాళ్ళకు. అయినా నెహ్లూడోవ్ ఎందుకొరకో లజ్జాన్వితుడైనాడు.

చివరకు నెహ్లూడోవ్ రైతులముందుకు వచ్చాడు. నెరిసిన తలలవారు, బట్టతలలవారు, నల్లనిజుట్టు ఉన్నవారు—రైతులంతా గౌరవసూచకంగా శిరోవేష్టనాలను తీసేశారు. వారి ముందు నెహ్లూడోవ్ భావాసక్యత కలిగి

"బాగానే ఉంది—" అన్నాడొక కుర్రవాడు.

"కాలం మేము కష్టాలపాలైపోయాం అయితేనే —" అన్నాడు మరొకడు.

"పాపం, కూలీకు మనం ఎందుకు ఒప్పుకోవటం లేదూ?"

"దున్నకుని బ్రతకవలసిన వాళ్ళకేంగా మనం!"

"అదే దొరగారికి కావలసిన విధానం. కాస్త సవాళ్ళు చేసుకోవటం తప్ప మరేమీ పనివుండదు- చూడండి, ఎలా పాపం పండిపోతోందో!"— అటూ ఇలా పలురకాలుగా వ్యాఖ్యానాలు సాగుతున్నాయి.

"పాపం అంతా మీదే. మీ పని మీరు సక్రమంగా చేస్తూ జాగ్రత్తగా ఉంటే—" జర్మన్ గుమాస్తా ఏదో చెప్పబోయాడు.

"అది మాకు ఎలా సాధ్యం అవుతుంది? 'పశువుల్ని పంటచేలోకి ఎందుకు తోలావురా?' అని దబాయిస్తావు నువ్వు. నేను తోలానా? కాళ్ళ వలి పట్టుకుని వొళ్ళు హూనం అయిపోయేట్టు రోజంతా కష్టపడ్డా, రాత్రి అయేసరికి బడలికమీద నిద్రపట్టేసింది. పశువులను కాపలా ఉండలేక పోయాను. అవి ధాన్యపుచేలోకిపోయి పడ్డాయి. నువ్వేమో నా వొంటి మీది చర్మం వొలిపించేశావు—" అన్నాడొక కోసుముక్కు గల కూలీ.

"కాను మరి, రూల్సు ప్రకారం నడుచుకోవద్దూ?"

"మీరు రూల్సు మాటాడతారు. మావి ప్రాణాలుపోతున్నాయి—" అన్నాడొక పొడగరియైన, నల్లజుట్టుగల మధ్యవయసువాడు.

"పొలంచుట్టూ కంచె పెట్టమని చెప్పావు కాదూ?"

"అందుకు కలప సప్లయి చెయ్యండి మరి! నిరుడు కంచె వేస్తానికని నాలుగు వాసాలు నరికానని మూడు నెలలు జైల్లో పెట్టించి బాధ పెట్టావు. దాంతో కంచె పోయింది; అన్నీ పోయాయి."

"ఏమిటంటాడతను?" నెహ్లూడొవ్ అడిగాడు గుమాస్తాను.

"ఏముంది? గజదొంగ వాడు. ప్రతిరోజూ నన్ను అడవిలోనుంచి కలప దొంగిలించుకు పోతూ ఉంటాడు" అని సమాధానం చెబుతూ ఆ జర్మన్ గుమాస్తా కూలివానివైపు తిరిగి, "కానోయి, ఇతర్ల సొంత ఆస్తులను మన్నించటం నేర్చుకోవాలి మరి!" అన్నాడు.

“[illegible] మిమ్మల్ని మేము [illegible] గౌరవించి తీరాలి. కాని [illegible]న్నారు; [illegible] చిక్కాం” అన్నాడొక [illegible].

“[illegible] [illegible] అన్నాడు గుమాస్తా.

“అలాగాండి. నా దవడ పగిలేట్టు కొట్టింది మీరే కదా సామీ! డబ్బుగల దొరలుమీరు; మిమ్మల్ని కోర్టుకెక్కించ గలమా మేము?”

“రూల్సును వ్యతిరేకించవచ్చునా మరి?”

ఈ విధంగా వాదోపవాదం సాగుతూ పోయింది. కూలీవాళ్ళ హృదయంలో భయంచేత అణగియున్న కోపతాపాలు కొంచెం కొంచెంగా పైకి చిమ్ముకొస్తున్నాయి. జర్మన్ గుమాస్తా తన అధిపత్యాన్ని, అధికారాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఇదంతా సెక్లూడోవ్‌కు విసుగు పుట్టించింది. అసలు విషయానికి వచ్చాడు.

“సరే, ఇక మన భూమి కౌలు విషయానికి వద్దాం. మీరు కౌలుకు తీసుకునేందుకు ఇష్టపడుతున్నారా? ఈ యావత్తు భూమినీ నేను మీకు కౌలుకు ఇచ్చేసేట్టయితే మీ రెంత సొమ్ము చెల్లిస్తారు?” అని అడిగాడు.

“ఆస్తి మీది. కౌలుధనం మీరే నిర్ణయించండి.”

సెక్లూడో కొంత మొత్తాన్ని నిర్ణయించి చెప్పాడు. చుట్టు ప్రక్కల నున్న ఇతర భూముల కౌలురేట్లకన్నా తక్కువ రేటే చెప్పాడు. అయినా అది చాలా ఎక్కువ అని రైతులు అన్నారు; బేరం చేయసాగారు. అది వాళ్ళకు ఎప్పుడూ మామూలే. తాను చెప్పిన మొత్తానికి రైతులు సంతోషించి తేలిగ్గా ఒప్పుకుంటారని సెక్లూడో అనుకున్నాడు. కాని వాళ్ళ ముఖాల్లో అలాంటి సంతృప్తి యేమీ కనిపించలేదు.

యావన్మంది రైతులూ ఒక సంఘంగా ఈ భూమిని సమిష్టిగా కౌలుకు తీసుకుంటారా? లేక వారిలో కొంతమంది మాత్రమే పెద్దరికం వహించి బాధ్యతకు అంగీకరిస్తారా? ఈ ప్రశ్న వచ్చినప్పుడు రైతుల్లో సంచలనం బయలుదేరింది. బలహీనులనూ, సరిగా సకాలానికి కౌలుధనం చెల్లించలేని వాళ్ళనూ తొలగించేయాలని కొందరు వాదించారు. మేము కూడా ఉండా

ల్సిందేనని అట్టివాళ్ళు పట్టు పట్టారు. చివరకు ఎలాగైతేనేమి జర్మన్ గుమాస్తా చాకచక్యంవల్ల కౌలు ధనం విషయంలోనూ, కౌలు చెల్లించే వాయిదాల విషయంలోనూ ఒక నిర్ణయానికి వచ్చారు. తరువాత రైతులంతా గలగలా మాట్లాడుకుంటూ తమ వాడకు వెళ్ళిపోయారు. కౌలు దస్తావేజు తయారు చేయటానికి నెఖ్లూడో జర్మన్ గుమాస్తా ఆఫీసులోకి వెళ్ళాడు.

అంతా నెఖ్లూడో కోరుకున్నట్టే జరిగింది. ఆ జిల్లాలో ఇతరచోట్ల భూములమీద ఇచ్చే కౌలుకన్నా 30 శాతాలు తక్కువ కౌలుకే తన భూమిని రైతులకు ఇచ్చేస్తున్నాడు. దానివల్ల తనకు వచ్చే ఆదాయం సగానికి సగం తగ్గిపోయింది, అయినా తనకు కావలసినదానికన్నా ఎక్కువే వస్తున్నది. పైగా అడవి ఒకటి అమ్మాడు, దాని తాలూకు డబ్బు రావాలి. అమ్మబోతూన్న వ్యవసాయపు పనిముట్లమీద కొంత సొమ్ము రావలసి ఉంది. అయినా వొక్క విషయం మాత్రం లోటుగా కనిపిస్తున్నది. రైతులు ఏవో కృతజ్ఞతా వాక్యాలు పలికినా వాళ్ళ ముఖాల్లో తృప్తి కనిపించదేం? ఇంకా అధికంగా ఆశిస్తున్నట్లు కనిపిస్తారేం? కాబట్టి తాను చాలా పోగొట్టుకున్నాడు; అయినా రైతుల్ని తృప్తిపెట్టనూ లేకపోయాడు.

మర్నాడు దస్తావేజుమీద సంతకాలు అయాయి. నెఖ్లూడో రైతు ప్రతినిధులతో కలిసి ఆఫీసులోనుంచి బయటకు వచ్చాడు. ఇంకా చేయవలసిన పని ఏదో ఉండి చేయనివాడివలె అసంతృప్తి భావంతో బండి ఎక్కాడు. ఏదో అసంతృప్తి, నిరాశ తొణుకుతూన్న ముఖాలు గల రైతులకు వీడ్కోలు చెప్పి స్టేషన్‌కు పోయాడు. తనలో కూడా ఏదో చెప్పరాని అసంతృప్తి సందడిస్తోంది. ఏదో విచారం, లజ్జ అనుభవిస్తున్నాడు.

## 3

కుజ్మిన్‌స్కీనుంచి నెఖ్లూడో తన మేనత్తలనుంచి సంక్రమించిన ఎస్టేటును చూడ్డానికి వెళ్లాడు. అక్కడే అతడు ప్రప్రథమంగా మస్లోవాను చూశాడు. అక్కడి భూ ఆస్తిని కూడా కుజ్మిన్‌స్కీలో వలెనే రైతుల పరం చెయ్యాలని అతని కోరిక. అదీగాక మస్లోవా గురించీ, ఆమె కన్న బిడ్డను గురించీ సర్వం తెలుసుకోవాలని కూడా అతని ఉద్దేశం. ఆ బిడ్డ

చనిపోయిన మాట నిజమే అయితే ఎలా చనిపోయిందీ, అంతా తెలుసుకోవాలని అతని కుతూహలం.

తెల్లవారేసరికి సానొవా చేరుకున్నాడు. భవనమంతా పాడుబడి వుంది. అక్కడక్కడ పైకప్పిన ఇనుపరేకులు తుపానుగాలులకు చెదరి వున్నాయి. బాగా తుప్పుపట్టి పోయాయి. వంటయిల్లు, పశువులశాలలు పడిపోయే స్థితిలో వున్నాయి. చుట్టూ తోటమాత్రం పూర్వంకన్నా దట్టంగా పెరిగి, నిండుగా పూచి, విరివిగా కాచి చూపులకింపుగానే వుంది. అదిగో ఆ మూలనే తాను పన్నెండు సంవత్సరాల క్రితం మస్లావాతో ఆడుకుంటూ ఆ పొద వెనకాతే పడిపోయాడు. అప్పుడు చేతికి ఒక రేగిముల్లు బాగా గుచ్చుకొని నొప్పిచేసింది. అదిగో ఈ మూల తన మేనత్త సోఫియా ఆ రోజుల్లో పాతిన సీమరేగుచెట్టు ఎంతఎత్తుగా పెరిగిందో! రొద చేసుకుంటూ ఆ వైపున నది ప్రవహిస్తూవుంది. ఆ పక్కన మైదానంలో రైతుల పశువులు మేస్తూవున్నాయి.

ఆ కూలిపోతున్న యింట్లో సముద్దారు ఉంటున్నాడు; కాలేజి చదువు పూర్తికాకముందే వచ్చేసినవాడు. నవ్వుముఖంతో వచ్చి నెక్లూడోకు స్వాగతం ఇచ్చాడు. చిరునవ్వు నవ్వుతూనే "రండి ఆఫీసులోకి" అంటూ పలికి లోనికి దారితీశాడు. అనుకోని మేలు ఏదో ఇస్తాను అన్నట్టు ఆశ గొలుపుతూన్న దాతని చిరునవ్వు - సముద్దారు లోనికి వెళ్లాడు. ఏవో గుసగుసలు లోపలనుంచి వినిపించాయి. నెక్లూడో ఎక్కివచ్చిన బండీవాడు కిరాయి తీసుకుని వెళ్ళిపోయాడు. అతనిబండీ గుర్రపు మెడగంటల మ్రోత సన్నగిల్లినది. చివరకు కాసేపు నిశ్శబ్దం. తరువాత ఒక అమ్మాయి, కర్షక బాలికలు సాధారణంగా ధరించే పరికిణీ తొడుక్కుంది, చెవులకు లోలకులున్నాయి—కిటికీపక్కనుంచి వెళ్ళింది. ఆమెపక్కనే ఒక మనిషికూడా వెళ్ళాడు బూట్లుచప్పుడు చేసుకుంటూ.

ఆ గదిపక్కనే కూచున్నాడు నెక్లూడో తోటవైపు చూస్తూ. వసంత పవనం మెల్లగా వీచింది. మొక్కలు నాటేందుకు కొత్తగా త్రవ్విన పాదుల్లో నుంచి మట్టివాసన మోసుకొస్తున్నదా గాలి. చెమటపట్టిన అతని నుదుటి మీది ముంగురులతోనూ, కిటికీప్రక్కనవున్న కాగితాలతోనూ ఆడుకుంటున్నవి ఆ గాలి తరంగాలు.

అల్లంతదూరాన వస్తున్నారు. తెడ్లు వేసుకుంటూన్న పడవలు లయతప్పకుండా విసిరేస్తున్నారు . పిల్లవాడొక డు ధైర్యంగా నేర్పుతో స్థిరంగా రొదచేసుకుంటూ గాలి పక్షులనుంచి కుర్రాడు వెళ్ళిపోయింది.

వయ
అప్పుడు ఒక్కసారిగా నక్షాడ్రోకు తన నూత్న యౌవనదశలో ఆదే చోటు, అలాగే స్త్రీలు బిడ్డలు ఊపుకొంటూన్న పడవలు, వసంతపవనాలు వీచి తన ముంగురులతో ఆడుకోవటం, ఇప్పటి వాస్తవంగానే ఒక కోకిల తమ్మెదన చెవిదగ్గరనుంచి రొద చేసుకుంటూ ఎగిరిపోవటం—ఇదేమాదిరి అను భూతి కలిగివుండటం జ్ఞాపకానికి వచ్చింది. నిజంగా తను 19 వత్సరాల యౌవనమూర్తినేనని అనుకుని ఉండకపోవచ్చు. కాని ఆ వయస్సులో తనకు వుండిన ఆ పవిత్రత, ఉత్సాహం, భవిష్యదాశలు ఇప్పుడుకూడా తనలో ప్రజ్వలిస్తూ వున్నట్లు ఒక విచిత్రమైన అనుభూతి కలిగింది. కాని కల తెగి పోయి మెలకువ రాగానే అదంతా అసంభవం అని తోచింది. చాల విచార గ్రస్తుడైనాడు.

"మీరు భోజనం ఎప్పుడు చేస్తారు?" అని అడిగాడు సముద్రాలు వచ్చి.

"మీ యిష్టం. నాకు ఆకలిలేదు. మొదట ఊళ్ళో కాస్త తిరిగి వస్తాను."

"ఇంట్లోకి రారూ మరి? లోపల అంతా సవ్యంగానే వుంది."

"ఇప్పుడు కాదు. తరువాత - అయితే ఇక్కడ మైత్రేనా అనే పేరు గల యువతి ఉన్నదా?" ఆమె మప్లానాకు పినతల్లి.

"ఔను. ఉంది. రహస్యంగా కుండలుచేసి అమ్ముకుంటూవుంటుంది. అందుకామెను నేను తరచు తిట్టి కోపగించుకుంటూ ఉంటాను. కాని ఆమెది జాలికరమైన స్థితే. ముసలిదై పోయింది. మనుమలు, మనుమరాళ్లు ఉన్నారు—" అంటూ సముద్రాలు చిరునవ్వు ప్రదర్శించాడు యజమానిని సంతోష పెడుతున్నాననుకుంటూ—ఇటువంటి విషయాలలో ఆయన దృక్పథంకూడా తనలాంటిదేనని భావిస్తూ.

"ఆమె నివాసం ఎక్కడ? వెళ్ళి చూడాలనుకుంటున్నాను."

"ఊరిచివర ఎక్కడో దూరంగా బనిసాలలో కట్టిన పాక ఒకటి వుంది; దాని అవతల ఆమె పాక వుంది. మిమ్మల్ని తీసుకువెడతాను అక్కడికి కావలిస్తే—" అంటూ సముద్రన్నాయుడు మందహాసం చేశాడు.

"అక్కర్లేదు. నేనే వెళ్ళి కనుక్కుంటాను. మీరు మాత్రం ఇక్కడి రైతులనందర్నీ సమావేశపరచండి. నేను వాళ్ళతో మన భూమిని గురించి మాటాడాలి" అన్నాడు నెఖ్లూడోవ్. కుస్మిన్స్కీ వలెనే ఇక్కడి రైతులతో కూడా ఒక ఒప్పందానికి వచ్చి... వీలైతే ఆ సాయంత్రమే... రావాలని అతని ఉద్దేశం.

౪

గేటుదాటి వీధిలోకి వచ్చాడు నెఖ్లూడోవ్. ఆ లోలాకుల అమ్మాయి ఎక్కడికో పోయి తిరిగి వచ్చేస్తోంది. ఆమె కుడిచేతిలో కోడిపెట్ట ఒకటి వుంది. ఎడమచేయి విసురుగా ఊపుకుంటూ గబగబా నడుస్తున్న దామె. కాని నెఖ్లూడోవ్‌ను చూడగానే నడకవేగం చాలాభాగం తగ్గింది. దగ్గరకు రాగానే ఆమె అతనికి తలవంచి నమస్కారం చేసింది. తరువాత అతన్ని దాటిపోయిన తరువాత మళ్ళీ నడకవేగం పూర్వంలా హెచ్చించింది.

నెఖ్లూడోవ్ ముందుకు సాగిపోగా బావిదగ్గర ఒక ముసలమ్మ కనిపించింది. ఆమె ఒక చింపిరి ముతకబట్ట కట్టుకుంది. రెండు నీళ్ళబిందెలు మోసుకుపోతూవుంది. ఆమెకూడా అతన్ని చూడగానే నీళ్ళబిందెలు దించుకుని, వంగి నమస్కారం చేసింది.

బావిదాటి నెఖ్లూడో ఊళ్ళోకి సాగిపోయాడు. అప్పటికి పది గంటలే అయింది. అయినా ఎండవేడి తీక్షణంగా ఉంది. అప్పుడప్పుడు మాత్రం మబ్బులు వచ్చి సూర్యబింబాన్ని కప్పేస్తున్నాయి. వీధుల్లో, అంత మరీ అసహ్యంగా లేకపోయినా, పేడ కంపు తీవ్రంగా కొడుతోంది. పొలాలకు ఎరువు మోసుకుపోతోన్న బండ్లనుంచి వస్తున్న దా వాసన. అదీగాక ప్రతి ఇంటిముందూ, ప్రతిరోజూ పోగుచేస్తూ వచ్చిన ఎరువు కుప్పలు విరివిగా ఉన్నాయి. ఆ కుప్పల్ని కదిలించి బండ్ల కెత్తుకుంటున్నారు రైతులు. వారి పాదాలకు ఆచ్ఛాదనం లేదు. దుస్తులు మట్టి కొట్టుకుని ఉన్నాయి. ఎరువును పొలాల్లో పోసేసి బండ్లలో కేరింతలు కొట్టుకుంటూ కొందరు

రైతు యువతులు తిరిగి వస్తున్నారు. వారంతా ఆశ్చర్య చకితులై చూడ సాగారు నెక్లూడోను. లావుగా జాకెట్టైవున్నాకి, వొక గోధుమరంగు టోపీ ధరించి, వెండి పొన్నుగల కర్ర ఊపుకుంటూ ఈ పల్లె వీధులలో పోతున్న ఈ కొత్త వ్యక్తి ఎవరు? స్త్రీలు వాకిళ్ల గుమ్మాల్లో నిల్చొని కొందరు, లోపలి మెట్లాల్లో నిల్చొని కొందరూ అతనికేసి చూస్తూ పరస్పరం వింత పడుతూ వున్నారు.

మరికొంత దూరం సాగివచ్చాడు నెక్లూడో. ఒక యింటి ఆవరణ లోనుంచి వొక బండి వొస్తోంది. దానినిండా ఎరువు దట్టించి వుంది. పైన వొక చాప పరిచారు కూచునేందుకు. బండి యెక్కి తాను కూడా వెళ్లాలన్న ఆతృతతో వొక ఆరేళ్ళ కుర్రవాడు వెనుక పరిగెత్తుకొస్తున్నాడు. వొక రైతు యువకుడు మోకులు పుచ్చుకుని ఎద్దుల్ని తిన్నగా వీధిలోకి మరలించుకొస్తున్నాడు. అతనికి సాయంగా వచ్చాడు వొక ముసలి రైతు. గుండెమీది యెముకలు బయటకు వచ్చాయతనికి. మురికి వస్త్రాలు ధరించి వున్నాడతను. బండి వీధిలోనికి వచ్చేసింది; ముందుకు సాగిపోయింది. ముసలి రైతు వెనక్కు తిరిగి వచ్చేశాడు. అక్కడ నెక్లూడో నిల్చి వుండగా చూసి నమస్కారం చేశాడు. "మా దొరసాని మేనల్లుడుగారు కామా మీరు?" అని పలుకరించాడు.

"ఔను."

"ఓ. మమ్మల్ని చూడ్డానికి వచ్చారా? ఎంత దయ!" అన్నాడా వాచాలుడు ముసలి.

సమాధానం వెంటనే తోచక "ఔను; చూడ్డానికే వచ్చాను. ఎలా వుంది మీ వ్యవహారం?" అని అడిగాడు,

"మా వ్యవహారమా! ఘోరంగానే వుంది."

"ఎందువల్ల?" అంటూ గేటులోకి అడుగువేశాడు నెక్లూడో.

"ఘోరంగాక ఏముంది బాబూ!" అంటూ ముసలివాడు లోపలికి దారితీశాడు. గొడ్లకోసం కామాలు వేసిన పందిట్లో ఆగాడు నెక్లూడో.

"ఇంట్లో అంతా కలసి పన్నెండుగురం వున్నాం బాబూ! నెల అయ్యేసరికి నాలుగుబస్తాల ధాన్యం కావాలి. కొనటానికి డబ్బు ఎక్కడ

నుంచి వస్తుంది!" అంటూ ఆ ముసలివాడు తన కుటుంబాన్ని చూపించాడు. పైటలు జారగా, కాళ్ళన్నీ మురికిదైన ఇద్దరు స్త్రీలు ఎరువుకుప్పమీద కనిపించారు నెక్లూడోవ్‌కు.

"సొంతంగా ధాన్యం పండించుకోవూ చాలినంత?"

"సొంతమా?" వ్యంగ్యహాసం చేశాడా రైతు. "ముగ్గురికి సరిపోయే ధాన్యమే మా సొంతానికి పండించుకోగలుగుతున్నాం. నిరుటిధాన్యం క్రిస్టమస్ పండుగవరకూ మాత్రమే సరిపోయింది."

"ఆ తరువాత ఏం చేశావు మరి?"

"ఏం చేశాను? ఒకకొడుకుని పాలేరుగా ఒప్పజెప్పేశాను. తరువాత తమ దివాణంలో అప్పు తెచ్చుకున్నాను. అదైనా మరి మూడు నెలలు వచ్చింది. ఇప్పటికీ ఆ వడ్డీ చెల్లించ లేదు."

"వడ్డీ ఎంత?"

"పదిహేడు రూబుల్సు. ఈ పాడుబ్రతుకు ఎలా కడతేరాలో భగవంతుడికి తెలియాలి."

"మీ పాకలోకి నేను రావచ్చునా?" అంటూ నెక్లూడోవ్ ముందడుగువేశాడు. ఆ ఎరువుకుప్పమీద కాలివ్రేళ్ళ సందుల్లోనుంచి మురికినీరు ఊరుతూఉంటే ఆ ముసలిరైతు ముందుగా నడిచిపోయి పాకతలుపు తెరచాడు. "రండి బాబూ!" అని ఆహ్వానించాడు. ఆ యువతులు జారిన పైటలు సవరించుకుని ఆశ్చర్యంగా నెక్లూడోవ్ కేసి చూస్తూ ఉన్నారు. పులు కడిగిన ముత్యంలా ఉన్న ఆ వ్యక్తి అంత పరిశుభ్రమైన దుస్తులు ధరించి తమ పాకలోకి కోరి వస్తున్నాడేమిటి?

చింకిపాతలేవో ధరించిన ఇద్దరు ఆడపిల్లలు పాకలోనుంచి బైటికి వచ్చారు. ఎత్తులేని ఆ ద్వారంముందు నెక్లూడోవ్ జాగ్రత్తగా వంగి ఆ ఇరుకైన పాకలో ప్రవేశించాడు. చద్దియన్నము కంపు. పాక అంతా రెండు పెద్ద రాటాలు ఆక్రమించుకొని వున్నాయి. పొయ్యిదగ్గర ఒక సగాలు వెళ్లుకొచ్చి వున్న ముసలమ్మ నిల్చుని ఉంది.

"ఇదుగో మన దొరగారు మనల్ని చూడ్డానికొచ్చారు" అన్నాడు ముసలిరైతు.

"దయచెయ్యండి బాబూ!" అన్నదా ముసలమ్మ.

"మీ జీవయాత్ర ఎలా సాగుతోందో చూదామనుకున్నాను."

"చూస్తున్నారుగా! ప్రాకేమో కూలిపోయేస్థితిలో ఉంది. ఎప్పుడు కూలిపడి ఎవరు చావనున్నారో చెప్పలేం. 'కూలిపోవటమేమిటి గట్టిగా ఉంటేను. రాజాల్లాగ ఉంటున్నామ్మ ఇంటిలో' అంటాడు మా ముసలయ్య."

"వంట చేస్తున్నట్టున్నావు. ఏం కూరలు చేస్తున్నావు?" నెఖ్లూడొవ్ అడిగాడు.

"కూరలా!—అన్నం, గంజి..." అంటూ ఇంకేమో చెప్పబోతూ బోసినోరు వెళ్ళబెట్టింది ఆ ముసలమ్మ.

"ఏదీ, మీ అన్నం, కూరలు ఎలా ఉంటాయో నేను చూడాలి."

"మావి దృష్టి తగిలే వంటకాలు కావు బాబూ—చూపించవే" అంటూ ముసలిరైతు భార్యను ఆజ్ఞాపించాడు.

"మా బీదరైతుల భోజనం చూస్తారా! మొత్తానికి మంచిపట్టుదలగల దొరే! అయినా చెప్పాను కదా బాబూ! అన్నం, గంజి—పులుసుకూడా పెడుతున్నాను. ఆ యింటావిడ చేపలు తెచ్చింది. అవి నాలుగు పులుసులో వేస్తాను."

"అంతేనా, ఇంకేం లేదా?"

"ఇంకేం కావాలి మాకు బంగాళదుంపలున్నాయి. పోలుకూడా ఉన్నాయిగా!" అని ఆమె నవ్వుతూ వీధిగుమ్మంకేసి చూచింది. గుమ్మం దగ్గర అప్పుడే చాలామంది పిల్లలు, పసిపిల్లల్ని ఎత్తుకున్న అమ్మలక్కలు గుమికూడి వింతగా చూస్తున్నారు కొత్తవ్యక్తికేసి - బీదవాళ్ళ భోజనం చూడాలని ఉత్సాహపడుతున్న నెఖ్లూడొవ్ వాళ్ళకొక వింతమనిషిలా ఉన్నాడు.

"ఇంతకూ మా బతుకు చెప్పకుండానే తెలిసిపోతున్నది లెండి" అన్నాడు రైతు. అని గుమ్మంకేసి తిరిగి "ఎందుకూ మీరంతా అక్కడ?" అని అరిచాడు.

"సరే, ఇక నేను పోయివస్తాను" అంటూ ఏదో సిగ్గుపడినవాడులా పలికాడు నెఖ్లూడొవ్. ఆ సిగ్గుకు కారణం ఏమిటో తనకే తెలియదు.

"తమరు మా ఇంటికి దయచేసినందుకు కృతజ్ఞులం—అన్నాడు రైతు.

గుమ్మందగ్గర కూడిన జనం పక్కకు ఒత్తుకున్నారు. నెక్లూడొవ్ తిన్నగా వెళ్ళి వీధిలో పడ్డాడు. ఇద్దరు పిల్లవాళ్ళు కుతూహలంగా ఆయన్ను అనుసరించి వెళుతున్నారు. పెద్దవాడు తొడుక్కున్న చొక్కా ఒకప్పుడు చాలా తెల్లగా ఉండి ఉండాలి. రెండవ బాలుడు తొడుక్కున్న చొక్కా రంగు వెలిసి, అక్కడక్కడ చినిగి ఉంది.

"ఇప్పుడు మళ్ళీ ఎవరింటికి వెడుతున్నారు?" తెల్లచొక్కా అబ్బాయి ప్రశ్న వేశాడు.

"మెత్రేనా ఇంటికి. మీరామెను ఎరిగున్నారా?"

రంగు మాసిన చొక్కా అబ్బాయి ఎందుకో పకపకా నవ్వటం మొదలు పెట్టాడు. పెద్దవాడు మాత్రం గంభీరంగా అడిగాడు: "మెత్రేనా అంటే చాల పెద్దామె. ఆమేనా?"

"ఔను. ఆమె పెద్దదే."

"ఆమేనా? ఊరి చివర ఉంటున్నది. మేం చూపిస్తాం పదండి—ఏంరా? ఈయనతో కూడా వెడదామా?"

"మరి గొడ్లు?"

"వాటికేం ఫరవాలేదులేరా!"

చిన్నవాడు అంగీకరించాడు. ముగ్గురూ ముందుకు సాగిపోయారు.

౨౮

పెద్దల సమక్షంలోకన్నా పిల్లలతో ఉన్నప్పుడే నెక్లూడొవ్‌కు హాయిగా ఉంది. రంగు వెలిసిన చొక్కా వేసుకున్న కుర్రాడు నవ్వులుమానేసి పెద్ద కుర్రాడులాగే సగౌరవంగా మాటాడసాగాడు.

"ఈ ఊళ్ళో మిక్కిలి బీదవాళ్ళెవరో చెప్పగలరా?" నెక్లూడొవ్ ప్రశ్నించాడు.

"మరీ బీదవాళ్ళా. మైకేల్ బీదవాడే. సైమన్, మాక్రోవ్, మార్థా—మార్థా చాలా బీదది" అన్నాడు పెద్దవాడు.

"అనీస్యా మాటేమిటి? అందరికన్నా [illegible] ఉంది. ఆమెకు ఆవు కూడా లేదు. అడుక్కుంటోంది పాపం!" అన్నాడు చిన్నవాడు.

"ఆవు లేదనుకో. అయినా పిల్లలతో ముగ్గురేగా ఉన్నారు! మాత్రా యింటో అయిదుగురు ఉన్నారు" అని పెద్ద కుర్రాడి వాదం.

"అయితే మాత్రం? అనీస్యాకు మొగుడు లేడుగా!" అని చిన్న వాడు అనీస్యా పక్షాన్ని వదలలేదు.

"అనీస్యా మొగుడు చచ్చిపోయాడంటావు మాత్రా దానికి అలాంటిదే ఇంచుమించు. ఆమెకూ మొగుడు లేడు."

"ఏం? ఏమైనాడామె మొగుడు?" అడిగాడు నెఖ్లూదోవ్.

"జైలులో అఘోరిస్తున్నాడు" అన్నాడు పెద్దబ్బాయి. "పోయినేడు క్రింద భూస్వామిగారి అడవిలో రెండు చెట్లు నరికి తెచ్చుకున్నాడు. అందుకోసం జైల్లో పెట్టించారు. అప్పట్నుంచీ జైల్లోనే ఉంటున్నాడు. భార్య అడుక్కు తింటోంది. ముగ్గురు పిల్లలు ఉన్నారు. ఒక ముసలమ్మ కూడా ఉంది. ఆమెకు ఎప్పుడూ సుస్తే" అని చిన్నబ్బాయి యావత్తు కథా చెప్పాడు.

"ఎక్కడ ఆమె ఉండేది?"

"అదిగో, ఆ ఇంట్లోనే" అంటూ కుర్రవాడు ఆ పక్కనే ఉన్న పాకవైపు వేలుపెట్టి చూపించాడు. ఒక పసి కుర్రవాడు ఆ యింటి వెలి గుమ్మం ముందు...అక్కడ పాతివున్న ఒక వాసం కొయ్యపట్టుకుని పడిపోకుండా నిల్చున్నాడు.

"అయ్యో, చంటివెధవ ఎక్కడికి పోయాడో!" అని అరుస్తూ ఒక యువతి, మలిన వస్త్రధారిణి, గబగబా పరుగెత్తుకు వచ్చింది. నెఖ్లూదోవ్ అక్కడికి రాకముందే ఆమె వచ్చి పసిపాపను ఎత్తుకుని లోనికి తీసుకుపోయింది — నెఖ్లూదోవ్ ఆ పసిపాపకు ఏమి అపకారం చేస్తాడోనని భయపడుతున్న దానివలె.

నెఖ్లూదోవ్ గారి అడవిలో చెట్లు నరికినందుకు జైలుశిక్ష అనుభవిస్తున్నది ఆ యువతి భర్తే.

చివరకు మెత్రేనా నివసిస్తున్న పాక వద్దకు వచ్చారు.

"కేవలం కూడా ప్రాప్తమే అనుభవిస్తోందా?" అని ప్రశ్నించాడు నెఖ్లూడోవ్.

"మెత్రేనా పేదది కాదు" అని ఆ చిన్న కుర్రాడు కచ్చితంగా చెప్పాడు. "ఆమె సారాయం అమ్ముకుంటుంది" అన్నాడు.

కుర్రవాళ్ళను బైటనే ఉంచి నెఖ్లూడోవ్ లోపలికి వెళ్ళాడు. పద్నాలుగు అడుగుల పొడవు వున్నదా పాక. లోపలఉన్న ఆ చిన్న మంచం పొడుగాటి మనిషి పడుకుంటే చాలదు. "ఈ మంచంమీదే మస్లోవా బిడ్డను కన్నది. తరువాత వ్యాధిగ్రస్తురాలైంది" అనుకున్నాడు చూసి నెఖ్లూడోవ్. పాకలో చాలా భాగం ఆక్రమించి ఉన్నది ఒక నేతమగ్గం. నెఖ్లూడోవ్ లోనికి వచ్చినప్పుడు ముసలమ్మ, పెద్ద మనుమరాలు మగ్గం పనిలోనే ఉన్నారు. లోనికి వస్తూంటే ఎత్తుకేని గుమ్మం తగిలి నెఖ్లూడోవ్ నుదురు శబ్దం చేసింది.

"ఎవరు కావాలి మీకు?" అని ముసలమ్మ పరుసంగా ప్రశ్న విసిరింది. మగ్గంమీది నూలుపోగులు ఎంత శ్రమపడినా సరిపడటంలేదు. అందుచేత విసుగ్గానూ, కోపంగానూ ఉంది మనిషి. అదీగాక లైసెన్సు లేకుండా సారాయి అమ్ముకుంటూన్నది కాబట్టి ఏ కొత్తమనిషి వచ్చినా భయగ్రస్తురాలవటం సహజం.

"నేను ఈ ప్రాంతపు ఎస్టేటుకు అధిపతిని. నీతో మాట్లాడాలి."

ముసలమ్మ అతన్ని తేరిపార చూసింది. ఆమె ముఖకవళిక మారింది.

"ఓహో, మా నాయనకదే! మా బాబు! నువ్వేనా? ఎవరో దారిన పోయేవాడనుకున్నాను. కోపంగా పలుకరించాను, తప్పయింది" అంటూ ఆప్యాయంగా ఆదరాలు పలికిందా ముసలమ్మ.

"నీతో ఏకాంతంగా మాట్లాడాలి" అంటూ నెఖ్లూడోవ్ అటు తలుపు కేసి చూచాడు. అక్కడ ఇద్దరు పిల్లలు, వాళ్ళవెనుక ఒక యువతి, ఆమె చంకలో నీరసించి, నెత్తురు పాలిపోయి, శుష్కహాసం చేస్తున్న ఒక పసిపాప.

"ఏమిటి. అదేమైనా అలా చూస్తూ నిల్చున్నావు. ఇస్తాలే. ఏదీ ఆ కర్ర ఇలా అందివ్వు—" అన్నది ముసలమ్మ ఆ యువతి నుద్దేశించి. "ఆ తలుపు మూసెయ్యి" అనికూడా ఆజ్ఞాపించింది.

ఆ పిల్లలు వెళ్ళిపొయ్యారు. చంటిబిడ్డ నెత్తుకున్న యువతి బైటి అడుగువేసి, తలుపు మూసేసింది.

దమా? పాలు, పోషణ లేకపోతే శిశువుగతి ఏం కావాలి? అందుకని బాగా ఆలోచించి ఫౌండ్లింగ్ ఆసుపత్రికి పంపించేశాను."

"ఆసుపత్రిలో ఆ బిడ్డ రిజిస్టరు నంబరు ఎంత?"

"ఒక రిజిస్టరు నంబరు ఇచ్చారు. కాని ఆ బిడ్డ చనిపోయిందిగా! ఆమె ఆ బిడ్డను ఆసుపత్రికి తీసుకుపోయిన వెంటనే చనిపోయింది."

"ఆమె అంటే యెవరు?"

"అదే స్కాగోరోడ్నోలో ఉండే ఆమె; ఇదొక వ్యాపారం ఆమెకు- చాలా తెలివిగల మనిషి. ఆమె పేరు మలాన్యా. ఇప్పుడు చచ్చిపోయిందిలే. ఎలా చేసేదనుకున్నావు ఈ వ్యాపారం? వాళ్ళూ, వీళ్ళూ పిల్లల్ని తెచ్చి వొప్పగించేవారు. ముగ్గురు నలుగురు పోగయిన తర్వాత వాళ్ళను ఫౌండ్లింగ్స్‌కు తీసుకుపోయి వొప్పజెప్పేది. అందాకా తనదగ్గరే వుంచుకుని ఆహారం ఇస్తూ పోషించేది. భలే చక్కని ఉయ్యాల ఉండేది ఆమెదగ్గర. అందులో ముగ్గురు నలుగురు పిల్లల్ని కూడా పడుకోబెట్టొచ్చు. ఒకరొకరితలలు ఢీకొట్టుకోకుండా ఆ వుయ్యాలలో మంచి యేర్పాటు ఉంది. అందర్నీ ఆ వుయ్యాలలో పెట్టి తీసుకుపోవచ్చు."

"ఊఁ - చెప్పు, చెప్పు."

"ఆమె అలాగే మన్లోవా బిడ్డనుకూడా తీసుకుపోయింది. ఒక పది హేను రోజులు బిడ్డ ఆమె యింట్లోనే వుంది. అప్పుడే ఆ బిడ్డ జబ్బుపడింది."

"బిడ్డ అందంగా ఉండేదేనా?"

"చాలా అందంగా ఉండేది. అలాంటి బిడ్డను నేనెక్కడా చూడలేదు. అచ్చంగా నీ రూపమే."

"ఎందుకు జబ్బుపడిందీ? మంచి ఆహారం ఇవ్వలేదు కాబోలు!"

"ఆఁ, ఏమి ఆహారం! ఆహారం పెడుతున్నామన్న పేరేగాని— అదీగాక సొంతబిడ్డ కాకపోయిన తరువాత ఏమి శ్రద్ధ ఏడుస్తుంది. చావకుండా బ్రతికివుండటానికి ఏదో—మాస్కోవరకూ తీసుకుపోయిందట ఆమె. అక్కడ బిడ్డ చనిపోయింది. సర్టిఫికేట్టు సంపాదించింది—అంతా బాగానే ఉంది. ఆమె చాలా తెలివిగల మనిషిలే..."

తన బిడ్డనుగురించి నెఖ్లూడోవ్ చేయగలిగిన భోగట్టా అంతవరకే.

౬

మళ్ళీ రెండుగుమ్మాలకూ మధ్య కొట్టుకుంటూ నెఖ్లూడోవ్ బైటికి వచ్చాడు. తనతో వచ్చిన పిల్లలిద్దరూ అక్కడే వున్నారు. ఇంకా మరి కొంతమంది జనంకూడా మూగారు. గుంపులో నెఖ్లూడోవ్ కొంతసేపు క్రితం చూచినవున్న... చంటిబిడ్డ నెత్తుకున్న యువతికూడా వుంది. ఆ చంటిబిడ్డ నీరసించిన ముఖంలో ఆ శుష్కహాసం విపులంగా వ్యాపించింది.

ఆ నవ్వు బాధాసూచకమైనదని నెఖ్లూడోవ్‌కు తెలుసు. "ఆ యువతి ఎవరు?" అని అడిగాడు.

"ఆమే అనీస్యా" అని జవాబు చెప్పాడు పెద్ద కుర్రాడు.

"నెఖ్లూడోవ్ ఆమెవైపు తిరిగాడు. "ఎలా గడుస్తోంది నీకు?"

"గడవటమా? బిచ్చమెత్తుకుంటున్నాను" అంటూ ఆమె కన్నీళ్ళు విడిచింది.

ఆమె చంకలోని చంటిబిడ్డ ముఖమంతా విప్పి నవ్వుతున్నది. పూచిక పుడకల్లా వున్న కాళ్ళు ఊగిసలాడిస్తున్నది.

నెఖ్లూడోవ్ జేబులోనుంచి ఒక పదిరూబుల్సనోటు తీసి ఆమెకిచ్చాడు. నాలుగడుగులు సాగివచ్చాడో లేదో, పసిపిల్లవానితో మరో యువతి, ఒక ముసలమ్మ, మరో స్త్రీ అతనికి ఎదురువచ్చి, తమ పేదరికాన్ని చెప్పుకుని సాయం అడిగారు. నెఖ్లూడోవ్ తనదగ్గరవున్న అరవైరూబుల్సు అలాంటి వాళ్ళందరికీ పంచిపెట్టేసి, ఖిన్నవదనుడై సముద్దారు ఇంటివైపు సాగిపోయాడు.

సముద్దారు చిరునవ్వుతో ఎదురువచ్చాడు. రైతులందరూ ఆసాయంత్రమే సమావేశం కానున్నారని, అందుకు తగిన ఏర్పాట్లుచేశాననీ చెప్పాడు. తరువాత నెఖ్లూడోవ్ తోటలో ఒంటరిగా తిరిగి రావాలని వెళ్ళాడు. తాను ఊళ్ళో కన్న, విన్న విషయాలను నెమరువేసుకుంటున్నాడు.

ఇంతలో సముద్దారిగారి ఇంటి వెనుక భాగంనుంచి ఎవరో ఇద్దరు స్త్రీల కోపఘూర్ణిత కంఠస్వరాలు వినిపించాయి. మధ్య మధ్య నవ్వుముఖపు సముద్దారు మాటలు కూడా వినిపిస్తున్నాయి. నెఖ్లూడోవ్ విన్నాడు.

"నా కిప్పుడు వొంట్లో సత్తువ లేదు. నా మెడలో పలుపు పట్టుకు లాగుతారేంటండీ?" అంటోంది కోపంగా ఒకామె.

"ఎంతో సేపు మేయ్యలేదండీ. ఒక గంటసేపుంటుందేమో! ఆమె గొడ్డును ఆమెకు ఇచ్చెయ్యండి. నౌకరయిన ఏ పసువునూ, దాని పాలు కావలసిన ఇంట్లో పిల్లల్ని బాధ పెడితే మీకేమి వస్తుందేం" అంటోంది మరొకామె.

"డబ్బు చెల్లించలేకపోతే ఆ విలువకు చాకిరీ చేసి మరీ వెళ్ళు" అంటున్నాడు సముద్రాలు.

నెహ్లూడో తిన్నగా అటువైపు వెళ్ళాడు. ఒకతె కడుపుతో వున్న మనిషి. నీళ్ళాడే పొద్దులు. పోలెండు కోటు తొడుక్కుని, పంట్లాం జేబుల్లో చేతులు పెట్టుకుని సముద్రాలు ఠీవిగా నిల్చున్నాడు. నెహ్లూడోను చూడగానే ఆ యువతులు మాట్లాడ్డం మానివేసి నమ్రతగా నిల్చున్నారు. జేబుల్లో చేతులు తీసివేసి సముద్రాలు మందస్మితం చేశాడు.

జరిగిన వ్యవహారం ఇదీ: ఎస్టేటుకు సంబంధించిన బీళ్ళలోనికి యీ రైతులు తమ పశువుల్ని తోలి మేపుతున్నారని సముద్రాలు చెప్పాడు. ఆ యువతుల తాలూకు రెండు ఆవులు బీడులో పడి మేస్తున్నాయిట. అందుచేత వాటిని బందిలి దొడ్లోకి తోలారు.

ఒక్కొక్క ఆవుకు ముప్ఫయి రోపెక్‌లు (రష్యన్ నాణాలు) ఇచ్చి తోలుకెళ్ళమంటాడు సముద్రాలు. లేదా రెండు రోజులు దివాణంలో చాకిరీ చేయమని నిర్బంధిస్తున్నాడు. ఆవుల్ని తాము బీడులోకి తోలలేదనీ, వాటంతట అవే వెళ్ళి పడ్డాయనీ, తమవద్ద డబ్బు లేదనీ, ఉదయంనుంచి బందెల దొడ్లో మేతలేక ఎండలో మాడుతున్న తమ పశువుల్ని తమ కిప్పించండనీ, జరిమానా తప్పనిసరి అంటే తరువాత చెల్లించుకుంటామనీ ఆ స్త్రీలు ప్రతిమాలారు.

"మీ పశువుల్ని మధ్యాహ్నమప్పుడు దొరగారి బీడులో పడకుండా జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉండండని ఎన్నిసార్లు చెప్పాను మీకు?" అన్నాడు సముద్రాలు. అని ఒకసారి నెహ్లూడో వైపు చూశాడు ఆయన్ను తన పక్షాన సాక్ష్యం వేసుకుంటున్నవాడు వలె.

"కాస్త చంటివాడిని సంబాళిస్తావుంటే అవి కట్టువిప్పుకుపోయాయి"

"జాగ్రతగా పశువులకు కాపలావుంటే ఎందుకు పోతాయి ?"

"మరి పసివాడికి పాలెవరిస్తారు. తమరెవ్వరుగదా ? అయినా బీడులో పడి పూర్తిగా పాడుచేస్తే అనుకోవచ్చు. ఒక్క నిమిషం సేపు ఉన్నాయేమో బీడులో."

"బీడులన్నీ ఇలాగే పాడైపోతూ ఉన్నాయి. గట్టిగా జరిమానాలు వసూలు చెయ్యకపోతే మాకు పశువుల మేత ఏమైనా మిగులుతుందా ?" అంటూ సముద్రాకు నెక్లాడో వేపు చూశాడు.

"అలాంటి అబద్ధాలెందుకు బాబూ ! ఇదివరకెప్పుడైనా మా గొడ్లు మీ బీడులో కనిపించాయా ?" అన్నదా కడుపుతో ఉన్నామె.

"ఇప్పుడు కనిపించిందిగా ! జరిమానా చెల్లించు; లేక చాకిరీ చేయి."

"సరే చాకిరీ చేస్తాను. నా ఆవును నాకు ఇప్పించెయ్యండి. మేత పెట్టకుండా మాడ్చకండి. రాత్రంబగళ్లు ఇంటిదగ్గర నాకు శాంతి లేకుండా ఉంది. అత్తగారు సుస్తీగా పడివుంది. ఆయన తాగి పడుకుంటాడు. నేను ఒక్కదాన్ని పని అంతా సవరించుకుంటున్నాను. నాకు సత్తువ లేదు."

ఆ యువతుల ఆవును తిరగ ఇచ్చివేసి పంపమని నెక్లాడో సముద్రారుతో చెప్పాడు. తాను మళ్ళీ తన సమస్యను గురించి ఆలోచించుకునేందుకు తోటలోనికి వెళ్ళాడు. కాని ఆలోచించవేందుకేమీ అవసరం కనిపించటం లేదు.

అంతా సుస్పష్టంగా కనిపిస్తూనే ఉంది. అయినా ఎవ్వరూ గమనించక పోవటమే ఆశ్చర్యం. తన కొక్కడికికే పట్టినగొడవగా ఉందేమిటి ? ప్రజలు నానా చావు చస్తున్నారు. ఈ చావుకే అలవాటు పడిపోయారు. అందుకు తగిన అలవాట్లనే అలవరచుకున్నారు. బాల మరణాలు అపరిమితంగా ఉన్నాయి. స్త్రీలు శక్తి మించిన పని చేస్తున్నారు. ముసలివాళ్ళకు చాలినంత తిండిలేదు. ఇలాంటి నికృష్ట జీవితపు బాధలు సహజం అయిపోయాయి. అవి చెప్పుకునే దాగ్యం కూడా సమసిపోయింది. ఇక పెద్దలనబడే వారు వాళ్ళ వ్యవహారం అంతా సవ్యంగానే ఉన్నదనుకుంటున్నారు. వాళ్ళకి తిండి పెట్టవలసిన భూమిని వాళ్ళ చేతుల్లోనుంచి భూస్వాములు లాగేసు

చున్నారు. ఇదే వాళ్ళ యీ మిక్కుటమైన దారిద్ర్యానికి ముఖ్యకారణం. ఇది అందరికీ తెలిసిన నగ్న సత్యం.

పిల్లలు, ముసలివాళ్ళూ అపరిమితంగా చనిపోతున్నారంటే వాళ్ళకు ప్రధాన ఆహారం కాదగిన పాలు లేవాయెను. పాలెలా వస్తాయి? ధాన్యం పండించుకోటానికి సొంత భూములు అసలే లేవు. వాళ్ళ జీవితపు ఆధారం కాదగిన భూమి వాళ్ళ సొంతంకాదు. అది భూస్వాముల సొంతం. వాళ్ళు రైతులచేత కూలి చేయించుకుని లాభాలు గడిస్తున్నారు. భూమి దున్నకపోతే ఈ బీదవాళ్లు బ్రతకలేరు కాని అర్ధాకలితో, ఉపవాసాలతో దున్నవలసిన వారైనారు. వారు పండించిన ధాన్యాన్ని భూస్వాములు పరాయి చోట్ల అమ్ముకొని టోపీలు, చేతికర్రలు, బండ్లు, ఇంకా ఇతర విలాస వస్తువులు కొనుక్కుంటున్నారు. ఒక ఆవరణలో బంధింప బడిన గుర్రాలు అక్కడ ఉన్న గడ్డి అంతా మేసిన తరువాత, మరింకో చోటునుంచి ఆహారం రాకపోతే మేతలేక కృశించిపోవలసినవే గదా! ఈ బీదరైతుల స్థితి అలాగే ఉంది.

ఇది చాలా భయంకరమైన స్థితి. ఇలా సాగిపోవటానికి వీల్లేదు. ఇది మార్చటానికి మార్గాలు కనుక్కోవాలి. కనీసం ఇటువంటి వ్యవస్థలో పాల్గొనరాదు "అటువంటి మార్గాలు కనుక్కుంటాను" అనుకున్నాడు నెఖ్లూడవ్ ఆ తోటలో అటూఇటూ పచార్లు చేస్తూ. "విజ్ఞానిక సభల్లో, శాసనసభల్లో, పత్రికల్లో ప్రజలదారిద్ర్యానికి కారణాలుగురించి తీవ్రచర్చలు జరుపుతూ ఉన్నాం. కాని వాళ్ళకు జీవనాధారములైన భూముల్ని వాళ్లకు ఇచ్చివేయటమే వాళ్ళ పరిస్థితులను బాగుచేయగల ఏకైకమార్గం. దీన్ని గురించి మాత్రం ఎవ్వరమూ ఎక్కడా ప్రసంగించము కదా!

హెన్రీ జార్జి సిద్ధాంతాలు మాటిమాటికీ నెఖ్లూడవ్ మనస్సుకు జ్ఞాపకం వస్తున్నాయి. ఒకప్పుడు ఆ సిద్ధాంతాలచేత తీవ్రంగా ఆవేశితుడైనాడుతాను. కాని ఇటీవల మరచిపోవటం ఆశ్చర్యకరంగా వుంది తనకే. "ప్రపంచం ఒక్కని సొత్తా ఏమిటి? నీళ్లు, గాలి, సూర్యరశ్మివలె భూమికూడా అమ్మేది కాదు; కొనేది కాదు. దానివల్ల రాగల ఫలసాయానికి అందరూ వారసులే. కున్‌మిన్‌స్కీలో తానుచేసిన కట్టుబాట్లకు తానే ఎందుకు సిగ్గుపడవలసి వచ్చిందో నెఖ్లూడవ్‌కు ఇప్పుడు తెలిసివచ్చింది. అప్పుడొక తప్పు టూహాతో

ఉండినాడు. భూమిని తన సొంత ఆస్తిగా ఉంచుకోతగిన అవ్సరత ఏ మాత్ర మున్నదీ లేదు. కుస్ మిన్‌స్కీలో అట్టి హక్కు ఏదో కొంత తాను వుంచుకుని వచ్చాడు. అట్టి హక్కు తన క్షేమాభ్రమూ లేదని హ్వారయాంతరాళంలో ధ్వనిస్తూనే ఉన్నది. ఈ సారి అలాంటి తప్పు చేయకూడదు. నెఖ్లూడో ఒక విధానాన్ని ఆలోచించాడు. యావత్తు భూమినీ రైతులకు కవులుకిచ్చేస్తాడు. అయితే వాళ్లు చెల్లించవలసిన కౌలుధనం తాను తీసుకోడు. అది వాళ్ళదే; దాన్ని వాళ్లు శిస్తులూ, పన్నులూ చెల్లించటానికి వాడ్కొ ఉంచుకోవచ్చు. ఈ విధానం బాగున్నట్టు తోచింది నెఖ్లూడోవు. భూమి తన సొంత ఆస్తిగానే ఉంటుంది; అయితే నామమాత్రంగానే. తాను పొందే లాభం ఏమీ లేదు.

నెఖ్లూడో సముద్దారు ఇంట్లోకి వచ్చాడు. సముద్దారు తన మామూలు మందస్మితం వెలిగిస్తూ "భోజనానికి లేస్తారా?" అని అడిగాడు. ఆలస్యమైతే తనభార్య ఆ లోలాకుల అమ్మాయి సహాయంతో తయారుచేసిన వంటకాలు చల్లారి చవులు తప్పుతాయని తొందర తెలిపాడు.

ఒక తెల్లనిగుడ్డ పరచిన టేబిల్ మీద వడ్డన జరిగింది. కోడిమాంసం, బంగాళీదుంపల పులుసు, మీగడ కట్టిన పెరుగు — పచ్యములుగానే ఉన్నాయి పదార్థాలు. అయితే నెఖ్లూడోవు ఆకలిలేదు. తింటున్నాడేగాని రుచి, పచి గమనించే స్థితిలో లేడు. ఊరిలో కనిపించిన విషయాలు దుఃఖహేతువులైనవి, ఆ దుఃఖాన్ని ఒక్కనిమిషంలో మటుమాయం చేయగలిగిన ఒక చక్కని ఆలోచన తోటలో పచార్లు చేస్తున్నప్పుడు తనకు తట్టింది. ఆ యోచనగురించే భోజనమప్పుడుకూడా తీవ్రంగా ఆలోచిస్తూ ఉంటున్నాడు.

సముద్దారు భార్య పెత్తనంకింద ఆ లోలాకులమ్మాయి భయం భయంగా పదార్థాలన్నీ తెచ్చి వడ్డిస్తోంది. సముద్దారు పూర్వంకన్న మిన్నగా మందస్మితాలు చిలుకుతూవున్నాడు. తనభార్య చూపిన పాకశాస్త్ర వైశిష్ట్యానికి గర్వించాడు. భోజనానంతరం కొంత కష్టంమీద సముద్దారును కూర్చోబెట్టి తన మనోభావాలను విడమరచి చెప్పాడు. భూమిని యావత్తూ రైతులకు ఇచ్చివేయాలన్న తన తలంపును బయటపెట్టాడు. అతని ఉద్దేశాన్ని అడిగి ఈ విషయాలన్నీ తాను ఇదివరకే ఆలోచించినట్లూ, నెఖ్లూడో పలుకులు

తనకు ఆనందం గొలిపినట్లూ సముద్రారు మందహాసం చేశాడు. కాని నిజానికి అతనికేమీ అర్థమై ఉండలేదు. అందుకు కారణం నెక్లూడో విస్పష్టంగా చెప్పకపోవటం కాదు. అతడు చెప్పినదాన్ని పట్టి— తానేమాత్రమూ లాభం కోరకుండా భూమిని రైతులపరం చేయబోతున్నాడు. ఇటువంటిపని ఎవరైనా చేస్తారా? పైగా రైతులు ఇవ్వగల్గిన కౌలుధనం యావత్తూ రైతుల సమిష్టి పెట్టుబడిధనం ఔతుందిట. మానవుడైనవాడు ఇతరుల హానిచేసియైనా స్వలాభం గడించుకోవాలని కోరుతాడన్న భావం సముద్రారు నరనరాల్లో జీర్ణించిపోయివుంది. అటువంటివాడికి నెక్లూడో మాటల్లో ఏదో తన కర్థంగాని నిగూఢ విషయం ఉన్నట్టు భావన కలిగింది.

“ఓహో! అదా సంగతి! ఆ సమిష్టి పెట్టుబడిలో మీరు నూటికి ఇంతా అని తీసుకుంటారన్న మాట!” అన్నాడు సముద్రారు ఉత్సాహంగా.

“ఎబ్బే లేదు. నీకు అర్థం కాలేదా యేమిటి? నేను పూర్తిగా భూమిని వొదిలేసుకుంటున్నాను.”

“అలాగైతే మీకేమీ ఫలసాయం రాదుగా మరి!” ఈసారి సముద్రారు పెదవులమీద మందస్మితం లేదు.

“ఔను, రాదు. వొదులుకుంటున్నాను.”

సముద్రారు ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు. కాస్త మందస్మితం చేశాడు. ఇప్పటికి అర్థం చేసుకున్నాడు. నెక్లూడో అందరికిమల్లే మామూలు మనిషి కాడు. అయితే అతడు అనుసరిస్తూన్న ఈ విధానం (భూమిని రైతుపరం చేసే ఈ విధానం) ద్వారా తానేమైనా బాగుపడేందుకు మార్గం ఆలోచించటంలో పడ్డాడు. కాని అట్టి మార్గం ఏమీ గోచరించటం లేదు. విచారగ్రస్తుడైనాడు. నెక్లూడో విధానం అతనికేమీ నచ్చలేదు—కాని యజమానిని సంతోష పెట్టటానికి మాత్రం మందస్మితం చేస్తూనే ఉన్నాడు.

సముద్రారుకు ఏమీ అర్థంకాలేదని నెక్లూడో గ్రహించాడు. కనుక అతడు వెడుతూంటే ఉండమనలేదు. తరువాత అతడు కిటికీ పక్కనే కూర్చుని, కాగితాలు, కలం తీసుకున్నాడు.

సూర్యాస్తమయం అయింది. దోమలు ముసురుకుంటూ వచ్చాయి. కుడుతున్నాయి కూడాను. తను అనుసరించదలచుకున్న విధానాన్ని

మాత్రప్రాయంగా రాసుకున్నాడు. ఇంతలో సమావేశానికి సిద్ధమై వెడుతున్న రైతుల కంఠధ్వనులు వినిపించాయి. రైతులను దివాణానికి పిలువనంపవద్దనీ, తానే గ్రామంలోనికి వెళ్ళి వాళ్ళను కలుసుకుంటాననీ సముద్దారుతో ఇదివరకే చెప్పి యున్నాడు. సముద్దారు తెచ్చి యిచ్చిన తేనీరు గబగబా తాగి నెఖ్లూడోవ్ బయలుదేరి వెళ్ళాడు రైతుల సమావేశానికి.

## ౭

ఊరి పెద్ద యింటిముందు రైతులు సమావేశమైనారు. ఏమేమో మాటాడుకుంటూ ఉన్నారు. నెఖ్లూడోవ్ రాగానే అంతా నిశ్శబ్దమై పోయింది. కుస్మిన్‌స్కోలో వలెనే ఇక్కడ కూడా అందరూ మర్యాద సూచకంగా శిరోవేష్టనాలను తీసేశారు. ఇక్కడి రైతులు కుస్మిన్‌స్కోలోని రైతులకన్నా బీదస్థితిలో ఉన్నారు. ఆ విషయాన్ని వాళ్ళు ధరించిన దుస్తులు, చెప్పులు లేకపోవటం చెబుతూనే ఉన్నాయి.

నెఖ్లూడోవ్ ప్రయత్న పూర్వకమైన ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. భూమిని యావత్తూ రైతులకే ఇచ్చివేయాలన్న తనఉద్దేశాన్ని వెలిబుచ్చాడు. రైతులు మౌనముద్ర వహించి విన్నారు. కాని వాళ్ళ ముఖాల్లో మార్పేమీ కనిపించలేదు.

"భూమిని అనుభవించే హక్కు ప్రతివాడికీ ఉంది. అని నేను నమ్ముతున్నాడు" అన్నాడు నెఖ్లూడోవ్ రవంత సిగ్గుపడుతూ.

"ఔను, ఆ మాట వాస్తవమే" అన్నారు చాలామంది రైతులు ఏకగ్రీవంగా.

నెఖ్లూడోవ్ ఇంకా చక్కగా విడమరచి చెప్పాడు. భూములన్నీ రైతులపరం చేయబడతాయి. భూములమీద వచ్చే ఆయువేజు, రైతులు అనుభవించ తగింది పోను మిగిలింది వారి సమిష్టి పెట్టుబడి ధనంగా ఉంటుంది. కనుక కాలుచేటువారి ఇష్టప్రకారం నిర్ణయించవచ్చు.

గంభీరంగా కూచుని వింటూన్న రైతుల ముఖాలు మరింత గంభీరములైనాయి. "నువ్వు వేస్తున్న ఎత్తు మాకు అర్థమయింది లేవయ్యా! మేము

నీ మోసంలో పడేవాళ్ళం కాదుతే" అని పైకి చెప్పి, ఆయన్ను కించపరచటం ఇష్టంలేనివాళ్లలాగ చూపులు తిప్పేసుకున్నారు.

నెక్లూడో చాలా విస్పష్టంగానే చెప్పాడు. రైతులు చాలా తెలివైన వాళ్ళు. వాళ్లు అతన్ని అర్థం చేసుకోలేకపోయారు; అర్థం చేసుకోలేదు. సముద్దారు కెందుకు అర్థం కాలేదో వీళ్ళకూ అందుకే అర్థంకాలేదు.

ప్రతివాడూ తన స్వార్థాన్ని చూసుకోనటం సహజం. భూస్వాము లైనవారు రైతులను కష్టపెట్టియైనాసరే, తన లాభాన్నే చూసుకుంటూ ఉంటారన్న సత్యం తరతరాలనుంచీ అనుభవసిద్ధమై ఉంది వాళ్ళకు. కాబట్టి ఒక భూస్వామి వచ్చి ఏదో ఒక కొత్త విధానాన్ని ఏకరువు పెడుతున్నా డంటే-పూర్వంకన్నా ఎక్కువ మోసం ఏదో ఉందన్నమాటే.

"ఇంతకూ కౌలుధనాన్ని ఎంత నిర్ణయిస్తారు ?"అని నెక్లూడో ప్రశ్న వేశాడు.

"మేం ఎలా నిర్ణయిస్తాం ? అది మేం చెయ్యలేము. భూమిమీది. అధికారం మీ చేతుల్లో ఉంది" అన్నారు కొందరు ఆ గుంపులో.

"అధికారం నాదికాదు. కౌలుధనాన్ని మీ సమిష్టి ఉపయోగానికే వినియోగించుకోవచ్చు."

"సమిష్టి సహకార సంఘం (కమ్యూన్) అనేదానికీ, మీరు చెప్పే దానికీ చాలా తేడా వుంది."

ఇంతలో సముద్దారు అందుకున్నాడు నవ్వుతూ.

"మీకు అర్థం కావటంలేదూ ? దొరగారు భూమిని మీకే కౌలుకు ఇస్తున్నారు. ఆ కౌలుధనాన్ని మీ కమ్యూన్‌కు పెట్టుబడి ధనంగా మీకే మళ్ళీ ఇచ్చివేస్తున్నారు.

"బాగానే అర్థం అయింది. ఒక బ్యాంకు మోస్తరు అన్నమాట. ఒక నిర్ణీత సమయానికి మేం డబ్బు చెల్లించాలి. అది మాకు చాలా కష్టం. మా కిష్టంలేదు. అది మా నాశనానికే" అన్నాడొక బోసినోటి ముసలివాడు.

"దానివల్ల మాకేం లాభంలేదు. పూర్వంలాగే ఏడుస్తాం" అంటూ చాలా అసంతృప్తి కంఠస్వరాలు వినిపించాయి.

నెఖ్లూడొవ్ తాను చెప్పిన రీతిగా ఒక దస్తావేజు రాయిస్తానన్నాడు. "వద్దు; అక్కర్లేదు" అంటూ చాలామంది తీవ్రంగా, నిరసన సూచకంగా పలికారు.

"ఎందుకూ ఈ దస్తావేజులూ, సంతకాలు ఇవన్నీని - మేము అజ్ఞానులం, చదువుకోలేదు. పూర్వంలాగే కష్టం చేస్తూఉంటాం——" అని ఒకరు.

"మీరు చెప్పేదంతా విచిత్రంగా ఉంది. మాకు ఒప్పుకోలేదు——" అని మరొకరు.

"అంటే భూమిని మీరే కౌలుకు తీసుకోటానికి నిరాకరిస్తున్నారన్న మాట!" అన్నాడు నెఖ్లూడొవ్ ఒక మధ్యవయస్కుడినిచూసి ఉద్దేశించి - అతడొక చినిగిపోయిన కోటు తొడుక్కున్నాడు. నిటారుగా ఒక సైనికుడులా నిల్చున్నాడు, ఎడమచేత్తో టోపీ పట్టుకుని - ఒకప్పుడు యుద్ధంలో పనిచేసి వచ్చిన బాపతు.

"అంతేనండి" అన్నాడతను. మిలిటరీ కొలువు, అందులో పనిచేసినప్పటి వాసనలు పూర్తిగా చావలేదు అతనిలో.

"అంటే మీకు బాగా చాలినంత భూమి ఉన్నదన్నమాట——" అన్నాడు నెఖ్లూడొవ్.

"లేదండి; మాకేమీ లేదు" అన్నాడా మిలిటరీ వాసనల రైతు, చేతిలో టోపీ ముందుకు ఎత్తిపట్టుకుని——అది అవసరమైనవాడికి కావలిస్తే ఇస్తానన్నట్లు సూచనగా.

"సరే, కాని నేను చెప్పినమాటలు మీరు మళ్ళీ జాగ్రతగా ఆలోచించుకోండి" అన్నాడు నెఖ్లూడొవ్ - ఆ మాటలే మరొకసారికూడా అన్నాడు ఆశ్చర్యపడుతూ.

"మేము ఏమీ ఆలోచించనక్కర్లేదు" అని నిష్కర్షగా చెప్పేశాడు బోసినోటి ముసలిరైతు.

"నేను రేపుకూడా ఉంటాను. మీ మనసు మారితే నాకు తెలియచెయ్యండి."

రైతులు మరి మాటాడలేదు. కాబట్టి ఈ సమావేశంవల్ల నెఖ్లూడొవ్ ఆశించిన ఫలితం సిద్ధించలేదు.

ఇంటికి వెళ్ళిన తరువాత సముద్దారు అన్నాడు; "మీరు ఈ రైతు జనంతో ఏ విధమైన ఒడంబడికకూ రాజాలరు. వాళ్ళు అలాంటి మొండి జాతి. మీటింగులో వచ్చి మొద్దుల్లా కూచుంటారు; అంతే. వాళ్ళను కదల్చటం బ్రహ్మతరం కాదు. అంతా భయమే; అనుమానమే – మీ సూచనలకు నిరసన తెలిపిన ఆ ముసలివాడూ, ఆ నడిమివయసువాడూ—ఇద్దరూ తెలివైనవాళ్ళే. వాళ్ళిద్దరిలో ఎవరైనా సరే మన ఆఫీసుకు వస్తే చక్కగా రాజకీయవేత్తలు లా మాటాడతారు. కాని మీటింగులో కూచున్నారంటే అలాగే మొద్దుబారిపోతారు. ఒకటేమాట మొదటినుంచి చివరదాకా ఏకరువు పెడుతూ ఉంటారు."

"పోనీ, వాళ్ళలో తెలివైనవాళ్ళనూ, బుద్ధిమంతుల్నీ ఎవరినన్నా ఆఫీసుకు పిలిపిస్తే? జాగ్రత్తగా విషయం వాళ్ళకు అవగాహన అయ్యేలాగు చేస్తాను."

"అలా చేయవచ్చు—" సస్మితాననుడై సముద్దారు అన్నాడు.

"రేపు పిలిపిస్తావా పోనీ?"

"ఓ, అలాగే పిలిపిస్తాను" అంటూ సముద్దారు ఇతోధిక ఉత్సాహంతో మందహాసం చేశాడు.

* * * *

"వారు చెప్పేది విన్నావుగా! అందులో ఏమీ కపటం ఉన్నట్టు లేదు—" అన్నాడా నల్లనిజుట్టుగల నడిమివయసువాడు గుర్రంమీద మెల్లిగా వెడుతూ తనపక్కనే చిరిగినకోటు తొడుక్కుని మరో గుర్రం మీద వస్తూన్న ముసలిరైతుతో. వాళ్ళిద్దరూ తమ రైతుల గుర్రాల్ని కొన్నింటిని తోలుకుపోతున్నారు, దొరగారి అడవిలో ఆ రాత్రి మేపుకోటానికి.

"ఊరికేనే భూమి ఇచ్చేస్తాడు. దస్తావేజుమీద దస్కతు పెట్టటమే, అంతే. ఇలాంటి వ్యవహారాలు ఇదివరకెన్నిసార్లు జరుగలేదు! ఊహుం, ఈ మోసాలకు లొంగేది లేదు. ఇంకా బుద్ధిరాకుండా చస్తున్నామా?" అని కనిపించకుండా ఉన్న ఒక గుర్రపుపిల్లకోసం కేక వేశాడు.

"ఎప్పుడూ దొంగబుద్ధే దానిది. పోయిందప్పుడే దొరగారి పొలంలోకి. ధాన్యపు మొక్కల్ని కొరుకుతూన్న చప్పుడు అదిగో వినిపిస్తాంటేను" అన్నాడు నడిమివయస్సువాడు.

"దస్కత్ చేయాలట! దొరగారంటున్నాడు. దస్కత్ చేయటం ఆయన గొంతులో మనం ఆహుతి కావటం! అంతేనా?"

"అంత గాకపోతే ఇంకెంత?"

తరువాత వాళ్ళేమీ మాటాడలేదు. గుర్రాల గిట్టల చప్పుడుమాత్రమే వినిపిస్తూ ఉంది.



ఆ రాత్రి దివాణంలోని ఆఫీసుగదే నెఖ్లూడోవ్‌కు పడకగది అయింది. ఎత్తయిన మంచం, దానిమీద తూలికాతల్పం, రెండుదిండ్లు ఉన్నాయి. తల్పంమీద ఒక యెర్రని పట్టుగుడ్డ పరచివున్నది. అది సముద్గారు భార్య ఉపయోగించేదని నేరుగా చెప్పనవసరంలేదు. సముద్గారు వచ్చి భోజనానికి లెమ్మని బ్రతిమాలాడు. ఆకలి కాలేదన్నాడు నెఖ్లూడోవ్. పడక యేర్పాట్లలోనూ, భోజనాదికాల విషయంలో ఆయనకు తగినట్లు చేయించలేకపోయానని క్షమాపణలు చెప్పుకుని సముద్గారు వెళ్ళిపోయాడు.

రైతులు తనమాటకు అంగీకరించకపోయినందుకు నెఖ్లూడోవ్ విచారపడలేదు. కుస్మిన్స్కీలో రైతులు తన విధానాన్ని అంగీకరించారు. అందుకు కృతజ్ఞత వెలిబుచ్చారుకూడా. కాని ఇక్కడివాళ్లు తన్ను అనుమానిస్తూనే ఉన్నందుకు, తన్నొక శత్రువుగానే భావిస్తున్నందుకూ తృప్తిపడ్డాడు.

ఆ గదిలో ఇరుగ్గా వుంది. పరిశుభ్రంగానూ లేదు. నెఖ్లూడోవ్ బైటికి వచ్చాడు. తోటలోకి పయనమైనాడు. అప్పుడతనికి ఆ నాటిరేయి జ్ఞాపకం వచ్చింది. పరిచారికల గది కిటికీ, ఆ వసారా జ్ఞాపకానికి వచ్చాయి. విచలితుడైనాడు. అటువంటి పూర్వస్మృతులను తెస్తూన్న ఆ చోటునుంచి వెళ్ళటానికి ఇష్టంలేదు. అక్కడే గదిగడపమీద కూచున్నాడు—తోటలోని పువ్వుల సౌరభ్యాన్ని మోచి తెస్తూన్న వెచ్చని గాలిపీలుస్తూ. ఆ సమీపాన చెట్లలోనుంచి, పొదల్లోనుంచి వస్తూన్న పిట్టల కలకలరవాలను వింటూ, ఆ చీకటి తోటలోనికి చూస్తూ చాలాసేపు అలాగే కూచున్నాడు. సముద్గారు గదిలో దీపం ఆరిపోయింది. అటు తూర్పువైపు, పొగాకుబేరనుల ఆవల చంద్రోదయకాంతులు కనిపించసాగాయి. క్రమశః ఆ పడిపోయిన

భవనం, ఆ తోట వెన్నెల వెలుగులో సుస్పష్టంగా కానవస్తున్నాయి. ఒక పెద్ద నల్లని మేఘం మూడువంతుల ఆకాశాన్ని కప్పివేసింది. ఉరుములు వినవస్తున్నాయి. పిట్టల రొదలు అణగిపోయినవి. నదిలో అలలచప్పుడు, అప్పటి బాతుల అరుపులు మాత్రం వినిపిస్తున్నాయి. మరికొంత సేపటికి మామూలు కన్న ముందుగానే కోడికూయటం ఆరంభించింది. అలా ముందుగా కోడి కూస్తే ఆ రాత్రి చాల ఆహ్లాదకరంగా ఉండగలదని జనవాక్యం. నెహ్లూడొవు మామూలుకన్న ఎక్కువ ఆహ్లాదకరంగానే ఉంది; సౌఖ్యవంతంగా, సంతోషకరంగానూ ఉంది. ఇచ్చటనే ఆతడు తనబాల్యంలో ఒక అత్యంతసౌఖ్యవంతమైన వసంతం గడిపాడు. ఈ పూర్వస్మృతి అతన్ని మళ్ళీ ఆ చీకు చింతలు లేని బాల్యావస్థలోనికి గొనిపోయిందేమో! ఆ క్షణంలో, ఆయపూర్వ భావనా ప్రపంచంలో తన జీవితంలోని అత్యంతసౌఖ్యమయక్షణాలు అవే కాలాలు ననిపించింది. పదునాలుగేళ్ళ వయస్సప్పుడు తనకు సత్యపథాన్ని చూపెట్టవలసినదని భగవంతుని ప్రార్థించిననాటిస్థితి జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడూ అలాగే అనుభవిస్తున్నాడు. బాల్యంలో వొకప్పుడు తల్లి ఒడిలో కూచుని "నేనిక ఎప్పుడూ తప్పుచెయ్యను. నిన్ను కష్టం కలిగించను" అని వాగ్దానం చేసి ఏడ్చినప్పటి స్థితి జ్ఞాపకం వచ్చింది; ఇప్పుడూ అలాగే అనుభవిస్తున్నాడు. తనూ నికొలెంకా ఇర్టెనెయ్యా కలిసి పరస్పరం సహాయం చేసుకుంటూ, తోటివాళ్ళకు సౌఖ్యం చేకూరుస్తూ నీతిజీవితం గడుపుకుందామని ప్రతిన చేసుకున్ననాటి అనుభవమే ఇప్పుడూ కలుగుతున్నట్లుంది.

ఆ నాడు తాను జైల్లో చూచిన విషయాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. పిల్లలుగల ఆ యువతిభర్త, పాపం, దొరగారి (అంటే తన) అడవిలో చెట్లు నరికినందుకు జైల్లో మగ్గుతూవుండటం—పిల్లల్ని పోషించలేక ఫౌండ్లింగ్ ఆసుపత్రికి పంపించివేసే ఈ బీదవాళ్ళ దుస్థితి—తల్లి చంకలోనీరసపు నవ్వులు చిలుకుతూవున్న ఆ పసిబిడ్డ ఆకలి—ఇంట్లో చాకిరీఅంతా తానే చేయవలసి వచ్చిన ఆ గర్భిణీ స్త్రీ—ఈ దుర్దశా చిహ్నాలు యావత్తూ స్మృతికి వచ్చాయి. జైళ్ళు, సంకెళ్ళు, కారాగారాలలోని ఆ దుర్వాసన, కశ్మలను భావించుకున్నాడు. వెంటనే తానూ, తదితర భోగలాలసులూ పట్నాల్లో గడుపుతూవుండే భోగజీవితాలను స్మరించాడు.

చంద్రబింబం ఆకాశాన ఎక్కివచ్చింది. పొగాకు బారసుల నీడలు పడుతున్నాయి. పడిపోతూన్న గోడలు తెల్లగా మెరుస్తున్నాయి. ఈ

వెన్నెలవెలుగును పృథ్వీలోనికి స్వాగతం అన్నట్లు నైటింగేల్ పిట్ట సంగీతం ఆరంభించింది మళ్ళీ.

నెఖ్లూడోవ్ జీవితంలో అడుగుపెట్టబోయేముందు ఆ నాడు కుజ్మిన్‌స్కీ తోటలో కూచుని భవిష్యత్తు గురించి ఆలోచించుకున్న విషయం స్మరణకు వచ్చింది. అప్పుడు ఎన్నో సమస్యలు పొడసూపినవి. వాటిన్నింటినీ ఎలా పరిష్కరించవలెనో సరిగా అర్థంగాక, చాలా తికమక పడ్డాడప్పుడు. అవే సమస్యలను మళ్ళీ ఇప్పుడు తలచుకుంటే ఆ నాటివలె క్లిష్టమయినవిగా లేనే లేవు. అతి సులభమైనవిగా ఉన్నాయి. కారణం ఏమిటి? ఆ నాడు ప్రతి విషయాన్నీ...ఫలితం తనకు ఎలాగ ఉండబోతుందీ అనే దృష్టితో ఆలోచించేవాడు. ఇప్పుడా దృష్టి కాదు; తను ఏమి చేసితీరాలి అనే దృష్టితో ఆలోచిస్తున్నాడు. ఇంకా విచిత్రం ఏమిటంటే—తన మేలుకొరకు ఏమి చెయ్యాలో అనే దృష్టి ఇప్పుడసలే లేదు. ఇతర్ల మేలుకొరకు చెయ్యాల్సిన పనేమిటి అనే ఆలోచనే. మస్లోవాను విడిచిపెట్టకూడదు. ఆమెకు యావజ్జీవం సహాయంచేస్తూ, పూర్వం తానామెపట్ల ఆచరించిన దోషానికి పరిహారం చెప్పుకోవలసిందే. న్యాయవిచారణ, శిక్ష—ఈ సమస్యల్ని గురించి తీవ్రంగా ఆలోచించి, అవసరమైతే పుస్తకాలు చదివి, వొక స్థిరమైన అభిప్రాయానికి రావాలని అతనికోరిక. ఇంతవరకు అవి సక్రమంగా లేవని మాత్రం అతనికి తెలుసు. ఆ సమస్యల్ని గురించి పరిశోధించినందువల్ల ఫలితం ఏమగునో తెలియదుగాని—తానా పరిశోధన జరిపితీరాలి. ఈ నిశ్చయం అతనికి ఆనందాన్ని కలిగించింది.

నల్లమేఘం ఆకాశం అంతా వ్యాపించి ది తీవ్రంగా ఉరుముతోంది. మెరుపులు మెరిసినప్పుడల్లా ఆ ఖాళీస్థలం, పడిపోయిన గోడలూ తళుక్కుమంటున్నాయి. పిట్టలరొదలు ఆగిపోయాయి. చెట్లఆకులు గలగలలాడిస్తూ గాలి తరగలు వీచి, నెఖ్లూడోవ్ ముంగురులతో ఆడుకుంటున్నాయి. ఒక్కొక్క చినుకే పడుతోంది. క్రమేణా వర్షం పెద్దది అయింది. ఇంటి కప్పుమీద చినుకుల టపటపలు! ఒక్క పెద్ద మెరుపు! అకస్మాత్తుగా ఏదో పెద్ద భయంకరమైన చప్పుడు పైనుంచి ఆకాశం విరిగిపడ్డట్లు! నెఖ్లూడోవ్ లోనికి వెళ్ళాడు.

"మానవజీవితగాథ! ఇదంతా నాకేమీ అర్థంకాదు. నా మేనత్తలు ఏం చేశారు? నేను బ్రతికివుండగానే నికొలెంకా ఇరటెన్‌గేవ్ ఎందుకు చని పోవాలి? మస్లోవా బ్రతుకేమిటి? నాయీ పిచ్చి అంతా యేమిటి? ఆ యుద్ధం, ఆ తరువాతి హద్దు, పద్దుపేని నా జీవితం—ఏమిటి ఇదంతా. దీన్ని అర్థం చేసుకోవాలంటే భగవంతుని ఇచ్ఛను అర్థంచేసుకోవాలి. అది నా శక్తికి మించిన పని. నా అంతరాత్మలో ధ్వనించే ఆయన ఇచ్ఛను నెరవేర్చటమే నా శక్తికి చాలిన పని. అదేమిటో మాత్రం నాకు స్పష్టంగా తెలుసు. అది నెరవేరుస్తూ ఉన్నప్పుడే నాకు శాంతి, స్థిరత."

ధారాపాతంగా కురుస్తున్నది వర్షం. ఇంటికప్పుమీదినుంచి వర్షపు నీటిధార గొట్టంనుండి క్రిందతొట్టిలో పడుతోంది. మెరుపులు తగ్గాయి. నెహ్లూడొవ్ మంచంమీద పడుకున్నాడు, నల్లులున్నాయేమోనని అనుమానిస్తూ.

"ఎవరైనాసరే, తాను యజమాన్ని కాను, సేవకుణ్ణి అనుకుంటే?" ఈ ఆలోచన నెహ్లూడొవ్‌కు ఆనందాన్ని ఇచ్చింది.

దీపం ఆర్పి కాసేపు పడుకున్నాడో లేదో, నల్లులు కుట్టడం సాగించాయి.

"భూమి యావత్తు రైతులకు వొప్పగించేసి వెడతాను సైబీరియాకు—ఈగలు, దోమలు, నల్లులు, మురికి! అయితేయేం? అలాగే జరుగవలసివుంటే అంతా సహిస్తాను" కాని ఎంత స్థిరమైన సంకల్పమైనా సహించలేకపోయాడు. లేచి కిటికీలో కూచుని విచ్చిపోతూన్న మేఘాలకేసి, మేఘాల్లోనుంచి తొలగి వస్తూన్న చంద్రునికేసి చూస్తున్నాడు.



తెల్లవారుఝామున కాస్త నిద్రపట్టింది. కాబట్టి చాలా ఆలస్యంగా లేచాడు. అప్పటికే ఏడుగురు రైతులు వచ్చారు. సముద్దారు కబురు చేశాడు వాళ్ళను. కర్రలు పాతించి వాటిమీద చక్కలువేసి కూచోటానికి బెంచీలుగా ఏర్పాటు చేశాడు. ఒక కుర్చీ—టేబిల్ వేశాడు. అతికష్టంమీద... దొరగారు వచ్చేంతవరకూ వాళ్లు నిల్చుండ నవసరంలేదని వొప్పించి కూచో బెట్టాడు. మొదట ఎంత బ్రతిమాలినా ఆ మిలిటరీలో పనిచేసిన రైతు కూచోనే

లేదు. చనిపోయిన ఒక యోధుని పవిత్రక్రియలు జరుగుతున్నప్పుడు మిగిలిన యోధులంతా నిల్చుండే తీరున చేతిలో టోపీ పట్టుకుని నిటారుగా నిల్చున్నాడు వచ్చిన వారిలో చాలా మర్యాదస్తుడులా కనిపిస్తున్న ఒక పెద్దరైతు ఉన్నాడు. విశాలమైన వక్షం, ఉంగరాలు తిరిగిపోయిన గడ్డం, నెరిసినజుట్టు అతడు వచ్చి తిన్నగా ఆసీనుడైన తరువాత మిగతావాళ్ళు కూడా వచ్చి కూచున్నారు. చివరకు నెఖ్లూడో వచ్చి వాళ్ళకు ఎదురుగా కూచున్నాడు. టేబిల్ మీదికి వాలి, తాను రాసుకున్న కాగితం ముందుంచుకుని, తన ఆశయాన్ని వివరించాడు.

ఎక్కువమంది లేకపోవటం చేతనో, ఎక్కువగా విషయంమీదే చిత్తాన్ని కేంద్రీకరించిన కారణాన్నో-ఎందువల్లనైతేనేమి, ఈసారి ఏమాత్రమూ తికమక పడలేదు. ఎక్కువగా ఆ ఉంగరాలు తిరిగిన గడ్డంగల ముసలివాణ్ణి ఉద్దేశించి ప్రసంగించాడు—అతని ఒప్పుదలనో, నిరాకరణనో ఆశిస్తూ, ఆ ముసలివాడు తన్ను బాగా అర్థం చేసుకోగలడని అనుకోటంలో నెఖ్లూడో పొరపాటు పడ్డాడనే చెప్పాలి. నెఖ్లూడో మాటల్ని అతడు చాలా కష్టం మీదే అర్థంచేసుకోగలిగాడు. నెఖ్లూడో వాక్యాల్ని మళ్ళీ మిగిలిన రైతులు వాళ్ళ భాషలో తిరిగి చెప్పినమీదే అవగాహన చేసుకోగలుగుతున్నాడు. ఇంకా గడ్డం మొలవని ఒక యువకుడు ఆ ముసలివాని ప్రక్కనే కూచుని ఉన్నాడు, అతనికి ఒక కన్ను గుడ్డి. అతడొక తాపీపనివాడని నెఖ్లూడో తరువాత తెలుసుకున్నాడు. ఆ యువకుడే మిగిలినవారికన్న బాగా అర్థం చేసుకోగలిగాడు. అతడు నెఖ్లూడో మాటల్ని జాగ్రత్తగా విని, మళ్ళీ వాటిని తన భాషలో తెలియజెప్పుతూ ఉండేవాడు. గడ్డం, మీసాలు పూర్తిగా నెరిసిపోయిన ఒక ముసలిరైతు కూడా బాగానే అర్థం చేసుకున్నాడు; మధ్య మధ్య కాస్త హాస్యరసం వొలికించే వ్యాఖ్యానం విసురుతూ అర్థమౌతున్నవాడువలెనే కనిపించాడు. మిలిటరీలో పనిచేసి వచ్చిన ఆ నడిమి వయసు రైతు కూడా కొంతవరకు అర్థం చేసుకుంటున్నట్లే కనిపించాడు. అయితే మధ్య మధ్య అర్థంలేని మిలిటరీ భాష మాట్లాడుతున్నాడు. వొక్క పొడగరియైన వ్యక్తి మాత్రం నిశితమైన శ్రద్ధతో వింటున్నాడు. తెల్లని పరిశుభ్రమైన దుస్తులు ధరించాడు. కొంచెం విలువగల చెప్పులు తొడిగాడు. కొంచెపాటి గడ్డం; పొడుగైన ముక్కు; గంభీర కంఠస్వరం; అవసరమని తోచినప్పుడు మాత్రమే మితంగా మాట్లాడుతున్నాడు. లోగడ దినం మీటింగులో

కచ్చితంగా నిరాకరణ తెలిపిన ఆ పండ్లులేని ముసలిరైతు; మరొక ముసలి వాడు—ఈ ఇద్దరూ ఈసారి ఎక్కువగా మాటాడలేదు. జాగ్రతగానే విన్నారు.

సొంత భూ ఆస్తి అంటూ ఉండటం అనే సమస్యమీద తన అభిప్రాయాల్ని మొదట వివరించాడు నెఖ్లూడోవ్. "భూ ఆస్తి కొనతగిందిగాని, అమ్మతగిందిగాని కాదు. కొనతగిందీ, అమ్మతగిందీ అయినట్టయితే వొక్క ఆసామి సర్వం కొనేస్తాడు; ఇక భూమి లేనివాళ్ళ దగ్గరనుంచి తన యిష్టం వచ్చినదల్లా దోచివేయ గలుగుతాడు."

"ఆ మాట నిజమే" అన్నాడు పొడుగాటి ముక్కుగల పొడగరి.

"ఔను, అంతే" అన్నాడు మిలిటరీ రైతు.

"వొక అమ్మ తన ఆవుకోసం పొలంలో గడ్డికోస్తుంది; తీసికెళ్ళి జైల్లో బంధించేస్తారు" అన్నాడు మీసాలు, గడ్డం నెరిసిపోయిన ముసలిరైతు.

"మాకు ఉన్న కాస్త సొంత పొలం నాలుగామడ దూరాన ఎక్కడో ఉంది. మరింకో పొలం కౌలుకు తీసుకు పనిచేద్దామంటే గిట్టుబాటు కాదు. కౌళ్ళు విపరీతంగా పెరిగిపోయాయి. కామందు నెత్తురు పీల్చేస్తాడు. యిది నికృష్టమైన బానిసత్వం" అన్నాడు పళ్ళూడిపోయిన బోసినోటి రైతు.

"అలాగే నేనూ భావిస్తున్నాను. సొంత భూ ఆస్తి అంటూ ఉండటం పాపం అని గుర్తించాను. అందుచేతనే భూమి యావత్తు ఇచ్చివేయ బోతున్నాను" అన్నాడు నెఖ్లూడోవ్.

"ఔను, బాగానే ఉంది" అన్నాడు ఉంగరాలుగా తిరిగిన గడ్డంగల రైతు—నెఖ్లూడోవ్ తను భూమిని కౌలుకు ఇచ్చివేయనున్నాడని అర్థం చేసుకుని.

"నేను ఇక్కడికి వచ్చింది అందుకే. భూమిని నేనే అట్టిపెట్టుకోటం నా కిష్టంలేదు. ఎలా పంచిపెట్టెయ్యాలి అనే విషయాన్ని మనం ఆలోచించాలి."

"రైతులకు ఇచ్చేసెయ్యటమే" అన్నాడు బోసినోటి రైతు. ఈ మాటలో వ్యంగ్యం ఏమైనా ఉందా? నెఖ్లూడోవ్ కొంచెం విచలితుడైనాడు.

తన మంచి తలంపును ఈ రైతు శంకిస్తున్నాడేమోనన్న అనుమానం నెహ్లూడోవు కలిగింది. కాని అతడు తన్ను తాను సంబాళించుకుని అన్నాడు.

"సంతోషంగా ఇచ్చేస్తాను. ఎవరికి ఇయ్యను? ఏ పద్ధతులమీద? ఇక్కడి మీ రైతు సంఘానికి ఇవ్వనా? పక్క ఊళ్ళో రైతుల కివ్వనా?"

కాసేపు అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. చివరకు మిలిటరీ రైతు అన్నాడు: "ఈ ఊళ్లో రైతులకే" అని.

"బాగానే ఉంది. ఎలా పంచిపెడతావో చెప్పు."

"వొక్కొక్కనికి ఇన్ని ఎకరాలు అని అందరికీ సమానంగా పంచెయ్యండి" అన్నాడు తాపీపని చేసే యువకుడు.

"ఔను, అంతే. మరింకెలాగ పంచుతాం?" అన్నాడు కుంటికాలు గల రైతు.

ఈ విధానం తృప్తికరంగానే ఉన్నదని అందరూ వొప్పుకున్నారు.

"అయితే దివాణంలో ఇంకా నౌకర్లు ఉన్నారు. వాళ్ళకుకూడా భాగం ఇవ్వాలి—" అన్నాడు నెహ్లూడో.

"అలా వల్లకాదు" అంటూ పేచీపెట్టాడు మిలిటరీ రైతు. కాని వివేకవంతుడో పొడుగుముక్కు పెద్దమనిషి అతనితో ఏకీభవించలేదు. "పంచుకోటం అంటూ వస్తే అందరూ సమంగా పంచుకోవలసిందే—" సహజగంభీరమైన స్వరాన.

"అలా లాభంలేదు" అన్నాడు నెహ్లూడో. "అందరూ సమంగా పంచేసుకున్నట్టయితే—కొంతమంది పనిచేయలేని సోమరులు, కష్టం చేతగాని వాళ్ళూ ఉంటారు—వాళ్లు తమభాగాల్ని ధనవంతులకు అమ్మేసుకుంటారు. ఈ విధంగా మళ్ళీ భూమి ధనవంతుల చేతుల్లోకి వెళ్ళిపోతుంది. స్వయంగా కృషిచేసేవారి కుటుంబాలు పెరుగుతాయి; కాని వాళ్ళకు భూమి చాలకుండా పోతుంది. అప్పుడు చాలినంతభూమి లేనివాళ్ళను మళ్ళీ ధనవంతులు గుప్పెట్లో చిక్కించుకుంటారు."

"ఔను, ఆ మాట వాస్తవం—" అన్నాడు మిలిటరీ రైతు.

"భూమి అమ్ముకోరాదని షరతు ఉండాలి. దున్నేవాడికే భాగం ఉండాలి" అన్నాడు తాపీపని చేస్తూఉండే రైతు.

"సొంతానికి మున్నదెవరో, ఇతర్లకోసం మున్నదెవరో తెలుసుకోటం కష్టం కదా!—" అన్నాడు నెహ్లూడో.

"అయితే అందరూ కలిసి సమిష్టిగా దున్నకుని, వ్యవసాయం చేయగల ఒకవిధానాన్ని అనుసరిద్దాం. కష్టించిన వాళ్లకు ఫలసాయంలో భాగం ఇవ్వొచ్చు. నాగలిపట్టనివాళ్ళకు ఏమీ లేదు—"అన్నాడా పొడగరి రైతు.

"అలాంటి విధానాన్ని అమలుజరుపవలసివస్తే, నాగళ్ళూ, గుర్రాలు, ఇతర వ్యవసాయపనిముట్లు, కళ్ళంలో ధాన్యాన్ని కొట్టే యంత్రాలూ—ఇవన్నీ మీ సమిష్టి సొత్తుగా వుండాలి. అందుకు మీరంతా వొప్పుకోవాలి."

"అటువంటిదానికి మా రైతులు ప్రాణాలుండగా వొప్పుకోరు" అన్నాడు బోసినోటి రైతు.

"అస్తమానం యుద్ధాలే సాగుతాయి" అన్నాడు ఉంగరాలు తిరిగిన గడ్డంగల రైతు.

"ఇకపోతే భూసారంగురించిన ప్రశ్నకూడా ఉంది. ఒకనికి సారవంతమైన భూమి, మరొకనికి ఇసుకనేల ఎందుకు రావాలి?—" అన్నాడు నెహ్లూడో.

"అటువంటప్పుడు భూమిని చిన్న చిన్న లాట్లుగా విభజించి ప్రతివానికీ సమానంగా ఇస్తే సరి!—" అన్నాడు తాపీపని చేసేయువకుడు.

"ఇది ఏదో ఒక్క ఎస్టేటుకు సంబంధించిన సమస్య మాత్రమే కాదు. ఇలాగే ఒకరాజ్యంలో వున్న భూమునంతా పంచవలసిందే. అలా పంచినప్పుడు కొందరికి సారవంతమైన భూమి, మరికొందరికి బీడునేల ఎందుకు రావాలి? అందరికీ మంచిభూమిమీదే దృష్టి వుంటుంది."

"ఔను" అన్నాడు మిలిటరీ రైతు. మిగిలినవాళ్ళెవరూ మాటాడలేదు.

"కాబట్టి సమస్య అంత తేలికైనదేమీ కాదు. దీన్ని గురించి మనమే కాదు; ఇంకా చాలామంది ఆలోచిస్తూనే ఉన్నారు. హెన్రీజార్జి అని ఒక అమెరికన్ దేశీయుడున్నాడు. ఆయన ఏమంటాడంటే—"

"ఎందుకూ మీరు యజమానులు. మీ ఇష్టంవచ్చినట్టు పంచండి. మాకు అభ్యంతరం చెప్పేదేముంది? అధికారం మీది" అన్నాడు ముసలి రైతు.

నెక్లాసోవ్ కొంచెం తటపటాయించాడు. ఈ అసంతృప్తి మాటలు పలికినందుకు తానే కాదు మిగిలినరైతులు కూడా అసంతృప్తి వెల్లడించినందుకు సంతోషించాడు.

"నువ్వు ఉండవయ్యా సైమన్ గారూ! వారిని చెప్పనీ" అన్నాడు సహజ గంభీరమైన కంఠస్వరాన ఆ పొడుగు ముక్కు పెద్దమనిషి. ఆ మాటలతో నెక్లాసోవ్ ఉత్సాహాన్ని తెచ్చుకుని హెన్రీజార్జి Single tax systemను వివరింపసాగాడు.

"భూమి ఏ మానవుని సొంతమూ కాదు; అది భగవంతునిది" అంటూ ఆరంభించాడు.

"ఔను, ఔను" అన్నారు చాలామంది.

"భూమి సమస్తమానవుల సమిష్టి సొత్తు. దాన్ని అనుభవించటానికి అందరికీ సమానమైన హక్కు ఉంది. కాని ప్రతివారూ మంచి సారవంత భూమినే కోరుతున్నారు. అటువంటప్పుడు భూమిని న్యాయంగా పంచటం. ఎలాగంటే—మంచి భూమిని పొందినవాడు దాని విలువను భూమిలేనివానికి ఇవ్వాలి. కాని ఎవరు ఎవరికి ఎంత చెల్లించాలో కష్టం. అదీగాక సంఘంయొక్క సమిష్టి అవసరాలకు ధనం కావలసి వస్తుంది. కాబట్టి మంచి భూమిని పొందినవాడు సంఘం యొక్క అవసరాలకు దాని విలువను చెల్లించాలి. అప్పుడు అందరికీ సమాన భాగాలే ఏర్పడుతాయి మీరు భూమిని దున్నుకోదలిస్తే మంచి భూమి తీసుకున్నవారు ఎక్కువ చెల్లించండి. బాగా పండని భూములు తీసుకున్నవాళ్లు తక్కువే చెల్లించండి. భూమి దున్నుకోనవసరం లేనివాళ్ళు ఏమీ చెల్లించనక్కర్లేదు. భూమిని దున్నేవాళ్ళే పన్నులు అవీ కడతారు; సంఘం యొక్క సమిష్టి ఖర్చులు భరాయిస్తారు."

"అది న్యాయంగానే ఉంది. మంచి భూమి అనుభవించేవాళ్ళు ఎక్కువే చెల్లించాలి" అన్నాడు తాపీమేస్త్రి.

"హెన్రీజార్జిగారిది మంచి బుర్రేనయ్యా!" అన్నాడు ఉంగరాలు తిరిగిన గడ్డంగల రైతు.

"అయితే ఆ చెల్లించే సొమ్ము మా తలకు మించింది కాకుంటే సరే" అన్నాడు పొడుగుముక్కు రైతు.

"అంత ఎక్కువగా నూ ఉండకూడదు; అంత తక్కువగానూ ఉండ కూడదు. ఎక్కువైతే ఇచ్చుకోలేరు; నష్టం వస్తుంది. తక్కువైతే లాభాలు ఆర్జించటం మరిగి, భూముల్ని అమ్ముకోటం, కొనటం—ఒక వ్యాపారాన్ని సాగిస్తారు."

"ఔనౌను. నిజమే" అన్నారు రైతులు బాగా అర్థం చేసుకుని.

"హ్యాన్రీజార్జి ఏం తెలివైన మనిషి! ఎంత గొప్ప సంగతులు కని పెట్టాడో!" అన్నాడు మెలికెలు తిరిగిపోయిన గడ్డంగల రైతు.

"అయితే నాకు కొంత భూమి కావాలనుకోండి?" అంటూ చిరు నవ్వుల సముద్రారు అడుగబోయాడు.

"ఒక లాటు ఉంటే తీసుకుని దున్నండి" అన్నాడు నెఖ్లూడోవ్.

"ఎందుకు బాబూ నీకు భూమి ఇంకాను? ఉన్నది చాలదేమిటి?" అన్నాడు ముసలిరైతు.

అంతటితో సమావేశం ముగిసింది. ఈ విషయాలన్నీ ఇతర రైతులతో కూడా బాగా ఆలోచించుకుని ఒక నిశ్చయానికి రండని నెఖ్లూడోవ్ రైతులకు చెప్పాడు. వాళ్ళంతా నెఖ్లూడోవ్ మాటలవల్ల కలిగిన ఆవేశంతో ఆ చోటు నుంచి కదిలిపోయారు, పెద్దగా దారి పొడుగునా మాటాడుకుంటూ.

ఆ మర్నాడు రైతులెవరు పనిలోకి వెళ్ళలేదు. నెఖ్లూడోవ్ సూచించిన విధానాన్ని గురించి చర్చించుకున్నారు. సంఘం అంతా రెండు పార్టీలుగా ఏర్పడింది. ఒక పార్టీవారు నెఖ్లూడోవ్ విధానం చాలా బాగుందనీ, దాన్ని నిరభ్యంతరంగా స్వీకరించవచ్చుననీ నమ్మారు. రెండో పార్టీవారు ఆ విధానం తమకేమీ అర్థంకాక అనుమానించారు, స్వీకరించటానికి భయగ్రస్తులైనారు. దానిమీద ఒక ముసలిరైతు వచ్చి "దొరగారు" తన ఆత్మను గురించీ, మోక్షాన్ని గురించీ తీవ్రంగా ఆలోచించుకుని, నిర్వాణప్రాప్తికై ఈ పని తలపెట్టాడని నెఖ్లూడోవ్ విషయమై చెప్పాడు. కనుకనే పానోవోలో బోలె డంత డబ్బు ఖర్మం చేశాడని కూడా వివరించాడు. దానితో రెండో పార్టీల వారి అనుమానాలు పోయాయి.

ఇదివరకెప్పుడూ నెఖ్లూడొవ్ పానొవో ప్రాంతాలకు ఎక్కువగా రాలేదు. అక్కడి రైతుల దౌర్భాగ్యస్థితి చూడలేదు. మొన్న వచ్చి అంతా చూశాడు. ఆయన గుండె నీరయింది. అందుచేత దారిద్ర్య ఘోరం ఎంత భయంకరంగా ఉంటుందో ప్రత్యక్షంగా చూశాడు. అడిగినవారికల్లా లేదన కుండా డబ్బు ఇచ్చాడు. గత సాలున అడవి అమ్మగా వచ్చిన డబ్బు, కుస్మిన్‌స్కీలో వ్యవసాయపు పనిముట్లూ అవీ అమ్మగా వచ్చిన డబ్బు చేతిలో ఉన్నది. ధర్మాలు చేశాడు. డబ్బిస్తున్నాడని వినగానే చాలామంది, ముఖ్యంగా స్త్రీలు గుంపులు గుంపులుగా వచ్చి సాయం అడిగారు. ఎవరి కియ్యాలో, ఎంత ఇవ్వాలో అతనికేమీ తెలియదు. లేనివాళ్ళు వచ్చి అడుగు తూంటే కావలసినంత ఉన్నవాడు ఇవ్వకుండా ఉండటం ఎలాగ? ఇవ్వను పొమ్మనటం అసంభవం అయింది. అలా ఇచ్చు వచ్చినట్టు ఇవ్వటమున్నూ వివేకంగా తోచలేదు.

పానొవో విడిచివెళ్ళేనాడు మేనత్తల యింట్లో ఉన్న వస్తువులన్నీ పరికించి చూచాడు. ఒక డ్రాయరులో ఒక ఫోటో ఉంది. అందులో తన మేనత్తలైన సోఫియా, మేరీ, తానూ, మస్లోవా వున్నారు. అప్పుడు మస్లోవా ఎంత అందంగా, ఎంత పరిశుద్ధంగా, ఎంత ఆనందంగా ఉంది! ఆ ఫోటో, ఇంకా కొన్ని అక్కడ పడివున్న ఉత్తరాలు నెఖ్లూడొవ్ తీసుకున్నాడు. ఇకపోతే, మిగిలిన వస్తువులు, ఆ యిల్లూ ఒక మిల్లుయజమానికి అమ్మివేశాడు. చిరునవ్వుల సముద్రావు సిఫారసుమీద ఆ మిల్లరు కొన్నాడు. నెఖ్లూడొవ్‌కు వచ్చిన క్రయధనం అసలు విలువలో పదోవంతు మాత్రమే.

కుస్మిన్‌స్కీలో ఆస్తి అమ్మివేసినప్పుడు ఒకరకమైన మనోవైకల్యం అనుభవించాడు నెఖ్లూడొవ్. ఇప్పుడు మాత్రం బరువు దించేసుకున్న వాడిలా హాయి అనుభవించాడు. ఒక ప్రయాణీకుడు కొత్తదేశాలను కనుగొన్నప్పుడు అనుభవించే ఉత్సాహంలాంటిది పొందాడు.

౧౦

నెఖ్లూడొవ్ మళ్ళీ పట్నం చేరుకున్నాడు. కాని ఈసారి పట్నం అతనికి పూర్వంలా కనిపించటంలేదు. సాయంత్రమప్పుడు రైలుదిగి, బండి యెక్కి యింటికి వెళ్ళాడు. అగ్రఫేనా, కార్నీ ఇద్దరూ చాలా అలసి, అసహ

తృప్తి వదనాలతో ఉన్నారు. ఇద్దరిమధ్య ఏదో చిన్న వాగ్వాదం జరిగి నట్టుగా వుంది. నెఖ్లూడొవ్ గది ఖాళీగానే వుంది. కాని లోపలికి వెళ్ళటానికి వీల్లేకుండా పెట్టెలు అడ్డంగా పడివున్నాయి. తను రావటంతో ఇంట్లో జరుగుతూన్న ఒకసంచలనం ఆగిపోయింది. పల్లెటూళ్ళలో నాలుగునాళ్ళుండి అక్కడి రైతుల నిరంతర దారిద్ర్యాన్ని, నికృష్ట జీవితాల్ని ప్రత్యక్షంగా చూచివచ్చాడు నెఖ్లూడొవ్. ఇప్పు డాతనికి పట్నంలోని విలాసజీవితాలపై, తానిదివరకు పట్నాల్లో గడపిన విషయాలలోలతపై ఒకరకమైన విరక్తి కలిగింది. మర్నాడే మరొక చోటికి నిరాడంబర ప్రదేశానికి వెళ్ళి ఒక చిన్న యిల్లు అద్దెకు తీసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఈలోగా ఇక్కడ తనకున్న వస్తువు లన్నింటినీ అగ్రఫేనా ఆమెయిష్టం వచ్చినట్టు సర్దిపెడుతుంది. తరువాత తన సోదరి వచ్చి ఇల్లు ఖాళీ చేస్తుంది.

నెఖ్లూడొవ్ మర్నాటి ఉదయమే లేచాడు. జైలుకు సమీపంలో ఒక వీథిలో రెండుగదులు అద్దెకు తీసుకున్నాడు. ఏమంత పరిశుభ్రమైన ఇల్లు కాదది. తన సామాను చాలావరకు ఈగదుల్లోకి పంపించమని కబురు చేశాడు. తనేమో ప్లీడర్ని చూడ్డానికి వెళ్ళాడు. రాత్రి బాగా వర్షం కురిసింది. బైట వాతావరణం శీతలంగా వుంది ఉదయంనుంచీ. చలికి వొణుకుతూ నెఖ్లూడొవ్ గబగబా నడిచాడు. పల్లెటూళ్ళ దౌర్భాగ్యజీవితం—ముఖ్యంగా నీరసపు చిరునవ్వులు ఒలుకబోస్తూ, ఉబ్బిపోయిన కాళ్లు ఊగిసలాడిస్తూ తల్లిచంకలోనుండి తనకేసి చూస్తూ ఉండిన ఆ పసిబిడ్డ ముఖ్యంగా మాటిమాటికీ తలపుకు వస్తోంది. పల్లెరైతులు, బస్తీ వ్యాపారస్థులు—ఈ రెండుతెగలవారిమధ్యగల అంతరాన్నిగురించి ఆలోచింపసాగాడు. షాపుల ముందునుంచి వెడుతున్నాడేమో, ఆ వ్యాపారస్థుల లావుపాటి బొర్రలు, ఏనాడూ ఆకలిబాధ అంటూ యెరగని మొఖాలు చూచాడు. ఇలా జీవన సంతృప్తిని వెళ్ళగక్కుతూన్న మొఖం ఒక్కటికూడా పల్లెరైతుల్లో అతనికి కనిపించలేదు. వస్తువుల విలువలు సరిగ్గా తెలియని అమాయిక ప్రజలను మోసగించటము వీరికి ఒక ప్రముఖవ్యాపారము—తొడలు బలిసి, మెడదగ్గర నుంచి బొడ్డువరకూ గుండీల వరుసలు మెరుస్తూన్న కోటు తొడుక్కుని బండీవాళ్ళు—జరీటోపీలు పెట్టుకుని దౌవారికులు - రంగురంగుల అంచులు తళుక్కుమంటూన్న గౌనులు ధరించి పనికత్తెలు—సగర్వంగా కులుకుతూ—అందరూ కడుపునిండినవాళ్ళులాగే కనిపిస్తున్నారు. వీళ్ళలో కొంతమంది

బహుశః పల్లెల్లో దున్నుకుని బ్రతికేందుకు చాలినంత భూముల్లేక, పస్తులుండలేక పారిపోయి బస్తీకి చేరుకున్నవాళ్లుకూడా ఉంటారు. అటువంటివాళ్ళు కొంతమంది ఈ పట్నవాసపు పద్ధతులకు తమను అనుకూలంగా పరిణమించి, తమ యజమానులకువలెనే ధనం ఆర్జించుకుని తృప్తిపొందివున్నారు. మరి కొందరు బస్తీచేరినా బాగుపడలేక, పల్లెల్లో వున్నప్పటికన్నా నికృష్టంగానే బ్రతుకు వెళ్ళబోసుకుంటున్నారు. ఇటువంటివాళ్లు పల్లెరైతులకన్నా దయనీయులై వున్నారు. సైనుకాలువల ప్రక్కన కూచుని చెప్పులు కుడుతున్న వాళ్ళు, పాలిపోయిన ముఖాలు గల చాకలివాళ్లు, మరకలుపడిన చొక్కాలతో ఇళ్ళకు రంగులువేస్తున్నవాళ్ళు, వొంటికి సరియైన ఆచ్ఛాదనలుకూడా లేక పనిపాటలకోసం వెతుక్కుంటూ తమలోతాము పోటీలుపడి పోట్లాడుకుంటూన్న కూలివాళ్ళూ—వీరంతా అటువంటి రకానికి చెందినవాళ్ళే. రిక్షాలు లాగుతున్న వాళ్ళముఖాలు, ఇళ్ళముందు బిచ్చం ఎత్తుకుంటూ దీనంగా అరుస్తున్నవాళ్ళ ముఖాలు ఒకమోస్తరుగానే వున్నాయి. కాఫీహోటళ్ళముందు బార్లుగట్టి నిల్చున్న బిచ్చగాళ్ళ ముఖాలుకూడా నెఖ్లూడోవ్ చూచాడు. ఎత్తిన కనుబొమలతో పెదవి విరుస్తూ కాఫీహోటలు కిటికీ ముందు నిరుత్సాహంగా కూచున్నాడొకడు.

వివిధ భావశబలితమైన హృదయంతో నెఖ్లూడోవ్ గబగబా నడుస్తున్నాడు ఇంతలో వెనుకనుంచి ఒక పరిచితమైన కంఠధ్వని వినిపించింది. "నెఖ్లూడోవ్! నువ్వేనా?"

నెఖ్లూడోవ్ ఆగిపోయాడు. ఒకవిధమైన సంతోషం కలిగింది. కాని మరుక్షణమే సంతోషించవలసిన అవసరం ఏమీ లేదని తెలుసుకున్నాడు. "ఓ, నువ్వా! షోన్‌బక్!"

ఆ నాడు తన మేనత్తల యింట్లో తన్నువచ్చి కలుసుకున్న షోన్‌బక్! తరువాత ఇతనెప్పుడూ తనకు కనిపించలేదు. అప్పుల బాధ అధికం అయినప్పటికీ ఆశ్వికదళంలోనే ఉంటూ వచ్చాడనీ—ఏదో 'ఒక రీతిగా ధనవంతుడనిపించుకుంటూనే వున్నాడనీ- ఈ షోన్‌బక్‌నుగురించి నెఖ్లూడోవ్ వింటూవచ్చాడు. ఆత్మసంతృప్తిని ప్రకటించే అతనిముఖం, ఆనం దాన్ని సూచిస్తూన్న అతని కంఠస్వరం విన్నదానికి వ్యతిరేకంగా లేవు.

"నిన్నిక్కడ కలుసుకున్నందుకు ఆనందంగా ఉన్నదబ్బాయి! ఎంత ముసలాడివైపోయావప్పుడేను! నీ నడకనుబట్టి గుర్తించాను సుమా! ఇదిగో మనిద్దరం ఈ మధ్యాహ్నం కలిసి భోంచెయ్యాలి. మాంచిహోటలు ఎక్కడుందో చెప్పు—" అంటూ షోన్‌బక్ రిక్షా దిగి చేయి చాచి వచ్చాడు.

"నాకిప్పుడు తీరిక లేదు...అయితే నువ్వు ఇక్కడికెలా వచ్చావు" అన్నాడు నెహ్లూడొవ్, వీడిని ఎలా వొదిలించుకుందామా అని లోలోన ఆలోచిస్తూ.

"ఉద్యోగమోయ్, ఉద్యోగం! మేనేజరును తెలుసా? సమనోవ్ అనే లక్షాధికారిగారి వ్యవహారాలు చూస్తున్నానిప్పుడు. ఆయనకు యాభై నాలుగువేల ఎకరాలభూమి ఉంది—" అంటూ సగర్వంగా పలికాడు. ఆ యాస్తి అంతా తనే సంపాదించి పారేసినట్లు - ఇంకా ఇలా చెప్పాడు: "ఆయన వ్యవహారాలు బాగా సాగటంలేదు. భూమి కౌలుకు ఇస్తే రైతులు దమ్మిడీకూడా చెల్లించరు. 80 వేల రూబుల్సు అప్పు పెరిగిపోయింది. నేను వచ్చాక ఒక్క సంవత్సరంలో పరిస్థితుల్ని చక్కజేశాను. ఇదివరకుకన్నా ఇప్పుడు 70 శతాంశాలు అధికలాభాన్ని చేకూర్చిపెట్టాను. చూచావా మరి?"

షోన్‌బక్ తన ఆస్తి అంతా పాడుచేసుకుని అప్పులపాలు కాగా ఒక పెద్దమనిషి పలుకుబడివల్ల ఒక ధనవంతునివద్ద మేనేజరుగా నియమితుడై బ్రతుకు గడుపుకుంటున్నాడని నెహ్లూడొవ్ వినియున్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అతని స్వప్రయోజకత్వాన్ని గురించిన ప్రసంగాన్ని వింటూ "ఇతని మనస్సుకు నొప్పి కలిగించకుండా తిన్నగా వొదిలించుకుపోవటం ఎలాగ?" అని ఆలోచిస్తున్నాడు.

"మనం ఈ మధ్యాహ్నం ఎక్కడ భోంచేద్దామంటావు?"

"నాకు తీరికలేదని చెప్పాను కాదూ!" అన్నాడు నెహ్లూడొవ్ చేతి గడియారం చూస్తూ.

"పోనీ, ఈ రాత్రి గుర్రపుపందేలు చూడ్డానికి వస్తావా?"

"రాను."

"రద్దూ. గ్రిషాగారి గుర్రాలమీద నేను పందెం కాస్తున్నాను. అతని గుర్రాలు చాలా మంచివి; నీకు తెలుసుగా! వస్తావు కదూ! రాత్రి భోజనం ఇద్దరం కలిసి చేద్దాం."

"ఉహుఁ, రాత్రికైనా నిన్ను కలుసుకోలేననుకుంటాను" అన్నాడు నెక్లూడొ చిరునవ్వు నవ్వుతూ.

"చెడ్డవాడివైనావు. ఇప్పు డెక్కడికి వెళుతున్నావో చెప్పు."

"ఇక్కడే; ఆ సందుమలుపున స్త్రీడరుగార్ని చూడ్డానికి వెళుతున్నాను."

"ఓహో, జైళ్ళతో సంబంధం పెట్టుకున్నావుటగా! ఖైదీల తరఫున పనిచేస్తున్నావని విన్నానే. ఏమిటిది ఇదంతా? కాస్త చెప్పు."

"నువ్వు విన్నది నిజమే కాని సంగతి యావత్తూ వీథిలో నిల్చుని చెప్పమంటావా?"

"పోనీలే అయితే–గుర్రపుపందేలు చూడ్డానికి వస్తావు కదూ!"

"ఉహుఁ రాలేను. రావటం నాకిష్టంలేదు. కోపగించుకోకేం!"

"కోపమా? ఎంతమాట! నువ్వు ఉండేదెక్కడ?" అని అడుగుతూండగానే స్కోన్‌బక్ ముఖకవళిక మారిపోయింది. ఆలోచనా సూచకంగా కనుబొమలు ముడుచుకున్నాయి. ఏదో జ్ఞాపకం వచ్చిన వాడులా కనిపించాడు. కాఫీహోటలు కిటికీముందు ఎత్తయిన కనుబొమలు గలిగి, పెదవి విరుస్తూ కూచున్న ఆ వ్యక్తి ముఖంలోని నిరుత్సాహమే స్కోన్‌బక్ ముఖంలోకూడా నెక్లూడొ చూచాడు.

"ఎంత చలిగా ఉన్న దివాళ!"

"ఔనౌను."

"అయితే వెడతాను మరి! మొత్తానికి నిన్ను కలుసుకున్నందుకు చాలా ఆనందం అయింది" అంటూ నెక్లూడొతో కరస్పర్శచేసి, తెల్లని దంతాలు కనిపించేట్టు నవ్వుతూ రిక్షాయెక్కి వెళ్ళిబోయాడు స్కోన్‌బక్.

నెక్లూడొ అనుకున్నాడు: "నేనూ అలాగే జీవించాలనుకున్నాను, నవ్వులతో, ఆనందంతో."

# ౧౭

నెస్లాడో ప్లీడరుగారి సమక్షంలోకి వెళ్ళాడు. మెన్‌షోవ్ వంశీకుల కేసును గురించి ఏకరువుపెట్టాడు ప్లీడరు. "ఈ కేసు చాలా విపరీతంగా ఉంది. ఇన్‌షూరు ధనం కాజెయ్యాలన్న తలంపుతో యజమానే భవనానికి నిప్పు అంటించియుండవచ్చును. మెన్‌షోవ్ వంశీకుల నేరం ఋజువు కాలేదు. సాక్ష్యం కూడా ఏమీ లేదు. ప్రాసిక్యూటరు పట్టుదల, మేజిస్ట్రేటు అజాగ్రత్త ఇంత చేశాయి. రాష్ట్ర న్యాయస్థానంలో గాక, ఈ కోర్టులో విచారణ జరిగేట్టయితే మెన్‌షోవ్ వంశీకుల విడుదల అయేటట్లు చేస్తానని హామీ ఇస్తున్నాను. అందుకు నేను ఫీజుకూడా తీసుకోను. ఇక థియొడోసియా మీద కేసు: చక్రవర్తికి అపీలు రాశాము. పీటర్సుబర్గుకు మీరు వెళ్ళేట్టయితే అప్పీలుకూడా తీసుకువెళ్ళండి. స్వయంగా మీరే దాఖలుచెయ్యండి. మీరుకూడా విన్నవించుకోండి. వాళ్ళేవో నాలుగు ప్రశ్నలు అడుగుతారు. అయితే ఫలితం ఏమీ వుండదనుకుంటాను. అప్పీలు కమిటీలో పలుకుబడి కలవాళ్ళను కట్టుకోవాలి. అంతకన్నా మీరు చేయగలిగింది ఏమీ ఉండదనుకుంటాను."

"ఒక ఉత్తరం తెచ్చానండి..."

"ఓహో, ఖైదీల రోదనలన్నీ ప్రవహిస్తున్న ఒక నీటి పంపులాగ తయారైనారు మీరు. చాలా బాధ్యత నెత్తిమీద వేసుకుంటున్నారు; నిర్వహించలేరేమో సుమండీ!" అన్నాడు ప్లీడరు మందహాసం చేస్తూ.

"ఇదొక విచిత్రమైన కేసు సుమండీ!" అంటూ నెస్లాడో వివరాలు చెప్పాడు. ఒక పల్లెలో ఒక రైతు తన స్నేహితులతో బైబిల్ గ్రంథం చదివి చర్చలు చేస్తూ ఉన్నాడు. చర్చి అధికారులు దీన్ని ఒక నేరంగా భావించి కేసు పెట్టారు. మేజిస్ట్రేటు దర్యాప్తు చేశాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ కేసు తయారు చేశాడు. విచారణ జరుగనై ఉంది" చూడండి; ఎంత ఘోరమో!" ఇది నిజమేనంటారా? అన్నాడు నెస్లాడో.

"ఇందులో నీకు ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటి?"

"ప్రతి అంశమున్నా, ఒక పోలీసు ఉద్యోగి గవర్నమెంటువారి ఆజ్ఞను శిరసావహించటం నేను అర్థం చేసుకోగల విషయమే. కాని పబ్లిక్

ప్రాసిక్యూటర్ ఇటువంటి కేసును బనాయించటమనేది—ఒక విద్యా వంతుడు—"

"అసలు తప్పు అంతా అక్కడే ఉంది. పబ్లిక్ ప్రాసిక్యూటర్లనూ, జడ్జీలను సాధారణంగా అభ్యుదయ భావుకులని భావిస్తూ ఉంటాము. ఒక ప్పుడు అలాంటివాళ్ళే అయివుండవచ్చు. కాని ఇప్పటి తరహా వేరు. ఇప్పుడు వాళ్ళు కేవలం ఉద్యోగస్థులు మాత్రమే. ప్రతినెలా ఒకటో తారీఖు వాళ్ళకు పర్వదినం. జీతాలు పుచ్చుకుంటున్నారు. ఇంకా కావాలని కోరతారు. వాళ్ళ ఆశయాలన్నీ అంతటితో సరి. ఎవరిమీదనైనా కేసు నేరం బనాయిస్తారు, విచారణ చేస్తారు, శిక్షిస్తారు."

"ఔను. కాని మరి బైబిల్ చదివినంతమాత్రాన మానవుని సైబీరియాకు ప్రవాసం పంపాలని శిక్షాస్మృతిలో ఎక్కడా లేదే!"

"బైబిల్ చదివి, చెప్పవలసిన రీతిగా గాక చర్చి అభిప్రాయాలను ఖండించాడని రుజువు అయితే ప్రవాస శిక్ష ఉన్నది. ప్రజలముందు సనాతన గ్రీకు సాంప్రదాయాన్ని నిందిస్తే 196 సెక్షన్ ప్రకారం సైబీరియాకు ప్రవాస మన్న మాటే!"

"అసంభవం!"

"పూర్తిగా సంభవమే. నా మాటలు నమ్మండి. ఈ పెద్దమనుష్యు లనబడే జడ్జీలతో చెబుతూనే ఉంటాను; వాళ్ళెప్పుడూ కృతజ్ఞతతో చూస్తూ వుండాలని. నువ్వుగాని, నేనుగాని, జైల్లో పడకుండా వున్నామంటే అది వాళ్ళ దయచేతనన్న మాటే. మన మనుభవిస్తూన్న సౌకర్యాలను అపహ రించేసి, మనల్ని సైబీరియా అంతర్భాగానికి పంపించి వేయటం వాళ్ళకు చాలా తేలికైన పని."

"అలాగ న్యాయాన్ని వాళ్ళ ఇష్టప్రకారం అమలు చేయటం, అమలు చేయకపోవటం జరుపుతూ వుండే వ్యక్తులమీదే సర్వం ఆధారపడి వుండేట్ట యితే ఈ కోర్టులూ, విచారణలూ దేనికోసం?"

ప్లీడరు పకపకా నవ్వాడు; "చాలా విచిత్రమైన ప్రశ్నలు వేస్తారు మీరు. బాగుంది, దాన్ని గురించి కూడా మనం చర్చించుకోవలసిందే. కాని వారంనాడు వస్తారా? ఆనాడు సైంటిస్టులు, సారస్వత వేత్తలు, కళాభి

జ్ఞులు వస్తారు ఇక్కడికి. ఈ 'ప్రాబ్లెమ్' సంగతి అప్పుడు నిర్ణయించుకుందాం, తప్పకుండా ఉండండి" అన్నాడు. 'ప్రాబ్లెమ్' సమస్యలు అన్న పదాన్ని వ్యంగ్యార్థసూచకంగా ప్రయోగించిన తీరు ఒక నిముషం ముందు నెల్సాడో అడిగిన ప్రశ్నకు ఆయన ఇచ్చిన నవ్విన విధం చూడగా స్లీడరు యొక్క గాని, అతని స్నేహితుల యొక్క గాని దృక్పథం తన దృక్పథానికి భిన్నంగా వుంటుందని నెల్సాడో భావించాడు.

"వస్తారెందుకు? రావటానికి ప్రయత్నం చేస్తారు" అన్నాడతను. ఆ మాట అంటూ అసహ్యం చెందుతున్నవాడులాగ అగుపించాడు. నిజానికి రావటానికి కాదు; రాకుండా వుండటానికి ప్రయత్నిస్తారు. స్టిగ్ లాంటి పూర్వ పరిచయస్థులకూ అతనికీ మధ్య ఇప్పుడు పెద్ద అంతరమే ఏర్పడింది. ఈ స్లీడరుగారి మిత్ర బృందానికీ తనకూ మధ్య అంతకన్నా పెద్ద అంతరమే వుంటుంది.

౧౨

జైలు చాలా దూరంలో వుంది. నడచి వెడితే ఆలస్యం ఔతుంది. అందుచేత ఒక బట్కా ఎక్కి బయలుదేరాడు నెల్సాడో. బట్కావాడు నడివయస్సులో వున్నాడు. సాధువైన ముఖం. ఒక వీధిలో వెళుతూవున్నప్పుడు వాడు వెనక్కి తిరిగి నెల్సాడోను వుద్దేశించి సగర్వంగా పలుకుతూ ఒక పెద్ద భవనంకేసి చూపించాడు. కట్టడం పూర్తికాలేదు; నిర్మాణదశలో వుంది. "చూశారా, ఎంత పెద్ద భవనం కడుతున్నారో!" అన్నాడు వాడు— ఆ కట్టడంలో తనకేదో భాగం వున్నట్టు సగర్వంగా.

నిజానికి భవనం చాలా పెద్దది. అపూర్వమైన స్థానం చుట్టూ పెద్ద పెద్ద గడలు పాతి అంచెలు కట్టి వున్నారు. వాటిమీద పనివాళ్లు నిల్చొని భవనం పై భాగాన్ని కడుతూ వున్నారు. కిందనుంచి కూలీలు సున్నపు తట్టలు, ఇటుకల బొత్తులు మోసుకు వస్తున్నారు. కొందరు వాటిని అందుకుని నిచ్చెనల మీదుగా అంచెలమీద మేస్త్రీలకు అందిస్తున్నారు. కొందరు నీటి బిందెలు మోసుకొస్తున్నారు. కొందరు సున్నపు కుప్పలు కలుపుతున్నారు. ఇంకా కొందరు రాళ్లను కోసి రూపాల్లో పగులగొడుతున్నారు. మేస్త్రీ కామందులా లావుగా వున్నాడు, మంచి దుస్తులు ధరించాడు—అంచెల సమీ

పంలో నిల్చుని మరొక వ్యక్తితో జరుపుతోన్న నిర్మాణపు వివరాలు కాపాలు చెపుతున్నాడు. ఆ రెండో వ్యక్తి కాంట్రాక్టరు కాబోలు! స్లాబి మరో రాష్ట్రంనుంచి వచ్చిన ఒక టైరు అయి వుండాలి. మేస్త్రీ చెబుతున్న విషయాల్ని శ్రద్ధగా ఆలకిస్తున్నాడు. కట్టెపుల్ల సామానులను మోసుకొస్తున్న బండ్లు పెద్ద గేటులోనుంచి లోనికి వెళ్తున్నాయి; ఖాళీ బండ్లు బైటికి వస్తున్నాయి.

మేస్త్రీలు, కూలీలు, కంట్రాక్టరు—యావన్మంది తమ తమ పనుల్లో నిమగ్నులై వున్నారు. ఆ కూలీలు ఖాళీ కడుపులతో మామూలుగా వేళకు సరియైన తిండిలేక మాడుతూన్నవాళ్ళే. అయినా వాళ్ళంతా హుషారుగా, చిరునవ్వులు నవ్వుతూ ఏదో సంభాషణలో మునిగి వ్యగ్రులై వున్నారు. ఒక నిరుపయోగమైన వివేకశూన్యమైన భవనం! సంఘానికి నిరుపయోగియైన, వివేకశూన్యమైన ఎవరో వ్యక్తికోసం! ఈ కూలీలను పీడించే, దోచివేసే ఒక ప్రముఖుని కోసం! ఇలా అనుకుంటూ సెన్హాడో అన్నాడు. "ఒక నిరర్థకమైన భవనం!" అన్నాడు.

"నిరర్థకమేం? ఎంతమందికో పనిదొరుకుతున్నది. నిరర్థకం కాదండి—" అన్నాడు బండివాడు.

"కాని ఆ శ్రమ యావత్తు నిరుపయోగమే."

"నిరుపయోగం అయితే ఎందుకు చేస్తున్నారండి! దానివల్ల కూడు దొరుకుతున్నదిగా!"

సెన్హాడో మాట్లాడలేదు. రోడ్డుమీద బండిచక్రాలు చప్పుడు జాస్తి అయింది. అందుచేత మాట్లాడినా సరిగా వినబడేట్టు లేదు.

జైలు ఇంకా ఎంతో దూరంలేదు. రోడ్డు మెత్తగా ఉన్నచోట చక్రాల చప్పుడు తగ్గింది. అప్పుడు బండివాడు సెన్హాడోవైపు తిరిగిచూస్తూ, "ఇప్పుడు పల్లెటూళ్ళనుంచి వ్యవసాయకూలీలు, బీదరైతులు ఎంతమంది పట్నానికి వచ్చేస్తున్నారనుకున్నారు. గుంపులు గుంపులుగా వచ్చిపడుతున్నారండి" అన్నాడు. అదేసమయాన రంపాలు, బాడిశలు పుచ్చుకుని వస్తున్నారు ఎదురుగా పనివాళ్లు. వాళ్ళంతా పల్లెటూళ్లనుంచి వలసవచ్చిన రైతుకూలీలేనని వారి దుస్తులే చెబుతున్నాయి.

"పూర్వంకన్నా ఎక్కువగా వస్తున్నట్లుంటారా?"

"ఈ సంవత్సరం మరీ ఎక్కువగా వచ్చారండి. యజమానులు కూలి వాళ్లను పురుగుల్లా చూస్తున్నారండి. పనిదొరకటం చాలా కష్టమైపోయింది."

"ఎందువల్ల?"

"చాలామంది వచ్చారాయె. అందరికీ పని ఎక్కడ దొరుకుతుంది?"

"అంతమంది ఎందుకు రావాలి పల్లెటూళ్లు వొదిలేసి?"

"పల్లెల్లో ఏముందండి? పనిపాటలు లేవు. మన్ను తిందామంటే పొలం లేదు."

పుండుమీద కెలికినట్టుగా సెడ్రాక్ బాధపడ్డాడు. అన్ని పల్లెల స్థితీ ఇలాగే వుందా? సెడ్రాక్ ఆంటోనియోని చాలా ప్రశ్నలడిగాడు. ఏ వూరు నుంచి వచ్చిందీ, ఎందుకు వచ్చిందీ, వాడి పల్లెటూళ్లో ఎన్ని ఎకరాలపొలం సాగు ఔతున్నదీ-ఈ మొదలైన విషయాలన్నీ అడిగి తెలుసుకున్నాడు.

"మాపల్లెలో మనిషికి ఎకరంభూమి చొప్పున ఉందండి. ఒక్కొక్క కుటుంబానికి వచ్చే ఫలసాయం ముగ్గురు మనుష్యులకు మాత్రమే సరిపోతుంది. నా తండ్రి, ఒక సోదరుడు ఇంటిదగ్గరే వుండి ఉన్నంతలో వ్యవసాయం చేసుకుంటున్నారు. ఇంకో సోదరుడు సైన్యంలో పనిచేస్తున్నాడు. ఇంటిదగ్గర పనిపాటలేమీ లేవట. ఆ సోదరుడుకూడా మాస్కోకు వచ్చేద్దామనుకుంటున్నాడు."

"కౌలుకు తీసుకోకూడదూ ఇంకా కొంతభూమిని?"

"ఎలా తీసుకుంటామండి. భూమి ఉన్నవాళ్ళు అమ్మేసుకుంటున్నారండి. వాళ్లు కౌలుకు ఇస్తారా? మా వూళ్లో ఒక ఫ్రెంచి దేశస్థుడు అధికారం మహా చలాయిస్తున్నాడు. ఎస్టేటుదారు భూమి అంతా తనే కొనేశాడు. ఆయన కౌలుకు ఇవ్వడు. ఆయనదే రాజ్యం ఇప్పుడక్కడ?"

"ఎవరా ఫ్రెంచివాడు?"

"ఆయనపేరు డ్యూఫర్. మీరు వినే ఉంటారనుకుంటా. నటులకు విగ్గులు తయారుచేస్తాడు. భలే వ్యాపారంలెండి అది. చాలా ధనం గడించాడు. మా ఎస్టేటు దొరసానిగారి భూమి అంతా కొనేశాడు. ఇప్పుడాయన చేతుల్లో చిక్కాం. మామీద స్వారీచేస్తున్నాడు. కొంతవరకు ఆయన మంచి

వాడే అనాలి. ఆయనభార్య ఒక రష్యన్ యువతి. గొప్ప సుందరి! ప్రజల్ని ద్వేషిస్తోందనుకోండి. చాలా ఘోరం లెండి — అదిగో జైలు. వచ్చేశాం. నేనుగా కాదా తీసుకుపొమ్మంటారా? వాళ్ళు రానీయరండి. అయినా తీసుకుపోతాను రండి...”

## ౧౩

నెఖ్లూడో జైలు ఆవరణలో ప్రవేశించాడు. జైల్లో మస్లోవా ఎటువంటి దీనపరిస్థితిలో ఉన్నదో! మిగతా ఖైదీలంతా ఎంత నికృష్టంగా ఉన్నారో! ఈ ఆలోచనతో నెఖ్లూడో మనస్సు కుంగిపోయింది. నెఖ్లూడో మస్లోవాకోసం వచ్చినట్లు తెలుసుకుని, ఆమె ఆసుపత్రిలో వున్నదని చెప్పాడు జైలర్. నెఖ్లూడో ఆసుపత్రివైపు వెళ్లాడు. అక్కడ ద్వారపాలకుడు కాస్త దయాదాక్షిణ్యాలు గల వ్యక్తి. మస్లోవా పిల్లల వార్డులో ఉంటుంది, వెళ్ళమన్నాడు.

దారిలో చిన్న డాక్టరు ఎదురైనాడు. కార్బాలిక్ ఆమ్లము గ్రక్కుతున్న దతని శరీరం. “ఎందుకొచ్చారు?” అని అమర్యాదాసూచకమైన కంఠస్వరంతో ఉరిమాడు. ఈ డాక్టరు ఖైదీలకు కాస్త పనిపాటులు కష్టతరమైనవి కానివి వొప్పగిస్తూవుంటాడు. అందుచేత పెద్దడాక్టరుగారితోనూ, జైలు అధికారులతోనూ తరచు సంఘర్షణపడుతూవుంటాడు. ఇప్పుడు వచ్చినతడు చట్టవిరుద్ధమైన కోరిక ఏదైనా వెళ్ళబెడతాడేమోనని ఊహించి, అటువంటి పప్పులేమీ తనదగ్గర సాగవన్నట్లుగా కటుత్వం చూపించాడు మొదట. “ఇక్కడెవరూ ఆడవాళ్ళు లేరు. ఇది పిల్లలవార్డు” అన్నాడు.

“ఆ సంగతి నాకు తెలుసు. ఒక ఖైదీ ఇక్కడ నర్సుగా నియమితురాలైందని విన్నాను.”

“ఔను, ఇద్దరున్నారు అటువంటివాళ్లు, ఎవరు కావాలి?”

“మస్లోవాతో నాకు దగ్గరసంబంధం వుంది. ఆమెతో కాస్త మాట్లాడాలి. ఆమె తరఫున అప్పీలు దాఖలుచెయ్యటానికి పీటర్స్‌బర్గు వెడుతున్నాను. ఆమెకు ఇది ఇచ్చి వెడతాను. ఏమీలేదు; వొక ఫొటో మాత్రమే” అంటూ నెఖ్లూడో తనజేబులోనుంచి ఒక కవరు బైటి[illegible]డు.

"అలాగా!" అన్నది నిస్సత్త్వంగా మస్లోవా.

"నీకు ఇక్కడ బాగుందా?"

"ఆఁ బాగానే వుంది."

"కష్టంగా లేదుగద!"

"లేదు. అయితే ఇక్కడ పనిపాటులు ఇంకా బాగా అలవాటు కాలేదు."

"మొత్తానికి అక్కడికంటే ఇక్కడ హాయిగా వుంటున్నావని సంతోషిస్తున్నాను."

"అక్కడ అంటే?" మస్లోవా ముఖం రాగరంజితమైంది.

"జైల్లోకంటే."

"ఎందువల్ల?"

"ఇక్కడ వుండేవాళ్లు మంచివాళ్ళు. అక్కడ వుండవలసినవాళ్ళ తీరు వేరుకదా!"

"అక్కడ కూడా మంచివాళ్లు చాలామంది వున్నారు."

"మెన్షోవ్ వంశస్థులమీది కేసు కూడా చూస్తున్నాను. వాళ్లు విడుదల కావచ్చు."

"భగవంతుడి దయవల్ల కానీయండి. ఎంత మంచి దా ముసలమ్మ!" అంటూ మస్లోవా మందహాసం చేసింది.

"ఇవాళే పీటర్స్‌బర్గు వెళుతున్నాను. త్వరలోనే నీ కేసు అపీలు విచారణకు వస్తుంది. పూర్వపు శిక్ష రద్దవుతుంది."

"రద్దు అయినా, కాకపోయినా వొకటే ఇప్పుడు."

"ఇప్పుడు-అన్న మాటలో భావం?"

"మరి..." ఆమె అతని ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

ఆమె వుచ్చరించిన పదం, చూచిన చూపు అతనికి అర్థమైనాయి. "నువ్వు ఇంకా నీ నిర్ణయానికే అంటిపెట్టుకుని వున్నావా? నా నిరాకరణను అంగీకరించావా?" అని అడుగుతున్నదామె. దానికి అతడు పలికిన జవాబు ఏమంటే—"రద్దు అయినా కాకపోయినా నేను వొకటేనంటున్నాను.

ఎందువల్లనో నాకు అర్థం కావటంలేదు. నాకు మాత్రం నువ్వు విడుదల అయినా, కాకపోయినా ఒకటే కావచ్చు. ఏమైనా నేను ఇదివరకు చెప్పి నట్లు చేసి తీరుతాను" అన్నాడు నిష్కర్షగా.

"మీరు అలా అనకండి."

"నీవు తెలుసుకోవాలని చెబుతున్నాను."

"ఆ విషయమై జరుగవలసిన వాదం అంతా అయింది. ఇంకా చెప్పే దేమీ లేదు" అన్నది మస్లోవా అతి కష్టంమీద చిరునవ్వు ఆపుకొంటూ.

ఆసుపత్రుల్లోనుంచి అరుపు వినవచ్చింది. ఒక బిడ్డ బిగ్గరగా ఏడుస్తోంది.

"నే నిక వెళ్ళాలనుకుంటాను" అన్నది మస్లోవా వెనక్కు తిరిగి చూస్తూ.

"సరే; నేనూ వెడతాను."

అతడు చాచిన హస్తాన్ని చూడనట్లుగా నటించి ఆమె వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది—అనుభవించిన హృదయవేగాన్ని దాచుకునేందుకు ప్రయత్నిస్తూ.

"ఆమె ఆలోచన ఏమిటి? భావాలు ఎలాంటివి? ఆమె నన్ను పరీక్షిస్తోందా? నిజంగా నన్నామె క్షమించలేదా? తన ఆలోచనలను, భావాల్ని చెప్పలేకపోతున్నదా? చెప్పటానికి ఇష్టంలేదా? ఆమె హృదయం మెత్తపడిందా? కఠినత్వాన్ని తాలుస్తున్నదా?" ఇన్ని ప్రశ్నలు తోచాయి నెఖ్లూడోవు. కాని ఒక్కదానికీ జవాబు దొరకలేదు. ఆమెలో ఏదో ప్రముఖమైన మార్పు వస్తున్నమాట మాత్రం నిజమే. ఈ మార్పు అతన్ని ఆమెకు మరింత సన్నిహితుణ్ణి చేస్తుంది. ఈ సన్నిహితత్వం అతనికి ఆహ్లాద కారణం అయింది.

మస్లోవా తిరిగి పిల్లల వార్డులోకి వెళ్ళింది. ఎనిమిది తొమ్మిది పక్కలు ఉన్నాయక్కడ. నర్సు ఆజ్ఞానుసారం ఒక పక్కను సరిచేస్తున్నది మస్లోవా. వంగి దుప్పటి సర్దేస్తున్నప్పుడు కాలు జారింది. పడిపోయేంత పని జరిగింది.

మెడమీద తగిలిన గాయానికి కట్టు కట్టించుకుని ఆ చేరువనే పడి వున్న ఒక కుర్రవాడు పక్కున నవ్వాడు. మస్లోవా కూడా ఆపుకోలేక

పెద్దగా నవ్వింది. దానితో నవ్వు జాడ్యం వ్యాపించి అక్కడి పిల్లలంతా పకపకా నవ్వారు. లేడీ డాక్టరు అందరినీ కోపగించుకుని మస్లోవాను కాస్త మందలించింది. "దేనికా పకపకలు? జైల్లో ఉన్నట్టుగానే అనుకున్నా వేమిటి? వెళ్ళి పిల్లలకు ఆహారం పట్టుకురా."

మస్లోవా మరి మాటాడలేదు. కాని తిరిగి వెళ్ళిపోతూ ఆ రెండవవాడి గాయంగల కుర్రవాణ్ణి చూసి మరొకసారి అప్రయత్నంగా నవ్వింది.

ఒంటరిగా ఉన్నప్పుడల్లా మస్లోవా ఆ కవరులోనుంచి ఫోటోను కొద్దిగా ఇవతలకు లాగి తడవ తడవకూ చూసుకుంటుంది ఆప్యాయంగా. నర్సు తను ఒక గదిలోనే ఉంటున్నారు. పని అయ్యాక అక్కడికి పోయి ఆమె కవరులోనుంచి పూర్తిగా బైటికి తీస్తుంది ఫోటోను. నిశ్చలంగా కూర్చుని అందులోని ప్రతి అంశాన్నీ చూస్తూ కూర్చుంటుంది. వరండా మెట్లు, తన వెనకాల ఉన్న పొదలు, ఆయన మేనత్తల ముఖాలు, ఆయన ముఖం, నాడు ధరించి ఉన్న దుస్తులతీరు, ముఖ్యంగా తాను, తన యవ్వనాంకితమైన ముఖం, ముఖంమీద దోబూచులాడుతున్న ముంగురులు—అన్నీ చూసి మెచ్చుకుంటుంది. ఒకసారి అలా తదేకంగా చూస్తూ కూర్చున్నప్పుడు వెనుక నుంచి నర్సు వచ్చింది. కాని మస్లోవా గమనించలేదు.

"ఆ మనిషి పోయిందిగదూ! ఇదెవరూ? నువ్వేనా?" అని అడిగింది ఆ లావుపాటి శరీరంగల నర్సు వంగి చూస్తూ.

మస్లోవా ఆమె ముఖంలోకి చూసి నవ్వుతూ "మరెవరను?" అన్నది.

"అది అతనేనా? అక్కడున్నది అతని తల్లి కాదేం?"

"కాదు మేనత్త. నా బొమ్మ గుర్తుపట్టగలిగావే!"

"అప్పటికీ ఇప్పటికీ చాలా మారిపోయావు. ఇది పది సంవత్సరాల క్రిందటి ఫోటో అనుకుంటాను."

"పదేమిటి? నూరు సంవత్సరాల క్రిందటిది" మస్లోవా ముఖంలోని ఆనంద రేఖలు మాయమైనాయి. విషాదచ్ఛాయ ఆవరించుకొచ్చింది.

"నీవు చాలా తేలికైన జీవితం గడిపావనుకుంటాను."

"ఔను. తేలికైనదే. నరకంలాన్నా నికృష్టమైనది."

"ఏం, ఎందువల్ల?"

"ఎందువల్ల! ఎనిమిది మొదలు తెల్లవారు ఝామున నాలుగింటిదాకా; ప్రతి రాత్రీ అంతే."

"ఎందుకు మార్చుకోలేదూ?"

"మార్చుకో దలుచుకున్నా మార్చుకోలేం. మాటలవల్ల ప్రయోజనం ఏమిటిలే" అంటూ మస్తానా చివాలున లేచింది. ఫొటోను డ్రాయరులో విసిరివేసింది. కోపం మిక్కుటమై పొర్లివచ్చే కన్నీళ్ళు బలవంతాన ఆపుకుంటూ చర్రున బైటికి పోయి తలుపు దభీమని మూసివేసింది.

ఫోటో చూస్తున్నంతసేపు ఆమె ఆ దినాలను స్మరించుకుంటూ ఉంది. అప్పటి సుఖాన్ని జ్ఞాపకం చేసుకుంది. మళ్ళీ అతనితో పొందగల సుఖాన్ని ఊహించుకుంది. కాని నర్సు కదలించిన విషయాలవల్ల తన ప్రస్తుత స్థితి జ్ఞాపకం వచ్చింది. పూర్వచరిత్ర స్ఫురణకు వచ్చింది. గతజీవితపు కుళ్ళుఅంతా కన్నుల గట్టినట్లు అయింది. అప్పటి నికృష్ట స్థితిని గుర్తించుకోను ధైర్యం ఎప్పుడూ కలగలేదామెకు. కాని అస్పష్టంగా అనుభవిస్తూనే ఉండేది.

గత జీవితంలోని ఆ భయంకర రాత్రులు కన్నుల గట్టినట్లున్నాయి. ముఖ్యంగా ఒక పండుగనాటి రాత్రి. తన్ను డబ్బిచ్చి అనుభవించటానికి వస్తానన్న ఒక విద్యార్థికోసం ఎదురు చూస్తూ కూచుంది. తలలో ఎర్రటి రిబ్బన్. సిల్కు దుస్తులు ధరించింది. తాగిన సారాయం ఆ గస్తులమీద పడి అక్కడక్కడ మరకలైంది. సారాయం మత్తులో అలసి సొలసి వుంది. వచ్చిన మగాళ్ళు నాట్యం చూసి, సంగీతం విని వెళ్ళిపోయారు. రాత్రి రెండు గంటలైంది. కాసేపు పియానోవద్ద విశ్రాంతిగా కూచుంది. పియానో వాయించే పిల్ల కూడా అక్కడే వుంది. ఆమెతో ఈ జీవితపు రోత చెప్పుకుంది. పియానో వాయించే పిల్ల కూడా తనకున్నూ ఇలాంటి బ్రతుకు అసహ్యంగానే ఉందనీ, మార్చుకోవాలనుకుంటున్నాననీ చెప్పింది. అప్పుడే బెర్తా కూడా అక్కడికి వచ్చింది. ముగ్గురూ కలసి ఇలాంటి జీవితానికి ఇంతటితో స్వస్తిచెబుదామని నిశ్చయించుకున్నారు. ఈ రాత్రి ఇంతటితో సరి అనుకున్నారు. ఆ చోటు విడిచేసి వెళ్ళిపోడానికి సిద్ధపడ్డారు. కాని ఇంతలో సారాయపు మత్తు సూచించే కంఠధ్వనులు వెనుక గదిలోనుంచి వినిపించాయి. వెంటనే ఫిడేలు మోగింది.

పియానో వాయించేపిల్ల చకచకా వేళ్ళు కదుపుతూ ఆ రాగ గీతం వాయించింది. ఒక పొట్టివాడు—తెల్లని నెక్టై వేసుకున్నాడు; మెత్తని కోటు విప్పేసి, ముందుకు వచ్చి మస్లొవాను పట్టుకున్నాడు. అతని ఒంటి నిండా సారాయం కంపు. ఇంకో లావుపాటి పురుషుడు—పొడుగైన గడ్డం ఉంది అతనికి—గబగబా వచ్చి బెర్తాను కావిలించుకున్నాడు. తరువాత చాలా సేపటివరకూ నాట్యం చేశారు, రాగాలు పాడారు; కేకలు వేశారు; తాగారు...ఇలా ఇంకో సంవత్సరం సాగిపోయింది; మరో సంవత్సరం కూడా గడిచింది; ఇంకో సంవత్సరమున్నూ. ఎలా మార్పు లేకుండా గడుస్తుంది జీవితాన్ని? దీనికంతకూ కారణం ఆయనగారు!

మస్లొవాకు పూర్వం అతనిపై రేగిన కోపం అంతా పునః రగులుకుంది. కసితీర తిట్టిపెయ్యాలనిపించింది ఆసుపత్రికి వచ్చినప్పుడు అనాల్సిన నాలుగు మాటలూ అనేసివుంటే బాగుండిపోయేదనుకుంది.

"నీ సంగతి నాకు తెలుసును పో. నీవు లొంగుతాననుకున్నావా? శారీరకంగా ఉపయోగించుకున్నావు. ఆధ్యాత్మికంగా కూడా ఉపయోగించుకో చూస్తున్నావు. సాగనియ్యను" అని చెప్పేసి ఉంటే బాగుండేది.

తనమీదే తనకు జాలికలిగింది. ఈ దైన్యాన్ని, అతని మొదల కోపాన్నీ ఉపశమింప జేసుకునేందుకు కాస్త సారాయం త్రాగాలనుకుంది. జైల్లోనే ఉండినట్టయితే తానిచ్చిన మాట నిలుపుకోలేకపోయేదే. కాని ఇక్కడ డాక్టరుకు అర్జీ పెట్టుకుంటేనేగాని సారాయంగాని, అలాంటి పానీయం ఏదిగాని దొరకదు. కాని అతనంటే ఆమెకు భయం. అదీగాక పురుషులతో ఏ విధమైన దగ్గర సంబంధం పెట్టుకోవటమూ ఆమెకిప్పుడు ఇష్టంలేదు. చాలాసేపు అక్కడ వరండాలోనే కూచుండి, చివరకు లేచి గది లోకి వెళ్ళింది. నర్సు! అనునయ వాక్యాలనేమీ వినిపించుకోకుండా చాలా సేపు తన గత జీవిత కల్మషాన్ని తలుచుకుంటూ ఏడ్చింది.

౧౪

నెఖ్లూడొ పీటర్స్‌బర్గులో సానుకూలంగా చేసుకురావలసిన పనులు నాలుగున్నాయి. మస్లొవా తరఫున పిటిషన్ సెనేట్‌లో దాఖలు చెయ్యాలి. థియొడోసియా కోరికలు రెండింటిని నెరవేర్చాలి. ఆమె మిత్రరత్నమైన వస్ట

వారు జైలునుంచి విడుదల చేయబడుతున్నా, ఇక కొన్ని జైళ్లలో వున్న తన వాడు కును చూడ్డానికి అనుమతిని సంపాదించలేకపోయాడు. ఇక నాలుగోసని: మత ద్రోహాలుగా పరిగణింపబడి కఠినమైన పస్నాతి ప్రాంతానికి ప్రవాస శిక్ష విధింపబడినవారి విషయాల్లో. ఈ కేసులు నిర్ణయించబడకుండా ఒక్కొక్కరుస్తా నని వాళ్ల బంధుమిత్రులకు మాట యిచ్చి వచ్చాడు.

ఇటీవల పల్లెటూళ్ళలో తిరిగి వచ్చిన నాటినుంచీ పట్నంలోని సంఘ వ్యవస్థ అంటే అసహ్యం కలిగింది. లక్షలాది సాధారణ ప్రజల కష్టాల్ని, బాధల్ని మరుగుపరిచే వ్యవస్థ! అల్పసంఖ్యాకులకు ధనవంతులకు విశ్రాంతిని ఆనందాన్ని కల్పిస్తున్న వ్యవస్థ! ఈ ధనవంతులు ఆ బీదల కష్టాల్ని మాడరు; చూసే అవసరం లేదు; తమ దుర్మార్గాల్ని, క్రూరకృత్యాల్ని తెలుసుకోలేరు. ఇటువంటి సంఘంలో మెలగటం నెఖ్లూడోవు కష్టమనిపించింది. మెలగవలసి వచ్చినందుకు తన్ను తాను నిందించుకున్నాడు. ఇటువంటి సంఘంలోనే తనకు చుట్టాలున్నారు; స్నేహితులున్నారు. ఈ బంధాలన్నీ అతణ్ణి లాగుతున్నాయి మరి! తన అలవాట్లు కూడా ఆ సంఘం ఆజ్ఞలోనే ఏర్పడినవి. అదీగాక ఆ సంఘంలో చేరుతున్న వ్యక్తుల సహాయాన్ని సంపాదిస్తేనే తప్ప మస్లోవానూ, తదితర దీనజనాన్నీ రక్షించే అవకాశం లేదు. కాని మరి ఆవ్యక్తులంటే అతనికి గౌరవం లేదుగదా? వాళ్ళను అనేకసార్లు ఏవగించుకున్నాడు, అసహ్యించుకున్నాడు.

పీటర్స్‌బర్గులో పినతల్లిగారింట్లో బస. ఆమె తన తల్లికి చెల్లెలు. ఆమె భర్త మాజీ మంత్రి; ఒక జమీందారు. అంటే పక్కా ధనికవర్గంలో వచ్చి పడ్డాడన్న మాట. నెఖ్లూడోవు అసహ్యంగానే ఉంది. కాని తప్పనిసరి అయింది. ఎక్కడైనా హోటలులో బస చేద్దామంటే ఆమెకు కోపం రావచ్చు. పైగా ఆమెకు పెద్ద పెద్ద పరిచయాలున్నాయి; తన వ్యవహారాల్లో ఆమె సహాయం ఎక్కువగా ఉండవచ్చుననే ఆశ. ఆమె ఒక జమీందారు భార్య కూడాను.

"ఏమిటబ్బాయి! నిన్ను గురించి చాలా విచిత్రాలు విన్నానే!" అన్నదామె నెఖ్లూడో రాగానే కాఫీ యిచ్చి.

"ఎబ్బే, ఏమీలేదమ్మా."

"ఏమిటా వేశ్యా సంపర్కం? స్త్రీతో ఉంటున్నావట. నెల నెలకు సాయం చేస్తున్నావట. అలాంటి వాళ్లను నమ్మితే ఎలాగో. అయితే నీ వ్యాసంగంలో వాళ్ళ ఇంటి ప్రసక్తి కూడా ఉన్నట్టు తెలుస్తున్నది. అంతా వివరంగా చెప్పు నాయనా!"

నవ్వాడు, తనమనసుల సంగతి వ్యాసాలన్నీ సాకల్యంగా చెప్పాడు నెహ్లూడో.

"ఔనౌను; మీ అమ్మ చెప్పగా విన్నాను. అది నీ మేనత్తలతో ఉంటూ ఉన్నప్పటి కథ కాదూ! నీ మేనత్తలు నీకు ఆ పరిత్తైన కట్టాలని చూశారనుకుంటాను."

ఈ మేనత్తలంటే ఈ పినతల్లికి ఇష్టముండేది కాదు, నెహ్లూడో తండ్రి వైపు చుట్టాలు కావడంచేత. ఈ పినతల్లికి 60 సం॥ వయస్సు. అయినా బలిష్టంగా ఉంది, ముఖం వికాసవంతంగానే ఉంది. వాగుడెక్కువ. నల్లని నూగు మీసం స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. మంచి పొడగరి పొడుక్కు తగిన లావుంది. ఆమె అంటే నెహ్లూడోకు చాలా ఇష్టం. చిన్న తనంలో ఎక్కువగా ఆమె చలాకీతనంచేతా, హాస్యప్రియత్వంచేతా ఆకర్షితుడయ్యే వాడు.

"అదంతా ఇప్పుడేమీ లేదు. కేవలం ఆమెకు సహాయం చేయాలని మాత్రమే నా కోరిక. ఆమె నిరపరాధి. ఆమె ప్రస్తుతదుస్థితికి కారణం నేను. ఆమె కిప్పుడు చేతనైన సాయం చేయుటం నా ధర్మం."

"మరి నువ్వామెను పెళ్ళి చేసుకుంటావని కూడా విన్నానే!"

"ఔను; నేను అలానే అనుకున్నాను. కాని ఆమె కిష్టంలేదు."

ఆమె మౌనముద్ర వహించి, కనుబొమ్మలెత్తి, ఆశ్చర్యంగా అతనికేసి చూసింది. మరుక్షణమే ఆమె ముఖవైఖరి మారింది. "బాగుంది; ఆమె నీ కన్నా తెలివైన మనిషి. నీకు బుద్ధిలేదురా అబ్బాయి! నువ్వు ఆమెను పెండ్లాడాలనే?"

"ఔను. ఖచ్చితంగా."

"ఆమె ఇలాంటి స్థితికి దిగజారిన తరువాత కూడానా?"

"ముఖ్యంగా అందువల్లనే. అందుకు కారణం నేనే గనుక"

చిరునవ్వు ఆపుకుంటూ ఆమె అన్నది: "భేష్, భలే తెలివితక్కువ పెద్దమ్మవు. అంత తెలివితక్కువ పెద్దమ్మవు కాబట్టే నీమీద నాకంత అపేక్ష. సరే; నీకు తెలుసా ? ఎంత గొప్ప అవకాశం ! ఎలీనా ఒక శరణాలయం స్థాపించింది; పడుపు వృత్తి గడిపి పశ్చాత్తాప పడిన యువతులకు. ఇటీవలే వెళ్ళి వచ్చాను అక్కడికి. దాన్ని అక్కడ పెడదాం—అంటే మీ ఆవిడను."

"కాని ఆమెను సైబీరియాకు పంపించేస్తున్నారు. ఆమె తరఫున అపీలు చేయటానికే వచ్చాను. నిన్ను నేను కోరగల కోర్కెలలో ఇదొకటి."

"అరె, ఎక్కడా అపీలు ?"

"సెనేటులో."

"ఊం. సెనేటులోనా ? నా పెత్తండ్రిగారి కొడుకు లియో ఉన్నాడు గాని అతనిది న్యాయశాఖ కాదే.

మరింకెవర్నీ నేను ఎరగను సుమీ ! అంతా జర్మన్ ఉద్యోగస్థులు ఉన్నట్టున్నారు. అయితే ఏంలే. మా ఆయనగారితో చెబుతాను. ఆయనకు వాళ్ళంతా తెలుసును. ఆయనతో చెబుతాగాని విషయం అంతా నువ్వే వివరంగా చెప్పుకోవాలి. నేను చెబితే ఆయనకు అర్థంకాదు. నే నేమి చెప్పినా ఆయన అర్థంకాలేదంటారు; అందరూ అర్థంచేసుకుంటారు, అదేమి కర్మమో, ఆయనకే అర్థంకాదు"

ఇంతలో దౌవారికుడొకడు ఉత్తరం తెచ్చి యిచ్చాడు.

"ఇదుగో ఎలీనా దగ్గర్నుంచే. కీస్‌వెటర్‌తో సంభాషించే సదవకాశం నీకు లభిస్తుంది."

"కీస్‌వెటర్ ఎవరు ?"

"కీస్‌వెటర్ ! అతడు ఎంత గొప్పగా మాటాడుతా డనుకున్నావేమిటి? రాతిగుండె నేరస్థులైనాసరే ఆయన మాటలు వింటే కరిగిపోయి, అప్పటి కప్పుడు పశ్చాత్తాపాశ్రువులు విడుస్తారు. మీ ఆవిడ అతని ఉపన్యాసం విన్నదంటే మంచి దారికి వచ్చేస్తుంది. సాయంత్రానికి ఇక్కడే ఉండు. విందువుగాని. అతడొక అద్భుతమైన వ్యక్తిలే"

"నా కటువంటి కుతూహలం లేదు."

"కాని విన్నావంటే మెచ్చుకుంటాను. తప్పకుండా సాయంత్రం రా. ఇంకో కోరికేమిటి ? బయటపెట్టు, దాపరిక మెందుకు ?"

"కోటలో కాస్త పనివుంది."

"కోటలోనా ? క్రీగ్స్‌మత్ దొరగారికి ఉత్తరం రాసి యిస్తాను. అతడు చాలా గొప్పవ్యక్తి. అయినా నీ కాయన తెలుసు ననుకుంటాను. మీ నాన్నకు, ఆయనకూ మంచి స్నేహం ఉండేది. కాస్త ఆధ్యాత్మిక విచారం గలవాడు. అయినా నీకేంకావాలి అక్కడ ?"

"జైల్లోవున్న ఒక కొడుకును చూడ్డానికి వొకమ్మకు అనుజ్ఞ కావాలి. ఇందుకు క్రీగ్స్‌మత్‌ను కాదు, చెర్వియాన్‌స్కీని ఆశ్రయించాలన్నారే"

"చెర్వియాన్‌స్కీ అంటే నాకు అసహ్యం. అయినా అతడు మేరియటీ భర్త. ఆమెతో మాటాడదాం. ఈ మాత్రం చేసిపెడుతుందిలే. మంచి మనిషే."

"కారణం చెప్పకుండా జైల్లో వేయబడిన వొక స్త్రీ తరఫున కూడా పిటిషన్ దాఖలు చేయాలి. నేను వచ్చిన పనుల్లో అదొకటి.

"నేరస్థులకు కారణం బాగానే తెలిసి ఉంటుంది. ఎందుకు తెలియదబ్బాయి ! వాళ్ళకటువంటి శాస్తి జరిగితీరాల్సిందే."

"జరగాలో, జరగనక్కర్లేదో నాకు తెలియదు. కాని అక్కడవాళ్లు యమయాతన లనుభవిస్తున్నారు. నువ్వు క్రీస్తు మతస్థురాలివి. బైబిలు పారాయణ చేస్తున్నావు. నీకు జాలి అన్నమాటే లేదే !"

"నేను బైబిలు చదవటానికీ అటు వాళ్ళమీద జాలిపడటానికీ సంబంధం ఏమిటి ? బైబిల్ బైబిలే, దుర్మార్గులు దుర్మార్గులే. అందులోనూ-తప్పుడు పనులుచేసి జైల్లోపడ్డ ఆడవాళ్ళమీదనా జాలిపడమంటున్నావు ?"

"ఎందుకు జాలిపడవూ ?"

"అలెగ్జాండరు చక్రవర్తి హత్య జరిగిన తరువాత కూడా అలా అడుగుతున్నావా ?"

మతిచెడిపోయిందతనికి... విన్నారా? కమెన్స్కీతల్లి పరిస్థితి బాగులేదట. ఆమె జీవించదని భయపడుతున్నారు."

"నువ్వు అక్కడికి వెళ్ళిచూచి రావాలి" అన్నాడామె భర్త.

"ఔను, చాలా విచారకరమైన పరిస్థితి."

"వెళ్ళి అతనితో మాటాడిరా. ఇంతలో నేను కొన్ని ఉత్తరాలు రాసుకుంటాను."

నెఖ్లూడొవ్ లేచి పక్కగదిలోకి వెళ్ళాడు. కాని పినతల్లి మళ్ళీ అతన్ని పిలిచింది. "మేరియట్‌కి ఉత్తరం రాయనా?" అని అడిగింది.

"దయచేసి అలాగే..."

"నీ ఆడఖైదీ విషయంలోమాత్రం నేనేమీ సిఫార్సు చెయ్యను. మేరియట్ తన భర్తతో చెబుతుంది. ఆయన ఏదో చేస్తాడు. నన్ను దుర్మార్గురాలనుకోకు సుమా! వాళ్ళంతా అసహ్యకరమైన వ్యక్తులు. సరే, ఇక వెళ్ళు. కాని రాత్రికి కీస్‌వెటర్ ఉపన్యాసం వినటానికి తప్పకుండా రావాలి సుమా! తరువాత ప్రార్థనలుకూడా ఉంటాయి. వచ్చావంటే నీ వొంటికీ, యింటికి మేలు కలుగుతుంది. నీ తల్లీ, నువ్వూ ఇటువంటి విషయాల్లో చాలా వెనుకపడివున్నారు. ప్రస్తుతానికి వెళ్ళిరా!"

## ౧౫

ఫ్రిఖేలిచ్ మాజీమంత్రి. కొన్ని స్థిరమైన ఊహలు కలవాడు. పిట్టలకు రంగురంగుల యీకెలు వుండటం, అది పురుగులను తినటం, గాలిలో ఎగరటం కేవలం సహజములు. అలాగే ఎక్కువజీతాలు పుచ్చుకునే వంటవాళ్ళు తయారుచేసే విలువైన మంచిమంచి కూరలు ఆరగించటం; ఖరీదుగల సుఖకరమైన దుస్తులు ధరించటం; వడిగల గుర్రాలమీద స్వారిచేయటం— ఇవన్నీకూడా తనకు సహజమని ఆయన భావిస్తాడు. అవన్నీ అందుచేత తనకు సర్వదా సిద్ధంగా ఉండాలని ఆయన కోరిక. అనేకవిధాలుగా ట్రెజరీలోనుంచి ధనం తనయింట్లో వచ్చిపడుతూవుండాలి. వీలైనంత అధికారం చెలాయిస్తూ ఉండాలి. తరచుగా సంఘంలో పై అంతస్తుకు చెందిన స్త్రీపురుషులతో సంభాషిస్తూ ఉండాలి.

అంతే ఆయాసం కావలసింది. మిగిలినవన్నీ అతనివ్యక్తిగత అల్పములు, నియమాలు-ఇలాంటి ఊహాలతో, తాదసుకున్యాంగా నలభై యేళ్లు గడిపాడు. తరువాత మంత్రి అయినాడు. ఈ పదవిని అతడు పొందుటకు సాయంచేసిన యోగ్యతలు ఏమంటే—

ఒకటి: దస్త్రాలూ, చట్టాలు బాగా చదివి అర్థం చేసుకుంటాడు; ఏదోవిధంగా మొత్తానికి ఎక్కువ తప్పులు లేకుండా ప్రభుత్వ పత్రాలు రాస్తాడు. రెండు: అతని విగ్రహం గర్వసూచకంగా, ఠీవిగా, దురాసదంగా ఉంటుంది; అవసరమైతే అతి నిక్కచ్చి బానిసగ్గా సూచకంగానూ కూడా ఉండగలడు. మూడు: వ్యక్తిగతంగానూ, రాజకీయంగాను అతన్ని బంధించే నైతికసూత్రాలేమీ లేవు. కనుక సమయాన్నిబట్టి ఒకరు చెప్పింది ఔనంటాడు, లేదా కాదంటాడు. అతడు చెప్పేమాటల్లోనూ, చేతల్లోనూ వ్యాఘాతాలు ఉన్నా అతనికేం ఫరవాలేదు. మొత్తంమీద తనొక కులీనుడన్నట్టు ప్రవర్తిస్తూ ఉంటే అతనికి చాలు. తను చేసేపనులు రష్యన్ సామ్రాజ్యానికి గాని, ప్రపంచానికి గాని మహోపకారం చేస్తున్నాయో, మహోపద్రవాన్నే తెచ్చిపెడుతున్నాయో— ఆ రకమైన ఆలోచన తనకేమీ అక్కరలేదు.

అతడు మంత్రి అయినప్పుడు అతనిమీద ఆధారపడివున్నవాళ్లు (అట్టివాళ్ళు చాలామంది వున్నారు), బంధువులూ, తదితరులు, అతడు చాలా తెలివైన రాజకీయవేత్త అని విశ్వసించారు. తానూ అలాగే విశ్వసించాడు. కాని కొంతకాలం గడిచింది. మంత్రిపదవిలో వుండి అతడు చేసిందేమీ లేదు. బ్రతుకుతెరువుకైన పోరాటంలో అతనిలాగే ఏ ఆశయాలూ లేని— డాక్యుమెంట్లు అర్థంచేసుకోటం, రాయటం తెలిసిన-ఠీవి, ఒడుపుగల కొందరు ఆయన్ని పదవీభ్రష్టుణ్ణి చేశారు. అప్పుడందరూ సంకుచితబుద్ధి గలవాడు, చదువు సంధ్యలు బాగా రావు, గర్వపోతు, ఉన్నతమైన ఊహాలు కలవాడేమీ కాదు అని అనుకున్నారు. ఇతని స్థానం ఆక్రమించిన ఆ చదువురాని గర్వపోతులకన్నా ఇతనిలో ఉన్న అధిక్యత యేమీలేదని తెలిసిపోయింది. ఆ సంగతి తనూ తెలుసుకున్నాడు. కాని ప్రతిసంవత్సరమూ ట్రెజరీలోనుంచి (ప్రభుత్వపు బొక్కసం) తనకు పెద్దమొత్తం వచ్చితీరాలి అన్న సిద్ధాంతాన్ని మాత్రం విడిచిపెట్టలేదు. ప్రభుత్వ సంస్థలో కొంతకాలం ఉండినందున

కొన్ని కమిటీల అధ్యక్షుడైనందువా జీతం రూపేణా కొంత, పెన్షన్ రూపేణా కొంత, కాజేస్తున్నాడు. ఇవ్వకుండా నిలిపివేసే తాహతు ఎవ్వరికీ లేదు. కాగా అతనికి పెద్దపెద్దవాళ్ళతో సంబంధాలు ఉన్నాయి.

అతడు నెక్లాడో చెప్పినమాటలన్నీ విన్నాడు—డిపార్టుమెంటు సెక్రటరీ మాటలు విన్నట్టు-అంతా విని ఇద్దరు ప్రముఖవ్యక్తులకు ఉత్తరాలు రాసి ఇస్తానన్నాడు. రెండింటిలో ఒకటి పూల్సుగారికి. ఆయన ఒక సెనేటు సభ్యుడు. ఆయనది అపీలుశాఖ.

"సాధారణంగా అన్ని వ్యవహారాలు ఆయనే చూస్తూఉంటాడు. చాలా పెద్దమనిషి. నా మాట కాదనలేడు. చేతనైనంత చేసి తీరుతాను" అని చెప్పాడు.

రెండో ఉత్తరం పిటిషన్ కమిటీలోని పలుకుబడిగల ఒక ప్రముఖ సభ్యునికి. థియోడోసియా కథను నెక్లాడో చెబుతూంటే మాజీమంత్రి శ్రద్ధగానే విన్నాడు. ఈ విషయమంతా మహారాణికి తెలుపుతూ రాస్తానని నెక్లాడో అన్నాడు. అది చాలా విషాదకరమైన గాథేనని మాజీమంత్రి అంగీకరించాడు; అవకాశం దొరికినప్పుడు మహారాణికి చెబుతానన్నాడు; కాని ఖచ్చితంగా వాగ్దానంమాత్రం చెయ్యలేనన్నాడు. పిటీషన్ నేరుగా మహారాణికే గాక ఆఫీసుల ద్వారానే వెళ్ళాలి. వచ్చే గురువారంనాడు పిటిషన్ కమిషన్ సమావేశమయ్యేట్లయితే మహారాణితో తానుకూడా చెబుతానన్నాడు. మేరియటీకి తన మేనత్త రాసియిచ్చిన ఉత్తరమూ, మాజీమంత్రిగారిచ్చిన ఉత్తరాలూ తీసుకుని బయలుదేరాడు నెక్లాడో.

మొదట మేరియటీ ఇంటికి వెళ్ళాడు. ఆమె నతను చిన్నతనంలో ఎరుగును. అంత గొప్ప ధనవంతులు కాకపోయినా కులీనుల ఇంట్లో పుట్టింది. ఆమె భర్తను గురించి పొక్కిన వార్తలు చాలా విన్నాడు. అయితేనేం ? పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. తాను గౌరవించలేని ఒక వ్యక్తినుంచి ఒక మేలును అర్థించటం మనస్సుకు కించగానే ఉంది. అదీగాక ఇటువంటివాళ్ళ సంఘంలో ఉండటం తనకు ఇష్టంలేదు. తాను కూడా అట్టి సంఘంలోని వాడేనని వాళ్ళంతా అనుకుంటూ ఉన్నారు. మళ్ళీ ఈ సంఘపు అవినీతి వాతావరణానికి తాను లొంగిపోతున్నట్టు అనుభవిస్తున్నాడు. పినతల్లితో

మాట్లాడుతున్నప్పుడు ఇట్టి అనుభవం కలిగింది. పీటర్స్‌బర్గులోని వాతావరణం శారీరక ఉత్సాహాన్ని కలిగిస్తున్నది. నైతిక స్తబ్ధతను కలిగిస్తున్నది.

అంతా హాయిగా, పరిశుభ్రంగా, సుఖవంతంగా ఉన్నట్టు కనిపిస్తున్నది నైతిక విషయాల్లో ప్రజలకు పట్టింపుగల లేదు. తేలిక జీవితం పరుగులు పెడుతున్నది.

పరిశుభ్రమైన దుస్తులు ధరించిన ఒక బండివాడు నెఖ్లూడోవ్‌ను బండిలో ఎక్కించుకుని పెద్ద పెద్ద చక్కని వీధులగుండా, మేరియటీ యింటికి తీసుకుపోయాడు. ఇంటిముందు జోడు గుర్రాలబండి ఆగి ఉంది. బండివాడు బుగ్గల మీద పడేలాగు జులపాలు దువ్వుకుని, కొరడా పట్టుకుని నిల్చున్నాడు.

డవాలు వేసుకున్న దౌవారికుడు నెఖ్లూడోవ్‌ను చూసి "అమ్మగారిని గాని, అయ్యగారినిగాని ఎవర్నీ ఇప్పుడు కలుసుకోలేరు. బైటికి వెళ్ళిపోబోతున్నారు" అని చెప్పాడు. నెఖ్లూడోవ్ తిరిగి వెళ్ళిపోబోతున్నాడు. అప్పుడొక సన్నపాటి యువతి మెట్లుదిగి వస్తూండటం చూశాడు. ఆమె ఒక మేలి ముసుగు ధరించింది తలమీద ఈకలటోపీ ఉంది. నల్లటి గౌను తొడుక్కుంది. ఆమె నెఖ్లూడోవ్‌ను చూడగానే మేలి ముసుగు ఎత్తింది. అందమైన ముఖం. ప్రకాశవంతములైన రెండు కళ్లు అతనికేసి ప్రశ్నార్థకంగాచూచాయి. మరుక్షణమే—

"ఓహో, నెఖ్లూడోవ్! నువ్వే?" అన్నది మెత్తని, ఆహ్లాదకరమైన కంఠస్వరం.

"నా పేరు కూడా జ్ఞాపకముందే!"

"ఉండకేం? నేనూ నా అక్కలూ కూడా నిన్ను ప్రేమించాం కదూ! కాని అరె, ఎంత మారిపోయావు? అయ్యో! ఇప్పుడే నేను బైటికి వెళ్ళాల్సి వచ్చిందే! మళ్ళీ పైకి వెడదామా?" అని కాస్త ఆలోచించి, గడియారంకేసి చూసి ఇప్పుడు కమెన్‌స్కీ ఇంటికి వెళ్లాల్సిందే. కమెన్‌స్కీ తల్లి చాలా ప్రమాదస్థితిలో ఉందిట!"

"కమెన్‌స్కీ యెవరు?"

"నువ్వు వినలేదా? కమెన్‌స్కీ ఒక ద్వంద్వ యుద్ధంలో చనిపోయాడు. పోసెన్‌తో పోట్లాడాడు. పాపం ఒక్కడే కొడుకు. తల్లి దుఃఖం చెప్పటానికి వీల్లేదు.

"అలాగా ! కొద్దిగా విన్నాను"

"నే నక్కడికి తప్పకుండా వెళ్లాలి. సాయంత్రంగాని, రేపుగాని తప్పకుండా రావాలి నువ్వు" అంటూ ఆమె ముందుకు సాగింది.

నెక్లూడో ఆమెను అనుసరించి వచ్చాడు. "ఇవాళ సాయంత్రం రావటానికి నాకు తీరదు. నేను నిన్నొక్కటి అడగాలనుకుంటున్నాను" జోడు గుర్రాల బండి ఇంటి ముందుకు తెస్తున్నాడు బండీవాడు.

"ఏమిటది ?"

"మా పినతల్లి దగ్గర్నించి ఉత్తరం తెచ్చాను. అందులో విషయం అంతా ఉంది" అంటూ కవరు తీసి యిచ్చాడు.

"మా వారి వ్యవహారాల్లో నా కేదో పలుకుబడి ఉన్నదని ఆవిడ అనుకుంటుంది. అది పొరపాటు. నే నేమీ చెయ్యలేను; మావారి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవటం నా కిష్టంలేదు. అయినా నీ కోసం, ఆ దొరసాని కోసం ఇష్టంలేకపోయినా చెయ్యాలిగా ! విషయం ఏమిటి ?

"ఒక పిల్లను కోటులో ఖైదు చేశారు. ఆమెకు సుస్తీగా ఉన్నది. ఆమె నిరపరాధి."

"ఆమె పేరు ?"

"షస్టోవా—ఉత్తరంలో రాసి ఉన్నది."

"సరే, చేతనయినంత సాయం చేస్తాను" అంటూ త్వర త్వరగా పోయి బండిలో యెక్కి కూచుంది. బండివాడు గుర్రాల్ని అదలించాడు. బండి కదిలింది. కాని మేరియాటీ బండిని ఆపించి, నెక్లూడో కేసి తిరిగి "మళ్ళీ నువ్వు రావాలిసుమీ ! ఏదో పని ఉంటేనే రావటం, లేకపోతే మానేయటం అలా ఉండకూడదు. ఏం ? అంటూ ఒక చిరునవ్వు నవ్వింది. అలాంటి తన చిరునవ్వు ప్రభావం ఎంతో ఆమెకే తెలుసు. ఆ మాటలు పలికేసి, తెర చాటుకు నిష్క్రమించే నటివలె మేలి ముసుగు దించుకుని బండివానివైపు తిరిగి "తోలేసెయ్యి" అన్నది.

నెక్లూడో కూడా తన దారిని తాను బయలుదేరాడు. ఆ రబ్బరు టైర్ల బండి రోడ్డుమీద మెత్తగా పరుగులు పెడుతోంది. ఎక్కడో మిట్టపల్లాలు వచ్చినప్పుడు మాత్రం గతుక్కుమంటోంది.

## ౧౬

మేరియటీ విసిరిన మందహాసం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నెఖ్లూడొవ్ తల ఊపుతున్నాడు పైకి, కిందికి. "ఈ విలాస జీవిత పద్ధతుల్లోకి ఇట్టే లాగి వేయబడుతున్నాను" అనుకున్నాడు. తను గౌరవించని వ్యక్తుల దగ్గరికే సిఫార్సుల కోసం వెళ్ళటంలో ఉన్న హీన్యాభావం అతన్ని కుంగదీసింది.

ఇంకెక్కడికి వెళ్ళాలి? కాస్త ఆలోచించి సెనేటుకు వెళ్ళాడు. అక్కడ వైభవోపేతమైన ఒక గదిలో చాలామంది ఆఫీసర్లు ఉన్నారు. మస్లొవా తరఫున పిటీషన్ అందిందనీ, దాన్ని పరిశీలించి నివేదిక సమర్పించేందుకు వుల్ఫ్ గారికి పంపించామనీ ఆఫీసర్లు చెప్పారు. మామగారు ఉత్తరం రాసి యిచ్చింది ఈ వుల్ఫ్ గారికే.

"ఈ వారంలో సెనేట్ సమావేశం ఔతుంది. కాని ఏదైనా ప్రత్యేకమైన ఒత్తిడి వొస్తే తప్ప మస్లొవా కేసు విచారణీయాంశాలలో ఉండక పోవచ్చు. అలాంటి ప్రత్యేకమైన ఒత్తిడివస్తే బుధవారంనాడు విచారణకు వస్తుంది" అని ఒక ఆఫీసరు చెప్పాడు.

నెఖ్లూడొవ్ అక్కడ ఆఫీసులో ఉన్నంతసేపు అక్కడి ఉద్యోగస్తులంతా కమెన్‌స్కీ అను యువకుడు ద్వంద్వ యుద్ధంలో చనిపోయిన గాథనే చెప్పుకుంటూ ఉన్నారు. ప్రస్తుతం పీటర్స్‌బర్గులో సంచలనం కలిగిస్తున్న విషయం అదే. దాన్ని గురించి నెఖ్లూడొవ్ సెనేట్ ఆఫీసులో చాలా వివరాలు విన్నాడు. అసలు గాథ ఇది: కొందరు ఉద్యోగస్తులు కూచుని నత్తలు ఫలహారం చేస్తున్నారు. సారాయం కూడా తాగుతున్నారు. ఆ సందర్భంలో ఒకడు కమెన్‌స్కీ పని చేస్తున్న సైనికదళాన్ని గురించి దూషణ వాక్యాలు పలికాడు. కమెన్‌స్కీ కోపం తెచ్చుకుని వాణ్ణి అబద్ధాల పుంక అని నిందించాడు. వాడొక దెబ్బ కొట్టాడు. మర్నాడు ఇద్దరూ పెద్ద యుద్ధం చేశారు. కమెన్‌స్కీకి కడుపుమీద పెద్ద గాయం తగిలింది, చనిపోయాడు. చంపినవాడినీ, అతని సహచరుల్నీ జైలులో పెట్టారు. కాని మరి రెండు వారాలలోనే విడుదలచేస్తారని అంతా అనుకుంటున్నారు.

తరువాత నెఖ్లూడొవ్ వెరుబోవ్ దొరగార్ని చూడ్డానికి వెళ్ళాడు. ఆయన పిటిషన్ కమిటీలో ఒక పలుకుబడిగలసభ్యుడు. ఒక మహాభవనంలో

ఉంటున్నాడు. అది ప్రభుత్వభవనాల్లో ఒకటి. నెల్లాడో రాగానే, కాపలావాడు రవంత నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు—'దొరగారు ఎప్పుడు పడితే అప్పుడు అందరికీ దర్శనం ఇవ్వర'ని. ఆ నాడు ఆయన చక్రవర్తిని సందర్శించేందుకు వెళ్లారట. మర్నాడుకూడా ఏదో ప్రభుత్వ నివేదిక తయారుచేయాల్సిన పని ఉందిట. నెల్లాడో తన పినతండ్రిగారిదగ్గర్నుంచి తెచ్చిన ఉత్తరం కాపలావాడి పరంగా ఇచ్చి, సెనేటర్ వృష్ణను కలుసుకోటానికి వెళ్ళాడు.

వృష్ణ అప్పుడే భోజనంచేసి, తిన్నది బాగా జీర్ణం అయ్యేందుకుగాను గదిలో అటూఇటూ పచార్లు చేస్తూ చుట్ట కాలుస్తున్నాడు. భార్యవైపునుంచి అతనికి సాలుకు పద్దెనిమిదివేల రూబుల్స్ అయివేజువచ్చే ఆస్తి సంక్రమించింది. సొంతప్రయత్నాలవల్ల సెనేటర్ అయినాడు. ప్రయివేటు వ్యక్తులదగ్గర్నుంచి రహస్యంగా లంచాలు పుచ్చుకోటం గౌరవానికి భంగకరమని అతనికి తెలుసు. కాని ప్రభుత్వ కార్యాలన్న నెపాన ఏ ఘోరమైనా చేస్తూంటాడు. అందుకు ప్రతిఫలంగా భృతి, భత్యఖర్చులు మొదలైనవి చాలా పుచ్చుకుంటూనే వుంటాడు. తమ తోడిప్రజల్ని ప్రేమిస్తూన్నందుకు, తమ తండ్రితాతల మతాన్ని నమ్మిస్తున్నందుకు అనేకవందలమందిని జైళ్ళలో వేయటం, ప్రవాసం పంపించటం—ఇలాంటి పనులు నికృష్టమైనవిగా అతను భావించడు—చాలా ఘనమైనవనీ, దేశభక్తి పూరితములనీ అనుకుంటాడు. పోలెండులో గవర్నరుగా ఉండినకాలంలో అలాంటి ఘనకార్యాలు చాలా చేశాడుకూడా. తనభార్యపేర, తనవదినగారిపేర వున్న ఆస్తిపాస్తులను తిన్నగా తనపేర పెట్టించేసుకోటం అతనికేమీ అక్రమంగా కనిపించలేదు. పైగా తన కుటుంబవ్యవహారాలను ఆ రీతిగా చక్కదిద్దుకోటమే తెలివైనపనియని భావించాడు. ఇంట్లో అతనిభార్య, వదినగారు, కూతురు, ఒకకొడుకు ఉన్నారు. వదినగారి భూఆస్తి యావత్తూ అమ్మివేసి ఆ రొఖ్ఖాన్ని తన పేర బ్యాంకులో వేశాడు. కూతురు వట్టి భయగ్రస్తురాలు, కురూపి. అస్తమానం వొంటరిగానే కాలంగడుపుతూ ఉంటుంది. ఎందుకొచ్చిన బ్రతుకా అన్నట్టు వుంటుంది. ఇటీవల ఆమెకు భక్తిమార్గం అలవడింది. నెల్లాడో పినతల్లిగారింటికి వెళ్ళి అక్కడ తరచు సాగుతూవుండే మతవిషయిక సమావేశాలకు హాజరవుతూ ఉంటుంది. ఇకపోతే కొడుకు వట్టి దిప్పకాయ. పదిహేనుసంవత్సరాల వయసప్పుడే గడ్డాలు, మీసాలు వచ్చాయి. త్రాగుడు

అలవాటైంది. చదువు పూర్తిచేయలేకపోయాడన్న నెపాన తండ్రి విసుక్కుంటూవుండేవాడు. ఇదికాక పోకిరీతనమే కాదు, అప్పులుకూడా చేయటం సాగించాడు. ఒకసారి అతడు చేసిన రెండువందల ముప్ఫయిరూపాయల్ని అప్పు తండ్రే తీర్చవలసివచ్చింది. మరికొన్నాళ్ళకు ఐదువందల రూపాయల్ని అప్పు మరొకటి తీర్చవలసివచ్చింది. "ఇక నువ్వు అప్పులు చేస్తే నేను తీర్చేదిలేదు. ఇంట్లోనుంచికూడా వెళ్ళగొట్టేస్తాను" అని హెచ్చరిక చెప్పి తండ్రి ఆ అప్పు తీర్చాడు. కొడుకు తండ్రి హెచ్చరికను పాటించలేదు. తన ప్రవర్తన మార్చుకోనూ లేదు. మరో వెయ్యిరూపాయలవరకూ ఊళ్లో అప్పులు చేశాడు. ఇంట్లో బ్రతుకు తనకేమీ సౌఖ్యంగా లేదని తండ్రితో ధైర్యంగాచెప్పాడు.

"అయితే నువ్వు నా కొడుకువేకాదు. నీ యిష్టంవచ్చిన చోటికి వెళ్ళి బ్రతుకు పో" అన్నాడు తండ్రి. నాటినుంచీ ఊళ్ళో తనకు కొడుకంటూ ఒకడు లేనట్టే ప్రవర్తిస్తున్నాడు. ఎవరూ ఆయన ముందు ఆ కొడుకు విషయమై ప్రసంగించటానికి సాహసించరు. కొడుకును వెళ్ళగొట్టేసి తన కుటుంబ వ్యవస్థను నిష్కళంకం చేసినట్టు ఆయన భావించాడు.

నెఖ్లూడొవ్ రాగానే అతడు పచార్లు ఆపుచేశాడు. వ్యంగ్యభరితమైనా, స్నేహసూచకమైన ఒక చిరునవ్వుతో స్వాగతం ఇచ్చాడు. ప్రతివారిముందూ అట్టి చిరునవ్వుతోనే తన పెద్దరికాన్ని అప్రయత్నంగా ప్రకటించుకుంటూ ఉంటాడు. మామూలు ప్రజలందరికన్నా తాను అధికుడనే అహంభావం ఆ చిరునవ్వులో వుంటుంది.

నెఖ్లూడొవ్ ఇచ్చిన ఉత్తరం అందుకుని చదివాడు. "కూచోండి" అని ఆసనం చూపించాడు. "దయచేసి మీరేమీ అనుకోకండి; నేను ఇలాగే అటూ ఇటూ కాస్త పచార్లు చేస్తూ వుంటాను" అంటూ కోటు జేబుల్లో చేతులు పెట్టుకుని యథాపూర్వంగా ఆ విశాలమైన గదిలో పచార్లు సాగించాడు మళ్ళీ.

"మీ పరిచయం లభించినందుకు సంతోషం. నిఖైలిచ్ కోరికను, ఎట్టిదైనా నెరవేర్చటం నాకు ఆనందం" అంటూ పెదవుల సందునుంచి చుట్ట జాగ్రత్తగా (నుసి క్రింద పడకుండా) తీసి, పొగ ఊదాడు నోట్లోనుంచి బైటికి.

"కేసు తొందరగా విచారణకు వస్తే బాగుంటుందని కోరుతున్నారు—ఒకవేళ ఆ ఖైదీ సైబీరియాకు వెళ్ళవలసి వచ్చేట్టయితే తొందరగా బయలు దేరగలందులకు."

"ఔనౌను. నిజ్నీ నుంచి ముందుగా బయలుదేరే స్టీమరులో వెళ్ళాలిగా! ఆ ఖైదీ పేరు?"

"మస్లోవా."

వుల్ఫ్ టేబిల్ దగ్గరకు వెళ్ళాడు. టేబిల్ మీద కాగితాలు చాలా ఉన్నాయి. ఒక కాగితంతీసి చూచాడు. "ఔనౌను, మస్లోవా! సరే; ఇతర సెనేటర్లతో చెబుతాను. బుధవారంనాడు ఈ కేసువిషయమై ఆలోచిస్తాం" అన్నాడు.

"అయితే వకీలుకు తంతి ఇమ్మన్నారా?"

"వకీలా? ఎందుకూ? పోనీ, ఇస్తే ఇవ్వండి."

"అపీలులో బలం లేకపోవచ్చు. అయినా కిందికోర్టులో విధించిన శిక్ష అన్యాయం అని తెలుస్తుంది."

"ఔనౌను; కావచ్చు. కాని సెనేటు తీర్పు కేసులోని గుణగణాల్ని బట్టి వుండదు. చట్టనిబంధనలను సరిగా అర్థం చేసుకోటం, వాటిని అమలు పరచటం—వీటిమీద ఆధారపడివుంటుంది—" అన్నాడు వుల్ఫ్ చుట్టకొసన ఉన్న మసికేసి చూస్తూ, గంభీరంగా.

"కాని ఇది అన్ని కేసులవంటిది కాదు సుమండీ!"

"నాకు తెలుసు, నాకు తెలుసు. అన్ని కేసులూ అసాధారణములే. మా విధ్యుక్తం మేము చేస్తాము—అంతే." చుట్టచివర నుసి అలానే అంటిపెట్టుకుని వుంది. క్రమేణా ఒక చీలిక యేర్పడింది. జారిపడేట్టుగా వుంది. అది కిందపడకుండా జాగ్రత్తగా పట్టుకుని "మీరు పీటర్స్‌బర్గు తరచుగా వస్తుంటారా?" అని ప్రశ్నించాడు వుల్ఫ్. చుట్టనుసి పడిపోయేట్టుగా వుంది. దాన్ని జాగ్రత్తగా తీసుకుపోయి బల్లమీది పళ్ళెంలో జారవిడిచాడు.

"కామెన్‌స్కీ సమాచారం విన్నారా? భయంకరమైన గాథ కాదూ!... మంచియువకుడు... తల్లికి ఒక్కడే కొడుకు... పాపం!... ఆ తల్లిస్థితి..." అంటూ అప్పట్లోని పీటర్స్‌బర్గులో ప్రతివాడి నోటా వెలువడే మాటలే

అతడూ పలికాడు. తరువాత వుల్ఫ్ మిఖేలిచ్ భార్యను గురించీ, ఆమెకు మతబోధలయెడ గల శ్రద్ధను గురించీ కాసేపు ప్రసంగించాడు. అట్టి మత బోధలయెడ తనకి శ్రద్ధలేదు; అశ్రద్ధలేదు. 'తనవంటి వున్నత పథంలో వున్న వాడికి అటువంటివాటితో పనేమిటి ?' అన్నట్టు కాసేపు మాటాడాడు.

చివరకు నెఖ్లూడో వెళ్ళిపోయేందుకు లేచాడు.

"మీకు తీరికవుంటే బుధవారంనాడు మాయింటికి భోజనానికి రండి. మీ కేసు విషయమై ఇదమిద్ధమని ఆనాడు చెబుతాను.—" అంటూ వుల్ఫ్ చెయిచాచి కరచాలనం చేశాడు నెఖ్లూడోతో. తరువాత నెఖ్లూడో ఎకా రెయికి పినతల్లిగారింటికి వెళ్ళాడు.

## ౧౭

రాత్రి ఏడున్నర గంటలయింది. పినతల్లిగారింట్లో వడ్డనలౌతున్నాయి. నెఖ్లూడో కూడా భోజనానికి కూచున్నాడు. ఆ యింట్లో భోజనవిధానం కొంత నూతనంగా వుంది. పళ్ళాలు, గిన్నెలు భోజనాలతో నింపి అక్కడ బల్లమీద పెట్టి-బైటికి వెళ్ళిపోతాడు వంటవాడు. దొరలు వాటిని ఆరగించిన తరువాత దొరసాని ఒక స్విచ్ నొక్కి గంటమోగిస్తుంది. అప్పుడు వంటవాడు లోనికివచ్చి ఆ పళ్ళాలను, గిన్నెలను తీసుకుపోతాడు. ఇంకా ఆరగించవలసిన ఇతర పదార్థాలను పెట్టుకుని మళ్ళీ పళ్ళాలను, గిన్నెలను తెచ్చి, బల్లమీద పెట్టిపోతాడు. చాలావరకు మగవాళ్ళే పళ్ళాలను జరిపి, ఆడవాళ్ళకు అందిస్తూంటారు. ఆడవాళ్ళు ఏ విధమైన పనీ చెయ్యరు. భోజనం ఆహ్లాదకరంగానే వుంది. సారాయములు మంచి విలువైనవి. వంటవాడు ఒక ఫ్రెంచివాడు. వాడికింద మరిఇద్దరు పనివాళ్ళు. భోజనానికి కూచున్న వాళ్ళు మొత్తం ఆరుగురు—దొరసాని, ఆమెభర్త మిఖేలిచ్, వాళ్ళకొడుకు (సైన్యంలో ఉద్యోగి), నెఖ్లూడో, ఒక ఫ్రెంచిమిత్రుడు, దొరగారి ప్రధాన సేవకుడు. ఇక్కడకూడా ఆ ద్వంద్వయుద్ధంగురించే సంభాషణ సాగింది. చనిపోయిన యువకుని తల్లిస్థితికి చక్రవర్తికూడా దుఃఖించాట్ట. చంపినవాడైనా తన వృత్తిగౌరవాన్ని కాపాడినవాడులాగే భావింపబడుతున్నాడు. అందుచేత చక్రవర్తి అతన్ని తీవ్రంగా శిక్షించబోవటంలేదట! అలాగే చాలామంది ప్రజలుకూడా, హంతకునిమీద కారాలు, మిరియాలు నూరటం లేదట-కాని దొరసాని కాథరైన్ మాత్రం అందుకు ఒప్పుకోలేదు.

"తాగి యిష్టంవచ్చినట్టు యువకులను చంపేవాళ్ళను నేనైతే అసలు క్షమించను" అన్నదామె.

"నువ్వు అనేది నాకర్థం కావటంలేదు" అన్నాడు ఆమెభర్త.

"నా మాటల్ని మీరు అర్థం చేసుకోలేరని నాకు తెలుసు" అంటూ ఆమె నెఖ్లూడోవ్ వైపు తిరిగి – "చూచావా, నా మాటలు అందరికీ అర్థమౌతాయి—మా ఆయనకు తప్ప. ఆ తల్లివిషయమై నేను చాలా విచారపడుతున్నానని చెబుతున్నాను. వాడతన్ని చంపేసి హాయిగావుండటం నాకిష్టంలేదు" అన్నది.

అంతటితో ఆమెకొడుకు ప్రసంగంలో దిగాడు హంతకుని పక్షాన వాదిస్తూ తనతల్లిమాటల్ని తీవ్రంగా విమర్శించాడు. "ఒక సైనికోద్యోగి అయినవాడు అలాగే ప్రవర్తించాలి. మరోరకంగా ప్రవర్తిస్తే పరువుపోతుంది; తోడి ఉద్యోగస్థులు తాటాకులు కట్టి బైటికి గెంటేస్తారు" అని చెప్పాడు. నెఖ్లూడోవ్ ఈ సంభాషణలో చేరలేదు. అంతా వింటున్నాడు మౌనముద్ర వహించి. తానుకూడా కొన్నాళ్ళు సైన్యంలో పనిచేశాడు. అయినా మిఖేలిచ్ కుమారుడు చేసినవాదం అతనికి నచ్చలేదు. ఖైదులో తాను చూచిన ఒక అందమైన రైతుయువకుడు జ్ఞాపకంవచ్చాడు. అతన్ని ఇలాగే ఎవరినో చంపితేనే ఖైదుచేశారు. తరువాత విచారణజరిగి అతన్ని గనులలో నిర్బంధబానిసగా పంపించాలని శిక్ష విధించారు. ఈ రెండు కేసులనూ పోల్చి చూచుకున్నాడు నెఖ్లూడోవ్. ఇద్దరూ తప్పతాగి హత్యచేసినవాళ్ళే అయితే యువకుణ్ణి వెంటనే తెచ్చి జైల్లో పడేశారు; భార్యాబిడ్డలనుంచి ఎడబాటు చేశారు. చేతులకు కాళ్ళకు ఇనుపసంకెళ్ళు తగిలించారు. బుర్రగొరిగించేసి సైబీరియాకు గనుల్లో నిర్బంధంగా పనిచేసేందుకు తీసుకుపోతున్నారు. ఈ సైనికోద్యోగి మాత్రం జైలుగదిలో హాయిగానే ఉంటున్నాడు. మంచి భోజనం తింటున్నాడు, విలువైన సారాయమే తాగుతున్నాడు, పుస్తకాలు ఉబుసుపోకకు చదువుకుంటున్నాడు; రెండుమూడురోజుల్లో విడుదల ఔతాడు. యథాపూర్వంగా జీవయాత్ర గడుపుకోగలుగుతాడు. పైగా యీ సన్నివేశంవల్ల ఒకరకమైన కీర్తినికూడా ఆర్జిస్తాడు.

ఈ ఆలోచనలనే నెఖ్లూడోవ్ పైకి చెప్పాడు. వెంటనే దొరసాని కాథరైన్ అతని అభిప్రాయాలతో ఏకీభవించింది. కాని ఆతడు అలాగే

ఇంకా తీవ్రంగా మాట్లాడుతూ ఉండగా అందరూ ఏమీ పలక్కుండా నమ్రమైన మౌనముద్రలు వహించి ఉన్నారు. కేథరైన్ కూడా అలాగే మౌనంగానే ఉండిపోయింది. ఆ నిశ్శబ్దతను గమనించి నెఖ్లూడో తానేమో మహాపచారం చేసినట్టు అనుభవించాడు.

భోజనాలు అయినాయి. పక్కనే ఉన్న పెద్ద గదిలో మంచి కుర్చీలు వరుసగా వేశారు. వ్యవహారం చూస్తే ఒక మీటింగు జరుగబోయేట్టుగా ఉంది. గది మధ్యలో ఒక ఎత్తు కుర్చీ వేశారు. దానిముందు ఒక టేబిల్ ఉంచారు. దానిమీద ఒక నీళ్ళగ్లాసు పెట్టారు. ఆ కుర్చీ బహుశః ఉపన్యాసకునికి కామాలు. ఉపన్యాసం మధ్యలో గొంతు తడుపుకోటానికి కామాలు ఆ గ్లాసెడు నీళ్ళు. చిన్న చిన్నగా జనం పోగైనారు. ఉపన్యాసకుడు (బోధకుడంటే బాగుంటుందేమో) కీన్ వెటర్ అని తేలింది.

చాలామంది గుర్రపు బగ్గీలలో వచ్చారు. అవన్నీ ఇంటిముందు ఆగి ఉన్నాయి. చాలామంది యువతులు, ధనవంతుల ఇల్లాళ్ళు కామాలు, విలువ గల పట్టు దుస్తులు, లేసులు ధరించి చమికీల మెరుపులు చిమ్ముతూ సుఖాసీనులై యున్నారు. పురుషులు కూడా చాలామంది ఉచిత వేషభూషణాలతో హాజరైనారు. ఒక అరడజనుమంది సాధారణ కుటుంబీకులు ఉన్నారు— ఇద్దరు నౌకర్లు, ఒక దుకాణదారు, ఒక దౌవారికుడు, ఒక గుర్రపు బండి వాడు.

కీన్ వెటర్ రష్యా దేశీయుడు కాడు. బలిష్ఠకాయుడు. ఇంగ్లీషుతో మాట్లాడాడు. ఒక యువతి అతని ఉపన్యాసాన్ని రష్యా భాషలోకి చాలా బాగానే అనువదిస్తోంది.

“మన పాపాలన్నీ చాలా ఘోరంగా ఉన్నాయనీ, వాటికి లభించే శిక్ష కూడా చాలా కఠినంగానే ఉన్నదనీ” అతడు చెప్పాడు.

“సోదర సోదరీమణులారా! మనం రోజూ ఏమేమి చేస్తూ ఉన్నామో కాస్త పర్యవేక్షించండి. మన జీవన విధానం ఎలా ఉంది? భగవంతునియెడ ఎన్ని అపరాధాలు చేస్తున్నాం? ఈ విషయాలన్నీ వివరంగా తరచి చూసుకుంటే 'మనం క్షమార్హులం కాదు; మనకు మోక్షం లేదు' అని తెలుసుకుంటారు. శాశ్వత నరకమే, అక్కడ మనం అనుభవించాల్సిన యాతనలే

మన నడుట రాసి వున్నాయి. ఈ మహాగ్ని గుండంలోనుంచి మనం బయట పడే దారి ఏమిటి? ఇల్లు తగులబడిపోతోంది. తప్పించుకుపోయే మార్గం కనిపించటం లేదు..." క్రమేణా ఉపన్యాసకుని కంఠస్వరం కంపించింది. కన్నీటి చుక్కలు విడుస్తున్నాడు.

ఉపన్యాసకుడు కాసేపు ఆగాడు. కన్నీళ్ళు చెక్కిళ్ళమీద ప్రవహిస్తున్నాయి. ఎనిమిది సంవత్సరాలనుంచీ ఇలాంటి ప్రబోధాలు అతడు చేస్తూనే ఉన్నాడు. ఈ రకమైన ఉపన్యాస భాగానికి వచ్చేసరికి అతని గొంతు గాద్గదికం పొందుతుంది. నేత్రాలు అశ్రుసిక్తాలు ఔతాయి. ఈ ఉపన్యాస భాగమంటే అతనికి ప్రీతి యెక్కువ. అశ్రువులు ప్రవహిస్తున్నకొద్దీ అతనికి ఆవేశం జాస్తి ఔతుంది.

గదిలోని శ్రోతలంతా కూడా వెక్కి వెక్కి ఏడవటం సాగించారు. కేథరైన్ మోచేతులు బల్లమీదపెట్టి, అరచేతులలో తలకాయ పట్టుకుని కూచుంది. ఆమె విశాల వక్షోభాగం ఊగిసలాడుతోంది. బుజాలు ఎగిరి పడుతున్నాయి. భయంగా ఆశ్చర్యంగా చూస్తున్నాడు గుర్రపుబండివాడు-రోడ్డుమీద బండి తోలుతూ ఉండగా - అకస్మాత్తుగా ముందు పోతూన్న ఒక జర్మన్ దేశస్థుడు దారి తొలగకుండా వుంటే, తానూ, తనబండీ వాడి మీదినుంచి పోవలసివచ్చిన పరిస్థితిలోవలె. ధనవంతుల ఇల్లాళ్ళంతా కాథరైన్ వలెనే తీవ్ర భావనిచలితులైనట్లు కనిపిస్తున్నారు. ఉల్ఫా కూతురు తాత్కాలపు ఫేషనుకు తగిన దుస్తులు ధరించి ఉంది. తండ్రిలాగే ఉంటుంది చూపులకు చాలావరకు. ఆమె కూడా చేతుల్లో ముఖం వంచుకుని ప్రార్థనలో వలె మోకాళ్ళపై నిల్చుంది.

మరుక్షణంలోనే ఉపన్యాసకుని ముఖకవళిక మారిపోయింది. ఒక మధురమైన మందహాసం చేశాడు. రంగంమీద నటకుడు తన హృదయానందాన్ని వ్యక్తం చేసేందుకుగాను ప్రదర్శించే చిరునవ్వు లాంటిది అది. మధురంగా, నెమ్మదిగా మళ్ళీ ఇలా ఆరంభించాడు—

"ఆc, ఉన్నది మనకొక తరుణోపాయం. ఒక ఆనంద ప్రదమైన, తేలికైన మార్గం. భగవంతుని కుమారుడైన ఏసుక్రీస్తు మనకోసమై సిలువమీద యాతనపడి రాల్చిన నెత్తురు చుక్కలో మన మోక్షం గ్యారంటీ చేయబడి నది. ఆయన బాధలు, నెత్తురు మనల్ని రక్షిస్తాయి..." మళ్ళీ అకస్మాత్తుగా

అతని కన్నుల్లోనుంచి అశ్రువులు రాలాయి—అన్నాడు—"సోదర సోదరీమణులారా! మనం సర్వేశ్వరుని స్మరించాలి. ఆయన ఈ ప్రపంచాన్ని సర్వ పాపాలనుంచీ రక్షించే నిమిత్తం తన కుమారుణ్ణి ఈ భూమిమీదికి పంపించాడు గదా? ఆయన పవిత్ర రక్తము—"

నెహ్లూడోవుకు విసిగెత్తిపోయింది. మెల్లిగా లేచి, చప్పుడు కాకుండా మునివేళ్ళమీద నడుచుకుంటూ ఆ చోటు వీడి తనగదికి వెళ్ళిపోయాడు.

## ౧౮

మర్నాడు నెహ్లూడోవ్ దుస్తులు మార్చుకుని ఎక్కడికో వెళ్ళటానికి సిద్ధంగా ఉన్నాడు. అప్పుడు ద్వారికుడు ఒక చీటీ ఇచ్చాడు. అది మాస్కో వకీలుది. మాస్కో వకీలు ఏదో సొంత పనిమీద పీటర్సుబర్గు వచ్చాడు. నెహ్లూడోవ్ పంపిన తంతి అతనికి దారిలో అందింది. అసలు ఆయన పీటర్సుబర్గు రావటంలో—ఒకవేళ త్వరలో మస్లోవా కేసు విచారణకు వచ్చేట్లయితే సెనేటులో తానూ హాజరు కావచ్చునన్న ఉద్దేశం కూడా ఉంది. మస్లోవా కేసు ఎప్పుడు విచారణకు రానున్నదీ, సెనేటులో ఎవరెవరు హాజరు కానున్నదీ, సెనేటులో ఎవరెవరు హాజరు అయేదీ నెహ్లూడోవ్ చెప్పాడు. అంతా విని వకీలు నవ్వి అన్నాడు;

"అయితే మూడురకాల సెనేటర్లు ఉన్నారన్నమాట! ఊల్ఫ్ అధికార వర్గానికి చెందిన వ్యక్తి. స్కోవరోడ్నికో న్యాయశాస్త్ర పుస్తకాల పరిచయం అధికంగా కలవాడు. బే దొర అచ్చం వాస్తవికవాది. అదిగో ఆ మూడో పెద్దమనిషిలోనే మన ఆశలన్నీ. సరే, ఇకపోతే పిటిషన్ కమిటీ వ్యవహారం ఏమిటి?"

"ఇదిగో ఇప్పుడే బయలుదేరుతున్నాను వొరొబేవ్ దొరగారి దగ్గరకు వెడదామని. నిన్న వెళ్ళానుగాని దర్శనం దొరకలేదు" అన్నాడు నెహ్లూడోవ్ 'దొరగారు' అన్న పదంమీద వ్యంగ్యంగా నొక్కుతూ.

"వొరొబేవ్, దొరగారు ఎలాగైనారో చెప్పనా? అతని తాత కోర్టులో దఫేదారుగా ఉండేవాడు. పాల్ చక్రవర్తిని ఎలాగో ఆశ్రయించి, సంతోషపెట్టాడు. చక్రవర్తి అతనికి 'దొర' అని బిరుదు ఇచ్చేశాడు. ఈ

బిడ్డను చూసుకుని పెరొబేవ్ చాలా గర్వపడతాడు. అతడొక పెద్ద భాగ్యం కలుడైన ముసలి మోసగాడు"

"వెళ్ళి చూస్తానుగా !"

"మంచిదే. అయితే ఇద్దరమూ కలిసే బయలుదేరుదాం."

ఇద్దరూ బయలుదేరబోతూంటే నౌకరువచ్చి ఒక ఉత్తరం ఇచ్చాడు. అది మేరియటీ పంపిన ఉత్తరం.

"నిన్ను సంతోషపెట్టే నిమిత్తం మా వారితో నీవు కోరిన విషయమై చెప్పాను. మావారి అధికారిక వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోటం నాకు ఇష్టంలేని పని. అయినా నీకోసమని చేయవలసినంతా చేశాను. కోటలో ఖైదీ చేయబడిన ఆ పిల్లను తక్షణమే విడుదల చేయటం జరగవచ్చు. మావారు అక్కడి సైన్యాధిపతికి రాశారు. కాబట్టి ఒక పనికోసం అంటూ గాక మామూలుగా వచ్చేయి. నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను" అని వున్నది ఉత్తరంలో.

"చూశావా ! ఎంత ఘోరమైన సంగతో ! ఏడు నెలలనుంచీ ఖైదు చేయబడివున్న యువతి ఇవాళ నిరపరాధి అని తేలిపోయింది. ఇక ఆమె విడుదల కావటానికి ఒక్క మాట వెలువడాల్సి వుంది" అన్నాడు నెఖ్లూడొ వకీలుతో.

"ఎప్పుడూ అంతేమరి ! ఏమైనా మొత్తానికి అనుకున్న పని సాధించావు కదా ! భేష్."

"కాని ఈ విజయం నన్ను దుఃఖపరుస్తున్నది. అక్కడ ఏమి జరుగుతూ ఉండాలో కాస్త ఆలోచించు. ఆమెను అక్కడ ఎందుకు బంధించారు ?"

"మరీ అంత లోతుగా ఆలోచించకుండా ఉండటమే మంచిది. సరే, ఇక మనం వెళదామా ?"

వకీలు ఎక్కివచ్చిన బండి వాకిట్లోనే ఉంది. ఇద్దరూ అందులో ఎక్కి పెరొబేవ్ దొరగారి యింటికి వెళ్ళారు. దొరగారు ఇంటి దగ్గరే ఉన్నారు. యువకుడైన ఒక ఉద్యోగి—పొడుగైన, సన్నని మెడగలవాడు—

ముందు గదిలో ఉన్నారు. అతనితోపాటు ఇద్దరు యువకులు కూడా ఉన్నారు.

"మీ పేరు?" అడిగాడా యువకోద్యోగి నాజూకుగా ముందుకు నడిచి వచ్చి.

నెఖ్లూడోవ్ తన పేరు చెప్పాడు.

"ఓహో, దొరగారు మీ సంగతి చెప్పారులెండి. ఒక్క నిమిషం ఆగండి" అంటూ తానున్న గదిలోని మరో గుమ్మం గుండా వెళ్లాడు. మరి కొంతసేపటికి అతను తిరిగి వచ్చాడు. అతనితోపాటు ఒక స్త్రీ కూడా వచ్చింది. ఆమె ఏడుస్తోంది. విచారాన్ని సూచించే నల్లదుస్తులు వేసుకుంది. కన్నీళ్ళు పసులకు కనిపించకుండా ఉండేందుకు మేలిముసుగు ముఖం మీదికి తీసుకుంటోంది.

ఆ యువకుడు నెఖ్లూడోవ్‌ను లోనికి తీసుకుపోయి ఒక గది తలుపు తెరచాడు. నెఖ్లూడోవ్ గదిలో ప్రవేశించాడు. అక్కడ దొరగారు కనిపించాడు. అతని శరీరం కట్‌మస్తీగానే ఉంది. అంత ఎత్తుగాక, పొట్టిగాక మామూలుగా ఉంటాడు. ఒక టేబిల్ ముందు కుర్చీలో కూచుని వున్నాడు. ముఖ కవళిక ఉల్లాసంగానే ఉంది.

"నీరాక నాకు చాల సంతోషంగా ఉంది. మీ తల్లి, నేను బాల్య స్నేహితులం సుమీ! నిన్ను నేను చిన్నప్పుడొకసారి, తరువాత ఉద్యోగం లో ఉన్నప్పుడొకసారి చూచాను. కానీ, ఏం కావాలి నీకు చెప్పు" అన్నాడాయన.

నెఖ్లూడోవ్ థియోడోసియా కథంతా చెప్పాడు. అంతా విన్న తరువాత "ఔను నాకు అర్థం అయింది. చాల విషాదభరితమైన గాథ! మరి పిటిషన్ ఇచ్చావా?" అని అడిగాడు దొరగారు.

"పిటిషన్ అంతా తయారుచేసి పెట్టాను"– అంటూ నెఖ్లూడోవ్ పిటిషన్ బైటికి తీశాడు జేబులోనుంచి. "ముందుగా మీతో మాటాడితే కేసును ఒక ప్రత్యేకమైన దృక్పథంతో విచారిస్తారని ఆశ!"

"సరే, బాగానే చేశావు. నేనే స్వయంగా రిపోర్టు ఇస్తాను" ఉల్లాసమైన ముఖంలో విచార రేఖను తెచ్చిపెట్టుకోటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ దొరగారు అన్నారు. "చాల విచారకరమైన కథ సుమీ! పాపం

చిన్నపిల్ల! భర్త ఆమెను అసహ్యంగా చూశాడు, ఆమెకు విరక్తి కలిగింది. కాని క్రమేణా పరస్పరం ప్రేమ కలిగింది. ఔను, ఈ కేసును రిపోర్టు చేస్తాను."

"మిఖేలిచ్ కూడా ఈ కేసు విషయమై మాట్లాడుతాడు" ఈ మాటలు నెఖ్లూడోవ్ నోటినుంచి వెలువడినవో లేదో దొరగారి ముఖకైఖరి మారిపోయింది.

"పిటిషన్ ఆఫీసులో ఇచ్చెయ్యి. నాకు చాతనైన సాయం చేస్తాను" అన్నాడు.

ఈ సమయాన యువకోద్యోగి నాజూకు నడకలతో అక్కడికి వచ్చాడు.

"ఆ స్త్రీ తమతో ఇంకా నాలుగు మాటలేవో చెప్పుకుంటానంటోంది."

"సరే లోనికి రమ్మను... ఎన్ని కన్నీళ్లు చూడాలోగద మనం ప్రపంచంలో! మనం వాటిని అన్నింటినీ ఇగురగొట్ట గలమా? ఏదో ఎవడికి చాతనయినంత వాడు చేస్తాడు..."

ఆ స్త్రీ లోనికి వచ్చింది.

"ఒక్క విషయం తమర్ని అర్థించటం మరచిపోయాను. అతను తన కూతుర్ని విడిచిపెడతాడేమో; అలా చేయనీయరాదు. ఎందువల్లనంటే అతడప్పుడే—"

"చేతనైనంతా చేస్తానన్నాను గదా!"

"భగవంతుడు మిమ్మల్ని చల్లని చూపులు చూస్తాడు: ఒక తల్లిని రక్షించాలి" ఆమె అతని చేయి అంది పుచ్చుకుని ప్రార్థనా సూచకంగా, కృతజ్ఞతా చిహ్నంగా ముద్దు పెట్టుకుంది.

"అంతా చేస్తాను."

ఆ స్త్రీ వెళ్ళిపోయాక, నెఖ్లూడోవ్ కూడా శెలవు పుచ్చుకోటానికి లేచాడు. "మేము చేతనయినంత సాయం చేస్తాం. న్యాయశాఖ మంత్రులతో ఈ విషయం చెబుతాను. వాళ్ళ జవాబు వచ్చాక మాకు చాతనైనంత సాయం చేస్తాం" అన్నాడు దొరగారు.

నెహ్లూడొవ్ అక్కడినుంచి బయలుదేరి దొరగారి ఆఫీసు గదిలోకి వచ్చాడు. అక్కడ చాలామంది గుమాస్తాలు, సెక్రెట్ ఆఫీసులోవలెనే, పరిశుభ్రమైన వేషభాషలతో, సంతృప్తిని ప్రకటిస్తూన్న ముఖాలతో కని పించారు.

“వీళ్ళందరికీ కడుపునిండా తిండి ఉంది. శుభ్రమైన దుస్తులు ధరించారు. వీళ్ళ బూట్లు చక్కగా పాలిష్ చేయబడి ఉన్నాయి. అక్కడ ఖైదీల కన్నా, ఆ పల్లెల్లోని రైతులకన్నా వీళ్లు సుఖంగా ఉన్నారు” అప్రయత్నంగా ఇటువంటి ఆలోచనలెన్నో మళ్ళీ నెహ్లూడొవ్ మెదడులో సందడి చేశాయి.

## ౧౯

క్రీటర్స్ముగ్స్ ఖైదీల భవిష్యత్తు ఒక మహామహునిమీద ఆధారపడి వున్నది. అతడొక జర్మన్ వంశీకుడు. అతడు చాలా ప్రజ్ఞానవంతుడని చాలామంది చెబుతారు. అతనికి చాలా బిరుదులు, బహుమతులు ప్రభుత్వం ఇచ్చింది అతడు సేనాపతి. ఒకప్పుడు కకాసస్ పర్వత ప్రాంతంలో ఒక యుద్ధం జరిగింది. అక్కడి రైతులంతా కవచాలు ధరించి, కత్తులు పుచ్చుకుని యీ మహామహుని ఆజ్ఞల్ని పాలించి, వేలాది ప్రజల్ని చంపారు; తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటూన్న వాళ్ళను; తమ ఇండ్లను, కుటుంబాలను రక్షించుకుంటూన్న వాళ్ళను. అందుకుగాను యీ సేనాపతికి చాలా బిరుదులు, బహుమానాలు దొరికాయి. తరువాత అతడు పోలెండులో పని చేశాడు. అక్కడ కూడా ఇలాగే రైతులచేత చాలా అత్యాచారాలు చేయించాడు; అందుకు కూడా బిరుదులు, బహుమానాలు ఆర్జించాడు. ఆ తరువాత ఇంకెక్కడో పని చేశాడు. ఇప్పుడు ముసలివాడైనాడు, చిక్కి వున్నాడు. అయినా ఒక చక్కని భవనం ఉంది, మంచి రాబడి వుంది, మర్యాద ఉంది. ప్రభుత్వ చట్టాల్ని, నిబంధనలను పట్టుదలతో అమలు జరుపుతూ ఉంటాడు. ప్రపంచంలో ఏమి మారినా అవి మాత్రం శాశ్వతములని అతని అభిప్రాయం.

ప్రస్తుతం అతని ఉద్యోగం ఏమిటంటే—రాజకీయ ఖైదీలపై పర్యవేక్షణ చేస్తూ ఉండటం. పది సంవత్సరాలయ్యే సరికి కనీసం సగంమంది ఖైదీలైనా—పిచ్చెక్కి, క్షయవ్యాధి చేతనో, నిరాహారులై కృశించో,

ఆత్మహత్య చేసుకొనో, ఉరి తీసుకొనో, నిప్పు పెట్టుకొనో చచ్చిపోకుండా ఉండాల్సిందే అతని పర్యవేక్షణలో.

ఈ ఘోరాలన్నీ అతని కళ్ళముందే జరుగుతూ ఉంటాయి. చూస్తూనే ఉంటాడు. అంతా తెలుసు. కాని అతని అంతరాత్మకు చీమ కుట్టినట్లేనా అనిపించదు. అవన్నీ ఈ ముసలి మాజీ సేనాపతి ప్రభుత్వ శాసనాన్ని 'తుచ' తప్పకుండా అమలు పరుస్తూన్నందువల్ల కలుగుతూన్న ఫలితాలే - వాటిని తప్పనిసరిగా అమలుజరుప వలసిందే కనుక, అమలు జరిపినందువల్ల ఫలితాలను గురించి ఆలోచించటం నిరుపయోగం. అతడు వాటిని గురించి తలపనే తలచడు. తలుచుకోటం మొదలుపెడితే అతి ప్రముఖమైన ప్రభుత్వాజ్ఞలను నెరవేర్చలేని దుర్బలుణ్ణి అయిపోతానేమోనని అతని భయం. అటువంటి జాలి యేమీ పెట్టుకోకుండా వాటిని నెరవేర్చటమే దేశభక్తి పరుడైన తన ధర్మం అని భావిస్తాడు-వారానికి ఒకసారి ఇతడు జైలు వార్డులన్నీ వెళ్ళి చూస్తాడు-"మీ కోరికలేమైనా ఉన్నాయా ?" అని ఖయిదీల నందర్నీ అడుగుతాడు. వాళ్ళకైతే చాలా కోర్కెలు ఉంటాయి. మౌనంగా అవన్నీ సావధానంగా వింటాడు. కాని ఒక్క కోరికా, ఎవరిదీ నెరవేర్చిన పాపాన పోలేదు. ఎందుచేతనంటే-అతని దృష్టిలో ఆ కోరికలన్నీ ప్రభుత్వ చట్ట విరుద్ధములు.

నెఖ్లూడోవ్ ఈ ఉద్యోగి ఇంటికి వెళ్ళేసరికి రెండుగంటలయింది. ఆ సమయాన అతడు ఒక మిత్రునితో కలిసి చచ్చిపోయినవారి ఆత్మలతో మాటాడే ప్రయత్నంలో ఉన్నాడు. బల్లమీద ఒక పెద్ద కాగితం ఉంది. దానిమీద వర్ణక్రమం అంతా రాసివుంది. ఒక చిన్న గిన్నెను ఇద్దరూ పట్టుకుని జరుపుతూ ఉన్నారు. ఎప్పుడో చనిపోయిన జోన్ ఆఫ్ ఆర్క్ ఆత్మను ఆవాహనం చేశారు. ఒక ప్రశ్న అడిగారు; ఆ గిన్నె జరుగుతోంది. ఒక్కొక్క అక్షరంమీద ఆగుతూ ఉంది. ఆ యక్షరాల్ని కూడబలుక్కొని అదే జోన్ ఆఫ్ ఆర్క్ చెబుతున్న సమాధానం అని భావిస్తున్నారు. కొంతసేపటివరకూ బాగానే నడిచింది. తరువాత వచ్చే సమాధానం విషయంలో ఇద్దరూ చెరొక విధంగా ఊహించుకున్నారు-ఎవరి ఊహకు అనుగుణ్యంగా వారు తత్సంబంధమైన అక్షరం మీదికి గిన్నెను లాక్కుంటూ ఉన్నారు. ఇటువంటి సమయంలో నెఖ్లూడోవ్ వచ్చియున్నట్టు దౌవారికుడు వార్త తెచ్చాడు.

మాజీ సేనాపతి లేచి మరో గదిలో నెఖ్లూదోవ్‌కు దర్శనం యిచ్చాడు. ఆసనం చూపిస్తూ "ఓహో, నీ రాక నాకు చాలా సంతోషంగా ఉంది. ఎన్నాళ్ళయింది నువ్వు పీటర్స్‌బర్గ్ వచ్చి?" అని అడిగాడు.

"కొద్దిరోజులే అయింది."

"మీ అమ్మ కులాసాగా ఉందా?"

"ఆమె చనిపోయింది."

"ఓహో, ఔనౌను' విన్నాను. మా అబ్బాయికి నువ్వు ఒకసారి కనిపించావట; చెప్పాడు."

అతని కుమారుడు కూడా తండ్రికివలెనే చాకచక్యంతో ప్రభుత్వోద్యోగంలో కుదురుకుని వున్నాడు. మిలిటరీ విశ్వవిద్యాలయంలో తర్ఫీదు పొంది ఇప్పుడు ప్రభుత్వసమాచారశాఖ ఆఫీసులో పనిచేస్తున్నాడు. ప్రభుత్వ గూఢచారులందరిపైనా అతడు పై అధికారి. సగర్వంగా తన విధ్యుక్తాలను నెరవేరుస్తూ ఉంటాడు.

"మీ నాన్నా నేనూ ఒకేచోట పనిచేశాం. ఇద్దరమూ చాలా స్నేహితులం. మరి నువ్వేదైనా ఉద్యోగంలో ఉన్నావా?"

"లేదు". ఈ సమాధానానికి మాజీసేనాపతి సంతృప్తి పడలేదు. "మిమ్మల్ని ఒకటి అడుగుదామని వచ్చాను" అన్నాడు నెఖ్లూదోవ్.

"చాలా సంతోషం. నీకు నేను చెయ్యాల్సిన సహాయం అంటూ ఒకటి ఉన్నదా?"

"నేను అడిగేది మీకు నచ్చదేమో! అయినా అడక్క తప్పటంలేదు; క్షమించాలి."

"ఏమిటది?"

"గుర్కేవిచ్ అను వ్యక్తి కోటలో ఖైదీ. అతనితల్లి అతన్ని చూడాలనుకుంటున్నది. కనీసం అతనికి కొన్ని పుస్తకాల్ని అయినా పంపించేందుకు అనుమతి కోరుతున్నది."

మాజీసేనాపతికి ఆ మాటలు రుచించినట్టూ కనిపించలేదు; రుచించనట్టూ కనిపించలేదు. తల ఒకపక్కకు వంచి కళ్ళు మూసుకున్నాడు ఏదో

ఆలోచిస్తున్నట్టు. కాని నిజానికి అతడేమీ ఆలోచించటం లేదు; శ్యాంజీ మాటలు అతనికి నచ్చలేదు. వాటికి తాను ప్రభుత్వ నిబంధనల రీత్యా జవాబు చెప్పవలసిందే. కనుక మానసికంగా విశ్రాంతి తీసుకుంటున్నాడే గాని ఏమీ ఆలోచించటం లేదు. చివర కన్నాడు—

"చూశావూ, ఇందులో చేయతగింది యేమీ లేదు. ఖైదీలను బంధువులువచ్చి చూడటం విషయంలో చక్రవర్తి జారీచేసిన నిబంధనలున్నాయి. ఇక పుస్తకాలు పంపించే విషయం: జైల్లో మంచి గ్రంథాలయం ఉంది. చట్టం అంగీకరించిన పుస్తకాల్ని ఖైదీలు తీసుకోవచ్చు."

"కాని అతనికి వైజ్ఞానిక (Scientific) గ్రంథాలు చదవటమంటే ఇష్టం."

"అటువంటి మాటలు నువ్వు నమ్మబోకు" అని పలికి కాసేపు మౌనంగా ఉండి "అతనికి కావలసింది చదువుకోటం కాదు; అశాంతి—" అన్నాడు.

"ఏం చేస్తారు పాపం! అటువంటి కష్టపరిస్థితిలో ఎలాగో కాలం వెళ్ళబుచ్చుకోవాలిగా మరి!"

"వాళ్ళు అస్తమానం అది కావాలి, ఇది కావాలి, అంటూ గొణుగుతూనే ఉంటారు. వాళ్ళ సంగతి నాకు తెలుసు—"వాళ్ళంతా పాపజాతి వాళ్ళన్నట్టుగా ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. "ఇక్కడ కోటలోని ఖైదీలకు ఇవ్వబడుతున్నన్ని సౌకర్యాలు మరే జైలులోనూ లేవు. తెలుసునా ?" అంటూ ఆ సౌకర్యాలన్నీ వరుసగా ఏకరువుపెట్టాడు. అసలు వాళ్ళను జైల్లో పెట్టారంటే ఒక చక్కని, సౌఖ్యవంతమైన గృహంలో ఉంచినట్లే నన్నట్లు వాదించాడు. "ఒకప్పుడు జైళ్ళలో ఏమేమో ఇబ్బందులుంటే ఉన్నాయేమో. ఇప్పుడలా కాదు. చాలా జాగ్రత్తగా చూస్తున్నాం. మూడేసి అనుపానాలు ఇస్తున్నాం భోజనానికి. ఆదివారంనాడు తీపిఫలహారం కూడా పెడుతున్నాం" ఇదే ధోరణిలో ఖైదీలు కోరుతూవుండే కోరికలన్నీ సవ్యమైనవి కావనీ, వాళ్ళు వట్టి కృతఘ్నులనీ రుజువుచేయటానికి తన వాక్చాతుర్యమంతా వినియోగించాడు. "వాళ్ళకు చదువుకోడానికి మతసంబంధమైన పుస్తకాలిస్తున్నాం-పాతపత్రిక లిస్తున్నాం. ఒక గ్రంథాలయం ఉంది.

అయితే అవి యెవరూ చదవరు. మొదటిరోజుల్లో ఏదో కొంత పేజీలు తిరగవేస్తారు. ఇక అంతే. ఎలా యిచ్చిన పుస్తకాలు అలాగే తిరిగి ఇచ్చివేస్తారు. అంతేకాక రాసుకోటానికి పలకలు, బలపాలుకూడా ఇస్తాం. పలకనిండా రాసి, చెరిపివేస్తే మళ్ళీ రాసుకోవచ్చుగా! కాని వాళ్ళు రాయరు. మొదట కొంచెం అశాంతిగా ఉంటారు. కాని రోజులు గడిచిన కొద్దీ చాలా శాంతంగా ఉంటారు; బలుస్తారు కూడా" అంటూ చాలాసేపు మాట్లాడాడు మాజీ సేనాపతి, తనమాటల్లోని భయంకర అంతరార్థాన్ని ఈషణ్మాత్రంకూడా అనుమానించకుండా.

నెఖ్లూడోవ్ ఆ ముసలివాని కఠిన కంఠస్వరాన్ని వింటూ, చూస్తున్నాడు అతని కర్రబారిన అవయవాలను, అతని మెరుస్తూన్న కన్నుల్ని, నున్నగా గొరిగివున్న చెంపల్ని, అతనికి గర్వకారణాలైన కోటుకు తగిలించివున్న పతకాల్ని. ఆ పతకాలన్నీ అతను యుద్ధంలో అమాయిక ప్రజల్ని హత్యచేయించి ఆర్జించినవని నెఖ్లూడోవ్ యెరుగును. అతనికి సమాధానం చెప్పటానికిగాని, అతను పలికిన మాటల అర్థాన్నే వివరంగా బయటపెట్టటానికిగాని ప్రయత్నించటం నిరుపయోగమని భావించాడు. చివరకు 'షస్టోవా' అను ఖైదీని గురించి అడిగాడు. ఆ ఖైదీని విడుదలచేయుటకు ఉత్తర్వు జారీచేయబడినట్లు ఆ యుదయమే అతనికి తెలిసింది.

"షస్టోవా—షస్టోవా? వాళ్ళ పేర్లన్నీ నాకు జ్ఞాపకం ఉండవు. బోలెడుమంది ఉన్నారాయెను" అన్నాడు ముసలిసేనాపతి – ఖైదీల సంఖ్య ఎక్కువగా ఉన్నందుకు వాళ్ళను దూషిస్తున్నవాడువలె. గంటమోగించి, నౌకరు రాగా, తన కార్యదర్శికి కబురువేశాడు రమ్మని. అతను వచ్చేలోగా నెఖ్లూడోవ్‌ను ఒక ఉద్యోగంలో చేరమని బుద్ధులు చెప్పటంలోకి దిగాడు. "నమ్మకస్థులైన కులీనుల్ని ప్రభుత్వోద్యోగాల్లో నియమించుకోవాలని జార్ ప్రభువు కోరిక. అటువంటివాళ్ళు చాలామంది కావాలి. నేను చూడు: ఈ ముసలితనంలోకూడా శక్తివంచనలేకుండా ఎలా పనిచేస్తున్నానో!"

ఇంతలో కార్యదర్శి వచ్చాడు. పాలిపోయి కృశించివున్నాడు. తెలివితేటలనే గాక అశాంతినికూడా ప్రకటిస్తున్న కళ్ళు. చెప్పాడు; షస్టోవాను విడుదలచేసే విషయమై తనకేమీ ఉత్తరువులు రాలేదని.

"అట్టి ఈ త్రయపుంజ వస్తే వచ్చేనాటే విడుదల చేస్తాం. వాళ్ళను అట్టి శిక్షలో వాళ్ళన్న కోరిక మాకేం లేదు" అంటూ మందహాసం చేశాడు మాజీ సేనాపతి.

అతన్ని చూస్తుంటే పుట్టుకొస్తున్న జాలిని, అసహ్యాన్ని ప్రకటించకుండా నెక్లూడో ఇక వెళ్ళిపోడానికి లేచాడు. తనమిత్రుని కుమారుడు ఈ నెక్లూడో పాపం ఆలోచనలేనివాడు, తప్పుదారిలో నడుస్తున్నాడు అని మాజీ సేనాపతి అనుకున్నాడు. మరీ కఠినంగా మందలించకూడదనుకున్నాడు. మంచి హితోపదేశం చేయాలనుకున్నాడు.

"ఇదిగో అబ్బాయి! నేను చెప్పేమాట జాగ్రత్తగా వినుమిరా! వాత్సల్యంవల్ల చెబుతున్నాను. ఈ ఖైదీలతో నీ కెందుకొచ్చిన సావాసం చెప్పు. వాళ్ళలో నిరపరాధి ఎవడూ లేడు. అంతా అవినీతిపరులు. మేము ఎరుగుదుము" అన్నాడు లేశమైనా సందేహానికి తావీని కంఠస్వరాన. "ఎక్కడేనా మంచి ఉద్యోగంలో జొరబడు. సమర్థులైన కుర్రాళ్ళు జార్ ప్రభువుకు కావాలి. దేశానికికూడా కావాలి. నీకు మల్లేనే నేనూ, నా వంటి వాళ్ళూ ఈ ఉద్యోగాలు మానేస్తాం అనుకో; ఇక మిగిలేదెవరు? వ్యవస్థలో లోపాలు ఉన్నాయంటూ మాటాడుతూ ఉంటాం. కాని ప్రభుత్వంతో సహకరించం. ఎలా?"

నెక్లూడో ఒక నిట్టూర్పు విడిచాడు. సెలవు పుచ్చుకొని కదిలిపోయాడు.

మాజీ సేనాపతి తిరిగి తనమిత్రుడున్న గదిలోనికి వెళ్ళాడు. జోన్ ఆఫ్ ఆర్క్ ఆత్మ తెలిపిన సమాధానాన్ని ఆ మిత్రుడు రాసిపెట్టి వుంచాడు. సేనాపతి చదువుతున్నాడు ఆశ్చర్యంగా.

## ౨౦

మర్నాడు సెనేటులో మస్లావా కేసు తీర్పు చెబుతారు. నెక్లూడో, అతని ప్లీడరు ఫానరిన్—ఇద్దరూ సెనేటు భవనంముందు కలుసుకున్నారు. ఫానరిన్‌కు ఈ భవనం యావత్తూ కొట్టినపిండి. గబగబా మెట్లెక్కి మొదటి అంతస్థులో ఒక గదిలో ప్రవేశించాడు. అక్కడ ఒక నౌకరుద్వారా సెనేటు

ళ్లంతా వచ్చివున్నారని తెలుసుకున్నాడు. త్వరగా లోపలివాకిలిదాటి మరో గదిలో ప్రవేశించాడు. అక్కడే ఫానరిన్‌కు ఒక వకీలు కనిపించాడు. ఇద్దరికీ ఒకేవృత్తి కనుక చప్పున మిత్రులైపోయారు. సంభాషణలో పడ్డారు. ఈ లోగా నెఖ్లూడొవ్ ఆ గదిలోని వ్యక్తులనందర్నీ పరిశీలిస్తూ ఉన్నాడు. ఆ రోజున ఒక మాననష్టపుదావా చెప్పబడుతోంది. కనుక మామూలుకన్న జనం ఎక్కువగానే వచ్చారు. చాలావరకు పత్రికారచయితలు ఉన్నారు.

ఇంతలో సెనేటుగుమాస్తా ఒకడు ఫానరిన్ దగ్గరకువచ్చి, "మీరు వచ్చిన పనేమిటి"ని ప్రశ్నించాడు. మస్లోవా కేసు విషయమై వచ్చానని ఫానరిన్ జవాబు చెప్పాడు. గుమాస్తా ఒక కాగితంమీద రాసుకొని వెళ్ళిపోయాడు.

తరువాత ఒక వృద్ధుడు—జలతారు దుస్తులు ధరించాడు—ఏవేవో పతకాలు తగిలించుకున్నాడు—గదిలోకి వచ్చేసరికి అందరూ ఆశ్చర్యంగా అతనికేసే చూడసాగారు. నెమలిపిట్టలా ఉన్నాడతడు. తన విచిత్రవేషం ఇంతగా ఇతర్ల దృష్టిని ఆకర్షించినందుకు భావాసహ్యత కలిగి, త్వరత్వరగా అటువేపు గుమ్మందాటి వెళ్ళిపోయాడు.

"ఆ వృద్ధుని పేరు 'బే'. పెద్ద పేరు ప్రతిష్ఠలు కలవాడు" అన్నాడు ఫానరిన్ నెఖ్లూడోవ్‌తో. తరువాత నెఖ్లూడోవ్‌ను వకీలు సోదరునితో పరిచయం చేశాడు. మస్లోవా కేసును గురించి వివరంగా చెప్పాడు.

సెనేటు గుమాస్తా లేచి సెనేటర్ల ఆగమనాన్ని ఉద్ఘోషించాడు. అంతా లేచి నిల్చున్నారు. సెనేటర్లు ప్రవేశించారు - ఉన్నతాసనాలను అలంకరించారు. మొత్తం నలుగురు సెనేటర్లు హాజరై ఉన్నారు. మొదటివాడు : నికిటిన్. కోలముఖం, చురుకైన కళ్ళు. రెండవవాడు : వుల్ఫ్; గంభీరభావ సూచకంగా ముడివడి యుండే పెదవులు. మూడవవాడు : స్కావొరోడ్నికోవ్; బరువైన, లావుపాటి, స్ఫోటకం మచ్చలుగల మనిషి. నాలుగోవాడు : బే. పెద్దరికాన్ని చాటుకునే ముఖం.

సెనేటర్లతోపాటు ప్రధాన కార్యదర్శి, పబ్లిక్ ప్రాసిక్యూటరు వచ్చారు. పబ్లిక్ ప్రాసిక్యూటరు సన్నగా ఉంటాడు. పొట్టీ, పొడుగూ కాని విగ్రహం. విచారసూచకాలైన నల్లని కళ్లు. అతన్ని నెఖ్లూడో ఆరునెలల

క్రితం చూశాడు. ఇప్పుడు చూడగానే గుర్తించాడు. చదువుకుంటోన్న రోజుల్లో ఇద్దరూ పరిచయ మిత్రులు.

"అతడు పబ్లిక్ ప్రాసిక్యూటర్, సెలెనిన్ కదూ!" నెఖ్లూడోవ్ తన వకీలు కేసి తిరిగి అడిగాడు.

"ఔను; ఏం?"

"అతన్ని నేను బాగా ఎరుగుదును. మంచివాడు."

"మంచి ప్రాసిక్యూటర్ కూడాను."

"ఏమైనా అంతరాత్మ ఆదేశానుసారం నడిచేవ్యక్తి" అన్నాడు నెఖ్లూడోవ్, అతనితో తన చిన్ననాటి పరిచయాన్ని గుర్తుకు తెచ్చుకుని; అతని పవిత్రతను, సత్యశీలతను స్మరించి.

"అతన్ని కూడా ఒకసారి నువ్వు వెళ్ళి చూసివుంటే బాగుండేది. కాని సమయం దాటిపోయింది" అంటూ వకీలు ఫానరిన్ సెనేటులో ఆరంభమైన కేసు వినటంలో మునిగిపోయాడు.

ఆరంభమైన కేసు మొదట జిల్లా కోర్టులో విచారణ జరిగి, తీర్పు చెప్పారు. తరువాత అపీలు కోర్టులో ఆ తీర్పునే ఖాయం చేశారు. ఇప్పుడు అదే కేసు సెనేటులో పరిశీలనకు వచ్చింది. నెఖ్లూడోవ్ జాగ్రత్తగా వింటున్నాడు బాగా అర్థం చేసుకోవాలన్న తలంపుతో. కాని క్రిమినల్ కోర్టులోలాగే ఇక్కడ కూడా తీవ్రంగా చర్చించబడుతున్నది. అసలు ప్రముఖ విషయం కానే కాదు. ప్రధాన సమస్య ఎగిరిపోయింది. అప్రధానమైన ఇతర విషయాల చర్చ తీవ్రంగా సాగుతోంది. అసలు కేసు ఇది: ఒక లిమిటెడ్ కంపెనీ డైరెక్టరు ప్రజల్ని మోసగించే పెద్ద పన్నాగం పన్నాడని నిరూపిస్తూ, లోగుట్టు అంతా బయటపెడుతూ ఒక వార్తాపత్రిక వ్యాసం ప్రకటించింది. అసలు నిజంగా కంపెనీ డైరెక్టరు అటువంటి మోసాన్ని తలపెట్టాడా? తలపెట్టి వున్నట్టయితే దాన్ని నిరోధించటం ఎలాగ? ఇవి ప్రధాన విషయాలు. వీటిని నిర్ధారణచేసి తీర్పు చెప్పాలి. కాని అక్కడ సెనేటులో యీ విషయాల చర్చ ఏమీ జరగటం లేదు. ఇక అక్కడ తర్జన భర్జన జరుగుతూన్న విషయాలేమంటే—అటువంటి వ్యాసం రాసి ప్రచురించటానికి చట్టసమ్మతమైన అధికారం పత్రికా సంపాదకునికి

ఉన్నదా? అలా రాయటం కంపెనీ డైరెక్టరును నిందించటం ఔనా, కాదా? నిందించటం మాన నష్టం కిందికి వస్తుందా, రాదా? ఇటువంటి – సాధారణ ప్రజకు అర్థంగాని–విషయాల్ని, చట్టాల్ని చర్చించి తర్క చాతుర్యాలు చూపారు.

యీ కేసు విషయమై వుల్ఫ్ మాట్లాడాడు. "సెనేటు తీర్పు కేసులోని గుణగణాల్ని బట్టి వుండదు" అని అతడు లోగడ దినం నెహ్లూడొవ్‌తో చెప్పి వున్నాడు గట్టిగా. కాని యీనాడు యీ కేసు విషయంలో కింది కోర్టు తీర్పును రద్దు చేయవలసిందేనని తీవ్రంగా వాదించాడు. సెలెనిన్ మామూలుగా అత్యంత మితవాది. నిగ్రహం గలవాడు. కాని యీనాడు ఆవేశంగా మాట్లాడాడు. వుల్ఫ్ చెప్పిన వాదాన్ని పూర్తిగా ఖండించాడు. అతనిలో ఎన్నడూ లేని ఈ ఆవేశానికి నెహ్లూడొవ్ ఆశ్చర్యపోయాడు. అతడంత తీవ్రంగా, ఉద్రేకంగా వాదించటానికి కారణాలు ఉన్నాయి. వుల్ఫ్ ధనాశాపరుడని అతనికి తెలుసు. అదీగాక ఇటీవలే మోసగాడైన ఆ కంపెనీ డైరెక్టరు ఇచ్చిన విందుకు వుల్ఫ్ హాజరైనాడని విన్నాడు.

వుల్ఫ్ తర్కయుక్తంగా, బహు జాగ్రతగా వాదన చేశాడు. కాని పక్షపాతం కనిపించింది అతనిలో. అందుచేతనే సెలెనిన్ కోపోద్రిక్తుడై, అంత ఆవేశ పూర్వకంగా మాట్లాడాడు. అతని ఉపన్యాసం వుల్ఫ్‌కు కోపం తెప్పించిన మాట వాస్తవం; అతని ముఖం కందగడ్డ అయింది; కుర్చీలో అశాంతిగా ఊగాడు. చివరకు ఇతర సెనేటర్లతో కూడా కలిసి చర్చాగృహంలోకి వెళ్ళాడు.

సెనేటు గుమాస్తా మరొకసారి ఫానరిన్ వద్దకు వచ్చి "మీరు ఏ కేసు విషయంలో వచ్చానన్నారూ?" అని అడిగాడు.

"ఇదివరకే చెప్పానుగా! మస్లావా కేసు."

"ఔనౌను. అది కూడా యీ రోజే తీర్పు చెప్పాలి. కాని—"

"కాని ఏమిటి?"

"మస్లావా కేసు విషయంలో వాదన ఏమీ వినాలనుకుంటున్నట్టు లేరు సెనేటర్లు. కాబట్టి ఇప్పటి యీ కేసుకు సంబంధించిన తీర్పు చెప్పేసిన తర్వాత సెనేటర్లు మళ్ళీ ఇక్కడికి రారేమో ననుకుంటాను. అయినా నేను చెబుతాలెండి."

"అంటే ?"

"నేను చెబుతాలెండి; చెబుతాను" అంటూ కాగితంమీద ఏదో రాసుకుని వెళ్ళిపోయాడు.

అసలు సంగతేమంటే—సెనేటర్లు యీ మావన్తుప్ర కేసు విషయంలో తీర్పు చెప్పేసి, అక్కడే ఆ చర్చా గృహంలోనే తేనీరు తాగి, సిగరెట్లు కాలుస్తూ మస్లోవా కేసు, ఇంకా ఇతర కేసులూ కూడా పూర్తి చేద్దామని నిశ్చయించుకున్నారు.

## ౨౧

చర్చాగృహంలో సెనేటర్లంతా ఒకబల్లచుట్టూ ఆసీనులైనారు. ఆ కేసువిషయంలో కిందికోర్టు తీర్పును కొట్టివేయటానికి తన కారణాలన్నీ వుల్ఫ బయటపెట్టాడు. అధ్యక్షుడు వస్తుతః కొంచెం దుర్మార్గుడు. ఆ నాడెందుకో కోపంగా ఉన్నాడు. చాలాకాలంనుంచీ అతనొక ఉన్నతోద్యోగాన్ని ఆశిస్తూ వున్నాడు. కాని ఆ వుద్యోగం తనకు రాలేదు. విగ్నోవ్ కు పోయింది. ఆ సందర్భంలో ఆయన డైరీలో రాసుకొనియున్న అంశాలపై కేంద్రీకృత మనస్కుడై ఉన్నా డీక్షణాన. తనకన్నా ఉన్నతోద్యోగ శాఖలలో ఉన్న వ్యక్తులనుగురించిన తన యభిప్రాయాలు భావచరిత్రకారులకు విలువైన విషయసామగ్రి కాకలదని అధ్యక్షుడు నికిటిన్ విశ్వాసం. ప్రస్తుతం రష్యన్ పరిపాలకులు దేశాన్ని ఒక మహావినాశస్థితికి తీసుకుపోతున్నారనీ, ఆ దుర్విధిని తప్పించేందుకు తాను కంకణం కట్టుకున్నాననీ అతని భావం. కాని అట్టి సత్కార్యాన్ని తన్ను చేయనీకుండా అరికట్టేందుకే ఆ యున్నతోద్యోగ శాఖలలోని ఉద్యోగులు నియమితులైనారని తన డైరీలో ఒక పెద్దప్రకరణ రాసుకునివున్నాడు. దీనిభావం ఏమిటీ అంటే—తాను ఇప్పుడు తీసుకుంటూన్నదానికంటె పెద్దజీతం తీసుకోకుండా వాళ్లు అడ్డుపడ్డారు. భావి చరిత్రలో ఈ రాసిన ప్రకరణ ప్రముఖం కాగలదని అతని భావన.

"ఔనౌను; నిజమే" అంటూ కూచున్నాడు, అధ్యక్షుడు నికిటిన్, వుల్ఫ చెబుతూన్న మాటలన్నింటికీ.

బే ఒకవిచారకరమైన ముఖం పెట్టుకుని వుల్ఫవాదం వింటున్నాడు. టేబిల్ మీద ఒక కాగితంమీదవున్న ఒక పూలదండను అటూ ఇటూ కది

లిస్తూ. అతడు లిబరల్ పక్షీయుడు. సాధారణంగా అన్ని కేసుల్లోనూ తటస్థంగానే ఉంటూంటాడు. కాని యీ తన స్వాభావిక తటస్థ విధానానికి భిన్నంగా ప్రవర్తించినప్పుడల్లా లిబరల్ పక్ష ఆశయాల్ని అనుసరిస్తూ ఉంటాడు. ఈ కేసులో ఒక పత్రికాధిపతి మాననష్టపు దావా క్రింద శిక్షితుడయ్యేట్టయితే పత్రికా స్వాతంత్ర్యానికి అఘాతం కలుగుతుందన్న మాట. అందుచేత కంపెనీ డైరెక్టరు అపీలును కొట్టి వేయించవలసిందే అని నిశ్చయించుకున్నాడు.

వుల్ఫు వాదం ముగిసింది. జే పూలదండను ఆడించటం ఆపివేశాడు. తిన్నని కంఠస్వరాన, నిరాడంబరంగా, అందరికీ నచ్చేలాంటి తర్కంతో ఉపన్యసించాడు. కంపెనీ డైరెక్టరు అపీలును కొట్టివేయవలసిందేనని వక్కాణించాడు. ఉపన్యాసం ముగించి మళ్ళీ పూలదండతో ఆడుకోటంలో పడ్డాడు.

స్కోవొరోడ్నికో వుల్ఫుకు ఎదురుగా కూచున్నాడు మీసాలు పెదవులసందుకు తెచ్చునని కొరుక్కుంటూ. జే ఉపన్యాసానంతరం ఈ మీసాలు కొరకటం మానేసి తన గంభీర కంఠస్వరాన్ని అందరికీ వినిపించాడు. "ఆ కంపెనీ డైరెక్టరు ఒక పెద్దభయంకర దుర్మార్గ చక్రవర్తి అయినా...ఏ కాస్తో చట్టసమ్మతమైన ఆధారం అంటూ ఉన్నట్టయితే... కిందికోర్టు చెప్పినతీర్పును రద్దుచేసెయ్యండని చెప్పటానికి నేను సంకోచించేవాణ్ణి కాదు. కాని అటువంటి చట్టసమ్మతమైన ఆధారం ఏమీలేదు కాబట్టి నేనుకూడా జే అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను—" అన్నాడు.

అధ్యక్షుడు స్కోవొరోడ్నికో వాదాన్ని అంగీకరించాడు. కంపెనీ డైరెక్టరుగారి అపీలును కొట్టివేశాడు.

వుల్ఫుకు చిన్నతనం అయింది. తానేదో పక్షపాతం వహించినట్టు ఇతర్లు అభిప్రాయ పడినందుకు మరింత చిన్నపుచ్చుకున్నాడు. కాని తీర్పు ఎలావున్నా తనకేమీ పట్టనట్టు, తానేదో న్యాయసూత్రాల రీత్యా వాదించినట్టు నటించాడు. మస్లొవా కేసుకు సంబంధించిన కాగితాలు తీసుకుని అవి చదవటంలో పడ్డాడు. ఇంతలో సెనేటర్లు నౌకర్లను పిల్చి తేనీరు తీసుకు రావలసిందిగా ఆజ్ఞాపించారు.

ఆ రోజుల్లో పీటర్సుబర్గులో ప్రతిచోటా ప్రజలు మాట్లాడుకుంటూ ఉన్న విషయాలు రెండు. ఒకటి: ఆ ద్వంద్వ యుద్ధం. రెండు: ఒక ప్రముఖ ప్రభుత్వోద్యోగిపై 995 సెక్షన్ అనుసరించి పెట్టబడిన కేసు. ఆ కేసు విషయమై ప్రసంగిస్తూ, అసహ్య భావాన్ని ప్రకటిస్తూ "ఎంత ఛండాలం?" అన్నాడు జే.

"ఏం, అందులో తప్పేముంది? మగాళ్ళు మగాళ్ళనే పెళ్ళిళ్లు చేసుకోనివ్వాలనీ, అలాంటి పెళ్ళిళ్ళను చేసుకున్నవాళ్ళను నేరస్థులుగా పరిగణించరాదనీ ఇటీవల ఒక జర్మన్ రచయిత ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని విశదీకరిస్తూ ఒక రష్యన్ పుస్తకం వెలువడింది, తెలుసునా?" అంటూ ఆప్యాయంగా పొగపీల్చి వదులుతూ, పకపకా నవ్వాడు స్కోవోరోడ్నికోవ్.

"అబద్ధం" అన్నాడు జే.

"కావలిస్తే చూపిస్తాను మీకు" అంటూ స్కోవోరోడ్నికోవ్ ఆ పుస్తకం పేరు, అది ఎక్కడ, ఎప్పుడు ప్రచురితమైనదీ-అన్నీ వివరాలు చెప్పాడు.

"తరువాత అతన్ని సైబీరియాలో ఒక పట్టణానికి గవర్నరుగా నియమించారని విన్నాను."

"అద్భుతమైన పనిచేశారు. అక్కడి బిషప్ దొరగారు ఆయనకు హృదయపూర్వక స్వాగతం ఇస్తారు. బిషప్‌ను కూడా అటువంటి రకాన్నే నియమించాలి. కావలిస్తే అటువంటి బిషప్‌ను ఒకణ్ణి సిఫార్సు చేస్తాను" అంటూ చేతిలో సిగరెట్టు పారేసి, మీసాలు పెదవుల సందుల్లోకి తీసుకుని కొరుక్కుంటూ కూచున్నాడు.

సెనేటు గుమాస్తా వచ్చాడు. మస్లోవా కేసు పరిశీలన జరుగుతున్నప్పుడు నెఖ్లూడోవ్, ఫానరిన్ కూడా వచ్చి చూస్తామన్నారు. వాళ్ళ కోరికను గుమాస్తా సెనేటర్లకు విన్నవించాడు.

"ఇది చాలా అద్భుతమైన కేసు" అంటూ వుల్ఫ్ తనకు తెలిసినంత వరకు మస్లోవా-నెఖ్లూడోవ్‌ల సంబంధాలను చెప్పాడు. దాన్ని గురించి కొంత సేపు మాట్లాడుకున్న తరువాత, టీ తాగి, సిగరెట్లు కాల్చి, సెనేటర్లు సెనేటు గదికి బయలుదేరి వచ్చారు. మాననష్టపు దావా కేసు అపీలు విషయంలో తమ తీర్పును చెప్పేసి, మస్లోవా అపీలు పరిశీలన ఆరంభించారు.

మస్లోవా అపీలు పూర్తిగా సభ్యులకు వినిపించాడు వుల్ఫ్. ఈసారి కూడా కొంచెం పక్షపాతం ధ్వనించింది అతని కంఠంలో. కింది కోర్టు తీర్పును కొట్టివేయాలన్న సూచనలు యిస్తున్నట్టే మాటాడాడు.

"మీరేమేనా చెప్పదలచుకున్నారా ?" అని అధ్యక్షుడు ఫానరిన్‌ను ఉద్దేశించి అడిగాడు. ఫానరిన్ రొమ్ము విరుచుకుంటూ లేచి గంభీరోపన్యాసం చేశాడు. ఆరు అంశాలలో క్రిమినల్ కోర్టు తీర్పు చట్ట విరుద్ధంగా ఉన్నదని వాదించాడు. శిక్ష విధించటం అన్యాయం అని రుజువు చేశాడు. కేసులోని గుణ గణాలను వివరించాడు. "ఈ విషయాలన్నీ న్యాయశాస్త్ర వేత్తలు, విజ్ఞాన మూర్తులు అయిన సెనేటర్లకు నేను చెప్పకుండానే గ్రహించగలరు. అయినా నా ధర్మం నేను నెరవేర్చాలి గనుక అంతా చెప్పాను" అంటూ తన ఉపన్యాసాన్ని ముగించాడు.

ఫానరిన్ ఉపన్యాసం విన్న తరువాత తప్పకుండా సెనేటర్లు కింది కోర్టు తీర్పును రద్దు చేస్తారు అని అంతా అనుకున్నారు. ఉపన్యాసం ముగించి విజయసూచకంగా చిరునవ్వు చిలుకుతూ ఫానరిన్ నెఖ్లూడొవ్ కేసి చూశాడు. 'కేసు గెల్చాం, ఇంకేముంది' అనుకున్నాడు నెఖ్లూడొవ్. కాని సెనేటర్ల ముఖం చూసి నిరుత్సాహపడ్డాడు. ఆ చిరునవ్వు, విజయగర్వం ప్రదర్శించింది ఒక్క ఫానరిన్ మాత్రమే. సెనేటర్ల ముఖంలోగాని, పబ్లిక్ ప్రాసిక్యూటర్ ముఖంలోగాని అటువంటి చిరునవ్వేమీ కనిపించలేదు. పైగా వకీలు ఉపన్యాసానికి విసిగెత్తిపోయినట్టు కనిపించారు. "ఇటువంటి ఉపన్యాసాలు చాలా విన్నాం; లాభంలేదు లేవోయ్" అన్నట్టు వెక్కిరిస్తున్నాయి వారి నొసళ్లు. ఫానరిన్ ఉపన్యాసం ముగించిన తరువాత "అమ్మయ్య, వొదిలిందిరా పీడ" అన్నట్టు నిట్టూర్పు విడిచారు.

వకీలుగారి ఉపన్యాసానంతరం అధ్యక్షుడు పబ్లిక్ ప్రాసిక్యూటరు వైపు చూశాడు. సెలెనిన్ లేచి విశదంగా ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. కింది కోర్టు తీర్పును మార్చవలసిన అవసరం ఏమీ కనిపించటం లేదన్నాడు. అపీలును అంగీకరించటానికి తగిన కారణాలేమీ లేవన్నాడు. అంతట సెనేటర్లంతా మళ్ళీ చర్చా గృహానికి దయచేశారు.

వుల్ఫ్ అపీలును అంగీకరించుదామన్నాడు. బే కూడా, కేసును అర్థం చేసుకుని వుల్ఫ్‌తో ఏకీభవించాడు. నికిటిన్ వ్యతిరేకించాడు. ఇక స్కోవో

రోడ్‌నికో అభిప్రాయంమీద పర్యవసానం ఆధారపడి వుంది. అతడు అప్పీలును త్రోసివెయ్యాల్సిందేనని ఖచ్చితంగా చెప్పాడు. అంతకు అతని అంతరంగికమైన ముఖ్య కారణం ఏమిటంటే—నెఖ్లూడో ఆ స్త్రీని వివాహం చేసుకోడానికి నిశ్చయించుకోవటమనేది అతనికి అసహ్యంగా కనిపించింది.

స్కోవొరోడ్‌నికో ఒక భౌతికవాది. డార్విన్ సిద్ధాంతాన్ని అంగీకరిస్తాడు. ఆదర్శ నైతిక ప్రదర్శనాల్ని, మత తత్వాన్ని అసహ్యించుకుంటాడు. ఇంతకూ అది ఒక పడుపుకత్తె; దానికోసం ఒక పేరుపడ్డ వకీలుతో తాను సెనేటుకు హాజరు కావటం—ఈ హంగామా అంతా అతనికి ఏహ్యమనిపించింది. కనక మీసాలు మాటి మాటికీ పెదవుల సందుల్లోకి తెచ్చుకుని కొరుక్కుంటూ, పలు రకాలుగా ముఖం పెట్టి, కేసును గురించి తనకు ఎక్కువగా ఏమీ తెలియనట్లు నేర్పుగా నటిస్తూ, అపీలులో పొందుపరచబడిన కారణాలు చాలవని వేర్కొంటూ కింది కోర్టు తీర్పును ఖాయం చేయటమే సమంజసమని ముగింపు మాట చెప్పాడు.

కాబట్టి కింది కోర్టు విధించిన శిక్ష రద్దు కాలేదు.

## ౨౨

“ఘోరం, ఘోరం” అంటూ నెఖ్లూడో వకీలుతోకూడా వైటి గదిలోకి వచ్చాడు. వకీలు తన కాగితాలూ, అవీ సంచీలో సర్దుకుంటున్నాడు. “కేసు అంత బట్టబయలుగా కనిపిస్తూవుంటే కారణాలు చాలవంటూ కొట్టేస్తారా? ఘోరం!” అన్నాడు నెఖ్లూడో.

“క్రిమినల్ కోర్టులోనే కేసు పాడుచేశారు” అన్నాడు వకీలు.

“సెలెనిన్ కూడా అపీలును తోసివెయ్యమన్నాడే. ఘోరం! ఇక చెయ్యాల్సిందేమిటి?”

“చక్రవర్తికి పిటిషన్ రాద్దాం. నువ్వు ఇక్కడే వున్నావుగా! నువ్వే స్వయంగా ఇద్దువుగాని. పిటిషన్ నేను రాసిపెడతాను.”

ఆ సమయాన వుల్ఫ్ నెఖ్లూడోను సమీపించాడు. “గత్యంతరం లేక పోయింది. అపీలుకు తగినంత బలం లేదు” అంటూ బుజాలు ఎగరవేసి, కళ్లు ఒకసారి చిట్లించి వెళ్ళిపోయాడు.

నెఖ్లూడో సెనేటుకు వచ్చివున్నాడన్న సంగతి సెనేటర్లవల్ల తెలుసుకుని సెలెనిన్ కూడా అక్కడికి వచ్చాడు చూడటానికి.

"నిన్ను ఇక్కడ చూస్తానని నేనెన్నడూ అనుకోలేదు సుమా! నువ్వు పీటర్సుబర్గు వచ్చావన్న సంగతి నాకు తెలియనే తెలియదు" అన్నాడు సెలెనిన్ దగ్గరకువచ్చి నెఖ్లూడోతో, పెదవులతో మాత్రమే నవ్వుతూ. కళ్ళు విచారసూచకంగానే వున్నాయి.

"నువ్వు ఇక్కడ పబ్లిక్ ప్రాసిక్యూటరువన్న సంగతి నాకు తెలీదు."

"సరేగాని నువ్వు సెనేటుకు వచ్చావు, ఏం పనిమీద? పీటర్సుబర్గు వచ్చావన్న సమాచారం నా చెవినిపడింది గాని, ఏంచేస్తున్నావిక్కడ?"

"ఇక్కడా? ఇక్కడైనా న్యాయం జరుగుతుందేమో, ఒక అమాయకురాల్ని రక్షించగలనేమో అనుకున్నాను."

"ఎవరావిడ?"

"ఆమె అపీలునే ఇందాక మీరు చర్చించింది."

"ఓహో, మస్లావా కేసా? అపీలుకు బలంలేదు."

"అపీలు సంగతి అలా ఉంచు పాపం, నిర్దోషి ఆమె. శిక్షకు పాత్రురాలౌతోంది."

సెలెనిన్ నిట్టూర్పు విడిచాడు. "కావచ్చు, కాని—"

"కావచ్చు కాదు, అయింది."

"నీకెలా తెలుసు."

"అప్పుడు జ్యూరీ సభ్యులలో నేనే ఒకణ్ణి. మేము చేసిన తప్పు నాకు తెలుసు."

సెలెనిన్ కాస్త ఆలోచించాడు. "మరి, ఆ సమయంలో నువ్వు ఒక ప్రకటన చేసి యుండవలసింది."

"చేశాను."

"అది అధికారికంగా ఒక కాగితంమీద ఉండి, దాన్ని కూడా అపీలు పిటిషన్‌తో జోడించి ఉన్నట్టయితే—"

"ఔను. ఆ మాట నిజమే. కాని ఇప్పటి మీ సెనేటు తీర్పు చూడు, ఎంత ఘోరంగా ఉందో!"

"కింది కోర్టుల తీర్పులు న్యాయమైనవా, కావా? అనే విషయంలో సెనేటు తన ఇష్టం వచ్చినట్టు ఒక నిర్ణయానికి రావాలట. ప్రమాణం అంటూ ఉండాలి. అలా ఇష్టం వచ్చినట్టు నిర్ణయించేట్టయితే కింది కోర్టుల, జ్యూరీల తీర్మానాలు నిరర్థకము లౌతాయి. ఈ విధంగా సెనేటు న్యాయాన్ని అమలు పరచజాలదు; పైగా అవినీతి పెరుగుతుంది.

"ఆమె పూర్తిగా నిరపరాధి అని నాకు తెలుసు. అన్యాయంగా విధించబడిన శిక్షనుంచి ఆమెను రక్షించటానికి మేము ఈ సెనేటులో పెట్టుకున్న ఆశ కూలిపోయింది—ఘోరమైన అన్యాయాన్ని ఈ పెద్ద కోర్టు కూడా ఖాయపరచింది."

"ఖాయపరచలేదు. సెనేటు కేసులోని నిజానిజాల పరిశీలనకు దిగదు."

సెలెనిన్ ఎప్పుడూ ఆయా సమావేశాలకు దూరంగా ఉంటాడు. కనుక ఎప్పుడూ నెఖ్లూదొవ్ ప్రేమ గాథను గురించి విని ఉండలేదు. నెఖ్లూదొవ్ ఆ సంగతి గ్రహించాడు. కనుక తనకూ మస్లోవాకూ మధ్యగల సంబంధాలను అతనికి చెప్పకుండా ఉండటమే మంచిదని నిశ్చయించుకున్నాడు.

సెలెనిన్ విషయం మార్చాడు. "మీ అత్తగారింట్లో బసచేస్తున్నావు కామాలేం? ఆమే చెప్పింది నువ్వు వచ్చావని. నన్నుకూడా రమ్మని చెప్పింది. సాయంత్రమున్నను ఎవరో విదేశీయ మతబోధకుడు వచ్చి ఉపన్యాసం ఇస్తాట్ట కదా!" అంటూ పెదవులతో మాత్రమే నవ్వాడు.

"ఔను, నిన్న ఉపన్యాసానికి హాజరైనాను. కాని విసుగెత్తి లేచి పోయాను." సెలెనిన్ విషయం మార్చినందుకు విసుక్కున్నాడు మనస్సులో నెఖ్లూదొవ్.

"విసుగెత్తటం ఎందుకు? మతవిషయికమైన భావవిస్ఫూర్తి. అంతే కద!"

"అంతే కాదు. ఒక అర్థంలేని వెర్రి."

"కాదు, కాదు; అలా అనకూడని మతవిషయాలు మనకు అల్పంగా తెలుసు. మతవిషయికమైన మూఢనమ్మకాలనుకునే వాటిలోనే ఒక కొత్త వెలుగు మనం చూడగలుగుతాం."

"ఇలా సెలెనిన్ మాట్లాడ్డం నెఖ్లూడోవ్ ఎప్పుడూ వినలేదు — ఇటువంటి తీవ్ర ఉద్రేకాలు వెలువరిస్తున్న సెలెనిన్‌ను ఎగాదిగా చూశాడు నెఖ్లూడోవ్. సెలెనిన్ తలవంచుకున్నాడు. అతనిముఖంలో ఏదో విషాదచ్ఛాయ తొణికిసలాడుతోంది.

"అయితే ఈ మూఢమతనమ్మకాల్లో నీకు నమ్మకం ఉందన్నమాట!" నెఖ్లూడోవ్ అడిగాడు.

"ఔను, ఉంది" అంటూ సెలెనిన్ నెఖ్లూడోవ్ కళ్ళల్లోకి చూశాడు. ఆ చూపుల్లో జీవం ఉన్నట్టులేదు.

నెఖ్లూడోవ్ నిశ్వసించాడు. "ఆశ్చర్యంగా ఉందే!"

"మరొకసారి మాట్లాడుకుందాం" అంటూ తనకోసమని వచ్చిన సెనేటు గుమాస్తాతో "వస్తున్నాను" అని పలికి మళ్లీ నెఖ్లూడోవ్ వైపు తిరిగి "మరొకసారి కలుసుకుందాం? కాని నిన్నెక్కడని వెతుక్కుంటూ రాను? నేను మాత్రం సాయంత్రం ఏడుగంటలకు ప్రతిరోజూ ఇంటివద్దే ఉంటాను" అంటూ తన చిరునామా తెలిపాడు. మళ్ళీ పెదవులతో మాత్రమే నవ్వి వెళ్ళిపోబోతున్నాడు.

"వీలైతే నేనొకసారి వచ్చి తప్పకుండా కలుసుకుంటాను" అన్నాడు నెఖ్లూడోవ్. ఒకప్పుడు ఈ సెలెనిన్ తనకు మిత్రుడు, అత్యంత సన్నిహితుడు. కాని ఇప్పుడు ఈ కాసేపు సంభాషణవల్ల తనకెంతో దూరస్థుడు, అపరిచితుడు, దుర్గ్రాహ్యుడుగా కనిపించాడు.

## ౨౩

నెఖ్లూడోవ్ సెలెనిన్‌ను బాగా యెరిగివున్న రోజుల్లో అతను పితృభక్తిపరుడు, స్నేహపాత్రుడు, విద్యాధికుడు, నేర్పుగలవాడు, అందగాడు, మర్యాదస్థుడు అని పేరు పడ్డాడు. అసాధారణ సత్యసంధుడనిపించుకున్నాడు. ఎక్కువగా కృషి చేయకుండానే ఉన్నతవిద్య అభ్యసించాడు. రాసిన వ్యాసాలకు బంగారు పతకాలను బహుమానం పొందాడు. మానవసేవే జీవితపరమావధిగా యెంచుకునేవాడు—మాటల్లోనే కాదు చేతల్లోకూడా

అలా బుజువుచేశాడు. చదువు పూర్తికాగానే తాను ఏ డిపార్టుమెం
చేరితే దేశసేవ చేయటానికి అనువుగా వుంటుందో బాగా ఆలోచించి,
త్వపు న్యాయశాఖలో చేరాడు. ఆ శాఖలో తన విధ్యుక్తాలను చ
నిర్వర్తించాడు. కాని తనవల్ల ప్రజలకేమీ ఉపయోగం ఉంటున్న
పించలేదు. సక్రమంగానే తాను ప్రవర్తిస్తున్నట్టు కూడా అం
చెప్పలేదు.

అదీగాక అతనిపై యధికారి సంకుచిత మనస్కుడు-అక్రమా
నితో యేదో పేచీ వస్తూనే ఉండేది - దాగా అసంతృప్తి పెరిగిపో
ఉద్యోగం వదిలివేసి సెనేటులో చేరాడు. ఇక్కడ బాగానే ఉంది
అసంతృప్తి అతన్ని వొదలటంలేదు. పరిస్థితులు తాను అనుకున్నట్టుగా
సక్రమంగాని పద్ధతిలో నడుస్తూ ఉండటమే అతని అసంతృప్తికి కా

సెనేటులో తనకిచ్చిన ఉద్యోగంలాంటిది ఉండవలసిన ఆ
ఏమిటో అతనికెంత ఆలోచించినా బోధపడలేదు. కాని ఆ వు
వొదిలేసి వచ్చేస్తే, తన్ను మన్నించి ఆ వుద్యోగం ఇప్పించినవారికి
కోపం వస్తుందోనని భయం. అదీగాక హోదా ఆకర్షణీయంగా
పించింది.

రోజులు గడవగా అతనికి ఒక పెద్దపెళ్ళి సంబంధం కుదిర్చారు.
వివాహం చేసుకోగోరుతున్న పెళ్ళికూతురు మనస్సును నొప్పించ
ఇష్టంలేక - సంబంధం కుదిర్చినవారికి ఎదురుచెప్పలేక—ఒక ధనికుల
బిడ్డను భార్యగా స్వీకరించటం గర్వకారణమేనని స్ఫురించినందువల్ల
మొత్తంమీద పెళ్ళిచేసుకున్నాడు. కాని యీ పెళ్ళికూడా కాల
అసంతృప్తికరంగానే పరిణమించింది, ప్రభుత్వశాఖలో ఉద్యో
సెనేటులో ఉద్యోగంవలెనే.

ఒక్కబిడ్డను ప్రసవించిన తరువాత, ఇక పిల్లల్ని కనకూడదు అ
భార్య నిశ్చయించుకుంది. అక్కడనుంచి ఒకరకమైన, ఆడంబర జీ
గడపసాగింది-ఇష్టం ఉన్నా, లేకపోయినా సెలెనిన్ కూడా ఆమెను
రించక తప్పలేదు.

ఆమె ప్రత్యేకమైన అందగత్తె యేమీకాదు; భర్తయెడల కృత
గానే వుండేది. కాని ఆమె తలపెట్టి, సాగించుకుంటూన్న ఆడంబరజీ

అలసట, త్రిప్పట గొప్ప పొందినలాభం ఏమీగాలేదు – కాని ఈ అర్థంలేని ప్రాపంచిక సాధారణసుఖాలకోసం పోరుతూండే వ్యక్తిని ఆమె విడువలేదు. ఈ రకమైన జీవితవిధానం – ఆమె కన్నకలను నిజతుల్యంగా పరిణమించింది. దీన్ని మార్చాలని అతడు శాయశక్తులా ప్రయత్నించాడు. కాని ఏమాత్రమూ లాభంలేకపోయింది. 'అసలు జీవితం సుఖాలకోసమే – ఇలాగే ఉండాలి' అనే తనభార్య నమ్మకాన్ని ఆమె స్నేహితులు, బంధువులు ఆమోదించారు; బలపరిచారు.

పుట్టినది ఆడుబిడ్డ. పొడుగ్గా పుష్టిగా అందంగా ఉంటుంది; ఆ పసిపిల్ల చిన్నతనంనుంచీ ఇటువంటి వ్యక్తిజీవితంలోనే శిక్షణపొందటం అతనికి ఇష్టం లేదు. తత్కారణంగా భార్యాభర్తల మధ్య భేదాభిప్రాయాలు మొలకెత్తాయి. పరస్పరం సంప్రదించుకునే అలవాట్లు పోయాయి. ఒక రకమైన సంసార సంగ్రామం ఆరంభమైంది. ఇది నాలుగుగోడల మధ్య భీభత్సంగా ఉండేది. నలుగురిలోకి వచ్చినప్పుడు మర్యాదార్థం అణగివుండేది – అతనికి గార్హస్థ్యభారం అయింది. ఉద్యోగంలాగే ఇదీ సవ్యమైనదిగా కనిపించలేదు.

ఇక తనకు మతంమీద గల భావం కూడా అపసవ్యంగానే తయారైంది. విశ్వవిద్యాలయంలో చదువుతుంటోన్న రోజుల్లో మూఢమత విశ్వాసాలనే సంకెళ్ళను త్రెంచేసుకున్నాడు. సాధారణంగా అందరూ అలాగే చేస్తారు చదువుకుంటున్న రోజుల్లో. మతం అంటే ఒక ఏహ్యభావాన్ని ప్రకటించేవాడు. కాని రోజులు గడవగా, ఉద్యోగంలో ఉన్నతికి వెడుతూన్నకొద్దీ ఈ ఏహ్యభావమే అతని దారి కడ్డంగా ఉండి వెక్కిరించటం మొదలుపెట్టింది. ఒకవంక కౌటుంబిక వ్యవస్థ తెచ్చిపెడుతూన్న ఒత్తిడివల్ల ముఖ్యంగా తల్లి కోరికను పాటించక తప్పని స్థితిలో, ఇతరులేమనుకుంటారో అన్న భయంచేత, కొన్ని సాంప్రదాయసిద్ధమైన ఆచారాలను అనుష్ఠింపక తప్పలేదు. ప్రభుత్వోద్యోగంలో ఉన్నందున తత్సంబంధమైన ఆచారాల రీత్యా ప్రార్థన సమావేశాలకేమి, తదితరములైన వాటికేమి హాజరు కావలసి వచ్చింది. ప్రతిరోజూ అటువంటి ఏదో సమావేశానికి హాజరుకాక తప్పలేదు. హాజరైనప్పుడు తనకు నమ్మకంలేని ఇటువంటి ఆచారాలలో నమ్మకం ఉన్నట్టే పైకి నటించాలి. కృత్రిమం ఎరుగనివాడు కాబట్టి అలా నటించటం చాతకాకపోయేది. లేదా, ఈ బాహ్యాచారాలన్నీ వట్టి ఆడంబరాలని నిశ్చయించుకుని, వాటిని పాటించే ఈ ఉద్యోగానికి తిలాంజలి ఇచ్చి బైటికి వచ్చే

దగ్గర ఉన్న నిధి అనీ-ఇలాంటి విషయాల సమేకం నిర్ధారణ చేసుకున్నాడు. నాటినుంచీ మామూలుగా ప్రార్థనలకూ-చనిపోయినవారి ఆత్మ శాంతి కోసం చేసే మత విషయకమైన తంతులకు-పాపప్రాయశ్చిత్త తంత్రాలకు హాజరౌతూ ఉన్నాడు. తనలో ప్రవేశించిన అసత్యాన్ని పూర్తిగా విస్మరించాడు. మానవసేవ చేయటానికి వీలుగా ఉన్నదని తనకు నమ్మకం కలిగిన ఆ ఉద్యోగంలోనే రోజులు గడుపుతున్నాడు. సుఖంలేని తన సంసారంనుంచి విశ్రాంతి కల్పిస్తున్నదా ఉద్యోగం. ఇలాంటి స్థితిలో కూడా ఇప్పుడు తాననుసరిస్తున్న — తనకు మనశ్శాంతి నివ్వగలుగుతున్నాయన్న భావాన్ని కల్పించిన - మత సాంప్రదాయాలు సక్రమమైనవి కావన్న ఒక భావం అతని నిలువెల్లా వ్యాపించిపోయి ఉన్నట్టే తోస్తుంది. కనుకనే అతనికన్ను లెప్పుడూ విచార సూచకంగా ఉంటాయి.

ఈ సత్యాలన్నీ తనలో నెలకొనక ముందు అతనికీ, నెఖ్లూడోవుకు గాఢ పరిచయం ఉండింది. ఇప్పుడు నెఖ్లూడోవును చూడగానే సెలెనిన్‌కు తన పూర్వస్థితి యావత్తూ జ్ఞాపకం వచ్చింది. మత విషయికంగా తనకు గల ప్రస్తుతాభిప్రాయాలను నెఖ్లూడోవ్ ముందు వెల్లడించినప్పుడు 'ఇదంతా సవ్యంగా లేదు' అనిపించింది గాఢంగా. మిక్కిలి విచారపడ్డాడు. నెఖ్లూడోవ్ కూడా మొట్టమొదట తన పాత స్నేహితుని చూచినప్పుడు పొందిన ఆనంద తరంగం జారిపోగానే విచారమునే పొందాడు.

కాబట్టి మరొకసారి కలుసుకుందామని విడిపోయిన మిత్రులు అలా కలుసుకోటానికి చేసిన ప్రయత్నమేమీ లేదు. కాగా నెఖ్లూడోవ్ పీటర్స్‌బర్గులో ఉన్నన్నినాళ్ళూ వాళ్లు తిరిగి కలుసుకోలేకనే పోయారు.

## ౨౪

సెనేటులోనుంచి బైటికి వచ్చి నెఖ్లూడోవ్, ఫానరిన్ కాలినడకన బయలుదేరారు. ఎక్కి వచ్చిన బండీని వెనుకాల తీసుకురమ్మని వకీలు బండి వానితో చెప్పాడు. 995వ సెక్షన్ ప్రకారం నేరస్థుడై, తరువాత సైబీరియాలో ఒకపట్నానికి గవర్నరుగా నియమితుడైన ప్రభుత్వోద్యోగిని గురించి సెనేటర్లు మాటాడుకుంటున్నారు. ఆ గవర్నమెంటు ఉద్యోగిని గురించిన

వివరాలు వకీలు చాలా చెప్పాడు. అతను ఆ తప్పు ఎలా చేసింది, న్యాయ చట్టరీత్యా అటువంటి నేరం చేసినవాడు ప్రవాసశిక్షకు అర్హుడై ఉండగా ఎలా గవర్నరుగా నియమితుడైనదీ- అన్ని వివరాలూ సమగ్రంగా చెప్పాడు- తరువాత—ఆ యువయుం వారు చూచియున్న, ప్రజోపయోగానికి కట్టబడు తున్న ఒక భవనాన్ని గురించి సాగింది. పంచాయతు పలుకుబడిగల పెద్దమను ష్యులు దాని నిర్మాణంకోసం ధనం ప్రజలవద్ద పోగుచేసి ఎలా కాజేస్తు న్నారో చెప్పాడు వకీలు. ఆ నిర్మాణం ఇంకో శతాబ్దం వరకూ పూర్తికాదని కూడా చెప్పాడు - మాటలసోరణిలో వకీలు ఇంకా లోకాభిరామాయణ సంగతులు చాలా చెప్పాడు. ఒకానొక ప్రముఖుడు ఉంచుకున్న యువతి వ్యాపారంలో లక్షలు గడిచిందట! మరొక ప్రముఖుడెవరో తన భార్యను అంగడిలో అమ్మటానికి బేరం పెట్టాడట! పెద్దపెద్ద మోసాలు చేసి, చెప్పరాని నేరాలు చేసి, జైళ్ళలో శిక్ష అనుభవించటానికి బదులు ప్రభుత్వోద్యోగశాఖ లలో ఉన్నతపదవు లలంకరించినవారి కథలు చెప్పాడు వకీలు. ఇటువంటి కథలన్నీ వకీలు బుర్రలో అసంఖ్యాకంగా ఉన్నాయి. అవన్నీ చెబుతున్నప్పు డల్లా అతనికి ఆనందం ఔతుంది. పీటర్స్‌బర్గులో ఉద్యోగస్థులు డబ్బు సంపాదించే విధానాలు ఘోరాతిఘోరంగా ఉంటాయి. వాటితో తన ప్లీడరు వృత్తిని పోల్చి చూచుకునే అవకాశాన్ని కల్పిస్తాయి ఈ కథలు-అలా పోల్చి చూచుకున్నప్పుడల్లా తనవృత్తి చాలా న్యాయవంతమనీ, తానే చాలా అమాయకుడనీ, స్ఫురించి ఆత్మసంతృప్తి పొందుతూవుంటాడు. అందుచేత ఆ కథలన్నీ ఒకటివెంబడి ఒకటి చెప్పుకొస్తున్నాడు. కాని అకస్మాత్తుగా నెహ్లూడవ్ దారిపక్కన కనిపించిన రిక్షాయెక్కి, సెలవుపుచ్చుకుంటానని చెప్పి, దాటిపోయాడు. వకీలు అతని ప్రవర్తనకు ఆశ్చర్యపడ్డాడు.

నెహ్లూడోవ్‌కు చాలా విచారంగా ఉంది. సెనేటులో అపీలు కొట్టి వేశారు. అంటే నిరపరాధిని మస్లావా అనుభవిస్తున్న యాతనలు ఖాయ పడినాయన్నమాట! ఇక తనదారి, ఆమెదారి యీ ప్రపంచంలో భిన్నమై పోవలసిందేనా? ఈ రకమైన ఆలోచనలతో అతనిలో రేగుతూన్న విషాదం- వకీలు ఆనందంగా చెప్పుకొస్తూన్న-దేశంలోని దుర్మార్గాలనుగురించిన గాథల వల్ల అధికం అయింది. ఒకప్పుడు ఎంతో సౌజన్యమూర్తి, ఉదారుడుగా ఉండిన సెలెనిన్ ఈ నాడు తనకేసి చూచిన చూపుల్లో పూర్వపు మిత్రభావం

అన్నగారి పక్కనే ఒక పడకకుర్చీలో మేరియటీ కూర్చుని, కేథ్రి గిన్నె చేతిలో పట్టుకుని కూచుంది. ఆమె రంగురంగుల దుస్తులు వేసుకుని సీతాకోక చిలుకలా ఉంది. ఏ విషయాన్ని గురించో సరదాగా వాగుతోంది. అందమైన కళ్లు నవ్వుతూ వికాసవంతంగా ఉన్నాయి. ఆమె ఏదో నవ్వు వచ్చే తమాషా ప్రసంగం - అసభ్యమైనదే చెప్పివుండాలి — అని నెఖ్లూదొవ్ వాళ్ళ నవ్వునుబట్టి ఊహించాడు. పిన్నమ్మగారి లావుపాటి విగ్రహం యావత్తూ ఆ నవ్వుకు ఊగిసలాడిపోతోంది. మేరియటీ మందహాసం చిలుకు తూన్న మాటలు త్రిప్పి, తల ఒక ప్రక్కగా వంచి, చిరునవ్వులు చిలికే ముఖంలో చిలిపితనం ఊగిసలాడుతుంటే అలా ఆ విధ్రుకుర్రాణ్ణి కేసి చూస్తూ కూచుంది.

వాళ్ళు మాట్లాడుకుంటూన్న మాటలు ఏ కొన్నో వినిపించాయి కామాలు. సైబీరియాకు గవర్నరుగా నియమితుడైన ఆ నేస్తుని విషయమే ఆ స్త్రీలిద్దరూ మాట్లాడుకుంటున్నారని నెఖ్లూదొవ్ తేల్చుకున్నాడు. అతన్ని గురించే మేరియటీ చిలిపిగా ఒక వ్యాఖ్యానం విసిరివుంటుంది హాస్యంగా. కేథరైన్ ఆపుకోలేక పగలబడి నవ్వుతోంది. పొట్టచెక్కలయ్యే ఆ నవ్వు తమాయించుకోలేక “చంపేశావ్” అంటోంది ఆమె.

“కులాసా?” అని మేరియటీని పలుకరిస్తూ నెఖ్లూదొవ్ వచ్చి కూచున్నాడు. మేరియటీ అంత ప్రోల్లాసంగా, వెకిలిగా ఉంటున్నందుకు నెఖ్లూదొవ్ తన మనస్సులో కోపగించుకోబోతున్నాడు. ఆమె అతని ముఖ వైఖరిలోని గాంభీర్యాన్ని, చూపుల్లోని అసంతృప్తినీ కనిపెట్టేసింది. వెంటనే తన ముఖకవళికల్లో మార్పు తెచ్చుకుంది. తన మానసిక స్థితినికూడా సంస్కరించుకుంది. చూడగానే అతన్ని సంతోషపెట్టాలి అన్న భావానికి లొంగి పోయింది. తానుకూడా ముఖంలో గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకుంది - తన ప్రస్తుత జీవితవిధానంతో అసంతృప్తిచెంది, ఒక ఉన్నతమైన ఆశయంకోసం తపిస్తున్నదానివలె కనిపించింది. అదంతా నటనకాదు. నెఖ్లూదొవ్ మన స్థితి ఎలాంటిదో మాటల్లో చెప్పవలసివస్తే మేరియటీకి చేతకాదు. అయినా అతని మనస్థితివంటి మనస్థితిని తనలోకూడా నెలకొల్పుకుంది.

“నువ్వు తలపెట్టిన సత్కార్యాలన్నీ సాగుతున్నాయా?” అని మేరియటీ ప్రశ్నించింది. సెనేటులో తన ఓటమిని, ఆ తరువాత సెలెనిన్‌తో సమావేశంగురించీ చెప్పాడు నెఖ్లూదొవ్.

"ఆహా! అతడొక పవిత్రవ్యక్తి. నిగ్రహయుడు. ఏ విషయంలోనూ వేలుపెట్టించుకునేవాడు కాదు-చాలా పవిత్రుడు" అన్నారా యిద్దరు స్త్రీలు సెలెనిన్ ప్రసంగం రాగానే. సాధారణంగా సెలెనిన్ గురించి చెప్పవలసి నప్పుడు పీటర్స్‌బర్గులో ప్రజలంతా ఉపయోగించే విశేషణాలే వీరూ ఉపయోగించారు.

"అతనిభార్య ఎలాంటిదేమిటి?" నెఖ్లూడో ప్రశ్నించాడు.

"అతనిభార్య? ఇతరులనుగురించి వ్యాఖ్యానంచేయటం నా కిష్టంలేదు. కాని అతని స్వభావాన్ని సరిగా గుర్తించలేకపోతున్నది ఆమె."

"సెలెనిన్ కూడా అప్పీలును త్రోసివేయటానికే వోటు చేశాడా? చాలా ఘోరం! పాపం, ఆ యువతిని తలచుకుంటే నాకు చాలా విచారం కలుగుతోంది—" అన్నది మేరియట్ నిజమైన జాలి ప్రకటిస్తూ.

నెఖ్లూడో కనబొమలు ముడుచుకుపోయాయి. విషయం మార్చాడు. మేరియట్ సౌజన్యంవల్ల కోటలో ఖైదులోనుంచి విడుదలై బయటపడిన షుస్టోవా గురించి ప్రసంగించాడు. ఈ విషయంలో మేరియట్ కొంత శ్రమ తీసుకుని సాయంచేసినందుకు కృతజ్ఞత తెలిపాడు. అధికారు లెవరూ సాయపడేవాళ్లు లేక షుస్టోవా, ఆమె కుటుంబము ఇన్నాళ్ళనుంచీ ఎన్ని బాధలు పడ్డారో తలచుకుంటె భయంకరంగా ఉంటుంది- అని నెఖ్లూడో చెప్పబోతూ ఉంటే మేరియట్ అడ్డం వచ్చి—

"నువ్వు ఆ సంగతి నాకు చెప్పనక్కర్లేదు. ఆమెను విడుదల చేసెయ్యవచ్చునని మా వారు చెప్పినప్పుడు—'ఆమె నిరపరాధి అయినప్పుడు అసలు ఎందుకు నిర్బంధించాలి?' అని నాకు చాలా కోపం వచ్చింది. అది చాలా అక్రమం" అంటూ ఆమె నెఖ్లూడో చెప్పవచ్చిన మాటలు తానే చెప్పింది.

మేరియట్ నెఖ్లూడో ముందు ఇచ్చకాలు పలుకుతున్నదని కేథరైను అనుకుంది. మేరియట్ మాటలన్నీ వింటూంటే ఆమెకు తమాషాగా ఉంది- లోలోపల ఆనందిస్తూ చూచింది. చివరకు వాళ్ళ సంభాషణ ముగిసిన తర్వాత "రేపు రాత్రికి ఎలీనా యింటికి వస్తావు కదూ! కీస్‌వెటర్ కూడా అక్కడే వుంటాడు" అని నెఖ్లూడోను ఉద్దేశించి పలికింది. వెంటనే మేరి

యట్ వైపు తిరిగి "నువ్వుకూడా రావాలి" అంది. మళ్ళీ నెల్లాడో వైపు తిరిగి "అతడు నిన్ను చూచాడు. నువ్వు నాకు చెప్పినమాటలన్నీ అతనికి చెప్పాను-అదంతా మంచిదేనన్నాడు. నువ్వు తప్పనిసరిగా ఏసుక్రీస్తుప్రభువు పరిష్వంగంలోకి వస్తావన్నాడు. నువ్వు గట్టిగా రావాలి" అని మేరియట్ కేసి తిరిగి "నువ్వుకూడా రమ్మని చెప్పు. నువ్వూ రావాలి" అన్నది.

"ఇంతకూ నెల్లాడోకు సలహా ఇవ్వదగిన హోదా నాకేముంది? అదీ గాక, నీకు తెలుసు కదా! నాకు ఇటువంటి విషయాల్లో సరదా లేదు" అంటూ మేరియట్ నెల్లాడో వైపు చూచింది. కేథరైన్ మాటలపట్ల తమ యిద్దరికీ సమానమైన ఒక భావాన్ని వ్యక్తం చేస్తున్నదా చూపు. అంతే గాదు మతవిషయిక చర్చలపట్లకూడా తమ యిద్దరికీ గల అలస భావాన్ని కూడా ప్రకటించిందా చూపు.

"ఔనౌను. నువ్వు చేసేపనులన్నీ నీ సొంత ఊహల ప్రకారం అప సవ్యంగా చేస్తూఉంటావు."

"నా సొంత ఊహలా? మామూలు పల్లెటూరి యువతిలా ఎవరేది చెబితే అది నమ్ముతూ ఉంటాను" అని మందహాసం చేస్తూ "అయినా రేపు రాత్రికి నేను ఫ్రెంచినాటకానికి వెడుతున్నాను" అన్నది.

"ఓహో, నువ్వు చూచావా - ఆ-ఆవిడ పేరేమిటి?" అని నెల్లాడోను ఉద్దేశించి ప్రశ్నించింది. ఒక పేరుగన్న నట్టువరాలి పేరు చెప్పింది మేరియట్.

"నువ్వు తప్పకుండా వెళ్ళాల్సిందే. ఆవిడ అద్భుతంగా నటిస్తుంది."

"నేనెవర్ని దర్శించాలి మొదట? నట్టువరాలినా? మతబోధకుడినా?" నవ్వుతూ అడిగాడు నెల్లాడో.

"దయచేసి పరిహాసా లాడకు."

"మొదట మతబోధకుడినే దర్శించాలనుకుంటాను. లేకపోతే మతోపన్యాసాలమీద కోరిక పూర్తిగా నశిస్తుంది. అంతేనా?" అన్నాడు నెల్లాడో.

"అలా కాదు. మొదట ఫ్రెంచి నాటకంతో ఆరంభించి చివరకు తపస్సులో దిగాలి."

"నేను ఒప్పుకోను. మీరిద్దరూ నన్ను ఆటలు పట్టిస్తున్నారు. మతబోధకుడు మతబోధకుడే; నాటకం నాటకమే. మూతి బిగించుకుని ఏడు

స్తే కేగాని మోక్షం రాదా యేమిటి? దేవునిలో విశ్వాసం ఉండాలి; ఆత్మానందం తప్పకుండా చేకూరుతుంది."

"మతబోధకులను మించి ఉపన్యసిస్తున్నావు"

"నేను చెబుతున్నాను కదూ! నువ్వు రేపు నాటకానికి తప్పకుండా రావాలి" మేరియటి అన్నది.

"నేను రావాల—"

నౌకరు తలుపు తోసుకుని లోపలికి రావటంతో సంభాషణకు అంతరాయం కలిగింది- పేటర్స్బర్గ్లో ఒక 'నిర్భాగ్య సహాయసంఘం' ఏర్పడింది. బీదలకు సహాయం చేయాలన్న ధర్మపరులు అందులో సభ్యులు. కేథరైన్ అధ్యక్షురాలు. ఇప్పుడామెను చూచిపోడానికి ఆ సంఘ కార్యదర్శి వచ్చాడని నౌకరు చెప్పాడు.

"వట్టి మూర్ఖుడా కార్యదర్శి. బైటనుంచే మాటాడి పంపించివస్తాను. అతనికి టేనీరు కలిపి ఇవ్వు" అని మేరియటీతో చెప్పి కేథరైన్ బయటికి వెళ్ళింది.

స్టౌమీద కాగుతూన్న పాలుతీసి టీ కలిపి నెక్లూడోవు అందించి "తీసుకో" అంది మేరియటీ. ఆమె ఉంగరాల వ్రేళ్లు తిరుక్కుంటున్నాయి గిన్నెమీద. చిటికెన వేలు మాత్రం గిన్నెమీద ఆనకుండా చిత్రంగా దూరంగా ఉంది - అతనిముఖం గంభీరంగానూ, విచారసూచకంగానూ ఉంది.

"ఎవరి ఆశయాలను ఎక్కువగా గౌరవిస్తానో, వారి సమక్షమందు నా ప్రస్తుత జీవనస్థితి జ్ఞాపకంవచ్చి దుఃఖసముద్రంలో మునకలువేస్తూ ఉంటాను" అని పలుకుతూ ఉంటే ఆమెకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. ఆ మాటలు విడదీసిచూస్తే అర్థరహితాలే. ఉన్నా ఏ కాస్తో అర్థం వుంటుంది. అయినా వాటిలో అపారమైన అర్థం, లోతు, ఉన్నట్టు నెక్లూడోవు తోచింది. ఆమెకు తనయెడగల సద్భావంకూడా కనిపించింది ఆ మాటల్లో. ఆకర్షకములైన దుస్తులు ధరించిన ఆ అందగత్తె ఆ మాటలు పలుకుతూన్నప్పుడామె చూపులకాంతికి ముగ్ధుడైనాడతడు. ఆమె ముఖంలోనుంచి తన చూపులను మరల్చుకోలేకపోయినాడు; అలాగే చూస్తూ కూచున్నాడు.

"నిన్నూ, నీ భావాలనూ నేను అర్థం చేసుకోజాలనని అనుకోకు. నువ్వేం చేస్తున్నావో అందరికీ తెలుసు-అది అందరికీ తెలిసిన రహస్యం. నీ భావాలతో నేను ఏకీభవిస్తున్నాను. నీ పనులను అభినందిస్తున్నాను" అన్నదామె.

"నన్ను అభినందించ తగినంతగా నేనేమీ చేయలేదే!"

"చేయలేకపోతే ఫరవాలేదు. నీ మనోభావాలను నేను గ్రహించాను. ఆమెను అవగాహన చేసుకోగలిగాను. చాలా బాగుంది. ఇంతకంటే ఆ విషయమై నేనేమీ చెప్పను" అన్నది అతని ముఖంలో నిరానందరేఖను గమనించి. అయినా స్త్రీ గనుక అతనికి ఇష్టమైన, ప్రముఖమైన, ప్రియమైన సంగతి తేలిగ్గా ఊహించి అన్నది—"జైళ్ళలో ఆ ఖైదీలు పడుతూన్న విపరీతబాధలను చూచి, సహించలేకపోయావు. ఇతర్ల నిర్లక్ష్యభావానికీ, క్రౌర్యానికీ గురియై నానాయాతనలను అనుభవిస్తూన్నవారికి సాయం చేయ తలపెట్టావు. అట్టి ఆత్మత్యాగాన్ని నేను అర్థంచేసుకోగలను. కాని ఎవరి విధి వ్రాత వాళ్ళది!"

"అయితే నీ విధివ్రాతను నీవు సంతృప్తిపడలేకపోతున్నావా?"

ఆ ప్రశ్న అత డడుగుతాడని ఆమె అనుకోలేదు. ఆశ్చర్యాన్వితయై "నేనా? తృప్తిపడక తప్పదు. తృప్తిపడే ఉన్నాను. కాని మాటి మాటికీ ఒక పురుగు తొలుస్తూ ఉంటుంది."

దాన్ని తొలవనిస్తూ ఉండాల్సిందే! దాన్ని సమసిపోనీయకూడదు. అది అనుసరించదగిన ఒక సందేశం" అన్నాడు నెఖ్లూడొ ఆమె పన్నిన వలలో చిక్కుకుని.

తరువాత చాలాసార్లు ఈ సంభాషణ తలపుకు వచ్చినప్పుడల్లా నెఖ్లూడొ తనలో తాను సిగ్గుపడేవాడు. ఆమె పలుకులు అబద్ధాలు కావు; కాని తన అనుకరణాలు. చాలాకాలంవరకూ ఆ పలుకులు అతనికి జ్ఞాపకం వస్తూనేఉండేవి. ఖైదీలబాధలనుగురించీ, పల్లెరైతులనుగురించిన తన యభిప్రాయాలను నెఖ్లూడొ చెబుతూన్నప్పుడు ఆమె ఎంతో శ్రద్ధగా, జాలి పడుతూ విన్నప్పుడు ఆమె ముఖంకూడా చాలాకాలం స్మృతిపథంనుంచి వీడిపోలేదు.

కేథరైన్ తిరిగి వచ్చింది. చిరకాలంనుంచీ అత్యంతమిత్రులుగా వుండిన వ్యక్తులవలె ఇద్దరూ మాట్లాడుకుంటూ ఉన్నారు. పరస్పరభావాలను పరిపూర్ణంగా అర్థం చేసుకున్న సన్నిహితులుగా కనిపించారు.

అధికారుల అన్యాయాల్ని గురించి, అమాయకుల అవస్థలనుగూర్చి, ప్రజ లనుభవించే దారిద్ర్యాన్ని గురించీ వారిద్దరూ చాలాసేపు ప్రసంగించుకున్నారు, కాని వాస్తవికంగా మధ్యమధ్య ఒకరి కన్నుల్లోకి ఒకరు బరపుతూన్న చూపుల్లో 'నన్ను ప్రేమించగలవా' అన్న ప్రశ్నలు, 'ఔను ప్రేమించగలను' అను జవాబులు దొర్లిపోతున్నాయి. కామేచ్ఛ తలచని తలంపుగా, విచిత్రరూపాలుగా సాగుతూ ఇద్దర్నీ దగ్గరకు చేర్చింది.

“నీకు ఏ సమయాన ఏ విధమైన సాయం కావలసివచ్చినా నేను వెనుదీయను. నీకు సాయపడటం నాకిష్టం. నీకొక ముఖ్యవిషయం చెప్పాలి. రేపురాత్రి నాటకశాలలో కలుస్తావు కదూ ? కనీసం ఒక్క నిమిషం అయినా సరే !” అన్నది మేరియటే వెళ్ళిపోడానికి లేస్తూ. “మళ్ళీ ఎప్పటికి కలుస్తామో, ఎవరు చెప్పగలరు ? వొస్తావు కదూ !” అని అడిగింది.

నెఖ్లూడో వస్తానని వాగ్దానం చేశాడు.

ఆ రాత్రి నెఖ్లూడో దీపం ఆర్పుకుని నిద్రపోదామని పడుకుంటే కళ్ళు మూత పడలేదు. మస్లోవాను తలచుకున్నాడు. సెనేటు తీర్పును స్మరించాడు. ఏమైనాగానీ మస్లోవాను అనుసరించి వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు. తన భూ ఆస్తి యావత్తూ రైతులపరం చెయ్యాలనే నిశ్చయించుకున్నాడు. ఇంతలో అకస్మాత్తుగా మేరియటి వదనం గోచరించింది. తన కన్నుల్లోకి చూస్తూ, నిట్టూర్పు విడుస్తూ 'మళ్ళీ ఎప్పటికి కలుస్తామో కదా !' అంటోంది. చిరునవ్వు నవ్వుతోంది ప్రస్ఫుటంగా. ఆమె నిజంగా తనయెదుట ఉన్నట్టుగానే తానుకూడా నవ్వాడు.” నేను సైబీరియాకు వెళ్ళటానికే నిశ్చయించుకోటం సబబేనా ? నా ఆస్తిఅంతా వొదులుకోటంలో మంచిపని చేస్తున్నట్టేనా ?” అని ప్రశ్నించుకున్నాడు.

“ఈ నా నూతన విశ్వాసాలన్నీ స్వప్నతుల్యాలే ఔతే ? ఈ ఆశయాలన్నింటినీ కొనసాగించ లేకపోతే ? ఇన్ని మంచి పనులు తలపెట్టినందుకు చివరకు పశ్చాత్తాప పడవలసివస్తే ? ఇలా రేగుతూన్న ప్రశ్న పరంపరలకు

జవాబులు రాలేదు. ఏదో నిరాశ, నిస్పృహా, బాధ ఇదివరకెన్నడూ లేనివి అతన్ని ముంచుకున్నాయి. చీకాటిలో అపారంగా స్త్రీన్ని పొందిన తర్వాత ఒకప్పుడు తానునుభవించినలాంటి ఒక గాఢ నిద్రలో పడిపోయాడు చివరకు.

౨౨

తెల్లవారి నిద్ర లేచాడు. లోగడ దినం ఏదో గొప్ప అన్యాయం చేసిన వాడులా అవ్యక్తబాధ అనుభవించాడు. నిశితంగా ఆత్మ పరిశీలన చేసుకున్నాడు. తానేమీ తప్పు చేసినట్టు తోచలేదు. ఏ దుర్మార్గమూ చేయలేదు. కాని కొన్ని చెడు ఆలోచనలు కలిగినట్టు స్ఫురించింది! మళ్లా వాడు పెళ్ళి చేసుకోవాలనీ, తన ఆస్తిని యావత్తూ వొదిలేసుకోవాలనీ తాను భావించుకున్న నిశ్చయాలు నెరవేరజాలని స్వప్నాలనీ అనుకున్నాడు. తాను తన ఆశయాలను నెరవేర్చజాలడేమోనని భయపడ్డాడు. అదంతా కృత్రిమం, అస్వాభావికం అనుకున్నాడు. ఇదివరకు వలెనే జీవితం గడుపుకు పోవలసిందే ననుకున్నాడు.

తానేమీ తప్పుపని చేయలేదు. కాని ఇటువంటి తప్పుటూహాలే తప్పు పనులకన్నా హానికరాలు. వాటినుంచే తప్పు పనులు ఉత్పన్నమౌతాయి. ఒక తప్పుపని చేశాక పశ్చాత్తాపపడి దాన్ని మళ్ళీ చేయకుండా ఉండవచ్చు. కాని తప్పుడు ఆలోచనల ఫలితంగా తప్పుడు పనులు జరిగి తీరుతాయి. ఒక చెడు పని మరొక చెడుపనికి దారి చేస్తుంది. చెడు ఆలోచనలు మనిషిని చెడు మార్గాన బలవంతాన ఈడ్చుకు పోతాయి.

అటువంటి ఆలోచనలు గతరాత్రి తనలో ఎందుకు పొడచూపినవో తనకే ఆశ్చర్యమయింది. తాను చేయ సంకల్పించుకున్న పనులు కొత్తవి కావచ్చు, కష్టతరములైనవి కావచ్చు. అయినా ఇకముందు తన జీవితంలో అనుసరించదగిన మార్గం అదే. పూర్వం మల్లేనే బ్రతుకుదామని వెనక్కి తిరిగిపోవటం తేలికే. కాని అది బ్రతుకు కాదు; మృత్యువు. గాఢనిద్రనుంచి మెలకువ వచ్చినప్పుడు తాత్కాలికి ఒక అలసభావం ఆవరిస్తుంది. ఇంకా సేపు హాయిగా పక్కమీదే పడుండిపుందామనిపిస్తుంది. అలాంటిదే తనకు

గతరాత్రి అనుసరించిన నిరుత్సాహభావం పోదా. కాని పక్కమీదనుంచి లేచి ఆ నాటి కార్యక్రమంలో జొరబడాలని తెలియకుండా వుంటుందా ?

ఇక సీటువద్ద విడిచిపెట్టి మర్నాడు వెళ్ళిపోతావనగా నెల్లాండో పస్టావాను చూడ్డానికి వెళ్ళాడు, ఉత్తరంలో ఆమె తల్లి రాసిపెట్టిపోయిన చిరునామా ననుసరించి.

ఆమె రెండో అంతస్తులోని గదిలో వుంటున్నది. ఇంటి వైపునున్న మెట్లెక్కి వెళ్ళాడు. సరాసరి వంటయింట్లోకి తీసుకుపోయాయి ఆ మెట్లు. వాళ్ళు వండుకున్న అన్నం, కూరలవాసన కొట్టింది, కళ్ళజోడు పెట్టుకుని ఒక వయసుమళ్ళిన స్త్రీ పొగలుగక్కుతోన్న చట్టిలో గరిటె పెట్టి గబగబా త్రిప్పుతున్నది. కళ్ళద్దాలలోనుంచి నెల్లాండో వైపు తీక్షణంగా చూస్తూ "ఎవరికోసం ?" అని అడిగింది.

నెల్లాండో తన పేరు చెప్పబోయాడు. కాని మరుక్షణమే ఆమె ముఖంలో భయం, ఆనందం చుట్టుముట్టిన తీరు గోచరించింది.

"ఓహో ! దొరగారా ? వెనకవోవన వచ్చారేం ? మా పాలిదేవుడు తమరు ! ఆ పిల్ల తల్లిని నేనే. జైల్లోవాళ్ళు మా పిల్లను హత్యచేసినంతపని చేశారు. మీరు మమ్మల్ని రక్షించారు – మీ దర్శనం చేసుకుందామని నిన్న వచ్చాను. మా చెల్లెలు వెళ్ళిరమ్మని పోరుపెడితే వచ్చాను. ఇలా, ఇటు వైపు రండి" అంటూ ఆ పక్కద్వారంలోనుంచి అవతల వున్న చిన్నగది లోనికి తీసుకుపోతూ "ఇక్కడుంటూన్న మా చెల్లెలిపేరు కోర్నెలియా. మీరు వినే ఉంటారేమో !" అని చెప్పి కొంచెం నెమ్మదిగా "ఆమె ఏదో రాజకీయ గొడవలో పనిచేస్తున్నది. చాలా తెలివిగల మనిషి" అన్నది.

ఆ చిన్నగదిలో ఒక సోఫామీద పొట్టిగా, బొద్దుగా ఉన్న పిల్ల కూచునివుంది. ముందు టేబిల్ ఒకటి వుంది. ఆమె జుట్టు చాలా అందంగా వుంది. పాలిపోయిన ఆ గుండ్రని ముఖంమీద ముంగురులు ఆడుకుంటు న్నాయి. కళ్ళగాను తొడుక్కుంది.

ఆమెకు ఎదురుగా ఒక కుర్చీలో నూనూగు గడ్డం, మీసం గల ఒక యువకుడు ముందుకు వంగి కూచున్నాడు. వాళ్ళిద్దరూ ఏదో సంభాషణ లో మునిగిపోయివున్నారు. నెల్లాండో లోపలికి వచ్చిన కాసేపటికి గాని వాళ్ళు తలెత్తి చూడనేలేదు.

"అమ్మా మస్లోవా! నెహ్లూదోవ్ దొరగారే! వారే..." అన్నది తల్లి.

ఆ పిల్ల ఉలికిపడి లేచింది. ముసురుకొస్తున్న ముంగురులను పైకి తోసుకుంటూ, తన చేరెడేసి కన్నులువిప్పుకుని, భయంభయంగా చూచింది ఆగంతకుని కేసి.

"దుఖోవా నాతో...విడిపించితీరాలని చెప్పిన ఆ మహాశేరస్థురాలు నువ్వేనా?" నెహ్లూదోవ్ నవ్వుతూ అడిగాడు.

"నేనే" అంటూ ఆమె నవ్వింది అందమైన దంతాలవరుస కనిపించేట్టు. "మా పిన్ని మిమ్మల్ని చూడాలని ఎంతో ఇదిగా అనుకుంటోంది—" అంటూ మృదుమధుర స్వరాన పిన్నిని కేకవేసి పిల్చింది. 'ఇక్కడ కూర్చోండి' అని సోఫా చూపించింది. ఇంతలో కుర్చీలోని యువకుడు లేచాడు. "ప్లీజ్, కుర్చీలో బాగుంటుంది. దయచెయ్యండి. అతడు మా పిన్ని కుమారుడు జఖరోవ్—" అని చెప్పింది.

నెహ్లూదోవ్ జఖరోవ్ కేసి చూచాడు. అతడు మందహాసం చేస్తూ నెహ్లూదోవ్ కుర్చీలో కూచున్న తరువాత మరో కుర్చీ తెచ్చుకుని ఆయన పక్కనే కూచున్నాడు. మరొక పదహారేళ్ళ కుర్రవాడొకడు ఇంట్లోనుంచి వచ్చి, కిటికీలో కూచున్నాడు.

"దుఖోవా మా పిన్నికి మంచి స్నేహితురాలు. కాని నేనామెను ఎరగను—" అన్నది మస్లోవా.

ఇంతలో ఒక యువతి—హృదయోల్లాసంతో తొణికిసలాడే ముఖం—తెల్లనిగౌను తొడుక్కుంది—ఒక తోలుపట్టా పెట్టుకుంది—పక్కగదిలో నుంచి వచ్చి "బాగున్నారా? మీరు వచ్చినందుకు కృతజ్ఞతావందనాలు" అని పలుకుతూ మస్లోవా పక్కనే సోఫాలో కూచుంది. "దుఖోవా కులాసాగా ఉన్నదాండి! మీరామెను చూచారు కామాలు. కష్టాన్ని ఎలా సహిస్తోందో!" అన్నది.

"ఆమె సుఖదుఃఖాలను అతీతురాలైపోయింది. తన కష్టాలను తలచుకుంటున్నట్టే లేదు."

"ఆమె యెప్పుడూ అంతే. నాకు తెలుసుగా! ఆమె శీలం గొప్పది. ఎప్పుడూ ఇతరుల సౌఖ్యాలనే కోరుతుంది. తనకేమీ అక్కరలేదు."

"ఔను, అసలు ఫలానా సాయం కావాలని నోటూ, పళ్ళూ పెట్టి అడగలేదు. ఎప్పుడూ —మీ అక్కగారిని తల్చుకుని పశ్చాత్తాపపడుతూ ఉండేది. ఈ పిల్ల పాపం, నిరపరాధిని, అన్యాయంగా ఖైదీ అయిందే అని విచారపడుతూ ఉండేది."

"ఔను, చాలా ఘోరం. అసలు నామూలాన్నే ఈ పిల్ల ఇన్ని కష్టాలకు గురిఅయింది."

"కాదమ్మా పిన్నీ! నువ్వు వద్దన్నా నేనా కాగితాలు తీసుకుపోయేదాన్నే!"

"అసలు ఇదంతా ఎలా జరిగిందో చెప్పుతున్నారా? ఎవరో ఒక పెద్ద మనిషి ఏవో కొన్ని కాగితాలు తెచ్చి నా దగ్గర కొన్నాళ్లు దాచిపెట్టమని ఇచ్చాడు. నా కప్పుడు ఇల్లూ వాకిలీ లేదు. ఈ యమ్మాయి కిచ్చాను. ఆ రాత్రే పోలీసులు ఈమె గదిని సోదాచూచి, ఆ కాగితాల్ని, పిల్లను తీసుకు పోయారు. ఆ కాగితాలు ఎక్కడినుంచి వచ్చాయో చెప్పమని వాళ్ళీ పిల్లను నానాహింసలూ పెట్టారు."

"అయితే నేను వాళ్ళకు చెప్పానేమిటి? చెప్పలేదు—" అంటూ ఉత్తేజితురాలైనట్లు తన వెంట్రుకల పాయ గట్టిగా పట్టుకుంది షస్టోవా.

"నువ్వు చెప్పావని నే నన్నానా?" అన్నది పినతల్లి.

"వాళ్లు మిటిన్‌ను కూడా పట్టుకొచ్చారంటే నా మూలాన్నే మీ కాదు" అన్నది షస్టోవా అపరాధినివలె సిగ్గుపడుతూ; విచలితురాలైనట్లు అటూ ఇటూ చూస్తూ.

"ఆ విషయం నువ్వేమీ మాటాడకు షస్టోవా!" అన్నది తల్లి.

"ఎందువల్లేమిటి? నే నదిఅంతా తప్పకుండా చెబుతాను" అన్నది షస్టోవా. ఆమె పెదవులమీద చిరునవ్వు మాయమైంది. వెంట్రుకల పాయ ముంగుకు లాక్కుని వేలికి చుట్టుకుంటోంది. ముఖం జేవురించింది.

ఆ విషయాన్ని ప్రసంగించినప్పుడు నిన్న ఏమైందో ఎరుగున్నావు కదా!"

"ఎరిగున్నానే - అయినా నువ్వు అడ్డురాకు అమ్మా! నేనేమీ చెప్పలేదు. నోరు తెరవకుండా గమ్మున ఉండిపోయాను - మిటిన్‌ను గురించీ

పిన్నినిగురించీ ఆయన అడిగినప్పుడు నేనేమీ చెప్పలేదు. చెప్పనని గట్టిగా చెప్పేశాను. అప్పుడు పెట్రోవ్..."

"పెట్రోవ్ ఒక ప్రభుత్వ గూఢచారి, పరమ దురాత్ముడు—" అంటూ పిన్ని చెప్పింది నెఖ్లూదోవ్‌కు, ఆ పిల్లమాటలు అర్థము చేసుకుని.

అప్పుడా పిల్ల హృదయావేగంతో గబగబా చెప్పసాగింది.

"పెట్రోవ్ బుజ్జగించాడు. 'అనవసరంగా మేము నిరపరాధుల్ని ఖైదుచేయటం తప్పుతుంది, చెప్పు' అని బ్రతిమాలాడు. నేను చెప్పనన్నాను. 'అయితే సరే, చెప్పకపోయావు గాని; నేను చెప్పేది కాదనకుండా ఉంటావా?' అంటూ మిటిన్ పేరెత్తాడు."

"ఆ సంగతేమీ మాట్లాడకు వస్తావా!" అన్నది పిన్ని

తలమీది జుట్టు గట్టిగా పీక్కుంటూ ఆ పిల్ల చెప్పింది—

"నువ్వు నా మాటలకు అడ్డం రాకమ్మా, పిన్నీ!...ఆ మర్నాడే మిటిన్‌ను ఖైదుచేసి తీసుకొచ్చారని తెలిసింది - నా మూలాన్నే అతన్ని ఖైదుచేశారనిపించింది. నేను అతనికి ద్రోహంచేశానని పరితపించాను. ఆ పరితాపంలో నాకు పిచ్చెత్తినంత అయింది."

"తరువాత తేలిపోయిందిగా అతడు నీ మాటలుబట్టి ఖైదు చేయబడలేదని!"

"ఔను. కాని నాకేం తెలుసు. నేనే ద్రోహం చేశాననుకున్నాను.

ఆ నాలుగుగోడల మధ్య అటు, ఇటు తిరుగుతూ 'నేనే ద్రోహం చేశాను, నేనే' అనుకుంటూ ఉండేదాన్ని. ముసుగుపెట్టుకుని పడుకుంటే "ద్రోహం! మిటిన్‌కు ద్రోహం చేశావు. మిటిన్‌కు" అన్న మాటలు ఎవరో పలుకుతున్నట్టు వినిపించేవి. అది నా భ్రమేనని నాకు తెలుసు. అయినా ఆ మాటలు వినిపిస్తూ వుండేవి. నిద్రపోదామనుకుంటాను; నిద్రపట్టదు. ఈ సంగతే ఆలోచించకుండా ఉందామనుకుంటాను; కాని ఉండలేను. అదొక భయంకరమైన మహాబాధ!—" ఈ మాటలు పలుకుతూన్న వస్తావా మరింత ఉత్తేజిత అయింది. వెంట్రుకలపాయ వేలికి చుడుతోంది, విప్పుతోంది, మళ్ళీ చుడుతోంది, వెర్రిగా అటు, ఇటు చూస్తోంది.

ఆమె తల్లి వచ్చి భుజంమీద చెయివేసి రాస్తూ "శాంతంగా ఉండమ్మా! ఆవేశం తెచ్చుకోకు" అన్నది. కాని ఆ పిల్ల ఆపుకోలేకపోయింది.

"అబ్బ ఎంత భయంకరమైన బాధ!—" అంటూ ఆ పిల్ల మళ్ళీ ఆరంభించింది. కాని మరుక్షణమే ఆగిపోయింది. ఒక వెర్రికేక వేసి గదిలో నుంచి బయటికి పరుగెత్తిపోయింది — ఆమె వెంటనే ఆమె తల్లికూడా వెళ్ళబోతోంది.

"ఆ గాడిదన్ని ఉరిదీయాలి—" అన్నాడు కిటికీలో కూచున్న కుర్రవాడు.

"ఏమిటది?"—తల్లి అన్నది అతనికేసి చూచి.

"ఏమీలేదు. ఎబ్బే. ఏముంది" అంటూ ఆ కుర్రవాడు టేబిల్ మీది నుంచి ఒక సిగరెట్టు అందుకుని, ముట్టించాడు.

౨౬

"ఒంటరిగా జైల్లో నివాసం చిన్నవాళ్ళకు చాలా అపాయకరంగా పరిణమిస్తుంది" అన్నదా పినతల్లి ఒక సిగరెట్టు తీసి వెలిగిస్తూ.

"చిన్నవాళ్ళకే అన్న మాటేమిటి? ఎవరికైనాను—" అన్నాడు నెఖ్లూడొవ్.

"ఊహుఁ, అందరికీ కాదులెండి. సిసలైన విప్లవవాదులకు జైలు నివాసం చాల శాంతంగా, హాయిగా వుంటుందని కొందరు చెప్పగా విన్నాను. పోలీసులు తనకోసం వెతుకుతున్నారనే సరికి ఎవరికైనా భయం భయంగా వుంటుంది; ఆతృతగా ఉంటుంది; తన ఉద్యమం భంగపడిపోతుందేమోనని తాపత్రయపడతాడు. కాని పోలీసులచేతుల్లో చిక్కుపోయిన తరువాత ఈ బాధలేమీ ఉండవు. బాధ్యతలన్నీ జారిపోతాయి; హాయిగా జైల్లో ప్రశాంతంగా కాలక్షేపం చేయవచ్చు. అరెస్టు అయితే వాళ్లు చాలా సంతోషిస్తారని చాలామంది చెబుతారు. కాని చిన్నవాళ్లు, నిరపరాధులు మాత్రం చాలా బాధపడతారు. అసలు వాళ్లు మన వస్టోవాలాంటి చిన్నవాళ్ళను, నిరపరాధులనే ఖైదుచేస్తారు. స్వాతంత్ర్యభంగం, అక్కడ పెట్టే దుర్భ

జనం—ఆటువంటివేమీ పరవాలేదు. సహించవచ్చు. కాని నైతికంగా తగిలే ఆఘాతం-అదే దుస్సహం."

"అయితే నీ కెప్పుడైనా జైలువాసం అనుభవం అయిందా?"

ఆమె ఒక విచారకరమైన చిరునవ్వు నవ్వింది. "నేనా? రెండు సార్లు జైలుకు వెళ్లాను. మొదటిసారి జైలుకు వెళ్ళినప్పుడు నేనేమీ నేరం చేయలేదు. అప్పుడు నాకు ఇరవైరెండేళ్లు. ఒకబిడ్డ - మళ్ళీ కడుపుతో ఉన్నాను. భర్తను, బిడ్డను, స్వేచ్ఛను వదిలిపెట్టవలసివచ్చినందుకు నేనంతగా బాధ పడలేదు. అయ్యో, మానవవ్యక్తిని కాకుండాపోయానే అని ఏడ్చాను-బిడ్డను ముద్దుపెట్టుకుని వస్తానన్నాను. 'తొందరగా లారీ ఎక్కు'మని దబాయించారు వాళ్ళు. 'ఎక్కడికి తీసుకుపోతున్నా'రని అడిగాను. 'వెళ్ళాక తెలుస్తుం దిలే' అన్నారు. 'నేనేమి నేరం చేశాను' అని అడిగాను. జవాబు లేదు- విచారణ అయిన తర్వాత నా దుస్తుల్ని మార్చి, జైలుదుస్తులు ధరింపించారు. ఎక్కడికో తీసుకుపోయారు. ఒక తలుపు తెరిచి లోపలికి తోశారు. మళ్ళీ తలుపు బిగించారు. అక్కడ అంధకారంలో ఒక్కదాన్ని. బైట జైలు కాపరి తుపాకి పట్టుకుని అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. చువ్వల సందుల్లోనుంచి కనిపించేది అతడే. అప్పుడు నాకు పాతాళంలోకి కృంగి పోతున్నట్టనిపించింది-నన్ను విచారించిన ఆ పోలీసు ఉద్యోగి నా కొక సిగ రెట్టు కాల్చటానికి ఇచ్చాడు. అది నాకు చాలా వింతగొలిపిన సన్నివేశం. మానవులు సిగరెట్లు కాలుస్తారని అతనికి తెలుసు. కాని మానవునికి స్వేచ్ఛ, వెలుతురు కావాలని తెలీదా? తల్లులు తమ పిల్లల్ని ప్రేమిస్తారనీ, పిల్లలు తమ తల్లులు లేకపోతే ఏడుస్తారనీ ఎరగడా? ఎరిగివుంటే నాకు ప్రియమైన, సన్నిహితమైన బంధువర్గంనుంచి లాగితెచ్చి ఇలా జైల్లో ఒక అడవిజంతువును వలె బంధిస్తాడా? అట్టి నిర్బంధపు పర్యవసానాలు గుప్తముగా ఉండితీరు తాయి. భగవంతునిమీద, తోడిమానవునియెడల విశ్వాసంగల వ్యక్తి— సర్వమానవుల సంబంధాలు ప్రేమబద్ధాలని నమ్మే వ్యక్తి—ఇటువంటి జైలు నివాసం అనుభవించి వచ్చాక ఆ విశ్వాసాన్ని తప్పనిసరిగా కోలుపోతాడు. నా సంగతేమయింది? ఆ నాటినుంచీ నాకు మానవత్వంలో విశ్వాసమే పోయింది. హృదయం కరుకుబారిపోయింది" అంటూ ముగించి ఆమె మంద హాసం చేసింది.

వస్తోవా తల్లి వచ్చింది. ఆ పిల్ల మనస్సు మళ్ళీ బాగా ఉద్రేజితమై ఉన్నదనీ, అందుచేత ఆమె తిరిగి రాజాలకున్నదనీ చెప్పింది.

"చూడండి, పాపం, ఆ చిన్నపిల్ల జీవితం ఎలా పాడైపోయిందో! అనవసరంగా దీనికంతకూ నేను ఒకరకంగా కారణమైనానే-అని బాధపడు తున్నాను" అన్నదా పినతల్లి.

"పల్లెటూరు పంపితే భగవంతునిదయవల్ల ఆ పిల్ల కోలుకుంటుందను కుంటాను. తండ్రిదగ్గరికి పంపించేస్తాను" అన్నదా పినతల్లి.

పినతల్లి నెక్లూడోవ్‌ను ఉద్దేశించి మళ్ళీ ఇలా చెప్పింది :

"మీరు దేవుడులాగ అడ్డుపడకపోతే ఆ పిల్ల చచ్చిపోయేదే. మీకు మేము కృతజ్ఞులం. మీ దర్శనం చేసుకోవాలని నేను ఇంతగా ఎందుకు కోరానంటే—దుఖోవాకు ఒక ఉత్తరం పట్టికెళ్ళి ఇస్తారేమోనని నా ఆశ" అంటూ ఒక కవరు తీసింది. "ఈ కవరు నేను అంటించలేదు. మీరు చదివి ఆమె కివ్వండి, లేదా చించిపారెయ్యండి. మీకు ఎలా తోస్తే అలా చెయ్యండి - మంచిచెడుగులు మీకు తెలుసు."

నెక్లూడోవ్ ఉత్తరం తీసుకున్నాడు. దాన్ని దుఖోవాకు తప్పకుండా ఇస్తానని వాగ్దానంచేశాడు. వాళ్ళదగ్గర సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. తాను చదవకుండానే కవరు అంటించివేశాడు-ఆ పినతల్లి చెప్పినట్టు దుఖోవాకు ఇచ్చివేద్దామని.

## ౨౭

ఇక పీటర్సుబర్గులో నెక్లూడోవ్ నిర్వహించవలసిన పని ఒక్కటే ఉంది. మతద్రోహులుగా ఖైదుచేయబడినవారి తరఫున పిటిషన్ చక్రవర్తికి అంద జేయాలి. అది చక్రవర్తి అంగరక్షకశాఖలోని ఒక ఉద్యోగిద్వారా జరగా ల్సిన పని. ఆ ఉద్యోగిని నెక్లూడోవ్ ఎరిగివున్నాడు. కొంత పూర్వపరిచయం ఉంది. ఉదయాన్నే వెళ్లాడు ఆ వుద్యోగి యింటికి.

ఈ వుద్యోగి ఆజానుబాహుడు కాదు. అయినా బలిష్ఠుడు. చక్కని శరీరం. దయాదాక్షిణ్యాలు కల వ్యక్తి. కృత్రిమంలేదు. ఉదారబుద్ధి ఉంది. అతనికి జార్ చక్రవర్తి అన్నా, అతని కుటుంబీకు లెవరన్నా చాలా యిష్టం.

చక్రవర్తి దర్బారులో మంచి పలుకుబడి సంపాదించాడు. చక్రవర్తికీ, చక్రవర్తి బంధువర్గానికీ సన్నిహితుడుగా ఉంటూ వాళ్ళ జీవితాల్లోని మంచిని మాత్రమే చూస్తూ ఉండేవాడు. మతాన్నీ, ప్రభుత్వాన్నీ ఎరగడు. వాటిల్లో పాల్గొనేవాడు కాదు—వస్తుతః అతిదేవప్నే గాని, ఏ పనికీ గాని నిందించడు. చాలావరకు మౌనంగానే ఉంటూంటాడు. తాను చెప్పదలుచుకుంది ఏదన్నా వుంటే పెద్ద గొంతుకతో, ఎడబడా చెప్పేసి, కిసకిస నవ్వేస్తూ ఉంటాడు. అది రాజకీయపు నేర్పు కాదు, అది అతని స్వభావం.

"వచ్చావూ, మంచిపని చేశావు. నీ సంగతే అనుకుంటున్నాను. పిటిషన్ చక్రవర్తి చేతికి నేనే స్వయంగా ఇస్తాను, నువ్వు అనుమానించ నక్కరలేదు. కాని ముందొకసారి నువ్వు టోపొరోవ్‌ను వెళ్ళి చూడ్డం మంచిదేమో అనుకుంటాను" అన్నాడా ఉద్యోగి.

టోపొరోవ్ పేరు వినగానే ముఖం ఒకరకంగా పెట్టి కూచున్నాడు నెఖ్లూడో.

"ఈ వ్యవహారం చాలావరకు అతనిమీద ఆధారపడివుంది. కనీసం అతని సలహా అయినా తీసుకుంటూరు. నువ్వే ముందుగా వెళ్ళి ఒకసారి ఆయన్ను కలిస్తే నీ కోరిక కాదనలేకపోవచ్చు."

"నువ్వు వెళ్ళమంటే వెడతాను."

"వెళ్ళిరా;—పీటర్స్‌బర్గులో ఎలావుంది నీకు?"

"సమ్మోహితుడి నౌతున్నాను."

"ఏమిటేమిటి? సమ్మోహితుడా?" అంటూ పకాపకా నవ్వాడు.

టోపొరోవ్‌ను సందర్శించటంవల్ల లాభం కలుగుతుందన్న ఆశ నెఖ్లూడోవు లేదు. అయినా మిత్రుని సలహాననుసరించి వెళ్ళాడు. టోపొరోవ్ చేస్తున్న ఉద్యోగానికి ఒక మందబుద్ధి—నైతిక విచక్షణ లేనివాడు—చాలు. టోపొరోవ్ అచ్చం అటువంటివాడే. చర్చిని భగవంతుడే స్వయంగా స్థాపించాడు. దాన్ని సంస్కరించేందుకుగాని నిర్మూలించేందుకుగాని మానవుడికి హక్కులేదు. భగవత్ స్థాపితమైన యీ సంస్థను హింసాత్మకవిధానం అవలంబించియైనా సరే రక్షించేందుకు ఒక శాఖ ఉంది. ఈ శాఖకు టోపొ

రోవ్ అధిపతి. సర్వసమానత్వాన్ని ప్రబోధిస్తుంది మతం. అటువంటి ప్రబోధం ఏమీ టోపొరోవ్ హృదయంలోకి ఎక్కలేదు. మిగతా సామాన్య ప్రజలంతా తనలాంటి ఉత్తములు కారని భావిస్తాడు. తన కక్కరలేని సర్వసమానత్వం వాళ్ళలో లేదని ఆక్రోశిస్తాడు. నిజానికి తనకు దేవుడిమీద నమ్మకం లేశంకూడా లేదు. అదే తనకు చాలా హాయిగా, సుఖంగా ఉందని తెలుసు. కాని ఇతర్లకూడా అటువంటి నాస్తిక స్థితికి వస్తారేమోనని భయపడతాడు. వాళ్ళను అలా తయారుకాకుండా అడ్డగించటం తన పవిత్ర కర్తవ్యం అని భావిస్తాడు.

"తమ్ము ఎవరన్నా ఉడకబెట్టుకుని తింటే బాగుంటుందని ఎండ్రకాయలు అనుకుంటూ ఉంటాయని ఒక పాకశాస్త్రవేత్త రాశాడు. అలాగే సాధారణ మానవులంతా మూఢనమ్మకాల్లో మునిగి ఉండటానికే కోరుతూ ఉంటారని టోపొరోవ్ ఆవిష్కరించిన మనోవైజ్ఞానిక సత్యం.

కోళ్ళను పెంచుకునేవాళ్ళు చెదపురుగుల్ని గురించి ఏమనుకుంటారు? వెధవచెదలు, ప్రతివస్తువునూ పాడుచేస్తున్నాయి. కోళ్ళు వాటిని ఆస్వాద్యంగా తింటాయి. కాబట్టి వాటిని కోళ్ళకు పెట్టుకోవలసిందే - అనుకుంటారు. మతాన్ని గురించికూడా టోపొరోవ్‌కు అలాంటి తర్కమే ఉంది.

క్రీస్తు తల్లియైన మేరీబొమ్మను, ఇంకా ఇతర దేవమాతల విగ్రహాల్ని ఆరాధించటం సాధారణమానవులకు ఇష్టం, కాబట్టి వారిని అలా విగ్రహారాధన చేయనిస్తూ ఉండాల్సిందే; వాళ్ళు నమ్ముతూన్న మూఢనమ్మకాల్ని నమ్మనిస్తూ ఉండాల్సిందే—అని టోపొరోవ్ వాదం. పారంపర్యంగా వస్తున్నాయి కాబట్టి ఇలాంటి మూఢనమ్మకాల్ని ఆచారాల్ని ప్రజలు పాటిస్తూంటారు. కాని టోపొరోవ్ వంటి క్రూరాత్ములు, తాము విజ్ఞానమూర్తులై కూడా—అజ్ఞానాంధకారంలో మునిగి తేలుతూ ఉండేవాళ్ళకు వెలుగు ఇవ్వరు సరికదా, ఇంకా మరింత చీకటిలో అణగద్రొక్కి ఉంచుతారు.

నెఖ్లూడొవ్ వచ్చినప్పుడు టోపొరోవ్ ఒక సంబంధికురాలితో మాట్లాడుతున్నాడు. ఆమె మంచి భలేమనిషి, బాగా డబ్బుగల స్త్రీ. గ్రీసులో ఉన్న సనాతన క్రీస్తుమతసిద్ధాంతాల్ని పశ్చిమదేశాల్లో ప్రచారం చేస్తున్నది.

ఒక గుమాస్తా వచ్చి నెహ్లూదోవు "వచ్చిన పనేమిట"ని ప్రశ్నించాడు "చక్రవర్తిగారికి ఒక పిటీషన్ దాఖలు చేసుకోవాలి" అన్నాడు నెహ్లూదోవ్. "ముందుగా మేము దాన్ని చూడవచ్చునా?" అని ప్రశ్నించాడు గుమాస్తా. దానికి జవాబుగా నెహ్లూదోవ్ పిటీషన్ తీసి అతని కిచ్చాడు. అతడా పిటిషన్ను టోపొరోవ్కు తీసుకుపోయి ఇచ్చాడు. మతాధికారాణికి దర్శనమయింది. నెహ్లూదోవు లోపల ప్రవేశపెట్టమని వెంటనే గుమాస్తాను ఆజ్ఞాపించలేదు టోపొరోవ్. పిటిషన్ యావత్తూ... మధ్య మధ్య తల పంకిస్తూ... చదివాడు. అది రాయబడిన పద్ధతి తీరుకు ఆశ్చర్యపోయాడు. "ఇది చక్రవర్తి చేతుల్లోకి వెడితే చాలా అపోహలకు దారితీస్తుంది. చాలా అసహ్యమైన ప్రశ్నలు వస్తాయి" అనుకున్నాడు తనలో తాను. చదవటం పూర్తి అయాక నెహ్లూదోవుని లోపలికి రమ్మనమని గుమస్తా ద్వారా కబురు చేశాడు.

టోపొరోవుకు ఈ కేసు జ్ఞాపకమే. ఇదివరకోసారి ఇలాగే ఒక పిటిషన్ వచ్చింది. గ్రీకు సాంప్రదాయానుగుణ్యమైన సనాతన క్రైస్తవమత సిద్ధాంతాల్ని పాటించని కొందరి అభాగ్యులపై కేసు ఇది. కోర్టులో మొదట్లో విచారణ జరిగింది. కాని వొదిలిపెట్టేశారు. తరువాత ఆ ప్రాంతపు మతాధిపతి, గవర్నరు ఇద్దరూ కలిసి, ఆ మత ద్రోహులు చేసుకున్న పెళ్ళిళ్ళు చట్టసమ్మతములైనవి కావని నేరం మోపి, భార్యలు భర్తలకు కాకుండా, పిల్లలు తల్లులకు కాకుండా విడదీసెయ్యాలని తీర్మానించారు.

"అలా విడదీయటం ఏమిటి బాబో!" అని ఇదివరకటివాళ్లు ఒక పిటిషన్ పెట్టుకున్నారు. పై తీర్మానానికి ఒకప్పుడు టోపొరోవు కూడా అంగీకరించాడు. అలా వాళ్ళను విడదీసేసి, ప్రవాసం పంపించేస్తే, వాళ్ళ వాసనలేకుండా ఉన్నవాళ్లు జాగ్రత్తగా ఉంటారని, సనాతన క్రైస్తవమతాన్ని మన్నించి బుద్ధిమంతులై నడుచుకుంటారనీ ఆయన అభిప్రాయం. అదీగాక మతాధికారి పట్టుపట్టాడు. అందుచేత కేసు యథావిధిగా నడుస్తున్నది.

కాని ఇప్పుడా నేరస్థుల పక్షం వహిస్తూన్నవారి తరఫున నెహ్లూదోవులాంటివాడు పని చేస్తున్నాడాయెను. అతనికి పీటర్స్‌బర్గులో కొంత పలుకుబడి లేకపోలేదు. స్వయంగానే చక్రవర్తిదగ్గరకు పోయి, ఈ కేసు చాలా అన్యాయం అనీ, క్రూరాత్మకం అనీ చెప్పుకోవచ్చు. ఇదంతా విదేశీ పత్రికల్లోకి కూడా

ఎక్కవచ్చు. ఈ విషయాలన్నీ ఆలోచించుకుని టోపొరోవ్ ఒక హఠాత్ నిర్ణయానికి వచ్చాడు.

చాలా పని తొందరలో ఉన్నవాడులా నటిస్తూ, ఒక మందహాసం విసిరి వెంటనే ప్రస్తుత విషయాన్ని ఎత్తుకుని అన్నాడు: "ఔను, ఈ కేసు నాకు తెలుసు. ఎత్తి చదవగానే జ్ఞాపకం వచ్చింది. మీరు మళ్ళీ దీన్ని నా స్మృతికి తెచ్చినందుకు ధన్యవాదాలు. చాలా అన్యాయమే పాపం! కాని ఇదంతా ఆ ప్రాంతీయ అధికారుల పట్టుదల!"

నెఖ్లూదొవ్ ముఖంలో ఏ విధమైన భావమూ పొడసూపలేదు. ఆ కఠినాత్ముని ముఖంలోకి యాదాలాపంగా చూస్తూ నిల్చున్నాడు.

"నేరస్థులకు విధించిన శిక్షను కొట్టేసి, వాళ్ళను ఇళ్ళకు పంపించే ఏర్పాట్లు చేస్తాను" అన్నాడు టోపొరోవ్.

"కాబట్టి నేనీ పిటిషన్‌ను ఉపయోగించనక్కర్లేదన్నమాట!"

"ఔను, మనఃపూర్వకంగా వాగ్దానం చేస్తున్నానుగా!" అన్నాడు. 'మనఃపూర్వకంగా' అన్న పదాన్ని వొత్తి పలుకుతూ: తాను, తన మనస్సు, తన మాట దేనికైనా పెద్ద గ్యారంటీ అయినట్టు.

"ఇప్పుడే రాసేస్తాను, అదే మంచిది. దయచేసి కూచోండి" అంటూ టేబిల్ దగ్గరకు వచ్చి రాయటం ఆరంభించాడు. నెఖ్లూదొవ్ కూచోలేదు. అతని బట్టతల కేసి, చరచరా కలాన్ని నడుపుతున్న చేతిమీది నరాల్ని చూస్తున్నాడు. "ఇదేమిటి? ఈ హృదయంలేని పెద్దమనిషి ఈ మేలుపని ఎలా చేస్తున్నాడు? ఇంత ఇష్టపూర్తిగా చేస్తున్నాడే!" అని ఆశ్చర్యపడుతున్నాడు.

"అయింది. ఇక నువ్వు ఈ సువార్తను వాళ్ళకు చెప్పవచ్చు" అని రాసిన కాగితం కవరులో పెట్టిఇస్తూ, ఒక చిరునవ్వు ప్రదర్శించటానికి ప్రయత్నించాడు.

"ఇంతకూ అకారణంగా వాళ్లు ఎంత బాధ పడాల్సివచ్చిందో చూశారా?" అన్నాడు నెఖ్లూదొవ్ కవరు తీసుకుంటూ.

టోపొరోవ్ తల యెత్తి మందహాసం చేశాడు—నెఖ్లూదొవ్ ప్రశ్న తనకు ఆనందదాయకం అయినట్టు. "అందుకు జవాబు నే నేమీ చెప్పలేను

సుమండీ! నేను చెప్పగలిగినదంతా ఏమంటే ప్రజల మేలు మేం చూస్తూ ఉండాలి. మత సంబంధమైన విషయాల మీద...ఇప్పుడు పొడచూపుతూన్న అలక్ష్యభావం వల్ల...ఆత్యంతికమైన పర్యవసానాల అపాయకరమైనది కాదు."

"కాని మతంపేరుమీద సామాన్య న్యాయసూత్రాల్ని కూడా పాటించకపోవటం జరుగుతున్నదే? భార్యాభర్తల్ని, తల్లీ పిల్లల్ని ఎడబాపు చేస్తారా?"

నెఖ్లూడోవ్ మాటలు చక్కగానే ఉన్నాయి. టోపొరోవ్ గ్రహించాడు. ఎంత చక్కగా వున్నా అతనివాదం ఏకపక్షీయమని అతని భావం. తనకు తెలిసినంతగా అపార రాజకీయవిషయాలు నెఖ్లూడోవ్‌కు ఏం తెలుసు అన్నట్టుగా ఒక మందహాసం విసిరాడు-అన్నాడు: "వ్యక్తిగతంగా మీకు అలా తోచవచ్చు-కాని పరిపాలనాబాధ్యతల దృష్ట్యా మరోవిధంగా అనిపిస్తుంది సుమండీ—అయినా ఇక నాకు వేరేపనులున్నాయి—" అంటూ వీడ్కోలు మర్యాదగా లేచినిల్చుని చెయి ముందుకు చాచాడు.

నెఖ్లూడోవ్ అతని కరస్పర్శచేసి తొందరగా బైటికి వచ్చేశాడు. వీడి చెయ్యి ఎందుకు ముట్టుకున్నానా? అని పశ్చాత్తాప పడ్డాడు.

"ప్రజలు మేలు చూస్తూ ఉంటాట్ట! అంటే తన మేలన్నమాట!" అనుకున్నాడు నెఖ్లూడోవ్ వెడుతూ. మత సంప్రదాయాల్ని రక్షిస్తూంటే— ప్రజల్ని విజ్ఞానవంతుల్ని చేయ సంకల్పించే ప్రభుత్వశాఖల కన్నెర్రకు గురియైన వాళ్ళనందర్నీ లెక్కవేసుకున్నాడు. దొంగతనంగా సారాయం అమ్మినందుకు ఒక స్త్రీ; దొంగతనం చేసినందుకు ఒక కుర్రవాడు; మోసం చేసినందుకు వడ్డీ వ్యాపారస్థుడు—ఇలా ఖైదీ అయిన వాళ్ళంతా గుర్తుకువచ్చారు. పాపం! వస్టొవా! ఆమెవల్ల ఏదో సమాచారం రాబట్టవచ్చునని ఆమెను పట్టుకుపోయి జైల్లో పడేశారు. సనాతన సంప్రదాయాల్ని పాటించనందుకు మతద్రోహులని కొందర్నీ, బాధ్యతాయుత ప్రభుత్వం కావాలన్నందుకు గుర్కేవిచ్‌ని శిక్షించారు. ఇంతమందిని కారాగారాల్లో బంధిచేస్తున్నారంటే, ప్రవాసం పంపించేస్తున్నారంటే, వాళ్ళంతా న్యాయవిరుద్ధంగా ప్రవర్తించటం చేతకాదు, చట్టవిరుద్ధంగా నడుచుకుంటున్నారని కాదు; ప్రజలదగ్గర దోచుకున్న సొమ్మును ఈ ధనవంతులు, ఉద్యోగస్తులు

అనుభవించటానికి ఆటంకప్రాయులౌతున్నందువల్లనే వాళ్ళకా శిక్షలన్నీను లైసెన్సు లేకుండా సారాయిని అమ్ముకుంటూన్న ఆ స్త్రీ, ఆ దొంగ పిల్లవాడు, పోలీసులకు కావలసిన సమాచారాన్ని చెప్పకుండా దాచిన వస్తోవా, మూఢమత నమ్మకాల్ని పాటించని ఆ మత ద్రోహులనబడే వాళ్లు—మూఢమతనమ్మకాల్ని పాటించని ఆ మత ద్రోహులు, బాధ్యతాయుత ప్రభుత్వాన్ని వాంఛించిన గుర్కేవిచ్ — వీరంతా అటువంటి ఆటంకప్రాయులే-ఈ ఉద్యోగస్థులంతా నెఖ్లూడో పిన్నిగారి మొగుడు, సెనేటర్లు, టోపొరోవు, ఇంకా అంతకన్న తక్కువ హోదాలో వుండే మంత్రి మాణిక్యాల ఆఫీసులలో ఉండే శుభ్రవస్త్రధారులైన ప్రముఖ గుమాస్తాలు — ఈ యావన్మందికీ తమ అధికారంలో నడుస్తూన్న ప్రస్తుత వ్యవస్థలో ఎంతమంది నిరపరాధులు, అమాయకులు బాధపడుతున్నారో లేశమాత్రమూ పట్టదు.

న్యాయతః నిరపరాధి శిక్షితుడు కారాదు, పదిమంది నిజమైన నేరస్థులు దొరక్కపోయినా సరే. కాని ప్రస్తుత పరిస్థితుల్లో జరుగుతున్నదేమంటే—ఒక్క నిజమైన అపరాధిని వొదిలించుకునేందుకుగాను పదిమంది నిరపరాధులను శిక్షిస్తున్నారు—ఒకపండులో కుళ్ళిపోయిన భాగాన్ని కోసివేసే ప్రయత్నంలో మంచిగా వున్న భాగాన్నికూడా కొంతవరకు కోసేసినట్టు.

ఇంతకూ న్యాయం, ధర్మం, మతం భగవంతుడు—ఇవన్నీ మహాభయంకర క్రౌర్యానికీ, కామానికీ ముసుగులైన పదాలు మాత్రమేనా?

౨౫

నెఖ్లూడో ఆ సాయంత్రమే పీటర్సుబర్గు విడిచిపెట్టి వెళ్ళిపోవలసింది కాని నాటకశాలలో వచ్చి కలుసుకుంటానని మేరియటీకి వాగ్దానం చేసియున్నాడు. అటువంటి వాగ్దానాన్ని పాటించనక్కరలేదని అతనికి తెలుసు. అయినా అన్నమాట నిలబెట్టుకోకపోవటం తప్పు అనే జనవాక్యాన్ని స్మరించి ప్రయాణం ఆపుకున్నాడు.

"ఈ ప్రలోభాలకు లొంగిపోకుండా నిలబడగల తాహతు నాకు [illegible]? చివరిప్రయత్నం చేస్తాను" అనుకున్నాడు.

తన సమయోచిత దుస్తులు ధరించి నాటకశాలకు వచ్చాడు. రెండో అంకం జరుగుతోంది. అది ఒక ఫ్రెంచినాటకం. క్షయరోగపీడితురాలైన ఒక యువతి మరణగాథ. విదేశీయ నటీమణి ఒకతె అందులో అద్భుతంగా నటిస్తున్నది. నెక్లూడోవ్ కోటు కాపలావానికిచ్చి కనుక్కొని మేరియాటీ కూచున్న బాల్కనీలోకి వెళ్లాడు.

నీలకేశాలవారు, నెరిసిన తలలవారు, ఉంగరాల జుట్టువారు, బట్టతలల వారు, హాలంతా నిండివున్నారు. రంగంమీద నట్టువరాలికేసి తదేకంగా చూస్తూ పరవశులై ఉన్నారు. ఆ నటీమణి ఎముకలు పొడుచుకొచ్చి, సన్నగా వుంది. పట్టుదుస్తులు, లేసులు ధరించి, కృత్రిమ కంఠస్వరాన ఏమిటో మాటాడుతోంది.

నెక్లూడోవ్ మేరియటీని చూచాడు. ఆమె ప్రక్కనే మరొక స్త్రీ యెవతో వున్నది. ఆమెను నెక్లూడోవ్ యెరగడు. అటుప్రక్కన మేరియటీ మొగుడు ఉన్నాడు. మంచిపొడగరి, అందగాడు. రోమన్ జాతివానికివలె ఉన్నతమైన నాసిక. గంభీరమై, లోనిభావమెరుగరాని ముఖం. ఆయనకు ప్రక్కగా మరో గిరజాల పెద్దమనిషి ఒకడు వున్నాడు.

పరిపూర్ణ సువిలాసిని మేరియటీ. భుజాలకద్ద నీటైన వొంపులు తిరిగిన మెడమీది పుట్టుమచ్చ కనిపించేలాగు కొత్తఫేషన్ జాకెట్టు తొడుక్కుంది. నెక్లూడోవ్‌ను చూచింది, కృతజ్ఞత, ఆదరణ వెల్లివిరియించే మందహాసంతో ఆహ్వానించింది. ఆ చిరునవ్వులో బహు శతగ్రంథాలు ఉన్నట్టనిపించింది నెక్లూడోవుకు. తన వెనుకవున్న కుర్చీలో కూచోమని చేతిలోని విసనకర్రతో సైగచేసింది ఆమె.

ఆమెభర్త అతనికేసి శాంతంగా చూశాడు. ఆయన అన్నిపనులూ శాంతంగానే చేస్తూండటం అలవాటు. మర్యాదా సూచకమైన ఒక శిరశ్చాలనం చేశాడు. తరువాత తనభార్యతో చూపులు కలిపాడు. ఆ చూపుల్లో, ఆ అందగత్తె యజమాని, హక్కుదారుడు తానే నన్నభావం వ్యక్తమైంది.

ఇంతలో ఆ రంగం ముగిసింది. ప్రేక్షకుల చప్పట్లతో హాలు ప్రతిధ్వనించింది. మేరియటీ లేచింది. గరగరలాడుతూన్న తన కొత్త సిల్కుగౌను కొంచెం ఎత్తిపట్టుకుని వెనక్కు వచ్చింది. నెక్లూడోవ్‌ను తనభర్తకు

పరిచయం చేసింది. "చాలా సంతోషం" అని మాత్రం పలికి కన్నులతో నవ్వుతూ, మౌనంగా కూచుండిపోయాడు.

"వస్తానని మాట యిచ్చాను కాబట్టి గాని, లేకపోతే ఇందాక సాయంత్రం బండికే వెళ్ళిపోయి వుండేవాణ్ణి—" అన్నాడు నెఖ్లూడొవ్.

"పోనీ, నన్ను చూడాలన్న అపేక్ష లేకపోతె మానె. ఇక్కడ ఒక అపూర్వ నటీమణిని చూడగలవు" అని భర్త కేసి తిరిగి.

"ఇందాకటి రంగంలో ఎంతో గొప్పగా నటించలేకుంటుండీ!" అన్నది. భర్త ఔనన్నట్టు తలఊపాడు.

"రంగంమీది బాధ నన్నెక్కువగా ఆకర్షించదు. ఇవ్వాళ నిజమైన బాధ ఎంతో చూచాను—" అన్నాడు నెఖ్లూడొవ్.

"చెప్పు చెప్పు" అన్నది మేరియటీ.

ఆమె భర్తకూడా అంతా విన్నాడు. మొదటినుంచి చివరవరకూ అతని నేత్రాలు వ్యంగ్యహాసాన్ని ప్రదర్శించినాయి.

"ఇన్నాళ్ళనుంచీ జైల్లో అట్టిపెట్టి విడిచిపెట్టారే, ఆ అమ్మాయిని చూడ్డానికి వెళ్ళాను. పాపం! ఆ పిల్ల మానసికంగా తీరనిదెబ్బ తిన్నది."

"నేనావేళ మీతో చెప్పింది ఆ పిల్లనుగురించే" అని మేరియటీ భర్తకు జ్ఞాపకం చేసింది.

"ఓహో, ఆ అమ్మాయిని విడిచిపెట్ట గలిగినందుకు చాలా సంతోషించాను—" అన్నాడామెభర్త. అతని మీసాల్లో దాగిన పెదవులమీది నుంచి వచ్చిన చిరునవ్వు వ్యంగ్యభరితమని నెఖ్లూడొవ్‌కు తోచింది. ఒక సిగరెట్టు కాల్చి రావటానికి బైటికి వెళ్ళాడామె భర్త.

ఆమె తనకేదో సంగతి చెబుతానన్నది. ఏమి చెబుతుందా అని ఆతృతగా వున్నాడు నెఖ్లూడొవ్. ఆమె యేమీ చెప్పనేలేదు. అస్తమానం నాటిక ప్రదర్శనంగురించి ప్రసంగించింది. ఆ నాటకప్రదర్శనం నెఖ్లూడొవ్ వంటివాణ్ణి బాగా ఆకర్షించగలదని ఆమె అభిప్రాయం.

ఇంతకూ ఆమె తనకు చెప్పేదేమీ లేదని తేలిపోయింది. ఆకర్షకము లైన తన విలాసహేలాభావములనూ, ఒయ్యారాల్ని, సుందరమైన వొంపు తిరిగిన మెడమీది పుట్టుమచ్చను అతనికి చూపించాలని ఉబలాటం తప్పితే మరేమీ

ఉన్నట్టు లేదు. దుస్తులు, మెడ, భుజాలు అందంగానే వున్నాయి. కాని ఎందువల్లనో ఏహ్యంగానూ కనిపించాయి అతనికి.

తెరపడలేదు. కాని తెరమరుగు రహస్యం నెఖ్లూడొవ్ చూడగలుగు తూనే వున్నాడు. మేరియట్‌ని చూచి ఆమె అందాన్ని మనసులో అభినందించాడు. కాని ఆమె అసత్యవాదిని అని తెలుసు. ఆమె భర్త వేలాది ప్రజల కన్నీళ్లు, ప్రాణాలు పణంపెట్టి తన భవిష్యదభ్యున్నతిని కల్పించు కొంటున్నాడు. అదంతా ఆమెకు తెలియకపోవటం ప్రశ్నా? తెలిసినా కాదా తనకేమీ పట్టనట్టు ఊరుకుంటున్నది - అంతే, నిన్నటిదినం ఆమె చెప్పిన మాట లన్నీ వచ్చి అబద్ధాలన్నమాట. ఆమె కోరుకుంటున్నది తన్ను ప్రేమవలలో చిక్కించుకోటానికే. అలాంటి కోరిక ఎందుకు కోరుకుంటున్నదో ఆమెకూ తెలియదు, తనకూ తెలియదు. తాను ఆకర్షితుడౌతున్నాడు. అసహ్యించుకుంటూనూ వున్నాడు. పలుసార్లు అక్కడనుంచి లేచిపోవాలని ప్రయత్నించాడు. కాని వెళ్ళలేదు.

చివరకు మేరియట్ భర్త సిగరెట్టు పొగవాసనలు గుప్పుతూ వచ్చాడు. అపరిచిత వ్యక్తిని చూచే చూపు, వ్యంగ్యభరితమైన చూపు ఒకటి నెఖ్లూడొవ్ కేసి విసిరాడు. దానితో విసిగెత్తి నెఖ్లూడొవ్ అప్పుడు లేచి బైటికి పోయాడు.

ఇంటికి నడిచిపోతూవున్నాడు. దారిలో ఒక స్త్రీ కనిపించింది. మనిషి పొడగరి. ఆమె ధరించిన దుస్తులు కొట్టొచ్చేటంత అందంగా వున్నాయి. అతనికి కొంతముందుగా నడుస్తోంది. దారినపోయేవాళ్ళంతా ఆమెకేసి చూస్తూనే వున్నారు. ఇతర్లను ఆకర్షించగల ప్రజ్ఞాపాటవాలున్నదానిని అన్న గర్వం ఆమె ముఖంలో, ఆకృతిలోని అణువణువునా తొణికిసలాడుతోంది. ఆమెకన్న త్వరగా నడుస్తూ పోయాడు నెఖ్లూడొవ్. ఆమెను సమీపించినప్పుడు అప్రయత్నంగా తానూ ఆమెకేసి చూశాడు. పౌడర్‌తో, స్నోలతో ముస్తాబు చేసిన ముఖం అందంగానే ఉంది. ఆమె అతనికేసి నవ్వుతూ చూసింది. ఆమె కన్నులు వెలుతురు చిమ్మాయి. నెఖ్లూడొవ్‌కు ఆ సమయంలో మేరియట్ జ్ఞాపకం వచ్చింది. నాటకశాలలో ఉన్నప్పుడులాగానే ఇప్పుడు కూడా ఆకర్షితుడైనాడు. అసహ్యించుకున్నాడు కూడా.

నెక్లాడ్లో స్వరత్వరగా ఆమెను దాటిపోతున్నాడు. తప్పనిసరై తనకే అపహాస్యం వేస్తోంది. అడ్డు దారిని తిరిగి, అటు గొంది దూరం వెళ్ళాను. ఆ త్రోవ వసే నది ఉంది. ఓడలు, పడవలు అని. ఓడల్లోంచి సామానులు దించే చోటు చక్కగా చప్టా చేసి ఉన్నది. అక్కడే అటూ, ఇటూ పచార్లు చేస్తూ ఉన్నాడు.

“నేను బాల్కనీలోకి వెళ్ళగానే ఆమె కూడా ఇలాగే మందహాసం చేసింది. ఈ రెండు మందహాసాల అర్థాలు ఒకటే. కానీ భేదం ఉంది. ఈ రెండో చిరునవ్వు మొదటి దానికన్నా బట్టబయలుగా, తేటతెల్లంగా చెప్పింది. ‘నేను నీకు కావాలా? తీసుకునో. అక్కర్లేకపోతే నీ దారిన నువ్వు పో’ అని. ఆవిడ మాటలే చెప్పటం లేదన్నట్టు నటించింది. ఒక యువత్తైయిన, పెద్ద నాగరిక దశలో ఉన్నట్టు కనిపించింది. కాని అంతరాంతరాలల్లో ధ్వనించింది ఈ రూపమే. ఈ రెండోదే కొంతవరకు సత్యవాదిని. మొదటిది పూర్తి అసత్యవాదిని. ఈమె అవసరాన్నిబట్టి ఈ స్థితికి దిగజారింది. కాని అది భయంకరమైన, కన్నులు మిరుమిట్లు గొలిపే మహావేశంతో ఆడుకుంటోంది. విరక్తికన్నా దాహం అధికంగా ఉండే వాళ్ళకు వినియోగపడే మురికిసీటికుండు ఈ బాజారులంజ. తాకిన ప్రతిదాన్నీ నిరంతరం కలుషితం చేసివేసే ఘోర విషరాశి ఆ నాటకశాలలోని యువతి.

“స్త్రీ పురుషులలోని యీ పశుత్వం కడు భయంకరమైనది సుమీ! అది బట్టబయలుగా కనిపిస్తూన్నప్పుడు మాత్రం ఒక ఆధ్యాత్మిక భావ శిఖరం మీదినుంచి ఏహ్యభావంతో చూస్తాం, అసహ్యించుకుంటాం. దానికి లొంగిపోయినా, విసర్జించినా పతితులమైనట్టూ కాదు, అభ్యున్నతి చెందినట్టూ కాదు. కాని యీ పశుత్వమే సౌందర్యపిపాస అనే ముసుగు వేసుకుని మన ఆరాధనను కోరినప్పుడు అది మనల్ని పూర్తిగా మింగేసిందన్నమాటే! మంచి చెడుగుల విచక్షణ మరచిపోయి దాన్ని ఆరాధిస్తాం. ఇది అత్యంత భయంకరం!”

ఆ ప్రదేశంలో ఉన్నది, పడవలు, కాపలావాళ్ళు, బ్యాంకు ఆఫీసు పరిస్ఫుటంగా కనిపిస్తున్నాయి. అంత పరిస్ఫుటంగానే మానవులలోని పశుత్వాన్ని గురించిన సత్యం కూడా గోచరిస్తూ ఉంది. ప్రపంచంలోని ఉత్తర ధ్రువమండలంలో రాత్రి యనేది ఉండదను. గొప్ప కాదు. ఏదో ఒక మసక

వెలుగు ఎక్కడినుంచో వస్తూనే ఉంటుంది. అదేమాత్రంగా నెఖ్లూదొవ్ హృదయంలో అజ్ఞానతిమిరం జొరబడలేదు.

అంతా పరిస్ఫుటంగానే ఉంది - ప్రస్తుత నాగరిక ప్రపంచంలో ప్రముఖము, మంచి అనుకున్నదల్లా అల్పము, అసహ్యాకరము - ఈ బాహ్యాడంబరాలలో, భోగవిలాసాలలో అనంతములైన—అంతకూ ఎదిగిన అత్యాచారాలు నిబిడీకృతములై ఉన్నాయి. వాటికి శిక్షలేదు. పైగా అవి కైనంత సవిలాసంగా అలంకృతములౌతున్నాయి.

ఈ ఆలోచనలన్నీ మరచిపోదామనుకున్నాడు నెఖ్లూదొవ్. కాని ఇంత పరిస్ఫుటంగా కనిపిస్తున్న సత్యాలను మనోవీథినుంచి త్రోసివేయలేక పోయాడు. ఇన్ని నిగూఢసత్యాల్ని చూపిస్తున్న ఆ వెలుగు ఎక్కడినుంచి వస్తున్నదో అతనికి దురూహ్యం. ఆ వెలుగు మసకమసకగా, కృత్రిమంగా ఉన్నట్టుంది. అయినా అది తన కాంతిలో బహిరంగపరుస్తూన్న విషయాల్ని చూస్తూ అతడు హర్ష పులకితుడైనాడు.

౨౯

ఫ్రాన్సోకా తిరిగివచ్చిన వెంటనే నెఖ్లూదొవ్ జైలు ఆసుపత్రికి వెళ్ళాడు. అక్కడ మస్లోవాను కలిసికొని సెనేటు క్రిందికోర్టు తీర్పునే ఖాయపరచిందనీ, కాబట్టి సైబీరియాకు వెళ్ళటానికే సిద్ధపడివుండాలనీ చెబుదామనుకున్నాడు.

మస్లోవా తరఫున చక్రవర్తికి దాఖలుచేసేందుకు వకీలు ఒక పిటీషన్ రాశాడు. దాన్ని నెఖ్లూదొవ్ వెంటబెట్టుకువచ్చాడు, మస్లోవా దస్కతు కోసం. ఈ పిటీషన్ చక్రవర్తికి దాఖలు చేసినా లాభం వుంటుందన్న ఆశ అతనికి లేదు. లాభం ఉండాలన్న కోరికకూడా అతనికి లేదు. మస్లోవాతో పాటు సైబీరియాకు వెళ్ళిపోయి, అక్కడ ఆ ప్రవాసులతోనే జీవితం వెళ్ళబుచ్చాలన్న అభిప్రాయం అతనిలో కుదురుకునిపోయింది. ఇప్పుడు మస్లోవా విడుదల అయేట్టయితే, ఆమె జీవితం, తన జీవితం ఎలా రూపొందుతాయో అతనెప్పుడూ ఊహించలేదు.

"ప్రభుత్వం అన్యాయంగా ప్రజల్ని జైళ్ళలో వేస్తూవుంటే న్యాయస్థుడైనవాడు జైల్లోనే వుండాలి" అని ఒక అమెరికన్ రచయిత థోరే రాసిన వాక్యాలు నెఖ్లూడోవ్‌కు గుర్తువచ్చాయి. నెఖ్లూడోవ్ పీటర్సుబర్గు వెళ్ళి, అక్కడి వ్యవహారాలన్నీ చూచాక అమెరికన్ రచయితమాటమీద ప్రగాఢవిశ్వాసం కుదిరింది. "ఈ నాడు రష్యాలో న్యాయబుద్ధిగల ప్రతివాడికీ జైలే సరియైన నివాసస్థానం—అనుకున్నాడు నెఖ్లూడోవ్.

అతడు జైలు అసుపత్రికి రాగానే కాపలాఉండే ఆడమనిషి అతన్ని గుర్తించింది. "మస్లోవా ఇప్పుడిక్కడ లేదు" అని చెప్పింది.

"ఎక్కడున్నది?"

"మళ్ళీ జైల్లోనే"

"ఎందువల్ల మళ్ళీ ఇక్కడినుంచి మార్చారు?"

"ఉంటారా బాబూ అటువంటివాళ్ళు మంచిచోట్లల్లో. చిన్న డాక్టరుతో సాగించింది. పెద్దడాక్టరుగారు ఆమెను మళ్ళీ యథాస్థానానికి పంపించేశారు."

ఈ వార్తవిని నెఖ్లూడోవ్ నిర్ఘాంతపోయాడు. ఏదో అనుకోని మహాపద సంభవించినట్లు బాధపడ్డాడు. ఆమె హృదయంలో ఒక మంచిమార్పు క్రమేణా వస్తున్నదని ఊహించిన తన తెలివితేటలు తనకే హాస్యాస్పదంగా పొడగట్టినవి. 'నువ్వు నా కోసం ఏమీ త్యాగం చేయవద్దు' అంటూ ఆమె పలికిన మాటలు, చేసిన మందలింపులు, విడిచిన అశ్రువులు—అన్నీ తనను తన మేలుకోసం ఉపయోగించుకోటానికి ప్రదర్శించే మాయపన్నాగాలని అతనికి తోచాయి. చివరసారి తానామెను చూచినప్పుడు ఆమెలో ఏవో మొండి భావాలు సందడించే జాడలు గోచరించినట్టు స్ఫురించింది. తిరిగి రెండోసారికి జైలుకు వెళ్ళాడు.

"ఇప్పుడు నేనేమి చేయాలి. ఆమె యీ పనిచేశాక ఇంకా ఆమెతో నాకు సంబంధం ఏమిటి?" అని తన్నుతాను ప్రశ్నించుకున్నాడు. కాని ఇప్పుడు తాను పూర్తిగా వైదొలగిపోవటం ఆమెను శిక్షించటం కాదు. తన్నే శిక్షించుకున్నట్టు ఔతుంది. అతనికి భయం కలిగింది.

మళ్ళీ అనుకున్నాడు: "ఈ జరిగినదానివల్ల నా నిశ్చయం మారటానికి వీల్లేదు. పైగా బలపడవలసిందే. ఆమె తన మనస్థితి ననుసరించి ఏమైనా చేయనీ; చిన్నడాక్టరుతో పొత్తుగా ఉంటే, సాగించనీ, అది ఆమె వ్యవహారం. నేను నా అంతరాత్మ ఆదేశించినట్టు చెయ్యాలి. నా స్వేచ్ఛను బలి యిచ్చుకోవాలి. అది నా అంతరాత్మ ఆదేశం. ఆమెను పెండ్లాడాలి; ఆమె ఎక్కడికి ప్రవాసం పోతుందో అక్కడికే నేనూ వెళ్ళాలి; అని నేను కాశించుకున్న నిర్ణయం మారకూడదు." ఈ గర్వమైన నిశ్చితభావం ఆతనిలో సందడించింది, ఆసుపత్రినుంచి జైలువైపు వెడుతూన్నప్పుడు.

జైలుగేటు కాపలా మనిషిని సమీపించాడు. తాను మస్లోవాను చూడకోరుతున్నానని ఇన్‌స్పెక్టరుతో చెప్పమన్నాడు. ఆ కాపలావాడు నెఖ్లూదోవ్‌ను ఎరిగివున్నాడు. పూర్వం ఉండిన ఇన్‌స్పెక్టరు ఇప్పుడు లేడనీ, కొత్త ఆయన వచ్చాడనీ కాపలావాడు చెప్పాడు; "పూర్వంమల్లే లేదండి; ఇప్పుడంతా చాలా కిరకట్టుగా ఉంటోంది. అయినా చెబుతాను ఉండండి."

కొత్త ఇన్‌స్పెక్టరు వచ్చాడు. మంచిపొడుగరి. వెడల్పాటి దవడలు, ఎక్కువ చురుకుదనం కనిపించని ముఖం. అతడు నెఖ్లూదోవ్ వైపు చూడకుండానే—"ఖైదీలతో మాటాడాలంటే ఎప్పుడు పడితే అప్పుడు వీలు లేదు. అందుకు కొన్నిదినాలు ప్రత్యేకించాం" అన్నాడు.

"కాని ఒక పిటిషన్ ఉంది. దాన్ని చక్రవర్తికి దాఖలు చెయ్యాలి. దానిమీద ఖైదీ సంతకం కావలసివుంది."

"అది నా కివ్వండి."

"నేను ఖైదీని స్వయంగా చూడాలి. ఇదివరకు ఎప్పుడు వచ్చినా చూడనిచ్చేవాళ్ళు."

"ఔను; అది ఇదివరకు సంగతిలెండి" అన్నాడు ఇన్‌స్పెక్టరు నెఖ్లూదోవ్ కేసి ఒక తీక్ష్ణమైన చూపు విసురుతూ.

"నాకు గవర్నరుగారి దగ్గర్నుంచి అనుమతి ఉంది" అన్నాడు నెఖ్లూదోవ్ జేబులో చేయిపెట్టి నోటుబుక్కు తీస్తూ.

ఇన్‌స్పెక్టరు నెఖ్లూదోవ్ ఇచ్చిన కాగితం తీసుకుని నెమ్మదిగా చదువుకున్నాడు. ఆ కాగితం పట్టుకున్న వేళ్ళలో ఒక దానికి బంగారు ఉంగరం ఉంది. చదువుకున్న తరువాత "అయితే లోపలికి దయచెయ్యండి" అన్నాడు.

ఆఫీసు గది అంతా ఈసారి ఖాళీగానే ఉంది. ఇన్‌స్పెక్టరు టేబిల్ మీద కాగితాలన్నీ సర్దుకుంటున్నాడు. నెఖ్లూదోవ్ ఖైదీతో మాట్లాడుతూన్నప్పుడు తాను కూడా హాజరై ఉండాలని అతని ఉద్దేశమైనట్టు స్పష్టమైంది.

'రాజకీయ ఖైదీ అయిన సుఖోవాను కూడా చూడవచ్చునా' అని నెఖ్లూదోవ్ అడిగినప్పుడు 'వీల్లేదన్నాడు' ఇన్‌స్పెక్టరు. "రాజకీయ ఖైదీలతో ఇక్కడ ప్రసంగించటానికి వీల్లేదు" అని చెప్పి మళ్ళీ కాగితాలు సర్దుకుంటున్నాడు. సుఖోవాకు తాను సేటుస్బర్గునుంచి తెచ్చిన ఉత్తరం జేబులోనే ఉంది. తానొక గొప్ప నేరం చేసినట్టాగా, తన పన్నాగాలు బయటపడి, భగ్నమై పోయినట్టుగా భావించాడు నెఖ్లూదోవ్.

ఆఫీసు గదిలోనికి మస్లోవా వచ్చింది. ఇన్‌స్పెక్టరు తలెత్తి ఒకసారి చూశాడు. "ఇక మీరు మాట్లాడుకోవచ్చు" అని ఆజ్ఞ ఇచ్చేసి, మళ్ళీ కాగితాలు సర్దుకుంటున్నాడు.

మస్లోవా తెల్లని జాకెట్టు తొడుక్కుంది. నెఖ్లూదోవ్ కేసి చూసింది. అతని చూపు కఠినంగానూ, కోప చిహ్నాంతంగానూ ఉంది. ఆమె బుగ్గలు సిగ్గుచే ఎర్రబడినాయి. జాకెట్టు కొసను వేలికి చుట్టుకుంటూ చూపులు దించేసుకుంది. ఆమె ప్రదర్శించిన భావాసహ్యాతను చూసి, ఆసుపత్రిలోని నేటు కాపలా స్త్రీ చెప్పిన మాటలు నిజమేనని స్ఫురించింది నెఖ్లూదోవ్‌కు.

పూర్వంవలెనే ఆమెను ఆదరించాలని నెఖ్లూదోవ్ భావం. కాని బైటికి సౌమ్యంగా ప్రవర్తించలేక పోయాడు. కరస్పర్శ చేయటానికి కూడా మనస్కరించలేదు.

"నేను నీకు చెడువార్త తెచ్చాను. సెనేటు అపీలును త్రోసివేసింది" నెఖ్లూదోవ్ ఆమెవైపు చూడకుండానే మామూలు కంఠస్వరాన చెప్పాడు.

"త్రోసివేస్తారనే నేనూ అనుకున్నాను" ఆమె కంఠధ్వని మామూలుగా లేదు. ఊపిరాడక తహతహ లాడుతున్నట్టుంది.

"త్రోసివేస్తారని నీ కెలా తెలుసు ?" అని ఇదివరకు పరిస్థితుల్లో అయితే అడిగేవాడే. ఇప్పుడలా అడగలేదు. మామూలుగా ఆమెవైపు చూశాడు. ఆమె కన్నులు అశ్రుపూర్ణములైనాయి.

నెక్లూడో హృదయం మెత్తపడలేదు. ఆమెమీద కోపం మరింత ఎక్కువయింది.

ఇన్‌స్పెక్టరు గదిలో అటూ, ఇటూ పచార్లు చేస్తున్నాడు. మస్లొవా పట్ల నిగూఢమైన అసహ్యభావం దేహంలో కంపిస్తూనే ఉంది. అయినా సెనేటు నిర్ణయం అలా ఉండేటందుకు విచారం వెలిబుచ్చటం సహజం అని తోచింది నెక్లూడోవుకు.

"అయినా నువ్వు నిరుత్సాహ పడక్కర్లేదు. చక్రవర్తికి పిటీషన్ పెడుతున్నాం. ఈసారి మేలు చేకూరవచ్చు" అన్నాడు.

"నేనసలు ఆ విషయమే ఆలోచించటంలేదు." మస్లొవా అతనికేసి జాలిగా చూసింది.

"మరి ?"

"మీరు ఆసుపత్రికి వెళ్ళి ఉంటారు. అక్కడ వాళ్ళు నన్ను గురించి—"

"అదా ? అది నీ వ్యవహారం—" అని ముక్తసరిగా పలికి కరుకు చూపొకటి విసిరాడు. ఆమె ఆసుపత్రి మాట యెత్తినప్పుడు—తన అభిమానం దెబ్బతిని యున్నప్పటి క్రౌర్యభావం, కాస్త అణగియున్నది మళ్ళీ పైకి వచ్చింది.

తాను లౌకికుడు. తన్ను వివాహం చేసుకోటం పరమ భాగ్యంగా కులీనలైన కన్యలంతా భావిస్తారు; సందేహం లేదు. అయినా తాను మస్లొవాను వివాహం చేసుకుంటానని మాట ఇచ్చాడు. ఆమె ఓపిక పట్టలేక పోయింది. చిన్న డాక్టరుతో వ్యవహారం సాగిస్తుందా ?

"సరే, ఈ పిటిషన్ మీద సంతకం చెయ్యి" ఒక పెద్ద కవరులోనుంచి కాగితం తీసి టేబిల్ మీద పరిచాడు. ఆమె తన కన్నీళ్ళు తుడుచుకుంటూ "ఏమి రాయాలి ? ఎక్కడ రాయాలి ?" అని అడిగింది.

ఎక్కడ సంతకం చెయ్యాలో చూపించాడు. ఆమె గౌను సర్దుకుంటూ కూచుంది. అతడామె వెనుకగా నిల్చొని చూస్తున్నాడు. ఆమె వీపు ఏ భావోద్రేకము చేతనో వొణుకుతోంది. సద్భావాలు, దుర్భావాలు కలసి, ఒరసికొని, సందడి చేస్తున్నాయి నెక్లూడో హృదయంలో. తన అభిమానం దెబ్బ

తన్న క్రౌర్యం, జైలు బాధ అనుభవిస్తున్న ఆమెగూర్చి జాలి—రెండు భావాలూ ఒండొంటి యుద్ధం చేశాయి. రెండవ భావం జయించింది.

ఏది ముందు జరిగిందో తనకే తెలియదు. అతని హృదయంలోనికి జాలి ముందుగా త్రోసుకు వచ్చిందా? లేక ముందుగా తన పాపాల్నే ముందుగా తలుచుకున్నాడా? ఏమైనా మొత్తంమీద తానే అపరాధి నన్నట్టు భావించి ఆమెపై జాలిపడ్డాడు.

పిటీషన్ మీద దస్కతు పెట్టి ఆమె లేచి నిల్చుంది; అతనివైపు చూసింది.

"ఏమైనా జరగనీ; ఏమైనా కానీ; నా నిశ్చయం మారదు. నేను చెప్పినంతా చేసి తీరతాను. వాళ్ళు నిన్ను ఎక్కడికైనా పంపనీ నేను నీ వెంట ఉంటాను" ఆమెను క్షమించగలిగానన్న భావంవల్ల ఆమెయెడ మొలకెత్తిన జాలి, సౌజన్యాలు అధికతరం అయినాయి. ఆమెను ఓదార్చదామన్న తలంపు కలిగింది.

ఆతని మాటలకు ఆమె ముఖం వికసించింది. "ఏమి లాభం?" అన్నది.

ప్రయాణానికి ఏమేమి కావాలో ఆలోచించి చెప్పు"

"నాకేం తెలుసు?"

ఇన్‌స్పెక్టరు లేచి వచ్చాడు. అతని మాటకోసం ఆగకుండానే నెఖ్లూడోవ్ సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు. అతని హృదయంలో ఎన్నడూ అనుభవించి యెరుగని శాంతి, ఆనందం, ప్రేమ పొంగులు వారినవి-మస్లావా ఎలా ప్రవర్తించినాసరే, ఆమె యెడల తన ప్రేమ విచలితం కాదు అన్న భావం అతని సంతోషానికి అవధిలేకుండా చేసింది. తానెన్నడూ చవిచూచి యెరుగని ఏ ఉన్నత పథాల అంచులో తాకినట్టనిపించింది. ఆమె చిన్న డాక్టరుతో సాగించే వ్యవహారం ఆమెది. తనకోసంగా ఆమెను తాను ప్రేమించటంలేదు. ఆమెకోసం, భగవంతుని కోసం ప్రేమిస్తున్నాడు.

ఆసుపత్రిలోనుంచి మస్లావాను వెళ్ళగొట్టటానికి కారణం—నిజంగానే మస్లావా చేసిందని నెఖ్లూడోవ్ అనుకుంటున్న నేరం—అదేమిటంటే:

ఆసుపత్రి ఔషధాలలోనుంచి ఒకానొక మూలికతో తయారైన ఔషధాన్ని తీసుకురమ్మని పెద్దనర్సు మస్లావాను పంపింది. మస్లావా వెళ్ళే

పించదు. ఇంతేకాదు. పూర్వపు తన వ్యాపారాలన్నీ విసుగును, అలసటను కలిగించేవి; ఇప్పుడొక విధమైన ఆనంద స్థితిని కల్పిస్తున్నాయి.

ఇప్పుడు తాను చేయవలసియున్న కార్యకలాపాల్ని మూడు రకాలుగా విభజించుకున్నాడు. ఈ మూడువిధాలకూ సంబంధించిన కాగితాల్ని మూడు సంచీలలో వేరువేరుగా పెట్టుకున్నాడు.

మొదటిపని : మస్లోవాకు సంబంధించినది. ఆమె తరఫున పిటీషన్ చక్రవర్తికి అందచేయాలి. ఆమె సైబీరియాకు వెళ్ళక తప్పనిసరి అయితే ఆ ప్రయాణానికి అంతా సిద్ధంచేయాలి.

రెండోపని : తన ఎస్టేటు వ్యవహారాలకు సంబంధించినది. పానోవ్‌లోని తన భూమిని యావత్తూ రైతులకు ఇచ్చేశాడు. వాళ్లు చెల్లించవలసిన కౌలు ధనాన్ని వాళ్ళ సమిష్టి ఖర్చుల కింద వినియోగించుకోవాలి. ఆ సమిష్టి నిధిగా ఏర్పాటు అయ్యేట్టు పరిస్థితుల్ని కల్పించివచ్చాడు. దస్తావేజు రాయించి రిజస్టరు చేయించటంద్వారా ఆ విధానాన్ని ఖాయపరచవలసిన పనిఉంది-కుస్మిన్స్కీలో పరిస్థితులు తాను మొట్టమొదట ఏర్పాటుచేసి వచ్చినట్టే ఉన్నాయి. కౌలుధనం తనకే చెల్లిస్తారు. అయితే వాటిని నిర్ణయించవలసి ఉన్నది - ఎంత ధనం తన బ్రతుకుతెరువుకు ఉంచుకోవాలో, ఎంత సొమ్మును రైతుల సమిష్టినిధికింద విడిచిపెట్టాలో నిర్ణయించుకోవలసి ఉంది - ఈ సైబీరియా ప్రయాణంవల్ల ఎంత ఖర్చు కావచ్చునో అతనికి తెలియదు. అందుచేత తన ఆదాయాన్ని పూర్తిగా విడిచిపెట్టుకోలేదు; అయితే మాత్రం సగానికి సగం తగ్గించుకోటం జరిగింది.

ఇక మూడోపని : మాటిమాటికీ తన సహాయాన్ని అధికంగా కోరుతూన్న ఖైదీలకు సాయపడటం.

మొట్టమొదట అతను జైలుకు వెళ్ళి వాళ్ళతో మాటాడిన రోజునుంచి వాళ్లు కొందరు తన సహాయాన్ని కోరారు. పాపం కదా అని, వాళ్ళబాధలను తొలగించుదామన్న ఉద్దేశంతో వాళ్ళ తరఫున కొంతపని చేశాడు. దానితో అతని సహాయాన్ని అపేక్షించే ఖైదీల సంఖ్య నానాటికీ పెరిగింది-ఇంతమంది వ్యవహారాలను చూడ్డం అతనికి అసంభవంగా తోచింది. కాగా పైమూడు పనులకన్నా అతనికి మరింత ఉత్సాహాన్నిగొలిపే మరొకపని ఒకటి ఏర్పడింది.

ఈ పని ఏమిటీ అంటే—అతి విచిత్రంగా వున్న క్రిమినల్ చట్టం అంటే ఏమిటి? ఇది ఎక్కడినుంచి వచ్చింది? అనే సమస్యల పరిష్కారం. ఈ అసాధారణ క్రిమినల్ చట్టం మూలాన వేలాది ఖైదీలు పీటర్సుబర్గు కోటలోనూ, సఖాలిన్ దీవిలోనూ నిర్బంధితులై మగ్గిపోతూ వున్నారు. వీరందరి అసహ్యవేదనకు మూలహేతువైన ఈ విచిత్ర క్రిమినల్ చట్టం ఎక్కడిది?

కొంతమంది ఖైదీలతో తనకున్న పరిచయంవల్ల—జైలు అధికారులను, వకీలును అడిగి తెలుసుకున్న అంశాలనుబట్టి—ఈ క్రిమినల్ నేరస్థులనబడే వారు అయిదుతరగతులుగా ఉన్నట్టు నెఖ్లూడోవ్ గ్రహించాడు. మొదటితరగతివాళ్ళు నిరపరాధులు, న్యాయాధిపతుల పొరబాట్లవల్లనే నేరస్థులుగా పరిగణింపబడి, శిక్షార్హులైనవాళ్ళు. మెన్‌షోవ్ వంశీకులు, మస్లోవా మొదలైన వాళ్ళంతా యీ తరగతికి చెందినవాళ్ళే. ఇలాంటివాళ్లు ఎక్కువగా ఉండరనీ, నూటికి ఏడుగురు మాత్రమే వుంటారనీ జైలులోని చర్చి అధికారివల్ల నెఖ్లూడోవ్ విన్న విషయం.

రెండవతరగతివాళ్లు: కొన్ని విపరీత పరిస్థితుల్లో చేసిన పనులకు శిక్షితులైనవాళ్ళు; కోపంలోనో, ఈర్ష్యలోనో, బాగా తాగివుంటేనో ఏదో చేసినవాళ్ళు. అలాంటి పరిస్థితుల్లో...వాళ్ళను విచారించి, శిక్షించిన న్యాయమూర్తులుకూడా అలాంటి ఏదో పనులే చేసివుండేవాళ్ళే. నెఖ్లూడోవ్ ఎరిగివున్నంతవరకు ఈరకపు నేరస్థులు సగానికి పైగా ఉంటారు.

కొంతమంది తమ దృష్టిలో స్వాభావికాలు, మేలైనవి అనుకున్న పనులు చేస్తారు. కాని చట్టాన్ని, నిషేధాజ్ఞలను జారీచేసేవారి దృష్ట్యా అవి అకార్య కరణాలు ఔతాయి. కాగా అట్టివారున్నూ నిర్బంధితులౌతున్నారు. ఇటువంటి వాళ్ళంతా మూడోతరగతికి చెందినవాళ్ళు. లైసెన్సులేకుండా సారాయాలు అమ్మినవాళ్లు, కనపడిన వస్తువు ఎత్తుకుపోయినవాళ్లు, ధనవంతుల విశాలమైన బీళ్ళలో గడ్డి దోక్కొనిపోయినవాళ్లు, ప్రభుత్వపు అడవులలో వంటకట్టెలు నరుక్కుపోయినవాళ్ళు, చర్చిలలో దొంగతనాలు చేసిన నాస్తికులు—వీళ్ళంతా ఈ తరగతికి చెందినవాళ్ళే.

నాలుగోతరగతికి చెందినవాళ్లు; సాంఘిక నైతిక మర్యాదలకు అతీతులైనవాళ్లు. విద్రోహులనబడేవాళ్లు; తమ స్వాతంత్ర్యాన్ని పొందుటకై తిరుగుబాట్లు చేసే పర్షేషియన్, పోల్ జాతివాళ్లు; సోషలిస్టులు, సమ్మె

వించాడు. ఫెడోరోవ్ స్వభావతః ఆవేశపరుడు. ఏ విధంగానైనాసరే సౌఖ్యానుభవం అతని చరమలక్ష్యం. అంతకన్నా మించిన మరోక జీవిత లక్ష్యాన్ని అతడెరుగడు. ఆత్మనిగ్రహం అనేది అతని నిఘంటువులో లేదు.

పై యిద్దరిలోనూ ప్రకృతి ప్రసాదించియున్న, వీర్యవంతములు కాగలిగిన, లక్షణాలు ఉన్నాయి. కాని పాగుగట్టి, ప్రోది చేయని మొక్కలవలె, సంఘము ప్రాపులేక చెడిపోయారని నెక్లూడోవ్ గ్రహించాడు.

ఒక దిష్పకాయను కూడా నెక్లూడోవ్ చూశాడు. ఇంకో యువతిని కూడా అతడెరుగును. వాళ్లు ఇద్దరూ తామస ప్రధానులుగా, క్రూరాత్ములుగా కనిపించారు, తనతో ప్రసంగించిన తీరునుబట్టి. కాని వారైనా చట్టాలు నిర్వచించే క్రిమినల్ నేరస్థులుగా కనిపించలేదు నెక్లూడోవ్‌కు. వ్యక్తిగతంగా తన యెడల క్రూరంగా వాళ్లు ప్రవర్తించి యుండవచ్చు. అదేమాదిరిగా ప్రవర్తించినవాళ్లు నాగరిక ప్రపంచంలో కూడా-విలువైనకోట్లు, జరీ అంచుల దుస్తులు సింగారించుకున్నవాళ్ళు లేకపోలేదు.

ఇటువంటి వాళ్ళనందర్నీ జైళ్ళలో ఎందుకు పెట్టాలి? వాళ్ళ మాదిరిగానే అటువంటి నేరాలే చేసిన అనేకమంది శిక్షలు లేక హాయిగా ఎందుకు ఉండగలుగుతున్నారు? ఈ విషయాల పరిశోధన కూడా అతని జీవిత కార్యక్రమంలో మరో అంశం అయింది.

ఈ పరిశోధనకు సాయపడతాయని తాననుకున్న పుస్తకాలు తెప్పించి చదివాడు. లోంబ్రాసో, గరోఫలో, ఫేరీ, లిజిట్, మాడ్స్లే, టార్డ్ మొదలైన ప్రముఖులు రాసిన గ్రంథాలు జాగ్రతగా చదివాడు. చదివినకొద్దీ ఆశాభంగమే కలిగింది. వ్యాసాలు రాయటానికి గాక - ఇతర్లకు బోధించే నిమిత్తం గాక - విషయ చర్చకుగాక — ఏదో ఒక జీవిత సమస్య పరిష్కారం కోసం విజ్ఞానశాస్త్రాలు తరిస్తే అంతే. క్రిమినల్ చట్టానికి సంబంధించిన వేలాది విషయాలు ఆ విజ్ఞాన గ్రంథాల్లో ఉన్నాయి. కాని నెక్లూడో అవలోకిస్తున్న సమస్యకు పరిష్కార మార్గం మాత్రం వాటిలో కనిపించలేదు.

కొంతమంది మరికొందర్ని ఎందుకు ఖయిదు చేస్తున్నారు? ఎందుకు బాధిస్తున్నారు? ఎందుకు ప్రవాస శిక్షలు విధిస్తున్నారు? ఎందుకు ఉరిదీసి చంపుతున్నారు? ఈ శిక్షించేవారు ఆ శిక్షితులవంటివారే కదా? ఈ చిన్న

ప్రశ్నకు జవాబుకోసం వెతుకుతూంటే ఆ ప్రశ్నలోనుంచే తామరతంపరంగా ప్రశ్నాంతరాలు ఉత్పన్నమైనాయి. జీవికి స్వతంత్ర క్రియాశక్తి ఉన్నదా? మానవుని ప్రవర్తనకు కొలతలు కట్టి అతడు దుర్మార్గుడో కాదో నిర్ణయించేందుకు వీలున్నదా? ఒకడు క్రిమినల్ నేరస్థుడు కావటానికి అతడు పుట్టిన వంశం ఎంతవరకు కారణభూతం అవుతుంది?— అవినీతి వంశ పారంపర్యంగా దిగుమతి అవుతుందా? పిచ్చి యెత్తటమంటే ఏమిటి? పతితులైపోవటమంటే ఏమిటి? స్వభావమంటే ఏమిటి? వాతావరణ స్థితి, ఆహారమూ, మూఢత్వం— వీటికీ చేయబడు నేరానికీ సంబంధం ఎంతవరకు? సమాజం అంటేనూ, దాని ధర్మాలు అంటేనూ ఏమిటి? అంటూ ఇలా చాలా ప్రశ్నలు...

ఒకప్పుడు ఒక చిన్న కుర్రవాడు బడినుంచి యింటికిపోతూ నెఖ్లూడో కాసేపు అతడితో ప్రసంగించటం జరిగింది—"అబ్బాయి! నీకు గుణింతం బాగా వొచ్చా?" అని అడిగాడు.

"ఓ, బాగానే వచ్చు."

"కాలు—యీ పదంలోని రెండు అక్షరాల గుణింతం చెప్పి ఎలా రాస్తావో చూపించు."

"ఏంకాలు? కుక్క కాలా? ఇంకా దేని కాలైనానా?"

ఇలాంటి జవాబులే విజ్ఞాన గ్రంథాల్లో దొరికాయి నెఖ్లూడోకు తన ప్రాతిపదిక ప్రశ్నకు. తెలివితేటలైన వ్రాతలే ఉన్నాయి; పాండిత్యానికి లోటులేదు; మనోరంజకాలైన ఘట్టాలూ ఉన్నాయి. "కొందరు మరి కొందర్ని శిక్షించే హక్కు ఎక్కడిది?" యీ ప్రశ్నకు మాత్రం ఎక్కడా జవాబు లేదు. శిక్షయొక్క ఆవశ్యకతను నిరూపించకుండా శిక్ష ఎలా ఉండాలో మాత్రం బాగా విశదీకరించాయి గ్రంథాలన్నీ.

ఎన్ని గ్రంథాలు చదివినా తనకు కావలసింది దొరక్కపోవటం... జాగ్రతగా చదవకపోవటంవల్లనేమో ననుకున్నాడు. ఎప్పటికైనా తెలియక పోదులే అనుకున్నాడు. కాని తన ప్రాతిపదిక ప్రశ్నకు జవాబు దానంతటది అదే అతనికి స్ఫురింప నారంభించింది. కాని అందలి సత్యాన్ని ఇంకా విశ్వసించలేక పోతున్నాడు.

## ౩౧

సైబీరియాకు ప్రవాస శిక్ష విధించబడిన ఖయిదీలు జులై 5వ తేదీని బయలుదేరవలసి ఉంది. వారిలో మస్లొవా కూడా ఉంది. నెఖ్లూడో కూడా ఆనాడే బయలుదేరటానికి సిద్ధపడ్డాడు.

లోగడ దినం నెఖ్లూడో సోదరి, ఆమె భర్త అతన్ని చూడ్డానికి పట్నం వచ్చారు.

నెఖ్లూడో సోదరి నటాలీ అతనికన్న పది సంవత్సరాలు పెద్ద. నెఖ్లూడో చిన్నతనంలో ఎక్కువగా ఆమె దగ్గరే పెరిగాడు. ఆమెకు అతనంటే చాలా ప్రేమ. ఆమెకు ఇరవై అయిదేళ్ళప్పుడు అతడు పదిహేనేళ్ళ కుర్రవాడు. ఇద్దరూ అత్యంత ప్రేమాస్పదంగా ఉండేవాళ్ళు ఆమె అతని మిత్రుడైన నికొలెంకాను ప్రేమించింది. అతనంటే అక్కా తమ్ముళ్ళ కిద్దరికీ మక్కువ.

కాని నికొలెంకా చనిపోయిన తర్వాత ఇద్దరూ స్వేచ్ఛా విలాస జీవితాల్లో పడిపోయారు. నెఖ్లూడో మిలిటరీ ఉద్యోగంలో చేరిపోయి ఇష్టం వచ్చినట్టుగా చెడుమార్గాన జీవితం గడిపాడు. నటాలీ తాను తీవ్రంగా కామించిన ఒకణ్ణి పెళ్ళి చేసుకుంది. ఆతడామె ఉదార ఆశయాలను, మంచి ఉద్దేశాలను లెక్కచేయలేదు. నీతి, మానవసేవ-ఇలాంటివి వాక్యాలు అతనికి అర్థంకాని పదాలు. ఆడంబర జీవితం, గుండెలో చెలరేగే కోర్కెల్ని సాధించుకోటం-ఇదే అతని జీవితాశయం.

మొదట అతనికి ఊరు, పేరు లేదు. పెద్ద ఆస్తి కూడా లేదు. కాని న్యాయశాఖలో తన ఉద్యోగాన్ని అంటిపెట్టుకుని చాకచక్యంగా పని చేసే వాడు. రెండు పెద్ద రాజకీయ పార్టీల మధ్య ఊగులాడుతూ, కాలానుసరణంగా ఏ యెండ కా గొడుగు పట్టుతూ, ఆ రెండు పార్టీలను తన స్వార్థ లాభానికి ఉపయోగించుకుంటూ చాలా జాగ్రతగా సంఘంలో మంచి స్థానం సంపాదించుకున్నాడు. ఆడవాళ్ళకు ఆహ్లాదాన్ని పుట్టించగల మాట, నేర్పు ఉంది. ప్రథమ యవ్వనం దాటిపోయిన తర్వాత నెఖ్లూడో-నటాలీలతో పరిచయం కలిగింది. అప్పటికి నటాలీ కూడా చిన్నపిల్లేమీ కాదు. ఎలాగైతే నేమి ఆమె కన్ను తనమీద పడేలాగు ప్రవర్తించాడు. నటాలీ అతన్ని

వివాహం చేసుకోటం ఆమె తల్లి కిష్టంలేదు. అయినా నటాలీ అతన్ని ప్రేమిం చింది. నెఖ్లూడోవ్ కూడా బావగారిమీద అసహ్యమే. కాని ఆ భావాన్ని పైకి పొక్కనీయడు.

ఆ మగవాడు పుట్టి సంకుచితబుద్ధి గలవాడు. అయినా అతన్ని నటాలీ పశుతుల్యంగా కామిస్తూ వున్నది. యీ తీవ్ర కామంవల్ల ఆమెలో వున్న మంచి యావత్తూ భగ్నమైపోగల అవకాశం వుంది. అయినా ఆమె అతన్ని అంత స్వార్థపరత్వంలో కామిస్తోన్నదంటే నెఖ్లూడోవ్ అసహ్యం కలిగింది. యీ అసహ్యం బావగారిమీద ద్వేషంగా కూడా పరిణతి చెందింది.

మన్యంలో మెరుస్తోన్న బట్టతల, వొంటినిండా విపరీతంగా వెంట్రుకలు, సంకుచితమైన చిత్తం, ఆత్మగర్వం గల అతనికి తన అక్క భార్య అని తలుచుకుంటే నెఖ్లూడోవ్ బాధ కలుగుతుంది. వాళ్ళకు పుట్టిన పిల్లలన్నా కూడా ఒక విధమైన అసహ్యభావాన్ని అణచుకోలేకపోయేవాడు. మరొకసారి ఆమె గర్భిణి అయిందన్నవార్త విని ఒకరకమైన దుఃఖం అనుభవించాడు. మరొకసారి ఆ దుర్మార్గునిచేత ఆమె కలుషిత అయినట్టు అతని భావం.

ఇప్పుడీ భార్యాభర్త లిద్దరూ ఒంటరిగానే మాస్కో వచ్చారు. క్రొత్త కుమారు, మాతుర్నీ ఇంటివద్దే దించివచ్చారు. మాస్కోలోని గొప్ప హోటలులో నుంచిగదులు అద్దెకు తీసుకున్నారు - పట్నంలోకి వచ్చిన వెంటనే నటాలీ తన తల్లిగారి పాతయింటికి వెళ్ళింది. తమ్ముడు గారు అక్కడ వుంటం లేదనీ మరోచోట వుంటున్నారనీ అగ్రఫేనా పెట్రోవ్నా చెప్పింది. ఆమె చెప్పిన జాడనుపట్టి తమ్ముడు వుంటోన్న చోటికి వెళ్ళింది. అక్కడ నెఖ్లూడోవ్ నౌకరు-చాలా అపరిశుభ్రంగా వున్నాడు—'అయ్యగారు బైటికి వెళ్ళారని చెప్పాడు.

నటాలీ లోపలికి వచ్చింది. తమ్ముడికి ఒక ఉత్తరం రాసిపెట్టి వెడదామని ఆమె ఆలోచన. నెఖ్లూడోవ్ వుంటోన్న ఆ రెండు చిన్నగదుల్నీ బాగా పరిశీలించింది. ఎక్కడి వస్తువు అక్కడే వుండవలసినచోటనే వుంది. అంతా అత్యంత పరిశుభ్రంగా వుంది-తన తమ్ముడెప్పుడూ అంతే. ఆమెకు తెలుసు. ఇకపోతే నా కేసిన బల్ల వుండే సంచిలో వుంటున్నాడే ఇది? అదే ఆమెకు చాలా ఆశ్చర్యం కలిగించింది- అతని రాతబల్ల మీద పనిషనిమయాలకు సంబం

ధించిన కాగితాలు విడివిడిగా చక్కగా పెట్టి వున్నాయి. గాలికి కాగితాలు ఎగిరిపోకుండా పెట్టుకునే ఒక పనిముట్టు కనిపించింది. దానిమీద ఇత్తడితో చేసిన ఒక చిన్న కుక్క వుంది. అది చాలా కాలంనుంచీ నెక్లూడోవ్ దగ్గర వున్నది. ఆమె యెరుగును. కాగితాలు కోసుకునేందుకు ఉపయోగించే చాకు ఒకటి టార్డ్ రాసిన ఒక ఫ్రెంచి గ్రంథంలో కనిపించింది. శిక్షాస్మృతిని గురించి వ్రాసిన గ్రంథాలు కూడా వున్నాయి. హెన్రీజార్జి రాసిన ఆంగ్లగ్రంథం కూడా వుంది. ఇవన్నీ ఆమె ఇదివరకు తమ్ముని దగ్గిర చూస్తూ వుండినవే.

టేబిల్ దగ్గర కూర్చుని ఒక ఉత్తరం రాసింది. తాము ఎక్కడ బస చేశారో తెలియజేస్తూ, ఒకసారి వచ్చి చూచిపొమ్మని కోరింది. ఆ రోజే తప్పకుండా రావలసిందని రాసింది. తమ్ముడు ఉంటూన్న ఆ చిన్న గదుల్ని, ఆ వీధిని తలచుకుని ఆశ్చర్యపడుతూ వెళ్ళిపోయింది.

నెక్లూడోవ్‌ను గురించిన రెండు విషయాలు ఇప్పుడు ఆమెకు కొత్తగా కనిపించాయి. ఒకటి : అతడు మస్లోవాను పెండ్లి చేసుకోవటం. రెండు : తన భూ ఆస్తిని యావత్తూ రైతు కూలీలకు ఇచ్చివేయటం. యీ రెండు అంశాలనూ పట్నంలో వాళ్లూ వీళ్ళూ చెప్పుకుంటూంటే ఆమె విన్నది. అసలు అందరూ ఆ సంగతులే చెప్పుకుంటున్నారు. పట్నంలో అతడు తన భూమిని రైతు కూలీలకు పంచి పెట్టడమనేది రాజకీయ ప్రాముఖ్యతగలది అనీ, అత్యంత అపాయకరంగా పరిణమించగలదనీ కూడా చెప్పుకుంటున్నారు. అతడు మస్లోవాను పెళ్ళి చేసుకుంటాడన్న విషయం నటాలీకి ఒక రకంగా సంతోషకరంగానే ఉంది. అతనిలో ఉన్న పట్టుదలను ప్రశంసించింది. అటువంటి పట్టుదల చిన్నతనంలో అతనిలోనే కాదు, తనలో కూడా ఉండేది, పెళ్ళి కానంత వరకూ. కాని తన తమ్ముడు ఒక నీచ యువతిని పెళ్ళి చేసుకోబోతున్నాడని తోచినప్పుడు ఆమె విచలిత అయింది. మొదట కలిగిన ఆనందంకంటే యీ రెండవసారి కలిగిన అసహ్య భావమే బలీయమైనది. ఏమైనా సరే యీ పెళ్ళి చేసుకోకుండా ఉండేందుకు తమ్మునికి బోధ చెయ్యాలని నిశ్చయించుకుంది. అది చాలా కష్టతరమైన పనియని ఆమెకు తెలుసు.

భూమి అంతా రైతుకూలీలకు పంచివెయ్యబోతున్నాడన్న సంగతికి ఆమె అంతగా బాధపడలేదు. కాని ఆమె భర్తకు తీవ్రమైన కోపం వచ్చింది.

"నీ తమ్ముణ్ణి అలాంటి తెలివితక్కువ పనులు చేయకుండా నీ పలుకుబడి ఉపయోగించి చూడు" అని భార్యను ఆదేశించాడు.

"గర్వం; అహంభావం; చలచిత్తం; అపూర్వవ్యక్తిలా కనిపించాలనీ, తన్ను గురించే అందరూ అనుకుంటూ వుండాలని ఆకాంక్ష—అందువల్లనే కనీ, వినీ యెరుగని ఇలాంటిపనులు తలపెట్టాడు. భూమిని కౌలు కిస్తున్నాడూ? రైతులు కౌళ్ళను తాము తమకే చెల్లించుకుంటారూ? అతనికి దమ్మిడీ రాదా? అంతకంటే రైతుల బ్యాంకుద్వారా భూమిని అమ్మివేసుకోకూడదా? బుద్ధిగలపని ఔతుందే! ఇదేంపని చేస్తున్నాడు? వీడికి గాని మతిచెడలేదు కదా!" అన్నాడు భర్త. అలా అనటమే కాదు. "పిచ్చి చేతుల్లో ఉంటే ఆస్తి ఇలాగే నాశనమైపోతుంది. ప్రభుత్వానికైనా తెలిపి వాడివల్ల నాశనం కాకుండా ట్రస్టీలను ఏర్పాటు చెయ్యవలసివుంటుంది. నువ్వు వాణ్ణి తీవ్రంగా కేకలు వెయ్యి—" అన్నాడు.

## ౩౨

ఆ సాయంత్రం నెక్లూడో ఇంటికి తిరిగివచ్చినప్పుడు అక్కగారు రాసిపెట్టివెళ్ళిన ఉత్తరం చూసుకున్నాడు. వెంటనే ఆమె వుంటూన్న హోటలుకు బయలుదేరి వెళ్ళాడు. తల్లి చనిపోయిననాటినుంచీ తిరిగి యిద్దరూ ఎన్నడూ కలుసుకోలేదు. నెక్లూడో వెళ్ళేసరికి నటాలీ ఒక్కతే కనిపించింది. ఆమెభర్త పక్కగదిలో విశ్రాంతి గైకొంటున్నాడు. ఒంటికి బిగుతుగా ఉన్న నల్లని పట్టుగౌను తొడుక్కుంది. బాగానే ముస్తాబై ఉంది. నల్లనిజుట్టు చక్కగా ఆధునికమైన ఫేషనుకు అనుగుణ్యంగా ముడిచింది.

ఆమె, భర్త-ఇద్దరూ ఇంచుమించు ఒకే యీడువాళ్లు. భర్తను సంతోషపెట్టే నిమిత్తం అలా అలంకృత కావటానికి ఎంతశ్రమ పడ్డదో కనిపిస్తూనే ఉంది.

తమ్ముడిని చూడగానే ఆమె ముందుకు గబగబా వచ్చి స్వాగతం ఇచ్చింది. పరస్పరం నవ్వుకున్నారు. ఏదో అర్థవంతములైన చూపులు

బరపుతున్నారు. ఆ చూపుల్లోని సందేశాలు భాషకు అతీతములు. అవి సత్యములు. ఆ తరువాత అసత్యములైన మాటలు దొర్లాయి.

"నువ్వు లావెక్కావు. పూర్వంకన్నా చిన్నదానివైనావు" అన్నాడు నెఖ్లూడొ. ఆమె పెదవులమీద ఆనందం విరిసింది.

"నువ్వు మాత్రం చిక్కావురా!"

"మీ ఆయన ఎక్కడ?"

"విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆయనకు రాత్రంతా నిద్రలేదు."

ఇంకా చాలా చెప్పవలసివుంది. అదంతా మాటల్లో వ్యక్తం కాలేదు. మాటల్లో వాళ్లు చెప్పలేకపోయిన విషయాలను వాళ్ళచూపులు ప్రదర్శించినవి.

"నేను నువ్వు ఉంటూన్న బసకు వచ్చాను."

"ఔను. ఇదివరకు ఉంటూన్న యిల్లు లంకంత ఉంటుందారొ. నేనొక్కణ్ణి అందులో దిగాలుగా ఉండాల్సివచ్చేది. అందుచేత బస మార్చేశాను. ఆ యింట్లోవున్న ఆ సరంజామా అంతా నాకు అక్కరలేదు. నువ్వు తీసుకోవచ్చు. కుర్చీలు, బల్లలు, కట్టెలు...అవన్నీను."

"ఔను అగ్రఫేనా పెట్రోనా చెప్పింది. అక్కడికే వెళ్లాను, మొదట నీ కోసం. నీ యీవికి కృతజ్ఞురాల్ని కాని—"

ఇంతలో హోటలువాడు టీ సరంజామా అంతా తెచ్చి బల్లమీద పెట్టాడు. అతడక్కడ ఉన్నంతసేపూ ఎవరూ మాటాడలేదు. తరువాత నటాలీ తేనీరు కలుపుతూ కూచుంది. ఆమె మౌనంగానే ఉండిపోయింది. నెఖ్లూడొకూడా పెదవి కదల్చలేదు.

చివరకు నటాలీ ధైర్యంచేసి ఆరంభించింది: "సరేగాని తమ్ముడూ! నాకంతా తెలుసును సుమీ!" అంటూ అతని ముఖంలోకి చూచింది.

"దానిదేముంది? నీకు తెలియటం నాకు సంతోషమే."

"ఆమె ఎలాటి బ్రతుకు గడిపిందో తెలుసుకదా! ఇంకా ఆమెను సంస్కరిస్తావా? చేతనౌతుందా?"

నెఖ్లూడొ ఆ చిన్న కుర్చీలో కదలకుండా కూచుని జాగ్రతగా వింటూన్నాడు. ఆమెభావాన్ని గ్రహించాడు. సరియైన సమాధానం చెబుదామని

అతని ఉద్దేశం. ఇటీవల మస్లొవాను కలసివచ్చినప్పుడు అతనిలో ఒకవిధమైన మానసికస్థితి ఏర్పడుతున్నది. ఆత్మ ఆనందంతో నిండిపోయింది. అందరి యెడల సౌజన్యమే ప్రవహిస్తోంది.

"ఆమెను కాదు; నన్ను నేనే సంస్కరింపదలచుకున్నాను."

నటాలీ ఒక నిట్టూర్పు విడిచింది. "అందుకు పెళ్ళిచేసుకోవటమేనా మార్గం? ఇతర పద్ధతులు లేవా?"

"కాని నా ఉద్దేశంలో అదే ఉత్తమమైన పద్ధతి. అది నన్ను ఇంకో ప్రపంచంలోకి తీసుకుపోతుంది. అక్కడినుంచి ఇతర్లకు కొంత ఉపయోగ పడతాను."

"నువ్వు ఇందువల్ల సుఖపడలేవు."

"నేను సౌఖ్యపడటం—అది కాదు లక్ష్యం."

"ఆమె అయినా—హృదయంగల వ్యక్తి అయితే సుఖపడలేదు. ఇటువంటిది కోరదసలు."

"ఆమె కోరటంలేదు."

"బాగుంది. కాని జీవితం..."

"ఊఁ. జీవితం?"

"ఇంతకన్న వేరైన మరొకదాన్ని కోరుతుంది."

"సవ్యమైన, సక్రమమైన ప్రవర్తనను కోరుతుంది. అంతకన్నా మరి దేన్నీ కోరదు"—నెక్లూడొ ఆమె ముఖంలోకి చూచాడు. ఇప్పటికీ ఆమె ముఖం అందంగానే ఉంది—నోటికి ఇరుప్రక్కల, కళ్ళచుట్టూ కాస్త ముడతలు కనిపిస్తున్నాయి అంతే.

"నాకు అర్థం కావటంలేదు"—ఆమె ఒక నిట్టూర్పు విడిచింది. పాపం! అక్కయ్య ఎలా మారిపోయిందో! అనుకున్నాడు నెక్లూడొ. చిన్న తనపురోజులు, అప్పటి తమతమ భావాలు తలుపుకువచ్చాయి. పెళ్ళికాక ముందు నటాలీ తనకు కన్నులకట్టినట్టు స్ఫురింపసాగింది. ఆమెయెడ ఒక ఆప్యాయతతో హృదయం నిండిపోయింది. ఇంతలో బావగారు వచ్చారు, నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ, తల ఠీవిగా ఎత్తి, రొమ్ము విరుచుకుని. నల్లనిగడ్డం, బట్టతల, కళ్ళద్దాలు మెరుస్తున్నాయి.

"కులాసా ? బాగున్నావా ?" అస్వాభావికమైన ఆ వేగంతో ప్రశ్నించాడు.

కరచాలనానంతరం బావగారు పడక కుర్చీలో వాలిపోయారు.

"అక్కా తమ్ముల సంభాషణకు నేను పానకంలో పుల్లలాగ రాలేదు కద !"

"ఉహుఁ—నా మాటలుగాని, చేతలుగాని బహిరంగమే – రహస్యం ఏమీ లేదు."

దట్టంగా వెంట్రుకలు గల బావగారి చేయి మూడగానే, అహంభావ-ఆత్మోన్నత్య-సూచకమైన ఆతని కంఠధ్వని వినగానే, నెఖ్లూడోవ్‌లోని నెమ్మదితనం పలాయమానమైంది.

"అతని ఆలోచనలను గురించే ప్రసంగించుకుంటున్నాం" అన్నది నటాలీ భర్తతో. "మీకు కూడా ఒక కప్పు టీ నీకు ఇవ్వనా ?" అని అందిస్తూ.

"ఏమి ఆలోచన లేమిటి ?"—కప్పు అందుకుంటూ అడిగాడు.

"సైబీరియాకు వెళ్ళే ఉద్దేశం ... ఖైదీలతో కూడా... నే నొకసారి ద్రోహం చేశానని నేను భావిస్తున్న యువతితో కూడా" అన్నాడు నెఖ్లూడోవ్.

"ఊరికే అనుసరించి వెళ్ళటమే కాదుటగా ! పై మాటకూడా విన్నానే."

"ఔను; ఆమె యిష్టపడితే పెళ్ళి చేసుకుందామని కూడాను."

"ఓహో, అలాగేం ? నీకు అభ్యంతరం లేకపోతే నీ ఉద్దేశాలేమిటో చెబుతావూ ? మాకు అర్థమై చావటంలేదు."

"నా ఉద్దేశాలేమిటంటే—ఆ యువతి యీ విధంగా 'పతితురాలై అధఃస్థితి'కి రావటానికి—" తాను ఉపయోగించిన ఆ రెండు పదాలూ సరియైనవి కావన్న భావనతో, సరైన పదం దొరక్కపోయినందుకు తనకు తన మీదే కోపం వచ్చి చివరకన్నాడు—"నా ఉద్దేశం ఏమిటంటే—అసలైన నేరస్థుడు నేను. శిక్ష అనుభవిస్తున్నది ఆమె."

"ఆమె శిక్ష అనుభవిస్తున్నదీ అంటే ఆమెకూడా నిరపరాధిని ఎలా ఔతుంది ?"

"ఆమె నిస్సందేహంగా నిరపరాధి" అంటూ నెఖ్లూడో తన కథ యావత్తూ అనవసరమైన ఆవేశంతో చెప్పాడు.

"ఔను; అధ్యక్షుని అజాగ్రత, జూరీపెద్దల అనాలోచితమైన తీర్పు-మరి అలాంటి పొరపాటు జరిగినప్పుడు సెనేటు ఉందిగా!"

"సెనేటు కూడా అపీలును తోసివేసింది."

"అంటే అపీలుకు తగినంత హేతుబలం లేదన్నమాట" అన్నారు బావగారు. న్యాయమూర్తుల తీర్పులు సత్యబద్ధములేనని జనవాక్యం, ఆ మాటే బావగారూ నమ్ముతారు.

"సెనేటు కేసుయొక్క గుణగణాల పరిశీలనకు దిగదు. నిజంగా పొరపాటే జరిగివుంటే చక్రవర్తికి పిటిషన్ పెట్టవచ్చు—" అన్నాడు.

"ఆ పనికూడా చేశాం. కాని లాభం ఉండేట్టు తోచదు. మంత్రుల సలహా కోరబడుతుంది. మంత్రులు సెనెటర్లతో ఆలోచిస్తారు. సెనేటు పూర్వపు తీర్పునే బలపరుస్తుంది. నిరపరాధుల శిక్ష ఖాయం ఔతుంది."

బావగారు పరిహాసంగా నవ్వాడు. మంత్రులు సెనేటర్లతో సంప్రదించరు. న్యాయస్థానాలనుంచి మొట్టమొదట దాఖలు చేయబడిన దస్తావేజులను తెప్పించుకుంటారు. ఏదైనా కనిపిస్తే తీర్పు మార్చి చెబుతారు. నిరపరాధుల్ని ఎవరూ, ఎప్పుడూ శిక్షించరు. ఎప్పుడో, ఏ అసాధారణ పరిస్థితుల్లోనో మాత్రం నిరపరాధుల్ని శిక్షించటం అనేది అరుదుగా జరిగితే జరుగుతుందేమో! ఎప్పుడూ నేరస్థుల్నే శిక్షిస్తారు" అని గట్టిగా చెప్పి ఎదుటివాని తెలివితక్కువను నవ్వినట్టు నవ్వాడు.

"నీ అభిప్రాయానికి కేవలం వ్యతిరేకమైన అభిప్రాయాన్నే నేను విశ్వసిస్తాను—" నెఖ్లూడోకు బావగారంటే వున్న అసహ్యభావం పొంగివచ్చింది. "మీ న్యాయచట్టం చేత నేరస్థుల్నిగా పరిగణింపబడి, శిక్షితులౌతున్నవారిలో అధిక సంఖ్యాకులు నిరపరాధులే, అమాయకులే."

"ఎలా నిరపరాధులంటావు?"

"అపరాధం ఏమీ చెయ్యలేదు గనుక. ఇప్పుడు మనం మాట్లాడుతున్న యువతి నిజంగా విషంపెట్టి చంపిందా? ఇప్పుడే నాకొక సమాచారం తెలియవచ్చింది. హత్యానేరం మోపి ఒక రైతును ఖైదుచేశారట!

హత్య అంటే యేమిటో అతడెరగడు. ఇంకో సంగతి. ఒకతల్లి; కొడుకు ఇల్లు తగలబెట్టేరన్న నేరంమీద ఘోరశిక్ష అనుభవించబోతున్నారు. నిజంగా ఇల్లు తగలబెట్టింది ఆ యింటి యజమానే..."

"న్యాయస్థానాల్లో అటువంటి కొన్ని పొరపాట్లు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. మానవనిర్మితాలైన సంస్థలు అన్నివిధాలా నిర్దుష్టంగా ఎలా ఉంటాయి?"

"అంతేకాదు-కొంతమంది వున్నారు. వాళ్ళు సంఘంలో తప్పులుగా భావింపబడుతున్నవి తప్పులో కావో తెలియక, ఆ తప్పులే చేసి శిక్షితులౌతున్నారు."

"అలా ఎప్పుడూ అనకు అబ్బాయి! దొంగతనం చేయటం తప్పు అనీ, తాను దొంగిలించరాదనీ, అది అవినీతి అనీ దొంగవాడికి మహా చక్కగా తెలుసు—" అంటూ బావగారు ఎగతాళి చేస్తున్నటుగా ఒక వ్యంగ్యహాసం చేశారు. నెఖ్లూడోకు కోపం వచ్చింది.

"ఊహుఁ-వాడికి తెలియదు. "దొంగతనం చెయ్యకు" అని మీరు చెబుతున్నారు వాడికి. ఫాక్టరీ యజమాని కూలిడబ్బుల్ని చాలీచాలకుండా ఇచ్చి తన శ్రమను దోచుకుంటున్నాడని అతనికి తెలుసు. ప్రభుత్వం ఉద్యోగులద్వారా పన్నులు విధించి తన్ను దోచేస్తున్నదని అతనికి తెలుసు."

"నువ్వు అరాజకాన్ని ప్రబోధిస్తున్నావు" అన్నాడు బావగారు అతని అభిప్రాయాలన్నింటినీ అరాజక ప్రబోధాలుగా ఒక్క మాటలో నిర్వచించి.

"నేను అరాజకం అంటూ ఒకదాన్ని ప్రబోధించటం లేదు. జరుగుతూన్న విషయాల్ని చెబుతున్నాను. అతడెరిగిన సంగతులు ఏమిటంటే— ప్రభుత్వం అతన్ని దోచేస్తున్నది. భూస్వాములమైన మనం ఇన్నాళ్ళనుంచీ వాళ్ళను దోచుకుంటున్నాం. సర్వులహక్కు భుక్తములో ఉండాల్సిన భూమిని అతనివద్దనుంచి కాజేశాం. అతని దగ్గరనుంచి మనం దొంగిలించుకున్న భూమిలో, వాడు పొయ్యికిందికిగాను నాలుగుపుల్లలు ఏరుకుపోతే వాణ్ణి దొంగవాడంటున్నాం; జైల్లో పెట్టిస్తున్నాం. తాను కాదు, తన భూమిని కాజేసినవాళ్ళే పచ్చిదొంగలని వాడికి తెలుసు."

"నీ మాటలు నాకు అర్థం కావటంలేదు. అయినా నీతో నేను ఏకీ భవించలేను. భూమి ఎవరిదో ఒకరిసొత్తు అయివుండవలసిందేగా! నువ్వు పంచిపెట్టిస్తే..." ఇక్కడ బావగారి కంఠస్వరం మందగించింది. నెహ్రూడో సోషలిస్టు (సామ్యవాది) అని అతని నమ్మకం. సామ్యవాద సిద్ధాంతాల్ని అనుసరించి భూమిని అందరికీ సమానంగా పంచియివ్వాలి అని అతని అభి ప్రాయంగా భావించాడు. అలా పంచియివ్వటం చాలా బుద్ధిహీనమైన పని అని తాను చులాగ్గా ఋజువు జేయగలనని అతనిగర్వం. అన్నాడు: "నువ్వు ఇవాళ సమానంగా పంచియిచ్చేసేట్టయితే రేపటికల్లా అది అంతా బాగా పరి శ్రమ చేయగల, తెలివితేటలుగలవాళ్ళ చేతుల్లోకి పోతుంది."

"సమానంగా పంచియివ్వాలని ఎవరూ అనుకోటంలేదు. అది యావ న్మంది సొత్తు. అమ్మేదీ, కొనేదీ, కొలుకిచ్చేదీ కాదు."

"ఆస్తి హక్కులు కోరటం మానవసహజం. అది లేకపోతే సాగు చెయ్యాలన్న ఉత్సాహం, కృషి ఉండనేరవు – ఆస్తి హక్కుల్ని నాశనం చేసిన మరుక్షణమే మనం అనాగరికయుగంలో కాలు వేశామన్న మాటే!" ఈ మాటలు తీవ్రంగా ఉచ్చరించాడాయన. సొంత ఆస్తులు కలిగివుండాలి సిందే. అది అనివార్యం అని సాధారణంగా అందరూ అంటూనే ఉంటారు. సొంత ఆస్తి ఉండాలి అనే కోరిక ఉన్నంతమాత్రాన దాన్ని కలిగివుండగల హక్కుకూడా ఉండాల్సిందేనని వాదించటం పరిపాటి.

"గడ్డికుప్పమీద కుక్క పడుకునివుంటే ఆ గడ్డిని తాను ఉపయోగిం చుకోదు. దాన్ని తినే పశువుల్ని చేరనీయదు. అలాగ భూస్వాములు భూముల్ని ఆక్రమించుకుని వున్నారు. భూమి ఒకరి సొంతఆస్తి కాకుండా పోయిననాడే అది బీడుపడకుండా ఎక్కువ ఫలసాయాన్ని ఇస్తుంది."

"కాని అబ్బాయీ! ఈ నీ మాటలన్నీ పిచ్చిప్రలాపాలుగా ఉన్నాయి. భూఆస్తి హక్కుల్ని నాశనంచేయటం ఈ మనయుగంలో సాధ్యం అయే పనేనా?"—ఈ మాటలు పలుకుతోన్న బావగారి ముఖం పాలిపోయింది. కంఠస్వరం కంపించింది. ఈ విషయచర్చ అతన్ని బాగానే కదల్చింది- అన్నాడు: "ఈ సమస్యను నువ్వు ఆచరణలో పరిష్కరించబోయేముందు బాగా ఆలోచించుకోమని నేను సలహా ఇస్తున్నాను."

"నా వ్యక్తిగత విషయాల్ని గురించి మాటాడుతున్నావా ?"

"ఔను. మనం కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో పెరిగివచ్చాం. ఆట్టి ప్రత్యేక పరిస్థితులద్వారా ఏర్పడిన బాధ్యతలను మనం వహించాలి. మనకు పుట్టుకతో సంక్రమించిన—మన పూర్వులనుండి అనుశ్రుతంగా వచ్చిన—మన భావిసంతతికి మనం అందించవలసిన—సంప్రదాయాల్ని పోషించాలి."

"ఏది నా ధర్మం అని భావిస్తున్నానంటే—"

"క్షమించాలి. ఒక్కమాట చెబుతాను. నా మేలుగాని, నా పిల్లల మేలుగాని దృష్టిలో వుంచుకుని ఇలా మాటాడుతున్నాననుకోకు. నా పిల్లల భవిష్యత్తు సవ్యంగానే వుంటుంది-మేము సుఖంగా బ్రతుకగలుగుతున్నా నేను బాగానే ఆర్జించుకుంటాను. మా పిల్లలుకూడా అలాగా బాగానే జీవయాత్ర చేయగలుగుతారని నేను ఆశిస్తున్నాను. ఏదో స్వార్థాన్ని అపేక్షించి నే నిప్పుడు నీ సొంతవిషయాల్ని గురించి ప్రసంగిస్తున్నాననుకోకు సుమీ! నేను నీ అభిప్రాయాలతో ఏకీభవించలేకపోతున్నాను గనుక నే చెబుతున్నాను. నే నిచ్చే సలహా ఏమంటే—నువ్వు బాగా ఆలోచించాలి. ఏమేమి పుస్తకాలు చదవాలంటే—"

"దయచేసి నా వ్యవహారాలను నన్నే పరిష్కారం చేసుకోనీయండి. ఏమి పుస్తకాలు చదవాలో, ఏమి చదవనక్కరలేదో నన్నే నిర్ణయించుకో నీయండి—" నెహ్లూడో ముఖం పాలిపోయింది. అరచేతులు చల్లబడి పోయాయి. తన మనస్సు తనవశంలో తప్పిపోయింది. ఇక మాటాడ్డం ఆపి వేశాడు. టీనీరు తాగుతూ కూచున్నాడు.

## 33

"పిల్లలు కులాసాగా ఉన్నారా ?" నెహ్లూడో అక్కగారిని ప్రశ్నించాడు, కాస్త కోపం చల్లారిన తర్వాత.

పిల్లలు వాళ్ళ బామ్మదగ్గర ఉంటున్నారని ఆమె చెప్పింది. బావా మరుదుల వివాదం ముగిసినందుకు ఆమె సంతోషించింది. పిల్లల్ని గురించి ఇంకా ఏమేమో చెప్పింది. "చిన్నప్పుడు నువ్వు బొమ్మలతో ఆడుకోలేదూ? ఒక బొమ్మ బ్రహ్మచారి దొరసాని అనీ, మరో బొమ్మ నీగ్రో అని

నువ్వు అనుకుంటూ ఉండేవాడివే ! అలాగా మా పిల్లలూ ఇంటివద్ద ఆడుకుంటూ ఉన్నారు."

నెఖ్లూదోవ్ నవ్వాడు. "నీకు ఇంకా ఆ సంగతులన్నీ జ్ఞాపకము న్నాయా ?

"లేకేం ! అచ్చం నీకుమల్లేనే వాళ్ళూ ఆడుకుంటున్నారు."

ఇప్పటికి నటాలీ శాంతపడ్డది. వాక్యుద్ధం ముగిసిపోయింది. కాని తమ్ముడికీ, తనకు మాత్రమే తెలిసిన తన భర్తకు తెలియని అంతర్యాలను గురించి మాటాడ్డం ఆమె కిష్టంలేకపోయింది. అందుచేత అందరికీ అందుబాటులో ఉన్న ఒక సాధారణ విషయాన్ని సంభాషణలోకి తెచ్చింది. కమెన్‌స్కీ ద్వంద్వ యుద్ధంలో చనిపోవటం, అతని తల్లియొక్క అపార దుఃఖం గురించి మాటాడ సాగింది. పీటర్స్‌బర్గులో అందరినోటా వినబడుతూ ఉండిన ఈ ప్రసంగం మాస్కోకు కూడా చేరింది. అలాంటి ఒక ద్వంద్వ యుద్ధంలో జరిగిన హత్యను సాధారణ క్రిమినల్ నేరంగా పరిగణింపబడక పోవటానికి తన అసమ్మతిని తెలిపాడు బావగారు. దానికేదో సమాధానం చెప్పకుండా ఊరుకోలేకపోయాడు నెఖ్లూదోవ్. దానితో మరొక వివాదం పెరిగింది. ఇద్దరూ ఎవరి ఉద్దేశాలను వారు అంటిపెట్టుకుని ఎదుటివారిని ఖండించుకుంటూ ఉన్నారు. ఎవ్వరూ తమ హృదయంలో వున్న భావాన్ని విస్పష్టంగా ప్రకటించుకోలేదు. తననూ, తన జీవిత విధానాల్నీ నెఖ్లూదోవ్ ఆక్షేపిస్తున్నాడని బావగారు భావించాడు. నెఖ్లూదోవ్ అభిప్రాయంలోని అసామంజస్యాన్ని బయటపెట్టుదామని చూశాడు.

అనవసరంగా బావగారు తన సొంత వ్యవహారాల్లో—తాను తన ఆస్తిని రైతు కూలీలకు పంచి ఇస్తూన్న కార్యక్రమంలో-జోక్యం కలిగించు కుంటున్నాడని నెఖ్లూదోవ్‌కు లోపల మంటగా ఉంది. అదీగాక తన అక్కబావ వాళ్ళ పిల్లలు తనకు వారసు లౌతున్నారు. అందుచేత వాళ్ళు-భూమిని రైతుకూలీల పరం చేసే తన ఉద్దేశాన్ని వ్యతిరేకిస్తున్నారని తెలుసుకున్నాడు. సంకుచిత బుద్ధిగల తన బావగారు-తప్పు, నేరములు అని తాను భావిస్తున్న వాటిని న్యాయబద్ధములని వాదిస్తూ వుంటే తీవ్రమైన కోపం వచ్చింది.

"ని చట్టం ఏం చేస్తుంది ?" అని అడిగాడు.

"ద్వంద్వ యుద్ధంలో ప్రతికక్షిని చంపినవాణ్ణి హంతకుడుగా నిర్ణయించి ఏ గనుల్లోనో నిర్బంధ కార్మికుడుగా పని చేసేందుకు పంపించేస్తుంది"

నెఖ్లూదోవ్ అరచేతులు చల్లబడినవి. "భేష్, దానివల్ల ఏమి మేలు చేకూరినట్లు ?"

"అది న్యాయం."

"మీ అన్యాయాలయాలలో న్యాయమే పరమలక్ష్యం అయినట్లు !"

"మరేమిటి ?"

"ధనికవర్గ రక్షణ ! నా ఉద్దేశంలో మీ చట్టాల, బిల్లుల పరమలక్ష్యం ప్రస్తుత సామాజిక వ్యవస్థను ఇలాగే ఉండనిచ్చి మన వర్గంవారి హక్కుల్ని సమర్థించటం."

"చట్టాలయొక్క లక్ష్యం అదికాదు. నువ్వు ఏదో కొత్తభావాలు వెల్ల డిస్తున్నావు."

"పైకి చెప్పే మాటలు ఎలావున్నా, ఆచరణలో మాత్రం జరుగుతున్నదంతే. వున్న వ్యవస్థను ఇలా ఉంచటమే మీ చట్టాల లక్ష్యం. అందు చేతనే ఈ వ్యవస్థకు అతీతులై, దీన్ని మార్చి బాగుచేయాలనుకుండే రాజకీయ ద్రోహు లనబడేవారిని మీ చట్టాలు శిక్షిస్తున్నాయి. అంతేకాదు, ఈ వ్యవస్థలో ఇముడలేక అలమటించే క్రిమినల్ నేరస్థులనబడేవాళ్ళనూ మీ చట్టాలు శిక్షిస్తున్నాయి."

"నీ అభిప్రాయాలతో నేను ఏకీభవించలేను. రాజకీయ ద్రోహులుగా శిక్షితులౌతున్నవారు నిజంగా ఈనాటి వ్యవస్థకు అతీతులై, దేశాన్ని బాగు చేద్దామని బయలుదేరారన్న సంగతి నేను ఒప్పుకోను. చాలావరకు వాళ్ళంతా ఒక రకంగా మామూలు క్రిమినల్ నేరస్థులతోపాటివాళ్ళే. అంతకంటే ఎక్కువేమీ కాదు."

"కాని ఈ మీ జడ్జీలకన్నా నైతికంగా వుత్తములని చెప్పుకోదగిన వాళ్లు శిక్షితులౌతున్నారు; నే నెరుగుదును. మత ద్రోహు లనబడేవాళ్ళు—

ఇలాగా మ నెఖ్లూదోవ్ మాటల్ని వినిపించుకోకుండానే తాను ఇతరత్ర పూర్వం చెప్పిన దాన్ని అనుసరించి అన్నాడు: "చట్టాల ఆశయం యీ

ప్రస్తుతవ్యవస్థను ఇలా సంరక్షించాలనే అనే నీ మాటను నేను ఒప్పుకోను. చట్టం అనేది దోషాన్ని సంస్కరించేందుకు—"

"భేష్గా సంస్కరిస్తున్నారులే జైళ్లలో."

"దుష్టభావాలతో మత్తెక్కి సంఘాన్ని నాశనం చేసేవాళ్ళను సంస్కరించటానికి, లేదా తొలగించటానికి చట్టాలు ఏర్పడతాయి."

"కాని ఆపనే అవి చేయటంలేదు. ఆ రెండు పనుల్లో ఏదిగాని చేయటానికి తగిన సత్తా సంఘానికి లేదు."

"అంటే? అర్థంకాలేదు" బావగారు బలవంతాన నవ్వు తెచ్చుకున్నాడు.

"నేను చెప్పేది ఏమంటే—రెండే రెండు వివేకములవలన జారిన శిక్షలు వున్నాయి. పూర్వకాలాల్లో వుపయోగించినవి—దండంతో తాడనం, ఉరి వేసి చంపటం. మానవ స్వభావం మెత్తబడుతున్నకొద్దీ ఆ శిక్షలు అమలులో నుంచి పోతాయి."

"ఇటువంటి మాటలు నీ నోటినుంచి రావటం కొత్తగాను, విచిత్రంగాను ఉన్నది సుమీ!"

"ఔనుమరి! ఏ పని చేసినందుకు తాడన అనుభవించాలో, ఆ పనే మళ్ళీ చేయకుండా ఉండేందుకు వళ్ళు వాయకొట్టటం వివేకమే. సంఘానికి హానికరుడుగా, అపాయకరుడుగా వున్నవాడి తల నరికేయటమూ వివేకమే. అట్టి శిక్షలకు అర్థం ఉంది. వృత్తిలేక, చెడ్డ మిత్రుల్ని అనుసరించి, చెడ్డవాడని పేరు పొందినవాళ్ళను చీకటి గదుల్లో పెట్టి తాళంవేస్తే ప్రయోజనం ఏమిటి? అక్కడవాళ్ళకు తిండి పెడుతున్నారు. ఏ పనీ చేయనక్కర్లేక సోమరులౌతున్నారు. ఇంకా తమలాంటి వాళ్ళతోనే అక్కడ కాలక్షేపం చేస్తున్నారు. ఈ జైళ్ళ పోషణకు ప్రజల ధనం అపరిమితంగా వ్యయం ఔతున్నది. యీ ఖర్చు దేశంలో మనిషి ఒకటికి 500 రూబుల్సు చొప్పున భరిస్తున్నాను."

"ఔను, ఎంత ధనం ఖర్చు అయినా అలా జైళ్ళు ఉంటూ ఉన్నాయి కాబట్టి, జైలు యాత్ర అంటే భయం అనేది వున్నది కాబట్టి సరిపోయింది గాని, లేకపోతే నువ్వు నేను ఇలా శాంతంగా కూచోగలిగి వుండేవాళ్ళమేనా?"

"ఈ జైళ్ళే మన రక్షణకు గ్యారంటీ అంటావా? అది తప్పు. వాళ్ళను శాశ్వతంగా బంధించివేయటం లేదే! మళ్ళీ వొదిలేస్తున్నారు. జైళ్ళలో నివసించినప్పుడు శారీరకంగా మరింత చెడిపోయి బైటికి వస్తున్నారు, కాగా వాళ్ళవల్ల అపాయం మరింత అధికం ఔతోంది."

"అంటే జైళ్ళలోని సంస్కరణ విధానాన్ని ఇతోధికంగా వృద్ధి పరచాలంటావా?"

"అది అసంభవం. అందుకు పూనుకున్నట్లయితే ప్రస్తుతం దేశంలో విద్యావ్యాప్తికి వినియోగిస్తున్న మొత్తంకన్నా ఎక్కువ కావలసి వస్తుంది. అధిక పన్నుల రూపేణా ప్రజల బాధ అతిశయిస్తుంది."

"అయితే ఏం చేయమంటావు? వాళ్ళనందర్నీ చంపిపారేయమంటావేమిటి? లేకపోతే ఇటీవల ఎవరో ఒక రాజకీయవిజ్ఞుడు చెప్పినట్లు అందరికీ గుడ్లు పెరికేయమంటావేమిటి?"

"ఔను, అది క్రూరమే. కాని సత్ఫలితాల్ని ఇస్తుంది. ఇప్పుడు జైళ్ళలో అనుసరిస్తున్న పద్ధతులు క్రూరంగా ఉండలేదు గనుకనా? క్రూరంగా ఉండికూడా తగిన ఫలితాన్ని ఇవ్వలేకపోతున్నాయి. ఇంత బుద్ధిహీనంగా వున్న యీ క్రిమినల్ శాఖలో ఏ శాస్త్ర జ్ఞానం ఉన్నవాడైనా పనిచేయడని నా అభిప్రాయం."

"మరి నేను చేస్తున్నానుగా!" బావగారి ముఖం వెలవెలబోయింది.

"నువ్వు చేస్తావు. అది నీ పని. నాకుమాత్రం అది దుర్గ్రాహ్యమే."

"నీకు చాలా విషయాలు దుర్గ్రాహ్యాలే—" అన్నాడు బావగారు వొణుకుతూన్న కంఠస్వరాన.

"ఇటీవల ఒక పబ్లిక్ ప్రాసిక్యూటరు ఒక కుర్రవాణ్ణి పట్టుకుని శిక్ష వేయించటానికి చాలా శ్రమపడ్డాడు. ఆ కుర్రవాణ్ణి చూస్తే ఎవరికైనా జాలి వేస్తుంది పాపం! మరొక ప్రాసిక్యూటరు ఒకతన్ని క్రాసుపరీక్ష చేసి బైబిల్ చదివి అర్థం చెప్పినందుకు ఒక పెద్ద నేరస్థుడినిగా నిర్ణయించేశాడు. ఈ సంఘటనలు నేను ఎరుగుదును. ఈ న్యాయస్థానాలలో జరుగుతున్నవన్నీ ఇటువంటి బుద్ధిహీనములైన క్రూరపుపనులే కదా!"

"నేనుకూడా—అలాగే అనుకున్నట్టయితే ఈ ఉద్యోగం ఎందుకు చేస్తాను—" అన్నాడు బావగారు ఇక లేస్తూ.

బావగారి కళ్ళద్దాల మాటున ఏవో మెరిశాయి. "అభిమానం దెబ్బ తిన్నందువల్ల ఉబికిన కన్నీళ్లు కావు కద!" అనుకున్నాడు నెఖ్లూదోవ్. నిజానికి అటువంటివి కన్నీళ్ళే. బావగారు కిటికీదగ్గరకుపోయి, జేబురుమాలు తీసి కళ్ళద్దాలు తుడుచుకున్నాడు. ఆ తరువాత కళ్లుకూడా తుడుచుకున్నాడు. తిరిగి వచ్చి సోఫాలో కూచుని చుట్ట వెలిగించాడు. ఇక మాటాడలేదు.

అక్కగారినీ బావగారినీ అంత యెక్కువగా ఉడికించినందుకు నెఖ్లూదోవ్ బాధపడ్డాడు, సిగ్గుపడ్డాడు. అక్కగారికి రేపు తాను వెళ్ళిపోతున్నాడు. ఇక మళ్ళీ వాళ్ళను చూడగలుగుతాడో, లేదో! ఇటువంటి పరిస్థితుల్లోకూడా అంత కఠినంగా ప్రవర్తించినందుకు నొచ్చుకున్నాడు.

చివరకు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

"నేను చెప్పినమాటలన్నీ సత్యములే కావచ్చు. కాని సరియైనరీతిలో చెప్పాను కాదు. కొంచెం నా వైఖరి మార్చుకుని యుండవలసింది. అతని మీద నాకు గల అసహ్యాభావం నన్ను అలా మాటాడించింది. అనవసరంగా అతనికి బాధ కలిగించాను; పాపం, అక్కయ్యనుకూడా నొవ్వచేశాను —" అనుకున్నాడు నెఖ్లూదోవ్.

## ౩౪

సాయంత్రం మూడుగంటల రైలుకు ఖైదీల గుంపు బయలుదేరాలి. ఆ గుంపుతో మస్లోవాకూడా వెళ్ళవలసివుంది. కనుక బయలుదేరేముందే, అంటే 12 గం॥లో గానే జైలుదగ్గరకు వెళ్ళాలని అనుకున్నాడు నెఖ్లూదోవ్.

గతరాత్రి తన సామానంతా సర్దుకుంటున్నప్పుడు, తన కాగితాలన్నీ జాగ్రత పెట్టుకుంటున్నప్పుడు తన డైరీ కనిపించింది. అందులో అక్కడక్కడ రాసివున్న కొన్ని సంగతులు చదివాడు. పీటర్సుబర్గు వెళ్ళేముందు ఇలా రాసివున్నాడు: "మస్లోవా నా త్యాగాన్ని స్వీకరించటానికి ఇష్టపడటంలేదు. ఆమె ఒకత్యాగం చేయతలచుకుంది. ఆమె జయించింది. అంటే నేను నిజసుఖం పొందానన్నమాట! ఆమెలో ఒకమార్పు వస్తూవున్నది.

అది నాకు ఆనందాన్ని ఇస్తున్నది. మార్పు వస్తున్నదని విశ్వసించటానికి భయపడుతున్నాను—కాని ఆమె ఒక పునర్జన్మ పొందుతున్నట్టే కనిపిస్తున్నది." ఆ తరువాత మరొకచోట ఇలా రాసివున్నది. "ఒక కష్టాన్ని అనుభవించాను. ఆనందాన్ని పొందాను. విచిత్రమైన అనుభవం. ఆమె ఆసుపత్రిలో అసహ్యంగా ప్రవర్తించిందని విని చాలా బాధపడ్డాను. అది అంతబాధ కలిగించేటువంటిదని నేననుకోలేను. ఆమెతో మాటాడుతున్నప్పుడు, ఆమె పట్ల అసహ్యభావం, ద్వేషం ప్రకటించానేమోకూడా. కాని మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకున్నాను. అనేకసార్లు ఇదివరకు—ఇప్పటికీన్నీ—నేను ఆమె చేసిన తప్పే కనీసం మానసికంగానైనా చేస్తూనే వున్నాను. అప్పుడు నామీద నాకే అసహ్యం కలిగింది. ఆమెపట్ల జాలిపుట్టింది. నా బాధ అంతా పోయింది. ఇతర్ల తప్పుల్ని ఎన్నేముందు మన తప్పుల్ని మనం చూచుకోవటం మంచిపని." ఇంతవరకు చదువుకుని మళ్ళా రాశాడు: "నటాలీని చూడ్డానికి వెళ్ళాను. మరొకసారి నేనక్కడ ఆత్మసంతృప్తికోసంగా నిర్దాక్షిణ్యంగా, కటువుగా ప్రవర్తించాను. దానిఫలితంగా హృదయం బరువెక్కి వుంది. కాని చేసేదేమీలేదు. రేపటినుంచీ కొత్తజీవితం ఆరంభం కాబోతున్నది. పాత బ్రతుక్కీ ఒక శాశ్వతమైన వీడ్కోలు—చాలా కొత్తభావాలు కూడుకుంటున్నాయి. కాని వాటినన్నింటినీ ఇంకా కూడదీసుకొని సమన్వయించుకోలేకపోతున్నాను."

మర్నాడు ఉదయం నిద్రలేవగానే—తనకూ, బావగారికీ మధ్య జరిగిన వాగ్వాదం తలుపుకువచ్చి పశ్చాత్తాపపడ్డాడు నెఖ్లూడొవ్. వెళ్ళి వాళ్ళతో మళ్ళీ సామరస్యం కుదుర్చుకున్న తర్వాతనే వెళ్ళిపోవటం మంచిదని తోచింది. కాని చేతిగడియారం చూచుకున్నాడు. సమయంలేదు. ఆలస్యంచేస్తే తాను జైలుదగ్గరకు వెళ్ళవలసినకాలం మించిపోతుంది. వెంటనే సామానంతా సర్ది, నౌకరుకిచ్చి స్టేషనుకు పంపించాడు. సామానుతోపాటు థియొడోసియా భర్తకూడా వెళ్ళాడు. అతడున్నూ సైబీరియాకు ప్రయాణమైపోతున్నాడు. నెఖ్లూడొవ్ ఒక రిక్షాయెక్కి జైలువద్దకు బయలుదేరాడు.

ఖైదీలు బయలుదేరవలసిన రైలు ముందుగా వెడుతుంది. తరువాత రెండుగంటలకు మరో రైలు ఉంది. అందులో వెళ్ళటానికి నెఖ్లూడొవ్ నిశ్చయించుకున్నాడు. ఇంటిఅద్దె, ఇతర బాకీలు పూర్తిగా చెల్లించేసి నెఖ్లూడొవ్ బయలుదేరాడు.

అది జులై నెల. ఎండ తీక్షణంగా ఉంది. రాళ్ళల్లోనుంచి, గోడల్లోనుంచి, ఇళ్ళకప్పుల్లోనుంచి వెచ్చని ఆవిరులు చిమ్ముకొస్తున్నాయి. వాయువు స్తంభించి వున్నది. ఎప్పుడైనా ఒకగాలి తెరగవొస్తే, అది దుమ్మును, వేడిని ఆవిరిని మోసుకొస్తోంది.

వీధుల్లో జనసంచారం తక్కువగా ఉంది. తప్పనిసరిగా వీధిలోకి రావలసినవాళ్లు నీడలు వెతుక్కుంటూ నడుస్తున్నారు. రోడ్డు బాగుచేస్తున్న కూలిజనానికి ఎండబాధ తప్పనిసరి అయింది. ఆ ఎండలోనే రాళ్ళు పగ లేస్తున్నారు. వాళ్ళు కూచున్న ఇసుక మండిపోతూవుంది. వాళ్ల వంక మొహాలు వాడి ఉన్నాయి. పోలీసువాడు విచారంగా, నిరుత్సాహంగా నాలుగు రోడ్లు కలిసేచోట నిల్చుని తన విధిని నిర్వహిస్తున్నాడు.

నెఖ్లూడోవ్ జైలు ఆవరణలోకి వచ్చాడు. ఇంకా బయలుదేరలేదు ఖైదీలు. ఇప్పుడు జైలు దేరవలసినది 623 గురు మగఖైదీలు, 64 మంది ఆడ ఖైదీలు. వీళ్ళందరినీ లెక్కపెట్టాలి. లిస్టుప్రకారం విడదీసి ఈవలకు తీసుకు రావాలి. బలహీనులను, రోగులను వదిలేయాలి. వీళ్ళందర్నీ ఒక అధికారికి అప్పగించి పెట్టాలి. ఈ పని అంతా తెల్లవారుఝామున 4 గంటలనుంచీ జరుగుతోంది. కొత్త ఇన్‌స్పెక్టరు, ఇద్దరు గుమాస్తాలు, డాక్టరు, ఖైదీలను సైబీరియాకు తీసుకుపోవలసిన ఉద్యోగి—వీరంతా జైలు ఆవరణలో ఒక గోడనీడలో ఒక టేబిల్ వేసుకుని కూచున్నారు. టేబుల్మీద కాగితాలు ఉన్నాయి. వరుసగా ఖైదీలను ఒక్కొక్కరినే పిలుస్తున్నారు. ప్రశ్నలడుగుతున్నారు. ఏమో రాసుకుంటున్నారు.

వాళ్లు కూచున్న టేబిల్ దగ్గర వరకూ ఎండ ప్రాకి వచ్చింది. ఎండ ఉడక పోత ఎక్కువైంది. చుట్టూ మూగివున్న ఖైదీల సమ్మర్దంవల్ల కూడా ఉక్కపోతగా వుంది.

"అబ్బ! ఆగ, అంతంలేకుండా వుంది ఈ వ్యవహారానికి. నాకు ప్రాణాలు పోతున్నాయి. పాతర తవ్వినట్టు వస్తున్నారే. ఈ ఖైదీల నింత మందిని ఎక్కడ పట్టుకొచ్చారు? ఇంకా వున్నారా?" అన్నాడు వాళ్ళను సైబీరియాకు తీసుకుపోవలసిన ఉద్యోగి, బాగా పీల్చిన సిగరెట్ పొగ దట్టంగా పెరిగిన గుబురు మీసాల్లోకి ఊదుకుంటూ—పొట్టి చేతులవాడు, ఎగు బుజాలవాడు, ఎర్రటి మొగం, పొడుగ్గా, లావుగా వుంటాడు.

గుమాస్తా లిస్టు తిరగవేశాడు. "ఆడ ఖైదీలుగాక ఇంకా 24 మందిని పరీక్ష చేయాలి" అన్నాడు.

ఆ ఉద్యోగి విసుగెత్తి అరిచాడు. "అలా నిల్చుంటారేం? రండి!" పరీక్ష చేయించుకోని ఖయిదీలంతా గుమిగూడి ఒకరి వెనుక ఒకరు నిల్చున్నారు. అలా మూడుగంటలనుంచీ వాళ్లు ఎర్రటెండలో అలాగే నిల్చుని వున్నారు ఎప్పుడు పిలుస్తారా అని ఎదురు చూస్తూ.

ఆవరణలో పరిస్థితి ఇది. ఆవరణ బైట గేటు దగ్గర తుపాకి పట్టుకుని కాపలావాడు నిల్చున్నాడు. ఇరవై బండ్లకు పైగా నిల్చి ఉన్నాయి ఖయిదీల సామానును చేరవేసేందుకు, నడవలేని ఖయిదీలను మోసుకుపోయేందుకు. ఇంకా ఆ ఖయిదీల తాలూకు బంధు మిత్రాదులు కూడా వచ్చి వున్నారు– వీలైతే చివరిచూపు చూసి, నాలుగు మాటలు మాటాడదామనీ, ఏమైనా నాలుగు వస్తువులు ఇచ్చి పోదామనీ.

వాళ్ళతోపాటు నెఖ్లూదొవ్ కూడా అక్కడే నిల్చున్నాడు. గంట సేపటినుంచీ అలాగే నిల్చున్నాడు. ఇంతలో సంకెళ్ళ గలగలలు, అడుగుల చప్పుడు, అధికార్ల కంఠస్వరాలు, దగ్గులు, ఏవేవో గుసగుసలు విన వచ్చాయి. చాలామంది జైలు కాపలావాళ్లు అటూ ఇటూ పని తొందరగా తిరిగారు. చివరకు ఆజ్ఞ అయింది. జైలు గేట్లు ఉరుములాంటి చప్పుడుతో తెరచుకున్నాయి. పెద్దగేటుముందు సైనికులు ఒక పెద్ద వలయాకారంలో నిల్చున్నారు. ఖైదీలనందర్నీ వీళ్ళు సైబీరియాకు తీసుకుపోయి దిగబెట్టి రావాలి. వాళ్ళంతా తెల్లటిదుస్తులు ధరించివున్నారు. మరొక ఆజ్ఞ అయింది. ఖైదీలంతా బైటికి రాసాగారు కాళ్ళకు తగిలించిన సంకెళ్ళు లాక్కుంటూ– వాళ్ళు జంటలుగా వస్తున్నారు. ప్రతివాని భుజంమీద ఒక సంచి వుంది. ఒక చేత్తో ఆ సంచిని పట్టుకుని, మరోచేయి ఊపుకుంటూ వస్తున్నారు – ముండనం అయిన తలలమీద టోపీలు ఉన్నాయి.

నిర్బంధ కార్మికులుగా పనిచేయవలసిన పురుషులు వచ్చారు ముందు– గోధుమరంగు పరాయిలు తొడుక్కున్నారు. తొడుక్కున్న చొక్కాల వెనకవేపు ఏవో గుర్తులు వున్నవి – యువకులు, వృద్ధులు; సన్నని వాళ్ళు, లావైనవాళ్ళు; పాలిపోయినవాళ్ళు, ఎర్రనివాళ్లు నల్లనివాళ్లు; గడ్డాలు

ఉన్నవాళ్లు, [illegible], రష్యనులు, టార్టారులు, యూదులు—అంతా చాలా మంది బహు దూరదేశం వెళ్ళడానికి సిద్ధపడిన వాళ్ళలాగ చేతులు ఊపుకుంటూ, సంకెళ్ళ గలగలలతో గుంపుగా నడుచుకువచ్చి, వాళ్ళు [illegible] వచ్చి ఆగి, ఒకరి వెనుకగా ఒకరు—దిగి నెమ్మదిగా వచ్చారు. వీరి వెనుక మరొక ఖైదీల గుంపు వచ్చింది. వీళ్ళకు సంకెళ్ళు లేవు. కాని ఇద్దరిద్దరి చేతులు సంకెళ్ళతో బంధితాలైనాయి. వీళ్ళంతా ప్రవాసశిక్ష విధింపబడిన వాళ్లు.

తరువాత ఆడ ఖైదీలు వచ్చారు. మొదట గోధుమరంగు గౌనులు ధరించి, నిర్బంధ కార్మికులుగా శిక్షితులైనవాళ్లు వచ్చారు. ఆ తరువాత తమ భర్తలను అనుసరించి తమ ఇచ్ఛానుసారం వస్తున్నవాళ్ళు ఉన్నారు. కొందరు స్త్రీలు పసిబిడ్డలను కూడా ఎత్తుకుని ఉన్నారు. ఈ స్త్రీలతోపాటు బాలకులు, బాలికలు ఆవుల ననుసరించు లేగదూడల్లాగ వస్తున్నారు.

మగవాళ్ళు నిశ్శబ్దంగా తమ స్థానాల్లో నిలబడ్డారు. అప్పుడప్పుడు మాత్రం దగ్గుతున్నారు. ఒకవేళ నోరు మెదిపినా మితంగా మాట్లాడు తున్నారు.

ఆడవాళ్లు మాత్రం ఎడతెగకుండా మాట్లాడేస్తున్నారు. వాళ్లు వస్తోంటే నెఖ్లూదోవ్‌కు ఒకసారి మస్లోవా కనిపించింది. కాని ఆ గుంపులో ఎక్కడ కలిసిపోయిందో మళ్ళీ కనిపించలేదు. ఆ స్త్రీలంతా మానవత్వమూ, స్త్రీత్వమూ కూడా కోల్పోయిన గోధుమరంగు పదార్థాలుగా కనిపిస్తున్నారు. అందరి బుజాలమీదా సంచులున్నాయి. చుట్టూ పిల్లలు ఉన్నారు. మగవాళ్ళ వెనకాల తమ స్థానాల్లో వచ్చి నిలుచున్నారు.

ఒకసారి ఖయిదీల సంఖ్యను లోపల లెక్కపెట్టే ఉన్నారు. అయినా ఇప్పుడు కూడా మరోసారి లెక్కించి సరిచూసుకున్నారు రక్షకభటులు. ఈ పని చాలాసేపు పట్టింది, కొంతమంది ఖయిదీలు స్థానాలు మారుటంవల్ల. ఈ స్థానాలు మారినవాళ్ళను ఖయిదీలు గదమాయించి యథాస్థానానికి తీసుకు వచ్చి నిలబెట్టి మళ్ళీ మళ్ళీ లెక్కించవలసి వచ్చింది. ఈ లెక్క ముగిసిన తరువాత అధికారి ఆజ్ఞ అయింది. బలహీనులైన పురుషులు, స్త్రీలు, పిల్లలు గబగబా పందెంలోవలె పరిగెత్తుకుంటూవచ్చి, సంచులు బండ్లలోవేసి ఎక్కు తున్నారు. చంకల్లో ఏడుస్తూన్న పసిపాపలతో స్త్రీలు, ఉత్సాహంగా కొందరు

పిల్లలు, ఉత్సాహం చచ్చిపోయి నీరసంగా వున్న పురుషులు బండ్లలో ఎక్కుతున్నారు

కొందరు ఖయిదీలు అధికారి దగ్గరకుపోయి బండ్లలో ఎక్కటానికి అనుజ్ఞ కోరారు. ఆ యధికారి వాళ్ళ ముఖాలు చూడకుండా సిగరెట్ పొగ పీలుస్తూ, వూరుకున్నాడు. ఒక ఖయిదీ ముందు చెయ్యి అడ్డంగా విసిరాడు. ఆ ఖయిదీ తనమీదికి దెబ్బ పడబోతున్నదన్న భయంతో తల వొంచుకున్నాడు.

ఎవరికో ఒక ముసలాడికి మాత్రం బండి యెక్కటానికి అనుజ్ఞ ఇవ్వబడింది. "మిగిలినవాళ్ళంతా నడచి వెళ్ళవలసిందే" అని ఊరుకున్నాడు అధికారి. అనుజ్ఞ ఇవ్వబడిన ఆ ముసలివాని కాళ్ళకు సంకెళ్లు ఉన్నాయి. అతడు బండీవద్దకు వెళ్ళి ఎక్కలేక చాలా అవస్థపడుతున్నాడు. అప్పుడు బండిలో వున్న యువతి చేయూతనిచ్చి లోపలికి ఎక్కించింది.

సంచులన్నీ బండ్లలో పడ్డాయి. బండ్లలో ఎక్కవలసిన వాళ్ళంతా ఎక్కారు. అప్పుడు అధికారి జేబురుమాలుతో నుదుటిమీద చెమటచుక్కలు, బట్టతల, మెడ తుడుచుకుని, ఏసుక్రీస్తును స్మరించి "ఊఁ. ఇక పదండి" అని ఆజ్ఞ జారీ చేశాడు. ఖయిదీలంతా ఏసుక్రీస్తును స్మరించారు. వాళ్ళను చూడ్డానికి వచ్చినవాళ్లు ఏడుపుతో గొణిగారు. ఆడఖయిదీలు గగ్గోలుగా వాగుతున్నారు. సైనికులు ముందుగా ఖయిదీలు నడచి వస్తున్నారు, సంకెళ్లపాదాలు ఈడ్చుకుంటూ, దుమ్ము లేపుతూ.

ముందు సైనికులు, వాళ్ళ వెనుక నిర్బంధ కార్మికులుగా శిక్షితులైన ఖయిదీలు. ఆ వెనుక ప్రవాసశిక్ష అనుభవించవలసినవాళ్ళు. ఆ వెనుక ఆడ ఖయిదీలు. ఇంకా వెనుక బండ్లలో దుర్బలులైన పురుషులు, స్త్రీలున్నూ. ఒక బండిలో ఒక స్త్రీ నిలువెల్లా దుప్పటి కప్పుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ వుంది.

## 39

ప్రొంప్టు చాలా పెద్దది. ముందున్న వాళ్లంతా కదిలి చాలాదూరం వెళ్ళిన తరువాతనే చివరవున్న బండ్లు బయలుదేరాయి. చివరి బండీ కదిలింది, [illegible]

[illegible] డొంకదారిగా ముందుకు [illegible] వెళ్ళటం [illegible] చెప్పాను.

మగఖైదీలలో తాను ఎరిగివున్నవాళ్లు ఎవళ్లైనా వున్నారేమోనని చూడాలని అతని వుద్దేశం. అంతేగాక, ఆడవాళ్ళలో మస్లోవాను కూడా చూడాలనీ, తానామెకు పంపివున్న వస్తువులు చేరాయో లేదో కనుక్కోవాలనీ.

చాలా వేడిగా వుంది. గాలి స్తంభించిపోయింది. వందలాది ఖయిదీలు నడుస్తూ లేపిన దుమ్ము పొగలుపొగలుగా వ్యాపించి చుట్టుకొంది.

ఖయిదీలు వేగంగానే నడిచిపోతున్నారు. గుర్రపుబండీవాడు వేగంగా తోలుకుపోతున్నాడు - బండీలోనుంచి నెఖ్లూడో ఆ భయంకర విచిత్ర వ్యక్తుల్ని (ఖయిదీల్ని) చూస్తూవున్నాడు. ఎరిగినవాడెవడూ లేడు.

అందరూ ఒకేరకమైన దుస్తులు ధరించారు. ఉత్సాహంగా వుందామని చేతులు ఊపుకుంటూ నడుస్తున్నారు. [illegible]. అందరూ ఒకేరకంగా కనిపిస్తున్నారు. ఒక విచిత్రమైన అసాధారణ పరిస్థితులలో వున్న వ్యక్తులు కావటంవల్ల వాళ్లంతా నెఖ్లూడోకు విచిత్ర భయంకర మూర్తులుగా కనిపించారు. ఇంతలో హత్యానేరానికి శిక్ష పడిన ఫెదొరోవ్ కనిపించాడు. దిస్పకాయ ఒఖోటిన్ కూడా కనిపించాడు. అప్పటికి నెఖ్లూడోకు వాళ్ళంతా భయంకరమూర్తులన్న భావం పోయింది. చాలా వరకు ఆ ఖయిదీలంతా ఆ వస్తూన్న బండీనీ, బండీలోని పెద్దమనిషినీ చూస్తూనే వున్నారు. ఫెదొరోవ్ చూచి నెఖ్లూడోను గుర్తించినట్లుగా తల ఊపాడు ఒఖోటిన్ కూడా చూపులు కలిపాడు. ఈ యిద్దరూ ఇదివరకు నెఖ్లూడో సహాయాన్ని అర్థించినవాళ్లే.

బండి ఆడఖయిదీల దగ్గరగా పోతోంది. నెఖ్లూడో మస్లోవాను చూచాడు. ఆమె రెండోవరుసలో వుంది. ఆ వరుసలో మొదట పొట్టికాళ్ళు, నల్లకళ్ల యువతి హోరోషావకా వుంది. ఆమె పక్కన గర్భిణి నడవలేక నడవలేక నడుస్తోంది. మూడవవ్యక్తి మస్లోవా, సంచి బుజానవేసుకొని నడుస్తోంది. ఆమె తిన్నగా ముందువైపే చూస్తోంది. ఆ ముఖంలో ఒక ప్రశాంతత, పట్టుదల కనిపిస్తున్నాయి-ఆ వరుసలోనే మస్లోవా ప్రక్కన నడుస్తున్న యువతి అందగత్తె; చాలావేగంగా, ఉత్సాహంగానే నడుస్తున్నది-ఆమె ధియొడోసియా.

నెఖ్లూడో బండిదిగి ముందుకువచ్చాడు. తాను పంపిన వస్తువులు చేరాయోలేదో మస్లోవాను అడుగుదామనీ, ఆమె మనస్థితి ఎలా వుందో

తెలుసుకుందామనీ అతని ఉద్దేశం. కాని ఆ ప్రక్కనే నడుస్తున్న సార్జంటు దగ్గరకు వచ్చి—"మీరు వీళ్ళకేమీ పలకరించకూడదండి. అది రూల్సుకు వ్యతిరేకం—" అన్నాడు. అన్నాడేగాని సెక్లాడో ముఖంచూచి గుర్తించాడు. జైలులో చాలామందికి తెలుసు సెక్లాడో. ఇనుక సార్జంటు తమాయించుకుని "ఇప్పుడు కాదు. కాస్త ఆగండయ్యా, స్టేషన్ చేరుకున్న తరువాత" అన్నాడు. అని "పదండి" అంటూ ఖైదీలకు హెచ్చరిక చెప్పాడు.

సెక్లాడో మళ్ళీ వెనక్కు తగ్గాడు. మామూలుగా బండీ వెనకాలే వస్తోంది నెమ్మదిగా. తాను పక్కగా నడుస్తూ వస్తున్నాడు. ఆ పోతున్న ఖయిదీల గుంపును చూస్తోంటే భయమౌతుంది జాలివేస్తుంది. బండ్లలో వెడుతున్న వారు వంగివంగి తదేకంగా వాళ్ళకేసే చూస్తూవున్నారు. నడచిపోతున్న వాళ్లు ఆగి ఆశ్చర్యంగా ఆ భయంకరదృశ్యంవేపు చూస్తున్నారు. కొందరు తమకు తెలియకుండా ఆకర్షితులై ఆ గుంపుతో పాటే నడచిపోయి, చివరకు ఆగి అలా చూస్తూ నిల్చుండిపోతున్నారు - కొందరు ఆ ఖయిదీలకు ఏమో ధర్మం చేస్తున్నారు. అవి ఖయిదీల తరఫున సార్జంట్లు పుచ్చుకుంటున్నారు. వాకిళ్ళలో నిల్చుని, కిటికీలవద్ద నిల్చుని, జనం విపరీతంగా చూస్తున్నారు. ఇళ్లలో ఉన్న వాళ్ళను బలవంతాన పిల్చి చూపిస్తున్నారు. చివరకు ఈ గుంపు మూలాన అశ్వశకటం నాలుగుగోడ్లు కలిసేచోట ఆగిపోవలసివచ్చింది. ఆ బండి తోలుతున్నవాడు బాగా బలిసివున్నాడు. ముఖం మెరుగుగానే వుంది. బండిలో ఒక మొగుడు, పెళ్లాం ఉన్నారు. ఆవిడ సన్నగా ఉంది. ముఖం పాలిపోయింది. భర్త చక్కని ఎత్తయిన టోపీ పెట్టుకున్నాడు. కోటు మంచి ఫేషన్‌గా వుంది. ఇద్దరు పిల్లలుకూడా వున్నారు. జుట్టు విరబోసుకుని ఒక అమ్మాయి ఒక అందమైన పువ్వులా వుంది. ఎనిమిదేళ్ళ కుర్రవాడొకడు-పొడుగైన మెడ, వాడూ అందంగా వున్నాడు.

ఆ గుంపు మధ్యలోనుంచి వీలుచేసుకుని బండీ నడపలేకపోయినందుకు బండివాడిని యజమాని కూకలువేయుటం ఆరంభించాడు - యజమానురాలు కోపంగా చూస్తూ, పొడుచుకువస్తూన్న సూర్యకిరణాలనూ, తోసుకువస్తూన్న దుమ్మునూ తన్ను మలినపరచకుండా ఉండేలాగు ఏంచేయాలో తోచక తికమకపడుతోంది.

బండిని ఆ దారినే తీసుకుపొమ్మని యజమానే ముందర చెప్పాడు. ఇప్పుడు కొరడాలు వేస్తున్నాడు. ఈ అన్యాయానికి ఆ లావుపాటి బండి వాడు కోపగించుకున్నాడు లోలోపల. బలవంతాన గుర్రాల కళ్ళాలను బిగించి పట్టుకుని బండిని అలాగే ఆపుచేసివుంచాడు.

గుంపును ఆపి, బండీ పోవటానికి అవకాశం కల్పించి, బండిలోని ఆ ధనవంతునికి సంతోషాన్ని కల్గించి, మెప్పు సంపాదించుదామని పోలీసువాడు లోలోపల ఉబలాటపడ్డాడు. కాని ఆ పని చేయలేకపోయాడు. ఒక సలాం మాత్రం పారేసి ఆతని ధనాన్ని గౌరవించాడు. ఖయిదీలకేసి తీవ్రంగా చూచాడు—వీళ్ళందరిబారినుండీ ఆ బండీని రక్షించటానికి తాను సర్వ సన్నద్ధుడై యున్నట్టు.

గుంపు అంతా దాటిపోయిన తరువాతనే, ఆ అశ్వశకటం ముందుకు సాగింది. సంచీలు, ఆడఖయిదీలు వున్న చివరబండిలో ఆ యువతి ఎవరో, వెక్కి వెక్కి రోదిస్తూ యున్నది కాస్త శాంతించింది కాని ఆ పరిశుభ్రంగా ఉన్న ధనవంతుల అశ్వశకటాన్ని చూడగానే మళ్ళీ కేకలు, రోదనం ఆరంభించింది-బండీ ముందుకు సాగిపోయింది.

బండీలోని పిల్లలకు తాము చూచిన ఆ గుంపేమిటో, వాళ్ల గొడవేమిటో తెలియదు-తల్లిదండ్రులైనా ఏమీ చెప్పలేదు-వాళ్ళే తమకు తాముగా ఏదో అర్థం చెప్పుకునివుంటారు.

తల్లిదండ్రుల ముఖవైఖరినిబట్టి—ఆ గుంపులో వారందరినీ—తమ తల్లి దండ్రులవంటివారు కాని ఎవరో ఒక విచిత్రజాతికి చెందినవాళ్ళుగా భావించుకుంది ఆ పిల్ల-వాళ్ళంతా చాలా చెడ్డవాళ్ళనీ, అందుకనే అలా తోలుకు పోబడుతున్నారనీ అనుకుంది. అందుకని వాళ్ళను చూచినప్పుడా అమ్మాయి భయపడింది. వాళ్లను దాటివచ్చేశాక సంతోషించింది.

కుర్రవాడుకూడా ఆ ఖయిదీలకేసి చాలాసేపు చూచాడు. వాడు ఈ సమస్యను మరోవిధంగా పరిష్కరించుకున్నాడు-తనకు మల్లేనే, అందరికి మల్లేనే వాళ్లుకూడా మానవులే అనుకున్నాడు-కాని వాళ్ళకు ఎవరో ఏదో చేయరాని మహాపకారం చేసివుంటారని ఊహించుకున్నాడు-వాళ్ళను చూస్తే జాలివేసింది. ముండనం చేయబడి, సంకెళ్ళు తగిల్చబడియున్న ఖయిదీలను

చూస్తే భయపడతేరు. అలా వాళ్ళను మూడనంచేసి, సంకెళ్ళు వేసిన వాళ్ళను తలచుకుని భయపడ్డాడు. అప్పుడు వాడి పెదవులు వొణికాయి. లోపలనుంచి వస్తోన్న ఏడుపును అణచుకోటానికి చాలా ప్రయత్నాలు చేశాడు. అటువంటిదానికి ఏడవటం లజ్జాకరమని అతని భావం.

## ౩౮

నెఖ్లూదోవ్ కూడా ఖయిదీలతోపాటు గబగబా నడుస్తున్నాడు—సన్నపాటి దుస్తులే ధరించాడు—అయినా ఎండ తీక్షణత అతన్ని బాధిస్తోంది; గాలి స్తంభించిన వాతావరణం, దుమ్ము విపరీతంగా లేస్తున్న రోడ్లు.

రెండు ఫర్లాంగులు నడిచాక మళ్ళీ తన బండి యెక్కాడు. వేడికి పోతున్నది. గతరాత్రి తనకూ, బావగారికి జరిగిన సంభాషణ జ్ఞాపకంవచ్చింది. కాని బావగారి యెడల ఆ వుదయం కలిగిన ఆగ్రహభావం ఇప్పుడు లేదు. అది ఈ ఖయిదీల గుంపును చూస్తున్నప్పటి భావాలచేత, ఉష్ణ వాతావరణం చేత ఆఛ్ఛాదితం అయిపోయింది.

దాని ప్రక్కన ఒక చెట్టుక్రింది మాపులో ఇద్దరు బడిపిల్లలుకనిపించారు. ఒకడు మంచుగడ్డలు వేసిన చల్లని పానీయం తాగుతున్నాడు. మరొకని గ్లాసుసు దుకాణదారు ఒక పసుపుపచ్చని రంగుగల పానీయంలో నింపుతున్నాడు.

నెఖ్లూడోవుకు కూడా ఏదైనా లోపలికి పుచ్చుకోవాలన్న కోరిక జనించింది. "ఇక్కడేమయినా మంచి పానీయాలు దొరుకుతాయా?" అని ప్రశ్నించాడు బండివాడిని."

"ఇక్కడే ఆ వైపున మంచి దుకాణం ఉందండి" అంటూ బండివాడు మూలమలుపు దాటించి ఒక దుకాణంలోకి తీసుకుపోయాడు.

దుకాణంలోకి వెళ్ళి ఒక టేబిల్ ముందు కూచున్నాడు.

నెఖ్లూడో—ఇదివరకెన్నడూ ఆ కొట్టుకురాని అతన్ని చూచి కొట్టు యజమాని, అతని నౌకర్లు ఆశ్చర్యంగా చూస్తూ 'ఏమి కావాలి'లని ప్రశ్నించారు. ఓక చల్లని పానీయం తెచ్చి యిమ్మని చెప్పాడు నెఖ్లూడో. ఇంతలో అతనికి

ఒక మూల కూచుని తేనీరు తాగుతూన్న ఇద్దరు వ్యక్తులు కనిపించారు. ఈ యిద్దరిలో ఒకడికి బట్టతల ఉంది తన బావగారికి మల్లేనే. వెంటనే నెల్లూ డోకు బావగారు జ్ఞాపకం వచ్చారు. ఒకసారి వెళ్ళి అక్కగార్ని, బావగార్ని చూసి, గతరాత్రి జరిగిన వాక్కలహానికి ప్రత్యామ్నాయంగా మంచి మాట లాడి వస్తే బాగుండు ననుకున్నాడు. కాని వ్యవధానం లేదు. కనుక ఒక ఉత్తరం రాద్దామనుకున్నాడు. దుకాణదారు దగ్గిర ఒక కాగితం, కలము పుచ్చు కుని ఉత్తరం రాయటానికి ప్రయత్నించాడు. ఏమి రాయాలో ఆలోచించాడు. అతని ఆలోచనలు పలువిధాలుగా సంచరించాయి.

“ప్రియమైన అక్కయ్యకు, నిన్న నీ భర్తతో కలిగిన వాగ్వాదంవల్ల సంభవించిన దుస్సహమైన భావాలతో మిమ్మల్ని విడిచి వెళ్ళలేక పోతు న్నాను” తరువాత ఏమిరాయాలి? అతన్ని క్షమించమని కోరాలా? కాని తానప్పుడు పలికిన మాటలన్నీ తన హృదయభావాలకు అనుకూలమైనవే కదా? అదీగాక బావగారు తన సొంత వ్యవహారాలలో అనవసరంగా జోక్యం కల్పించుకుని మాటాడాడుగా! బావగారిపట్ల మళ్ళీ పూర్వపు అసహ్యభావం యావత్తూ పొంగి వచ్చింది. పూర్తిగా కాగితాన్ని మడిచి జేబులో పెట్టేసుకున్నాడు. దుకాణదారుకు ఇవ్వవలసిన డబ్బు యిచ్చేసి బైటికి వచ్చేశాడు. మళ్ళీ బండి యెక్కి ఖయిదీలగుంపు వెనుక వెళ్ళిపో యాడు!

ఎండవేడి మండిపోతోంది. ప్రతిక్షణమూ నేల సెగలు చిమ్ముతు న్నది. బండికి బిగించిన లోహపుచువ్వలు ముట్టుకుంటే కాలిపోతున్నాయి.

పోగాపోగా ఒక పెద్దయింటిముందు సైనిక కాపలావద్ద జనం గుమి గూడివున్నారు. ఖయిదీలను తీసుకుపోతున్న సైనికులలో పెద్ద అధికారి ఉన్నాడు. కునుకుపాట్లు పడుతున్న బండివాణ్ణి పిలిచి బండి ఆపమన్నాడు నెల్లూడో.

“ఏమిటీ గొడవ” అని ఆ యింటి కాపలావాణ్ణి అడిగాడు నెల్లూడో.

“ఎవరో ఖైదీ కాబోలు, ఏదో జరిగింది పాపం!”

నెల్లూడో బండిదిగి అక్కడికి వెళ్ళాడు. పల్లకిలా నడుస్తున్నాడా ఖైదీ. కొంచెం వయసుమళ్ళినవాడు — గడ్డం వొత్తుజుట్టు ఆతనికేసి చూస్తే

న్నాను. ఉండి ఉండి గుండె ఉబుకుతోంది. మూలుగుతున్నాను. పక్కన ఒక పోలీసువాడు, ఎవరో వర్తకుడు, ఒక ముసలమ్మ, ఒక కుర్రవాడు ఉన్నారు.

"వాళ్ళంతా బలహీనంగా వున్నారు. గోజుల లరటపే గుమ్ముల్లో బెట్టి తాళాలువేస్తారాయెను. బలం ఏముంటుంది. ఇలాంటి ఎర్రటెండలో ఇలా తోలుకొస్తూంటే ఏమవుతుంది మరి!" అన్నాడు ఆ యింటి యజమాని గుమాస్తా రామాలు నెక్లూడోవద్దకు వచ్చి.

"పాపం, బ్రతికేట్టు లేదు—" అన్నదా ముసలమ్మ విచారంగా.

"మెడదగ్గర చొక్కా వదులుచెయ్యాలి—" అని సలహాయిచ్చాడు అక్కడే వుండి చూస్తున్న ఒక పోస్టు జవాను.

పోలీసువాడు గుండీలు విప్పేసి, చొక్కాను మెడదగ్గర వదులు చేయు టానికి ప్రయత్నం చేశాడు. అతనికేమీ తోచటంలేదు. సిగ్గుపడుతున్నాడు. తికమకగా ఉంది - "అసలే గాలి రావటంలేదు. మీరంతా ఎందుకు చుట్టూ కమ్ముకొచ్చారు?"—అంటూ అక్కడ కూడినవాళ్ళను గదమాయించాడు.

"ఖయిదీలను ఇలా తీసుకొచ్చేముందు డాక్టరుచేత పరీక్ష చేయించాలి; బలహీనులను తీసుకురాకూడదు—" అన్నాడా యింటి గుమాస్తా.

"పదండి, ఏమిటలా తేరిపారచూస్తారు? మీకేం పనివుంది?" ఇక్కడ అంటూ ఆ పోలీసు అక్కడ వున్నవాళ్ళను ఉద్దేశించి పలుకుతూ నెక్లూడోవ్ వేపు దీనంగా చూచాడు - కాని నెక్లూడోవ్ సానుభూతి లభించలేదు-ఇక ఆ సైనికుడు తన బూట్లమీది దుమ్ము దులుపుకుంటూ అతనివైపే చూడలేదు.

"భాగ్యతగలవాళ్ళు అలా చూస్తూ పొరుకుంటారేం? అలా మనుష్యుల్ని నిలువునా ప్రాణాలు తీస్తారా? ఖయిదీ అయితే మాత్రం మనిషి కాదేమిటి?" అన్నారు చాలామంది.

"తలయెత్తి, కాస్త మంచినీళ్ళు త్రాగించండి" అన్నాడు నెక్లూడోవ్.

"పంపించాం నీళ్ళకోసం—" అంటూ ఆ పోలీసు ఆ పడివున్న వాని జబ్బలు పట్టుకుని లేవనెత్తటానికి ప్రయత్నంచేశాడు.

"ఈ గుంపంతా ఎందుకు చేరిందిక్కడ?" అంటూ అధార్టీ చెలిగిస్తూ ఒక పోలీసు ఉద్యోగి ఎక్కడనుంచో వచ్చాడు-అతని కొత్తబూట్లు,

అప్పుడే క్షవరం చేసిన గడ్డం బాగా మెరుస్తున్నాయి. "అడ్డం లేవండి; ఇక్కడ గుంపు కూడకండి" అని గదమాయించిన తరువాతనే అసలు సంగతేమో కనుక్కోటానికి ఉపక్రమించాడు.

ఆ చనిపోతున్న ఖయిదీని సమీపించాడు, ఇదంతా తానిదివరకే ఊహించినట్టు తల ఊపాడు. పోలీసును లక్ష్యించి—"ఏమిటైంది" అని అడిగాడు.

"ఖైదీల గుంపు ఇటుకేసి వెళ్ళిపోతోంది. ఇతడు అకస్మాత్తుగా ఇలా క్రిందపడిపోయాడు. ఖైదీలను తీసుకుపోతున్న ఉద్యోగి ఇతన్ని ఇక్కడే అట్టిపెట్టేయండి అని చెప్పి వెళ్ళిపోయాడు.

"ఔను. బాగానే ఉంది. ఇతన్ని పోలీసుస్టేషనుకు తీసుకుపోవాలి. ఒక గుర్రపుబండీని పిల్చుకురా".

"పంపించానండి ఒక కూలివాణ్ణి."

అక్కడ వున్న వర్తకుడు ఎండవేడిమినిగురించి ఏమో చెప్పబోయాడు.

"చెప్పొచ్చావులే మహా! నీకేం పనివుంది ఇక్కడ. వెళ్ళిపో"అంటూ పోలీసు ఉద్యోగి అతనికేసి చాలా తీవ్రంగా చూచాడు. ఆ చూపుకు ఆ యింటి యజమాని కూడా భయపడిపోయాడు.

"అతనికి కాస్త దాహం ఇప్పించాలి మొదట." అన్నాడు నెఖ్లూదొవ్. పోలీసు ఉద్యోగి అతనికేసి కూడా తీవ్రంగా చూచాడు. కాని ఏమీ మాటాడలేదు. ఇంతలో ఒకడు కూజాతో నీళ్ళు తెచ్చాడు. పోలీసు ఉద్యోగి పోలీసును ఆజ్ఞాపించాడు - అతనికి దాహం పట్టమని. ఆ పోలీసు ఖయిదీని కొద్దిగా లేపి నోట్లో నీళ్ళుపోశాడు. కాని ఆ దుర్భాగ్యుడు గుటక వెయ్యలేదు. ఆ నీళ్లు గడ్డంమీదగా స్రవించి, అతని మట్టి గొట్టుకున్న చొక్కాను తడిపాయి.

"కాసిని నీళ్లు తలమీద పొయ్యి—" అన్న ఉద్యోగి ఆజ్ఞ ననుసరించి ఆ పోలీసు అతని టోపీతీసి, అతని యెర్రటి జుట్టుమీద, బట్టతలమీద నీళ్లుపోశాడు. అతని కన్నులు విపరీతంగా పత్తికాయల్లా తెరచుకున్నాయి. శరీరం మాత్రం పూర్వంవలెనే మొద్దుబారి వున్నది.

అసలే అతని ముఖం మట్టిగొట్టుకుని ఉంది. నీళ్ళు పడటంతో బురద-అయింది-రొప్పుతూ వున్నాడు. వొళ్ళంతా వొణుకుతోంది.

నెఖ్లూడొ ఎక్కివచ్చిన బండీ కనిపించగా, పోలీసు ఉద్యోగి ఆ బండీ వాణ్ని పిల్చాడు.

"నాకు బాడుగ ఉందండి" అన్నాడు వాడు.

"నేనే ఆ బండీలో ఎక్కివచ్చాను. అయితే మానె, బాడుగ నేనే ఇచ్చుకుంటాను. పాపం, ఇతన్ని నీ బండిలో తీసుకుపో—" అన్నాడు నెఖ్లూడొ.

"ఇంకా చూస్తారేం! కానీయండి" అన్నాడు పోలీసు ఉద్యోగి.

పోలీసు, సైనికుడు, ఒక కూలివాడు—అంతా కలిసి ఆ మనిషిని ఎత్తి బండిలో కూచోబెట్టారు. కాని అతడు కూచోలేకపోయాడు. తల వెనక్కి వాలిపోయింది-శరీరం కూలిపోయింది.

"పడుకోబెట్టు పోనీ—" అని పోలీసు ఉద్యోగి కేకవేశాడు.

"ఇక పరవాలేదు; ఇలాగే నేనే పట్టుకుని పోలీసుస్టేషనుకు తీసుకు పోతాను లెండి—" అన్నాడు పోలీసు బండీలో ఎక్కి కూచుని, ఖయిదీ నడుము చుట్టూ చెయిపోనిచ్చి జాగ్రతగా పట్టుకుని. సైనికుడు వచ్చి ఊడి పోయిన జైలు చెప్పులను ఖయిదీ పాదాలకు తొడిగినాడు. విడిగా వున్న జైలు టోపీని తీసి ఖైదీ తలమీద అమర్చాడు పోలీసు.

"ఇక పదండి—" అన్నాడు పోలీసు ఉద్యోగి.

"బండీవాడు కోపంగా చూచి, తలవూపి, పోలీసు స్టేషను వైపు బండి మరల్చాడు. సైనికుడు వెనకాలే వస్తున్నాడు. బండీలో ఖయిదీ శరీరం వెనక్కి జారివస్తూంటే పోలీసు ముందుకు లాక్కుంటూవున్నాడు. ఖయిదీ తల వెనక్కి వాలి పడుతూవున్నది.

సైనికుడేమో క్రిందికి జారుతూన్న ఆ ఖయిదీ కాళ్ళను బండీలోనికి తోస్తూ వెనకాలే వస్తున్నాడు. నెఖ్లూడొ కూడా బండిని అనుసరించి వస్తున్నాడు.

# ౩౨

బండి పోలీసుస్టేషనుకు చేరింది. ఒకద్వారం ముందు ఆగింది. చాలా మంది పోలీసులు వచ్చి బండీలోని ఖయిదీని బైటికి తీశారు. బండీలోని పోలీసు "అమ్మయ్య" అంటూ దిగాడు. ఆ ఖయిదీని మేడమీద ఒక గది లోకి తీసుకుపోయారు. సెక్స్టాన్ కూడా వెళ్ళాడు. అదొక చిన్నగది. అందులో నాలుగుమంచాలు వున్నాయి. ఒక మంచంమీద ఒకమూతి వంకర పోయినవాడు, మెడకు ఒక కట్టు కట్టించుకుని కూచున్నాడు. ఇంకో మంచంమీద క్షయరోగి ఒకడు ఉన్నాడు-మిగతా రెండు మంచాలు ఖాళీగా ఉన్నాయి-ఒకదానిమీద ఆ తెచ్చిన ఖయిదీని పడుకోబెట్టారు. ఎవరో ఒక యువకుడు-మెరుస్తున్న కళ్లు గలవాడు, అస్తమానం కనుబొమలు తిప్పు కుంటూ వుంటాడు—వచ్చి ఆ ఖయిదీ వైపు చూచి పకపకా నవ్వ నారంభించాడు. పోలీసు ఆసుపత్రిలో కొంతకాలంనుంచీ ఉంటూన్న ఒక పిచ్చి వాడు అతడు.

"వాళ్ళు నన్ను భయపెట్టాలని చూస్తున్నారు. కాని లాభంలేదు. ఊఁ" అన్నాడతను.

ఇంతలో వొక పోలీసు అధికారి, డాక్టరుకూడా అక్కడికి వచ్చారు.

డాక్టరు ఆ ఖయిదీ చేయిమెత్తి పట్టుకు చూచాడు. మెత్తగానే వుంది. కాని పాలిపోయింది. అత్యంతం చల్లగా వుంది. ఆ చేయి అలా కాసేపు పట్టుకుని జారవిడిచాడు. అది ఆ మృతశరీరగా పొట్టమీద పడింది.

"చచ్చిపోయాడు. అయిపోయింది" అన్నాడు డాక్టరు. అయినా ఇంకా ఖచ్చితంగా తేల్చుకుందామని అతని చొక్కా బాగా వొదులుచేసి, అతని గుండె దగ్గర చెవిపెట్టి విన్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉన్నారు-డాక్టరు వొంగి యున్నవాడు లేచి, తల ఆడించి, ఆ శవం కనురెప్పలు ఒకటి తరువాత ఒకటి నిశితంగా పరీక్ష చేశాడు.

"నాకేం భయంలేదు; నాకేం భయంలేదు" అన్నాడా పిచ్చివాడు డాక్టరు ఉన్నవైపు ఉమ్మివేస్తూ—

"అయిపోయినట్టేనా ?" అడిగాడు పోలీసు అధికారి.

"అయిపోయినట్టే. పాతిబెట్టొచ్చు."

"జాగ్రతగా చూడండి. పూర్తిగా చచ్చిపోయినట్టేనా ?"

"అయితే ఉండు; పెద్ద డాక్టరుగారికి కూడా చూపిద్దాం. శవాన్ని తీసుకురండి" అని ముందుకు సాగిపోయాడు.

పోలీసువాళ్లు మళ్ళీ ఆ శరీరాన్ని మోసుకుని క్రిందకి వెళ్ళారు. వాళ్ళతో కూడా వెడుతోన్న నెక్లూడోవ్‌కు అడ్డంగా వచ్చి పిచ్చివాడు "నువ్వు మంచివాడివేనయ్యా, నాకు ఒక సిగరెట్టు ఇవ్వు" అని అడిగాడు. నెక్లూడోవ్ జేబులోనుంచి ఒక శ్వేతకాష్ఠం తీసిఇచ్చాడు. ఆ పిచ్చివాడు కనుబొమలు అదేపనిగా త్రిప్పుతూ, ఆసుపత్రిలో తన్ను డాక్టర్లంతా ఎలా వీడిస్తున్నారో ఆ గొడవ అంతా చెప్పుకొస్తున్నాడు. చివరకు ఎలాగో వాణ్ణి వొదిలించుకుని నెక్లూడోవ్ క్రిందికి వచ్చాడు. శవాన్ని తీసుకుపోయిన గదిలోకి వెళ్లుతూంటే పోలీసు అధికారి వచ్చి అడిగాడు "ఏంకావాలి ?" అని.

"ఏం అక్కరలేదు."

"అయితే వెళ్ళిపొండి."

వెంటనే నెక్లూడోవ్ తిరిగి వెళ్ళిపోయాడు. బైట ఆవరణలో కునుకు తీస్తున్న బండివాణ్ణి లేపి, యెకాయెకి స్టేషనుకు వెళ్ళుతున్నాడు. ఒక వంద గజాలు వెళ్ళేసరికి ఒక బండి యెదురైంది. దాని వెనుక తుపాకి పుచ్చుకుని సైనికుడొకడు ఉన్నాడు. బండిలో మరొక ఖైదీ శవం ఉంది. బండి వేగానికి అటు ఇటు ఊగుతూ ఉంది. బండివాడు గుర్రపు కళ్ళెం పుచ్చుకుని నడుస్తున్నాడు. ఒక పోలీసు కూడా బండివెంట వస్తున్నాడు. నెక్లూడోవ్ తన బండిని ఆపుచేయించాడు.

నెక్లూడోవ్ బండి దిగి మరొకసారి ఆ బండివెంట పోలీసు స్టేషనుకు వెళ్లాడు.

సర్జన్ ఆవరణలోనే ఉన్నాడు. ఆ శవాన్ని ఎక్కడినుంచి తెస్తున్నారో అడిగి తెలుసుకున్నాడు.

"ఏడూ ఖైదీయేనా ?" అని అడిగాడు.

"ఔనండి; ఇది ఇవాళ రెండోచావు"

ఇదివరకు శవాన్నివలెనే ఈ శవాన్ని కూడా మేడమీది ఆసుపత్రికి తీసుకుపోయారు. నెక్లూడోవ్ కూడా మంత్రముగ్ధునులా పైకి వెళ్లాడు.

"ఏం కావాలి తమకు?" అని ఒక పోలీసు అడిగాడు. కాని నెఖ్లూడొ వినిపించుకోకుండా లోపలికి వెళ్లాడు. అక్కడ ఒక మంచంమీద ఆ పిచ్చివాడు పడుకుని నెఖ్లూడొ యిచ్చిన సిగరెట్టును ఆప్యాయంగా తాగుతున్నాడు.

"ఒహో; నువ్వు మళ్ళీ వచ్చావే" అని పకపకా నవ్వాడు. అటు తిరిగి శవాన్ని చూచి నవ్వు ఆపి "ఓహో, మళ్ళీనా? నాకు విసుగెత్తి పోతోంది. పసిపిల్లవాడి ననుకుంటున్నారు కామాలు వీళ్ళంతా?" అంటూ ప్రశ్నార్థకంగా నెఖ్లూడొ కేసి చూశాడు.

నెఖ్లూడొ శవంకేసి చూస్తున్నాడు. ఆ చనిపోయినవాని ముఖం చాలా అందంగా ఉంది. అవయవాలన్నీ బలిష్ఠంగా ఉన్నాయి. ప్రౌఢయవ్వనంలో ఉన్న మనిషి. నల్లటి మీసాలపైన ఆ ముక్కు చాలా చక్కగా ఉంది. ఆ పెదవులమీద చిరునవ్వు రేఖ అల్లాగే ఉంది, ఆ పెదవులు రాను రాను నల్లబడిపోతున్నాయి. ముఖవైఖరి ప్రశాంతంగా, దయాన్వితంగా, గంభీరంగా ఉంది.

ఆ బలమైన కండరాలు, పటిష్ఠమైన యెముకలు చూస్తే అతడు చాలా అందమైన, ఉపారైన యువకుడని తేలుతుంది. అయితేయేం ఈ స్థితికి తేబడ్డాడు. పాపం, మనిషే, చచ్చిపోయాడే, అని ఎవరూ విచారించటంలేదక్కడ. మంచి పని, పాటు చేయగలిగిన బలవంతుణ్ని కోలుపోయాం—అన్న విచారమైనా లేదెవరికీ. శవాన్ని ఇంత దూరం తెచ్చి, పరీక్షించి, అంత్యక్రియలు చేయించవలసి వచ్చిన ఈ గొడవను చింతిస్తున్నారు వాళ్ళు.

డాక్టరు, పోలీసు ఇన్‌స్పెక్టరు వచ్చారక్కడికి. డాక్టరు బాగా కండలుదేరి బలిసివున్నాడు. సిల్కు కోటు, సిల్కు లాగు తొడుక్కున్నాడు. ఇన్‌స్పెక్టరు లావైన మనిషి. గుండ్రని ముఖం. డాక్టరు శవం పక్కన కూచున్నాడు మంచంమీద. ఇదివరకు వచ్చిన శవాన్ని ఆ చిన్న డాక్టరు పరీక్షించినట్టుగానే ఈయన కూడా, చెయ్యి పట్టుకు చూశాడు, గుండెమీద చెవి పెట్టి విన్నాడు. చివరకు చావు కబురు చల్లగా చెప్పేశాడు.

"ఎక్కడి ఖైదులోనివాడు?" అడిగాడు పోలీసు ఇన్‌స్పెక్టరు వెంట వచ్చిన సైనికుణ్ని. సైనికుడు జవాబు చెప్పాడు. ఖైదీ కాళ్ళకు తగిలించిన సంకెళ్లు చూపించాడు.

"వాటిని కంపౌండరుని పిలిపించి తీయిస్తాంలే" అంటూ ఇన్స్పెక్టరు తాపీగా బైటికి వెళ్లాడు.

"ఇలా ఎందుకు జరగాల్సి వచ్చిందంటారు?" అని అడిగాడు నెఖ్లూడో.

డాక్టరు కళ్ళజోడు సవరించుకుంటూ అతనికేసి చూశాడు.

"వడదెబ్బకు ఇలా ఎందుకు చస్తున్నారనా? మీరడిగేది! ఏముందీ, చలికాలం అంతా వ్యాయామం లేకుండా, వెలుతురు లేకుండా ఖైదులో పడి ఉంటారు. అకస్మాత్తుగా ఇలాంటి ఒక వేడిరోజున గుంపులో కలిపి బైటికి తెస్తే వడ తగలక ఏంచేస్తుంది?"

"బైటికి తేవటం ఎందుకు?"

"ఆ సంగతి ఆ తెచ్చేవాళ్ళను పోయి అడగండి. ఇంతకూ తమరు ఎవరు?"

"నేను అపరిచితుడిని."

"ఓ; అయితే సరే, మీతో మాటాడుతూ కూచోటానికి నాకు వ్యవధి లేదు" అంటూ వెళ్ళిపోయాడు.

మూతి వంకరపోయి, మెడకు కట్టు కట్టుకుని మంచంమీద పడుకుని వున్న రోగిని పలుకరించి క్షేమం అడిగాడు నెఖ్లూడో. ఆ పిచ్చివాడు సిగరెట్టు కాల్చటం ముగించి డాక్టరు పోయినవైపు ఉమ్మి వేస్తూ ఉన్నాడు.

నెఖ్లూడో ఆ చోటు వీడి బైటకి వచ్చేశాడు. బండివాడు మళ్ళీ కునికిపాట్లు తీస్తూ ఉన్నాడు.

## ౩౮

నెఖ్లూడో స్టేషను చేరుకున్నాడు. ఖైదీలంతా రైలుపెట్టెలలో ఎక్కి కూర్చున్నారు. వాళ్ళను కడసారి చూసి, సాగనంపి పోదామని వచ్చిన బంధుమిత్రాదులు ప్లాట్ఫారంమీద నిల్చునివున్నారు. రైలుపెట్టెలవద్దకు పోవటానికి వీల్లేదు.

ఖైదీలనందర్నీ సైబీరియాకు తీసుకుపోవలసిన పెద్ద ఉద్యోగి ఆనాడు చాలా విచలితుడై వున్నాడు. స్టేషను చేరుకునేలోగా ఖైదీలలో...

నెఖ్లూడో చూచిన యిద్దరూ గాక, ఇంకా ముగ్గురు ఖైదీలు వడదెబ్బ తగిలి చనిపోయారు. రైలుస్టేషను చేరిన తర్వాత ఇద్దరు చనిపోయారు. ఈ శవాలను పోలీసు స్థానాలకు తీసుకుపోవటం; వాళ్ళకు సంబంధించిన కాగితాల్ని, వస్తువుల్ని అధికారులకు వొప్పగించేయటం, సైబీరియాకు పోవలసిన ఖైదీల పేర్లలోనుంచి వాళ్ళ పేర్లను కొట్టివేయించటం — ఈ పనులన్నీ తోడు వెళ్ళుతూన్న సైనికులు, తదితరులు చెయ్యాలి. పైన ఎండ మండిపోతోంది.

ఆయా పనులన్నీ సక్రమంగా జరిగేవరకూ నెఖ్లూడోవు రైలుపెట్టెల వద్దకు వెళ్ళటానికి అనుజ్ఞ ఇవ్వటానికి వీల్లేదన్నారు. నెఖ్లూడో సార్జంటుకు కాస్త లంచం పారేశాడు. "అధికార్లు వచ్చి చూడకముందే చప్పున మాట్లాడి వచ్చేయండి సుమీ!" అన్నాడు సార్జంటు, సరేనని నెఖ్లూడో వెళ్ళాడు. మొత్తం పద్దెనిమిది పెట్టెలున్నాయి. ఒక్కటిమాత్రం అధికార్లకోసం ప్రత్యేకించబడింది. మిగిలిన అన్నింటిలోనూ ఖైదీలు నిండివున్నారు. నెఖ్లూడో ఆ పెట్టెల ముందుగా నడుస్తూవుంటే లోపలనుంచి, సంకెళ్ళచప్పుడు, అంతంలేని గలభా వినిపిస్తోంది. వాళ్ళల్లో ఎవరూకూడా తమ ఖైదీలలో కొందరు ఆ నాడు చనిపోయిన విషయమై మాటాడుకోవటమేలేదు. మంచినీళ్ళకోసం, కూర్చోటానికి సీట్లకోసం గలభా పడుతున్నారు

ఒకపెట్టెలో ఇద్దరు సైనికులు ఖయిదీల చేతులకు వున్న సంకెళ్ళను తీసివేస్తున్నారు. ఒకడు తాళంతీసి సంకెళ్ళను లాగుతున్నాడు; మరొకడు వాటిని పోగుచేస్తున్నాడు.

పురుషులు కూచున్న పెట్టెలు దాటివెళ్ళాడు నెఖ్లూడో - ఆడవాళ్ళ పెట్టెలు ఆరంభమైనాయి. రెండో పెట్టెలోనుంచి "అమ్మో! బాబో! దేవుడా" అంటూ ఆర్తధ్వనులు వినవస్తున్నాయి. నెఖ్లూడో ముందుకు సాగిపోయి మూడవపెట్టె కిటికీలోనుంచి తలదూర్చాడు. వెచ్చని గాలిసోకింది—జనసమ్మర్దముచేత ఉద్భవించేటటువంటిది—ఆడవాళ్ళ కీచుగొంతులు ధ్వనిస్తున్నాయి.

స్త్రీలంతా ఖయిదీలు ధరించవలసిన దుస్తుల్లోనే వున్నారు. అందరి ముఖాలు ఎర్రగా కందివున్నాయి. కిటికీలోనుంచి చూస్తున్న నెఖ్లూడోను చూడగానే అందరూ అతనికేసి ఆకర్షితులైనారు. తమలో తాము గొడవగా మాటాడుకోవటం ఆపివేశారు. అవతలవైపు కిటికీదగ్గర కూచుంది మస్లావా.

నెహ్లూడొవ్ నిల్చియున్న కిటికీకి దగ్గరగానే ఫియొడోసియా చిరునవ్వు నవ్వుతూ కూచుంది. ఆమె నెహ్లూడొవ్‌ను గుర్తించింది. మస్లొవాను మోచేత్తో పొడిచింది.

మస్లొవా ఉలికిపాటుగా లేచింది. చికిలినవ్వు నవ్వుతూ నిల్చున్న కిటికీవద్దకు వచ్చింది-"చాలా ఎండగా వుంది కదూ!" అన్నది.

"నేను పంపించిన వస్తువులు అందినవా?"

"ఔను. అందినై."

"ఇంకా నీకు కావలసినవి ఏమైనా ఉన్నాయా?"

"ఏమున్నాయి? ఏమీ అక్కరలేదు."

"కాస్త దాహం దొరికితే బాగుండునే!" అన్నది ఫియొడోసియా.

"ఔను, దాహం దొరికితే బాగుండును" అన్నది మస్లొవా.

"ఏం? మీ దగ్గర మంచినీళ్లు లేవా?"

"కాసిని ఇచ్చారు. కాని అయిపోయాయి."

"వెళ్ళి ఆ జవానులతో చెబుతాను పంపించమని. ఇక మళ్ళీ నిజ్నీ స్టేషను చేరేవరకూ మనం కలుసుకునే అవకాశం వుండదు."

"అయితే, మీరుకూడా వస్తున్నారేమిటి?" అడిగింది మస్లొవా ఆ సంగతి తానెరగనట్టు, సంతోషంగా అతనికేసి చూస్తూ.

"పని తరువాత బయలుదేరే రైలులో వస్తున్నాను.

మస్లొవా యేమీ మాటాడలేదు. కాని వొకనిట్టూర్పు విడిచింది.

"అయితే నాయనా, ఇవాళ పన్నెండుమంది ఖైదీలు చనిపోయారట, నిజమేనా?" ఒక ముసలమ్మ మగాడి కంఠస్వరాన అడిగింది. తీక్ష్ణంగా ఉంది ఆమె ముఖం. ఆమె పేరు కొరాబ్లేవా.

"పన్నెండుమంది సంగతి నాకు తెలియదు. నేను రెండు శవాల్ని చూశాను."

"పన్నెండుమందిని చంపామని చెబుతున్నారు వాళ్ళు. వాళ్ళ గతి అంతేనా? పాపం!

"ఆడవాళ్ళల్లో ఎవరూ జబ్బు పడలేదా?" నెహ్లూడొవ్ అడిగాడు.

"ఆడవాళ్ళు సహజంగా బలం కలవాళ్ళు" అంటూ ఒకామె పకపకా నవ్వింది. "ఒక్కతే మాత్రం తప్పించుకు పోతానని చూస్తోంది" అంటూ ఆ ప్రతిధ్వనులు వినిపిస్తున్న ఆ పక్క పెట్టెకేసి చూపింది.

మస్లోవా తన ఆనందాన్ని అణచుకుంటూ "ఏమైనా కావాలా అని అడుగుతున్నారుగా మిమ్మల్ని! పాపం ఆవిడను ఇక్కడే ఉండేట్టు చేయరూ! మీరు అధికార్లతో చెబితే—" అన్నది.

"ఔను; తప్పకుండా చెబుతాను."

"ఇంకో విషయం కూడా ఉంది. ఈమె తన భర్తను తారాస్‌ను చూడాలనుకుంటోంది" అంటూ మస్లోవా ఫియోదోసియాను చూపింది. "అతను మీతో కూడా వస్తున్నాట్టిదా!" అని అడిగింది.

"అయ్యా, మీ రెవరితోనూ మాటాడరాదు" అన్నాడు ఒక సార్జెంటు వచ్చి. ఇతడు నెఖ్లూడోవ్ వద్ద లంచం పుచ్చుకున్నవాడు కాదు, మరొకడు. నెఖ్లూడోవ్ అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఎవరేనా ఉద్యోగి కనిపిస్తాడేమోనని, తారాస్ సంగతి, ఆ నొప్పులు పడుతున్న యువతి సంగతి చెబుదామని వెతికాడు. కాని ఎవరూ కనిపించలేదు. సార్జెంట్లు అయినా సరియైన సమాధానం ఎవరూ చెప్పారు కాదు. వాళ్ళంతా తమ తమ పని తొందరలలో ఉన్నారు. ఖైదీలన్ని అటు ఇటూ తీసుకుపోవటమో, పై అధికారి భార్యగారికి సేవ చెయ్యటమో, తమ సామానులు రైల్లో ఎక్కించుకోవటమో—యిలాంటి పనులు చాలా ఉన్నాయి వాళ్ళకు.

రైలు బయలుదేరటానికి రెండవ గంట కూడా మ్రోగింది. అప్పుడు ఒక అధికారి కనిపించాడు. ఆ పొట్టిచేతుల అధికారి చేతిరుమాలుతో మూతి మీద గుబురుగా పడివున్న మీసాల్ని తుడుచుకుంటూ ఒక సార్జెంటును ఎందుకో అధికారికమైన దర్జా ఉట్టిపడేలాగు మందలిస్తున్నాడు.

"ఏమి కావాలి తమకు?" అని అడిగాడు నెఖ్లూడోవ్‌ను చూడగానే.

"ఇక్కడ ఒక స్త్రీ ఖయిదీ నొప్పులు పడుతోంది. కాబట్టి—"

"నొప్పులు పడితే పడనీయండి. ఆ వ్యవహారం తరువాత కనుక్కుంటాలెండి" అంటూ తనకోసం ప్రత్యేకించబడిన రైలు పెట్టెలో ఎక్కాడు.

గార్డు బూరా ఊదేశాడు. ప్లాటుఫారంమీద ఉన్న ఖయిదీల బంధువర్గం, రైల్లోవున్న ఖయిదీలు కన్నీళ్ళు కార్చారు.

నెఖ్లూడో ప్లాట్‌ఫారంమీద టారస్‌తో సహా నిల్చుని చూస్తున్నాడు. రైలు శబ్దం చేస్తూ కదిలింది. పెట్టెల్లోని కిటికీలోనుంచి ఖయిదీల ముఖాలు వరసగా దాటిపోతున్నాయి అతని కన్నులముందు. ఆడఖయిదీలున్న పెట్టెలు వచ్చాయి. ఆ రెండో పెట్టెలోనుంచి ఆవేదనా కంఠస్వరాలు వినిపిస్తూనే ఉన్నాయి. ఆ పక్క పెట్టె కూడా వచ్చింది. మస్లోవా కిటికీ పక్కనే నిల్చుని నెఖ్లూడోకేసి చూస్తూ ఉంది. ఆమె చిరునవ్వులో ఏదో విషాదం!

## 3

నెఖ్లూడో వెళ్ళవలసివున్న తరువాత రైలు బయలుదేరటానికి ఇంకా రెండు గంటల వ్యవధానం ఉంది ఈ లోగా ఒకసారి అక్కగారిని చూసివద్దామా అనుకున్నాడు. కాని ఉదయంనుంచీ వాతావరణం ఉద్విగ్నమయంగా ఉండటంచేతనూ, తాను ఎక్కువగా అటూ ఇటూ తిరిగి వుండటం చేతనూ—ఫస్టుక్లాసు వెయిటింగు రూములో సోఫామీద పడుకున్నాడో లేదో కళ్ళు మూసుకుపోయాయి. నిద్ర వచ్చేసింది. పడుకున్నాడు.

కొంతసేపటికి వోక పోర్టరు వచ్చి మేల్కొల్పాడు.

“నెఖ్లూడో తమరేనా అండి! మీ కోసం ఎవరో దొరసానమ్మగారు వచ్చారు” అని చెప్పాడు.

నిద్ర లేవగానే భావ వీథిలో ఖయిదీలను మోసుకుపోతున్న రైలు కనిపించింది. ఆ యువతి వేదనాభరితములైన ఆర్తస్వరములు వినిపించాయి. విషాదయుతమైన చిరునవ్వుతో మస్లోవా కనిపించింది. తిన్నగా కళ్ళు నులుముకుని చూశాడు బల్లలు, కుర్చీలు కనిపించాయి. పోర్టర్లు, రైలుకోసం కాచుకుని వున్న ప్రయాణీకులు కనిపించారు. తిన్నగా తన ఆలోచనలన్నింటినీ కూడదీసుకుంటున్నాడు నెఖ్లూడో. అక్కడ వున్నవారి దృష్టులన్నీ ద్వారంవేపు ఆకర్షితమైనాయి. నెఖ్లూడో కూడా అటువైపు చూశాడు. ఎవరో కొందరు వోక స్త్రీని వోక కుర్చీలో మోసుకుని వస్తున్నారు. ఆ మోస్తున్న వాళ్ళలో వొకడిని తానిదివరకు చూసినట్టు స్ఫురించింది నెఖ్లూడోకు. వెనకాల వస్తున్న

మరొక వ్యక్తిని కూడా అతను గుర్తించాడు. వాడు వొక దౌవారికుడు. కుర్చీ వెనక వొక పరిచారిక నడిచి వస్తున్నది. ఆమె చేతిలో సంచి, మరి కొన్ని ఏవో పొట్లాలు వున్నాయి. ఆ వెనక కోర్చాగిన్ జమీందారు వస్తున్నాడు మందపాటి పెదవు లతనిని. అతని వెనక మిస్సీ వుంది. ఆమె పక్కనే మిషా వున్నాడు. వాళ్ళ ప్రక్కనే ఆస్టిన్ వున్నాడు. ఆసన్ని నెఖ్లూదోవ్ బాగా యెరుగును ఆస్టిన్ ముక్కు పొడుగ్గా వుంది. మెడ కూడా పొడుగే. హాస్యప్రియుడు. ఏవో గప్పాలు చెబుతున్నాడు. మిస్సీ నవ్వుతూ నవ్వుతూ వస్తున్నది. ఈ అందరి వెనకా డాక్టరు వస్తున్నాడు, కోపంగా సిగరెట్టు దమ్ములు పీలుస్తూ ఇప్పుడే కోర్చాగిన్ వంశీకులు మాస్కో నగరానికి దగ్గరగా వున్న తమ ఎస్టేటునుంచి నిజ్నీకి సమీపంలో వున్న కోర్చాగిన్ దొరసాని చెల్లెలిగారి ఎస్టేటుకు వెడుతున్నారు.

ఆ గుంపు అంతా స్త్రీల వెయిటింగ్ రూములోకి వెళ్ళింది. ప్లాట్ ఫారంమీది జనులు వుత్సుకులై చూస్తున్నారు కోర్చాగిన్ జమీందారు ఫలహారాల శాలలో ఆగిపోయాడు. టేబిల్ వద్ద కూచుని ఫలహారాలు, పానీయాలు తెప్పిస్తున్నాడు మిస్సీ, ఆస్టెన్‌లు కూడా ఫలహారాల శాలలోనే వచ్చి కూచోబోతున్నారు. ఇంతలో పరిచయస్తురాలైన నటాలీ రావటం చూసి ఎదురుగా వెళ్ళారు.

నటాలీతోపాటు అగ్రఫేనా కూడా వచ్చింది. ఇద్దరూ ఫలహారాల శాలలోకి వచ్చి అటూ ఇటూ చూశారు. తన సోదరుడు నెఖ్లూదోవ్ కనిపించాడు నటాలీకి. ఆమె మొదట మిస్సీని పలకరించి వెంటనే సోదరుని దగ్గరకు వెళ్ళింది.

"అమ్మయ్య, దొరికావు చివరికి" అన్నది నటాలీ. నెఖ్లూదోవ్ లేచి మిస్సీని, మిషాను, ఆస్టెన్‌ను పలుకరించాడు. తమ పల్లెటూరులో ఇళ్ళు తగులబడిపోయాయనీ, అందుచేత ఇప్పుడు తన పినతల్లిగారింటికి వెడుతున్నామనీ మిస్సీ చెప్పింది. ఆస్టెన్ ఇళ్ళు కాలిపోవటాన్ని గురించి వొక హాస్యరస గాథ ఆరంభించాడు. ఆ కథ వినటంలో ఆసక్తి చూపక నెఖ్లూదోవ్ అక్కగారి వైపు తిరిగాడు—"నువ్వు వచ్చావు, నాకు చాలా సంతోషం అయింది" అన్నాడు.

"నేను వచ్చి చాలాసేపు అయింది. నాతో కూడా అగ్రఫేనా కూడా వచ్చింది; అదిగో" అని అటువైపు చేత్తో చూపింది. అల్లంతదూరాన నిలుచున్న అగ్రఫేనా మర్యాదపూర్వకంగా నెఖ్లూదోవ్‌కు సలాం చేసింది.

"చాలాసేపటినుంచీ నీ కోసం వెదకుతున్నాం" అన్నది నటాలీ.

"నేనిక్కడ పడి నిద్రపోతున్నాను. నువ్వు రావటం నాకు సంతోషమైంది. నీకు ఉత్తరం రాద్దామని ఆరంభించాను కూడా."

"నిజంగానా? ఏమని?"—నటాలీ కొంచెం విచలితయై అడిగింది.

అక్కా తమ్ముళ్ళ మధ్య ఏదో సన్నిహితవిషయాలు చర్చకు రాబోతున్నాయని తెలుసుకుని మిస్సీ, ఆస్టిన్ అక్కడినుంచి లేచి వెళ్లిపోయారు; అక్కా తమ్ముళ్ళు కిటికీవద్ద వున్న సోఫాలో ఆసీనులైనారు.

"నిన్న అంత జరిగిన తరువాత వొకసారి వచ్చి నా పశ్చాత్తాపాన్ని మీ ముందు తెలుపుదామనుకున్నాను—కాని నీ భర్త ఎలా స్వీకరిస్తాడో నాకు బోధపడలేదు—నీ భర్తతో కొంచెం తొందరపడి మాటాడేను. అది నాకు కష్టంగానే వుంది" అన్నాడు నెఖ్లూదోవ్.

"నువ్వు అలా మాటాడినావుగాని, కోపం తెప్పించాలన్న ఉద్దేశం లేదు నీకు, నాకు తెలుసు" అన్నది నటాలీ. ఆమె కన్నులవెంట అశ్రువులు జారాయి.

ఆమె ప్రదర్శించిన భావానికి నెఖ్లూదోవ్ మెత్తబడ్డాడు. ఆమెకు భర్త మీద అభిమానం వుంది. భర్త అధీనంలో నలిగిపోయిన మనిషే. అయినా ఆమెకు తమ్ముని మీద ఆపేక్ష లేకపోలేదు. తమ్మునితో అభిప్రాయభేదం వచ్చినప్పుడు ఆమె హృదయం బాధపడుతుంది.

నెఖ్లూదోవ్ విషయం మార్చాడు. "ఇవాళ ఎంతఘోరం చూచాననుకున్నావు. మహాఘోరం, ఇద్దరు ఖయిదీలు చనిపోయారు."

"చనిపోయారా? ఏం? ఎందువల్ల?"

"ఔను, చనిపోయారు. వాళ్లను ఇంత ఎండలో బయటకు తోలుకొచ్చారాయెను. ఇద్దరు వడదెబ్బ తగిలి చచ్చిపోయారు."

"అసంభవం? ఎప్పుడు? ఇవాళే!"

"ఔను, ఇంతకుముందే, రెండుకేవాళ్ళీ నేను కళ్లారా చూచాను."

"ఎవరు చంపారంటావు ?"

"ఇంత యెండలో వాళ్లను స్టేషనుకి తీసుకొచ్చినవాళ్లే. ఇంకెవరు ?" అన్నాడు నెహ్లూడొ కొంచెం తీక్ష్ణంగా—ఈ విషయాన్నికూడా ఆమె తన భర్తను గల దృక్పథంలోనే చూస్తున్నదని భావిస్తూ.

"అయ్యో, పాపం !" అంటూ ముందుకువచ్చింది అగ్రఫేనా జాలి ప్రదర్శిస్తూ.

"ఔను; ఈ అభాగ్యులకు ఎంత అన్యాయం జరుగుతోందో మనకు తెలియాలి. తెలుసుకోవాలి" అని పలికి నెహ్లూడొ కోర్చగిన్ మిలిందారు వైపు చూచాడు. కోర్చగిన్ అదే సమయాన నెహ్లూడొ మాటలు విని అతని కేసి చూశాడు—టేబిల్ మీది పానీయపు పాత్ర నోటికెత్తుకోబోతున్నవాడు.

"నెహ్లూడొ ! నువ్వుకూడా వచ్చి నాతోపాటు కాస్త ఫలహారం అదీ పుచ్చుకుంటువు గానిరా; ఒక దీర్ఘప్రయాణం చేయబోతున్నాం. ముందుగా కాస్త పొట్టలో ఏదో పడవేయటం మంచిది" అన్నాడు. నెహ్లూడొ అందుకు అంగీకరించలేదు. నటాలీ వైపు తిరిగాడు.

"అయితే నువ్వు ఇప్పుడేమి చేయబోతున్నావు?" నటాలీ అడిగింది.

"చేయగలిగింది చేస్తాను. ఏమి చేయాలో సరిగా తోచటంలేదు. కాని ఏదో చేయాలి; తప్పదు."

"సరే అర్థం అయింది. అయితే మరి, ఆమె సంగతి ఏమిటి ? అంతా నిశ్చయం అయినట్టేనా ?" అని అడుగుతూ నటాలీ ఒక చిరునవ్వు విసిరి అటు కోర్చగిన్ వైపుకూడా చూచింది. "నిస్సంకోచంగా నిశ్చయమైపోయి నట్టే" అన్నాడు నెహ్లూడొ.

"నాకేమిటో విచారంగా ఉంది. ఆమె అంటే నాకు ఇష్టమే. కాని నీ జీవితాన్ని ఆమెతో బంధించుకుంటావెందుకు ? నువ్వుకూడా ఆమెతో వెళ్ళటం దేనికి ?" అని అడిగింది నటాలీ భయం భయంగా.

"వెళ్ళాలిసిందే కనుక వెళుతున్నాను" అని క్లుప్తంగా జవాబు చెప్పేసి మౌనంగా ఉండిపోయాడు నెహ్లూదొవ్. కాని వెంటనే తన మౌనానికి తానే సిగ్గుపడ్డాడు. తన సొంత అక్కయ్యకు తన హృదయాన్ని యథావత్తూ విప్పి ఎందుకు చెప్పకూడదు? చాలా కాలనుంచీ తమ వంశంలో విశ్వాసంతో ఉంటూన్న పరిచారిక అగ్రఫేనాకూడా తన మనోనిశ్చయాన్ని వింటే తప్పేముంది? ఇలా భావించి నెహ్లూదొవ్ తనమౌనాన్ని భంగం చేసుకుని చెప్పాడు"—

"నేను మస్లోవాను పెండ్లిచేసుకోబోతున్న విషయాన్ని గురించి కదూ నువ్వు అడుగుతున్నావు! ఔను అలాగే నిశ్చయం చేసుకున్నాను నేను. కాని ఆమెమాత్రం గట్టిగా నిరాకరిస్తోంది" నెహ్లూదొవ్ గొంతు వణికింది. ఈ విషయం ప్రసంగించినప్పుడెల్లా అతనికి అంతే. ఆమె నాయీ త్యాగాన్ని అంగీకరించటంలేదు. ఆమెయే తనను మించిన త్యాగాన్ని చేయబోతోంది. అది నాకు ఇష్టంలేదు. అందుకనే ఆమెతోపాటే వెళ్ళిపోతున్నాను. ఆమె ఉన్నచోటనే నేనూ వుంటాను. ఆమె దుఃఖాన్ని తగ్గించేందుకు ప్రయత్నిస్తూ ఉంటాను."

నటాలీ ఏమీ మాట్లాడలేదు. అగ్రఫేనా ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూచింది. ఇంతలో...ఇంతకుముందే అటువేపు ముందుకు వెళ్ళిపోయిన వారంతా తిరిగి వచ్చేస్తున్నారు—ఆ దౌవారికుడు, కోర్చగీనా దొరసాని మొదలైనవారంతా. కోర్చగీనా రాకుమార్తె తన్ను కుర్చీలో మోసుకొస్తున్నవారిని ఆగమని, నెహ్లూదోవ్‌కు సైగచేసింది దగ్గరకు రమ్మని.

నెహ్లూదోవ్‌తో ప్రసంగించిన సందర్భంలో "ఘోరంగా ఉంది ఇక్కడి వేడిమి. నేను నిలువలేకపోతున్నాను. ఈ వాతావరణం నా ప్రాణం తీసేస్తోంది" అంటూ పలికి, రష్యాదేశపు శీతోష్ణస్థితిలోని దౌర్జన్యాన్ని ఉపన్యసించి, తమ్ము ఒకసారి వచ్చి చూచి పోవలసినదిగా నెహ్లూదోవ్‌ను కోరి, సాగిపోయింది.

బోయీలు మోసుకుపోతున్న కుర్చీలోనుంచే వెనక్కి ఒకసారితిరిగి—"మరచిపోకుండా మా వూరు ఒకసారి రావాలి సుమీ!" అని కేకవేసింది.

వాళ్లు ఆమెను కుడిచేతివైపుగా మొదటిక్లాసు పెట్టెలు వుండే చోటుకు తీసుకుపోయారు. నెహ్లూదొవ్ ఎడమచేతివైపుకు తిరిగాడు. అతని

వెంట ఒక సంచీ పుచ్చుకుని టారస్ వున్నాడు. ఒక పోర్టరు నెఖ్లూడో సామాను మోస్తున్నాడు.

"ఇతడు నా అనుచరుడు" అంటూ నెఖ్లూడో టారస్‌ను చూపించాడు తన అక్కకు. అతని గాథ ఆమెకు ఇదివరకు చెప్పి ఉన్నాడు.

నెఖ్లూడో ఒక మూడవ తరగతి పెట్టె ముందు ఆగాడు. పోర్టరు అతని సామాను ఆ పెట్టెలో పెడుతున్నాడు. "మూడో తరగతి పెట్టెలో ప్రయాణం చేస్తావా?" సాశ్చర్యంగా అడిగింది నటాలీ.

"ఔను. అదే నా కిష్టం. టారస్‌తో కూడా వెడుతున్నాను కదా! సరేగాని ఒక సంగతి. ఇంతవరకు కుస్మిన్‌స్కీలో భూమిని నేను రైతులకు ఇచ్చివేయలేదు. కనుక ఒకవేళ నేను చనిపోయేట్టయితే ఆ భూమి నీ పిల్లలకే సంక్రమిస్తుంది."

"అవేం మాటలు? ఊరుకో."

"ఒకవేళ నేను బ్రతికి ఉండగానే దాన్ని రైతులకు ఇచ్చివేయటం జరిగితే నా మిగిలియున్న సమస్తమూ నీ పిల్లలకే పోతుంది, నేను పెండ్లి అంటూ చేసుకోవటం సంభవం కాదు కనుక. ఒకవేళ నేను పెళ్ళి చేసుకున్నా నాకు పిల్లలు పుట్టరు కాబట్టి—"

"అలాంటి మాటలు మాట్లాడకు" అన్నది నటాలీ. కాని ఆ మాటలకు ఆమె లోలోన సంతోషిస్తున్నదని నెఖ్లూడో అనుకున్నాడు.

ఆ పైన మొదటి తరగతి పెట్టెలో కోర్చాగిన్ దొరసానిని ఎక్కించారు. ఆమెను సాగనంప వచ్చినవారంతా పెట్టె ముందు గుంపుగా కూడి ఉన్నారు. ప్రయాణీకులంతా రైల్లో ఎక్కి ఉన్నారు. ఆలస్యంగా వచ్చిన వాళ్ళు ప్లాటుఫారం మీద గబగబా నడుస్తూ వస్తున్నారు. గార్డు తెరచివున్న తలుపులు మూసేస్తున్నాడు.

నెఖ్లూడో పెట్టెలోకి ఎక్కాడు. జనసమ్మర్దం చేత లోపల వెచ్చగా ఉంది. మళ్ళీ క్రిందికి దిగాడు. అగ్రఫేనా పెట్రోవ్నాకు పక్కగా నిల్చున్న నటాలీ తమ్ముడితో ఏదో మాట్లాడాలని ప్రయత్నం చేస్తున్నది.

'ఉత్తరాలు రాస్తుండు సుమీ!' అని ఒక బంధువు దూరదేశం వెడుతూ ఉన్నప్పుడు ప్రతివాళ్ళు చెప్పేమాట. ఆ మాటైనా పలుకలేకపోయింది

నటాలీ, ఆస్తి పాస్తులను గురించి వచ్చిన మాటలన్నీ ఆ ఇద్దరి సన్నిహి సహజంగా పెంచిన ఏకోదర ప్రేమ భగ్నం అయినట్టు తారాడాయి. నెఖ్లూడోవ్ బండిలో ఎక్కాడు. బండి కదిలింది. నటాలీ "కొంటూరాం త్రెయ్మెనా" అని మాత్రం పలికి హృదయభారం తగ్గించుకుంది.

రైలు కదిలిపోయిన తర్వాత... తమ్ముడితో తనకు సంభవించిన సంభాషణను తన భర్తకు ఎలా చెబుదామా అని ఆలోచించింది. ఆమెకేమీ పాలు పోలేదు. ముఖం గంభీర ముద్ర వహించింది. హృదయం ఉబ్బి బరువెక్కింది.

నెఖ్లూడోవ్ తన అక్క యెడల సహజంగా ప్రేమ ఉంది. తన హృదయగతం గూర్చి వస్తూ ఆమెకు విప్పి చెప్పాడు. అయినా ఇప్పుడామెను విడచి దాటిపోయిన తర్వాత హృదయశాంతిని పొందాడు. ఆమె తన సమక్షంలో వున్నంతసేపూ భావాసహ్యతనే అనుభవించాడు. ఇప్పుడు హాయిగా ఉంది. ఒకప్పుడు తానెంతగానో ప్రేమించిన అక్క ఇప్పుడు లేదు. ఆనాటి అక్కగారి స్థానే ఇప్పుడు వొంటినిండా వెంట్రుకలుగల ఒక అసహ్య వ్యక్తి బానిస ఉంది. తన ఆస్తి ఆమె పిల్లలకు చెందగలదులే అని తాను చెప్పినమాట ఆమె మొగుడికి శ్రవణానందంగా ఉంటుంది. ఆమె ముఖం కూడా ఆ మాట విన్నప్పుడు వికసించింది. ఆ వికాసం చూసినప్పటినుంచీ నెఖ్లూడోవ్ విచారంగానే ఉంది.

## ౪౦

రైలు పెట్టెలో వేడి యెక్కువగా ఉంది. తలుపు తెరచివుంచి అక్కడే ద్వారం ముందు నిల్చున్నాడు నెఖ్లూడోవ్. రైలు పొలిమేరదాటి బయలులో ప్రవేశించిన తరువాత గాలి తెరగలు రాసాగాయి. కాస్త హాయి అనిపించింది.

"ఔను, చంపేశారు" అన్న మాటలు తనలో తాను మననం చేసుకున్నాడు. చనిపోయిన రెండవ ఖైదీ ముఖం చాలా అందంగా వుంది. పెదవుల మీద చిరునవ్వు వుంది. కనుబొమ్మలు గంభీర భావవ్యక్తి కాలుగా వున్నాయి. నెఖ్లూడోవ్‌కు ఇవన్నీ భావ వీధులలో కిల్లల కట్టినట్టుగా వున్నాయి.

"వాడిని హత్య చేశారు కాని ఎవరు హత్య చేశారో మాత్రం తెలియదు. ఇదే మహా ఘోరం. సరిగా ఖైదీలకు మల్లేనే అధికారులు కూడా జాగ్రత్తలు తీసుకొంటున్నారు. జైలు అధికారి తన డ్యూటీ ప్రకారం ఆజ్ఞ జారీ చేశాడు. డాక్టరు పరీక్ష చేశాడు. అయితే ఎండ ఎక్కువౌతుందని, అంత ప్రమాదకర ఎండలోనే ఖైదీలను తోలుకుపోతారనీ అతనికేం తెలుస్తుంది. ఒక జైలు ఇన్స్పెక్టరు తనకు వచ్చిన తాఖీదుల ప్రకారం ఎంతమంది ఖైదీలను పంపించాలో అంతమందినీ లెక్కవేశాడు. బైటికి పంపించేశాడు. ఖైదీలను సైబీరియాకు తీసుకుపోవలసిన అధికారి తనకుగల ఆజ్ఞలను పాటించాడు. దారిలో ఇలాగ ఇద్దరు చచ్చిపోనున్నారని అతడు మాత్రం కలగన్నాడా యేమిటి? కనుక అతనిదీ తప్పు కనిపించదు. ఇంతకూ వీళ్ళచేతనే ఆ ఇద్దరూ హతులైనారు. హత్యానేరంమాత్రం వాళ్ళది కాదు.

వీళ్ళే గనక ఆయావుద్యోగాల్లో లేకపోయినట్లయితే ఆ ఖైదీలను ఈ గాడ్పులలో బైటికి తీసుకురావటానికి కనీసం తటపటాయించేవాళ్ళే. ముందు సాగ్ర ఆలోచించివుండేవాళ్ళే. ఒకవేళ అలా బైటికి తీసుకువచ్చినా... ఒకరిద్దరు చచ్చిపోయినప్పుడు మానవసహజమైన జాలి ప్రకటించివుండేవాళ్ళే. కాని ఆ ఉద్యోగాల్లో ఉన్న కారణాన మానవుడు సహజంగా తోటిమానవులయెడ చూపవలసిన సాధారణ దయాదాక్షిణ్యాలను ఒక్కొక్కప్పుడు చూపనక్కరలేదని భావిస్తూవున్నారు. అందుచేత ఖైదీలను దారిలో ఎక్కడా విశ్రాంతి తీసుకోనీయలేదు. ఇంకెవర్నీ కూడా వాళ్ళయెడ జాలిపడనీయలేదు; ఏవిధమైన సాయమూ చేయనీయలేదు. ఎందుచేత? హృదయసహజమైన దయాదాక్షిణ్యాలకన్నా తమతమ ఉద్యోగవిధులే వాళ్ళకు ముఖ్యమైనవి. "ఎటువంటి పరిస్థితులలోనైనా సరే... ఒక్క అరగంటసేపు మాత్రమైనా సరే... తోటిమానవులయెడ చూపవలసిన ప్రేమకంటే ఉత్కృష్టమైనది మరేదో ఒకటున్నదని భావించామంటే—ఇకచాలు—ఎన్ని దౌష్ట్యాలైనా నిర్ఘాటంగా చేయగలం. పాపం చేస్తున్నామే అన్న నొప్పికూడా కలగదు."

ఇలాంటి ఆలోచనలలో మునిగిపోయి, నెఖ్లూదోవ్ వాతావరణంలో జరిగిన మార్పునుకూడా గమనించలేదు. సూర్యబింబాన్ని ఒక పలుచని మబ్బు కప్పేసింది. పశ్చిమభాగాన ఒక దట్టమైన నల్లనిమబ్బుపట్టి కన్పించింది. అటు వేపు దూరాన వర్షంకూడా పడుతూనేవుంది. నీటియావిరితో కూడిన గాలి

తరగలు లేస్తున్నాయి. అడపా తడపా మెరుగు తీగలతో మేఘం [illegible]పోతున్నట్టుంది. ఉరుములు రైలునోటిలతో శృతి గలుపుతున్నాయి. [illegible] మబ్బు [illegible]లికి [illegible]సుకుని వస్తోంది. గాలికి వాలుగా వచ్చిపడుతున్నాయి కొన్ని జల్లు చినుకులు ద్వారందగ్గర నిల్చున్న సెస్లాడో కోటుమీద. అతను కాస్త సర్దుకుని నిల్చున్నాడు. పృథివి తడిసిన సుగంధాన్ని [illegible]కొస్తున్న గాలి యాలలను ఆఘ్రాణిస్తూ—పొలాలను, తోటలను చూస్తున్నాడు. ప్రకృతి అంతా క్రొత్త పూతలను సవరించుకున్నట్టున్నది. పచ్చనిది మరింత పచ్చగా; పసుపుది మరింత పసుపుగా, నల్లనిది మరింత నల్లగా ఉన్నాయి.

వానజల్లులో ఒకనూతన వికాసాన్ని పుణికిపుచ్చుకున్న తోటల్ని, పొలాల్ని చూసినప్పుడు సెస్లాడో హృదయం ఆనందతరంగితం అయింది. జల్లు ఎంతోసేపు పడలేదు. మేఘం రెండుపాయలుగా విచ్చిపోయింది. ఒకటి ప్రక్కగా సాగిపోయింది. మరొకటి సూటిగా దాటిపోయింది. వేగం తగ్గి వాన చినుకులు కొద్దికొద్దిగా చిటపటలు చేస్తూపడుతున్నాయి – మళ్ళీ సూర్యబింబం కనిపించింది. అంతా ప్రకాశవంతంగా వుంది. తూర్పువైపు ఆకాశాన ఒక పెద్ద ఇంద్రధనుస్సు వెలుగుతోంది.

సెస్లాడో తాను ఇంతసేపటినుంచీ ఆలోచిస్తున్న విషయాన్ని తాత్కాలికంగా విస్మరించాడు. మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఇన్‌స్పెక్టరు, జైలు అధికారి – మొదలైనవాళ్ళంతా మామూలుగా హృదయంగల మనుష్యులే. కాని [illegible]ల్లో వున్న కారణంచేత క్రూరంగా ప్రవర్తించవలసి వస్తోంది. ఈ [illegible] ఆలోచనల సారాంశాన్ని దృష్టికి తెచ్చుకున్నాడు.

[illegible] జరుగుతున్నదీ జైలు అధికార్లు చెప్ప నిరాకరించారు. ఇన్‌స్పెక్టర్ [illegible]గా జవాబు చెప్పాడు-ఒక అధికారి—పాపం ఖైదీలను బం[illegible] [illegible] చోటానికి అనుమతి ఈయలేదు. నిండుచూలాలు ఒకతె వున్నదని [illegible] గుర్తించనే లేదు. "అయ్యో అధికారాలలో ఉన్న[illegible] [illegible] మానవ సహజములైన దయాదాక్షిణ్యాది గుణాలు వాళ్ళల్లో [illegible]. రాతి నేలపై వానచినుకులు ఇనికిపోవు– దయా, జాలి వాళ్ళ [illegible] చొరవు—" అని అనుకుంటూ సెస్లాడో అక్కడ చప్టాచేసియుండిన నేలవైపు చూచాడు. దానిమీద వాననీళ్ళు కాలువకట్టి

జరుగుతూ ప్రవహిస్తున్నాయి. ఒక్కొక్కసారి ఘోరాలలో [illegible] [illegible] [illegible] [illegible] కొన్ని పోస్టు చెయ్యాల్సిరావటం అవసరమైతే [illegible] కాని సమర్థంగా చెయ్యగలిగేవి పెంపొందవలసినవాళ్ళు ఎలా [illegible] [illegible] విచారకరం."

"మనుష్యుల విషయంలో కూడా అంతే. ఈ అధికారులంతా అవసరమైతే [illegible] కావచ్చు. కాని మానవునికి ప్రధానంగా ఉండవలసిన జాలి, దయ, సానుభూతి—ఇత్యాది గుణాలు లేకపోవటం ఘోరాతిఘోరం. ఈ అధికారులు మహా అన్యాయమైనదానిని న్యాయమని అంగీకరించగలరు. భగవంతుడు సర్వహృదయాల్లోనూ రాసిపెట్టివుంచిన శాశ్వతసత్యాన్ని సత్యంగా అంగీకరించలేరు. ఇది మిక్కిలి విచిత్రం! అందుచేతనే వాళ్ళ సమక్షంలో వున్నప్పుడు నాకు నిరుత్సాహంగా ఉంటుంది; భయంగొల్తుంది. నిజంగా వాళ్ళు చాలా భయంకరులు! దోపిడిదొంగలకన్నా భయంకరులు! ఒక్కొక్కప్పుడు దొంగవాడికైనా జాలి కలగవచ్చు; వీళ్ళకు మాత్రం కలగదు. రాతి నేలమీద మొక్కలు మొలవవు. వీళ్ల హృదయాల్లో జాలి ఉత్పన్నం కాదు. కనుకనే అంత భయంకరంగా ఉంటారు వాళ్ళు. రాక్షసులకన్నా, పిశాచాలకన్నా వేయిరెట్లు క్రూరులు వాళ్ళు!

"సాధుసజ్జనుల చేత, దయాదాక్షిణ్యమంతుల చేత నిస్సంకోచంగా భయంకరదౌర్జన్యాలను చేయించటం ఎలాగ అనే మనోవైజ్ఞానిక సమస్య వస్తే, దానికి పరిష్కారమార్గం ఒకే ఒకటి వుంది: గవర్నర్లుగా, ఇన్స్పెక్టర్లుగా, పోలీసు అధికారులుగా నియమించేసెయ్యాలి - గవర్నమెంటు సర్వీసు అనే ఒకరకమైన వ్యాపారం వుంది; మానవుడు తోటిమానవుల్ని సోదరులుగా గాక, అచేతనవస్తువులుగా సమాదరించగల హక్కును ఈ వ్యాపారం ఇస్తుంది అని వాళ్ళకు నచ్చచెప్పాలి—వాళ్ళు చేసేపనుల ఫలితాలు ఏ ఒక్కరిమీదా వ్యక్తిగతంగా పడకుండా ఈ గవర్నమెంటు సర్వీసు అనేది వాళ్ళవాళ్ళ అధికారాల్ని పరస్పరాధారితాలుగా చెయ్యాలి - ఇటువంటి పరిస్థితులే లేకపోతే ఈనాడు నేను చూసినటువంటి ఘోరాలు జరగటానికి ఆస్కారం లేదు. 'తోటి మానవులపట్లనైనాసరే దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రవర్తించాల్సిన సమయాలు ఉన్నాయి' అనే తప్పటూహ వల్లనే ఇటువంటి అన్యాయాలు జరుగుతున్నాయి. నిజానికి అటువంటి సమయాలు ఉండవు.

అచేతన పదార్థాలపట్ల ప్రేమ లేకుండా వ్యవహరిస్తాం. చెట్లను నరికేస్తాం, ఇటుకల్ని కాలుస్తాం, ఇనుమును కాల్చి సమ్మెటతో కొడతాం, కాని తోటి మానవులతో ప్రేమ రహితంగా వ్యవహరించలేము. తేనెటీగలతో వ్యవహరించినప్పుడు జాగ్రత్తగా ఉంటాం, జాగ్రత్తగా ఉండకపోతే అపాయం కలుగుతుంది. మనుష్యులతో వ్యవహారం చేసేటప్పుడూ అంతే. మానవ జీవితంలోని ప్రాతిపదిక సూత్రం పరస్పర ప్రేమ. ఒకని చేత బలవంతాన మనకిష్ట పని చేయించుకోగలం. అట్లే బలవంతాన ఒకణ్ణి మనల్ని ప్రేమించేలాగ చేసుకోలేము. ముఖ్యంగా అతని వద్దనుంచి ఒక ప్రయోజనాన్ని ఆశించేటప్పుడు, లేదా శాసించేటప్పుడు అతని ప్రేమను పొందలేము. నువ్వు ప్రేమించలేకపోతే గమ్మున ఒక చోట కూచో; నీకు కావలసిన వస్తువుల్ని పెట్టుకుని ఒంటరిగానే కాలక్షేపం చెయ్యి. మనుష్యుల్లోకి రాకు. ఆకలి వేసినప్పుడే భోజనం చేయగలుగుతావు. ప్రేమించినప్పుడే మానవులతో ప్రయోజనాత్మకంగా వ్యవహరించగలుగుతావు. నిన్న నేను నా బావగారి పట్ల వ్యవహరించినట్టే నువ్వు నీ తోటి మానవులతో ప్రేమ లేకుండా వ్యవహరించు; నీవు కొని తెచ్చుకునే బాధలకు అంతం ఉండదు. ఔను, అది సత్యం. ముమ్మాటికీ సత్యం."

మధ్యాహ్నపు ఎండ తాపం తగ్గి ఇప్పుడు చాలా హాయిగా ఉంది. చిరకాలంగా తన్ను వేధిస్తోన్న ఒక సమస్య విడిపోయినట్టుగా సంతోషించాడు నెఖ్లూడో.

## ౪౧

నెఖ్లూడో ఎక్కిన పెట్టెలో సగంవరకూ జనం ఉన్నారు. నౌకర్లు, కూలీలు, ఫాక్టరీ పనివాళ్ళు, యూదులు, వర్తకులు, కూలీల భార్యలు, ఒక సైనికుడు, ఇద్దరు స్త్రీలు (ఒకతె యువతి, మరొకతె వృద్ధ; మెళ్లో హారాలు, చేతులకు దండకడియాలు ఉన్నాయి), నల్లటి టోపీ పెట్టుకుని గంభీర వదనుడైన ఒక పెద్దమనిషి–చాలామంది ఉన్నారు. సామాన్లు సర్దుకునే గొడవ అణగిపోయింది ఎప్పుడో. ఇప్పుడంతా శాంతంగా కూచున్నారు. కొందరు ఏవో ఫలహారాలు చేస్తున్నారు; కొందరు బాతాఖానీ వేశారు; కొందరు పొగ పీలుస్తున్నారు.

టూరిస్ కుడివైపు కిటికీదగ్గర పక్కనే నెక్లూడోవ్ చోటు ఇద్దరి పెట్టి కూచున్నారు. ఎదురుగా కూచున్న ఒక లావుపాటి వ్యక్తితో ఉత్సాహంగా సంభాషిస్తూ ఉన్నాడు. ఆ లావుపాటి వ్యక్తి ఒక తోటమాలి అని నెక్లూడోవ్‌కు తరువాత తెలిసింది. టాటస్ పక్కన ఉన్న సీటు దగ్గరకు పోతూ మధ్యలో ఆగాడు నెక్లూడోవ్. అక్కడ గడ్డం కూడా నెరిసిపోయిన ఒక ముసలివాడు ఒక యువతితో మాటాడుతున్నాడు. ఆ యువతి మామూలు రైతు కుటుంబాల్లో ధరించే దుస్తుల్లో ఉంది. ఆమె పక్కనే ఒక ఏడేళ్ళ బాలిక అస్తమానం రేగుపళ్ళు తింటూ ఉంది. ఆ పిల్ల జుట్టు చాలా అందంగా ఉంది. తలకొక చిన్న రుమాలు చుట్టుకుంది. రైతు బాలికలు ధరించే ఫ్రాక్ తొడుక్కుంది.

ముసలివాడు నెక్లూడోవ్‌ను చూశాడు. వెంటనే కాస్త పక్కకు జరిగి, స్నేహపూర్వకంగా అన్నాడు: "దయచేయండి, కూర్చోండి" నెక్లూడోవ్ కూచున్న తరువాత ఆ యువతి...ముసలివానితో మళ్ళీ ప్రసంగం సాగించింది. ఆమె ఇప్పుడు తన తండ్రిగారి గ్రామం వెళుతోంది. భర్త పట్నంలో ఉన్నాడు. ఆయనకోసం తాను పట్నం వెళ్ళినప్పుడు తన్ను ఎలా ఆదరించాడో ఆమె చెబుతోంది.

"మొన్ననే వెళ్ళి కొన్నాళ్లుండి వస్తున్నాను. మళ్ళీ వొచ్చే పండక్కు వెడతానేమో!"

"ఔను, అలా వెళ్ళివస్తూ ఉండటం చాలా మంచిది. లేకపోతే యువకుడు పట్నంలో వుండి చెడిపోటానికి అవకాశాలు ఉన్నాయి" అన్నాడు ముసలయ్య నెక్లూడోవ్ వైపు చూస్తూ.

"లేదులెండి; మా ఆయన అటువంటివాడు కాదు. ఈ పాడు వ్యవహారాలేమీ లేవు ఆయన దగ్గర. పసిపాపలాంటి పిల్లలాంటి నిర్మల మూర్తి. యీ పిల్లను చూస్తే ఆయనకెంత సంతోషం అనుకున్నారు! చాలా ఆనందపడతాడు" అని ఆమె నవ్వుతూ చెప్పింది.

రేగుపళ్ళు తింటూ, విత్తులు వుమ్మివేస్తూ తన తల్లి చెబుతూన్న మాటల్ని వింటూ వుంది, ఆమె చెప్పిందంతా సత్యమేనని స్థిరీకరిస్తున్నట్టుగా ఆ పిల్ల, నెక్లూడోవ్‌కేసి, ముసలతనికేసి తెలివైన కళ్ళెత్తి చూచింది.

"అంత బుద్ధిమంతుడైతే ఇంకేం?" అన్నాడా ముసలాయన. "మీవంటి వ్యక్తులుగల దేశమే సంపన్నమౌతుంది!" అన్నాడా చివరి సీటులో కూర్చున్న కూలి దంపతులవైపు చూస్తూ. మొగుడు మూతనెత్తి, వెనక్కి వాల్చి, గొంతులో పోస్తున్నాడు సారాబుడ్డి యెత్తిపుచ్చుకుని. సారాబుడ్డి వున్న పెట్టె పుచ్చుకుని...మొగుడికేసి చూస్తోంది భార్య.

"ఎక్కడ, మా ఆయన తాగడు; సిగరెట్టు కూడా కాల్చడు" అన్నదా యువతి ఒకసారి తన భర్తను పొగడుకునే అవకాశం లభించినందుకు సంతోషిస్తూ. "మా ఆయనలాంటివాళ్ళు ప్రపంచంలో చాలా కొద్దిమంది మాత్రమే ఉంటారు కదూ?" అని నెహ్రూజీవైపు చూచి "ఇదిగో వీరిలాగే ఉంటారు మా ఆయన" అన్నది.

అక్కడే ఆ ఫ్లాస్కులో కూలీ సగం సీసా ఖాళీ చేశాడు. మిగిలింది భార్యను తాగమని ఇచ్చేశాడు. ఆమె నవ్వుతూ సీసా అందుకుని తాగేస్తోంది. ముసలయ్య, నెహ్రూజీ వాళ్ళకేసి చూస్తున్నారు. తమకేసి చూస్తున్నారని తెలుసుకుని ఆ కూలివాడు వాళ్ళను ఉద్దేశించి ఇలా అన్నాడు: "ఏం బాబులూ! నేను తాగుతున్నాననా? మేము రోజూ ఎంతెంత పని చెయ్యాల్సి ఉందో ఎవరూ చూడరు. మేము ఎలా తాగుతున్నామో మాత్రం అందరూ చూసేవాళ్ళే. నేను సంపాదించుకున్న డబ్బు, నే నే తాగుతున్నాను. నా భార్యను సంతోషపెడుతున్నాను-ఇంకెవర్నీ కాదు."

"ఔనౌను" అన్నాడు నెహ్రూజీ సమాధానం తోచక.

"నిజమే బాబూ! నా భార్య చలచిత్తంలేని మనిషి. దానితోనే నాకు తృప్తి. నే నంటే దానికిష్టం—ఔను కాదేమారా!"

"ఊఁ. ఇక నువ్వే తీసుకో. నా కక్కర్లేదు" అంటూ అతని భార్య సీసా ఇచ్చేసింది. "ఏమిటి అలా వాగుతున్నావ్" అని అడిగింది.

"లే. ఇలాగే. చాలామంచిది. ఎంత మంచి దనుకున్నారు. యిక చూడండి: ఇరుసులో నూనె వెయ్యని చక్రంలా ఎలా కీచులాడుతోందో! ఔను కాదుటే మారా!"

మారా నవ్వింది. తాగిన మత్తులో తూలసాగింది.

కూలివాడికి కళ్ళు మూతపడి పోతున్నాయి. మత్తు ఎక్కువైంది.

"నా కష్టాల కథే చెబుతున్నాను. హృదయంగల స్నేహితుడు దొరికాడు. అతని ముందు వెళ్ళబోసుకుంటున్నాను" అన్నాడు టిగారస్ నెస్లాడో వైపు చూస్తూ.

"ఓహో, అలాగా!"

"విషం పెట్టిన సంగతి ఎలా తెలిసిందంటే—ఆ రొట్టె పుచ్చుకుని మా అమ్మ పోలీస్ స్టేషన్‌కు వెడతానని బయలుదేరింది. మా నాన్న ముసలివాడు, న్యాయస్థుడు. 'కాస్త ఆగు. ఆ పిల్ల చిన్నది. తెలీక చేసింది. మనం దాన్ని క్షమించాలి. క్రమేణా బుద్ధి వస్తుందిలే' అన్నాడు. కాని మా అమ్మ వినలేదు. 'ఈ పిల్లను ఇంకా ఇంట్లో అట్టిపెట్టుకుంటే మనందర్నీ కూడా చంపేస్తుంది' అని పోలీసుస్టేషనుకు వెళ్ళింది. ఇంకేముంది? వెంటనే పోలీసు ఉద్యోగి వచ్చి మీద పడ్డాడు."

"మరి నీ సంగతేమైంది" తోటుమాలి అడిగాడు.

"నేనా? నేను కడుపులో చెప్పరాని బాధతో మెలికలు తిరిగి పోతున్నాను. మాటాడలేను. మా నాన్నే బండి కట్టుకొని నన్నూ మోడిసియానూ పోలీసు స్టేషనుకు తీసుకుపోయాడు. అక్కడినుంచి మేజిస్ట్రేటు దగ్గరకు వెళ్ళారు. అక్కడ ఆమె అంతా ఒప్పుకుంది. మొదటినుంచీ ఒప్పుకుంటూనే ఉందిగా! తనెక్కడ పాషాణం తీసుకొచ్చిందీ, ఎలా రొట్టె తయారుచేసిందీ అంతా చెప్పేసింది. 'ఎందుకు చేశావు అటువంటి పని?' అని మేజస్ట్రేటు అడిగాడు. 'ఎందుకా? అతడంటే నాకు అసహ్యం. అతనితో—అంటే నాతో నన్న మాట—కాపురం చేయటం కంటే సైబీరియాకు పోయినా నా కిష్టమే' అని జవాబు చెప్పిందామె.

"అలాగ అంతా ఒప్పుకుంది. తరువాత మా నాన్న ఒక్కడే ఇంటికి వచ్చాడు. కోతల సమయం వచ్చింది. ఇంటి దగ్గర మా అమ్మ ఒక్కతే. ఆమె అయినా బలమైన మనిషి కాదు. ఏం చెయ్యాలి? ఆలోచించాం. పోనీ బేలుమీద ఆమెను విడిపించుకు రాకూడదూ? అనుకున్నాం. అప్పుడు మా నాన్న వెళ్ళాడు ఒక ఆఫీసరు దగ్గరికి. 'ఊహుఁ పో' అన్నాడాయన. మరో ఆఫీసరును బతిమాలాడు. ఇలా అయిదుగుర్ని బతిమాలాడు. ఇక లాభంలేదు, ఈ ప్రయత్నం విరమిద్దామని కూడా అనుకున్నాం.

చివరకొక గుమాస్తా తటస్థపడ్డాడు. అటువంటి జీతాలమారి మనిషిని ఎక్కడా విని ఎరగను. "నాకు అయిదు రూపాయలివ్వండి. పని చేసి పెడతాను" అన్నాడు. చివరకు మూడు రూపాయలకు ఒప్పుకున్నాడు. అప్పుడు నేను నీయొడిగిరియా అల్లిన 'లినెన్ అల్లిక' తీసుకుపోయి, కుదువ పెట్టి డబ్బు తెచ్చి ఇచ్చాను. అతడేదో కాగితం రాశాడు. మూడు నెలలనాటి పని అయిపోయింది.

"నే నామెను ఇంటికి తీసుకురావటానికి ఆ కాగితం పట్టుకుని పట్నంలో జైలుకు వెళ్ళాను. "ఎందుకొచ్చావ్ ?" అన్నారు. ఎందుకొచ్చానో చెప్పేశాను. "మరి కాగితం తెచ్చావా ?" అని అడిగారు. నేను కాగితం ఇచ్చేను చూసుకున్నాడాయన. "అయితే ఆగండి" అన్నాడు. అక్కడొక బెంచీమీద కూచున్నాను. అప్పటికి మధ్యాహ్నం అయిపోయింది. ఒక ఆఫీసరు వచ్చాడు. "టారస్ నువ్వేనా ?" అని అడిగాడు. "నే నేనండి" అన్నాను.

"అయితే ఆమెను తీసుకుపోవచ్చు" అన్నాడు. గేటు తెరిచారు. జైలు దుస్తులు తీసేసి ఆమె దుస్తులు ఆమెకిచ్చారు. నాకు వొప్పజెప్పారు. 'రా, వెడదాం' అన్నాను. "నడిచే వచ్చావా ?" అని అడిగిందామె. "కాదు బండి తెచ్చాను" అన్నాను. బండిలో గడ్డి బాగా పర్చి పైన చాప వేశాను. ఆమె బండి యెక్కి కూచుంది. ఇంటిదారిబట్టి పోతున్నాం. ఆమె మాటాడ లేదు, నేనూ మాటాడలేదు. ఇల్లు సమీపించినప్పుడు ఆమె అడిగింది, "అత్తగారు బాగున్నారా ?" అని. "ఆఁ బాగానే ఉంది" అన్నాను. "మామగారు కులాసాగా ఉన్నారా ?" అంది. "ఆఁ కులాసాగానే ఉన్నాడు" అన్నాను. "నన్ను నువ్వు క్షమించాలి, తప్పు చేశాను. నాకు తెలియలేదు" అన్నది. "మాట లెందుకు ! నేను నిన్నెప్పుడో క్షమించాను" అన్నాను. ఇక ఆమె మాటాడలేదు. ఇంటికి పోయాం. ఆమె మా అమ్మ పాదాల మీద పడ్డది. "భగవంతుడు నిన్ను క్షమిస్తాడు" అని ఆశీర్వదించింది, అమ్మ. "జరిగిందేదో జరిగింది. ఇక ముందు మంచిమార్గాన నడు. ఈ సంవత్సరం బాగా ఎరువు పెట్టాం. పంట బాగా పండింది. చప్పున కోతలు కోసెయ్యాలి. కుప్పలు నూర్చాలి. నువ్వు, టారస్ కల్సి ఆ పని అంతా చూడండి అన్నాడు మా నాన్న కోడలితో. అప్పటినుంచి

ఆమెకు పనిలో అభిరుచి కలిగింది. అందరిచేతా మంచి పనిమంతురాలనిపించుకుంది. ఉన్న పొలంగాక, ఇంకా కొంత పొలం కూడా కౌలుకు తీసుకొన్నాం. రైధాన్యం, ఓటు ధాన్యం బాగా పండాయి. నేను కొడవలి పట్టుకుని కోసేవాణ్ణి. ఆమె కట్టలు కడుతూ ఉండేది. తెల్లవారితే ఇద్దరమూ కోతపనిలోనే ఉండేవాళ్ళం. నాకూ పని పాటలు బాగా తెలుసు. నా కన్నా కూడా బాగా చేసేదామె. ఉత్సాహంగల పిల్ల. అస్తమానం ఏదో పనిలోనే ఉంటూంటే నేనే కేకలేసేవాణ్ణి అప్పుడప్పుడు. పగలంతా పొలంలో పనిచేసి, భుజాలు నొప్పెడుతూంటే ఇంటికి వచ్చేవాళ్ళం. అప్పటికయినా విశ్రాంతి తీసుకోవచ్చా? మళ్ళీ గిరిజ దగ్గరకు పోయి ఏ పనో పెట్టమనేది. అంత మార్పు వచ్చేసింది మనిషిలో."

"అయితే నీమీద అపేక్ష కుదిరిందా?" తోటమాలి అడిగాడు.

"అనుమానం ఏంలేదు. మేమిద్దరమూ ఒకే ఆత్మ అన్నట్టుగా ప్రవర్తిస్తుంటాం. నా ఆలోచనల్ని అర్థం చేసుకుంటుంది. మా అమ్మ కూడా "మన థియోడోసియా పూర్వం మనిషే కాదు, పూర్తిగా మారిపోయింది" అని అంటూ వుంటుంది. ఒకనాడు కళ్ళం తొక్కించటానికి మేమంతా రెండు బండ్లమీద బయలుదేరాం. నేనూ, థియోడోసియా ముందు బండిలో ఉన్నాం. నేనడిగాను. "థియోడోసియా, అలా ఎందుకు చేశావు నాడు" అని. "ఎందుకు చేశానా? నీతో వుండటం నాకిష్టంలేకపోయింది. అంతకన్నా చచ్చిపోదామనిపించింది" అన్నది. "మరి ఇప్పుడో?" అన్నాను. "ఇప్పుడా? నువ్వు నా గుండెలో వున్నావు" అన్నది. ఇక్కడ టారస్ కాసేపు ఆగి నవ్వాడు. నూర్పిళ్ళు అయిపోయి ఇంటికి వచ్చాం. సమన్లు వచ్చాయి. ఆమె విచారణకు కోర్టులో హాజరు కావాలి. ఇన్నాళ్ళనుంచీ మేము ఈ సంగతే మరచిపోయాం."

రైలు వేగం తగ్గింది. "స్టేషను వచ్చింది కాబోలు. వెళ్ళి కాస్త పానీయము త్రాగి వస్తాను" అన్నాడు తోటమాలి.

సంభాషణ ఆగిపోయింది. రైలు దిగి ప్లాట్‌ఫారంమీద నడుస్తోన్న తోటమాలికేసి చూస్తూ వున్నాడు నెహ్లూడోవ్.

# ౮౨

ప్యాసింజర్ల రైలు స్టేషన్ ఆవరణలో గుర్రపు బండ్లు నాలుగు వున్నాయి. మూడేసి, నాలుగేసి గుర్రాలు లాగే బండ్లు కూడా వున్నాయి లు కూడా బాగా వున్నాయి. వాటి మెడలకంతా గజ్జెలు కట్టబడి లున్నాయి. నెక్లూడోవ్ ప్లాట్ మీద కాలుపెట్టి దిగాడు. మొదటి తరగతి పెట్టెముందు జనం గుంపుగా కూడి వున్నారు. ఆ గుంపులో ఒక లావైన యువతి కనిపిస్తోంది. ఆమె పెట్టుకున్న టోపీకి మంచి ఖరీదైన యీకలవంటి అలంకరణాలు వున్నాయి. ఒక పొడుగాటి యువకుడు, ఖరీదు మైన సూటు వేసుకుని వున్నాడు. అతని కాళ్ళు చాలా సన్నగా వున్నవి. అతని పక్కనే ఒక పెద్ద కుక్క వుంది. దాని మెడకున్న పట్టీ చాలా ఖరీదైనది. కుక్క ఆకారాన్ని చూస్తే, దానికి తిండికేమీ కరువు లేదనిపిస్తుంది. వీళ్ళ వెనుక ఒక నౌకరు గొడుగు, కొన్ని పొట్లాలు పట్టుకుని నిల్చున్నాడు. అతనితోపాటు ఒక బండివాడు కూడా వున్నాడు.

ఆ గుంపులో ఆ స్త్రీ దగ్గర్నుంచి నౌకరువరకూ—అందరిముఖాల్లోనూ ఆత్మతృప్తి, ధనికత్వపు చిహ్నాము కనిపిస్తున్నాయి. ఎవరో వీళ్ళని తెలుసు కుందామన్న కుతూహలంతో ఇంకా చాలామంది భావవాస్యపరు చుట్టూ చేరారు—ఎర్రటోపీ పెట్టుకుని స్టేషన్‌మాస్టరు, రష్యన్ దుస్తులు వేసుకున్న ఒకయువతి (ఈమె మెడలో పూసలదండ వుంది. రైలుస్టేషన్‌లోకి వచ్చి ఆగినప్పుడల్లా ప్లాట్‌ఫారంమీదికి వచ్చి చూడటం ఆమెకు అలవాటు), టెలిగ్రాఫ్ గుమాస్తా, ప్రయాణీకులే కొందరు.

కుక్కను పట్టుకు నిల్చున్న యువకుడు కోర్చగిన్ జమీందారు కొడుకని నెక్లూడోవ్ గుర్తించాడు. లావుపాటి యువతి కోర్చగిన్ దొరసాని సోదరి. ఈవిడ యెస్టేటుకే ఇప్పుడు వీరంతా పయనమై వెళుతున్నారు. జమీందార్గారయినా; గార్డువచ్చి తలుపుతీసి పట్టుకున్నాడు. లోపలనుంచి కోర్చగిన్ దొరసాన్ని కుర్చీలో కూచోబెట్టుకుని బైటికి మోసుకొస్తున్నారు సేవకులు. అక్కాచెల్లెళ్ళిద్దరూ ఒకరినొకరు పలకరించుకున్నారు – అందరు కలిసి ఒకగుంపుగా బయలుదేరారు. కోర్చగిన్ దొరసాని పరిచారిక ఒక తోలుపెట్టె, మరికొన్ని తేలికవస్తువులు పుచ్చుకుని వెనకాల నడుస్తున్నది.

నెఖ్లూడోవ్ వెళ్ళి వాళ్ళను కలుసుకోలేదు. కలుసుకోవాలన్న కోరిక లేదతనికి. అతను పెట్టెముందే నిల్చుని చూస్తున్నాడు.

కోర్చాగిన్ దొరసాని, ఆమె కొడుకు, డాక్టరు, మిస్సీ, పరిచారిక వరుసగా నడుస్తున్నారు. కోర్చాగిన్ జమీందారు, మరదలు వెనకాల వస్తున్నారు. నెఖ్లూడోవ్ ఈ గుంపుకు దూరంలోనే వున్నాడు. వారి మాటలతనికి వినబడీ, వినబడకుండా వున్నాయి.

“అతడు ఉన్నత సంఘంలో పెరిగాడు” అంటున్నాడు కోర్చాగిన్ జమీందారు మరదలుతో స్టేషన్‌లోనుంచి బైటి ఆవరణలోనికి వెళ్ళిపోతూ. ఈ వాక్యంమాత్రం నెఖ్లూడోవ్‌కు వినిపించింది. కాని ఎవరినిగురించి అంటున్నారో మాత్రం తెలియదు.

ఈ సమయాన స్టేషన్‌లో ఒకమూలనుంచి కూలీలు గుంపుగా వస్తున్నారు బుజాలమీద మూటలు వేసుకుని. వచ్చి ఒక పెట్టెలో గబగబా ఎక్కబోతున్నారు. కాని గార్డువాళ్లను ఎక్కనీయలేదు, ఆ కూలీలు అక్కడి నుంచి బయలుదేరి మరొక పెట్టెలో ఎక్కబోతున్నారు. అప్పుడు మరొక గార్డువచ్చి ఎక్కవద్దని గదమాయించాడు. లోపలికి ఎక్కినవాళ్లుకూడా మళ్ళీ దిగేశారు. అందరూ కలసి ఇంకా ముందుకుపోయి నెఖ్లూడోవ్ ఉన్న పెట్టె ముందు ఆగారు. గార్డు మళ్ళీ వాళ్లను అదలించబోయారు.

“కూచోనీయండి పోనీ, లోపలచోటు చాలావుంది” అన్నాడు నెఖ్లూడోవ్. వెంటనే కూలీలంతా బండీలో ఎక్కారు. కాని వీళ్ళంతా లోపలికి ఎక్కటం—చేతులకు దండకడియాలున్న ఆ స్త్రీలిద్దరూ, గంభీరవదనుడైయున్న పెద్దమనిషీ అంగీకరించలేదు. మళ్లీ వాళ్ళను బైటికి గెంటేయించాలని కోరారు. ఆ కూలీలు మొత్తం ఇరవైమంది ఉన్నారు. అంతా చిన్నవాళ్ళే. అలసివున్నారు. ముఖాలు ఎండదెబ్బ తిన్నట్టు ఉన్నాయి. బుజాలమీద మూటలూ వాళ్లూ పెట్టెలో గడబిడ పడుతూ ఉన్నారు. ఇరుకనిపించింది. తమదే తప్పుగా భావించుకొని మరింకో పెట్టెలోకి పోదామని వుద్యుక్తులైనారు.

“ఏమిటిది? దయ్యాల్లాగ వున్నారే! ఎక్కడికి పోతారు, అక్కడే కూచోండి” అన్నాడు గార్డు ఎదురై.

ఒక పెద్ద గండం తప్పినంత సంతోషం కలిగి ఆ కూలీలు తమ మూటల్ని బల్లల కిందకి తోసి, కూచోటానికి సీట్లు వెతుక్కుంటూ వున్నారు.

హారాలు వేసుకున్న యువతి తడవ తడవకూ ముక్కు మూసుకుంటూ ముఖం చిట్లిస్తూ, కూలీలమధ్య కూచుని, కంపుకొడుతూ వుంటే ప్రయాణం చేయటంలో ఉన్న ఆనందాన్ని వర్ణిస్తోంది. తన వాక్చాతుర్యంతో నెక్లూడో దృష్టిని ఆకర్షించాలని ఆమె కోరిక.

టారస్‌తో మాటాడుతున్న తోటమాలి తన పూర్వస్థానాన్ని వదలి పెట్టి, అతని పక్కనే వచ్చి కూచున్నాడు. ఇప్పుడు టారస్‌కు ఎదురుగా రెండు సీట్లు, పక్కనొక సీటు ఖాళీగా ఉన్నాయి. వాటిల్లో ముగ్గురు కూలీలూ వచ్చి కూచున్నారు. నెక్లూడో లోనికి వచ్చాడు. అతని దుస్తుల్ని బట్టి కులీనుడనుకుని—ఆయన కూచోటానికి చోటులేకపోయిందే అని కించపడుతూ వాళ్ళు లేవబోయారు. నెక్లూడో వాళ్ళను లేవవద్దని చెప్పి తానొక సీటు చివరి అంచున అలా ఆనుకుని కూచున్నాడు.

ఆ కూలీలు ముఖం ముఖం చూచుకున్నారు. భయపడ్డారు. కులీనుడైన బడేవాడు తన సీటు ఇతెళ్లు ఆక్రమిస్తే ఊరుకుంటాడా ? తిట్టి, బైటికి గెంటేస్తాడు. నెక్లూడో అలా చెయ్యలేదు. లేచిన వాళ్ళను కూచోమని, తాను వెళ్ళి ఎక్కడో ఇరుకులో కూచున్నాడు. మహాపచారం జరిగింది. తమకేదో ఆపద రానున్నదని భయపడ్డారు.

కాని నెక్లూడో టారస్‌తో అంత ఆప్యాయంగా మాటాడుతూ ఉండటం చూసి వీళ్ల మనసులు కుదుటపడ్డాయి. ఒక కుర్రవాణ్ణి ఇవతలకు వచ్చి మూటమీద కూచోమని చెప్పి, నెక్లూడోను తిరిగి తన స్థానంలో కూచోండని పట్టు పట్టారు. నెక్లూడోకు ఎదురుగావున్న సీటులో ఒక నడి వయసు కూలీ ఉన్నాడు. అతడు తన కాళ్లు - చేతులు నెక్లూడోకు తగులుతాయేమోనన్న భయంతో వొదిగి, వొదిగి కూచున్నాడు మొదట. కాని క్రమశః ఆయనతో పరిచయం పెరిగింది. ఆయనతోనూ, టారస్‌తోనూ మాటాడుతున్నప్పు డొకసారి నెక్లూడో మోకాలుమీద తన అరచేత్తో తట్టాడు కూడా, తను చెబుతూన్న వాక్యంలోని ప్రాముఖ్యతను గుర్తించమన్నట్టుగా. అతడు తన కథంతా చెప్పాడు. గత రెండున్నర నెలలనుంచీ

పట్నంలో ఒకచోట పనిచేస్తూ ఉన్నాడు. ఇప్పుడు తిరిగి యింటికి పోతున్నాడు. తన ఖర్చులు పోగా మిగిలించుకోగలిగిన పది రూపాయలు అతని దగ్గర ఉన్నాయి. ఉదయంనుంచి సాయంత్రం వరకూ తానక్కడ ఎలా కష్టపడి పని చేసినదీ చెప్పాడు. మధ్యాహ్నం మాత్రం భోజనంచేసి రావటానికి రెండు గంటలు విశ్రాంతి ఇచ్చేవాళ్లు.

"పని చాలా కష్టమే. అయితే కాస్త అలవాటు పడ్డాక పరవాలేదు. మొదట ఆహారం మంచిది ఇచ్చేవాళ్ళు కాదు. తరువాత అందరమూ కలిసి ఆందోళన చేశాం. ఇప్పుడు మంచి ఆహారమే ఇస్తున్నారు."

28 సంవత్సరాలనుంచీ ఇలా కూలిపని చేసుకుంటూ ఇంటికి ఏదో కాస్త పంపిస్తూనే ఉన్నాడు. మొదట తండ్రికి పంపించేవాడు. తరువాత పెద్దన్నను పోషిస్తూ ఉండేవాడు. ఇప్పుడు ఇంటిపెద్దగా వ్యవహరిస్తూన్న మేనల్లుడికి పంపిస్తున్నాడు. సంవత్సరానికి 50, 60 రూపాయలు సంపాదిస్తాడు. అందులో రెండుమూడు రూపాయలు మాత్రమే తనకింద పొగాకుకూ, అగ్గిపెట్టెలకూ ఖర్చు అయ్యేవి అంతే–

"కాని నేను పాపిని. అలసిపోయినప్పుడు కాస్త సారాయం తాగుతూ ఉంటాను" అన్నాడు చిరునవ్వుతో.

అతనితోపాటు పనికోసం పట్నం వెళ్ళినవాళ్ళలో ఒకడు చనిపోయాడనీ, మరొకడు సుస్తీగా వున్నాడని చెప్పాడు. జబ్బుపడ్డవాడు కూడా అతనితోపాటు తిరిగి వస్తున్నాడు. ఆ పెట్టెలోనే ఒకమూల కూచున్నాడు. అతనిముఖం పాలిపోయింది. పెదవులు నీలిరంగును మారాయి. బాధపడుతూ కూచున్నాడు. స్లేడ్ అతని దగ్గరకు పోయి చూచాడు. కాని ప్రశ్నలువేసి బాధించటం బాగుండదనుకున్నాడు. "ఇతనికి క్వినైన్ ఇవ్వండి, తగ్గిపోతుంది" అని సలహాయిచ్చాడు. ఆ మందు పేరు ఒక కాగితం మీద వ్రాసికూడా యిచ్చాడు. అది కొనటానికి డబ్బుకూడా ఇవ్వబోయాడు. కాని నడివయసు కూలి తీసుకోలేదు. "నేను కొంటానులెండి" అన్నాడు.

"నేను చాలావూళ్లు తిరిగాను; కాని ఈయనగారిలాంటి మనిషిని నేనెక్కడా చూడలేదు. చెప్పులుకుండి, బయటికి గెంటకుండా తనసీటు

ఇచ్చేస్తున్నాడు"—అన్నాడా నడివయసు కూలీ టారెస్‌తో. "గొప్పవాళ్ళలో కూడా అన్నిరకాల మనుషులు ఉంటారు" అన్నాడు.

కూలీలంతా ఎండుకుపోయి ఉన్నారు. నరాలు తేలుకొస్తున్న అవయవాలు. అలసిపోయిన ముఖాలు. కానీ దయాదాక్షిణ్యాలు చిలుకుతూన్న చూపులు. ఇంట్లో స్వయంగా నేసుకున్న బట్టలు ధరించి ఉన్నారు. కార్మిక జీవితపు కష్టసుఖాలు వ్యాపించి ఉన్న ఆ పెట్టెలో, వాళ్ళ మధ్య కూచున్న నెఖ్లూడోవ్‌కు "ఇదంతా ఒక ప్రత్యేకమైన కొత్త ప్రపంచం"లా కనిపించింది. "ఉన్నత సంఘం" అని అనుకుంటూ పోయిన కోర్చాగిన్ జమీందారు మాటలు గుర్తుకొచ్చాయి. కోర్చాగిన్ జమీందారు వంటి వాళ్ళు చెందిన సంఘంలోని సోమరితనం, భోగలాలసత, నైచ్యత స్ఫురణకు వచ్చాయి. ఒక కొత్త, అందమైన, అదృష్టపూర్వమైన మరో ప్రపంచాన్ని కనుగొన్న ప్రయాణీకుడు వలె ఆనందపడ్డాడు.



# ౧

మస్లోవా ఉన్న ఖైదీల జట్టు సుమారు మూడువేలమైళ్లు ప్రయాణం చేసింది. క్రిమినల్ నేరాలక్రింద శిక్షితులైన ఖైదీలనందర్నీ రైలుమీదా, స్టీమరుమీద పెరమ్ అనే పట్నంవరకూ తీసుకొచ్చారు. ఆ తరువాత మస్లోవాను రాజకీయ ఖైదీలతోపాటు ప్రయాణం చేయించేట్టుగా అనుమతి సంపాదించాడు నెఖ్లూడోవ్. ధుఖోవా సలహామీద నెఖ్లూడోవ్ ఈ పని చేశాడు. ధుఖోవా రాజకీయ ఖైదీల జట్టులో ఉంది.

పెరమ్ పట్నంవరకూ సాగిన ప్రయాణం మస్లోవాకు శారీరకంగానూ, మానసికంగానూ చాల విసుగు కలిగించింది. జనం క్రిక్కిరిసి ఉండేవాళ్లు. ఎక్కడచూచినా మట్టి, ఈగలు, దోమలు. అందువల్ల శారీరకంగా ఆమె చాలా బాధపడాల్సి వచ్చింది. ఇకపోతే పురుషులవల్ల ఆమె నైతికంగా తట్టుకోవలసిన ఆవశ్యకతకూడా ఏర్పడింది. మజిలీచేసినప్పుడల్లా పురుషులు మారుతూ ఉండేవాళ్లు. ఐనా వాళ్లు ఈగలు దోమల్లాగ ఆమె చుట్టూ మూగే వాళ్లు. ఆమెకు క్షణంకూడా విశ్రాంతి అనేది లేకుండా సంచరించేవాళ్లు. ఆడ ఖైదీలంలోనూ, మగఖైదీలలోనూ, జైలర్లలోనూ, వీళ్ళందర్నీ కని పెట్టిచూస్తూ ఉండవలసిన సైనికుల్లోనూ ఒకరకమైన వ్యభిచారతృష్ణ పొడసూపుతూ ఉండేది. ఇటువంటి పరిస్థితులలో ఒక ఆడది ............ తన స్త్రీత్వాన్ని వినియోగించుకుందామను కుంటే తప్ప...ఎంతో జాగ్రతగా ఉండక తప్పదు. మస్లోవా రూపం ఆకర్షణీయంగా ఉంటుంది. ఆమె గతచరిత్ర అందరికీ తెలిసిపోయింది. అందుచేత ప్రతివాడూ ఆమెను ఆక్రమించాలని చూచేవాడే. ఇట్టి భయంకర పరిస్థితిలో అస్తమానం ఆత్మరక్షణ పరాయణయై మస్లోవా ఏమరకుండా అతిజాగ్రతగా మెలగవలసివచ్చేది. స్థిరచిత్తయై వాళ్ళ దౌష్ట్యాన్ని ఎదుర్కొన్నది. అందువల్ల వాళ్ళకు ఆమెపట్ల ద్వేషం ఉత్పన్నమైంది. కాని మస్లోవాకు థియోడోసియాతోనూ, టారస్‌తోనూ పరిచయం ఏర్పడ్డది. అందువల్ల ఆమెకు కొంత మనశ్శాంతి చిక్కింది. పరపురుషులు తన భార్యను లోబరుచుకో జూస్తున్నారని తెలుసుకుని తనభార్యను రక్షించుకునేందుకు టారస్ తానై కోరి నిజ్‌నీవద్ద అరెస్టు అయి ఇప్పుడు ఖైదీలతోనే ప్రయాణంచేస్తున్నాడు.

మస్లోవాను రాజకీయఖైదీలతో కలిపిన తరువాత ఆమె పరిస్థితి ఇంకా బాగుపడ్డది. రాజకీయఖైదీలను మొరటుగా చూడరు. వారికి మంచిసౌకర్యాలు వుంటాయి; మంచి ఆహారం ఇస్తారు. ఇప్పుడామెపై దురాక్రమణ చేసే పురుషులెవరూ లేరు. తన గతచరిత్ర యావత్తూ మరచిపోవాలని ఆమె కోరిక. అలా మరచిపోవటానికి తగిన అవకాశం ఆమెకిప్పుడు లభించింది. అనేకమంది సత్పురుషులతో ఆమెకు పరిచయం కలిగింది. వారి సాహచర్యం వల్ల ఆమెకెంతో మేలు చేకూరింది. వారి ప్రభావం ఆమెశీలములో మంచి పరిణామాన్ని తెకలిగింది.

మజిలీ చేసినప్పుడల్లా మస్లోవా రాజకీయఖయిదీలతోనే ఉండేది. కాని మనిషి బలంగా, ఆరోగ్యంగా ఉన్నందువల్ల క్రిమినల్ ఖయిదీల తోపాటు నడచిరమ్మనేవాళ్ళు. అలాగ ఆమె టోమస్కువరకూ నడచే వెళ్ళింది. ఈ గుంపుతోపాటు ఇద్దరు రాజకీయఖయిదీలు నడచివెళ్ళేవాళ్ళు. వారిలో ఒకతె మేరీపావ్‌లోనా. ఈమె అందమైన పిల్ల - నీలినేత్రాలు- ఖైదులో దుఖోవాను చూడ్డానికి వెళ్ళినప్పుడు ఈమె నెహ్లూడోవ్ దృష్టిని ఆకర్షించింది. రెండోవ్యక్తి సైమన్‌సన్. నల్లనియువకుడు; లోతైన కళ్ళు. ఇతన్ని కూడా నెహ్లూడో ఆ సందర్భంలోనే చూచివున్నాడు. యాకుటస్కు జిల్లాకు ప్రవాసం వెడుతున్నాడిప్పుడు సైమన్‌సన్. మేరీపావ్‌లోనా బండీలో ప్రయాణం చెయ్యాలి. కాని ఒక ఆడఖయిదీ గర్భిణిగా ఉండి నడవలేకపోతుంటే... మేరీపావలోనా ఆమెను బండిలో కూచోబెట్టి తాను నడుస్తోంది. తన తోటివాళ్ళంతా నడుస్తోంటే తాను బండెక్కి రావటం ఇష్టంలేక సైమన్‌సన్ కూడా నడుస్తున్నాడు. ఈ ముగ్గురూ అందరికన్నా ముందుగా తెల్లవారుఝామునే బయలుదేరేవారు. ఆ తరువాత కొంతసేపటికి ఇతర రాజకీయఖయిదీలు బండ్లెక్కి బయలుదేరేవారు.

సెప్టెంబరునెల ఒకనాటి ఉదయం చలిగాలి రివ్వున వీస్తోంది. వర్షం కురుస్తోంది. వర్షం ఆగినప్పుడు మంచుపడుతోంది. ఖైదీలంతా ఒక పెద్దపట్నం చేరారు. వారున్న బసముందు ఖాళీస్థలంలో అంతా సమావేశమైనారు. సుమారు 450 మంది ఖయిదీలు. ఒక ఉద్యోగి ఖయిదీలకు డబ్బు పంచిపెడుతున్నాడు. ఆ పట్నంలో ఉండే రెండురోజులకూ వాళ్ళు ఆ డబ్బు ఖర్చుపెట్టుకోవచ్చు. ఆ ఉద్యోగి చుట్టూ చాలామంది మూగారు.

కొందరు తినుబండారాలు అమ్మే స్త్రీలు బైటినుంచి లోపలికి వచ్చారు. కొందరు ఖయిదీలు ఆ స్త్రీలచుట్టూ మూగి అవీ, ఇవీ కొనుక్కుంటున్నారు. తినుబండారాలమ్మే ఆ స్త్రీల గొంతులు, తిమ డబ్బులు లెక్కబెట్టుకుంటూ అవీ, ఇవీ కొనుక్కుంటున్న ఖైదీల అరుపులు-అంతా కోలాహలంగా ఉంది.

మస్లోవా, మేరీపావ్‌లోనా ఉన్నికోట్లు, ఎత్తుబూట్లూ ధరించారు. తలకు చేతిరుమాళ్ళు చుట్టారు. ఇద్దరూ ఆవరణలోకి వచ్చారు. ఉత్తరపు వేపు గోడనీడన కూర్చుని స్త్రీలు బటానీలు వేసి ఉడకబెట్టిన మాంసం కూరలు, చేపకూరలు, గోధుమపిండివంటలు, గుడ్లు, పాలు, పందిమాంసం వేపుళ్ళు అమ్ముతున్నారు.

సైమన్‌సన్ కూడా ఆవరణలోకి వచ్చాడు. అతడు కేవలం శాఖాహారి. అందుచేత జంతువుల చర్మంతో తయారుచేసిన దుస్తులు వేసుకోడు. రబ్బర్‌జాకెట్ తొడుక్కున్నాడు. రబ్బర్ చెప్పులు వేసుకున్నాడు. ఆవరణలో నిల్చున్నప్పుడు అతనికొక ఊహతట్టింది. వెంటనే జేబులోనుంచి నోటుపుస్తకం తీసి అందులో ఇలా రాసుకున్నాడు : "బాక్టీరియా వచ్చి మానవుని గోరును గనక పరీక్షచేసేట్టయితే, అవి దాన్ని తప్పకుండా నిర్జీవ పదార్థమేనని ఉద్ఘాటించేస్తాయి. అలాగే మనంకూడా ఈ బ్రహ్మాండంమీది పెచ్చును నిర్జీవమనే ఉద్ఘాటిస్తాం. ఇది తప్పు"

గుడ్లు, చేపకూర కొని సంచిలో పెట్టుకుంటోంది మస్లోవా. మేరీ పావ్‌లోనా కొన్న వాటికి డబ్బిచ్చేస్తోంది. ఇంతలో ఆ ప్రదేశంలోని కలకలం అంతా అణగిపోయింది. ఖయిదీలందరూ తమతమ స్థానాలకు వెళ్ళి కూచుంటున్నారు. క్షణంలో అంతా నిశ్శబ్దం అయిపోయింది. పెద్ద ఆఫీసరుగారు వచ్చి...మళ్ళీ ప్రయాణం సాగించేముందు చెయ్యాల్సిన పనులన్నీ ఆజ్ఞాపిస్తున్నాడు.

అన్ని యేర్పాట్లూ సిద్ధం అయిపోయాయి. ఖైదీలందర్నీ లెక్కించారు. వాళ్ళ కాళ్ళకు తగిలించిన సంకెళ్ళు సరిగా వున్నాయో లేవో తనిఖీ చేశారు. ఇద్దరిద్దరు జతగా ప్రయాణం చెయ్యాల్సినవాళ్ళ చేతుల్ని కలిపే గొలుసులు తగిలించారు. ఇంతలో ఆఫీసరుగారి అధికారయుతమైన క్రోధ కంఠస్వరం ధ్వనించింది. ఎవడినో ఒక దెబ్బకొట్టినట్టుకూడా వినిపించింది.

ఒకబిడ్డయేడుపు వినిపించింది. క్షణంసేపు అందరూ నిశ్శబ్దంగా వున్నారు. మరుక్షణం మళ్ళీ ఏవేవో గుసగుసలు లేచాయి. మస్లావా, మేరీపావ్‌లోనా ఆ యేడుపు వినవచ్చే చోటికి వెళ్ళారు.

౨

ఆఫీసరుది బాగా మొద్దుబారిన శరీరం. మీసాలు అందంగానే వున్నాయి. గుడ్లురిమి చూస్తున్నాడు. పచ్చిబూతులు తిడుతున్నాడు. ఒక ఖయిదీని ముఖాన లాగికొట్టాడు. తన అరచేయే నెప్పిపుట్టింది కాబోలు-రుద్దుకుంటూ నిల్చున్నాడు అతనియెదుట ఆ ఖయిదీ నిలబడివున్నాడు. సగం నెరిగినతల, చాలీచాలని వస్త్రు, బిగుతులాగు. దెబ్బతిన్న ముఖాన నెత్తురు తుడుచుకుంటున్నాడు ఒకచేత్తో. మరోచేత్తో ఏడుస్తున్న ఒక చంటిపిల్లను ఎత్తుకునివున్నాడు.

"జాగ్రత! (తిట్లు) నాతో వాదిస్తావా? (తిట్లు). ఆ పిల్ల దాన్ని ఆడవాళ్ళ కెవరికన్నా ఇచ్చేయాల్సిందే-ఊఁ, వెళ్ళి ఇచ్చేసిరా!" గర్జించాడు ఆఫీసరు.

గ్రామపంచాయితీవారు మోపిన నేరాలకు అతన్ని ప్రవాసం పంపిస్తున్నారు. అతనిభార్య టోమస్కు పట్నంలో చనిపోయింది. అక్కడినుంచి కూతుర్ని తనే మోసుకొస్తున్నాడా ఖయిదీ. ఇప్పుడతనికి సంకెళ్ళు తగిలించవలసిందిగా ఆఫీసరు ఆజ్ఞాపించాడు. సంకెళ్ళు వేస్తే బిడ్డను మోసుకురావటం కష్టంగా ఉంటుందని అతను విన్నవించుకున్నాడు. తన ఆజ్ఞను వెంటనే శిరసావహించకుండా ఎదురుమాట చెప్పాడని ఆఫీసరుకు వొళ్ళు మండిపోయింది. ఈడ్చికొట్టాడు ముఖంమీద. ఆ దెబ్బతిన్నవాని పక్కనే ఇంకో ఖయిదీ వున్నాడు. అతని చేతికి సంకెళ్ళు వున్నాయి. ఒకసారి ఆఫీసరుకేసీ మరోసారి దెబ్బతిన్నవానికేసీ ముఖం తిప్పిచూస్తూ నిల్చున్నాడు. అక్కడే ఒక సైనికుడూ వున్నాడు.

"ఆ పిల్లను తీసుకుపో" అని ఆఫీసరు ఆ సైనికుని ఆజ్ఞాపించాడు.

మళ్ళీ గుంపులో కలకలం బయలుదేరింది. "టోమస్కునుంచీ సంకెళ్ళు వెయ్యకుండానే వచ్చారుగా!...మనుషులపిల్ల అనుకున్నాడా? కుక్కపిల్ల అనుకున్నాడా?"...ఎవరో అన్నారు కటువుగా.

"పసిపిల్లగొడవ తనకెందుకూ? ఇదేనా న్యాయం" అన్నారు ఇంకెవరో.

ఆఫీసరుకు కోపం వచ్చింది. గబగబా గుంపులోకి చొచ్చుకు పోయాడు. "ఎవరా వాగేది? నువ్వేనా? నువ్వా?......"

"వారు వీరేమిటి, అంతా అలాగే అంటున్నారు" అన్నాడొక పొట్టి ఖయిదీ.

రెండుచేతులూ ఎత్తి ఆఫీసరు అతని ముఖంమీద కొట్టాడు. "తిరుగు బాటు చేస్తున్నారా మీరు? కానీయండి - మిమ్మల్ని అందర్నీ కుక్కల్ని చంపినట్లు తుపాకి పేల్చి చంపేస్తాను. పై అధికార్లంతా సంతోషిస్తారు. తీసికెళ్ళిపో ఆ పిల్లను."

గుంపులో మరెవరూ మాటాడలేదు. ఒక సైనికుడు ఆ పిల్లను బల వంతాన లాగేశాడు. మరొకడు ఆ ఖయిదీకి సంకెళ్ళు తగిలించాడు. ఆ పిల్ల ఒకటే యేడుపు-పాపం!

"ఆ పిల్లను ఆడఖయిదీల కివ్వండి" ఆఫీసరు అరచాడు, తన బెల్టు సర్దుకుంటూ.

పిల్లముఖం ఏడుపుతో కందిపోయింది. సైనికుని చేతిలోనుంచి విడి పించుకోటానికి పెనగులాడుతోంది. మేరీపావ్లోనా ఆఫీసరు ముందుకు వచ్చి నిల్చుంది. "ఆ అమ్మాయిని నే నెత్తుకుని తీసుకొస్తాను మీరు-వొప్పు కుంటే" అన్నది.

ఆమె ముఖం అందంగా ఉంటుంది. కళ్ళు మెరుస్తూ సొగసుగా ఉంటాయి. ఇదివరకొకసారి ఆమెను ఆఫీసరు చూచి వున్నాడు. ఆమె అడిగిన ప్రశ్నకు సమాధానం ఆలోచిస్తున్నట్లుగా కాసేపు మౌనంగా ఆమె వైపు చూస్తూ నిల్చున్నాడు. చివరకన్నాడు: "ఎత్తుకొస్తే ఎత్తుకురా; నా కభ్యంతరం లేదు. దయ చూపించవచ్చు. కాని వాడు పారిపోతే బాధ్యత ఎవరిదంటావ్!"

"చంకలో పిల్ల ఉండగా ఎలా పారిపోతాడులెండి"

"ఇప్పుడు మాటాడే అవకాశం లేదు నాకు. పిల్లను నువ్వు ఎత్తుకురా నీ కిష్టమైతే."

"పిల్లను ఇచ్చెయ్యమంటారా ?" సైనికుడు అడిగాడు.

"ఇచ్చెయ్యి."

"రా, పాపా ! రా" అంటూ మేరీపావ్లోనా బుజ్జగిస్తూ చేతులు చాచింది.

కాని సైనికుడి చేతిలోనించి పిల్ల తండ్రివైపే సాగుతూ గీపెట్టి ఏడుస్తోంది. మేరీపావ్లోనా దగ్గరకు పోనేలేదు.

"నీ దగ్గరకు రాకపోతే నా దగ్గరకు వస్తుందిలే" అంటూ మస్లోవా తన సంచీలోని బిస్కెట్లుతీసి చూపిస్తూ పిల్లను సమీపించింది.

ఆ పిల్ల మస్లోవాను ఎరుగు. ఆమె ముఖం, ఆమె చేతిలో బిస్కెట్లూ కనిపించగానే ఏడుపు ఆపి వచ్చేసింది.

అంతటితో పరిస్థితి శాంతపడింది. గేట్లు తెరిచారు. ఖైదీలంతా బైటికి వచ్చి వరుసలుగా నిలబడ్డారు. అందర్నీ మరోకసారి లెక్కించారు. సంచులు, సామాను బండ్లకెక్కించారు. బలహీనులైన ఖైదీలను బండ్లలో ఎక్కిస్తున్నారు. మస్లోవా ఆ పిల్లనెత్తుకుని ఒకబండిలో థియోడోసియా పక్కన కూచుంది. నెహ్లూదొవ్ ఇందాకటినించీ జరిగిన గ్రంథమంతా చూచిచూచి చివరకు ఆఫీసరు దగ్గరకువచ్చి నిల్చుని ధీమాగా "మీరు చాలా అసహ్యంగా ప్రవర్తించారు" అన్నాడు.

"ఈ విషయంలో నీకేమీ సంబంధంలేదు. నీపని నువ్వు చూచుకో పో" అన్నాడు ఆఫీసరు.

"మీరు చాలా అసహ్యంగా ప్రవర్తించారని మీకు చెప్పటం నా విధి. అందువల్ల చెప్పాను" అన్నాడు నెహ్లూదొవ్ అతనికేసి తనబిగ్గరైన కనుబొమలగుండా చూస్తూ.

ఆఫీసరు అతన్ని వినిపించుకోలేదు. "దాఁ ప్రయాణం సాగించండి" అని ఆజ్ఞాపించి తనబండి యెక్కాడు. గుంపు సాగింది. రాజమార్గం బురదగా వుంది. ఇరువైపులా మురికికాలవలు ఉన్నాయి. క్రమక్రమంగా దట్టమైన అడవి గుండా వెడుతున్నారు.

# 3

పరిస్థితులు భారంగా ఉన్నా...రాజకీయ ఖైదీలమధ్య జీవితం ఒక రకంగా హాయిగా ఉన్నట్టే తోస్తున్నది మస్లావాకు. పూర్వం తాను పట్నంలో ఆరేళ్ళు విలాసంగా భోగజీవితం గడిపింది. చాలానెలలు క్రిమినల్ నేరస్తులమధ్య జైలుజీవితం అనుభవించింది. ఇప్పుడు రాజకీయ ఖైదీల మధ్య ఈ కొత్త జీవితం బాగానే ఉన్నట్టనిపిస్తోంది. రోజుకు పదిహేను ఇరవైమైళ్ళు ప్రయాణం. అలా రెండురోజులు ప్రయాణం చేసిన తరువాత మూడోరోజు విశ్రాంతి. మస్లావా శరీరానికి బలంవచ్చింది. రాజకీయ ఖైదీల సాహచర్యంలో...ఆమె పూర్వమెన్నడూ కలలోకూడా భావించి ఉండని కొత్తతలపులు గోచరిస్తున్నాయి. వాళ్ళంతా చాల విచిత్రవ్యక్తులు. ఇట్టి వ్యక్తులను తానిదివరకెప్పుడూ కనివిని యుండలేదు.

“మొదట నాకీ ప్రవాసశిక్ష విధించినప్పుడు ఏడ్చాను. కాని అందు కిప్పుడు భగవంతునికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను. ఈ ప్రవాస శిక్ష మూలంగానే ఇటువంటి ఉత్తమ వ్యక్తుల సాహచర్యం లభించింది. ఎన్నో కొత్తవిషయాలు నాకిప్పుడు తెలుస్తున్నాయి” అనుకుంటుంది మస్లావా అప్పుడప్పుడు.

ఆ ఉత్తమ వ్యక్తుల భావాలు, ఆశయాలు ఆమె కిప్పుడు సులభంగా బోధపడ్డాయి. వారియెడల ఆమెకు సానుభూతి ఏర్పడింది. సంఘంలో ఉచ్చతరగతి వారికి వీరు శత్రువులు. సామాన్య ప్రజలకు వీరు మిత్రులు. వీరిలో కొందరు ఆ ఉచ్చతరగతికి చెందినవారే అయినా తమకున్న సౌకర్యాలన్నీ త్యాగంచేశారు. స్వేచ్ఛ గోల్పోయారు. సామాన్యప్రజలకోసం తమ జీవితాల్ని అంకితంచేశారు. అందుచేత వారంటే మస్లావాకు ఆదరాభిమానాలు పెరిగాయి.

ఇలా కొత్తగా లభించిన మిత్రబృందం అంటే మస్లావాకు చాలా ప్రీతి. అందరిలోనూ మేరీపావ్లోనాపట్ల ఆమెకు అమితగౌరవం, ప్రేమ. మేరీపావ్లోనా ఒక ధనవంతుడైన సైనికాధికారి కూతురు. చాలా అందగత్తె మూడుభాషలు మాటాడగలదు. తన సోదరుడు పంపించే డబ్బును తిరస్కరించేసింది. ఒక నిరుపేద కూలివాని కూతురులాగా దుస్తులు ధరించి

నిరాడంబరంగా కాలక్షేపం చేస్తున్నది. తన అందచందాల విషయమై శ్రద్ధ వహించదు! విలాసాలామె కక్కర లేదు. ముఖ్యంగా ఆమెలోని ఈ ప్రత్యేకత మస్లొవాను మిక్కుటంగా ఆకర్షించింది.

తాను అందగత్తెనని మేరీపావ్‌లోనాకు తెలుసు. ఆమెకది సంతోషకరమైన విషయమే. కాని తన అందం పురుషుల్లో కలిగించే వైకల్యానికి ఆమె అసహ్యపడుతుంది, ఏవగించుకుంటుంది. అందరూ తన్ను చూసి మోహపడతారేమోనని భయపడుతుంది. ఈ సంగతి పురుషులు గుర్తించారు. అందుచేత వారామెను చూచి మోహించరు. ఒకవేళ మోహించినా తమ భావాన్ని అణచుకునే వారుగాని ప్రకటించేవారు కారు. తోడి పురుషునితో వలెనే ఆమెతో ప్రవర్తించేవారు. మరి ఆమెను ఎరుగని అపరిచితులు మాత్రం అప్పుడప్పుడు వెర్రివేషాలు వేసేవారు. అటువంటివారి బారినుండి... మంచి శక్తిబలంగల మనిషి కాబట్టి... తప్పించుకుంటూ ఉండేది.

"ఒకనాడు ఏం జరిగిందో తెలుసా? ఒకడు వీధిలో నా వెంటబడి ఒకపట్టాన విడిచిపోయేలాగు కనిపించలేదు. అప్పుడతన్ని విదిలించి కొట్టేశాను. భయంపడి పారిపోయాడు" – మేరీపావ్‌లోనా ఒకసారి మస్లొవాతో చెప్పింది.

చిన్నతనం నించీకూడా ఆమెకు ధనవంతుల భోగజీవితం అంటే అసహ్యంగా ఉండేది. అందుచేతనే ఆమె విప్లవసంఘంలో చేరింది. బాల్యంలో అస్తమానం నౌకర్లతోనే ఆడుతూపాడుతూ కాలం గడిపేది. ఎప్పుడూ డ్రాయింగ్‌రూమ్‌లో కనిపించేది కాదు. వంటచావిడిలోనో, గుర్రపుశాలలోనో నౌకర్లదగ్గరో ఉండేది. అందుచేత ఇంట్లో పెద్దవాళ్లు ఆమెను తరచు కూకలేస్తూ ఉండేవాళ్ళు.

ఒకప్పుడు మస్లొవాతో ఇలాచెప్పింది "దొరగార్లు, దొరసాన్ల సముక్షంలో ఉన్నంతసేపూ నాకు తలనొప్పిగానే ఉండేది. వంటశాలలోనూ, గుర్రపుచావిడిలోనూ నౌకర్లదగ్గర కాలం గడపటమే నాకు ఆనందంగా ఉండేది. శాస్త్ర బుద్ధి తెలిసిన తర్వాత మనం బ్రతుకుతూన్న బ్రతుకంతా అస్తవ్యస్తపు బ్రతుకని గుర్తించాను నాకు తల్లి లేనేలేదు. తండ్రి అంటే అపేక్ష ఉండేది కాదు. నా పందొమ్మిదోయేట ఒక అమ్మాయితో కలిసి ఇల్లువిడిచి వెళ్ళిపోయాను. ఒక ఫ్యాక్టరీలో పనికి కుదిరాను."

ఫ్యాక్టరీలో పనిమానేసి కొన్నాళ్ళు పల్లెటూళ్ళో వున్నది. తర్వాత మళ్ళీ పట్నం వచ్చింది. ఆమె ఉండే ఇంట్లో ఒక రహస్య ముద్రణాలయం ఉంది. అక్కడ ఆమెను అరెస్టుచేసి పట్టుకొన్నారు. తన్ను ఎందుకు అరెస్టు చేశారో మేరీపావ్‌లోనా ఎప్పుడూ చెప్పలేదు. కాని మస్లోవా ఇతర్లవద్ద నించి విన్నదేమిటంటే... ముద్రణాలయం సోదా చూసేందుకు పోలీసులు వచ్చారట. ఆ చీకటిలో ఎవరో విప్లవసంఘంలోని వ్యక్తి తుపాకి పేల్చాడు. ఆ తుపాకి పేల్చిన నేరం మేరీపావ్‌లోనా మీదపడ్డది. తానే పేల్చినట్టు ఆమె అంగీకరించిందంట.

మేరీపావ్‌లోనా నడవడికను శీలాన్నీ మస్లోవా చక్కగా అర్థం చేసుకుంది. ఎటువంటి పరిస్థితుల్లోనూ మేరీపావ్‌లోనా తన్ను గురించి, తన సౌఖ్యం గురించీ ఆలోచించుకునేది కాదు ఎప్పుడూ ఇతర్లకేదో సేవ చేద్దామనే ఆతృతపడుతూ వుంటుంది. ఇతర్లకు సాయంచేద్దామనే ఆమె కుతూహలం.

ప్రస్తుతం ఆమెకొక సహచరుడున్నాడు. అతనిపేరు నోవోద్వోరో. ఆమెది జాలిగుండె అనీ, ఆమె పరోపకార పరాయణ అనీ అంటుంటాడు. ఆ మాట నిజమే, ఆటగాడు ఎప్పుడూ తనకు అభిరుచిగల ఆటలాడేందుకు ఉత్సాహపడతాడు. ఆమె ఎప్పుడూ ఇతర్లకు సాయంచేసేందుకు అవకాశాల కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. అది ఆమె అలవాటు. అదే ఆమె జీవిత కార్యక్రమం. ఈ ఆమె నైజాన్ని తెలిసినవాళ్ళు ఆమెవల్ల వుపకారం పొందటానికే కోరుతూ వుంటారు; పొందిన వుపకారానికి కృతజ్ఞత చూపరు.

మొట్టమొదట మస్లోవాను చూసినప్పుడు మేరీపావ్‌లోనాకు అసహ్యం కలిగింది. ఆ సంగతి మస్లోవా గుర్తించింది. కాని క్రమేణా ఆమె తన అసహ్యభావాన్ని తొలగించుకుని మస్లోవాపట్ల దయగా, ప్రేమగా వ్యవహరిస్తూ వచ్చింది. మస్లోవా దృష్టిలో మేరీపావ్‌లోనా ఒక అసాధారణ వ్యక్తి. అట్టి వ్యక్తి తనపట్ల దయ, ప్రేమ చూపుతున్నందువల్ల మస్లోవా హృదయం కృతజ్ఞతాపూర్ణమై పోయింది. ఆమెను మనసారా ప్రేమించింది. తనకు తెలియకుండానే ఆమె భావాలపట్ల తనకు గౌరవం ఏర్పడ్డది. అన్నింటిలో ఆమెను అనుకరించటానికి తాను ప్రయత్నించింది.

మస్లోవా తన్నంతగా ప్రేమిస్తున్నందువల్ల మేరీపావ్‌లోనా హృదయం మరింత మెత్తపడ్డది. ఇద్దరూ అత్యంత సన్నిహితులైనారు.

పురుషుల శారీరక కామతృష్ణ అంటే ఇద్దరికీ అసహ్యమే. ఈ సామ్యగుణం కూడా వారి సాన్నిహిత్యానికి మరొక కారణం. అయితే ఒకతె ఆ వలపును, దాని దుష్ఫలితా లన్నింటినీ పూర్తిగా అనుభవించిన తర్వాత...ఏవగించుకుంటున్నది. మరొకతె దాన్ని అనుభవించనే లేదు. కాగా అదేదో ఒక అర్థంగాని పదార్థంగానూ, వ్యక్తి గౌరవానికి భంగకరమైనదిగానూ భావించి ఏవగించుకుంటున్నది.

౪

మేరీపావ్‌లోనా ప్రభావానికి మస్లోవా ఇచ్ఛాపూర్తిగా లొంగిపోయింది. అందుకు కారణం: తానామెను మనసారా ప్రేమించింది. మస్లోవాపై మరియొకరి ప్రభావం సైమన్‌సన్‌ది. దీనికి కారణం: అతడామెను ప్రేమించాడు.

సాధారణంగా మానవులంతా...కొంతవరకు తమ ఉద్దేశాలను అనుసరించి, మరికొంతవరకు ఇతర్ల ఉద్దేశాలననుసరించీ నడుచుకుంటూ ఉంటారు. ఇందులో ఉండే తరతమ భేదాల్నిబట్టి అనేక రీతులుగా ఉంటారు మానవులు. కొంతమందికి ఆలోచన అనేది ఒక మానసికమైన ఆట. మనస్సు కట్టుబాటు లేకుండా పరిభ్రమించే చక్రం అని వారి అభిప్రాయం. కాబట్టి వారు చాలావరకు ఇతర్ల భావాల్ని అనుసరించీ, సాంప్రదాయరీత్యా, చట్టబద్ధంగా, ఆచారపద్ధతినిబట్టీ నడుచుకుంటారు. మరి కొందరు స్వబుద్ధికే ప్రాధాన్యత ఇస్తారు. తమ అంతరంగ బోధనలనుబట్టే నడుచుకుంటారు. ఇతర్ల ఉపదేశాలను పాటించటమనేది వాటిని బాగా తూచి, సరిచూచి, నచ్చిన తరువాతనే. సైమన్‌సన్ ఈ రకపు మనుష్యులకు చెందినవాడు. దేనినైనా తన బుద్ధితో ఆలోచించి, విమర్శించుకున్న తరువాతనే ఒక తీర్మానానికి వస్తాడు. అలా చేసుకున్న తన తీర్మానాలకు తు.చ తప్పకుండా నడచుకుంటాడు.

సైమన్‌సన్ తండ్రికి ఒక గవర్నమెంటు ఆఫీసులో ఉద్యోగం. అతనికి వచ్చే ఆదాయం అంతా కేవలం అన్యాయార్జితమేనని సైమన్‌సన్‌కు చిన్నప్పుడే బడిలో చదువుకుంటోన్న రోజుల్లోనే స్ఫురించింది. వెంటనే తండ్రితో చెప్పేశాడు. నీకు వచ్చే డబ్బు అంతా నీది గాదు, నిజంగా ప్రజలదీ అని.

తండ్రి అతని మాటల్ని లక్ష్యపెట్టలేదు. బాగా చీవాట్లు పెట్టాడు. వెంటనే సైమన్‌సన్ ఇల్లు విడిచి లేచిపోయాడు. తండ్రి ఆస్తిలో పైసా కూడా ఆశించలేదు. దేశంలోని అనర్థాలన్నీ ప్రజల అజ్ఞానం వల్లనే సాగుతున్నాయని అతడు నిర్ణయించాడు. అందుచేత విశ్వవిద్యాలయం విడిచి బైటికి రావటంతోనే 'ప్రజాపార్టీ'లో చేరాడు. ఒకచోట బడిపంతులుగా చేరాడు. పిల్లలకూ, ప్రజలకూ న్యాయం అంటే ఏమిటో, ఎలా ఉండాలో ధైర్యంగా బోధించాడు. సంఘంలో సాగుతూన్న అన్యాయాల్ని బహిరంగంగా ఖండించాడు.

అతన్ని అరెస్టుచేసి విచారణకు తెచ్చారు.

తన్ను విచారించేందుకు జడ్జీలకు ఏ విధమైన హక్కూ లేదని అతనికి తోచింది. ఆ సంగతే జడ్జీలతో చెప్పేశాడు. కాని వాళ్ళతని మాట లక్ష్యం చేయకుండా విచారణ సాగించారు. వాళ్ళు ఏమి అడిగినా తాను సమాధానం చెప్పకూడదని సైమన్‌సన్ నిర్ణయించుకున్నాడు. వాళ్ళు ఏమి అడిగినా మాటాడకుండా గమ్మున ఊరుకున్నాడు.

అతనికి ప్రవాస శిక్ష విధించారు. ఆర్చిఏంజిల్ అనే రాష్ట్రానికి పంపించారు. అతడక్కడ ఒక నూతన తత్వ ప్రచారం సాగించాడు. అతని నడవడికంతకూ ఆ నూతన తత్వమే మూలాధారం. ఆ తత్వంయొక్క పునాది ఏమంటే—ఈ విశ్వంలో ప్రతిదీ సజీవమే. నిర్జీవమైన పదార్థమంటూ లేనే లేదు. ప్రాణంలేని పదార్థాలని మనం అనుకుంటూన్నవన్నీ కూడా ఒకానొక అనంతమూల సజీవ పదార్థంయొక్క భాగాలు. మానవుడు కూడా ఆ యనంత మూల పదార్థం యొక్క భాగమే. కాబట్టి జీవమును పెంపొందించుటకు ప్రయత్నించటమే అతని విధి. ప్రాణనాశన హేతువులైన కార్యాలన్నీ అకార్యాలే. యుద్ధాలు చేయటం; ఉరిశిక్షలు విధించటం; మానవుల్నీ, జంతువుల్నీ చంపటం—ఇవన్నీ క్రిమినల్ నేరాలు. వివాహం గురించి కూడా అతనికి ప్రత్యేకాభిప్రాయం ఉంది. పెళ్ళి చేసుకుని, బిడ్డల్ని కని, జనాభాను పెంచటం మానవుని కర్తవ్యాల్లో అధమమైనది. ఉన్న జనాభాకు గరిష్ఠసేవ చేయటమే ఉత్తమ కర్తవ్యం. మానవ రక్తంలో Phagocytes అనే జీవకణాలు ఉన్నాయి. శరీరంలోని బలహీనమైన, వ్యాధిగ్రస్తమైన భాగాలకు పుష్టి కల్పించటం వాటిపని. అలాగే ఇంద్రియ నిగ్రహంగల బ్రహ్మ

చారులు సంఘానికి పుష్టి ప్రసాదిస్తారని సైమన్‌సన్ అభిప్రాయం. యవ్వనంలో కొంతకాలం అతడు స్త్రీలతో విలాసంగా గడిపినా...ఈ నిర్ణయం అతని బుద్ధికి తోచిన నాటినుంచీ మాత్రం...నిగ్రహంగానే ఉంటూ వచ్చాడు. తానూ, మేరీపావ్‌లోనా మానవసంఘానికి Phagocytes వంటి వారనుని అతని ఊహ.

తాను మస్లోవాను ప్రేమించటంవల్ల తన సిద్ధాంతం భంగపడిందేమీ లేదు. తన కామెపై ఆధ్యాత్మిక ప్రేమ. మానవ సంఘంలో తాను Phagocyte గా పనిచేయటానికి ఆ ప్రేమ అంతరాయం కల్పించదు. పైగా ఒక రకమైన ఉత్సాహాన్ని చేకూరుస్తుంది.

ఇలాగ నైతిక సమస్యల్నేగాక, అనేక లౌకిక సమస్యల్ని కూడా అతడు స్వబుద్ధితో పరిష్కరించుకుంటాడు. అనేక లౌకిక వ్యవహారాల్ని గూర్చి అతనికి ప్రత్యేకాభిప్రాయాలు ఉన్నాయి. మానవుడు ఎన్ని గంటలు పనిచెయ్యాలి, ఎంతకాలం విశ్రాంతి తీసుకోవాలి, ఎటువంటి ఆహారం భుజించాలి, ఏ రకం దుస్తులు ధరించాలి, గృహాల్లో వేడి, వెలుగు ఎంతెంత ఉండాలి...ఈ మొదలైన విషయాలన్నింటిని గురించీ అతడు కొన్ని సిద్ధాంతాలు క్రోడీకరించుకున్నాడు.

ఇంత పాండిత్యం ఉన్నా, అతడు సిగ్గరి; వినయశీలి. కాని పట్టుదల కలవాడు. ఒక విషయాన్ని గురించి ఒక నిర్ణయానికి వచ్చాడంటే ఆ నిర్ణయంనుంచి చింతామణాని కూడా తొలగిపోడు.

ఈ వ్యక్తి తన ప్రేమద్వారా మస్లోవాపై కొంత ప్రభావం ప్రసరించ గలిగాడు. అతడు తన్ను ప్రేమిస్తున్నాడన్న సంగతి మస్లోవా ఇట్టే కని పెట్టేసింది. స్త్రీ కదా! ఉన్నతాశయాలుగల అటువంటి వ్యక్తిని కూడా ఆకర్షించగలిగానన్న భావంతో తనపై తనకు గౌరవం పెరిగింది. నెఖ్లూదోవ్ తన్ను పెళ్ళిచేసుకుంటానని అన్నాడంటే...అతడు ఉదార స్వభావం కలవాడు కనుక. అదీగాక ఇదివరకు చేసిన అన్యాయాన్ని సరిదిద్దుకోటానికి. కాని సైమన్‌సన్ తన ప్రస్తుతస్థితిని ఎరిగివుండి కూడా ప్రేమిస్తున్నాడు, అంటే కేవలం ప్రేమించాడు కాబట్టి ప్రేమిస్తున్నాడు.

తాను ఒక అసాధారణ వ్యక్తి అనీ, నైతిక గుణసంపత్తిగల యువతి అనీ అతని అభిప్రాయం ఐ వుండొచ్చు. తనకు ఎట్టి నైతిక గుణాల్ని అతను

ఆపాదిస్తున్నాడో తెలియదు. కాని ముఖ్యంగా అతనికి ..ఇప్పుడున్న సదభిప్రాయం మారకుండా ఉండేందుకని...మస్లోవా అతి జాగ్రత్తగా సత్ప్రవర్తన కలదియై సంచరిస్తోంది. ఉత్తమ నైతిక గుణాల్ని ఊహించుకుని తదనుగుణంగా ప్రవర్తిస్తున్నది.

ఈ ప్రేమసంబంధం జైల్లో ఉండగానే ఆరంభమైంది. ఒకనాడు మస్లోవా అతన్ని చూసింది. అతడప్పుడామెను దయా చిహ్నితాలైన తన నీలి నేత్రాలతో ఒత్తైన కనుబొమల క్రిందుగా అవలోకిస్తున్నాడు. ఈ విచిత్ర వ్యక్తి తనకేసి అంత విచిత్రంగా చూస్తున్నాడని మస్లోవా గమనించింది. బిరుసైన దువ్వెనకు ఒదుగని అతని జుట్టు, గంభీరమైన అతని ముఖము రూక్షస్వభావాన్ని తెలియజేస్తూ ఉంటాయి. కాని అతని చూపులో పసిపాపల అమాయకత్వము, కరుణ తొణికిసలాడుతూ ఉంటాయి. మరొకసారి అతన్ని ఆమె టౌనుసెల్లులో చూసింది. అప్పుడే ఆమెను రాజకీయ ఖైదీలతో కలిపారు. అంతవరకూ వారిమధ్య మాటలు కలవలేదు. కాని ఒకరినొకరు చూసుకున్న ఆ చూపుల్లోనే ఒకరి నొకరు పోల్చుకున్న భావం, పరస్పర సమాశ్రయావశ్యకతను అంగీకరిస్తోన్న భావం వ్యక్తమైనాయి. ఆ తరువాత కూడా వాళ్లు ఒకరితో ఒకరు ఎక్కువగా మాటాడుకున్నట్టు లేదు. నలుగురిలో కూచుని అతడేమైనా చెబుతూ ఉంటే...అదంతా అతడు ప్రత్యేకం తనకే చెబుతున్నట్టనిపించేది మస్లోవాకు. ఆమె రాజకీయఖైదీలతో కలసి ప్రయాణం చేయగల అవకాశం లభించిన తరువాత మాత్రం ఇద్దరూ ఎక్కువగా కలసికొను అవకాశాలు చేకూరాయి.

౨౮

పెరమ్ పట్నం విడిచి రాకముందు...ఒకసారి నిజ్ నీలోనూ, మరొకసారి పెరమ్ పట్నంలోనూ...రెండుసార్లు మాత్రమే నెఖ్లూదొవ్ మస్లోవాతో కలిసి మాటాడాడు. ఈ రెండు సమయాల్లోనూ ఆమె నిర్దయాత్మ, మితభాషిలాగ కనిపించిందతనికి. "నీ కేమైనా కావాలా? హాయిగా ఉంటోందా?" ఈ మొదలైన ప్రశ్నలకు ఆమె సమాధానం సరిగా చెప్పీ చెప్పకా సిగ్గభినయించి ఊరుకుండేది. తనపట్ల ఆమె నిర్లక్ష్యభావం చూపుతున్నట్టుగా అతడు భావించాడు. ఇలా ఆమె ఇదివరకు చాలాసార్లు ప్రవర్తించింది. పురుషులు

ఆమెను చూసి, మోహపడి, వెంటపడి చికాకు పెడుతున్నారని నెఖ్లూడోవ్‌కు తెలుసు. అందువల్ల ఆమె చాలా నిరుత్సాహంగా ఉన్నదనుకుని అతడు విచారపడ్డాడు. ఇటువంటి నికృష్ట పరిస్థితులవల్ల మళ్ళీ ఆమెకు నిరాశ, నిస్పృహ కలిగి...తనపై తనకు విశ్వాసం లేకుండా పోయి...పూర్వంలాగా చెడిపోతుందేమోనని కూడా అతడు భయపడ్డాడు. ఇదివరకు ఇటువంటి చెడు పరిస్థితులవల్లనే ఆమె ధూమపానానికీ, సురాపానానికీ అలవాటు పడ్డది. ఈ ప్రయాణంలో అతడామెను తరచు కలుసుకోటానికి అవకాశం లేదు. అందుచేత తానామెకు ఏ విధమైన సాయమూ చేయలేకపోతున్నాడు. కాని ఆమెను రాజకీయ ఖయిదీలతో కలిపిన తరువాత ఆమెలో ఒక ఆంతరంగికమైన మార్పు అతనికి కనిపించింది. అట్టి మార్పు ఆమెలో రావాలనే అతడు ఇన్నాళ్ళనుంచీ కోరుకుంటున్నాడు. టోమస్క్‌లో ఆమెను మొదటి సారి కలిసికొన్నప్పుడు...మాస్కో విడిచి వచ్చేటప్పుడు ఎలా ఉండేనో అలాగే కనిపించింది. తన్ను చూసి, కోపగించుకోలేదు, భావావ్యాప్తి కనబరచలేదు. సంతోషంగా ముందుకు వచ్చి అతనితో మాటాడింది; అతడు చేసిన మేలుకు కృతజ్ఞత చెప్పింది; ముఖ్యంగా రాజకీయ ఖయిదీలతో తన్ను కలిపినందుకు ధన్యవాదం పలికింది.

మస్లోవాకు రాజకీయ ఖయిదీలతో సాహచర్యం లభించి రెండు నెలలయింది. ఏతత్ఫలితంగా ఆమెలో కలిగిన ఆంతరంగికమైన మార్పు పరిణామం శారీరకంగా కూడా కనిపించసాగింది. వొళ్లు సన్నబడింది. ముఖం వాడు వారింది. వయసు మీరిన మనిషిలా కనిపిస్తోంది. నుదుటిమీద, మూతిపక్కన ముడుతలు ఏర్పడుతున్నాయి. ముంగురులిప్పుడు పాలభాగంమీద వచ్చి పడటం లేదు. రుమాలుతో పైకి ఎగకట్టేసుకుంటోంది. పురుషుల్ని చక్కిలిగింత పెట్టే విలాస చేష్టలామెలో ఇప్పుడు లేవు. వేషభాషలు మార్పు చెందాయి. రోజు రోజుకూ ఈ మార్పు సాగిపోతూనే ఉంది. అందుకు నెఖ్లూడోవ్ చాలా సంతోషించాడు.

ఇప్పుడు మస్లోవాపట్ల అతనికొక వినూత్న భావం కలిగింది. ఇట్టి భావం అతని కిదివరకెన్నడూ అనుభూతమై యుండలేదు. ప్రప్రథమంలో ఆమెపట్ల కలిగిన వలపుటూహలకన్నా...ఆ తరువాత కలిగిన తీవ్రవాంఛా సంకలితమైన మోహంకన్నా...అటు తర్వాత కోర్టులో విచారణానంతరం

ఆమె యెడల తాను చేసిన అపచారాన్ని సరిదిద్దుకోవాలన్న అనుతాపంతో ఉద్భవించిన సద్భావం కన్నా... ఇప్పుడు కలిగిన ఈ విహూత్న అనుభవం భిన్నమైనది. ఇప్పుడామె అంటే అతనికి కేవలం జాలి జాలువారుతోంది. మొదట ఆమెను జైల్లో చూచినప్పుడు ఈ జాలే కలిగింది. ఆ తరువాత ఆసుపత్రిలో డాక్టరుతో ఆమె ఏదో ప్రేమకలాపం జరిపిందని తాను భావించినా ఆమెను క్షమించాడు. ఆ సందర్భంలోనూ ఈ జాలే ప్రకటించాడు. కాని అప్పటి జాలికీ, ఇప్పటి జాలికీ ఒక్క భేదముంది. అప్పటి జాలి తాత్కాలికమైంది. ఇప్పటిజాలి శాశ్వతమైంది. ఈ జాలి అతని ప్రతి ఆలోచనకూ, ప్రతి పనికీ ప్రాతిపదికైంది. ఈ జాలి ఆ ఒక్క మస్లోవా అనే వ్యక్తిపట్లనే కాదు; ప్రతిప్రాణిపట్లా ప్రవహించసాగింది. అతని ఆత్మలోని ప్రేమ ప్రవాహం గట్లు తెంచుకుని ప్రవహించసాగింది.

మస్లోవా రాజకీయ ఖైదీలతో ఉంటోంది కాబట్టి నెక్లూడోవ్‌కు కూడా చాలమంది రాజకీయ ఖైదీలతో పరిచయం ఏర్పడింది. ఎకేటరిన్‌బర్గ్‌పట్టణంలో ఈ రాజకీయ ఖైదీలందర్నీ ఒకే పెద్ద గదిలో ఉంచారు. అక్కడ వారు స్వేచ్ఛగా కాలం గడిపారు. ఆ సందర్భంలో నెక్లూడోవ్ కూడా వాళ్ళతోనే ఉన్నాడు. అక్కడనించి ప్రయాణమైన తరువాత మస్లోవా జట్టులో అయిదుగురు పురుషులు, నలుగురు స్త్రీలు ఉన్నారు. నెక్లూడోవ్ రాజకీయ ఖైదీలతో పరిచయం ఎక్కువౌతున్నకొద్దీ, వాళ్ళంటే తన కదివరకున్న అపోహలు చాలవరకు తొలగిపోయాయి.

ఆరోజుల్లో రష్యాలో సాగుతోన్న విప్లవోద్యమం అంటే మొదటి నించీకూడా నెక్లూడోవ్‌కు కోపం, అసహ్యం. ప్రభుత్వాన్ని కూలదొయ్యటం కోసం వాళ్ళు అనుసరించే క్రూరమైన రహస్య విధానాలను అతను ఏవగించుకునేవాడు. వాళ్ళు దుర్మార్గంగా అనేక హత్యలు చేశారు. విప్లవోద్యమంలో పనిచేసే ప్రతివాడికీ తప్పనిసరిగా అహంభావం ఉండేది. ఇవన్నీ నెక్లూడోవ్‌కు అసహ్యంగా ఉండేవి. కాని ఇప్పుడతనికి వారితో ముఖా ముఖి పరిచయం కలిగింది. వారిని గురించి ఎక్కువగా తెలుసుకోగల అవకాశం లభించింది. ప్రభుత్వం చేతుల్లో వాళ్ళు ఎన్నో బాధలు అనుభవించారు 'అటు వాళ్ళు అలాగే ఉంటారు. అలాగే సంచరిస్తారు. ఇంకోవిధంగా ఎలా ఉంటారు?' అనుకున్నాడు.

క్రిమినల్ నేరస్థులనబడేవాళ్ళను ప్రభుత్వం క్రూరాతి క్రూరంగా హింసిస్తోంది. కాని శిక్ష చెప్పేముందూ, చెప్పిన తర్వాత వాళ్ళ పట్ల రవంత న్యాయంగానే ప్రవర్తిస్తోంది. కాని రాజకీయ ఖయిదీలవిషయంలో ఆ మాత్రం న్యాయంకూడా చూపటంలేదు. ఈ విషయం పస్టోవా, మరి ఇంకా కొంతమంది రాజకీయ ఖయిదీల సంగతి గమనిస్తే తెలిసిపోతుంది. వీళ్ళ గతి వలలో చిక్కిన చేపల గతిలాగ ఉంది. వలలో చిక్కిన చాపల్ని లాగి ఒడ్డుకు విసిరిపారేస్తారు. ఆ తరువాత పెద్ద చేపల్ని ఏరి పట్టుకుపోతారు. చిన్న చేపల్ని అక్కడే విడిచి వెళ్ళిపోతారు. అవి అక్కడ గిలగిల తన్నుకుని చచ్చిపోతాయి. వాటి గతి ఎవరూ చూడరు. ఏ నేరమూ చేయని వాళ్ళను, సంఘానికి ఏ విధంగానూ అపకారులు కానివాళ్ళను వందల మందిని ప్రభుత్వం ఖయిదు చేస్తుంది. వాళ్ళను ఏళ్ళతరబడీ జైళ్ళలో బంధించి వుంచుతుంది. కొంతమంది క్షయ మొదలైన రోగాలకు గురిఔతారు. కొందరికి మతిచెడిపోతుంది. ఇంకా కొందరు ఆత్మహత్య చేసుకుంటారు. ఆఫీసర్లకు వాళ్ళను విడుదలచేద్దామన్న బుద్ధి కలగదు. ఏ కేసు విచారణలోనైనా వాళ్ళవల్ల ఏ అంశానికైనా సమాధానం దొరకగలదన్న ఉద్దేశంతో జైళ్ళలోనే వుంచుతారు. ప్రభుత్వం దృష్టిలో కూడా వీళ్ళంతా నిర్దోషులే. వీళ్ళ బ్రతుకంతా పోలీసు ఆఫీసర్ల, పబ్లిక్ ప్రాసిక్యూటర్ల, మేజిస్ట్రేట్ల, గవర్నర్ల, లేక మంత్రుల చేతుల్లో వుంది. ఎవరో ఒక వుద్యోగి తన పై అధికార్ల ఆజ్ఞాను సారమో, లేక తాను పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవాలనో కొన్ని వందల మందిని అరెస్టు చేయిస్తాడు; జైల్లో పెట్టిస్తాడు, ఇష్టమైతే వొదిలి పెడతాడు, లేకపోతే లేదు. పై యధికార్లు కూడా అట్టి వుద్దేశాలతోనే...ఏ మంత్రితోనో తనకున్న పలుకుబడి ఆధారంగా...అనేకమందిని ప్రపంచంలో ఏ మూల మూలకో...ప్రవాస శిక్ష విధించి...పంపించేస్తాడు, లేదా సైబీరియాకు తోలేస్తాడు, ఉరిశిక్ష విధిస్తాడు...లేకపోతే ఏ ఆడదో వచ్చి బ్రతిమాలితే విడిచిపెట్టేస్తాడు.

యుద్ధంలో శత్రువుల్ని నిర్మూలించేందుకు ఎటువంటి విధానాల్ని సాధారణంగా అనుసరిస్తారో, వీళ్ళపట్ల కూడా అట్టి విధానాల్నే కొనసాగిస్తూ వుంటారు. మిలిటరీవాళ్ళ దుర్మార్గాలన్నీ ఎవరూ నిందించరు. పైగా ఆ దుర్మార్గాలే ఉత్తమ వీర కృత్యాలుగా ప్రచారం పొందుతూ ఉంటాయి.

ఆలాగే ప్రభుత్వ యంత్రం నిర్వహిస్తున్నామనుకునే ఈ రాజకీయవేత్తల అకృత్యాలన్నీ, అమానుష కార్యాలన్నీ ప్రజా సంక్షేమ కార్యకలాపాలుగా ప్రచారం పొందుతూ వుంటాయి. ఇది చాలా విచిత్రమైన విషయం. ఒక ప్రాణి బాధపడుతూంటే మనం చూడలేం. ఇంకో ప్రాణికి బాధ కలిగించటమంటే వొళ్ళు జలదరిస్తుంది. అయినా...అంత మెత్తని మనస్సుగల వ్యక్తుల్ని కూడా ప్రభుత్వం హంతకులుగా తయారుచేస్తున్నది. కొన్ని సందర్భాల్లో, ఆత్మరక్షణయందు, ఉన్నతాదర్శాల సాధనయందు, ప్రజాసంక్షేమ సిద్ధికీ... హత్యలు న్యాయసమ్మతమైనాయి. ప్రభుత్వం తన కార్యకలాపాలకు, తాను నిర్ణయించే శిక్షలకు ప్రాధాన్యత ఇస్తున్నట్టే ఈ విప్లవకారులు కూడా తమ ఉద్యమానికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వటం సహజమే. అంత ఆత్మ విశ్వాసం, అహంభావం లేకపోతే వాళ్ళు...ప్రభుత్వం తమపట్ల చూపుతూన్న క్రౌర్యాన్ని, విధిస్తున్న శిక్షల్ని...తట్టుకోటం చాలా కష్టం. విప్లవకారులపట్ల నెఖ్లూడోవ్‌కు క్రమేణా యిలాటి భావాలు కలుగుతూ వచ్చాయి.

ఇలాగ విప్లవకారులను గురించి నెఖ్లూడోవ్ ఎక్కువగా తెలుసుకోగలిగాడు. కొందరు అనుకుంటూన్నట్లు వారు కేవలం దుర్మార్గులు, విద్రోహులు కానేకారు; మరికొందరు భావిస్తున్నట్టు ఉత్తమ నాయక శిరోమణులూ కారు; కేవలం మామూలు మనుషులే. వాళ్ళలోనూ మంచివారూ, చెడ్డవారూ, మధ్యస్థులూ...అన్నిరకాలవారూ వున్నారు.

ప్రస్తుతం సంఘంలో వున్న అనర్థాలను నిర్మూలించేందుకే కొందరు విప్లవకారులుగా మారిపోయారు. దాన్నే వారు తమ కర్తవ్యంగా భావించారు. మరికొందరు, స్వలాభాపేక్షతో స్వార్థపరులై విప్లవ సంఘంలో చేరినవారూ వున్నారు. వొంట్లో వేడిరక్తం ప్రవహిస్తూన్న సాధారణ యువకులందరికీ మామూలుగా ఏవో సాహస కృత్యాల్లో జొరబడి అపాయాల్ని ఎదుర్కోవాలన్న తహ తహ, యితర ప్రాణాలతో చెలగాటం ఆడాలన్న ఉత్సాహం వుంటాయి. మిలిటరీ ఉద్యోగం చేసినప్పటి తన అనుభవం వల్ల నెఖ్లూడోవ్‌కు ఈ సంగతి తెలుసు. అట్టి వుత్సాహ వంతులైన సాధారణ యువకులే ఎక్కువగా ఈ విప్లవ సంఘంలో చేరారు. అయితే వీరికి గల నైతిక భావాలు మామూలు యువకుల కుండే భావాలకన్నా ఉత్కృష్టమైనవనే చెప్పాలి. ఆత్మనిగ్రహం, ఎట్టి కష్టాలనైనా సహించటం, సత్యాన్ని అంటిపెట్టుకుని

వుండటం...యిటువంటి సద్గుణాల్ని వాళ్లు అలవరుచుకుంటున్నారు. అంతే కాదు, ప్రజాబాహుళ్యం కోసం దేనినైనా-ఆఖరుకు ప్రాణాల్ని అయినా సరే-త్యాగం చెయ్యటానికి సిద్ధపడుతున్నారు. కాగా వారిలో ఉత్తములైన వారు అనన్య దుర్లభమైన స్థాయిలో వున్నారు. అధములైనవారు నీచాతి నీచమైన స్థాయిలో వున్నారు. అట్టివారు అసత్య ప్రలాపులు, అహంభావ పూరితులు, గర్వపోతుల్లాగే వున్నారు. అట్టి వుత్తములైనవారి పట్ల నెక్లూడోకు గౌరవం కుదిరింది. వారిని హృదయపూర్వకంగా ప్రేమించాడు. అధములైనవారి పట్ల మాత్రం అసహ్యించుకుంటూనే వున్నాడు.

౬

క్రిల్ట్సో అనే యువకునిపట్ల నెక్లూడోకు ప్రత్యేకాభిమానం ఏర్పడింది. అతన్ని నిర్బంధ ఖైదీగా పని చేయించటానికి దూరదేశం తీసుకు పోతున్నారు. అతనికి క్షయవ్యాధి. మస్లోవా జట్టులోని వారిలో అతడొకడు. ఎకెటరిన్‌బర్గు పట్నంలో నెక్లూడోకు అతనితో పరిచయం ఆరంభమైంది. వేసంగిలో ఒకరోజల్లా నెక్లూడో అతనితో గడిపాడు. అతడొకసారి తన కథ అంతా...ఎప్పుడు ఎలాగ తాను విప్లవ సంఘంలో చేరిందీ...చెప్పాడు, అతని తండ్రి ఒక పెద్ద భూస్వామి, చాలా ధనవంతుడు. క్రిల్ట్సో చిన్నతనంలోనే తన తండ్రిని కోల్పోయాడు. తల్లి పోషణలో పెరిగాడు. ఒక్కడే కొడుకు. బడికి వెళ్ళి చదువుకున్నాడు. విశ్వవిద్యాలయంలో గణితశాస్త్రంలో ప్రథముడుగా ఉత్తీర్ణుడైనాడు. విదేశాలకు వెళ్ళి చదివేందుకు విశ్వవిద్యాలయంవారు అతనికి కొంత ఉచిత వేతనం యిస్తామన్నారు. కాని విదేశాలకు వెళ్ళే విషయం త్వరగా తేల్చుకోలేక పోయాడు క్రిల్ట్సో. ఒక అమ్మాయిని ఎవరినో ప్రేమించాడు. ఆమెను పెళ్ళి చేసుకుని పల్లెటూళ్లో ఒక ఉద్యోగం సంపాదించుకుని జీవితంలో కుదురుకుందా మనుకున్నాడు. కాని అతడు త్వరగా ఏ నిర్ణయానికీ రాలేదు. అనేక తోవలు ఆలోచిస్తూ వుంటాడు. ఇలా వుండగా కొందరు కాలేజీ స్నేహితులు వచ్చి కొంత ధనం యిమ్మని అర్థించారు. ఆ ధనం వాళ్లు విప్లవ సంఘ కార్యకలాపాల కోసం అడుగుతున్నారని అతనికి తెలుసు. ఆ రోజుల్లో అతనికి విప్లవ సంఘంపట్ల సానుభూతి ఏమీ ఉండేదికాదు. కాని స్నేహితులు అడిగారుకదా అనీ, ఏదో

కాస్త మెహర్బానీ కోసం, వాళ్ళు తన్ను భయస్తుడని అనుకోకుండానూ, డబ్బు ఇచ్చాడు. అలా డబ్బు పట్టుకుపోయినవాళ్ళు ప్రభుత్వం చేతుల్లో పట్టుబడ్డారు. వాళ్ళకు ధన సహాయం చేసినవాడు క్రిస్టసో అని వాళ్ళ దగ్గర దొరికిన ఒక ఉత్తరంవల్ల తెలిసిపోయింది. క్రిస్టసోను కూడా అరెస్టుచేసి పోలీసు స్టేషన్‌కు తీసుకొచ్చారు, జైల్లో పెట్టారు.

ఈ కథంతా క్రిస్టసో ఒక మంచంమీద...మోచేతులు మోకాళ్ళపై ఆనించి ముందుకు వొంగి కూచుని చెబుతున్నాడు నెక్లూదోవ్‌కు. జ్వరతీవ్రతలో వలె అతని కళ్ళు మెరుస్తున్నాయి. అతనివి చాల చక్కని కళ్ళు. ఇలా చెబుతున్నాడు: "ఆ జైల్లో అంత కఠినంగా ఉండేవాళ్ళు కాదు అధికార్లు. ఖయిదీలమంతా స్వేచ్ఛగా మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళం. ఒకరికొకరం ఆహారపదార్థాలూ, పుగాకు ఇచ్చుకుంటూ ఉండేవాళ్ళం. అప్పుడప్పుడు వరండాలో పచార్లుచేస్తూ ఉండేవాళ్ళం. సాయంత్రమప్పుడు అందరం కలసి ఏవో గీతాలు పాడేవాళ్ళం. నా గొంతుకు చాలా బాగుండేది. జైల్లో ఉన్నప్పుడే...ఎంతో పేరుపడ్డ పెత్రోవ్‌ను మీరు ఎరిగివున్నారు కదూ...అతనితో నాకు పరిచయం కలిగింది. పెత్రోవ్ తరువాత కొన్నాళ్ళకు ఒక గాజు ముక్క మింగి ఆత్మహత్య చేసుకున్నాడు. అంతవరకూ నేను విప్లవసంఘంలో చేరనేలేదు. పక్క జైలుగదిలో ఉన్న మరి యిద్దరు విప్లవవీరులతో కూడా నాకు పరిచయంలభించింది. వాళ్ళిద్దరూ ఒకే సందర్భంలో అరెస్టు అయినారు. వాళ్ళ దగ్గర పోలిష్ ప్రొక్లమేషన్సు దొరికాయి. వారిలో ఒకని పేరు లోజిన్‌స్కీ. అతడు పోలెండు వాస్తవ్యుడు. రెండవవాడు యూదుజాతి మనిషి. అతనిపేరు రొజోవ్‌స్కీ. ఈ రొజోవ్‌స్కీ చాలా చిన్నవాడు. తన వయస్సు పదిహేడు సంవత్సరాలని చెప్పాడు. కాని పదిహేనేళ్ళ కుర్రవాడులా కనిపించేవాడు. సన్నగా, పొట్టిగా, బహుచురుగ్గా ఉంటాడు. నల్లని కళ్ళు మెరుస్తూ ఉంటాయి. గొంతులో జీర ఉంటుందిగాని చాల చక్కగా పాడేవాడు. ఒకనాటి ఉదయం వాళ్ళిద్దర్నీ విచారణకు తీసుకుపోయారు. సాయంత్రానికల్లా మళ్ళీ తీసుకొచ్చేశారు. కోర్టులో విచారణ అయిపోయింది. ఇద్దరికీ మృత్యుదండన విధించారు. అంత కఠినశిక్ష విధిస్తారని ఎవరూ అనుకోలేదు. వాళ్ళు చేసినతప్పు అంత గొప్పదేమీ కాదు. పోలీసుల చేతుల్లో చిక్కిన తరువాత పారిపోవటానికి ప్రయత్నించారుట, అంతే. వాళ్ళు ఎవరికీ ఏ విధమైన అపకారమూ చేయలేదు. అదీగాక అంత చిన్న

క్రూరవాడు రోజోస్కీని కూడా చంపిపారేయటమేనా? అటువంటి కఠిన శిక్ష విధించినట్లు...వాళ్ళను భయపెట్టటానికి...ప్రకటించారే గాని... నిజంగా అమలు జరుపరని...జైల్లో ఉన్న ఖయిదీలమంతా అనుకున్నాం. మొదట చాల ఆత్రుతపడ్డాం. కాని క్రమేణా ఏదో సమాధాన పడ్డాం. మళ్ళీ పరిస్థితులు మామూలు ధోరణిలో సాగిపోతున్నాయి. ఒకనాటి సాయంకాలం జైలు కాపలాదారు నా గదిలోకి వచ్చి ఉరికంబం ఏర్పాటు చేస్తున్నారని వార్త చెప్పాడు. మొదట నాకేమీ బోధపడలేదు. ఏమిటది? ఉరికంబ మేమిటి? ఆ జైలుకాపరి చాల భావావేశంలో ఉన్నాడు. ఉరికంబం ఆ యిద్దరికోసమేనని నాకు స్ఫురించింది. పక్క గదుల్లో ఉన్న ఖయిదీలకు ఈ వార్త అందజేద్దామని అనుకున్నాను–కాని నాకు భయం కలిగింది. సంగతి మాత్రం అందరికీ తెలిసింది. ఆ సాయంత్రం ఆ ప్రాంతమంతా నిశ్శబ్దంగా ఉండింది. ఎవరూ గొంతెత్తి పాడలేదు. పదిగంటలప్పుడు ఆ జైలుకాపరి మళ్ళీ వచ్చాడు. ఉరితీసేందుకు ప్రత్యేకంగా ఒక ప్రముఖుడు మాస్కోనగరం నించి వచ్చాడని చెప్పాడు. చెప్పి వెంటనే వెళ్ళిపోతున్న వాణ్ణి తిరిగి రమ్మని కేక వేశాను. ఇంతలో రోజోస్కీ కంఠధ్వని వినిపించింది: "ఏమిటది? ఎందు కతన్ని పిలుస్తున్నావు?" అని అడిగాడు నన్ను వరండాలోనించి. "పాగా కేమన్నా తెచ్చిపెడతాడేమోనని పిలుస్తున్నాను" అన్నాను. కాని అతడు విషయం గ్రహించినట్టున్నాడు. "ఇవాళ మీరెవరూ కూడా పాడలేదేం?" అని అడిగాడు. దానికి సమాధానం నేనేమి చెప్పానో నా కిప్పుడు జ్ఞాపకం లేదు. అతనితో మాట్లాడ్డం ఆపేసి లోపలకు వెళ్ళిపోయాను. అది చాల భయంకరమైన రాత్రి. చీమ చిటుకుమంటే వినిపిస్తోంది. తెల్లవార వచ్చింది. తలుపులు తెరచినప్పుడు చాలమంది నడిచిపోతున్న అలికిడి. లేచి తలుపుదగ్గ రకు వచ్చాను. తలుపు సందులోనించి చూచాను. వరండాలో ఒక లాంతరు వెలుగుతోంది. మొట్టమొదట ఇన్‌స్పెక్టరు వెళ్ళాడు. లావుపాటి మనిషి ఆయన. మామూలుగా ఒక స్థిరసంకల్పం, ఆత్మనిగ్రహంగల మనిషి. కాని ఆ తరుణంలో ఆయనముఖంలో నెత్తురు చుక్కలేదు. ఎందుకో భయభీతుడులా కనిపించాడు. అతని వెనకనే చిన్న ఇన్‌స్పెక్టరు వెళ్ళాడు. ఏదో పట్టుదలతో ఉన్నవాడులా కనిపించాడు. కాని ముఖవైఖరి సవ్యంగా లేదు. ఆ వెనుక చాలమంది వెళ్ళారు. చివరకు జైలుకాపరి కూడా వెళ్ళాడు. అందరూ నాగది ముందునించే వెళ్ళారు. వెళ్ళి నాపక్క గదిముందు ఆగారు. "లోజిన్‌స్కీ,

నిద్రపో. లేచి దుస్తులు ధరించు"-అన్నాడు ఇన్‌స్పెక్టరు. అతని కంఠ ధ్వని అదో రకంగా ఉంది. ఆ వెంటనే తలుపు తెరచిన ధ్వని-వాళ్ళంతా ఆ గది లోకి వెళ్ళారు. వరండాలో ఇన్‌స్పెక్టరు ఉన్నాడు. అతని ముఖం పాలిపోయి ఉంది. కోటుగుండీలు సర్దుకుంటూ ఉన్నాడు. భుజాలు ఎగురవేస్తున్నాడు మధ్య మధ్య. మరి కాసేపటికి ఎందుకో భయపడుతున్న వాడులాగ ఉన్న చోటునించి కదిలిపోయాడు. ఇంతలో అతని పక్కగా నడిచివచ్చాడు లోజిన్‌స్కీ నా గది ముందుకు. అతను చాల అందమైన యువకుడు. మంచి పోలిష్ ఫేషన్‌లో ఉంటాడు. వెడల్పు అయిన ఎదురురొమ్ము. చక్కని ఉంగరాలు తిరిగిన జుట్టు - ఒకటోపీ - అందమైన కన్ను. మంచి ఆరోగ్యవంతుడు. యౌవనంలో మిసమిసలాడుతూ ఉన్నాడు. అతడువచ్చి నా గదముందు ఆగాడు. తలుపు సందులోనించి అతని ముఖం నాకు బాగా కనపడ్తోంది. "క్రిల్ట్‌సో! సిగరెట్లు ఏమైనా ఉన్నాయా?" అని అడిగాడు. నా దగ్గర ఉన్న సిగరెట్లు కొన్ని తీసి ఇద్దామనుకున్నాను- కాని ఇంతలో నేఇన్‌స్పెక్టరు వచ్చి తన సిగరెట్ కేసు అందించాడు. లోజెన్‌స్కీ ఒక సిగరెట్ తీసుకున్నాడు. ఇన్‌స్పెక్టరు ఒక అగ్గిపుల్ల గీచాడు. లోజెన్‌స్కీ సిగరెట్ వెలిగించుకుని పొగ పీలుస్తూ ఏమో ఆలోచిస్తున్నట్టుగా నిల్చున్నాడు. ఇంతలో ఏదో జ్ఞాపకం వచ్చినవాడులాగ మాట్లాడ్డం ఆరంభించాడు. "ఇది చాల క్రూరం; అన్యాయం; నేనేమీ నేరం చెయ్యలేదు. నేను—" అతని కంఠం వొణుకుతోంది. మాట ఆగిపోయింది. నా దృష్టి అతని కంఠంమీదే ఉంది. ఇంతలో రోజోస్కీ బిగ్గరగా అరవటం వినిపించింది. లోజెన్‌స్కీ సిగరెట్ పారేసి నా తలుపుముందునించి కదిలిపోయాడు. అతని స్థానంలో రోజోస్కీ వచ్చి నిల్చున్నాడు. అతని ముఖం ఎర్రగా, పాలుగక్కుతోంది. ఉతికిన దుస్తులు ధరించాడు. అతని లాగు వొదులు వొదులుగా ఉంది. మాటిమాటికీ పైకి లాక్కుంటున్నాడు. వొళ్ళంతా కంపిస్తోంది. అతని ముఖంలో దైన్యం కనిపిస్తోంది. నా తలుపు సందువద్ద వచ్చి నిల్చాడు. "క్రిల్ట్‌సో! డాక్టరు నాకు దగ్గుమందు ఇచ్చాడు కదూ! ఇంకా కొంచెం తాగనా?" అని అడిగాడు. ఎవరూ జవాబు చెప్పలేదు. నాకేసీ, ఇన్‌స్పెక్టరువైపూ చూస్తూ నిల్చున్నాడు. అతని ఉద్దేశం ఏమిటో నాకు బోధపడలేదు. ఇంతలో చిన్న ఇన్‌స్పెక్టరు ముందుకు వచ్చి కఠినంగా అరిచాడు: "ఏమిటీ పరాచకాలూ, మీరూను? పదండి" రోజోస్కీ తనకు ఏం జరగబోతున్నదో తెలుసుకో

లేని అయోమయావస్థలో అటూ ఇటూ వరండామీద పరుగులెత్తాను. అరచాడు. ఏడ్చాడు. నాకంతా వినిపిస్తూనే ఉంది. క్రమేణా ఏడుపు ఆగిపోయింది. తలుపు తెరచిన చప్పుడు. తరువాత అంతా నిశ్శబ్దం. వాళ్ళను ఉరి తీశారు. ఆ దృశ్యమంతా చూచివచ్చిన జైలుకాపరి ఒకడు నాకు అంతా చెప్పాడు. లోజిన్స్కీ ఏమాత్రమూ పెనగులాడలేదుట. రొజోవ్స్కీ మాత్రం చాలసేపు పెనగులాడుతూ గొడవ చేశాట్ట. అప్పుడు కొందరతన్ని బలవంతాన లాక్కొచ్చి, తలకాయ ఉచ్చులో దూర్చారట. ఈ విషయమంతా నాకు చెప్పిన ఆ జైలుకాపరి వట్టి మందబుద్ధి. ఇలా అన్నాడు: "ఆ వ్యవహారమంతా చూడ్డానికి చాల భయంకరంగా ఉంటుందని చెప్పారు నాకు. కాని ఏమీ భయంకరంగా లేదు. వాళ్ళు ఉరికంబానికి వేలాడుతూ కొత్త బుజాలు ఎగురవేశారు, అంతే—" అంటూ తన బుజాలు పైకి కిందికీ ఊపి చూపించాడు. "ఆ తరువాత ఉరికంబం దగ్గర ఉన్న మనిషి వాళ్ళ కాళ్ళు పట్టుకుని కిందికి లాగాడు. ఉచ్చు బిగిసింది. అంతటితో ఆ వ్యవహారం ముగిసిపోయింది. మళ్ళీ వాళ్ళు బుజాలు ఊపలేదు."

"ఏమీ భయంకరంగా లేదు" అంటూ ఆ జైలుకాపరి చెప్పిన వాక్యమే మరొకసారి ఉచ్చరిస్తూ క్రిల్ట్సో మందహాసం చేయటానికి ప్రయత్నించాడు. కాని మరుక్షణమే వెక్కి వెక్కి ఏడ్చాడు.

తన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తూ, పొర్లి పొర్లి వస్తున్న దుఃఖాన్ని బలవంతాన ఆపుకుంటూ క్రిల్ట్సో అలాగే చాలాసేపు గడిపాడు.

"ఆ నాటినుంచీ నేను కూడా విప్లవ సంఘంలో చేరాను" అన్నాడు చివరకు క్రిల్ట్సో. ఆ తరువాత తన కథ యావత్తూ క్లుప్తంగా చెప్పి ముగించాడు.

అతడు తీవ్రవాదుల పక్షానికి చెందిన వ్యక్తి. తమ తీవ్రతర కార్యకలాపాల ఫలితంగా ప్రభుత్వం భయపడిపోయి అధికారాన్ని విడిచిపెట్టి వైదొలగిపోవాలని ఈ సంఘీయుల పట్టుదల. ఈ ఆశయంతోనే అతడు పీటర్సుబర్గు, కీవ్, ఒడిస్సా, ఇంకా విదేశాల్లో కూడా పనిచేశాడు. అన్నిచోట్లా అతని కార్యకలాపాలు విజయమే పొందాయి. చివరకతని అనుచరుడే తనకు ద్రోహం చేశాడు. పోలీసులు అతన్ని అరెస్టుచేసి పట్టుకొచ్చారు; విచారణ జరిగింది; రెండు సంవత్సరాలు జైల్లో అట్టిపెట్టారు. మొదట

మరణశిక్ష విధించారు. కాని తరువాత దయదలచి శిక్ష తగ్గించారు. ఇప్పు డతన్ని నిర్బంధ బానిసగా ఎక్కడికో తీసుకు పోతున్నారు.

జైల్లో నిర్బంధితుడైన తరువాతనే అతనికి క్షయవ్యాధి వచ్చింది. అతని ప్రస్తుతస్థితినిబట్టి చూస్తే ఇంకా కొన్ని నెలలేమన్నా బ్రతుకుతాడేమో! ఆ సంగతి అతనికీ తెలుసు. అయినా అతడు విచారపడటంలేదు. ఇంకో జన్మ ఎత్తవలసి వచ్చేట్టయితే ఆ జన్మకూడా ఇలాగే...ప్రస్తుతం సంఘంలో జరుగుతున్న దుర్మార్గాల్నీ, అత్యాచారాల్నీ నిర్మూలించేందుకే వినియోగిస్తా నని నిరాఘాటంగా చెబుతాడు.

ఇతని కథ, ఇతనితో పరిచయం నెఖ్లూదోవ్‌కు ఎన్నో కొత్త విషయా లను...తా నిదివరకు ఎరిగియుండని అంశాలను బోధించింది.

## ౭

చంటిబిడ్డ విషయమై ఆఫీసరు పెద్ద గందరగోళం చేసిన ఆ రోజు రాత్రి నెఖ్లూదోవ్ ఆ ఊళ్ళో ఒక సత్రంలో గడిపాడు. మర్నాటి ఉదయం కొంచెం ఆలస్యంగా లేచాడు. ఆ చేరువనే పోస్టాఫీసు వున్న పట్నానికి వెళ్ళి కొన్ని ఉత్తరాలేవో రాసి పోస్టు చేశాడు. మళ్ళీ సత్రానికి వచ్చి బయలుదేరేసరికి ఆలస్యం అయింది. ఈ లోగానే ఖయిదీలంతా ప్రయాణమై సాగిపోయారు. నెఖ్లూదోవ్ వాళ్ళను దారిలో కలుసుకోలేకపోయాడు. సాయంత్రమైన తర్వాత ఖయిదీలు చేరిన పల్లెకు తానూ చేరుకున్నాడు.

ఆ ఊళ్ళో ఒక సత్రం వుంది. ఆ సత్రం యజమానురాలు ఒక వయసు మళ్ళిన యువతి. కొంచెం లావుగా వుంటుంది. నెఖ్లూదోవ్ ఆ సత్రంలో బస చేశాడు. కాస్త విశ్రాంతి తీసుకున్న తర్వాత ఒక పరిశుభ్రమైన గదిలో కూచుని తేనీరు తాగాడు. ఆ గదినిండా చాలా పటాలు వేలాడుతున్నాయి. మరి కాసేపటికి నెఖ్లూదోవ్ లేచి ఆఫీసరు దగ్గరకు బయలుదేరాడు. ఆఫీసరు అనుజ్ఞ తీసుకుని మస్లోవాను కలుసుకుందామని అతని వుద్దేశం. కొన్నాళ్ళ నుంచీ అతడు మస్లోవాను కలసి మాటాడలేదు. ఆరు ఊళ్ళలో ఆగారు ఖయిదీలు ఈ మధ్య. కాని ఎక్కడా అతడు మస్లోవాతో కలసి మాటా డేందుకు అధికార్లు అనుజ్ఞ ఇవ్వలేదు. ఆఫీసర్లు మారుతూ వచ్చారు. కాని

ఏ ఒక్కడూ అతన్ని ఖయిదీలుండే చోటుకు పోనీయలేదు. ఎవరో పెద్ద ఆఫీసరు రానున్నాడన్న భయంవల్ల ఆఫీసర్లు స్ట్రిక్టుగా ఉంటున్నారు. కాగా నెఖ్లూదొవ్ మస్లోవాను చూసి వారం రోజులు దాటింది. ఈ మధ్య ఆ వస్తాడనుకున్న పెద్ద ఆఫీసరు ఆ దారినే... ఖయిదీల బసలోకి వచ్చి చూడకుండానే వెళ్ళిపోయాడు. కాబట్టి ఇక ఆఫీసర్లు తనకు అనుజ్ఞ యిస్తారనీ, ఖయిదీలతో వెళ్ళి మాటాడవచ్చుననీ నెఖ్లూదొవ్ ఆశించాడు.

ఖయిదీలందర్నీ ఊరి చివర ఎక్కడో బస చేయించారు. సత్రం గుజమాస్తాలు తన గుర్రపు బగ్గీ చూపించి అందులో వెళ్ళమంది నెఖ్లూదొవ్‌ను. కాని అతడు నడిచే వెడతానన్నాడు. ఆమె అతని వెంట ఒక నౌకరును పంపించింది దారి చూపేందుకు. అతడు విశాలమైన ఛాతీ గలవాడు; మంచి బలిష్టుడు; కొత్తగా తారుపూసి ఘాటుగా వాసన కొడుతూన్న నల్లని యెత్తయిన బూట్లు తొడుక్కున్నాడు.

దట్టంగా పొగమంచు అలముకుంది. కటికి చీకటిగా ఉంది. నౌకరు ముందు నడుస్తున్నాడు. అతడు నెఖ్లూదొవ్‌కు కనిపించటమే లేదు. అతని ఎత్తుబూట్ల చప్పుడు మాత్రం వినిపిస్తున్నది. ఏ యింటి కిటికీలోంచైనా దీపపు వెలుగు వచ్చి పడ్డప్పుడు మాత్రమే ఆ నౌకరు కనిపిస్తున్నాడు నెఖ్లూదొవ్‌కు. చర్చి ముందునుంచి, ఆ పైని వున్న మైదానం దాటి వెళ్ళారు. ఆ తరువాత ఒక పెద్ద వీధిగుండా సాగిపోయారు. ఆ వీధికి ఇరువైపులా ఇండ్లు ఉన్నాయి. కిటికీల్లోంచి వెలుతురు వచ్చి పడుతూనే వుంది. చివరకు ఊరు పొలిమేర చేరారు. అక్కడ మళ్ళా కటిక చీకటిగా వుంది. అయితే అల్లంత దూరాన ఖైదీలు బస చేసినచోట ఉంచిన దీపాలు మసక మసకగా కనిపిస్తున్నాయి. చేరువకు వస్తున్నకొద్దీ అవి ఎర్రని నిప్పు కణికల్లాగ అగుపించాయి. చివరకు గుడారాలు, కాపలా కాస్తున్న మనిషి, నల్లని అక్షరాలేవో రాసిన ఒక బోర్డు కనిపించాయి.

"ఎవరది?" కాపలా కాస్తున్న మనిషి మామూలుగా ప్రశ్నించాడు. నెఖ్లూదొవ్ దగ్గరకు వచ్చాడు. ఎవరో అపరిచితుడనుకుని ఆ కాపలా కాస్తున్న వాడు అతన్ని ముందుకు సాగి రానివ్వలేదు. అడ్డగించాడు. నెఖ్లూదొవ్‌తో వచ్చిన నౌకరు మాత్రం ఏమీ విచలితుడు కాకుండా "ఎందుకంత జబర్దస్తీ

చేస్తా వబ్బాయి ? మేం ఇక్కడే వుంటాంగాని నువ్వు వెళ్ళి మీ ఆఫీసరుతో చెప్పు" అన్నాడు.

ఆ కాపలాదారు జవాబేమీ చెప్పలేదు. పక్కకు తిరిగి ఏదో కేక వేశాడు. ఈ లోగా ఆ నౌకరు ఒక వెదురుపుల్ల తీసుకుని నెల్లాడో బూట్లకు అంటుకున్న బురద అంతా తుడుస్తున్నాడు. లోపలినుంచి కొందరు స్త్రీ పురుషుల కంఠధ్వనులు వినిపించాయి. మరి కాసేపటికి ఒక సార్జంటు కోటు బుజాన వేసుకుని బైటికి వచ్చాడు.

సార్జంటు సౌమ్యుడే. కాని "తమరెవరు ? ఆఫీసరుతో మీకేంపని ?" అంటూ యిలా చాలా ప్రశ్నలు వేశాడు. నెల్లాడో తనొక పనిమీద వచ్చానని చెబుతూ ఒక చీటీ రాసి ఆఫీసరుగారికి అందజేయమని ఇచ్చాడు. అది పుచ్చుకుని సార్జంటు తల ఊపుకుంటూ వెళ్ళాడు.

మరి కాసేపటికి గేటు తెరిచారు. చాలామంది స్త్రీలు బుట్టలు, పెట్టెలు కూజాలు, సంచులు పట్టుకుని బిగ్గరగా మాట్లాడుకుంటూ బైటికి వచ్చారు. వాళ్ళలో ఎవరూ పల్లెటూళ్ళకు చెందిన వాళ్ళుగా కనిపించలేదు. అంతా బస్తీలో నివసించే వ్యక్తుల్లా ఉన్నారు. జాకెట్లూ, వూలుకోట్లూ ధరించారు. తలలకు ఉన్ని రుమాళ్ళు ఉన్నాయి. వాళ్ళు నెల్లాడోను, అతని నౌకరునూ పరీక్షగా చూశారు దీపాల వెలుగులో. వారిలో ఒకతె... వెడల్పాటి ఛాతీ గల ఆ నౌకరును చూడగానే సంతోషంగా, ఉల్లాసంగా "ఒరే, దయ్యమా ! నువ్వు వచ్చావా ? ఏంచేస్తున్నా విక్కడ ?" అని అడిగింది.

"వీరెవరో కొత్తవారు వస్తే-దారి తెలీదని వెంటవచ్చాను. నువ్వెందు కొచ్చావ్ ? ఏం తెచ్చావేమిటి ?"

"పాలు, పెరుగు తెచ్చాను. రేపు ఉదయం మళ్ళీ తేవాలిట ?"

"ఈ రాత్రికి నిన్నిక్కడే ఉండమనలేదటే వాళ్ళు ?"

"పోరా, పో భడవా !" అన్నదామె నవ్వుతూ. "సరేగాని మాతో కూడా ఊళ్ళోకి రారాదూ ?" అన్నది.

దాని కతనేదో పరాచికంగా జవాబు చెప్పాడు. ఆ స్త్రీలు, పెట్రీ కూడా నవ్వారు. తరువాత ఆ నౌకరు నెల్లాడో వైపు తిరిగి అన్నాడు. "మీరు ఒంటరిగా తిరిగి రాగలరా ? దారి తప్పరుకదా ?"

"వస్తాలే-పరవాలేదు."

"చర్చి దాటిన తర్వాత ఆ రెండంతస్తుల మేడ పక్కన రెండో యిల్లే. ఈ కర్ర ఉంచుకోండి" అంటూ తనకన్నా పొడుగ్గావున్న తన కర్రను నెఖ్లూడోవు యిచ్చేసి ఆ యువతులతో కలిసి, బురదలో రోడ్డుమీద ఎత్తయిన బూట్లు తపతప శబ్దిస్తోంటే వెళ్ళిపోయాడు.

చాలాసేపటివరకూ అతని కంఠం, ఆ యువతుల కంఠం ఆ పొగ మంచులోనుంచి వినిపిస్తూనే ఉన్నాయి. చివరకు గేటు తెరచుకుని సార్జంటు వచ్చి, నెఖ్లూడోను లోపలికి రమ్మని తీసుకుపోయాడు.

౮

ఖైదీలను బస చేయించిన ఆవరణ చాలా పెద్దది. చుట్టూ మూళ్ళతీగ మూడు వరుసలుగా నిర్మించారు. ఆ లోపల మూడు గృహాలు ఉన్నాయి. వాటిలో పెద్దది ఖైదీలకు, రెండవదానిలో సైనికులు, మూడోది ఆఫీసరుకు. ప్రతి యింట్లో కిటికీల్లో దీపాలు ఉంచారు. ఇళ్ళముందు వరండాల్లో కూడా దీపాలు ఉన్నాయి. సార్జంటు నెఖ్లూడోను వెంటబెట్టుకుని ఒక యింటికి తీసుకుపోయి బైటిగదిలో ప్రవేశించాడు. అక్కడొక సైనికుడు తేనీరు తయారుచేయటానికి కుంపటిమీద నీళ్లు కాస్తున్నాడు. నెఖ్లూడోను చూడ్డంతోనే అతడు లేచి లోపలిగదిలోకి వెళ్ళి "వారెవరో వచ్చారండీ" అని కబురు చెప్పాడు.

"సరే, లోపలికి రమ్మను" కంఠస్వరం కోపంగా వుంది.

ఆ సైనికుడు మళ్ళీ వచ్చి "ఇలా ఆ గదిలోకి వెళ్ళండయ్యా" అని నెఖ్లూడోతో చెప్పి మళ్ళీ కుంపటి ముందు కూచున్నాడు.

లోపలి గదిలో ఒక లాంతరు వేలాడుతోంది. ఆఫీసరు ముఖం ఎర్రగా వుంది. మీసాలు అందంగా ఉన్నాయి. ఆస్ట్రియన్ జాకెట్ తొడుక్కున్నాడు. అది అతనికి బిగుతుగా వుంది. టేబిల్ముందు కూచున్నాడు. అప్పుడే భోజనం అయింది కామాలు! టేబిల్మీద రెండు సారా సీసాలు వున్నాయి. గదిలో వెచ్చగానే వుంది. సిగరెట్టు పొగ సువాసన దట్టంగా

వస్తోంది. యేదో చౌకపాటి సెంటు పూసుకున్న వాసన కూడా కొడు తోంది. నెక్లూడోను చూడగానే ఆఫీసరు లేచి అతనికేసి వ్యంగ్యంగా, అనుమానాస్పదంగా చూడసాగాడు.

"ఏం కావాలి తమకు?" అని అడిగి జవాబుకోసం ఎదురుచూడ కండానే ఆఫీసరు అటువైపు గదికేసి తిరిగి-"ఏయ్, బెర్నో! ఏం జేస్తు న్నావు? తేనీరు ఎదీ?" అని అడిగాడు.

"వొస్తున్నానండీ"

"ఏం వస్తున్నావు? ఎంతసేపనీ!" గర్జించాడు కోపంగా ఆఫీసరు. ఆయన కళ్ళు ఎర్రబడి పోయాయి.

"వచ్చేస్తున్నానండీ" అంటూ సైనికుడు తేనీరు తీసుకొచ్చాడు. సైని కుడు తేనీటి కెటిల్ టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయాడు. ఆఫీసరు అతనివైపే తీక్షణంగా చూస్తూ ఉన్నాడు..వాడిని ఎక్కడ కొడదామా అన్నట్టు. సైనికుడు దాటిపోయాడు. ఆ తరువాత ఆఫీసరు తన పెట్టెలోనించి బిస్కెట్లు తీసి టేబిల్ మీద పెట్టాడు. తేనీరు కప్పుల్లో పోశాడు. అప్పుడు తలెత్తి నెక్లూడో కేసి చూచి, "ఇప్పుడు నాతో మీకేం పని?" అని అడిగాడు.

నెక్లూడో ఇంకా కూచోలేదు. అన్నాడు: "ఒక ఖైదీని చూడ్డానికి నాకు తమరు అనుమతి ఇవ్వాలి."

"రాజకీయ ఖైదీయా? అయితే అది చట్ట విరుద్ధం"

"నేను చూడగోరే ఖైదీ ఒక యువతి. ఆమె రాజకీయ ఖైదీ కాదు."

"అలాగా? దయచేసి కూచోండి"

నెక్లూడో ఒక కుర్చీలో కూచున్నాడు-అన్నాడు: "ఆమె రాజకీయ ఖైదీ కాదు. కాని ఉన్నతాధికారుల అనుమతితో ఆమె ఇప్పుడు రాజకీయ ఖైదీలతోనే ఉంటోంది—"

"ఓహో, అలాగా-ఇప్పుడు గుర్తుకొచ్చింది. కొంచెం నల్లగా ఉంటుందికదూ!-సిగరెట్టు కాలుస్తారా?"-అంటూ సిగరెట్ పెట్టె నెక్లూ డోకు అందించి... తేనీటిగిన్నె అతని ముందు పెట్టాడు.

"కాని నే నామెను చూచి—" నెక్లూడో ఏమో చెప్పబోయాడు. అర్ధోక్తిలోనే ఆఫీసరు అడ్డువచ్చి—

"రాత్రి ఇంకా చాల ఉంది. ఏం పరవాలేదు. ఆమెను మీ దగ్గరకు పంపిస్తాను" అన్నాడు.

"నా దగ్గరకు పంపించటం దేనికి. ఆమె ఎక్కడున్నదో అక్కడికే నేను వెళ్ళకూడదా?"

"అది చట్ట విరుద్ధం. రాజకీయ ఖయిదీలున్న చోటికి మీరు వెళ్ళ కూడదు."

"ఇదివరకు చాలసార్లు వెళ్ళనిచ్చారే! నేను వాళ్ళకేదైనా అంద జేస్తారనని మీ భయమా? ఒకవేళ ఆమెనే నావద్దకు పంపించినా...ఆ అంద జేసేది ఆమెద్వారా అందించకూడదూ నేను?"

"ఆమెను నేను సోదా చూస్తాంగా!" అంటూ ఆఫీసరు చాల అస హ్యంగా నవ్వాడు.

"షాన్లీ, వస్తే సోదా చూచి పంపించండి"

"అంత అవసరం లేకండా నే చూస్తాం" అంటూ ఆఫీసరు కెటిల్ ఎత్తి మరికొంత తేనీరు నెక్లూడొ కప్పులో పోయబోతూ "ఇంకా కొంచెం పొయ్యమంటారా? వద్దా? పోనీలెండి, మీ యిష్టం. ఈ సైబీరియాలో మీ వంటి చదువుకున్నవాడు ఎవడన్నా కనిపిస్తే ఆనందంగా ఉంటుంది. మా దంతా చాల కష్టమైన పని సుమండీ! ఈ ఖయిదీలపై ఉద్యోగంచేసే మాబోటి వాళ్ళకు చదువు సంధ్యలు రావనీ, చాల మోటుగా ఉంటామనీ అంతా అనుకుంటారు-కాని మాకూ బుర్ర అనేది ఉంటుందని ఎవరూ అను కోరు" అన్నాడు ఆఫీసరు.

అతని కందగడ్డలాంటి ముఖం, ఉంగరాలు, సెంటు, అసహ్యపునవ్వు చూస్తొంటే నెక్లూడొవు విసుగెత్తిపోతోంది. కాని ఎప్పుడూ ఇతర్లను చుల కన చేసే స్వభావం కాదు అతనిది. ఎవరిపట్లనైనా మర్యాదగానే ఉంటాడు. ఇప్పుడతనికి ఆఫీసరుగారి మానసికస్థితి అర్థమైంది. అన్నాడు గంభీరంగా: "మీరు యీ ఉద్యోగంలో ఉండికూడా బాధితులకు సహాయంచేసి మన శ్శాంతి పొందవచ్చుగదా!"

"ఏమున్నాయి వాళ్ళకు బాధలు! వాళ్ళు ఎటువంటివాళ్ళో మీ కసలు తెలియదు."

"వాళ్ళు ఒక ప్రత్యేక జాతియేమీ కాదు. అందరిలాంటి మనుషులే వాళ్ళుకూడా. వారిలో కొంతమంది నిర్దోషులు కూడాను"

"అవును మీరన్నట్టు చాల రకాల వాళ్ళు ఉన్నారు. ఒక్కొక్కప్పుడు వాళ్ళను చూస్తే జాలి వేస్తుంది. వీలైనప్పుడల్లా ఏదో కాస్త వాళ్ళ బాధల్ని తగ్గించటానికి చూస్తూ ఉంటాను. వాళ్ళకన్నా ఎక్కువగా నేనే బాధ పడాలని నా కోరిక. కొందరు ఆఫీసర్లు రూలుప్రకారంగా నడవకుండా చాల కఠినంగానే ఉంటారు. కాని నేను జాలి చూపిస్తూనే ఉంటాను. దయచేసి ఇంకో కప్పు తాగండి" అంటూ కెటిల్ ఎత్తి నెఖ్లూడోవు ముందున్న కప్పులో తేనీరు పోశాడు. "ఇప్పుడు మీరు చూడాలనుకుంటూన్న ఆ యువతి ఎవరు?"

"ఒక అభాగ్యురాలు. పశుప్రవృత్తిలో దిగాల్సి వచ్చింది. ఎవరినో విషంబెట్టి చంపిందన్న నేరంమీద ఆమెను శిక్షించారు. కాని ఆమె చాల మంచిది."

ఆఫీసరు తల ఊపాడు: "ఔనౌను. ఒక్కొక్కప్పుడు అలాగే జరుగుతూ ఉంటుంది. కాజాన్ నగరంలో ఎమ్మా అనే ఒక యువతి ఉండేది. ఆమె హంగేరి దేశస్థురాలు. కాని కళ్ళుమాత్రం పర్షియా స్త్రీల కళ్ళలా ఉండేవి. ఆమె అందంచూస్తే ఏ జమీందారు భార్యో అనిపిస్తుంది..."

ఆఫీసరు ధోరణి సాగనీకుండా నెఖ్లూడోవు అడ్డువచ్చి ఇలా అన్నాడు. "మీరీ అధికారంలో ఉన్నన్నినాళ్ళయినా పాపం వాళ్ళ దుఃఖభారాన్ని తగ్గించటానికి ప్రయత్నిస్తే మీకు చాలావరకు ఆత్మసంతోషం కలుగుతుంది" ఒక కొత్త విషయాన్ని పనివానికి బోధిస్తున్నట్టు విస్పష్టంగా చెప్పాడు నెఖ్లూడోవు.

"ఆగవయ్యా!" అన్నట్టుగా ఆఫీసరు నెఖ్లూడోవువైపు చూశాడు. అతని భావవీధిలో యింకా ఆ హంగేరి బాలిక సంచరిస్తూనే వుంది. ఆమెను గురించి తాను ఆరంభించిన గాథ చెప్పాలని ఉవ్విళ్ళూరుతున్నాడు.

"ఔనౌను. మీరు చెప్పింది నిజమే. వాళ్ళంటే నాకు జాలి కలుగుతూనే ఉంటుంది. కాని ఎమ్మా సంగతి చెబుతా వినండి. అసలు ఏమేమి చేసిందనుకున్నారు...?"

"ఎమ్మా సంగతి కేమిలెండి. నాకు వినాలని కుతూహలంగా లేదు. పూర్వపు నాకూ, యిప్పటి నాకూ చాలా తేడావుంది. స్త్రీలతో అటు వంటి సంబంధాన్ని యిప్పుడు నేను యేవగించుకుంటాను."

ఆఫీసరు నెఖ్లూడోవ్ కేసి విచిత్రంగా చూశాడు. "ఇంకో కప్పు టీ తాగుతావా?"

"వద్దండి."

ఆఫీసరు బోగ్డను కేక వేసి పిల్చి "వీరిని వారులో వద్దకు తీసుకుపో. వీరిని రాజకీయ ఖైదీలున్న వార్డుకు తీసుకుపొమ్మని చెప్పు. తనిఖీ చేసే వేళయ్యే వరకూ వీరు అక్కడ వుండవచ్చు" అని చెప్పాడు.

౯

నెఖ్లూడోవ్ సైనికుని వెంట బైటికి వచ్చాడు. అక్కడ దీపాలు మసక మసకగా వెలుగుతున్నాయి.

"ఎక్కడికి?" బైటవున్న సెంట్రీ అడిగాడు బోగ్డను.

"౫ వ నెంబరు గదిలోకి."

"ఈ దారిన వెళ్ళటానికి వీల్లేదు తాళం వేసి వుంటుంది. అటు తిరిగి వెళ్ళండి."

"తాళంచెవి యేమైంది?"

"అయ్యగారు గ్రామంలోకి వెళ్ళారు. వెడుతూ తాళంచెవి కూడా పట్టికెళ్ళారు."

"సరే, అయితే అటు తిరిగి వెడదాం పదండి" అంటూ బోగ్డను నెఖ్లూడోవ్ ను వేరే దారిని తీసుకుపోయాడు. లోపలనుంచి ఖైదీల కంఠధ్వనులు వినిపిస్తున్నాయి. తేనె తెట్టెమీది ఈగల గొడవలాగ లోపల కలకలంగానే ఉంది. చేరువకు వచ్చారు. తలుపు తెరచారు. లోపల అంతా చెడ్డ గందరగోళంగా వుంది. నవ్వుతున్నారు, అరుస్తున్నారు, తిట్టుకుంటున్నారు. సంకెళ్లు గలగల మంటున్నాయి. యేదో దుర్వాసనగా కూడా వుంది.

ఆ గందరగోళం, ఆ దుర్వాసన నెఖ్లూడోవు వొళ్ళు జలదరించేట్టు వున్నాయి. లోపల ప్రవేశించగానే అక్కడ ఒక పెద్ద తొట్టి కనిపించింది.

ఆ తొట్టి అంచున ఒక స్త్రీ కూచుని వుంది ఆమె కెదురుగా ఒక మనిషి నిల్చుని వున్నాడు. వాడి గొరిగిన తలమీద ఒక తంకెర టోపీ వుంది. వాళ్ళిద్దరూ యేదో మాటాడుకుంటున్నారు. నెఖ్లూడోవు చూడగానే ఆ మనిషి తన రెప్పలు ఎగురవేసి "రష్యా చక్రవర్తి కూడా పొందు ఆవ్వక్తో లేదు" అన్నాడు. ఆ స్త్రీ నవ్వులు సద్దుకుంటూ స్తంభించిపోయింది. మధ్యలో ఒక వసారా వుంది, దానికి ప్రక్కగా గదులు వున్నాయి. మొదటి గదిలో కుటుంబాలు వుండవచ్చు. రెండో గది బ్రహ్మచారులది. ఆ వరుసలో చివరవున్న రెండు గదులూ రాజకీయ ఖైదీలవి.

ఆ గృహం నూటయాభైమంది ఖైదీలకు మాత్రమే సరిపోతుంది. కాని యిప్పుడు నాలుగువందల యాభైమందికి పైగా వున్నారు. గదులు చాలక చాలామంది బైట వరండాలోనే క్రిక్కిరిసివున్నారు కొందరు కూచున్నారు, కొందరు పడుకున్నారు, కొందరు తేనీరు తెచ్చుకుంటున్నారు. ఆ సమయాన టారస్ తేనీరు తెచ్చుకుంటున్నాడు. అతను నెఖ్లూడోవుని చూశాడు. చూడగానే నమస్కారం చేశాడు. టారస్ ముక్కుమీద, కంటిక్రింద దెబ్బలు తగిలినట్టు కనిపిస్తోంది.

"ఆ గాయాలేమిటి?" అడిగాడు నెఖ్లూడోవ్.

"యేదో జరిగిందిలెండి" టారస్ మందహాసం చేశాడు.

"ఆస్తమానం వీళ్ళకు కొట్లాటలేగా!" అన్నాడో సైనికుడు.

"ఆడవాళ్ళ మూలంగానే. గుడ్డిఫెడ్కాతో ఖపట్లోగ్రం అయిందిగా!" అన్నాడా ప్రక్కనేవున్న ఖైదీ.

"ఫెదోస్యా కులాసాగా వుందా?"

"ఆఁ కులాసాగానే వుంది. ఆమెకోసమే తేనీరు తీసుకుపోతున్నాను" అంటూ టారస్ కుటుంబాలు వుండే గదిలోకి వెళ్ళాడు.

నెఖ్లూడోవ్ గదిలోకి చూశాడు. స్త్రీలు, పురుషులు క్రిక్కిరిసి వున్నారు. కొందరు మంచాలమీద, కొందరు మంచాల క్రింద పడి వున్నారు. ఆరవేసిన తడిబట్టల మూలాన అక్కడ గాలి అంతా నీటి ఆవిరితో నిండివుంది. స్త్రీలంతా గలగల మాటాడుకుంటున్నారు.

ఆ ప్రక్కన బ్రహ్మచార్లగది కూడా క్రిక్కిరిసే వుంది. గుమ్మంలోనూ బైట కూడా గుమికూడి వున్నారు జనం. వాళ్ళ బట్టలన్నీ తడితడిగా వున్నాయి. కూచుని యేవో మాటాడుకుంటున్నారు. నెక్లూడోవునూ, సార్జంటునూ చూడగానే వాళ్లు మాటలు మానేసి వాళ్ళకేసి కోపంగా చూడసాగారు. అక్కడ నెక్లూడోవుకు ఫెడోరోవ్ కనిపించాడు. అతడొక క్రిమినల్ నేరస్థుడు. నెక్లూడోవ్ అతన్ని యెరుగును. స్ఫోటకం మచ్చల ముఖం, వాడూ చాలా అసహ్యంగా వుంటాడు. జైల్లోనుంచి పారిపోవటానికి ప్రయత్నిస్తూ అతడొకసారి తన తోడివాణ్ణి చంపేసి వాడి మాంసం కూడా తిన్నాట్ట. వాడిప్పుడు నెక్లూడోవ్ వెడుతూన్న దారిలో అడ్డంగా, ధీమాగా నిల్చుని అతనికేసి నిర్లక్ష్యంగా చూస్తున్నాడు. దారి కడ్డంగా నిల్చుని తొలగనేలేదు. నెక్లూడోవ్ ఆ పక్కనుంచి తప్పుకుని వెళ్ళాడు.

మూడు నెలలనించీ ఈ ఖయిదీలనూ, ఈ నికృష్ట పరిస్థితులనూ నెక్లూడోవ్ చూస్తూనే ఉన్నాడు. ఈ నాలుగువందల మంది ఖయిదీల వివిధ దయనీయ స్థితిగతుల్ని చూస్తూనే ఉన్నాడు. గొలుసు తగిలించిన కాళ్ళు ఈడ్చుకుంటూ రోడ్డుమీద గుమ్ములో వాళ్ళు నడుస్తూ వుంటారు, ఎర్ర టెండలో. ఆ యెండలోనే గదులు చాలక బయట అవస్థపడుతూ వుంటారు. స్త్రీ పురుషులు మరులు కొని సిగ్గు విడిచి ప్రవర్తిస్తూ వుంటారు. వీళ్ళ పరిస్థితి చాల భయంకరంగా, భీభత్సంగా వుంటుంది. వీళ్ళను చూచినప్పుడల్లా నెక్లూడోవు సిగ్గేస్తుంది. వాళ్ళపట్ల తాను అన్యాయంగా ప్రవర్తిస్తున్నట్టు భావం కలుగుతుంది. ఆ పరిస్థితుల్లో వుండి వాళ్ళు అంతకన్నా మెరుగ్గా వుండలేరు. అయినా వాళ్ళను చూస్తే తన మనస్సుకు చాల బాధ కలుగుతూ వుంటుంది.

"వాళ్ళగతి అంతే కావాలి"—అంటున్నాడెవరో కటువుగా నెక్లూడోవ్ రాజకీయ ఖయిదీలున్న గదుల దగ్గరకు వచ్చినప్పుడు. ఆ పలికినవాడు అంతటితో ఆగక ఇంకా ఏవో బూతులు పలికాడు. దానికి చాలమంది పకపకా నవ్వసాగారు.

# ౧౦

నెక్లూడో, సార్జంటు బ్రహ్మాచార్లు వుండే గదిదాటి వచ్చారు. "నేను మళ్ళీ తనిఖీ జరిగే వేళకు వచ్చి కలుసుకుంటానండి" అని చెప్పి సార్జంటు వెళ్ళిపోయాడు. సార్జంటు వెళ్ళిపోగానే చేతులకు సంకెళ్ళు తగిలించిన ఒక ఖయిదీ గబగబా నెక్లూడోను సమీపించి మెల్లిగా ఇలా చెప్పాడు: "ఆ కేసులో మీరు కాస్త జోక్యం కల్పించుకోవాలి. వాళ్ళు ఆ కుర్రవాణ్ణి పాపం వెర్రివెంగళప్పను చేశారు. బాగా సారా తాగించారు. యివాళ తనిఖీ జరిగినప్పుడు వాడు తన పేరు కార్మొనో అని చెప్పాడు. అలా జరగనీకండి బాబూ! వాళ్ళు మమ్మల్ని చంపేస్తారు" అని చెప్పి భయం భయంగా అటూ యిటూ చూశాడు.

అసలు సంగతేమంటే: కార్మనో ఒక క్రిమినల్ నేరస్థుడు. గనుల్లో నిర్బంధంగా పని చేయించేందు కతన్ని తీసుకుపోతున్నారు. అతనిలాంటి రూపురేఖలుగల ఒక కుర్రవాడు వున్నాడు. అతనికి ప్రవాస శిక్ష విధించారు. తనపేరే కార్మనో అని ఆ కుర్రవాడిచేత చెప్పించటానికి కార్మనో ఒప్పించాడు. అలా ఒప్పించినందువల్ల ఆ కుర్రవాణ్ణి గనుల్లో పని చేయించేందుకు తీసుకుపోతారు. కార్మనో తన శిక్ష తప్పించుకుని ప్రవాసిగా వుండచ్చు.

ఈ వ్యవహారం నెక్లూడోకు తెలుసు. ఈ సంగతి అంతా ఒక వారం రోజుల క్రితం అతని కెవరో ఖైదీ చెప్పాడు. "నాకు తెలుసులే. యేదో చేతనైనపని చేస్తాను" అన్నట్టుగా తల ఊపి నెక్లూడో దాటిపోయాడు.

ఇప్పుడు తనతో వచ్చి మాటాడిన ఖైదీ తన్ను ఒకసారి కలిసి... తన భార్య కూడా తనతోపాటు రావటానికి అధికార్ల అనుమతి సంపాదించి పెట్టవలసిందిగా అర్థించాడు. అతడొక మామూలు రైతులా కనిపిస్తాడు. సుమారు ముప్ఫయి సంవత్సరాల వయస్సు వుంటుంది. అతన్ని నిర్బంధ బానిసగా పని చేయించటానికి తీసుకుపోతున్నారు. హత్య, దొంగతనం చేశాడట. అతని పేరు మకార్ దేవకిన్. తన కథ కొంతవరకు తానే నెక్లూడోకు చెప్పుతున్నాడు. "నేరం నేను కాదండి చేసింది. నా నెత్తిమీది దయ్యం" అంటాడు.

ఒకసారి ఒక బాటసారి వాళ్ళింటికి వచ్చాడట. ఇరవై యొరుమైళ్ళ దూరంలో వున్న ఒక గ్రామానికి వెళ్ళాలిట అతడు. అందుకోసం గుర్రపు బండి ఒకటి బాడుగకు కావాలన్నాడు. మకార్ దేవకిన్ తండ్రి కొడుకును పిల్చి బండి కట్టుకుని ఆ పెద్దమనిషిని ఆ గ్రామంలో దించిరమ్మని చెప్పాడు. మకార్ దేవకిన్ బండి సిద్ధంచేసి ఆ పెద్దమనిషితో కలసి తేనీరు తాగుతున్నాడు. ఆ సమయంలో ఆ పెద్దమనిషి...తాను పెళ్ళి చేసుకోబోతున్నానని, తన దగ్గర తాను మాస్కోలో ఆర్జించిన అయిదువందల రూబుల్సు వున్నాయనీ చెప్పాడు. ఆ మాట విన్న తర్వాత మకార్ దేవకిన్ రహస్యంగా ఒక గొడ్డలి తీసుకుపోయి బండిలో గడ్డికింద పెట్టాడు.

"గొడ్డలి ఎందుకు తీసుకుపోతున్నానో నాకే తెలియదు. 'తీసుకుపో గొడ్డలి' అని దయ్యం చెప్పింది. తీసుకుపోయాను. ఆయన బండిలోఎక్కాడు; నేను తోలుకుపోయాను. ఈ [illegible]గా నేను ఆ గొడ్డలి విషయమే మరచిపోయాను. ఆ గ్రామం చేరువకు వచ్చేశాం. యింకా నాలుగుమైళ్ళు వుంది. అక్కడనుంచి పక్కగొడ్డుకు తిరిగి వెళ్ళాలి. అది మిట్టప్రదేశం. నేను బండి దిగి గుర్రాన్ని నడిపిస్తున్నా. అప్పుడు దయ్యం నా చెవిలో గుసగుస లారంభించింది, 'ఇంకా ఊరుకుంటావేమిరా? ఈ మిట్టప్రదేశం దాటితే చాలా మంది జనసంచారం వుంటుంది. ఆ వెంటనే గ్రామంలోకి వచ్చేస్తావు. వాడు డబ్బుతో సురక్షితంగా వెళ్ళిపోతాడు. నువ్వు చేయదలచుకున్న పని యిప్పుడే చేసెయ్యి ఇదే మంచి సమయం' గడ్డి సర్దుతున్నట్టుగా బండిలో చెయ్యి పెట్టాను. గొడ్డలి దానంతటదే నా చేతిలోకి దూకి వచ్చింది బండిలో పెద్దమనిషి వ్యవహారం కనిపెట్టాడు. "యేంచెయ్యబోతున్నావ్" అని అరచాడు. నేను గొడ్డలి ఎత్తి కొట్టబోయాను. అతడు దెబ్బ తప్పించుకుని నా చేతులు గట్టిగా పట్టుకున్నాడు. 'ఓరి దుర్మార్గుడా?' అంటూ నన్ను క్రింద పడేసి, చేతులు కాళ్ళు కట్టేసి, బండిలో వేసుకుని పోలీసు స్టేషనుకు తీసుకుపోయాడు. నేను కిక్కురుమనలేదు; పెనగులాడలేదు. లొంగిపోయాను. నన్ను జైల్లో పెట్టారు; తరువాత విచారణ జరిగింది. మా ఊరివాళ్ళంతా నేను చాల మంచివాడేననీ, నే నెప్పుడూ ఏ దుర్మార్గమూ చెయ్యలేదనీ సాక్ష్యం చెప్పారు. నేను అక్కడా అక్కడా పనిపాటలు చేస్తూ ఉండేవాణ్ణిగా. ఆయా యజమానులు కూడా నేను మంచివాడిననే చెప్పారు. కాని ప్లీడరును

పెట్టుకునేందుకు మాకు డబ్బులేదాయె. నాలుగేళ్ళ నిర్బంధబానిసగా నాకు శిక్ష విధించారు."

ఇప్పుడిప్పుడు నెఖ్లూడోవు సమీపించి ఒకతోటి గ్రామస్థునికి జరుగుతున్న అన్యాయాన్ని గురించి వలపోసుకున్నాడు. ఈ రహస్యం బయటపెట్టినందుకు తనకు అపాయం సంభవిస్తుందని అతనికి తెలుసు. ఇలా చెప్పాడని తెలిస్తే అతనిగొంతు పిసికేస్తారేమో కూడా. అయినా చెప్పాడు.



చివర ఉన్న రెండుగదులూ రాజకీయఖైదీలకోసం ప్రత్యేకించబడినవి. ఆ గదులముందు కొంత ఖాళీస్థలం ఉంది. నెఖ్లూడో అక్కడికి వచ్చేసరికి...రబ్బరు జాకెట్ తొడుక్కొని కుంపటి రాజేస్తూన్న సైమన్‌సన్ కనిపించాడు. అతడు నెఖ్లూడోవు చూడగానే ..లేవలేదుగాని...కూచునే చెయి చాచాడు కరచాలనం కోసం... "మీరాక నాకు సంతోషాన్ని కలిగించింది. మీతో కొంచెం మాటాడాలి" అన్నాడు భావగర్భితమైన చూపులతో.

"ఏ విషయం గురించీ?"

"తరువాత మాటాడదాంలెండి; ఇప్పుడు పనిమీద ఉన్నాను" అంటూ కుంపటి విసరటంలో నిమగ్నుడైనాడు సైమన్‌సన్.

నెఖ్లూడో మొదటిగదిలోకి వెళుతూ గడపదాకా వచ్చాడు. ఇంతలో రెండోగది గుమ్మంలోనించి మస్లావా బైటికి వచ్చింది. ఆమెచేతిలో చీపురు ఉంది. గదిఅంతా ఊడ్చి తెచ్చిన చెత్త, చెదారం బైట పారబోసింది. తెల్లని జాకెట్ తొడుక్కొంది. తలకు దుమ్ముపడకుండా రుమాలు చుట్టుకుంది. నెఖ్లూడోవు చూడగానే ఆమె కపోలాలు లజ్జారుణములైనాయి. చీపురు అవతల పడేసి, చేతులు తుడుచుకుని అతని దగ్గరకు వచ్చింది.

నెఖ్లూడో ఆమెతో కరచాలనం చేశాడు. "గదులు ఊడ్చి శుభ్రం చేస్తున్నావల్లే ఉందే."

ఆమె మందహాసం చేసింది. "అవును. అసలు మొట్టమొదట ఇదేగా ఉద్యోగం. కాని ఇక్కడ దుమ్ము ఊడ్చినకొద్దీ ఇంకా పెరుగుతూనే

ఉంటుంది. అస్తమానం చీపురు పుచ్చుకుని శుభ్రం చేస్తూ ఉండాల్సిందే... ఇంతకూ ఆ కుంపటి రాజుకుందా?"-అని మస్లోవా సైమన్‌సన్ వైపు తిరిగి ప్రశ్నించింది.

"రాజుకున్నట్టే" అంటూ సైమన్‌సన్ మస్లోవా కేసి చూచిన చూపు అదో రకంగా ఉంది. నెఖ్లూడో గమనించాడు.

"సరే, బొగ్గులు రాజుకుంటే ఇస్త్రీపెట్టె తెస్తాను. దుస్తులు ఆర బెడదాం..." అంటూ నెఖ్లూడో వైపు తిరిగి "మనవాళ్ళంతా లోపల ఉన్నారు" అని మొదటి గదిలోనికి వేలుబెట్టి చూపిస్తూ మస్లోవా రెండో గదిలోకి వెళ్ళింది.

నెఖ్లూడో మొదటిగదిలో ప్రవేశించాడు. అదొక చిన్నగది. ఒక చిన్న దీపం గోడకు తగిలించి ఉంది. గదిలో చాల చల్లగా ఉంది. నేల చెమ్మగా ఉంది. మట్టి వాసనకొడుతోంది. దీపానికి దగ్గరగా ఉన్నవాళ్ళ ముఖాలు మాత్రం స్పష్టంగా కన్పిస్తున్నాయి. సిగరెట్ల పొగవాసన కూడా దట్టంగా ఉంది.

ఇద్దరు మాత్రం తేనీరు తయారుచేసుకోటానికి వేన్నీళ్ళు, ఇంకా కొన్ని ఆహారపదార్థాలూ తీసుకురావటానికి వెళ్లారు- మిగతా ఖైదీలందరూ గదిలో గుమిగూడి ఉన్నారు. నెఖ్లూడో ఎరిగివున్న ధుఖోవా అక్కడే ఉంది. ఆమె రోజురోజుకూ సన్నబడి పోతోంది; వొంట్లో నెత్తురు తగ్గి పోతోంది. విశాలమైన ఆమె నేత్రాలు భయం భయంగా చూస్తున్నాయి. ఆమె నుదుటిపై నరం ఒకటి ఉబికివుంది. ఒక గోధుమరంగు జాకెట్టు తొడుక్కుంది. ఆమె ముందొక వార్తాపత్రిక పడివుంది. సిగరెట్టు తయారు చేస్తోంది.

ఎమిలీరాంట్‌సేవా కూడా అక్కడే ఉంది. రాజకీయ ఖైదీలందరిలోనూ ఆమె చురుకైనమనిషి అని నెఖ్లూడో అభిప్రాయం. చాలా ఉల్లాసంగా ఉంటుందామె. ఏ వస్తువు ఎక్కడ ఉండాలో సర్దుతూ భోజనాదికాల ఏర్పాట్లు పర్యవేక్షిస్తూ ఆమె...జైలుకూడా ఒక గృహంలా అనిపించేట్టు వ్యవహరిస్తూ ఉంటుంది. జైల్లోని అతి క్లిష్టపరిస్థితుల్లో కూడా అక్కడివాళ్ళకు కాస్తసుఖం, ఆనందం కలిగేట్టు పనిపాటలు చక్కబెడుతూ

ఉంటుంది. ఒక దీపం ముందు కూచుని ఆమె చెంబులు, కప్పులు, తదితర పాత్రలు తోమి, శుభ్రంచేసి అక్కడ పరిచివున్న ఒక గోనెపట్టామీద జాగ్రతగా పెడుతోంది. ఆడంబరం ఏమీ లేని యువతి. తెలివితేటలుగల మనిషి. ముఖంలో ముగ్ధత్వం కనిపిస్తుంది; కాని ఆమె చిరునవ్వు తెరపరి పరాలను ముగ్ధపరుస్తుంది; శవానికి ప్రాణం వచ్చినట్టనిపిస్తుంది; చాలా ఉల్లాసంగా, ఆకర్షణీయంగా ఉంటుంది అట్టి సజీవమైన చిరునవ్వుతోనే ఆమె ఇప్పుడు నెహ్లూడోవు స్వాగతం పలికింది.

"అరె, మీరు తిరిగి రష్యాకు పోయారనుకున్నామే! "అన్నదామె.

అక్కడే మేరీపావ్‌లోనా కూడా ఒక మూల కూచుని ఉంది—చక్కని ఉంగరాల జుట్టుగల ఒకచిన్న అమ్మాయి జిలిబిలి పలుకులు విని ఆనందిస్తూ.

"వచ్చారూ ? చాల సంతోషం. మస్లొవా కనిపించిందా ?" అని పలుకరిస్తూ మేరీపావ్‌లోనా "మనల్ని చూడ్డానికి ఎవరో వచ్చారు, అరునో" అంటూ తన దగ్గర ఉన్న చంటిపిల్లకు చూపించింది.

క్రిల్ట్‌సో కూడా ఫెల్టుబూట్లు తొడుక్కొని అక్కడే ఉన్నాడు. చేతులు కాళ్ళసందున ముడిచి పెట్టుకుని, చలికి వొణుకుతూ, జ్వరతీవ్రత తను వ్యక్తం చేస్తున్న చూపులతో నెహ్లూడోవు అవలోకిస్తూ ఒక మూల కూచుని వున్నాడు. నెహ్లూడోవ్ అతని వద్దకు వెళదామని సాగాడు. కాని ఇంతలో ఆ ప్రక్కనే కళ్ళద్దాలు పెట్టుకున్న ఒకవ్యక్తి రబ్బరుజాకెట్ తొడుక్కొని గ్రాబెట్సు మాటాడుతూ కనిపించాడు. అతడే ప్రఖ్యాతిపొందిన విప్లవనాయకుడు నొవొడ్వోరొవ్. నెహ్లూడోవ్ పక్కకు తిరిగి మొదట అతని వద్దకు వెళ్ళాడు. రాజకీయ ఖైదీలందరిలోకీ అతనంటే నెహ్లూడోవు అసహ్యం. నొవొడ్వోరొవ్ తననీలి నేత్రాలతో, కళ్ళద్దాలగుండా నెహ్లూడోవు కోపచిహ్నితంగా అవలోకిస్తూ తన సన్నని చేయి చాచాడు కరచాలనం కోసం.

"మంచిది; మీకీ ప్రయాణం సుఖదాయకంగానే ఉన్నదనుకుంటాను" అన్నాడు నొవొడ్వోరొవ్ వ్యంగ్యంగా.

"ఔను. మనసుకు పట్టించుకోతలసిన చాలా అంశాలే చూస్తున్నాను" అని జవాబు చెప్పేసి అతని మాటలోని వ్యంగ్యాన్ని గమనించని వాడువలె నటించి నెహ్లూడోవ్ తిన్నగా క్రిల్ట్‌సో దగ్గరకు వెళ్ళాడు.

పైకి అలా నటించినా సెల్హాడో మనసులో చాల బాధపడ్డాడు. ఒక్కొక్కరినే మిత్రులను చూస్తున్నప్పుడు కలిగిన ఉత్సాహం తగ్గిపోయింది. వోవాడోరో మాటలు; చేతలు ఇతర్లకు కష్టం కలిగించేట్టుగానే ఉంటాయి.

సెల్హాడో వచ్చి క్రిస్ట్‌సోతో కరచాలనం చేశాడు: "ఎలా ఉన్నావు? ఆరోగ్యంగా ఉందా?"

"బాగానే ఉన్నా. కాని ఇక్కడ ఎంత చలి అనుకున్నారు? ఈచలి అణిగే సాధనే కనిపించటం లేదు. ఆ కిటికీల అద్దాలు చూడండి; అన్నీ పగిలి పోయాయి...మీరు కులాసాగా ఉన్నారా? ఇన్నాళ్ళనించీ మమ్మల్ని చూడ్డానికి రానేలేదే!"

"అధికార్లు రానీలేదు. చాల స్ట్రిక్టుగా ఉంటూ వచ్చారు. ఇవాళ మాత్రం ఆఫీసరు కాస్త చనువుగానే మాట్లాడేడు."

"చనువా? మంచి చనువే. మేరీపావ్‌లోనాను అడగండి, ఇవాళ ఉదయం ఏం చేశాడో!"

ఆ మూల కూచున్న మేరీపావ్‌లోనా...నాటి ఉదయం ఆ చంటి బిడ్డ విషయమై ఆఫీసరు చేసిన రభస అంతా...పూసగుచ్చినట్టు చెప్పింది.

"మన ఖైదీలమంతా కలసి ఉమ్మడిగా మన అసమ్మతిని ప్రకటించటం అత్యవసరం. సైమన్‌సన్ తన అసమ్మతిని తెలియజేశాడనుకోండి-అయినా అంత మాత్రం చాలదు-" అన్నది గుఖోవా తన మాటలకు అందరూ సమ్మతిస్తారా లేదా అన్న అనుమానంతో భయం భయంగా చూస్తూ.

"ఏం అసమ్మతి తెలుపుతావ్!" అన్నాడు కోపగించుకున్నట్టుగా క్రిస్ట్‌సో. ఆమెలోని ఆడంబరానికీ, అసహజ ప్రవర్తనకూ, భయగ్రస్తమైన స్వభావానికీ ఆమె అంటే అతనికి చాలకాలనించీ కోపంగానే ఉంది.

"మస్లొవాకోసం వచ్చారా? ఆమె అస్తమానం ఏదో పని చేస్తూ ఉంటుంది. ఇప్పుడే ఈ గది శుభ్రం చేసి, ఆ గదికూడా శుభ్రం చేయటానికి వెళ్ళింది. ఈ యీగల్ని మాత్రం తోలిపారేయలేక పోతున్నాం. అవి మా ప్రాణాల్ని తినేస్తున్నాయి...మేరీపావ్‌లోనా ఏమి చేస్తోందక్కడ?" అన్నాడు క్రిస్ట్‌సో.

"పెంపుడు కూతురుకు తల దువ్వుతోంది"—రాంట్ సేవా జవాబు చెప్పింది.

"ఆ పిల్ల నాశ్రయించుకుని ఉంటున్నాయి పేలన్నీ. ఆ పేలన్నీ యిటు కేసి తోలుతున్నా వేమిటి?" అన్నాడు క్రిల్ట్సో విసుగ్గా.

"ఎబ్బేలేదు. చాల జాగ్రత్తగా దువ్వుతున్నాను. అయినా ఇప్పుడీపిల్ల చాల పరిశుభ్రంగా ఉంటోంది" అని చెప్పి మేరీపావ్లోనా ఆ పిల్లను రాంట్ సేవాకు అప్పగించేసి పనిలో మగ్లోవాకు సాయం చేసేందుకని వెళ్ళిపోయింది.

రాంట్ సేవా ఆ పిల్లనెత్తుకుని, తల్లిలాగ ప్రేమతో గుండెలకు హత్తుకుంటూ ముద్దులాడి, ఇంత పంచదార కోసి ఇచ్చింది.

మేరీపావ్లోనా నడిచి వెళ్ళగానే ఇద్దరు వ్యక్తులు వేన్నీళ్ళు, మరి కొన్ని ఆహార పదార్థాలు పట్టుకుని లోపల ప్రవేశించారు.

౨౧

ఆ యిద్దరిలో ఒకడు పొట్టిగా, సన్నగా ఉన్నాడు. పైన నేతగుడ్డ వేసి గొర్రె తోలుతో కుట్టిన చొక్కా వేసుకున్నాడు. ఎత్తు బూట్లు తొడుక్కున్నాడు. మసల కాగిన నీళ్ళు రెండు పాత్రలు రెండు చేతుల్లో పట్టుకుని, రొట్టెల పొట్లం ఒకటి చంకలో పెట్టుకుని తెచ్చాడు.

నీటి పాత్రలు అక్కడ కప్పుల దగ్గర పెట్టేసి, రొట్టెల పొట్లం రాంట్ సేవా కిచ్చేసి "ఓహో, మన జమీందారుగారు మళ్ళీ ఏమి చేశారన్నమాట" అంటూ గొర్రెతోలు చొక్కా విప్పి అక్కడొక మంచంమీదకి విసరపారేసి "మేము చాలా పదార్థాలు తీసుకొచ్చాం. మార్కెల్ పాలూ, గుడ్లూ తీసుకొచ్చాడు. ఈ రాత్రి విందు చేసుకుందాం. రాంట్ సేవా పరిశుభ్రంగా అంతా ఏర్పాటు చెయ్యాలి. ఆమె యింపుగా మనకు తేనీరు తయారుచేసి యిస్తుంది" అంటూ ఆమెకేసి చిరునవ్వు చిందిస్తూ చూశాడు.

ఆ వ్యక్తి మాటలు, చేతలు, చూపు—అన్నీ ఆనందకరంగా, ఉల్లాసంగా ఉన్నాయి. రెండో వ్యక్తి మాత్రం ఇలా ఉండడు. పూర్తిగా వ్యతిరేకంగా ఉంటాడు. ఎప్పుడూ నిరుత్సాహంగా, విచారంగా కనిపిస్తాడు.

అతడు పొట్టిగా ఉంటాడు. ఎముక పుష్టిగల మనిషి. పెద్ద ఎత్తైన చెంపలు. పలుచని పెదవులు. కళ్లు అందంగానే ఉంటాయి. ఒక పాతకోటు, పాము గాటి బూట్లు తొడుక్కున్నాడు. రెండు కుండల పాలు, రెండు చెక్క పెట్టెలనిండా ఏవేవో పదార్థాలూ తీసుకొచ్చాడు. అవన్నీ రాంట్ సేవా ముందు పెట్టాడు. నెక్లూడోవు సలాం చేసి, కరచాలనానంతరం పెట్టెలు తెరచి పదార్థాలు బైటికి తీస్తూ కూచున్నాడు. ఈ యిద్దరు రాజకీయ ఖైదీలూ సాధారణ కుటుంబాలకు చెందినవాళ్ళే. ఒకని పేరు నబటోవ్. ఇతడొక రైతు. రెండోవాడు మార్కెల్. ఇతడొక ఫ్యాక్టరీ కార్మికుడు. నబటోవ్ పద్దెనిమిదేళ్ళ వయస్సులోనే విప్లవ సంఘంలో చేరాడు. మార్కెల్ చాలా పెద్ద వాడైన తరువాతగాని చేరలేదు. స్వగ్రామంలోని బడిలో చదువు పూర్తి చేసుకొని ఒక బస్తీ హైస్కూల్లో చేరాడు. నబటోవ్ ఒక వంక తాను చదువు కుంటూ, ఇతర్లకు పాఠాలు చెప్పి డబ్బు సంపాయించుకునేవాడు. మంచి తెలివితేటలుగల మనిషి. బంగారు పతకం పొందాడు. హైస్కూలు చదువు పూర్తి అయింది. కాని అతడు కాలేజీలో వెళ్ళి చేరలేదు. హైస్కూల్లో ఉన్నత తరగతిలో ఉన్నప్పుడే అతనికొక ఆశయం ఉండేది. అవకాశాలు లేక, చదువు సంధ్యలు లేక, ఆదరణ లేక పల్లెటూళ్ళలో పడివున్న అనేక మంది తనలాంటి బీద పిల్లలకు జ్ఞానోదయం కలిగించి పైకి తీసుకురావాలని అతనికి కోరిక ఉండేది. అందుచేత కాలేజీలో చేరకుండా ఒక పెద్ద గ్రామంలో గవర్నమెంటు గుమాస్తాగా చేరాడు. రైతులకు ఆ యా విషయాలు పుస్తకాల్లోనించి చదివి చెబుతూ ఉండేవాడు. ఒక సహకార పారిశ్రామిక సంఘాన్ని కూడా ఏర్పరచాడు. అందుచేత అతన్ని ప్రభుత్వం అరెస్టు చేసింది. ఎనిమిది నెలలు జైల్లో వుంచి వొదిలేశారు కాని పోలీసు లతని చర్యలన్నీ కనిపెట్టి చూస్తూనే ఉండేవాళ్ళు. జైల్లోనుంచి బయట పడ్డాక అతడు మరో గ్రామం వెళ్ళి ఒక బడి పంతులుగా కొన్నాళ్ళు పని చేశాడు. అలా బడి పంతులుగా ఉంటూ కూడా ఇదివరకు ఆ ఊళ్లో చేసినట్టుగానే చేశాడు. కాగా మళ్ళీ అతన్ని అరెస్టు చేశారు. పధ్నాలుగు నెలలు జైల్లో ఉంచారు. ఈ లోగా అతని రాజకీయాభిప్రాయాలు మరింత పటిష్టములు సుస్థిరములు అయినాయి.

ఆ తరువాత అతనికి పెరమ్ రాష్ట్రానికి ప్రవాస శిక్ష విధించారు. అతడు అక్కడనుంచి పారిపోయాడు. కానీ మళ్ళీ పట్టుబడి ఏడు నెలలు

జైల్లో ఉన్నాడు. తరువాత మళ్ళీ ప్రవాసశిక్ష విధించి ఆర్చి ఏంజిల్ రాష్ట్రానికి పంపించారు. అక్కడినుంచి కూడా పారిపోవటానికి ప్రయత్నించాడు మళ్ళీ పట్టుబడ్డాడు. ఈసారి కూడా ప్రవాస శిక్ష విధించి యాకుటస్క్ రాష్ట్రానికి పంపించారు. ఈ విధంగా నడివయస్సు వచ్చేసరికి జీవితంలో సగం భాగం జైళ్ళలోనూ, ప్రవాసంలోనూ గడిచిపోయింది. యిన్ని కష్టాలు అనుభవించినా అతనిలో ఉత్సాహం, ఉల్లాసం తగ్గలేదు. జీవశక్తి బాగా ఉంది; చురుగ్గా ఉంటాడు. పనిపాటులు సమగ్రంగా నిర్వహిస్తాడు. గతాని కెప్పుడూ విచారించే మనిషి కాదు. దూర భవిష్యత్తును గురించి కూడా ఆలోచించడు. వివేకం, లౌకికజ్ఞానం, శక్తి సామర్థ్యాలు-అన్నీ వర్తమాన సమస్యలకే వినియోగిస్తూ ఉంటాడు. అవకాశం కలిగినప్పుడల్లా ఫ్యాక్ట్రీల్లోని కార్మికుల్లో ఐక్యత, విజ్ఞానం పెంపొందించటానికి శాయశక్తులా ప్రయత్నించాడు. జైల్లో వున్నప్పుడైనా వీలైనంతవరకు బయటి ప్రపంచంతో సంబంధం పెట్టుకోటానికే ప్రయత్నించాడు. జైల్లో పరిస్థితుల్ని కూడా సాధ్యమైనంతవరకు తనకూ, తన చుట్టూ ఉన్నవాళ్ళకూ సౌఖ్యప్రదంగా ఉండేలాగు ఏర్పాట్లు చేసుకుంటూ ఉండేవాడు. సంఘదృష్టిగల మనిషి. కమ్యూన్ సభ్యుడు. తనకోసం, తన హక్కులకోసం తహ తహలాడేవాడు కాదు. తాను వ్యక్తిగతంగా తేలిగ్గానే తృప్తిపడేవాడు. తన సంఘంవారి శ్రేయస్సు కోసం, వారి హక్కులకోసం మాత్రం రాత్రింబవళ్ళు నిద్రాహారాలు లేకుండా శారీరకంగా, మానసికంగా కష్టపడేవాడు. తానొక రైతు. తన నిత్య జీవనంలో కష్టజీవి. తెలివితేటలతో, సూక్ష్మదృష్టితో వ్యవహరించేవాడు. ఆత్మనిగ్రహంగల మనిషి. ఇతర్లయెడ సహజంగా చాలా మర్యాదగా ఉంటాడు. ఇతర్ల వాంఛల్ని, ఉద్దేశాల్ని మన్నించే వ్యక్తి. వితంతువైన అతని తల్లికి చదువు రాదు. గుడ్డి నమ్మకాలు ఆమెకు జాస్తిగా ఉండేవి. చాలా ముసలది. ఇప్పటికీ బ్రతికే వుంది. ఆమె అప్పుడప్పుడు వచ్చి కొడుకును ఎక్కడున్నా చూసిపోతూ ఉంటుంది. జైల్లో గాక ఇంటి వద్ద ఉన్నప్పుడు నబటో గృహకృత్యాల్లో తల్లికి సాయపడుతూ ఉండేవాడు. మామూలు మిత్రులతో వినోదంగా కాలక్షేపం చేసేవాడు. వాళ్ళతో పాటు చౌకసారు సిగరెట్లు కాల్చేవాడు. ప్రభుత్వం వాళ్ళందర్నీ ఎలా మోసం చేస్తున్నదో, ఆ మోసంలోనుంచి వాళ్లు ఎలాగ బైటపడాలో... నబటో బోధిస్తూ ఉండేవాడు. విప్లవ సంఘ కార్యకలాపాల్ని గురించి

అతను ఎప్పుడు ఎక్కడ ప్రసంగించినా సాధారణ ప్రజల్ని...జెత్తెడు భూమి కూడా లేకుండా దరిద్ర స్థితిలో అటుమటిస్తూ వున్న తంలాంటి సాధారణ ప్రజల్ని దృష్టిలో ఉంచుకునే మాటాడేవాడు. విప్లవం అనేది మానవ జీవిత సౌధం యొక్క పునాదుల్ని కూల్చివేయకూడదు. సౌధాల్ని యాకత్తూ కూల్చివేయరాదు. ఈ అందమైన, పెద్ద, గట్టి కట్టడంలోని లోపలి గోడల్ని మాత్రం మార్చివేయాలి—అని నబటో అభిప్రాయం. ఇది నొవొడొరో సిద్ధాంతాలకు భిన్నమైన అభిప్రాయం. మార్క్సేల్ నొవొడ్వొరో అనుచరుడు.

మత విషయమై కూడా నబటోకు ప్రత్యేకాభిప్రాయాలు ఉన్నాయి. తాత్విక సమస్యలను గురించి అతడాలోచించడు. సృష్టి ఎలా ఆరంభమైంది? ముందు ఎలా వుండబోతుంది?- ఈ రకమైన ప్రశ్నలతో అతనికి పని లేదు. భగవంతుడొకడున్నాడన్న సిద్ధాంతం అతనికి అనవసరం. ప్రపంచం ఎలా పుట్టింది, పెరిగింది అన్న సమస్యతో అతనికి సంబంధంలేదు. ఈ విషయంలో మోసెస్ రైటా? డార్విన్ రైటా? అనే ప్రశ్నకే తావులేదు. ఈ ప్రపంచం ఆరు రోజుల సృష్టి అన్న బైబిల్ కథ ఎంత పుక్కిటి పురాణమో, డార్విన్ సిద్ధాంతం కూడా అతనికి అటువంటి కట్టుకథే. తమిమ్యాత్ర విప్లవకారులకు మాత్రం డార్విన్ సిద్ధాంతం చాలా ప్రముఖమైనది.

మానవ జీవితం ఎలా బాగుపడాలి? అనే సమస్య ఎప్పుడూ అతని దృష్టిలో ఉంటుంది. అందుచేత సృష్టి ఎలా ఉద్భవించిందీ అనే సమస్య అతనికి అక్కర్లేదు. జంతు లోకంలోనూ, వృక్ష ప్రపంచంలోనూ ఏదీ నశింపు చెందటం లేదు. అవిరాళంగా మార్పు చెందుతూ ఉన్నాయి. ఎరువు ధాన్యం ఔతుంది. తోకతో ఉన్న చిరుకప్ప తోకలేని అసలు కప్ప ఔతుంది. గొంగళి పురుగు సీతాకోక చిలుక ఔతోంది. విత్తు వృక్షం ఔతోంది. కాబట్టి మనిషి కూడా లయం పొందడు. మార్పు చెందుతాడు ఈ అభిప్రాయం తాత ముత్తాతల కాలం నాటి నించీ కూలీ నాలీ చేసుకు బ్రతికే పల్లెప్రజలలో స్థిర పడిఉంది. ఇదే అభిప్రాయం నబటో అంతరాత్మలో గాఢంగా ఉంది. అందు చేత ఈ సృష్టి భవిష్యత్తునుగురించిన ఆలోచనే అతనికి కలగదు. మృత్యు వంటే అతనికి భయంలేదు. అందుచేత ఎన్ని కష్టాల్ని అయినా, ఎటువంటి బాధల్ని అయినా సహించటానికి భయపడడు. అస్తమానం ఏదో పనిలో

నిమగ్నుడై ఉంటాడు. తోడివారి చేతకూడా ఉత్సాహంగా పనిచేయిస్తూ ఉంటాడు. సోమరితనం అత డెరగడు.

మార్కెల్ ఇంకోరకమైన మనిషి. పదిహేనోయేట ఫ్యాక్టరీలో పనికి కుదిరాడు. యజమానులు చేసే అన్యాయాలనూ, పెట్టే బాధల్నీ సహించలేక సిగరెట్లకూ, సురాపానానికీ అలవాటుపడ్డాడు. ఒక క్రిస్టమస్ పండుగనాడు యజమానిభార్య ఫ్యాక్టరీలో పనిచేస్తున్న పిల్లల్ని విందుకు ఆహ్వానించింది. మార్కెల్ కూడా వెళ్ళాడు. అతనికి ఒక బూర, (కానీ ఖరీదు కూడా ఉండదు) ఒక అత్తిపండు, ఒక యాపిల్ పండు ఇచ్చారు. యజమాని పిల్లలకు గొప్ప గొప్ప వాళ్ళంతా వచ్చి రకరకాల అందమైన వస్తువుల్ని బహుమానంగా ఇచ్చారు. ఆ వస్తువులు దేవలోకంనించి తెచ్చారా అన్నట్టు ఆకర్షణీయంగా వున్నాయి. ఒక్కొక్క బిడ్డకు వచ్చిన వస్తువులన్నీ యాభైరూబుల్సు విలువ చేస్తాయి. ఇదంతా చూచి మార్కెల్ తన కేదో పెద్ద అన్యాయం జరిగినట్టు భావించాడు. అతనికి ముప్ఫయి సంవత్సరాలు వచ్చాయి. ఆ ఫ్యాక్టరీలోనే పనిచేయటానికి ఒకావిడ వచ్చి చేరింది. ఆమె విప్లవనాయకురాలు. అతనిలో మంచి శక్తిసామర్థ్యాలున్నట్టు ఆమె ఊహించింది. అనేక పుస్తకాలు, కరపత్రాలు అతనికి చదవమని ఇచ్చింది. అతని ప్రస్తుత దయనీయస్థితినీ, అందులోనించి బైటపడి బాగుపడేందుకు మార్గాలూ తెలియ జెప్పింది. తనూ, తన అనుచరులూ ఈ ప్రస్తుత దుస్థితిలోనించి తప్పించుకోడానికి మార్గాలున్నాయని బోధపడేసరికి మార్కెల్కు యజమానులు చేసే అన్యాయాలు, అక్రమాలు అత్యంత భయంకరములు, దుస్సహములుగా కనిపించాయి. తానీగుంజాటనలోనించీ బయటపడాలనీ, ఈ అన్యాయాలకూ, దురంతాలకూ కారకులైన వారిని శిక్షించాలనీ అతనికి తీవ్రమైన వాంఛ రేకెత్తింది. ఈ వాంఛ నెరవేరాలంటే విజ్ఞానం కావాలని అతనికి చెప్పారు. అందుచేత విజ్ఞాన సముపార్జనకు తీవ్రంగా కృషి చేశాడు. విజ్ఞానసముపార్జనవల్ల సామ్యవాద లక్ష్యసాధన ఎలా సిద్ధిస్తుందో మాత్రం అతనికి బాగా తెలియదు. కాని ఏ విజ్ఞానం తనకు ధనస్వాముల అన్యాయాల్నీ అక్రమాల్నీ చూపించిందో, ఆ విజ్ఞానమే ఆ అన్యాయాల్నీ అక్రమాల్నీ నిర్మూలించగలదుకూడా అని అతడు విశ్వసించాడు. అదీగాక విజ్ఞానం పెరిగినట్టయితే జీవనస్థాయి పెరుగుతుందనికూడా అతని ఆశ. అందు,

కని ధూమపానం, సురాపానం మానేసి అవకాశం దొరికినప్పుడల్లా పుస్తకాలు చదివేవాడు.

ఆ విప్లవనాయకురాలు అతనికి పాఠాలు నేర్పేది. అతని విజ్ఞాన దాహానికీ, ఏ విషయాన్ని అయినా అతి సులభంగా గ్రహించగలుగుతూన్న అతని సామర్థ్యానికీ ఆమె ఆశ్చర్యపోయేది. రెండు సంవత్సరాల్లో బీజగణితం, రేఖాగణితం, చరిత్ర బాగా చదివేశాడు. చరిత్ర అంటే అతనికి చాలా యిష్టం. పర్యాటకస్వత్వం, నవలా సాహిత్యం, విమర్శన వ్యాసాలు కూడా చదివాడు. సామ్యవాద సాహిత్యం అంటే మాత్రం అతనికి ప్రత్యేకాభిమానం.

కొన్నాళ్ళకా విప్లవ నాయకురాల్ని అరెస్టు చేశారు. ఆమెతోపాటు మార్క్యెల్‌నూ అరెస్టు చేశారు. ప్రభుత్వం నిషేధించిన సాహిత్యం వాళ్ళ దగ్గర దొరికింది. వాళ్ళను కొన్నాళ్ళు జైల్లో వుంచి ఆ తరువాత వోలోగాకు ప్రవాసం పంపించారు. అక్కడ మార్క్యెల్‌కు నొవోడ్వొరోవ్‌తో పరిచయం లభించింది. ఇంకా ఎక్కువ విప్లవ సాహిత్యం చదివాడు. జీర్ణించుకున్నాడు. సామ్యవాద సిద్ధాంతాన్ని గురించి అతనికి స్థిరమైన ఊహాలు ఏర్పడ్డాయి. ప్రవాస శిక్ష అనుభవించి బైటికి వచ్చాక ఒకచోట నాయకత్వం వహించి సమ్మె నడిపించాడు. ఆ సమ్మె ఫలితంగా ఒక ఫ్యాక్టరీ నాశనమైపోయింది. ఫ్యాక్టరీ డైరెక్టరొకడు హతుడైనాడు. మార్క్యెల్‌ను మళ్ళీ అరెస్టు చేశారు. సైబీరియాకు పంపించారు.

ప్రస్తుత ఆర్థిక స్థితిగతుల్ని గురించిన అతని అభిప్రాయాలెట్టివో, అతని మత విషయకమైన ఊహాలు కూడా అలాంటివే. తాను ఏ మతంలో పెరిగాడో ఆ మతంలో ఉన్న గుడ్డి నమ్మకాలన్నింటినీ గుర్తించాడు. మొదట కొంత భగవద్భీతి అనేది లోపల కెలకవేసినా క్రమేణా మత విషయికమైన కట్టుబాట్లనుంచీ, గుడ్డి నమ్మకాలనుంచీ బయటపడ్డాడు. యిలా యిన్నాళ్ళనుంచీ అర్థంలేని మతంలో ఉంటూ తాను మోసపోయినందుకూ తన పూర్వీకులందరూ, ఇలాగే మోసపోయినందుకూ అతని కెక్కడలేని కోపం వచ్చింది. అందువల్ల అస్తమానం మతబోధకులనూ, మత సంబంధమైన మూఢ విశ్వాసాలనూ హేళనగా విమర్శిస్తూ ఉండేవాడు.

అతడు విషయ లాలసుడు కాదు. అతని కోరికలు స్వల్పం. చిన్నప్పటినుంచీ కాయకష్టానికి అలవాటు పడినవాడు కాబట్టి కండరాలు చక్కగా

పెరిగాయి. శారీరకమైన పరిశ్రమ అంటే వెనుకంజ వేయడు. చురుగ్గా చేస్తాడు. కాని ఎప్పుడు ఏ కాస్త విరామం దొరికినా పుస్తకాలు ముందేసుకుని కూచుంటాడు. చదువంటే అతనికి సరదా. ఇప్పుడతడు కార్ల్ మార్క్స్ రచనల ప్రథమ సంపుటం చదువుతున్నాడు. దాన్ని ఒక అమూల్యమైన వస్తువులాగ తన సంచిలో భద్రంగా దాస్తాడు. సాధారణంగా మితభాషి. ఒక్క నొవొడ్వోరోతో తప్ప మిగతా అందరిపట్ల నిర్లక్ష్యంగానే ఉంటాడు. నొవొడ్వోరోతో మాత్రం అతనికి సన్నిహిత మిత్రత్వం ఉంది. ఏ సమస్య గురించైనా నొవొడ్వోరో అభిప్రాయాలే ప్రమాణాలుగా శిరసా వహిస్తాడు.

మార్కెల్ కు స్త్రీలంటే పరమాసహ్యం. పురుషులు తలపెట్టే మంచి పనులకు స్త్రీలు విఘ్నకారకులని అతని అభిప్రాయం. కాని మస్లొవాపట్ల మాత్రం అతనికి ఎంతో జాలి. ఆమె యెడల దాక్షిణ్యంగా వ్యవహరిస్తాడు. క్రింది తరగతివారిని పై తరగతులవారు ఎలా బాధిస్తారో పీడిస్తారో రుజువు చేయటానికి మస్లొవా గాథ ఒక తార్కాణం. అందువల్ల అతనికి నెహ్లూడోవ్ అంటే అసహ్యం. కాగా అతడెప్పుడో నెహ్లూడోవ్‌తో ఎక్కువగా ప్రసంగించడు. దగ్గరకు వచ్చి కరచాలనం చెయ్యడు. ఊరికే చెయ్యి మాత్రం చాస్తాడు ఇష్టం లేకపోయినా.

## ౧౩

కుంపట్లు వెలిగించారు. వంటకాలు తయారైనాయి. తేనీరు కలిపారు. బిస్కట్లు, గోధుమరొట్టెలు, వెన్న, ఉడికించిన గుడ్లు, గొడ్డు మాంసం అన్నీ...ఒక బల్ల చెక్కమీద గుడ్డ పరిచి వరుసగా పెట్టారు. అంతా చుట్టూ కూచుని తింటున్నారు, లోకాభిరామాయణం మాటాడుకుంటున్నారు. రాంట్సేవా ఒక పెట్టెమీద కూచుని కప్పుల్లో తేనీరు పోస్తోంది. అంతా ఆమె చుట్టూ మూగారు తేనీటి కప్పుల కోసం. ఒక్క క్రిల్ట్సోవ్ మాత్రం అటుకేసి రాలేదు. తడి దుస్తులు తీసేసి పొడి దుస్తులు వేసుకుని అక్కడే కూచున్నాడు నెహ్లూడోవ్‌తో మాటాడుతూ.

వర్షంలో బురద రోడ్డుమీద దూర ప్రయాణంచేసి వచ్చాక, వాళ్ళంతా శుభ్రమైన దుస్తులు ధరించి ఏదో తిని, తాగినట్టేకే... మళ్ళీ ప్రాణాలు లేచివచ్చినట్టనిపించి ఉల్లాసంగా ఉన్నారు.

అవతల పక్కనుంచి క్రిమినల్ ఖైదీల సంకెళ్ల చప్పుడు, అరుపులూ, ఒకళ్లనొకళ్లు తిట్టుకుంటోన్న బూతులు వినిపిస్తున్నాయి. ఒక మహా సముద్రం మధ్య ఒక ద్వీపంలో ఉన్నట్టు...చుట్టూ క్రిమినల్ ఖైదీల నికృష్ట పరిస్థితులు, మధ్య తాము హాయిగానే ఉన్నట్టు...రాజకీయ ఖైదీలు భావించుకుంటున్నారు. వాళ్లకు హాయిగా, ఉల్లాసంగా వుంది. తమ ప్రస్తుత స్థితిగతుల్ని, భవిష్యత్తులో తమకు కలుగబోయే అనుభవాల్ని తలచుకోటంలేదు. అవి పూర్తిగా విస్మరించారు. ఏవేవో ఇతర విషయాల్ని గురించి చర్చించుకుంటున్నారు. ఈ విధంగా అనేకమంది యువతీ యువకులు ఒకే చోట కలసి వుండవలసిన పరిస్థితి ఏర్పడితే ప్రేమలు, ఈర్ష్యలు, ద్వేషాలు—ఏవేవో ఏర్పడుతూ ఉంటాయి. నొవోడ్వోరోవ్ గ్రాబెట్స్‌ను ప్రేమిస్తున్నాడు. గ్రాబెట్స్ ఒక అందమైన పిల్ల. ఆమె నవ్వు చాలా రమణీయంగా ఉంటుంది. కాని ఆలోచన లేని మనిషి. కాలేజీలో చదువుకుంటూ ఉండేది. విప్లవ సంఘంతో ఆమెకేమీ సంబంధం లేదు మొదట. కాని కాలమాన పరిస్థితుల్ని బట్టి చివరకు అందులోకి ఆకర్షింపబడింది. తత్ఫలితంగా ప్రవాస శిక్షకు లోనైందిప్పుడు. కాలేజీలో చదువుకుంటున్నప్పుడు గాని, పట్టుబడి జైల్లో ఉన్నప్పుడు గాని, ఇప్పుడీ రాజకీయ ఖైదీలతో కలసి ప్రయాణం చేస్తున్నప్పుడు గాని...ఆమె జీవితానందకరమైన విషయం ఒక్కటే ఉంది. ఆమె పురుష హృదయాల్ని అవలీలగా కైవసం చేసుకోగలదు. ఇప్పుడామెను నొవోడ్వోరోవ్ కామించి వెంటపడుతున్నాడు. ఆమెకూ అతనిమీద వలపు కలిగింది. దుఖోవా కామిస్తుంది; కాని వలపించు నేర్పు తక్కువ. ఆమె మనస్సు ఇప్పుడు కాసేపు నబటోవ్ వైపు, మరి కాసేపు నొవోడ్వోరోవ్ వైపు పరుగెత్తుతోంది. క్రిల్ట్సోవ్ మేరీపావ్‌లోనాను హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నాడు. కాని అతనికి మేరీపావ్‌లోనా వ్యవహారం బాగా తెలుసు. అందుచేత తన ప్రేమను బైటికి ప్రకటించలేదు. మామూలు స్నేహభావమూ,...ఆమె తనకు చేస్తున్న సపర్యలపట్ల కృతజ్ఞతా భావమూ మాత్రమే వ్యక్తీకరిస్తున్నాడు. నబటోవ్-రాంట్‌సేవాల సంబంధం చిత్రగతుల్లో నడుస్తోంది

రాంట్‌సేవా తన పదహారో యేట...స్కూల్లో చదువుకుంటూన్న రోజుల్లో ఒక యువకుని ప్రేమించింది. అతడు పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయ

విద్యార్థి. అతని కాలేజిచదువు ముగియకముందే ఇద్దరికీ వివాహం అయింది. అప్పటికి శాంటా సేవాకు పందొమ్మిదేళ్ళు. ఆ యువకుడు కాలేజిలో నాలుగో సంవత్సరం చదువుతున్నాడు. అప్పుడు విద్యార్థులు ఏవో కొన్ని అల్లర్లలో పాల్గొన్నారు. ఆ అల్లర్ల ఫలితంగా అతనికి ప్రవాసశిక్ష విధించారు. తరువాత అతడు విప్లవ సంఘంలో చేరిపోయాడు. వైద్యవిద్య అభ్యసిస్తున్న శాంటా సేవాకూడా తన చదువుకు స్వస్తిచెప్పి భర్తను అనుసరించి వెళ్ళింది. తాను కూడా విప్లవ సంఘంలో చేరింది. తనభర్త ఉత్తముడు, మిక్కిలి తెలివైన వాడు అని ఆమె అభిప్రాయం; అందువల్లనే అతన్ని ప్రేమించి వివాహం చేసుకుంది. వివాహం చేసుకున్న తరువాత భర్త వ్యక్తిత్వాన్ని అనుసరించే తన జీవిత కార్యక్రమాల్ని నిర్ణయించుకుంటూ వచ్చింది. అనేక విషయాల్ని అభ్యసించి నేర్చుకోవాలి అని ఆమె లక్ష్యం. అందుచేత ఆమె అనేక గ్రంథాల్ని శ్రద్ధగా చదివింది. అతడు విప్లవ సంఘంలో చేరాడు; తానూ చేరింది. ప్రస్తుత సాంఘిక వ్యవస్థ చాల భయానకంగా ఉంది; ఈ పరిస్థితులు ఇలాగే సాగిపోనీయరాదు; ఈ వ్యవస్థను ఇంతటితో అంతంచేసి...ప్రతి వ్యక్తీ స్వేచ్ఛగా కావలసినంత వికాసాన్ని పొందటానికి అనువైన అవకాశాలుగల ఒక సౌష్టవమైన వ్యవస్థను నిర్మించాలి—అని తనభర్త సతర్కంగా రుజువుచేసి చెప్పాడు. అదంతా నిజమే నన్నట్లు ఆమెకు స్ఫురించింది. భర్త ఏమిచెప్పినా ఆమెకు పరమ సత్యంలాగే స్ఫురించేది. అతని భావాలతో తాను సంపూర్ణంగా సామరస్యం పొందితేనే తనకు ఆత్మ సంతృప్తి అన్నట్టుగా ఆమెకు అనిపించేది.

విధిగా నామె భర్తను విడిచిపెట్టి రావలసి వచ్చింది. ఈ యెడబాటు చాల దుఃఖకరమైనదే. అయినా ఆమె ధైర్యంతో సంహించింది. తన భర్త ఒక మహోత్కృష్ట సిద్ధికోసం దీక్ష గైకొన్నాడు. అతని ఆశయం నెరవేరాల్సిందే. కాబట్టి తానీ యెడబాటు దుర్భరమైనా భరించక తప్పదు. అతనితో ఉన్నన్నాళ్ళు అతన్నే అనుసరించింది, ఆరాధించింది ఇప్పుడైనా నిరంతరం ఆమె అతన్ని గురించి ఆలోచిస్తూనే ఉంటుంది. అతన్నేతప్ప ఇంకెవర్నీ ఆమె ఎప్పుడూ ప్రేమించలేదు. ఇప్పుడామెను నటటో మిక్కుటంగా ప్రేమిస్తున్నాడు. అతని నిశ్చల నిరంధ్రమైన ప్రేమకు ఆమె కొంతవరకు విచలితురాలైంది. అతను నీతిమంతుడే; స్థిరసంకల్పంగల వ్యక్తి; ఆమెభర్తకు మిత్రుడున్నూ. అతడామెను తన చెల్లెల్నిలాగా ఆత్మీయతతో చూస్తున్నాడు.

కాని అతని ప్రవర్తనలో మరేదో కొంత అధికంగా కనిపిస్తోంది. అది ఇద్దర్నీ భయగ్రస్తులను చేస్తోంది. అయినా ఈ కష్టస్థితిలో అదే ఓదార్పుగానూ పని చేస్తోంది.

ఇంతకూ అక్కడున్న వారిలో ఏ ప్రేమగొడవల్లోనూ తగులుకోని వాళ్లు ఇద్దరే ఉన్నారు-మేరీపావ్‌లోనా, మార్సెల్.

## ౧౪

తేనీరు తాగిన తరువాత నెఖ్లూడో క్రిల్ట్‌సో దగ్గర కూచుని మాటాడుతున్నాడు మస్లావాతో కాసేపు ఏకాంతంగా కలసి మాటాడి పోవాలని అతని ఊహ. మకార్ గాథ, అతడు తనతో చేసిన విజ్ఞాపన క్రిల్ట్‌సోతో చెప్పాడు. క్రిల్ట్‌సో గుడ్లు వొప్పజెప్పి అంతా సావధానంగా విన్నాడు.

“ఔను వాళ్ళంతాకూడా మాతోనే ప్రయాణాలు చేస్తూవస్తున్నారు. ఎవరు వాళ్ళందరూను? వాళ్ళకోసమే మేము ఇంత శ్రమపడి ఇలా అవస్థలు పడుతున్నాం. అయినా వాళ్ళనుగురించి మాకేం తెలీదు; తెలుసుకోటానికీ ప్రయత్నించం. వాళ్ళ స్థితిగతులు మరీ దిగజారి పోతున్నాయి. మమ్మల్ని వాళ్ళు అసహ్యించుకుంటున్నారు; మమ్మల్ని శత్రువులుగా పరిగణిస్తున్నారు. ఎంతఘోరం” అన్నాడు క్రిల్ట్‌సో వినివినీ.

ఆ పక్కనేవున్న నొవొడ్వోరో ఆ మాటలు విన్నాడు. అన్నాడు: “అందులో ఘోరం ఏమీలేదు. మామూలు ప్రజలు అధికారాన్ని పూజిస్తారు. అధికారం ప్రభుత్వం చేతుల్లోవుంది. కాబట్టి వాళ్ళు ప్రభుత్వాన్ని పూజిస్తారు, మనల్ని ద్వేషిస్తారు. రేపు అధికారం మనచేతుల్లోకి వస్తుంది. అప్పుడు వాళ్ళు మనల్నే పూజిస్తారు.”

ఆ సమయాన గోడ అవతలనించి క్రిమినల్ ఖైదీల సంకెళ్ళ గలగల, వాళ్ళు మాటాడే బూతులు వినిపించాయి. ఏదో గోడకు కొట్టుకుంటున్న చప్పుడూ, పైపైని అరుపులూ, కేకలూ, ఎవరినో ఎవరో చావగొడుతున్నాడు. ఇంకెవరో అరుస్తున్నాడు; “హాయ్య! హాయ్య! రక్షించండో” అని.

“విన్నారా! మనుష్యులు కాదు, మృగాలు వాళ్ళు! వాళ్ళకూ మనకు సాన్నిహిత్యం ఎలా కుదురుతుంది?” అన్నాడు నొవొడ్వోరో.

"వాళ్ళను మృగాలు అంటున్నావా? ఇంతకు ముందే నెఖ్లూడ్తో ఏమిచెప్పానో విన్నావా?" అంటూ క్రిల్ట్సో...మకార్ ఏ విధంగా తన ప్రాణంమీదికే వస్తుందని తెలిసికూడా ఒక తోడిగ్రామస్తుని రక్షించేందుకెలా సంకల్పించాడో ఆ కథంతా...చెప్పి "ఇది మృగలక్షణం కాదే! ఉత్తమ నాయకుని లక్షణమే నే!" అన్నాడు...కొంచెం కోపంగానే.

"అదేదో తాత్కాలిక ఆవేశం ఐవుండవచ్చు" అంటూ నొవొడ్వొరొవ్ ఎగతాళిగా నవ్వేశాడు. "వాళ్ళ భావాలేమిటో, ఉద్దేశాలేమిటో గ్రహించటం కష్టం. ఒకనిలో ఔదార్యం ఉన్నట్టు పైకి కనిపించవచ్చు. కాని అది ఇంకొకరిమీదనో ఈర్ష్య కావచ్చు నిజానికి" అన్నాడు నొవొడ్వొరొవ్ ..రెండో ఖైదీమీది ఈర్ష్యవల్లనే మకార్ దేవకిన్ తోడి గ్రామస్తుని రక్షించేందుకు పూనుకుని ఉండవచ్చుననే భావం ధ్వనిస్తూ.

"మీ కెప్పుడూ ఎవరిలోనూ మంచిఅనేది కనిపించదేం?" మేరీపావ్లోనా ముందుకువచ్చి కోపంగా అడిగింది.

"అసలు లేనిదే ఎలా కనిపిస్తుంది?"

"ప్రాణాలకు తెగించికూడా ఒకడొక సత్కార్యం చేస్తున్నాడంటే లేకుండా ఎలా పోతుంది?"

దీనికి నొవొడ్వొరొవ్ సమాధానం చెప్పసాగాడు. ఆ సమయాన మార్కెల్ తాను చదువుతున్న పుస్తకం మూసేసి తన గురువుగారైన నొవొడ్వొరొవ్ చెబుతోన్న సమాధానం సావధానంగా వింటున్నాడు. నొవొడ్వొరొవ్ సమాధానం ఇది: "మన తాత్వికపు ఊహాలు, భావనా పటిమ కాదు; మన చేతల్ని నిర్ణయించవలసింది. పరిస్థితులు ఉన్నవి ఉన్నట్లుగా అర్థం చేసుకోవాలి. సాధారణ ప్రజలకు మన శాయశక్తులా సేవ చెయ్యాల్సిందే. అందుకు ప్రతిఫలం మనం ఆశించకూడదు. వాళ్ళను దృష్టిలో పెట్టుకునే మన కార్యక్రమంసాగాలి. కాని వాళ్ళు ప్రస్తుతం అచేతన స్థితిలో ఉన్నారు. ఇలా అచేతన స్థితిలో ఉన్నంతవరకూ వాళ్ళు మన కార్యక్రమంలో మనతో పాటు పని చెయ్యటానికి వీల్లేదు. కాబట్టి వాళ్ళలో చైతన్యం, వికాసం వచ్చేంతవరకూ వాళ్ళసహాయాన్ని మనం ఆశించటం అపాయ హేతువు. వాళ్ళు చైతన్యవంతులు కావటానికి మార్గం మనం తయారు చేస్తున్నాం" అంటూ ఉపన్యాస ధోరణిలో చెప్పాడు.

"ఏంమార్గం?" క్రిల్ట్సోకు కోపం వచ్చింది. ఇంకా ఇలా అన్నాడు. "మనం నిరంకుశత్వాన్ని ఖండిస్తున్నాం. కాని నీ మాటల్లో భయంకర నిరంకుశత్వం తాండవిస్తోంది."

"నిరంకుశత్వం ఏమీలేదు. ప్రజలు తరించవలసిన పంథా ఉంది. ఆ పంథా నాకు తెలుసు; ప్రజలకు చూపిస్తాను" అన్నాడు నెమ్మదిగా నొవొడ్వొరో.

"కాని నువు చూపేమార్గమే సరైన మార్గమని నీకేం తెలుసు? నీది ఒక్కటే సరైన మార్గమని భావించటం నిరంకుశత్వం కాదా? స్పెయిన్‌లో అనేకమంది కేథలిక్‌లను నానాహింసలపాలు చేసిందీ...ఫ్రెంచి విప్లవాన్నికి హేతువూ...ఈ రకమైన నిరంకుశత్వమే కాదా? వాళ్ళకూ తెలుసునన్న మాటేగా ఆ ఒకే ఒక సరైన మార్గం?"

"వాళ్ళు పొరపాటు పడ్డారు. కాబట్టి నేనూ పొరపాటు పడతానని నువ్వు అనటం మంచి తర్కం కాదు. అదీగాక, వాళ్ళు ఏవో ఆదర్శాల్ని పట్టుకుని ఊగులాడారు; నేను వాస్తవిక పరిస్థితులను అనుసరించి పనిచేస్తున్నాను. ఆదర్శవాదానికీ, వాస్తవిక దృష్టికీ బోలెడంత తేడా వుంది" బిగ్గరగా గది అంతా తానే అన్నట్టు ధాటీగా మాటాడాడు నొవొడ్వొరో చాలాసేపు. మరెవరూ మాటాడలేదు.

"వాళ్ళకెప్పుడూ వాగ్వాదమే" అన్నది మేరీపావ్‌లోనా ఆఖరుకు.

"ఇంతకూ ఈ విషయమై నీ ఉద్దేశం ఏమిటి?" నెహ్లూడొ అడిగాడు ఆమెను.

"మన ఉద్దేశాల్ని యితరులపై రుద్దకూడదని క్రిల్ట్సో చెప్పిన మాటతో నేను ఏకీభవిస్తున్నాను" అన్నదామె.

"మరి నీ ఉద్దేశం ఏమిటి?" నెహ్లూడొ మస్లొవాకేసి తిరిగి ప్రశ్నించాడు. కాని ఆమె ఏమి అసందర్భపు సమాధానం చెబుతుందోనని కాస్త జంకాడు.

"అలనా, పాలనా లేని సాధారణ ప్రజలకు చాలా అన్యాయం జరుగుతోంది. నిత్య పీడితులైన వాళ్ళ అవస్థలు చెప్పటానికి వీల్లేదు" అన్నది మస్లొవా సిగ్గుపడుతూ.

"చాలా బాగా చెప్పావు మస్తావా! నిజం చెప్పావు. ప్రజలకు అన్యాయం జరుగుతోంది. మన కార్యకలాపం అంతా అన్యాయం జరగకుండా ఉండేందుకే" అన్నాడు నటటో.

"విప్లవ కార్యక్రమం యొక్క మీ ఉద్దేశం చాలా చిత్రంగా వుంది" అంటూ కోపంగా పలికి నొవొడ్వోర్ సిగరెట్ వెలిగించాడు.

"నే నతనితో వాదించలేను" అన్నాడు నెమ్మదిగా క్రిట్సోస్ నెక్లూడోవ్తో.

"వాదించక పోవటమే మంచిది" అన్నాడు నెక్లూడో.

## ౧౫

విప్లవకారులందరికీ నొవొడ్వోర్ అంటే మంచి గౌరవమే ఉంది. అతడు చాలా చదివాడు. అందరూ అతన్ని చాలా తెలివిగలవాడనే అంటారు. కాని ఆ వ్యక్తి...విప్లవ ఉద్యమంలో నైతికంగా చాలా తగ్గు స్థాయిలో ఉన్న సాధారణులలో ఒకడుగా నెక్లూడో భావించాడు. అతని మేధాశక్తి గొప్పదే. అహంభావం అంతకన్నా గొప్పది.

అతని స్వభావం సైమన్సన్ స్వభావానికి పూర్తిగా వ్యతిరేకం. సైమన్సన్ నిజంగా మగవాడని చెప్పాలి. ఏ విషయమైనా స్వబుద్ధితో ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తాడు. స్త్రీలు సాధారణంగా ఉద్రేకంతో, ఆవేశంతో వ్యవహరిస్తారు. ఆ ఉద్రేకంలో, ఆవేశంలో చేసిన పనులను సమర్థించుకో చూస్తారు. నొవొడ్వోర్ ఈ తరగతికి చెందిన మనిషి.

నొవొడ్వోర్ తన విప్లవ కార్యక్రమం చాలా విశిష్టమైనదని చక్కగా ఇతర్లకి నచ్చేటట్టు వివరించి చెప్పగల వాక్చాతుర్యం కలవాడే. కాని అతనికి బాగా అధికార వ్యామోహం, కీర్తి పిపాస ఉన్నట్లు నెక్లూడో గమనించాడు. హైస్కూల్లోనూ, తరువాత కాలేజిలోనూ చదువుకునే రోజుల్లో పుస్తకాలు బాగా చదివి వాటిలోని భావాల్ని మళ్ళీ చక్కగా తిరిగి చెప్పగల సామర్థ్యం నొవొడ్వోర్కు బాగా ఉండేది. విద్యార్థికి కావలసిన ప్రజ్ఞ అదే కదా! అందుచేత అతన్ని ఉపాధ్యాయులు, తోటి విద్యార్థులు బాగా పొగిడేవారు. అతని ఆత్మకు తృప్తిగా ఉండేది. కాని డిగ్రీ పుచ్చుకుని కాలే

జైల్లోనుంచి బైటికి వచ్చాక ఆ పొగడ్తలు, ఆత్మతృప్తి కనిపించలేదు. అందుచేత తన భావాల్ని మార్చుకుని మరో రంగంలో ఆధిక్యత సంపాదించాలని అనుకున్నాడు. పూర్తిగా అతివాదిగా మారిపోయాడు... అని ట్రాట్స్కీ అతన్ని గూర్చి చెబుతాడు.

మంచీ, చెడూ; నీతి, అవినీతి, అనే విచక్షణ కలవాడికే ఏ విషయం గురించైనా సందేహాలు, అనుమానాలూ కలుగుతూ ఉంటాయి. నొవొడ్లోరోకు అటువంటివేమీ లేవు. తొందరలోనే ఒక పార్టీ నాయకుడైనాడు. మళ్ళీ ఆత్మ సంతృప్తి పొందాడు. ఒక పంథా నిర్ణయించుకున్నాడంటే మళ్ళీ అతనికి అనుమానాలుగాని, సందేహాలుగాని వచ్చేవి కావు. తానేమీ పొరపాటు పడటం లేదని అతనికి గట్టి నమ్మకం. సంకుచిత తత్వం కలవాడు కాబట్టి ఏ సమస్యనూ సర్వతోముఖంగా చూడడు. ఒకవైపే చూస్తాడు. అందుచేత అతనికి ఏ సమస్యా క్లిష్టంగా ఉండదు. సులభంగా పరిష్కరించేదిగానే ఉంటుంది. చెప్పే విషయం సహేతుకంగా చెబితే చాలునని అతని అభిప్రాయం. తన అభిప్రాయాలే ఉత్కృష్టమైనవని అతనికి ప్రబలమైన విశ్వాసం. ఈ ప్రబల విశ్వాసానికి కొందరు లొంగిపోయి అనుచరులౌతారు. మరి కొందరు అసహ్యించుకుంటారు. యువక హృదయాల్ని మాత్రం అతడు తేలిగ్గా ఆకర్షించ గలిగాడు. విస్తృతమైన పాండిత్యం, ప్రజ్ఞా ప్రాభవాలు గల వ్యక్తి కనుకనే అంత అహంభావంగా, పట్టుదలగా ఉంటాడని వాళ్ళు భావించి అతనికి లొంగిపోయి అనుచరులైనారు. అతని ప్రభావం సాగినంత వరకు విజయవంతంగానే సాగింది. విప్లవం ద్వారా అధికారాన్ని తాను హస్తగతం చేసుకుని, ఒక కౌన్సిల్‌ను ఏర్పరుస్తాడట. తాను తయారుచేసిన ఒక కార్యక్రమం ఆ కౌన్సిల్ ముందు పెట్టి ఆమోదింప జేస్తాడు. ఈ కార్యక్రమం ప్రతి సమస్యనూ పరిష్కరింపగలదని అతని విశ్వాసం. దాన్ని అమలు జరిపిస్తాడట. యిదీ అతని ఆశయం.

అతడంటే అతని అనుచరులకు గౌరవమేగాని ప్రేమలేదు. అతనికీ ఎవరిమీదా ప్రేమలేదు. కాస్త పేరు ప్రఖ్యాతి సంపాదించిన ప్రతివాడినీ తనకు పోటీదారుగా భావిస్తాడు. అటువంటి వాడిని నులిమివేయ్యాలన్నంత కోపంగా ఉంటాడు. తన ప్రజ్ఞ, తెలివితేటలూ చూపించాలనే అతని తాపత్రయం. తన కెదురు ఎవ్వరూ ఉండరాదు. ఉంటే అటువంటివాళ్ళ మెడను

లాగేసి పారెయ్యాలన్నంత ఉత్సాహం అతనికి. తనకు పక్క ప్రాణులైన వాళ్ళను మాత్రమే అతడు మర్యాదగా చూస్తాడు. తన ప్రచారంవల్ల ప్రభావితుడైన మార్కెల్‌నూ, తన్ను ప్రేమిస్తోన్న ముఖోవాగా, గ్రాడెట్స్‌ను మాత్రమే కొంచెం ఆదరణగా చూస్తాడు. పైకి మాత్రం మహిళా ఉద్యమాలపట్ల సానుభూతి ఉన్నవాడులాగే నటిస్తాడు. కాని స్త్రీలు వట్టి బుద్ధిహీనులనీ, ఎందుకూ పనికిరానివాళ్ళనీ అతని నిజమైన ఆంతరంగిక అభిప్రాయం. తన ప్రేమ ప్రసరించిన గ్రాడెట్స్ లాంటి యువతుల్ని మాత్రం అసాధారణ వ్యక్తులని కీర్తిస్తాడు...వాళ్ళ గుణగణాల్ని గ్రహించగల సామర్థ్యం తనకే ఉన్నట్టు.

స్త్రీ పురుషులు యథేచ్ఛగా ఎవరి యిష్టం వచ్చినట్టు వాళ్ళు కలిసి మెలసి వ్యవహరించవచ్చు...అని నొవొడ్వోరోవ్ సిద్ధాంతం.

అతనికి నామకః ఒక భార్య వుంది. అసలు భార్య మరొకతె ఉంది. ఒకరిమీద ఒకరికి నిజమైన ప్రేమ లేదన్న నిర్ణయానికి వచ్చేసి అసలు భార్యను విడిచిపెట్టేశాడు. ఇప్పుడు యథేచ్ఛగా గ్రాడెట్స్‌తో వ్యవహరించాలని చూస్తున్నాడు. నెఖ్లూడోవ్ అంటే, అతనికి అసహ్యం. మస్లోవాతో ఆయన 'బుద్ధిహీనుడు'లా వ్యవహరించాడని అతనంటాడు. నెఖ్లూడోవ్ కూడా ప్రస్తుత వ్యవస్థలోని లోపాల్ని గ్రహించాడు, వాటిని సరిదిద్దటానికి విధానాల్ని ఆలోచిస్తున్నాడు. కాని అతని దృక్పథం, ఒక బుద్ధిహీనుని దృక్పథం అని నొవొడ్వోరోవ్ వ్యాఖ్యానిస్తాడు. అందుచేత నెఖ్లూడోవ్‌కు అతనంటే సద్భావం లేదు.

## ౧౬

ప్రక్క గదిలోనుంచి ఆఫీసర్ల కంఠస్వరం వినిపించింది. ఖైదీలంతా నిశ్శబ్దంగా ఉన్నారు. ఒక సార్జంటు, ఇద్దరు సైనికులు లోనికి వచ్చారు. తనిఖీచేసే వేళ అయింది. సార్జంటు అందర్నీ లెక్కపెట్టాడు. నెఖ్లూడోవ్ దగ్గరకు వచ్చాడు. "తనిఖీ జరిగేటప్పుడు మీరు ఇక్కడ ఉండకూడదు. మీరిక దయచేయ్యాలి" అన్నాడు మర్యాదగా.

నెఖ్లూడోవ్ ఆ మాటల అర్థం గ్రహించి, మూడు రూబుల్స్ నోటు చేతిలో పెట్టాడు.

"అయితే సరే, మీ వల్ల మాకేం యిబ్బంది? కావలిస్తే యింకా కాసేపు ఉండండి" అని పలికి సార్జంటు వెళ్ళబోతున్నాడు. ఇంతలో మరో సార్జంటు వచ్చాడు. అతనితోపాటు ఒక క్రిమినల్ ఖైదీ వచ్చాడు. ఆ ఖైదీ గడ్డం పలుచగా ఉంది, అతని కంటికింద ఒక గాయం ఉంది. "మా అమ్మాయికోసం వచ్చాను" అన్నాడతడు.

"అదుగో, మా నాన్నొచ్చాడు" అంటూ రాంట్ సేవా పక్కనున్న ఆ పిల్ల కలకల లాడుతూ పలికింది. మేరీపావ్లోనా, మస్లోవాల సాయంతో రాంట్ సేవా తన వద్దనున్న గుడ్డ ఒకటి చింపించి ఆ పిల్లకు కొత్త గౌను ఒకటి కుడుతోంది.

"ఔనమ్మా! నే నేనే! అన్నాడా ఖైదీ బిడ్డను ఉద్దేశించి. అతని పేరు బుజోకిన్.

మేరీ పావ్లోనా అతనికింది గాయంకేసి జాలిగా చూస్తూ "పిల్ల యిక్కడ ఖులాసాగానే ఉంది మా దగ్గరే ఉండనీ" అన్నది.

"నాకు కొత్త గౌను కడుతున్నారు నాన్నా!" అంటూ ఆ పిల్ల, రాంట్ సేవా చేతుల్లో ఉన్న గుడ్డకేసి చూపిస్తూ "ఎర్రగా, ఎంత బాగుందో చూడు" అన్నది.

"నువ్వు మా దగ్గరే పడుకుంటావు కదూ?" రాంట్ సేవా బుజ్జగిస్తూ అడిగింది పిలను.

"ఊం, మా నాన్న కూడానా?"

"ఊహుం. మీ నాన్న యిక్కడ కాదు" అని పలికి రాంట్ సేవా బుజోకిన్ వైపు తిరిగి "పిల్లను మా దగ్గరే ఉంచుకుంటాంలే" అని చెప్పింది.

"ఇంకేం! యిక నువ్వు వెళ్ళిపోవచ్చు" అన్నాడు మొదటి సార్జంటు బుజోకిన్‌తో. ఆ తరువాత ఇద్దరు సార్జంట్లూ వెళ్ళిపోయారు.

అప్పుడు నబటోవ్ బుజోకిన్ దగ్గరకు వెళ్ళి, వీపుతట్టి "ఏం ముసలయ్యా! కార్మనోవ్ పేరు మార్చుకోవాలను కుంటూన్న మాట నిజమేనా?" అని అడిగాడు.

"నేను చెప్పటం లేదట్రా మతి పోయినవాడా! అవి నావికావు"... అంటూ ఒక కంఠం.

"నీ గొంతు పూడిపోను గదరా!"...అని రెండో కంఠం.

ఆ సమయానికి మేరీషావ్‌లోనా వరండాలోకి వచ్చింది. "ఈ గందరగోళం! మీరేమి మాట్లాడుతుంటూ ఇక్కడ? ఆ గదిలోకి వెళ్ళండి. దుఖోవా ఒక్కతే ఉందక్కడ" అంటూ ఆమె వాళ్ళిద్దర్నీ ఒక చిన్న లోపలి గదిలోకి తీసుకుపోయింది. అక్కడ దుఖోవా ఒక్కతే ఒంటరిగా దుప్పటి కప్పుకొని పడుకుంది.

"ఆమెకు తలనొప్పి వచ్చి, పడుకుని నిద్రపోతోంది. మీ మాటలు ఆమెకు వినిపించవులెండి. నేనూ వెళ్ళిపోతున్నాను" అని చెప్పి మేరీషావ్‌లోనా అక్కడనించి పోబోయింది.

"నువ్వు వెళ్ళనక్కర్లేదు ఉండు. ఇతర్లు వినరాని రహస్యాలు నాకు లేవు. అందులో నువ్వు వినకూడనివంటూ అసలే లేవు" అన్నాడు సైమన్‌సన్.

"అయితే సరే" అంటూ మేరీషావ్‌లోనా తిరిగివచ్చి...అయిష్టంకీ కొంచెం దూరంగానే కూచుంది...అటెటో చూస్తూ.

సైమన్‌సన్ ఇలా చెప్పాడు నెహ్లూదోవ్‌ను లక్ష్యించి: "మస్లోవాతో నీకున్న సంబంధాలు నాకు తెలుసు. కట్టి ఆమెతో నాకున్న సంబంధాలేమిటో...అది కూడా నీకు నేను చెప్పి తీరాలి."

సైమన్‌సన్ అంత అరమర లేకుండా మనసువిప్పి మాట్లాడుతున్నందుకు నెహ్లూదోవ్ అతన్ని లోలోన ప్రశంసించాడు. "అంటే మీ ఉద్దేశం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

"మస్లోవాను పెళ్ళి చేసుకోవాలని నా అభిప్రాయం"

మేరీషావ్‌లోనా సైమన్‌సన్ వైపు తేరిపార చూచింది. "చాలా విచిత్రంగా ఉందే!" అన్నది.

"నా భార్యవు కమ్మని ఆమెను అడగటానికి నిశ్చయించుకున్నాను" అన్నాడు సైమన్‌సన్.

"ఈ విషయమై నేను చేసేదేముంది? అది ఆవిడ మీద ఆధారపడి ఉంటుంది" అన్నాడు నెహ్లూదొవ్.

"ఆమాట నిజమే. కాని ఆమె మీ ఉద్దేశాన్ని తెలుసుకోకుండా ఒక నిర్ణయానికి రాజాలదు"

"ఎందువల్ల?"

"ఆమెతోడి మీ సంబంధం ఒక రూపానికి రాకుండా ఉన్నంతకాలం ఆమె ఏమీ నిర్ణయించుకో జాలదు."

"నేనొక సుస్థిరమైన నిర్ణయానికే వచ్చాను. ఆమెపట్ల నేను నిర్వర్తించవలసిన విధి ఎంతవరకో అంతవరకూ నిర్వర్తిస్తాను. ఆమె భవిష్యత్తును బాగుచెయ్యటం నా ధర్మం. కాని ఆమెపై ఏ విషయంలోనూ బలవంతం తీసుకురావటం నా కిష్టంలేదు."

"తనకోసమై మీరు అంత త్యాగానికి పూనుకోటం ఆమె కిష్టంలేదు."

"ఇది త్యాగం కాదు."

"ఆమెకది యిష్టంలేదనే నాకు తెలుసు"

"అయితే ఇక నాతో మీరు మాటాడవలసిం దేముంది?"

"ఆమెలాగే మీరూ భావిస్తున్నట్లు అంగీకరించాలని ఆమె కోరిక.

"నా విధిని నేను నిర్వర్తించను అని నే నెందు కంగీకరిస్తాను. ఆమె కున్నంత స్వేచ్ఛమాత్రం నాకు లేదు. ఆమాట మాత్రం ఒప్పుకుంటాను."

సైమన్‌సన్ జవాబేమీ చెప్పలేదు. కాసేపు ఆలోచించుకుని చివరి కిలా అన్నాడు: "సరే నే నామెతో చెబుతాను. ఆమెను నేను కామిస్తున్నట్టు మీరు భావించకండి సుమీ! ఎన్ని బాధలనో ఓర్చి సహించిన ఒక గొప్ప అసాధారణ వ్యక్తి ఆమె అని ప్రేమిస్తున్నాను. ఆమె దగ్గర నుంచి నేను కోరేది ఏమీ లేదు. ఆమెకు సాయం చెయ్యాలనీ, ఆమె భవిష్యత్తును బాగుచెయ్యాలనీ నాకు గట్టి పట్టుదలగా ఉంది" సైమన్‌సన్ కంఠధ్వని వొణికింది. అది చూసి నెహ్లూదొవ్ ఆశ్చర్యపోయాడు సైమన్‌సన్ ఇంకా యిలా చెప్పసాగాడు: "ఆమె మీ సహాయాన్ని స్వీకరించకపోతే నా సహాయాన్ని అయినా పొందనీయండి. ఆమె వొప్పుకునేట్లయితే... ఆమెను నిర్బంధించే చోటుకే నన్ను తీసుకుపోండని అధికార్లను వేడుకుం

టాను. నాలుగేళ్ళంటే యుగాలు కాదూ! అంతకాలం ఆమెకు సమీపంలోనే వుంటూ ఆమె బాధల్ని వీలైనంతవరకు తొలగించటానికి ప్రయత్నిస్తాను" సైమన్‌సన్ మళ్ళీ కాసేపు ఆగాడు. భావావేశంలో యిక మాటాడలేకపోయాడు.

"ఇక నేను చెప్పేదేముంది? మీ లాంటి ఒక ఉత్తమ వ్యక్తిని తన రక్షకుడుగా ఆమె పొందగలిగినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను" అన్నాడు నెఖ్లూడొవ్.

"అదే నేను తెలుసుకో గోరుతున్నాను. మీరూ ఆమెను ప్రేమిస్తున్నారు; ఆమె సుఖాన్ని కోరుతున్నారు. కాబట్టి ఆమెను నేను వివాహం చేసుకోవటం ఆమెకు శ్రేయస్కరమౌనో కాదో మీవల్ల తెలుసుకో గోరుతున్నాను."

"తప్పకుండా శ్రేయోదాయకమే." అన్నాడు నెఖ్లూడొవ్.

"ఇంతకూ ఆమె యిష్టం. ఇన్ని బాధల్ని అనుభవించిన ఆమె ఆత్మకు శాంతి చేకూరాల్లని నా కోరిక, అంతే" అన్నాడు సైమన్‌సన్. సాధారణంగా ఎప్పుడూ విచారంగా, మితభాషిగా ఉండే ఈవ్యక్తి ఇంతగా, ఈ ధోరణిలో మాటాడ్డం చూచి నెఖ్లూడొవ్‌కు ఆశ్చర్యం కలిగింది.

సైమన్‌సన్ లేచి నెఖ్లూడొవ్‌కు దగ్గరగా వచ్చి, సిగ్గుగా నవ్వుతూ అతన్ని ఆలింగనం చేసుకున్నాడు.

"ఇక నేను వెళ్ళి ఆమెతో చెబుతాను" అని పలికి సైమన్‌సన్ వెళ్ళిపోయాడు.

౧౨

వేరీ పావ్‌లోనా ఒక నిట్టూర్పు విడిచింది. "చూశారా వ్యవహారం? మనిషికి ప్రేమ జాడ్యం తగిలింది. ప్రేమే అది. సందేహం లేదు. సైమన్‌సన్ లాంటి మనిషికి ప్రేమ జాడ్యం తగులుతుందని నే నెన్నడూ అనుకోలేదు. కుర్రకుంకలాగ, చాలా అసహ్యంగా ఎలా తయారైనాడో! చాలా చిత్రం! చాలా విచారకరం!" అన్నదామె.

"మరి మస్లొవా మాటేమిటి? ఈ వ్యవహారంలో ఆమె అభిప్రాయం యెలా ఉంది? నీ కేమైనా తెలుసునా?" నెఖ్లూడొవ్ అడిగాడు.

దానికి సరైన సమాధానం బాగా ఆలోచించి చెబుతానన్నట్టు ఉద్దేశంతో మేరీపావ్లోనా కాసేపు, ఆగి, చికాకు పడుతూ ఇలా చెప్పింది: "మస్లొవా సంగతా? ఆమె గత జీవితం ఎలాంటిదైనా, ఇప్పుడు మాత్రం చాలా నీతి మంతురాలుగా ఉంది. ఆమె మిమ్మల్ని ప్రేమిస్తోంది తన మూలంగా మీరు బాధపడటం ఆమె కిష్టంలేదు. మిమ్మల్ని వివాహం చేసుకోటం ఆమెను పూర్వంకన్నా ఎక్కువ అధఃపతితను చేసినట్టవుతుంది. అందుచేత మీతో వివాహానికి ఆమె అంగీకరించదు. కాని మిమ్మల్ని చూసినప్పుడల్లా ఆమెకు కలవరపాటు కలుగుతూ వుంటుంది."

"ఇక నే నేం చేయను, మాయమైపోనా?"

మేరీ పావ్లోనా ఒక పసిపిల్లలాగ నవ్వింది. "ఔను, సగం మాయమైపోండి."

"సగం మాయమవటం ఎలా సాధ్యం?"

"నే నేమిటో అర్థం కాకుండా మాటాడుతున్నాను. సైమన్సన్ ప్రేమను మస్లొవా చిలిపితనంగా భావిస్తున్నది. అతడు తనకు కలిగిన ప్రేమావేశంలో ఒక విధమైన ఆనందాన్ని అనుభవిస్తున్నా భయగ్రస్తుడౌతున్నాడు. ఇంకా అతడామెతో వెళ్ళి తన ప్రేమ చెప్పుకోలేదు. నా వంటి వ్యక్తి యిటువంటి ప్రేమ విషయాల్లో ఒక అభిప్రాయాన్ని వెల్లడించబోవటం సాహసమే. అయినా చెబుతున్నాను. సైమన్సన్ ప్రేమ ఒక సాధారణ పురుషునికి స్త్రీపై కలిగేటటువంటి వ్యామోహమే. కాని అది ఒక ఆదర్శం అనే ముసుగును తగిలించుకుంది. తన ప్రేమ ఆదర్శప్రాయమైనదనీ, అది తనకు ఉత్సాహాన్ని ప్రసాదిస్తుందనీ...అతనంటాడు. కాని యీ ఆదర్శం అడుగున మామూలు కళంకం ఉండనే వుంది—నొవొడ్వొరొవ్-గ్రాబెట్స్ల ప్రేమలో వున్న కళంకం లాంటిదే."

మేరీపావ్లోనా అసలు విషయాన్ని దాటి చాలా దూరం వెళ్ళి మాటాడుతోంది.

"మరి నే నేం చెయ్యను" నెఖ్లూడొవ్ ప్రశ్న.

“ఏరా రాశాను గా అంతా చెప్పేస్యాండి. మనసులో గుద్దులాట ఎందుకు? అనుమానాలు పరిహరించుకోవటం మంచిది. ఆమెతోనే ముఖాముఖి మాటాడేసెయ్యండి. వెళ్ళి పిలుచుకురానా?”

“సరే” నన్నాడు నెఖ్లూడో. మస్లోవాను పిలుచుకురావటానికి మేరీ పావ్‌లోనా వెళ్ళింది.

నెఖ్లూడో ఒక్కడే ఉన్నాడు గదిలో. దుఖోవా గుర్రుపెట్టి నిద్ర పోతోంది. అతనికి ఒక విచిత్రమైన భావావేశం కలిగింది. తాను మస్లోవా పట్ల నిర్వర్తించవలసిన విధి ఒకటి ఉన్నదనీ, దాన్ని తాను నిరాటంకంగా నిర్వర్తించాలనీ అతనికి తెలుసు. కాని అది చాలా బాధలతో కూడుకున్న వ్యవహారమనీ, కొంతవరకు దుఃఖభూయిష్టమైనదనీ అప్పుడప్పుడు తనకు స్ఫురిస్తూనే ఉంటుంది. ఇప్పుడు తన్నీ బాధ్యతలనుంచి తప్పించటానికి సైమన్‌సన్ దొరికాడు. సైమన్‌సన్ చాలా మంచివాడు. అతనికీ మస్లోవాకూ ఏ విధమైన పూర్వ సంబంధం లేదు. అతనికి ఆమెవల్ల కావలసిందీ ఏమీ లేదు. అయినా అతడు తన జీవితాన్ని ఆమె జీవితంతో ముడిపెట్టుకోవాలని చూస్తున్నాడు. అతడు తలపెట్టిన త్యాగం మహత్తరమైనదే. అతని త్యాగం ముందు నెఖ్లూడో త్యాగం ఎంత? నిజంగా తన త్యాగం తాననుకున్నంత ఉత్కృష్టమైనది కాదేమో ననిపించింది నెఖ్లూడోకు. అదిగాక తనకు సైమన్‌సన్‌పై ఈర్ష్య కూడా కలిగిందేమో! చాలా కాలంనుంచీ తాను మస్లోవాను ప్రేమిస్తున్నాడు. కాగా ఆమె తన్ను తప్ప మరింకెవరినో ప్రేమించగలదన్న భావాన్ని అంగీకరించలేక పోతున్నాడు.

ఆమె శిక్ష పూర్తి అయేవరకూ ఆమెకు సమీపంలోనే ఉంటూ కాలక్షేపం చెయ్యాలని నెఖ్లూడో నిర్ణయించుకున్నాడు. కాని ఆమె సైమన్‌సన్‌ను వివాహం చేసుకునేట్టయితే తానామెను యింకా అనుసరించి ఉండవలసిన అవసరం లేదు. తన కార్యక్రమాన్ని మార్చుకోవాలి.

ఇలా తన భావాల్ని తాను పరామర్శించుకుంటూ ఉన్నాడు నెఖ్లూడో. అవతల క్రిమినల్ ఖయిదీలు వున్న గదుల్లోనుంచి, శ్రవణ కటువులైన శబ్దాలు వినిపించాయి. ఇంతలో తలుపు తెరుచుకొని మస్లోవా లోనికి వచ్చింది. తొట్రుపాటుగా అడుగులు వేసుకుంటూ నెఖ్లూడోను సమీపించింది.

"మేరీ పావ్‌లోవ్నాతో నాకు కబురు చేశారెందుకు ?"

"ఔను. నీతో మాటాడాలి. కూచో. ఇంతకు ముందే సైమన్‌సన్ నాతో మాటాడి వెళ్ళాడు.

మస్లోవా చేతులు ఒడిలో పెట్టుకుని కూచుంది...ప్రశాంతంగానే. కాని సైమన్‌సన్ పేరు వినగానే ఆమె కపోలాలు రాగరంజితాలైనాయి.

"వారు ఏమన్నా రేమిటి ?" మస్లోవా అడిగింది.

"నిన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు."

ఆమె కేదో బాధ కలిగినట్టయింది. తల వంచుకుని క్రిందికి చూస్తూ కూచుంది.

"నా అంగీకారం, సలహా అడిగాడు. అన్తా నీకు సంబంధించిన విషయం అని చెప్పాను. నువ్వే నిర్ణయించుకోవాలి"

"ఏమిటీ గందరగోళం ? ఎందుకొచ్చిం దిదంతా ?" అంటూ మస్లోవా అతనికేసి చూసింది. ఆమె మెల్లకంటి చూపు అతని హృదయంలో గుచ్చుకు పోయింది. ఒకరి నొకరు చూసుకుంటూ కాసేపు మౌనంగా కూర్చున్నారిద్దరూ. ఆ చూపులే భాషను మించి అనేక భావాల్ని వ్యక్తీకరించాయి.

"నువ్వు ఒక నిర్ణయానికి రావాలి" అన్నాడు నెఖ్లూడో మళ్ళీ.

"నేను నిర్ణయించుకునేది ఏముంది ? చాలా కాలం క్రితమే నిర్ణయమైపోయింది."

"సైమన్‌సన్‌ను వివాహం చేసుకోటానికి నువ్వు ఒప్పుకుంటావో లేదో నిర్ణయించుకుని చెప్పు"

"నేను ఖయిదీని. గృహిణి ననిపించుకునే యోగ్యత నా కెక్కడుంది ? సైమన్‌సన్‌ను కూడా నేనెందుకు చెడగొట్టాలి ?" అన్నదామె కోపంగా చూస్తూ.

"ఒకవేళ నువ్వు నిర్దోషివని రుజువై, యీ శిక్ష రద్దైతే అప్పుడు నువ్వేమంటావు ?"

"అబ్బ! ఎన్నిసార్లు అడుగుతారు. నాకింకేం చెప్పాలనీ లేదు" అంటూ ఆమె వెళ్ళిపోడానికి లేచింది.

## ౧౮

వ్యస్లావా వెనకాలే నెస్లాడో మళ్ళీ రాజకీయ ఖైదీ లందరూ సమావేశమై ఉన్న చోటికి వచ్చాడు. నటటో ఆ చుట్టుప్రక్కల తిరిగి ఒక వార్త పట్టుకొచ్చాడు. అది విని అందరూ నిర్ఘాంతపోయారు. క్రిమినల్ ఖైదీలు ఉన్న ఆవరణలో ఒక గోడమీద కొన్ని వాక్యాలు రాసి ఉన్నాయిట. ఆ వాక్యాలు ప్లెట్నేన్ అనే ఒక విప్లవ నాయకుడు రాసినవట. కొంత కాలం క్రితం ప్లెట్నేన్‌ను ప్రభుత్వం ఖయిదు చేసి, విచారణ జరిపి 'కారా' అనే ప్రదేశానికి నిర్బంధ బానిసగా పని చేయటానికి పంపించారు. అతడీ సరికి 'కారా' చేరియుంటాడనే అందరూ అనుకున్నారు. కాని అతడు ఇటీవలనే ఈ దారిన వెళ్ళియున్నట్టు యిప్పుడు విశదమైంది, ఈ గోడమీది రాతలనుబట్టి. క్రిమినల్ ఖయిదీలతోపాటు కొనిపోబడిన రాజకీయ ఖయిదీ అతనొక్కడే. గోడమీది వాక్యాలు యివి:

"ఆగస్టు 17వ తేదీని నన్ను క్రిమినల్ నేరస్థులతోపాటు పట్టుకుపోతున్నారు. నెవెరో కూడా నాతోనే వున్నాడు. కాని అతను కాజాన్‌లో వచ్చి ఆసుపత్రిలో ఉరి తీసుకుని చచ్చిపోయాడు. నేను ఆరోగ్యంగానే, ఉత్సాహంగానే ఉన్నాను. మంచి రోజుల కోసం ఎదురు చూస్తున్నాను."

ప్లెట్నేన్ స్థితిగతుల్ని గురించీ, నెవెరో ఆత్మహత్య చేసుకోటానికి కారణాల్ని గురించీ...ఏవేవో ఊహాల్లో ఊహలు అల్లుతూ అందరూ గలభాగా చెప్పుకుంటున్నారు. ఒక్క క్రిట్సో మాత్రం ఒక మూల మౌనంగా, శూన్యంలోకి తదేకంగా చూస్తూ కూచున్నాడు.

"నెవెరోకు ఒకసారి దేవతలు కనిపించారట. మా నాన్నగారు చెబుతూ ఉండేవారు" అన్నది రాంటే సేవా.

"ఔనౌను. అతడు స్వప్న ప్రపంచములో విహరిస్తూ ఉండే ఒక కవి. అలాంటివాళ్ళను ఒంటరిగా జైళ్ళో నిర్బంధిస్తే తట్టుకోలేరు"... ఒకసారి నన్ను ఒక్కడినే జైళ్ళో నిర్బంధించారు. అప్పుడు నేను వట్టి భావనా ప్రపంచంలో విహరించి పాడైపోలేదు. ఒక రకమైన వ్యాయామం చేసుకొని అంతా ఓపిగ్గా భరించి బైట పడ్డాను" — అన్నాడు నోవాడ్గో.

"వద్దు, మీరు సిగరెట్ కాల్చొద్దు. మీ ఆరోగ్యం మరీ పాడవుతుంది." అన్నది మేరీపావ్‌లోనా.

"నాకు అడ్డంరాకు" అని కోపంగా పక్కకి క్రిల్ట్సో సిగరెట్ వెలిగించి ఒకదమ్ము పీల్చాడో లేదో దగ్గుతెర తీవ్రంగా వచ్చింది. అది కాస్త తగ్గినతర్వాత మళ్ళీ ఇలాఅన్నాడు. "మనం ఊరకే చర్చలకు దిగుతాం. అది కాదు, మనం చేయవలసినపని. మనంఅంతాకలిసి, ఐకమత్యంగాపనిచెయ్యాలి. మన శత్రువులు నాశనం కావాలి"

"ఆ శత్రువు లనబడేవాళ్ళు కూడా మానవులేకదా?" అన్నాడు నెఖ్లూడో.

"ఊహూ-కాదు. వాళ్ళు మానవులు కారు. వాళ్ళు ఇప్పుడు చేస్తోన్న అకార్యాలు గమనిస్తే మనుష్యులని అనుకోటానికి వీల్లేదు. కొత్తరకం బాంబులు, విమానాలు కూడా కనిపెట్టారుట. ఏముందీ? విమానాల్లో పైకి వెళ్ళి బాంబులు వేస్తారు. వీళ్ళంతా నల్లుల్లా మాడిపోవలసిందే...నిరవశేషంగా. ఊరి ... అంతే..." క్రిల్ట్సో ఇంకా ఏమో చెప్పబోయాడు. కాని ముఖం ఎర్రబడిపోయింది. దగ్గు విపరీతంగా వచ్చింది. నెత్తురు కక్కాడు. నబటో మంచుగడ్డ పట్టుకురావటానికి పరుగెత్తాడు. మేరీపావ్‌లోనా మందు తెచ్చి అతని నోటికి అందించబోయింది. క్రిల్ట్సో రొప్పుతూ, రొజుతూ ఆ మందు అవతలకి తోసివేశాడు. కళ్ళు మూసుకున్నాడు. ఇంతలో నబటో చిన్నిపెళ్ళ మంచుగడ్డ తీసుకొచ్చాడు. వాటివల్ల కొంచెం గుణం కనిపించింది. దగ్గుతెర ఆగింది. క్రిల్ట్సోను ఒక మంచంమీద పక్కవేసి పడుకోబెట్టారు. నెఖ్లూడో కాసేపు ఉండి అందర్నీ వీడ్కొని అచ్చోటువీడి వెళ్ళిపోయాడు

క్రిమినల్ ఖైదీలంతా నిశ్శబ్దంగా నిద్రపోతున్నారు. కొందరు మంచాలమీద, కొందరు మంచాలక్రింద పడివున్నారు. అందరూ గదుల్లో పట్టనంగా! కాబట్టి చాలమంది వరండాలోనూ, ఖాళీ స్థలంలోనూ సంచులు తలకింద పెట్టుకుని, తడిచుప్పట్లే కప్పుకొని పడుకున్నారు. జైలు దుస్తులు ధరించి వాళ్ళంతా కుప్పలు కుప్పలుగా పడివున్నారు. బ్రహ్మచారుల గదిలో మాత్రం కొద్దిమంది దీపంముందు కూచుని మాటాడుకుంటున్నారు. ఒక ముసలివాడు ఆ దీపపు వెలుగులో తన దుస్తులమీద కమ్మివున్న పురుగుల్ని ఏరి పారేసుకుంటున్నాడు. రాజకీయ ఖైదీలున్న గదుల్లోనే అసహ్యంగా ఉంది. అంత

కన్నా అసహ్యంగా ఉంది ఈ క్రిమినల్ ఖైదీల గదుల్లో. ఎక్కడ చూసినా అక్కడ ఖైదీలు గుంపులుగా పడివున్నందున అతి జాగ్రత్తగా దారి చేసుకొని నెఖ్లూడోవ్ నడుస్తున్నాడు. అడుగుతీసి అడుగు పెట్టటం కష్టంగా ఉంది. ఎక్కడా చోటులేక ముగ్గురు నలుగురు కారుతున్న నీటితొట్టిదగ్గర పడుకున్నారు. వారిలో ఒకడు ముసలివాడు; అతన్ని నెఖ్లూడోవ్ చాలాసార్లు చూశాడు. ఇంకొకడు పన్నెండేళ్ళ కుర్రవాడు; ఇతడు మిగతా ఇద్దరిమధ్య, ఒకనికాళ్ళ మీద తల పెట్టుకొని పడుకున్నాడు.

గేటుదాటి వచ్చాక నెఖ్లూడోవ్ ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు.

## ౧౯

పొగమంచు తగ్గింది. నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. దారివెంట చాల చోట్ల బురద గట్టిపడింది. నెఖ్లూడోవ్ తిరిగి సత్రానికి చేరుకొని తలుపు తట్టాడు. విశాలోరస్కుడైన ఆ నౌకరువచ్చి తలుపు తీశాడు. నెఖ్లూడోవ్ లోపల ప్రవేశించాడు. వెనకాల దొడ్డితలుపు దగ్గర పడుకొని కొందరు నౌకర్లు కామాలు గురకపెట్టి నిద్రపోతున్నారు. అటుపక్కనున్న శాలలో గుర్రాలు గడ్డి మేస్తున్న చప్పుడు వినిపిస్తోంది. ముందుగదిలో ఒక లాంతరు వెలుగుతోంది. గదిలో అడ్డంగట్టిన తెరవెనుకనించి ఒక నిద్రపోతోన్న వ్యక్తి గురక వినిపిస్తోంది. నెఖ్లూడోవ్ తనదిండొకటి వేసుకుని సోఫాలో పడుకున్నాడు. దుప్పటి కప్పుకున్నాడు. నాటి వ్యవహారమంతా స్మృతిపథంలో తిరిగింది. నీరు కారి పోతోన్న నీటితొట్టి దగ్గర పడుకున్న ఆ కుర్రవాని స్థితి పాపం ఎంత ఘోరంగా ఉంది!

తనకు ఆనాడు సైమన్‌సన్‌తోనూ, మస్లావాతోను సంభాషణ అలా సాగటం చిత్రంగానే ఉంది. పరిస్థితి అలా వస్తుందని తానెన్నడూ అనుకో లేదు. కాని ఆ విషయానికి సంబంధించిన ఆలోచనలు తన మనసులోకి రానీయటం లేదు నెఖ్లూడోవ్. ఈ వ్యవహారంలో తన పాత్ర ఎంతవరకు ఎలా ఉండాలో తనకే అగమ్యగోచరంగా ఉంది. అందుచేత ఆ సంగతి గురించి ఆలోచించటం మానేశాడు. కాని ఆ క్రిమినల్ ఖైదీల దుస్థితి... దుర్వాసన కొడుతూన్న ఆ చెమ్మనేలమీద అలా పడుకున్న అభాగ్యుల అవస్థలు...

ముఖ్యంగా ఆ పన్నెండేళ్ళ కుర్రవాని నిద్రాముద్రితమైన ముఖం...అతని మనస్సులో పదేపదే ఆవర్తితము లౌతున్నాయి.

తాను మూడు నెలలనించీ చూస్తున్నాడు; ఈ అభాగ్యులు నానా బాధలు, అవమానాలు, అత్యాచారాలు తలవంచుకుని సహిస్తున్నారు. వీళ్ళను ఇంత అమానుషంగా ఏడిపిస్తోన్న అధికార్ల ప్రవర్తన తాను చూస్తూనే ఉన్నాడు. ఎవరికీ కనిపించని ఈ ఘోరమంతా తనకే కనిపిస్తోందంటే-తన కేమన్నా మతిపోయిందా? ఈ ఘోరాలన్నీ చేస్తున్న వాళ్ళకే పిచ్చెత్తిందా? ఈ ఘోరాలన్నీ తప్పకుండా చెయ్యాల్సిందేనని-ప్రయోజనం కోసమే చేస్తున్నామనీ-వాళ్ళు విశ్వసించి మరీ చేస్తున్నారే. మరి వాళ్ళకు పిచ్చెత్తిందని ఎలా అంటాం? తానూ నిజానికి పిచ్చివాణ్ణేం కాడే! మరేమిటీ వ్యవహారమంతా?

ఈ ఖైదీలలో చాలామంది ఆవేశపరులు, ముక్కోపులు, గలకంతులు, ప్రజ్ఞాశాలులు ఉన్నారు. కాని వీరందరూ ఎక్కువ జాగ్రత గలవారు. జిత్తులు తెలిసినవారూ కారు. వీళ్ళకంటే సంఘానికి ఎక్కువహాని చేస్తున్నటువంటివాళ్ళు ఇంకా చాలామంది స్వేచ్ఛగా, హాయిగా ఉంటూనే ఉన్నారు. కాని వీళ్ళనే ప్రభుత్వం చేజిక్కించుకొని, నేరాలు ఆరోపించి, విచారణ జరిపి, జైళ్ళలో నిర్బంధించి చివరకు సైబీరియాకు పంపించేస్తోంది. అక్కడ వీళ్ళకింత కూడేస్తారు. సంవత్సరాల తరబడీ అక్కడే అట్టిపెడతారు. ప్రయోజనకరమైన పనిపాటులులేక, కుటుంబాలకు దూరమై వీళ్ళక్కడ అసహజమైన జీవితాలు గడుపుతూ కాలక్షేపం చేస్తూ ఉండాలి.

ఇక రెండో విషయం: వీళ్ళంతా అనేక రకాల అవమానాలకు గురి ఔతున్నారు. అధికార్లు వీళ్ళపట్ల చాల అమర్యాదగా ప్రవర్తిస్తూ ఉంటారు. సంకెళ్ళు తగిలిస్తారు. తలలు గొరిగిస్తారు. చూస్తే అసహ్యంపుట్టే దుస్తులు తొడిగిస్తారు. ఇందువల్ల క్రమశః వీళ్ళకు ఇతర్లు తమనుచూచి ఏమనుకుంటారో అన్న భిడియంగాని సిగ్గుగాని అంతరించిపోతున్నది. ఇతర్ల దృష్టిలో మర్యాదగా ఉండాలన్న భావంగాని, ఆత్మగౌరవంగాని నశించిపోతున్నాయి.

మూడో విషయం: వీళ్ళకు సరైన తిండి ఉండదు. అధికార్ల చేతుల్లో దెబ్బలుతింటూ ఉంటారు. సరైన గాలిరాని ఇరుకు ప్రదేశాల్లో నిర్బంధితులై ఉంటారు. అందుచేత తరచు రోగాలకు (ముఖ్యంగా అంటురోగాలకు) ఎర

పోతూ ఉంటాయి. ఇటువంటి నికృష్ట పరిస్థితుల్లో ఎంత నైతిక భావాలుగల ఉత్కృష్టవ్యక్తులుకూడా ఆత్మరక్షణకోసం అతి భయంకర దుష్కృత్యాలకు కూడా దిగుతారు; సందేహాంతేసు ఇక వీళ్ళ మాటేమిటి?

నాలుగో విషయం: వీళ్ళల్లో కొంతమంది వస్తుతః మహాత్ములు ఉండవచ్చు అయినాకాని తామున్న నికృష్ట పరిస్థితులవల్ల కొందరు జారులు, చోరులు, హంతకులుగా మారిపోవచ్చు. అటువంటివాళ్ళ సాహచర్యంవల్ల మంచివాళ్ళగా ఉండే ఇతర్లుకూడా పాడైపోవటానికి చాల అవకాశాలు ఉన్నాయి.

ఐదవ విషయం: వీళ్ళను సంఘ ద్రోహులుగా, దేశద్రోహులుగా భావించి, ప్రభుత్వం అనుసరిస్తూన్న శిక్షావిధానం బహు క్రూరంగా, హింసాత్మకంగా, అమానుషంగా ఉంది. పిల్లల్ని, స్త్రీలను, వృద్ధులను కూడా నానా హింసలు పెడుతున్నారు కర్రలతో, కొరడాలతో కొడుతున్నారు. ఏ ఖయిదీ అయినా పారిపోతే వాడిని మళ్ళీ పట్టి తెచ్చిన వ్యక్తికి బహుమానా లిస్తున్నారు. భార్యాభర్తలను యెడబాపుతున్నారు. ఉచ్ఛలితంగా కామతృప్తి కోసం స్త్రీలు పర పురుషులతోనూ, పురుషులు పర స్త్రీలతోనూ సంబంధాలు సాగిస్తున్నారు. కొందరు ఖయిదీలను ఉరితీస్తున్నారు; మరి కొందర్ని కాల్చి చంపేస్తున్నారు. అన్ని హంగులూ ఉన్న ప్రభుత్వమే యింత అమానుషంగా ప్రవర్తిస్తూ ఉంటే... లేమితో, దుఃఖంతో, కష్టాలతో అలమటిస్తూన్న ఈ అభాగ్యులు అమానుషంగా ప్రవర్తిస్తే తప్పేముంది? అనిపిస్తుంది మా సేవాళ్ళకు.

ప్రభుత్వం అమలుపరుస్తున్న శిక్షాస్మృతి యావత్తూ... ఈ ఖయిదీల లోనే కాదు... దేశంలో వున్న ప్రజలందరిలోనూ... అవినీతి, దుర్మార్గం పెంపొందించటానికే ఉపయోగిస్తున్నది. జైళ్ళలో అధికార్లు చేస్తూన్న అకృత్యాలు చూస్తే... అసంఖ్యాకులైన ప్రజల్ని ఎలా అవినీతి పరులుగా తయారు చేద్దామా? అనే ప్రభుత్వ-ఆశయం కాబోలని తోస్తుంది. ప్రతి సంవత్సరం యిలాగే వేలాది మందిని జైళ్ళలో పెట్టి... జబర్దస్తీగా అవినీతి పాఠాలు నేర్పి... వాళ్ళు బాగా పాడైపోయిన తర్వాత యిళ్ళకు పొమ్మని వొదిలేస్తారు. వీళ్ళ మూలాన దేశంలో యింకా యితర్లు కూడా పాడైపోతారు. జైళ్ళలో తాము నేర్చుకు వచ్చిన అవినీతినే దేశంలో విస్తృతం చేస్తూ ఉంటారు వీళ్ళు.

ట్యామోస్, ఎకేటరిన్‌బర్గ్, టోమస్క్ మొదలైన చోట్ల జైళ్ళలో పరిస్థితులు కళ్ళారా చూచాడు నెక్లూడోవ్. జైళ్ళలో మగ్గుతూ వుంటే ఖయిదీలకు క్రమేణా సంఘస్పృహ నశించిపోతుంది. నీతి, అవినీతి అనే విచక్షణ చచ్చిపోతుంది. లాభదాయకమైతే మనిషి మనిషిని హింసించవచ్చు. యెంత ఘోర కార్యమైనా చేస్తే తప్పులేదు...అనే అభిప్రాయం ఏర్పడుతుంది. సాధారణంగా ప్రతి వ్యక్తికీ సంఘము, మతము నేర్పిన కొన్ని నీతులు తెలిసే వుంటాయి. కాని కొన్నాళ్ళు ఈ జైళ్ళలో అవస్థలు పడిన తరువాత, తమ దగ్గర జరిగే అన్యాయాలన్నీ అనుభవించిన తర్వాత...'నీతి శాస్త్ర వేత్తలు, మత బోధకులు చెప్పే సిద్ధాంతాలన్నీ అసలు జీవితంలో ఎవరూ పాటించటంలేదు. పైకి వాటిని నిర్లక్ష్యంచేసి త్రోసిపారేస్తున్నారు'...అనే అభిప్రాయం కలుగుతుంది. "మనం మాత్రం ఈ నీతుల్ని ఎందుకు పాటించాలి?" అనే నిర్ణయానికి వస్తారు. జైలు జీవితంవల్ల కలిగే ఈ పరిణామం ఫెడోరోవ్, మకార్, టారస్ మొదలైన వ్యక్తులలో నెక్లూడోవ్ చూశాడు. కొందరు ఖయిదీలు ఈ జైళ్ళలోనుంచి తప్పించుకు పారిపోదామని ప్రయత్నాలు చేస్తారు. ఎలాగో తప్పించుకుని అడవుల్లో పారిపోతూ ఉన్నప్పుడు ఆకలికి ఓర్చుకోలేక ఒకరిని ఒకరు చంపుకుని తింటారు. ఇలా నరమాంసం భక్షించిన ఒక ఖయిదీని నెక్లూడోవ్ చూసి వున్నాడు. వాడా అకార్యం చేసినట్టు ఒప్పుకుంటున్నాడు కూడా. ఇటువంటి సన్నివేశాలు ఎప్పుడో సకృత్తు జరగటం కాదు...పరిపాటైపోయాయి. చాలా విచారకరం!

ఈ శిక్షాస్మృతిని అసలు జరుపుతున్నది...నేరస్థులకు భయం కొలిపి వాళ్ళు మళ్ళీ అటువంటి నేరాలు చెయ్యకుండా చూసేందుకూ...వాళ్ళను సత్ప్రవర్తకులుగా మార్చేందుకూ...అని సమర్థింప జూస్తారు. కాని వాస్తవికంగా...ఆశించిన ఆ ఫలితాలు కలగటంలేదు. నేరాలు అంతటితో ఆగిపోవటంలేదు. పైగా విస్తృతం అవుతున్నాయి. వాళ్ళు భయపడటంలేదు. పైగా చేసిన నేరాల్ని మళ్ళీ ధైర్యంగా చేస్తున్నారు. జైళ్ళలోంచి పంపిస్తే తిరిగి ఆ నేరాలే చేసి బుద్ధిపూర్వకంగా జైళ్ళకు వచ్చేస్తున్నారు. వాళ్ళను సత్ప్రవర్తకులుగా బాగు చెయ్యటం జరగటం లేదు. అవినీతి ఇంకా ఎక్కువగా బోధిస్తున్నారు.

కోలేదు. అందుచేత అతన్ని కూడా మాతోనే తీసుకుపోతున్నాం. కాని అతని పరిస్థితి చాల ప్రమాదంగా ఉంది. కాబట్టి...ఈ రాత్రికి ఇంకో ఊరు చేరతాం కదా! ఆ ఊళ్ళోనైనా అతన్ని ఆరోగ్యం కుదిరేవరకు అట్టిపెట్టేందుకూ, నేనూ అతనితో ఉండిపోయేందుకూ మీరు అధికార్ల అనుమతి సంపాదించాలని ప్రార్థిస్తున్నాను. నేను అతనితో ఆగిపోవటానికి అతని భార్యనైవుండాలని అధికార్లు షరతు పెట్టేటట్టయితే నేనతన్ని పెళ్ళాడేందుకు సిద్ధంగానే ఉన్నాను" అని రాసింది.

నెఖ్లూడో సత్రంలోని ఒక నౌకర్ని పిల్చి, బండి సిద్ధం చేయమని చెప్పి, మూట ముల్లె కట్టేసుకుంటున్నాడు. తేనీరు తాగాడు. [illegible] కాసేపటికి మూడుగుర్రాలు కట్టినబండి ఒకటి వచ్చింది. నెఖ్లూడో సత్రం యజమానురాలికి చెల్లించవలసిన డబ్బు ఇచ్చేసి బండిలో ఎక్కి కూచున్నాడు. బండి వానితో వేగంగా తోలమని చెప్పాడు. ఖైదీలు ఈపాటికి చాల దాటిపోయి వుంటారు. వాళ్ళను త్వరగా వెళ్ళి కలుసుకోవాలని నెఖ్లూడో ఉద్దేశం. నెఖ్లూడో ఎక్కినబండి ఊరి పొలిమేర దాటింది. ఆపైనున్న గడ్డిబీడుకూడా దాటింది. రోగగ్రస్తులను, సామానులను ఎక్కించిన బండ్లు కనిపించాయి. అక్కడే ఆఫీసరెవరూ లేరు. బాగా సారా తాగిన సైనికులుమాత్రం ఆ బండ్లకు కాపలాగా నడచి వస్తున్నారు. అటువంటి బండ్లు చాలఉన్నాయి. ఒక్కొక్క బండిలో ఆరుగురు చొప్పున రోగగ్రస్తులయిన ఖయిదీలను కుక్కారు. ఖైదీ కాని ప్రతి బండిలోనూ ఇంకా సామానులుకూడా ఉన్నాయి. చివరనున్న మూడు బండ్లలో, బండికి ముగ్గురు చొప్పున రాజకీయ ఖైదీలు ఉన్నారు. నొవొద్వొరోవ్, గ్రాబెట్స్, మార్కెల్ ఒకబండిలో ఉన్నారు. రెండో బండిలో రాంట్సేవా, నబటోవ్ ఉన్నారు. అందులో మేరీపావ్లోనా కూర్చోవలసింది. కాని ఆమె తన స్థానాన్ని మరెవతెకో ఇచ్చింది. మూడోబండిలో ఇంత ఎండుగడ్డి పరచివుంది. ఆ గడ్డిమీద క్రిల్ట్సోవ్ పడుకున్నాడు. కాసన కూచుంది మేరీపావ్లోనా.

నెఖ్లూడో తన బండిలోనుంచి దిగి క్రిల్ట్సోవ్ దగ్గరకు నడచి వెళ్ళాడు. తాగివున్న ఒక సైనికుడు 'వెళ్ళకు' అన్నట్టుగా చెయ్యి ఊపాడు. కాని నెఖ్లూడో అతన్ని లక్ష్యం చెయ్యలేదు. క్రిల్ట్సోవ్ చాల నిస్సత్తువగా పడుకుని ఉన్నాడు. ముఖమంతా పాలిపోయి ఉంది. గొర్రెతోలుతో కుట్టిన చొక్కా

తోడుక్కున్నాడు. తలపై టోపీ ఉంది. నోటికి ఒక చేతిరుమాలు అడ్డంగా కట్టాడు. అతని అందమైనకళ్ళు మామూలుకన్న పెద్దవిగా, ప్రకాశవంతంగా కనిపిస్తున్నాయి. బండి కుదుపులకు అతనివొళ్ళు సతమతమౌతోంది. బండి వెనుకనే వస్తోన్న నెఖ్లూదోవ్ కేసి చూస్తూ పడుకున్నాడు. "వంట్లో ఎలా ఉంది?" నెఖ్లూదోవ్ అడిగాడు. క్రిల్ట్సోవ్ కళ్ళు మూసుకుని కోపసూచకంగా తల ఊపాడు. బండి కుదుపుల్ని తట్టుకునేందుకే వినియోగ పడుతున్నది, అతని శక్తిఅంతా. మేరీపావ్లోవ్నా కూడా నెఖ్లూదోవ్ రావటం చూసింది. ఆమె చూపుల్లో క్రిల్ట్సోవ్ పరిస్థితిని గురించిన ఆందోళన కనిపిస్తోంది. మరుక్షణం ఆమె మామూలు ధోరణిలో ప్రసంగం ఆరంభించింది.

"చివరకు ఆఫీసరుకే సిగ్గొచ్చినట్టుంది. బుజోవ్‌కినుకు తగిలించిన సంకెళ్లు తీయించాడు. అతనిప్పుడు తన కూతుర్ని ఎత్తుకుని నడుస్తున్నాడు. మస్లోవా, సైమన్‌సన్, దుఖోవా కూడా అతనితోపాటు నడచి వెళుతున్నారు–" అన్నదామె.

క్రిల్ట్సోవ్ ఏమో చెప్పాడు. కాని బండ్లో చప్పుడు మూలాన వినిపించలేదు. మరికాసేపటికి వస్తోన్న దగ్గుతెర అపుకుంటూ ముఖం అదోరకంగా పెట్టాడు. అతనిమాటలు విందామని బండిలోకి వంగాడు నెఖ్లూదోవ్. మూతికి కట్టిన చేతిరుమాలు తీసేసి క్రిల్ట్సోవ్ "నా కిప్పుడు కొంచెం నయంగానే ఉంది. జలుబు చాలభాగం తగ్గింది" అన్నాడు. నెఖ్లూదోవ్ తల ఊపాడు.

"త్రిమూర్తుల సమస్య ఏమైంది? తేల్చగా పరిష్కారమయ్యే సమస్య కాదనుకుంటాను" అన్నాడు క్రిల్ట్సోవ్ ప్రయత్నపూర్వకంగా మందహాసం చేస్తూ.

నెఖ్లూదోవ్‌కు అర్థం కాలేదు. మేరీపావ్లోవ్నా విశదంగా చెప్పింది. త్రిమూర్తులంటే నెఖ్లూదోవ్, సైమన్‌సన్, మస్లోవా. తాను పరిహాసకంగా పలికిన క్లిష్టభావనకు మేరీపావ్లోవ్నా చెప్పిన వ్యాఖ్యానం సరైనదే నన్నట్టు క్రిల్ట్సోవ్ తల ఊపాడు.

"పరిష్కారం కావటమో కాకపోవటమో [illegible]" అన్నాడు నెఖ్లూదోవ్.

"ఏమోయ్ నేను పంపిన చీటీ అందిందా? అందులో నేను కోరినట్లు ఏర్పాటు చేస్తారా?" మేరీపావ్లోవ్నా నెహ్లూదోవు నడిగింది.

"తప్పకుండా"

క్రిల్త్సోవ్ విచారంగా చూచాడు. నెహ్లూదోవ్ తిరిగివచ్చి తన బండిలో కూచున్నాడు. రాస్తా చాల ఎగుడు దిగుడుగా ఉంది. కుదుపులతో బండి సాగిపోతోంది. గొర్రెతోలు చొక్కాలు తొడుక్కుని, సంకెళ్ళతో అవస్థ పడుతూ నడచిపోతున్నారు ఖైదీలు. రోడ్డుమీద ముచ్చావుత్తైలు వరసగా వాళ్ళే ఉన్నారు. నెహ్లూదోవ్ ఎక్కినబండి వాళ్ళందర్నీ దాటివచ్చేసింది. అల్లంత దూరాన రోడ్డుకు పక్కగా నలుపుముప్పటి పైన వేసుకున్న పస్తోవా, నల్ల కోటు ధరించిన సుఖోవా కనిపించారు. సైమన్‌సన్ వాళ్ళతోపాటు నడుస్తున్నాడు. అతను తెల్లని స్టాకింగ్స్ తొడుక్కొన్నాడు. ఒకటోపీ ఉంది తలమీద. ముగ్గురూ ఏ విషయమో తీవ్రంగా చర్చించుకుంటున్నారల్లే ఉంది.

నెహ్లూదోవ్ వాళ్ళను సమీపించాడు. ముగ్గురూ అతన్ని చూడగానే నమస్కారం చేశారు. నెహ్లూదోవ్ బండి ఆపలేదు. వాళ్ళతో ప్రత్యేకమైన మాటాడాల్సిం దేమీలేదు. ముందుకు సాగిపోయింది బండి. ఆ తరవాత రాస్తా ఎగుడు దిగుడుగా లేకుండా బాగానే ఉంది. బండివాడు బండిని వేగంగా తోలుతున్నాడు, కాని రోడ్డుమీద ఖైదీలనూ, బండ్లనూ మాటిమాటికీ తప్పుకుని పోవలసే వస్తోంది.

అది ఒకచిట్టడవి. రకరకాలచెట్లు ఉన్నాయి. నెహ్లూదోవ్ బండి ఖైదీలందరినీ దాటిపోయింది. అప్పటికి అడవికూడా దాటిపోయినట్టే. ఇక రోడ్డుకు ఇరుప్రక్కలా పొలాలు ఉన్నాయి. దూరాన ఒక చర్చి కనిపించింది. ఆకాశం నిర్మలంగా ఉంది. మేఘాలన్నీ పోయాయి. చలిగాలి తగ్గింది. చర్చి శిఖరం, గోడలమీదపెట్టిన సిలువలు సూర్యకాంతిలో ప్రకాశిస్తున్నాయి కుడిచేతివైపు దూరానవున్న కొండలు తెల్లగా మెరుస్తున్నాయి. నెహ్లూదోవ్ బండి ఊళ్ళోకి వచ్చేసింది. అదొక పల్లెటూరు. వీధుల్లో రష్యన్ ప్రజలు, ఇంకా ఇతరజాతుల వారు చాలమంది రకరకాల టోపీలు ధరించి కనిపించారు. స్త్రీలు, పురుషులు...కొందరు తాగివున్నారు, కొందరు బాగానే ఉన్నారు...అక్కడక్కడ గుంపులు గుంపులుగాకూడి బాతాఖానీ వేస్తున్నారు.

బండివాడు తన ప్రజ్ఞావిశేషాన్ని ఆ పల్లెటూరి ప్రజలకు ప్రదర్శించాలన్న తలంపుతో కొరడాతో గుర్రాన్ని అదలిస్తూ బండి అతివేగంగా తోలుతున్నాడు. రోడ్డుకు అడ్డంగా నది ఒకటి దాటాలి. ఇవతలి ఒడ్డున చాలబండ్లు నిలిచిఉన్నాయి. అవన్నీ పడవమీద అవతలి ఒడ్డుకు దాటిపోవాలి. ఇంతలో అవతలి ఒడ్డునుంచి రేవుపడవ ఈవలిగట్టుకు వచ్చింది. పడవ మనిషి పొడుగ్గా బలంగా ఉంటాడు. వెడల్పాయిన ఛాతి. అతను ఆవలి ఒడ్డునుంచి ఎక్కించుకువచ్చిన బండ్లను ఒడ్డుమీదికి దించేశాడు. ఇందాకటినుంచి కాచుకునిఉన్న బండ్లను పడవమీదికి ఎక్కించుకున్నాడు. పడవంతా బండ్లతో, గుర్రాలతో నిండిపోయింది. నదిలోని నీరు చూచేసరికి గుర్రాలు సకిలించటం మొదలుపెట్టాయి. అది చాలవెడల్పయిన నది. ఉరవడిగా ప్రవహిస్తోంది. అలలువచ్చి పడవకు తగిలి తటతట శబ్దిస్తున్నాయి. నెఖ్లూడోవ్ ఎక్కివచ్చిన బండి, గుర్రాలు కూడా పడవమీదికి చేరాయి. ఇంకా చాలమంది తమ బండ్లనుకూడా ఎక్కించుకోవలసిందంటూ మొరపెడుతూ చాలమంది ఉన్నారు. పడవ మనిషి వాళ్ళ మొరలు ఆలకించలేదు. ఇక ఖాళీ లేదని నిక్కచ్చిగా చెప్పేసి ఆవలిగట్టుకు ప్రయాణం సాగించాడు.

— ౩౧ —

పడవ అంచుమీద ఒకవైపున నిల్చుని నెఖ్లూడోవ్ నదివైపు చూస్తూ ఉన్నాడు. ఇద్దరు వ్యక్తులు అస్తమానం అతని మనఃపథంలో చొచ్చుకొని వస్తున్నారు. ఒకరు కోపంతో తల ఊపుతూ చావుకు సిద్ధమైఉన్న క్రిల్ట్సోవ్. మరొకరు: సైమన్సన్ ప్రక్కనే చురుగ్గా అడుగులువేస్తూ నడచివస్తోన్న మస్లోవా. క్రిల్ట్సోవ్ చాల చిన్నవాడు. అప్పుడే చచ్చిపోవలసిన వాడు కాడు. అతన్ని తలచుకుంటే నెఖ్లూడోవ్‌కు చాల విచారం కలుగుతోంది. మస్లోవా మంచి వయస్సులోఉన్న ఉల్లాసవతి. గతజీవిత కల్మషం కడిగివేసుకుని సత్పథం పట్టింది. సైమన్సన్ వంటి ఉత్తముని ప్రేమ సంపాదించగలిగింది. నిజానికి ఆమెను తలచుకుంటే నెఖ్లూడోవ్‌కు ఆనందం కలగవలసిందే. కాని ఇప్పుడతన్ని ఏదో ఒక విచిత్రమైన భావం ఆవేశించేది. దాన్ని తొలగించుకోలేక పోతున్నాడు.

అక్కడికి చేరువనే ఒకపట్నం ఉంది అక్కడినించి కంచుగంటలేవో వినిపించాయి. అవి చర్చిగంటలు కామాలు. గంటలమోత వినిపించగానే

నెక్లాడో బండివానికి, ఇంకా పడవమీద ఉన్న మనుష్యులందరూ తలలమీది టోపీలు తీసి ప్రార్థన చెప్పుకుంటున్నారు. ఒక పొట్టి ముసలిమనిషి మాత్రం ప్రార్థన చెయ్యలేదు. అతి దెబ్బలో కొత్తవ్యక్తి. అతన్ని నెక్లాడో ఇంతవర కెన్నడూ చూచియుండలేదు. ఒక మాసిక కుట్టిన కోటు, లాగు తొడుక్కున్నాడు. తలమీద ఊలుటోపీ పాతదే; చెప్పులుకూడా పాతవే. బాగా అరిగి పోయాయి.

"ఏం, ముసలయ్యా! నువ్వు ప్రార్థన చెయ్యవేం?" నెక్లాడో బండిమనిషి అడిగాడు తన ప్రార్థన ముగించి తరవాత.

"ఎవరిని ప్రార్థించాలి నేనిప్పుడు?" తీక్ష్ణకంఠస్వరాన జవాబు.

"ఎవరినా? భగవంతుణ్ని."

"ఎక్కడున్నాడో చూపించు భగవంతుడు!"

అతని కంఠస్వరం తీక్ష్ణంగా ఉంది. కొన్ని స్థిరమైన ఊహాలుగల మనిషిగా కనిపించాడు. అతని జవాబుకు బండివాడు చిన్నబుచ్చుకున్నాడు. కాని అతనిముందు తాను చిన్నబోయినట్లు ఇతర్లకు కనిపించటం ఇష్టంలేక... తాను మళ్ళీ సరైన జవాబు చెప్పకపోతే ఓటమిని అంగీకరించినట్లు అవుతుం దన్న భావంతో... వెంటనే

"ఎక్కడున్నాడంటావా? స్వర్గంలో ఉన్నాడు" అన్నాడు.

"స్వర్గానికి నువ్వు ఎప్పుడైనా వెళ్ళి ఆయన్ను చూసి వచ్చావా?"

"నేను వెళ్ళితే యేం? వెళ్ళకపోతేనేం? భగవంతుని ప్రతివాడూ ప్రార్థన చెయ్యాల్సిందే"

"భగవంతుని ఎవ్వరూ యింతవరకు చూసినవాడు లేడు. (ఏసుక్రీస్తు) వచ్చి భగవంతుడనేవాడొకడున్నాడంటూ బోధించాడు. అంతే" ముస లయ్య కోపంగా చూస్తూ పలికాడు.

"అయితే నువ్వు క్రీస్తు మతస్థుడివి కామాలు. ఏదో బొక్క వెతుక్కుని ప్రార్థించు" అన్నాడు బండివాడు కసితీర—తన కొరడాకర్ర బెల్టులో పెట్టుకుంటూ.

ఆ పక్కనున్న వాడెవడో నవ్వాడు.

"అయితే నీది ఏ మతం తాతయ్యా ?" అడిగాడు ఒక నడివయసులో ఉన్న మనిషి.

"నాకు మతం ఏమీ లేదు. ఎందువల్లనంటే...నాకు ఎవరిమీదా విశ్వాసం లేదు; నాకు నా మీదే విశ్వాసం. అంతే" నిక్కచ్చిగా చెప్పాడు.

నెల్లాడో కూడా ఆ కొత్త వ్యక్తితో సంభాషణను పెంచాడు: "నీమీదే నీకు విశ్వాసం ఎలా కుదరగలదు ? నువ్వు పొరపాటు పడొచ్చుగా ?"

"నేనెప్పుడూ పొరపాటు పడను" ఖండితంగా చెప్పాడా వ్యక్తి.

"మరి ఇన్ని మతాలు ఎలా వచ్చాయంటావ్ ?"

"మానవుడికి ఆత్మవిశ్వాసం వుండదు. ఇతర్ల మాటమీదే విశ్వాసం. అందుచేతే యిన్ని మతాలు వచ్చాయ్. నేనూ చాలాకాలం యితర్లనే నమ్మి వాళ్ళ మాట ప్రకారమే నడుస్తూ వచ్చాను. అందుమూలాన నా గతి ఏమైంది? అధఃపతనం అయింది. ప్రతివాడూ తన మతాన్నే పొగడుకుంటూ కూపస్థ మండూకంలా ఉంటున్నాడు. ఎన్ని మతాలన్నా ఉండవచ్చు. కాని నీలో, నాలో, అతనిలో...అందరిలో ఉండే ఆత్మ ఒక్కటే. కాబట్టి ఎవడికి వాడు తన ఆత్మలో విశ్వాసం కలవాడై వుంటే మనందరం ఏకమౌతాం. ఎవడికి వాడు 'తాను' 'తాను'లాగే వుంటే మన అందరి ఏకత్వం గుర్తించ గల్గుతాం."

ఈ మాటలు ముసలివాడు బిగ్గరగా...అందరూ తన భావాల్ని తెలుసుకోవాలన్న ఉద్దేశంతో మాటి మాటికీ చుట్టూ తిరిగి చూస్తూ...పలికాడు.

"నువ్వు చాలా కాలంనుంచీ ఈ ఉద్దేశంతోనే వున్నావా ?"

"నేనా ? ఇరవై మూడేళ్ళనుంచీ నా ఉద్దేశం అదే. ఇవాళ నన్ను హింసిస్తున్నారు."

"హింసిస్తున్నారా ? ఏ విధంగా ?"

"ఏసుక్రీస్తును హింసించినట్టే. నన్ను పట్టుకున్నారు, కోర్టుల చుట్టూ తిప్పారు. ఒకసారి పిచ్చి ఆసుపత్రిలో పడేశారు. కాని వాళ్ళు నన్ను ఏమీ చేయలేకపోయారు. నేను స్వతంత్రుణ్ణి. "నీ పేరేమిటి ?" అని అడిగారు.

నాకు నే నొక ప్రత్యేకమైన పేరు పెట్టుకుంటానని వాళ్ళ భావం. కాని నే నే[illegible]రు పెట్టుకోలేదు. నేను సర్వం వదిలిపెట్టేశాను. నాకు పేరు లేదు, ఊరు లేదు.

నేను నేనే. నా పేరు "మనిషి" అంతే.

నాకు వయస్సు యెంత? నేను ఏన్నాళ్ళు లెక్కపెట్టుకోను. లెక్కపెట్ట లేను కూడా. నేను పూర్వం ఉన్నాను, ఇకముందూ ఉంటాను. నా తల్లి తండ్రులు లెవరు? ఎవరూ లేరు. నా తండ్రి భగవంతుడు, నా తల్లి భూదేవి. "మరి రష్యా చక్రవర్తిని నువ్వు గుర్తించావా?" అని అడుగుతారు నన్ను. "ఔను. ఎందుకు గుర్తించను? ఆయన ఆయనకే చక్రవర్తి. నేను నాకు చక్రవర్తిని" అంటాను. నేను వట్టి పిచ్చివాడినని వాళ్ళు అనుకుంటున్నారు. నాతో మాటాడినందువల్ల ప్రయోజనం లేదని వాళ్ళ భావం. "నాతో మీరు మాటాడ నక్కర్లేదు" అని నే నంటాను. దానితో వాళ్ళకు కోపం వచ్చి నన్ను హింసిస్తారు."

"ఇప్పుడు నువ్వు ఎక్కడికి పోతున్నావ్?"

"భగవంతుడు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికి. పని దొరికితే సరే సరి. లేకపోతే అడుక్కు తింటాను."

పడవ అవతలి ఒడ్డు సమీపించింది. ముసలివాడు విజయసూచకంగా చూశాడు అందరికేసి.

నెఖ్లూడోవ్ జేబులోంచి మనీపర్సు తీసి కొంత డబ్బు ఇవ్వబోయాడు. ముసలివాడు తీసుకోలేదు, "నాకు డబ్బు అక్కర్లేదు - అన్నం కావాలి" అన్నాడు.

"అయితే నన్ను క్షమించు."

"ఇందులో క్షమించే దేముంది? మీరు నేమీ కోపం తెప్పించారని? నాకసలు కోపం తెప్పించలేరు మీరు"

పడవ దిగినుంచి నెఖ్లూడోవ్ గారి బండీని దించారు. బండీవాడు గుర్రాల్ని కట్టాడు. నెఖ్లూడోవ్ పడవ వాడికి డబ్బు ఇచ్చి బండీలో ఎక్కాడు. "ఆ ముసలాడితో అంత సేపు మాటాడారేమిటండీ బాబూ! వాడు వట్టి దిక్కులేని దేశదిమ్మరి అయితేనూ" అన్నాడు బండీవాడు.

## ౨౨

బండి పట్నంలోకి వచ్చేసింది. బండివాడు వెనక్కి తిరిగి "ఏ హోటలుకు తీసికెళ్ళమంటారు?" అని అడిగాడు.

"ఏ హోటలు బాగుంటుంది?"

బండివాడు రెండు మూడు పేర్లు చదివాడు.

"నీ యిష్టం వచ్చిన హోటలుకు తీసుకుపో" అన్నాడు సెల్లాండో.

బండిని ప్రక్క రోడ్డుకు తిప్పి వేగంగా తోలాడు బండివాడు. ఈ పట్నం అన్ని బస్తీల్లాగానే ఉంది. ఇళ్ళు, రోడ్లు, చర్చీలు, దుకాణాలు, పోలీసులూ అన్ని బస్తీల్లోలాగే ఉన్నాయి. కాని యిళ్లు అన్నీ రంగులతో కట్టినవి. రోడ్లు కంకర వేసి లేదు. బండివాడు ఒక హోటలు ముందు బండి ఆపి లోపలికి వెళ్ళి కనుక్కున్నాడు. హోటల్లో ఖాళీ గదులు లేవుట. అందుచేత మరో హోటలుకు తీసుకువెళ్లాడు. సెల్లాండోకు ఆ హోటల్లో చాలా హాయిగా ఉంది. ముఖ్యంగా పరిశుభ్రంగా ఉంది హోటలు. అన్ని సదుపాయాలూ ఉన్నాయి. రెండు నెలలనుంచీ యింత హాయైన ప్రదేశం యెక్కడా దొరకలేదు. ఇన్నాళ్ళనుంచి పల్లెటూళ్ళ సత్రాల్లో బస చేస్తూ వచ్చాడు. ఎక్కడా యింత హాయి కనిపించలేదు.

హోటల్లో దిగటంతోనే మొట్టమొదట శుభ్రంగా స్నానం చేశాడు. సెల్లాండో పట్నవాసానికి తగిన నూతన దుస్తులు ధరించాడు. ఆ తరువాత ఆ జిల్లా గవర్నరును చూడ్డానికి బయలు దేరాడు. హోటలు యజమాని ఒక జట్కా యిచ్చాడు. ఆ జట్కా లో యెక్కి ఒక పెద్ద సుందర భవనముందు దిగాడు. అక్కడ ఒక పోలీసు, ఇంకా కొందరు పహరావాళ్ళు ఉన్నారు. భవనముందు చక్కని తోట ఒకటి ఉంది. వెనక వైపు కూడా విశాలంగా కొమ్మలు ప్రాకి ఏవేవో వృక్షాలున్నాయి. గవర్నరు గారికి సుస్తీగా ఉందిట. అందుచేత యెవరికీ లోనికి పోవటానికి వీల్లేకపోయింది. అయినా సెల్లాండో ఒక చీటీ పంపించాడు లోపలికి ఒక నౌకరుద్వారా. ఆ నౌకరు తిరిగివచ్చి "లోనికి దయచెయ్యండి" అన్నాడు.

ఈ భవనమూ పీటర్సుబర్గులోని ఉన్నతాధికార్ల భవనాల్లాగే ఉంది. ఒక దర్బారుని హాలు, మేడమీదికి మెట్లవరుస, వృక్షాలు... అన్నీ ఉంటూనే ఉన్నాయి. అయితే అంత పరిశుభ్రంగా లేదు.

గవర్నరుగారి అభ్యంతర మందిరంలోకి తీసుకుపోబడ్డాడు నెఖ్లూదొవ్.

గవర్నరు లావుపాటి మనిషి. బుర్రముక్కు. సుపరిపూర్ణ వేళ్ళో కాయలు కాశాయి. కనురెప్పలచుట్టూ నలుపుచారలున్నాయి. బట్టతల. ఒక సిల్కుగౌను వేసుకున్నాడు. తేనీటిగ్లాసు ముందు పెట్టుకుని కొంచెంకొంచెం చప్పరిస్తూ సిగరెట్ కాలుస్తున్నాడు. "రండి, దయచెయ్యండి... నేనిప్పుడు సరైన దుస్తుల్లో లేను. క్షమించాలి. కొన్నాళ్ళనుంచీ సుస్తీగా ఉంటున్నాను. బైటికెక్కడికీ వెళ్ళటం లేదు .. ఈ మా దూరప్రాంతాలకు వచ్చారేమిటి?" అడిగాడాయన.

"నేనీ ఖైదీల గుంపుతో కూడా వచ్చాను. ఆ ఖైదీలలోని ఒకవ్యక్తితో నాకు దగ్గర సంబంధం ఒకటి ఉంది. ఆ వ్యక్తిని గురించీ, మరోచిన్న వ్యవహారం గురించీ మీతో మాట్లాడిపోదామని వచ్చాను."

గవర్నరు సిగరెట్టుదమ్ము పీల్చి, మరికాస్త తేనీరు చప్పరించి, నెఖ్లూదొవ్ ముఖంలోకి సావధానంగా అవలోకిస్తూ అంతా విన్నాడు.

ఈయన ఇతఃపూర్వం ఒక మిలటరీ ఉద్యోగి. చాలా పురాతన బాపతే. ఉదార భావాలు కలవాడు. మెత్తని హృదయంగల మనిషి. తన ఉదార స్వభావానికీ, మిలటరీ ఉద్యోగానికీ పొత్తు కుదరకపోతుండగా అనైక్యంతోనే ఉండేవాడు మొదట. సూక్ష్మబుద్ధి కలవాడు, చాల దయాదాక్షిణ్యాలున్న వ్యక్తి. తన ఔదార్య బుద్ధికీ, మిలటరీ ఉద్యోగానికీ పొత్తు కుదరటం అసంభవమని కాలక్రమేణా తెలుసుకున్నాడు. ఈ రెండూ కుదరకపోవటంవల్ల మనస్సుకు కలిగే బాధనుంచి విముక్తి పొందటానికిగాను తాగుడు అలవాటు చేసుకున్నాడు. మిలటరీవాళ్ళలో ఈ తాగుడు అలవాటు సర్వసాధారణంగా అందరికీ ఉండేదే, ఈయన అస్తమానం సారాయిలో మునిగి తేలుతూ ఉండేవాడు. రానురాను మామూలు సరుకువల్ల నిషా రావటం మానిపోయింది. అందువల్ల నిఖార్సు అయిన సరుకే ఉపయోగిస్తాడు. అది లేకపోతే క్షణం గడవదు. ప్రతి సాయంత్రం పీకలవరకూ తాగవలసిందే. ఎంతతాగినా ఇతర్లలాగ తూలిపడడు. అసంబద్ధంగా మాటాడడు. ఒకవేళ అస్తవ్యస్తంగా

ఆ నిషాలో మాటాడినా...అదంతా ఎంతో బుద్ధిచాకచక్యంతో మాటాడుతున్నట్టే భావిస్తారు, చుట్టూ ఉన్నవాళ్ళు. ప్రముఖమైన ఉన్నతోద్యోగంలో ఉన్నాడుకదా మరి! ఉదయానమాత్రం తాగడు. మామూలుగానే ఉంటాడు. ఈయన త్రాగుబోతని పై యధికార్లకు తెలుసు. కాని మిగతా వాళ్ళందరికన్నా బాగా చదువుకున్నాడు; ధైర్యసాహసాలు గలవాడు. అధికార పదవికి తగినట్టు గంభీరంగా ఉంటుంది రూపం. సారా నిషాలోఉన్నా చాకచక్యంగా మెలిగేరకం. కాబట్టి బాధ్యతాయుతమైన ఈ గవర్నరు పదవిని అతనికే ఇచ్చారు.

ఖైదీలలో తనకు సంబంధంఉన్న ఆవ్యక్తి ఒక స్త్రీ అనీ...ఆమె తరఫున ఒక పిటిషన్ చక్రవర్తికి అందజేయబడిందనీ నెహ్లూడోవ్ చెప్పాడు.

"ఊఁ- తరువాత?" అన్నాడు గవర్నరు.

"ఈ నెలలోనే ఈ ఊరికే ఆ పిటిషన్‌కు జవాబు రాగలదని నాకు పీటర్స్‌బర్గులోనే గట్టిగా చెప్పారు"

గవర్నరు తన లావుపాటి చేయిచాచి బల్లమీద గంట మోగించాడు... సిగరెట్ దమ్ముపీల్చి దగ్గుతూ, నెహ్లూడోవ్ వైపే చూస్తూ.

"కాబట్టి ఆమె పిటిషన్‌కు జవాబు వచ్చేంతవరకూ ఆమెను ఇక్కడే అట్టిపెట్టి ఉంచగలందులకు మిమ్ము కోరుతున్నాను."

గంటమ్రోత వినగానే ఒక నౌకరు లోపలికి వచ్చాడు.

"అన్నా వాసిలీనా నిద్రలేచిందేమో చూడు. తేనీరు ఇంకా కొంచెం పట్టుకురా" అని గవర్నరు నౌకరుతో పలికి మళ్ళీ నెహ్లూడోవ్ వైపు తిరిగి "ఊఁ చెప్పండి" అన్నాడు.

"ఒక రాజకీయ ఖయిదీని గురించి మీతో నేనొక విషయం మనవి చెయ్యాల్సివుంది" అన్నాడు నెహ్లూడోవ్. "అలాగా?" అంటూ అదోరకంగా తల ఊపాడు గవర్నరు.

"అతడు పాపం తీవ్రమైన జబ్బులో...చావుకు సిద్ధమై ఉన్నాడు. బహుశః అతన్ని ఇక్కడే ఒక ఆసుపత్రిలో అట్టిపెట్టేసి వెళ్ళిపోతారనుకుంటాను. అతనితో కూడా కాస్త సాయంగా...పరిచర్యకోసం ఒక స్త్రీ...ఆమె కూడా రాజకీయ ఖైదీయే...ఇక్కడే ఉండిపోవాలనుకుంటోంది."

"అతనికేమో బంధువు కాదా ఆమె?"

"కాదు. కాని ఆమె అతన్ని వివాహం చేసుకోటానికి సిద్ధంగా నే ఉంది... అందువల్ల ఆమె అతనితోపాటు ఉండిపోవటానికి వీలుంటే..."

గవర్నరు అతనికేసి తన మెరుస్తూన్న కళ్ళతో తదేకంగా... ఆశ్చర్యాన్వితుడై చూస్తూ... సిగరెట్టు పీలుస్తూ... వింటున్నాడు.

నెక్లూడొవ్ తాను చెప్పవలసినదంతా చెప్పాడు. గవర్నరు డెస్కులో నుంచి ఒకపుస్తకం తీశాడు. పేజీలు తిప్పాడు. వివాహాలకు సంబంధించిన చట్టం పరిశీలించాడు. చివరకు తలెత్తి: "ఆమెకు విధించిన శిక్ష ఏమిటి?" అని అడిగాడు.

"ఆమెకా? నిర్బంధ బానిసత్వం"

"నిర్బంధ బానిసత్వ శిక్ష విధింపబడిన వ్యక్తి పరిస్థితి వివాహంవల్ల ఏమీ బాగుపడేది కాదే!"

"ఔను- కాని..."

"శిక్షితుడు కాని ఒక స్వతంత్రుడు ఆమెను వివాహం ఆడినా... ఆమె తనశిక్ష అనుభవించి తీరాల్సిందే. ఇటువంటి సందర్భాల్లో చూడాల్సిందేమి టంటే... ఎవరిశిక్ష గొప్పది? అతనిదా? ఆమెదా?"

"ఇద్దరికీ నిర్బంధ బానిసత్వ శిక్షే."

గవర్నరు పకపక నవ్వాడు. "అయితే బాగా నేఉంది. ఇద్దరిదీ ఒకేరకమైన శిక్ష. అతనికి సుస్తీగా ఉంది కాబట్టి ఇక్కడే దిగబెట్టి వెళతారేమో! మందులు, మాకులు, పరిచర్య... వీలైనంతసాయం చేస్తాం. ఇక ఆమెవిషయం: అతన్ని వివాహం చేసుకున్నా ఆమె నిక్కడ దిగబెట్టి పోవటానికి వీల్లేదు."

ఇంతలో నౌకరువచ్చి "అమ్మగారు నిద్రలేచి కాఫీ పుచ్చుకుంటున్నారు" అని కబురు చెప్పాడు.

"అలాగా" అన్నట్టు తలఊపాడు గవర్నరు. వెంటనే నెక్లూడొవ్ వైపు తిరిగి ఇలా అన్నాడు: "ఏమైనా ఈ విషయమై మళ్ళీ ఆలోచిస్తాను. వాళ్ళ పేర్లు చెప్పండి. ఆ కాగితంమీద రాసిపెట్టి పొండి."

నెఖ్లూడోవ్ ఆ యిద్దరి పేర్లు ఒక కాగితంమీద రాసియిచ్చాడు.

చావుకు సిద్ధంగాఉన్న ఆ రాజకీయ ఖైదీని తానువెళ్ళి చూడ్డానికి అనుమతించవలసిందిగా కోరాడు నెఖ్లూడోవ్. అందుకు సమాధానంగా గవర్నరు..."ఆపని నేను చెయ్యలేను. నేను మిమ్మల్ని అనుమానిస్తున్నానని కాదు. అతడన్నా, ఇంకాఇంకా ఖైదీలన్నా మీకు అభిమానం ఉండచ్చు. మీకు డబ్బువుంది. ఆ డబ్బుతో మాచేత ఏ పనైనా చేయించగలుగుతారు. "లంచగొండితనం నిర్మూలించు" అని పై యధికార్లు నాకు తాఖీదు పంపుతూ ఉంటారు. ప్రతివాడూ లంచాలే పుచ్చుకుంటూ ఉన్నాడు. ఇక నేనా దురాచారాన్ని ఎలా మాపుచేయగలుగుతాను? ఉద్యోగం చిన్నదైన కొద్దీ లంచాలమీద ఆశ ఎక్కువౌతూ వుంటుంది. మూడువేల మైళ్ళ పొడుగున్న ఈ ప్రదేశంలో ఎన్ని లంచాలకేసులు పట్టుకోను? ప్రతి చిన్న వుద్యోగీ తానొక చక్రవర్తి ననుకుంటూ వుంటాడు. ఇక్కడ నేననుకోటం లేదూ?" అంటూ బిగ్గరగా నవ్వాడు. "మీరిదివరకు చాలసార్లు వెళ్ళి రాజకీయ ఖయిదీలను చూచి వచ్చేరనుకుంటాను. అందుకుగాను ఆ మావుద్యోగస్థులకు లంచాలు ఇచ్చేవుంటారు. ఔనా?" అన్నాడు మందహాసం చేస్తూ.

"ఔను"

"లంచాలు ఇవ్వాలి మరి. ఇవ్వకపోతే కుదరదు. మీకు ఏ రాజకీయ ఖయిదీనో వెళ్ళి చూడాలనిపిస్తుంది. ఇన్స్పెక్టరుగాని, కాపలా వుండే సైనికుడుగాని చేయి చాపుతాడు. అతనికి రోజుకు ఒక షిల్లింగుజీతం. కుటుంబభారమా యెను. లంచం తీసుకోక ఏంచేస్తాడు? నేనే వాళ్ళస్థితిలో వుంటే నేనూ తీసుకుంటాను. నేనే మీ స్థితిలోవుంటే నేనూ ఇస్తాను. కాని నా ప్రస్తుత స్థితిలో నేనుమాత్రం అలాచెయ్యను. చింతాకు వాసికూడా చట్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించను. నేను దయ, జాలి మొదలైన భావాలకు లొంగిపోకుండా నాకు చట్టమే శరణ్యం. నేను పరిపాలన శాఖలో వున్న మనిషిని. నాకీ బాధ్యతాయుతమైన వుద్యోగాన్ని కొన్ని షరతులమీద ఇచ్చారు. ఆ షరతులను నేను తు. చ. తప్పకుండా నెరవేర్చాల్సిందే...సరే, ఈ వ్యవహారం ఇంతటితో ముగిద్దాం. ఇక మనరాజధాని పీటర్సుబర్గు వ్యవహారాలేమన్నా చెప్పండి" అంటూ గవర్నరు ఏవేవో ప్రశ్నలడగసాగాడు ...తన

పాండిత్యాన్నీ, వ్యవహార దక్షతనూ ప్రదర్శించుకోవటానికి వీలున్న విషయాల్ని గురించి ప్రసంగం చేస్తూ.

## ౨౩

"ఆలస్యం అయిపోయింది. ఎక్కడ మీ బస?" గవర్నరు అడిగాడు... నెఖ్లూదోవ్ వెళ్ళిపోతూండగా.

"దుఖోవా హోటల్లో"

"అక్కడ చాలా దరిద్రంగా వుంటుంది. అయిదింటికి మా యింటికి రండి భోజనానికి. మీరు యింగ్లీషు మాట్లాడగలరా?"

"ఆఁ"

"ఇంకేం! ఒక ఆంగ్లేయుడు ఈ ప్రాంతంలో సంచారానికి వచ్చాడు. ప్రవాస శిక్షల సమస్యను గురించి ఆయన పరిశోధన చేస్తున్నాడు. సైబీరియా లోని కారాగారాల్ని పరిశీలిస్తున్నాడు. ఆయన కూడా మా యింటికి భోజనానికి వస్తాడు సాయంత్రం. మీరుకూడా రండి. మేము సరిగ్గా అయిదింటికే భోజనం చేస్తాం. మీరు చెప్పిన ఆ యిద్దరు వ్యక్తుల్ని గురించి బాగా ఆలోచించి... సాయంత్రానికి మీరు వచ్చినప్పుడు నా సమాధానం చెబుతాను. ఆ రోగికి పరిచర్య నిమిత్తం ఇంకో వ్యక్తిని కూడా ఇక్కడ దిగబెట్టటానికి వీలౌతుందను కుంటాను."

గవర్నరు వీడ్కొని నెఖ్లూదోవ్ జట్కా యెక్కి తపాలా కచేరీకి వెళ్ళాడు. ఉత్తరాలకోసం చాలామంది జనం వచ్చి నిల్చున్నారు. ఒక పోస్టల్ ఉద్యోగి బల్లముందు కూచుని వచ్చిన ఉత్తరాలమీద ముద్రలు కొడుతున్నాడు. నెఖ్లూదోవ్ తన పేరు చెప్పాడు. వెంటనే అతనిపేర వచ్చిన ఉత్తరాలు, పుస్తకాలు, డబ్బు, పత్రికలు—అన్నీ యిచ్చేశారు. అవన్నీ పుచ్చుకుని... అక్కడే వున్న ఒక బెంచీమీద కూచుని ఉత్తరాలు విప్పి చూసుకున్నాడు. ఒక రిజిస్టరు ఉత్తరం కూడా వుంది. కవరు చాలా అందంగా వుంది. ఎర్రటి ముద్ర వుంది దానిమీద. నెఖ్లూదోవ్ దాన్ని విప్పి చూసుకున్నాడు. అందులో సెలినిన్ రాసిన ఒక ఉత్తరమూ, మరొక అధికారికమైన

పత్రమూ ఉన్నాయి. అది చూడగానే నెఖ్లూడోవ్ ఒంట్లో నెత్తురు ఉడికినట్టయింది. గుండె ఆగిపోతున్నట్టనిపించింది. అది మస్లొవా పిటిషన్‌కు సమాధానం అయి ఉంటుంది. ఏమి సమాధానం అయివుంటుందో! పత్రం చిన్ని చిన్ని అక్షరాలతో రాశారు. నెఖ్లూడొవ్ గబగబా చదివేశాడు. అమ్మయ్య! అని ఒక నిట్టూర్పు విడిచాడు. సమాధానం అనుకూలంగానే వుంది.

సెలినిన్ రాసిన ఉత్తరంలో ఇలా ఉంది:

“ప్రియ మిత్రమా! మీరు నాతో చెప్పిన విషయాలు నా గుండెలో మెదులుతూనే వచ్చాయి. మస్లొవాను గూర్చి మీరు చెప్పిన అంశాలు సరైనవే. ఆ కేసు వివరాలన్నీ జాగ్రత్తగా పరిశీలించి చూశాను. ఆమెకు ఘోరమైన అన్యాయం జరిగినమాట వాస్తవమే. జరిగిన అన్యాయాన్ని సరిదిద్దాలంటే...ఉన్నతాధికార్లతో ఏర్పడిన ఒక కమిటీ చెయ్యాలి ఆ పని. మీరు ఆ కమిటీకి పిటీషన్ పెట్టటం మంచిదే అయింది. ఈ కేసు పరిశీలనలో కమిటీకి నేను చాలా సాయపడ్డాను. కమిటీ శిక్షను చాలామట్టుకు తగ్గించేసింది. మీ అత్తగారు జమీందారిణి కేథరైన్ ఇవనోవా నాకు తమ చిరునామాను తెలిపింది. కాబట్టి మీకీ ఉత్తరం, అధికారిక పత్రం నకలు పంపించ గలిగాను. అసలు పత్రం...విచారణకు ముందు మస్లొవాను ఖైదుచేసి వుంచిన చోటుకు పంపించారు. అక్కడినుంచి అది సైబీరియాలో ప్రధాన గవర్నమెంటు ఆఫీసుకు వస్తుంది. ఈ సంతోషకరమైన వార్త ముందుగా మీకు తెలియజేస్తున్నాను...సెలినిన్.”

అధికారిక పత్రంలో ఇలా వుంది: “చక్రవర్తిగారి దివ్యసముఖమునకు సవినయంగా పెట్టుకున్న అర్జీని పురస్కరించుకుని చక్రవర్తిగారి ప్రధానోద్యోగి జారీ చేస్తున్న అనుజ్ఞ: మస్లొవాకు విధించిన నిర్బంధ బానిసత్వశిక్ష-సైబీరియాలో అంత దూరంగాని ప్రదేశానికి ప్రవాస శిక్షగా మార్పు జేయడమైనది.”

ఇది చాలా సంతోషకరమైన వార్త. తన విషయంలోనూ, మస్లొవా విషయంలోనూ నెఖ్లూడొవ్ ఆశించిన మంచి యావత్తూ చేకూరినట్టే. ఆమె ఒక ఖయిదీగా ఉన్నప్పుడు తా నామెను వివాహం చేసుకుంటే...ఆమె కష్టాల్ని కొంతవరకు తాను తగ్గించ గలుగుతాడు. అంతకన్నా ఆ వివాహం యొక్క ప్రయోజనం మరేమీ వుండదు. ఇప్పుడామె స్వతంత్రురాలు.

తానూ, మస్లోవా ఒకచోట కలిసి ఉండవచ్చు. కాని అందుకింకా తానేమీ యేర్పాట్లు చెయ్యలేదు. అయినా ఆమెకూ సైమన్‌సన్‌కూ మధ్య వ్యవహారాలెలా ఉన్నాయో! నిన్న ఆమె పలికిన మాటల అంతరార్థం ఏమై వుంటుందీ? ఆమె ఒకవేళ సైమన్‌సన్‌ను వివాహం చేసుకోటానికి యిష్టపడేట్టయితే దాని పర్యవసానం మంచికా? చెడుకా? ఈ ప్రశ్నలన్నింటికీ తక్షణ సమాధానాలు దొరకటం లేదు. అందుచేత వాటిని గురించి ఆలోచించటం మానుకున్నాడు. "రోజులు గడిస్తే అన్నీ అవే తేలిపోతాయి. ఇప్పుడు వాటిని గురించి బుర్ర పగులగొట్టుకోవటం దేనికి? ప్రస్తుతానికి ఈ శుభవార్త తీసుకుపోయి ఆమెకు చెబుతాను. నిర్బంధంలోనుంచి విడిపించెట్టిస్తాను" అనుకున్నాడు. ఆమెకు విడుదల ప్రసాదించటానికి తనకు వచ్చిన అధికారిక పత్రం చాలుననుకున్నాడు నెహ్లూడొవ్. వెంటనే జట్కా యెక్కి ఖయిదీలను నిర్బంధించి వుంచిన చోటుకు వెళ్ళాడు.

జైళ్ళలోకి వెళ్ళి ఖయిదీలను చూడ్డానికి గవర్నరు తనకు అనుమతి యివ్వలేదు. అయినా పై అధికార్లచేత చేయించలేని పని చిన్న వుద్యోగులచేత కాస్త లంచం పడేస్తేసరి...చేయించవచ్చునని నెహ్లూడొవ్‌కు తన పూర్వ అనుభవాన్ని బట్టి బాగా తెలుసు. యెలాగో ప్రయత్నించి జైల్లోకి పోయి మస్లోవాకు ఈ శుభవార్త చెప్పటం, వీలైతే ఆమెను విడుదల చేయించటం, క్రిల్టుసోవు మరొకసారి పరామర్శించటం, గవర్నరుగారు చెప్పిన మాటల్ని మేరిపావ్‌లోనాకు తెలియజేయటం...ఈ పనులన్నీ ముగించుకు వద్దామని అతని అభిప్రాయం.

జైళ్ళ ఇన్స్‌పెక్టరు పొడుగాటి మనిషి. శివిగా వుంటాడు. పెదవుల చివర మెలికెలు తిరిగిన మీసాలు. అతడు నెహ్లూడొవ్‌తో సాయలా పాయలాగా మాటాడలేదు. ఒక బైటి మనిషి జైల్లో ప్రవేశించి ఖయిదీలతో మాట్లాడ్డానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పేశాడు; తన పై యధికారి దగ్గరనుంచి వుత్తరువు లేనిదే ఎవరినీ లోపలికి పోనియ్యనని ఖండితంగా చెప్పాడు.

"ఇదివరకు అనేకచోట్ల చాలాసార్లు చాలామంది ఆఫీసర్లు నన్ను లోపలికి పోనిచ్చారు."

"పోనిస్తే పోనిచ్చారేమో. నేను మాత్రం పోనీయను" అన్నాడు ఇన్స్‌పెక్టరు. "మీ బస్తీ మనుషులు మమ్మల్ని లోకరా తనిపించవచ్చుననుకున్నా

లేమో! ఈ తూర్పు సైబీరియాలో మాకు చట్టాలూ, నిబంధనలూ అన్నీ తెలియక పోలేదు. కావలిస్తే మీకు కూడా బోధిస్తాం" అన్నట్టు బెదిరింపుగా వుంది అతని కంఠస్వరం.

చక్రవర్తిగారి ఆఫీసునుంచి వచ్చిన డాక్యుమెంటు కూడా పని చెయ్యలేదు. ఇన్‌స్పెక్టరు నెఖ్లూడోవును లోపలికి పోనీయలేదు. మస్లోవాను విడుదల చేయించటానికి ఆ డాక్యుమెంటే చాలనుకుంటూన్న నెఖ్లూడోవును చూసి అతడు వ్యంగ్యంగా మందహాసం చేస్తూ "జైల్లోనుంచి ఎవర్ని విడుదల చెయ్యాలన్నా స్థానికంగా వుండే నా పై అధికారి వుత్తరువు కావాల్సిందే" నన్నాడు. "కావలిస్తే ఈ వార్త మస్లోవాకు తెలియజేస్తాను. నా పై అధికారి వుత్తరువు వచ్చాక ఆమెను యిక్కడ అరగంట సేపు కూడా యిక వుంచుకోము" అని చెప్పాడు. నెఖ్లూడోవ్ క్రిల్త్సోవు గురించి కొన్ని ప్రశ్నలడిగాడు. ఇన్స్పెక్టరు ఏమీ సమాధానం చెప్పలేదు. క్రిల్త్సోవ్ అసలు అక్కడ వున్నాడో లేడో కూడా చెప్పటానికి నిరాకరించాడు. ఇక చేసేదేమీ లేక నెఖ్లూడోవ్ మళ్ళీ బండెక్కి హోటలుకు బయలుదేరాడు.

ఆ పూట ఇన్స్పెక్టరు ఎందుకంత కఠినంగా ప్రవర్తించాడో నెఖ్లూడోవు తరువాత తెలిసింది. ఆ జైలు గదుల్లో ఖైదీలు క్రిక్కిరిసి పోయేటట్టు నిర్బంధించినందువల్ల రోగాలు యెక్కువయ్యాయి. కొన్ని పాత జ్వరం తీవ్రంగా వ్యాపించి వున్నది. దారిలో బండివాడు అన్నాడు: "ఈ జైల్లో ప్రతిరోజూ చాలామంది చచ్చిపోతున్నారంట. ఏదో అంటురోగం సోకినట్టుంది. రోజుకి ఇరవై మందిని తీసుకెళ్ళి పాతి పెడుతుంటారు."

## ౨౮

ఇన్స్పెక్టరును మంచి చేసుకోలేకపోయినా నెఖ్లూడోవు విచారం కలగలేదు. మనస్సు వుల్లాసంగానే వుంది. హోటలుకు వెళ్ళకుండా మొదట గవర్నరుగారి ఆఫీసుకు వెళ్ళాడు. 'అసలు డాక్యుమెంటు' ఇక్కడికేమన్నా వచ్చిందేమో కనుక్కోటానికి. రాలేదన్నారు. నెఖ్లూడోవ్ తిరిగి హోటలుకు వచ్చాడు. అసలు డాక్యుమెంటు ఇంకా యిక్కడికి రాలేదనీ, త్వరలో వచ్చేటట్టు చూడవలసిందనీ సెలినిన్‌కూ, తన అడ్వకేటుకూ వుత్తరాలు రాశాడు.

డింగాను. ఆ గోపురం, ఆ యింపైన భోజనం, తన స్థాయికి చెందిన వున్నతవ్యక్తులతో సంభాషణ—ఇవన్నీ నెఖ్లూదోవుకు ఆహ్లాదం, వుల్లాసం కలిగించాయి. ఇన్నాళ్ళూ మూడు నెలలనించీ అనుభవించిన మామూలు సాధారణ జీవితం ఒక కలలా తోచింది.

భోజనాల దగ్గర సమావేశమైన వారిలో గవర్నరుగారి కూతురు, ఆమె భర్త, ఒక మిలిటరీ ఉద్యోగి, ఒక ఆంగ్లేయుడు, బంగారపు గనుల్లో కంట్రాక్టరైన ఒక వర్తకుడు, సైబీరియాలోని మరొక జిల్లా గవర్నరు ఒకాయన ఉన్నారు. వీరందరితోటీ సంభాషణ నెఖ్లూదోవుకు ఉల్లాసకరంగానే ఉంది.

వర్తకుడు యువకుడే. ఇంగ్లండులో తయారు చేయించి తెప్పించిన దుస్తులు తొడుక్కున్నాడు. వజ్రాలు పొదిగిన గుండీలున్నాయి షర్టుకు. అతని ఇంట్లో మంచి లైబ్రరీ ఉంది. దీనవారైన వ్యక్తులకూ, సంఘసంస్కరణల కోసం సాగే ఉద్యమాలకూ భూరి విరాళాలు ఇస్తూనే ఉంటాడు. యూరోపియను సభ్య నాగరికత అతనిలో మూర్తీభవించినట్టు కనిపించింది నెఖ్లూదోవుకు.

సైబీరియాలోని దూరప్రాంత జిల్లా గవర్నరు కొంతకాలం క్రితం ప్రభుత్వ శాఖలో డైరెక్టరుగా పనిచేశాడు. అతన్ని గురించి నెఖ్లూదోవ్ పీటర్స్‌బర్గులో పలువురు చెప్పుకుంటూ ఉండగా విని ఉన్నాడు. అతను బాగా లావుగా వుంటాడు. ఉంగరాల జుట్టు, నల్లని కళ్ళు. వేళ్ళకు ఉంగరాలు ఉన్నాయి. అతని కాయం మరీ లావుగా ఉంటుంది. గృహయజమానికి అతనంటే చాలా ప్రీతి. ఎందువల్లనంటే అతడు నిప్పులాంటి మనిషి. చచ్చినా లంచం పుచ్చుకోడు. అతడు చక్కగా సంగీతం పాడగలడు. అందుచేత గృహయజమానురాలికి కూడా అతనంటే మంచి గౌరవం. ఆమె స్వయంగా చక్కగా పాడుతుంది. పియానో వాయిస్తుంది. అతనిలో వున్న లోటుపాట్లు గురించి నెఖ్లూదోవ్ పీటర్స్‌బర్గులో కొంతవరకు విన్నాడు. అయినా ఈ సందర్భంలో అతనితో కూడా నెఖ్లూదోవ్ ఉల్లాసంగానే మాట్లాడాడు.

మిలిటరీ ఉద్యోగి మంచి ఉత్సాహంగల మనిషి. సత్స్వభావం గలవాడు. నెఖ్లూదోవుకు అతని ప్రవర్తన కూడా నచ్చింది. ముఖ్యంగా గవర్నరుగారి కూతుర్నీ, ఆమె భర్తనూ చూసినప్పుడతనికి చాలా ఆనందం కలిగింది. ఈడూ జోడూగల చక్కని దాంపత్యం. ఆ అమ్మాయి చాలా నిరాడంబరంగా

ఉంటుంది. ఇద్దరు పిల్లలున్నారు. ఆమె భర్త [illegible]. అయినా ఆమె ప్రేమించి...తల్లి దండ్రులతో చాలా కాలం [illegible]...[illegible] [illegible] వివాహం చేసుకుంది. అతను [illegible] భద్రుడు. పెద్ద గవర్నమెంటు ఉద్యోగమే దొరికింది.

నెల్లాడో ఆ ప్రాంతానికి కొత్తగా వచ్చిన వ్యక్తి కాబట్టి [illegible] ఆలీ పట్ల ఆదరణ, ఆప్యాయత చూపించారు. గవర్నరు కూడా [illegible] పాత స్నేహితునిలాగ గౌరవించాడు. ప్రేమగా మాట్లాడాడు. "[illegible] నన్ను కలసికొని వెళ్ళక మీ రేంచేశారు?" అని అడిగాడు. నెల్లాడో [illegible] వచ్చిన డాక్యుమెంటు నకలు గురించీ, తాను జైలుకుపోయి తిరిగి వచ్చిన సంగతీ—అంతా చెప్పాడు మరొకసారి అడిగాడు 'జైల్లో [illegible] వస్తావాను, క్రిక్ సోను చూసి రావటానికి అనుమతి ఇవ్వండి' అంటూ.

భోజన సమయంలో ఈ విషయాన్ని ముచ్చటించటం ఇష్టంలేక గవర్నరుగారు ఏమీ మాటాడలేదు.

"ఒక గ్లాసు సారాయం తాగండి" అన్నాడు అప్పుడే అక్కడికి వచ్చిన ఆంగ్లేయుని ఉద్దేశించి.

ఆంగ్లేయుడు సారాయం తాగాడు. తానూ ఉదయం వచ్చి, ఫ్యాక్టరీ చూసి వచ్చాననీ...ఇంకా ఈ బస్తీలో జైళ్ళ పరిస్థితి పరిశీలించవలసి యున్న దనీ చెప్పాడు.

గవర్నరు నెల్లాడో వైపు తిరిగి అన్నాడు: "ఇంకేం? అవకాశం కూడి వచ్చింది. మీ రిద్దరూ కలిసి వెళ్ళండి" అని పలికి మిలిటరీ ఉద్యోగి వైపు చూసి "వీరికి పాస్ ఇవ్వండి" అన్నాడు.

"మీ రెప్పుడు వెళ్ళాలను కుంటున్నారు?" నెల్లాడో అడిగాడు.

"జైళ్ళు చూడాలంటే సాయంత్రం మప్పుడే చూడాలని నా ఉద్దేశం. అప్పుడైతే అందరూ లోపలే వుంటారు. మనం సర్వం చూడొచ్చు" అన్నాడు ఆంగ్లేయుడు.

"మా జైళ్ళ వైభోగం అంతా ఏ మాత్రం దీసుపోకుండా సమగ్రంగా చూడదలచుకున్నా రన్న మాట! నేను పైకి రాశాను. కాని వాళ్ళు పట్టించు

కుంటే కదూ! పోనీయండి, విదేశీయ పత్రికల్లోనైనా చూచి తెలుసుకుంటారు" అన్నాడు గవర్నరు.

విందు ప్రారంభమైంది. టేబిల్ చుట్టూ అంతా ఆసీనులైనారు. గవర్నరుగారి భార్యకూ, ఆంగ్లేయునికీ మధ్య కూచున్నాడు నెక్లూడో. అటుని కెదురుగా గవర్నరుగారి కూతురూ, దూరపు జిల్లా గవర్నరూ కూచున్నారు. సంభాషణ అనేక విషయాల్ని గురించి సాగిపోయింది. ఆంగ్లేయుడు ఇండియా గురించి ప్రసంగించాడు. గవర్నరుగారు టాన్‌కిన్ దండయాత్రను ఖండిస్తూ మాటాడాడు. తరువాత సైబీరియాలో ఉద్యోగస్థు లందరిలోనూ విరివిగా వ్యాపించియున్న లంచగొండితనం గురించి చర్చించారు. ఈ విషయాలేవీనీ నెక్లూడోకు నచ్చలేదు.

విందు ముగిసింది. కాఫీ త్రాగుతున్నప్పుడు నెక్లూడో, ఆంగ్లేయుడు, గవర్నరుగారి భార్య...ఈ ముగ్గురి మధ్య గ్లాడ్‌స్టన్ గురించి ఆహ్లాదకరమైన సంభాషణ సాగింది. నెక్లూడో చాలా విషయాలు చెప్పాడు. ఇంపుగా భోజనం చేసి, సారాయం తాగి, పడక కుర్చీలో వాలి కాఫీ చప్పరిస్తూ వుంటే నెక్లూడోకు చాలా హాయిగా, ఉల్లాసంగా వుంది. నాగరిక వాతావరణంలో పెరిగిన వ్యక్తుల సాహచర్యం అతనికి ఆనందాన్ని చేకూర్చింది. తరువాత ఆంగ్లేయుని కోరికపై గవర్నరుగారి భార్య పియానోమీద చక్కని పాట వాయించింది. ఈ మధుర వాతావరణంలో నెక్లూడో ఆత్మ పరిపూర్ణ తృప్తి అనుభవించింది. తా నెంతో మంచి వ్యక్తి అయినట్టు తన కిప్పుడే బోధపడుతున్నట్టనిపించింది. పియానో వాయిద్యం విన్నాడు. సంగీతంలోని మాధుర్యం అనుభవించాడు.

నెక్లూడో గవర్నరు దంపతులకు తన కృతజ్ఞత చెప్పుకొని వెళ్ళిపోడానికి లేచినప్పుడు గవర్నరుగారి కూతురు ముందుకువచ్చి "మా పిల్లల్ని చూద్దురుగాని రండి" అన్నది.

"అందరికీ నీ పిల్లల్ని చూడాలనే ఉంటుందను కుంటున్నావా? పో పో, వారికి పిల్లలంటే కోపం" అన్నది వాళ్ళ అమ్మ ఆమె అమాయకత్వానికి నవ్వుకుంటూ.

"నాకు కోపంలేదు. పైగా పిల్లలంటే నాకు చాలా యిష్టం. ఎక్కడున్నారు-ఏరీ? చూద్దాం పద!" అన్నాడు నెక్లూడో.

"మా అమ్మాయి తన పిల్లల్ని చూపించటానికి నెఖ్లాడోవ్‌ను తీసుకు పోతుందా?" అంటూ పక పక నవ్వాడు గవర్నరుగారు.

నెఖ్లాడోవ్ తన పిల్లల్ని ఎంతగానో మెచ్చుకో గలడన్న ఉత్సాహంతో అతన్ని లోపలికి తీసుకుపోయింది. అదొక పెద్ద గది. గోడలకు తెల్లని కాగితా లంటించారు. ఒక లాంతరు వెలుగుతోంది. రెండు చిన్న మంచాలు వున్నాయి గదిలో. ఆ రెండు మంచాల మధ్య దాయమ్మ ఒకామె కూచుంది. ఆమె సైబీరియాలోనే పుట్టి పెరిగిన మనిషి. నెఖ్లాడోవ్ రాగానే లేచి నమస్కారం చేసింది. ఒక మంచంమీద రెండేళ్ల ఆడపిల్ల పడుకుని వుంది. ప్రశాంతంగా నిద్ర పోతోంది. చిన్నారి పెదవులు తెరుచుకుని వున్నాయి. ఉంగరాలు తిరిగిన అందమైన వెంట్రుకలు.

పిల్లమీద కప్పిన దుప్పటి తొలగిస్తూ తల్లి చెప్పింది. "ఈ బిడ్డ పేరు 'కాట్రీ' రెండోయేడు. అందంగా లేదూ?"

"చాలా అందంగా వుంది."

"ఆ మంచంమీద వున్నది 'వాసుక్'. వాడిని వాళ్ళతాతగారు అలాగే పిలుస్తారు. అచ్చం సైబీరియా మనిషిలాగే వుంటాడు."

"చాలా అందమైన కుర్రాడు" అన్నాడు నెఖ్లాడోవ్ బోర్లా పడుకుని నిద్రపోతోన్న పసివాడిని చూస్తూ.

ఆ తల్లి సగర్వంగా, ఆనందంగా మందహాసం చేసింది.

నెఖ్లాడోవ్‌కు ఆ సమయాన సైనికులు, సంకెళ్ళు, గొరిగిన తలలు, వాళ్ళలో వాళ్ళ కొట్లాటలు—దుండగాలు, చావుకు సిద్ధమైన క్రిల్జసోవ్, మస్లోవా, ఆమె గత జీవితం...ఏవేవో గుర్తుకు వొచ్చాయి. ఈ ఇల్లాలు పవిత్రురాలు. ఈ ఇంట్లో అంతా సుఖమయం. ఆ సభ్యత, ఆ నాగరికత చూసి ముగ్ధుడైనాడు.

తల్లికి బాగా సంతోషం, సంతృప్తి కలిగేటంతవరకూ పిల్లల్ని బాగా పొగిడాడు నెఖ్లాడోవ్. చివరకు ఆమెతోపాటు మళ్ళీ డ్రాయింగ్ రూముకు వచ్చాడు. ఆంగ్లేయుడు జైళ్ళ పరిస్థితి పరిశీలనకు బయలుదేర బోతున్నాడు. గవర్నరు దంపతుల సెలవు తీసుకుని నెఖ్లాడోవ్ కూడా బయలుదేరాడు ఆంగ్లేయునితోపాటు.

బైట వసంతపు కోలాహలంగా ఉంది. ఆంగ్లేయుడు తన బండిలో ఎక్కి కూచున్నాడు. నెఖ్లూడో కూడా తన జట్కా యెక్కాడు. మంచు గడ్డలు పడి వున్న రోడ్డుమీద విపరీతంగా కదలుతూ బండ్లు సాగిపోయాయి.

## ౨౩

ఆంగ్లేయుడు, నెఖ్లూడో తెచ్చిన 'పాసు'లను చూసి ఇన్స్పెక్టరు ఒక దీపం ముందు చదువుకుని ఆశ్చర్యపడ్డాడు. బల్లలు ఎదుర వేశాడు. 'దయ చెయ్యండి' అంటూ లోపలికి దారితీశాడు. కొంత దూరం పోయాక కుడి వైపు తిరిగాడు. అక్కడినుంచి మెట్లమీదుగా మేడమీది ఆఫీసు గదిలోకి తీసుకుపోయాడు. కుర్చీలు చూపించి కూచోమన్నాడు.

"నాకు మస్లావాతో మాటాడవలసిన పనివుంది" అన్నాడు నెఖ్లూడో.

ఇన్స్పెక్టరు ఒక జైలరును పిల్చి "వెంటనే మస్లావాను ఇక్కడకి తీసుకురా!" అని ఆదేశించాడు.

ఆ తరువాత ఆంగ్లేయుడు తన యింగ్లీషు భాషలో కొన్ని ప్రశ్నలడిగాడు. వాటిని రష్యన్ భాషలోకి తర్జుమా చేసి చెప్పాడు నెఖ్లూడో. వాటికి జవాబులు ఇన్స్పెక్టరు రష్యన్ భాషలో చెబుతూంటే ఇంగ్లీషులోకి తర్జుమా చేశాడు కూడా.

ఎంతమంది ఖైదీలను వుంచటానికని ఈ జైలు నిర్మించారు? వారిలో పురుషులెందరు? స్త్రీలెందరు? గనుల్లో పని చేయించటానికి తీసుకుపోబడుతున్న వాళ్ళెందరు? ప్రవాస శిక్షకని తీసుకు వచ్చిన వాళ్ళెందరు?"

ఆంగ్లేయుడు అడిగిన ఈ ప్రశ్నలను రష్యన్ భాషలోకి నెఖ్లూడో తర్జుమా చేస్తూండగా బైట ఏవో అడుగుల చప్పుడు వినిపించింది. తలుపు తెరువబడింది. మస్లావాను వెంటబెట్టుకుని జైలరు లోపలికి వచ్చాడు. మస్లావా తలకొక రుమాలు చుట్టుకుని జైలు దుస్తుల్లో వుంది. నెఖ్లూడోకు ఒక రకమైన భావావేశం సోకింది.

"నేనూ అందరిలాగా ప్రపంచంలో జీవించాలి. నాకూ ఒక కుటుంబం పిల్లలూ, ఇల్లు, వాకిలి వుండాలి..." ఇలా ఏవేవో భావాలు నెఖ్లూడో మనోవీధిలో మెరిశాయి. మస్లావా తల వంచుకుని లోపలికి వచ్చింది.

"నువ్వు అతన్ని ప్రేమిస్తున్నావా?" అని అడిగాడు.

"ప్రేమించటం, ప్రేమించకపోవటం అనే ప్రశ్న లేదుగా! నేనంతా ఎప్పుడో విడిచిపెట్టేశాను. ఇంతకూ సైమన్‌సన్ ఒక అసాధారణ వ్యక్తి."

"ఔనౌను–అతను చాలా గొప్పవ్యక్తి. నేను అనుకునే దేమంటే..."

మస్లోవా మళ్ళీ మాటకు అడ్డు వచ్చింది. అధికంగా అతడేమి చెబుతాడోనని ఆమె భయం. "మీ కోరిక ప్రకారం నేను ప్రవర్తించటం లేదని మీకు తోస్తే నన్ను క్షమించండి. నిజానికి అంతకంటే మార్గం లేదు. మీరు కూడా ఒక యింటివారై సుఖపడాలి కదా!"

ఔను. ఆ మాటే తానూ కొంతసేపటి క్రితం అనుకున్నాడు. కాని యిప్పుడా భావం లేదు అతనికి. ఆమెను పోగొట్టుకున్నందువల్ల తనకు కలుగబోయే నష్టాన్ని తలచుకుని తనలో తాను లజ్జితుడైనాడు "విధి యిలా మారిపోతుందని నేననుకోలేదు" అన్నాడు.

"మీరు ఈ ప్రాంతాల్లో వుండి అవస్థ పడటం దేనికి? ఇప్పటికే మీరు చాలా బాధలు పడ్డారు" అంటూ ఆమె మందహాసం చేసింది.

"నేనేమీ బాధలు పడలేదు. నాకు చాలా హాయిగానే గడిచాయి రోజులు. ఈ విధంగానే ముందు కూడా నీకు సహాయపడుతూ కాలక్షేపం చెయ్యాలనే నా కోరిక."

'మేము...' –'మేము' అనే పదాన్ని ఉచ్చరిస్తూ మస్లోవా నెహ్లూడోవ్ వైపు క్రీగంట చూసింది. "మేము యింకా కోరే సాయం ఏమీ లేదు. మీరు నాకు చాలా సాయం చేశారు యింతవరకూ. మీరే గనక లేకపోయినట్టయితే..." ఆమె యింకా ఏమో చెప్పబోయింది. కాని కంఠస్వరం వణికింది.

"నువ్వు నాకు కృతజ్ఞత చెప్పుకోవలసిన అవసరం ఏమీ లేదు."

"మీరు నాకు చేసిన మేళ్ళు అన్నీ లెక్కపెట్టి ఏం లాభం? భగవంతుని కన్నీ తెలుసు" అశ్రుసిక్తములైన ఆమె నీలి నేత్రాలు మెరిశాయి.

"నువ్వు చాలా మంచిదానివి సుమీ!"

"నేనా? మంచిదాన్నా?" కన్నీళ్ళతో తలెత్తి చూసింది. పెదవుల మీద చిన్ని చిరునవ్వు.

"అయిందా? యిక మనం బయలుదేరుదామా?" అని అంగ్లేయుడు కేక వేశాడు.

"పోదాం బయలుదేరుదాం, వెళ్ళండి" అన్నాడు నెఖ్లూదోవ్. వెంటనే మస్లొవా వైపు తిరిగి "క్రిల్ట్సోవ్ ఎలా ఉన్నాడు?" అని అడిగాడు.

మస్లొవా తన భావావేశాన్ని అదుపులోకి తెచ్చుకుంది. క్రిల్ట్సోవ్ గురించి తనకు తెలిసిన సమాచారమంతా చెప్పింది. [illegible] అతని విషయమై చాల ఆందోళన పడుతోంది. అతని పరిచర్యకోసం [illegible] తన్ను 'నర్సు'గా వేయించవలసిందిగా అధికార్లను కోరింది. కాని వాళ్ళు ఒప్పుకోలేదు... "ఇక నేను వెళ్ళిపోనా?" మస్లొవా అడిగింది... అంగ్లేయుడు నెఖ్లూదోవ్ కోసం కనిపెట్టుకుని వున్నాడని గమనించి.

"సరే, మళ్ళీ ఒకసారి కలుసుకుంటాను." అంటూ నెఖ్లూదోవ్ కరచాలన నిమిత్తం చెయి చాచాడు.

"క్షమించండి" అన్నది మస్లొవా చాల నెమ్మదిగా. ఇద్దరి చూపులూ కలిశాయి. ఆమె అందమైన మెల్లకంటి చూపులో, ఆ చిన్ని చిరునవ్వులో [illegible] హృదయం తెలిసినట్టనిపించింది. 'ఆమె నిజంగా నన్ను ప్రేమిస్తోంది. కాని నన్ను ఆమె పెళ్ళిచేసుకున్నట్టయితే నా జీవితం పాడైపోతుందని ఆమె ఉద్దేశం. తాను సైమన్సన్‌తో కలిసి వెళ్ళిపోతున్నట్టయితే, నేను స్వేచ్ఛగా సుఖపడతానని, ఆమె అనుకుంటోంది. తాను [illegible] చేస్తున్నందుకు ఆనందిస్తున్న మనిషిలా కనిపించింది. కాని నిజంగా నన్ను వదిలిపెట్టి పోవటానికి విచారపడుతున్నది' అనుకున్నాడు నెఖ్లూదోవ్.

ఆమె అతని చేయి అందిపుచ్చుకుంది. [illegible] ఆమె వెళ్ళిపోయింది.

ఆంగ్లేయుడు పుస్తకంలో ఏమో రాసుకుంటున్నాడు. అక్కడొక కుర్చీలో కూలబడ్డాడు నెఖ్లూదోవ్. ఒక విపరీతమైన అలసట అనుభవించాడు. నిద్రలేని అలసట కాదు. ప్రయాణ బడలిక కాదు, భావావేశ [illegible] కాదు. జీవితమే అలసటగా తోచింది. కుర్చీలోనే [illegible]. మరుక్షణమే ప్రగాఢమైన నిద్రలో మునిగిపోయాడు.

"ఇక వెళ్ళి జైలుగదులు చూస్తారా?" అని ఇన్స్పెక్టరు అడుగుతూన్నప్పుడు స్లొకొంబ్‌కు మెలకువ వచ్చింది. ఈలోగా ఆంగ్లేయుడు పుస్తకంలో రాసుకోటం పూర్తిఅయింది. జైలుగదుల పరిశీలనకు బయలు దేరాడు. స్లొకొంబ్ అలసటగా అతన్ని అనుసరించి వెళ్ళాడు.

— ౨౬ —

మేడమీదినించి దిగి క్రిందవరండాలోకి వచ్చారు. అక్కడ ఇద్దరు ఖైదీలెవరితో ఆలాపనం చేస్తున్నారు వరండా మీదే. ఆంగ్లేయునితో సహా స్లొకొంబ్ మొదటి వార్డులో ప్రవేశించాడు. నిర్బంధ శ్రమ సహిత శిక్ష విధించిన వారంతా ఈ వార్డులో ఉన్నారు. సుమారు డెబ్బయిమంది ఉంటారు. అంతా అప్పుడే పడక వేశారు. కాళ్ళు కాళ్ళూ, తలలు తలలూ ఆనించుకుని పడుకున్నారు. క్రొత్తవ్యక్తులు లోనికి వచ్చేసరికి వాళ్ళంతా లేచినిల్చున్నారు. ఇద్దరుమాత్రం లేవలేదు. తీవ్రమైన జ్వరబాధలో ఉన్న ఒక యువకుడు, తోన్న మరొక ముసలివాడు.

"ఆ యువకునికి జ్వరం ఎన్నాళ్ళనించి వస్తోంది" అని ఆంగ్లేయుడు ప్రశ్నించాడు.

"అతనికి ఇవాళే ఉదయమే తగిలింది జ్వరం. ఆ ముసలివాడుమాత్రం కడుపునొప్పితో చాలకాలంనించీ బాధ పడుతున్నాడు. ఆసుపత్రి ఇప్పటికే నిండిపోయివుంది. అందుచేత ఇతన్ని ఇక్కడే వుంచాం" అన్నాడు ఇన్స్పెక్టరు.

"మీరు చేసింది మంచిపని కాదు" అన్నట్టుగా ఆంగ్లేయుడు తలవూపాడు. తరువాత ఆ ఖైదీలకు తానేదో నాలుగు మాటలు చెబుతానన్నాడు. మొదట అతడు ఇంగ్లీషులో చెప్పాడు. దాన్ని స్లొకొంబ్ రష్యన్ భాషలోకి అనువదించి వాళ్ళకు వినిపించాడు. ఆ మాటలు ఇవి: "ఏసుక్రీస్తు మిమ్మల్ని ప్రేమించాడు. మీ స్థితికి జాలి వహించి మీ కోసమే మరణించాడు. ఈ విషయాన్ని మీరు విశ్వసిస్తే మీరు బాగుపడతారు. ఆ విషయమంతా ఈ పుస్తకంలో ఉంది. మీలో ఎవరన్నా చదువగలరా?"

ఆంగ్లేయుని పని కేవలం జైళ్ళ పరిస్థితులను పరిశీలించటమేగాక వాళ్ళకు మోక్షమార్గాన్ని ఉపదేశించటంకూడా కాబోలు! అయన హితోప

దేశాన్ని ఖైదీలు సావధానంగానే విన్నారు. వారిలో చదువగలవాళ్ళు ఇరవై మందిదాకా ఉన్నట్లు తేలింది.

ఆంగ్లేయుడు తన సంచిలోనుంచి రెండు బైబిల్ పుస్తకాలు తీశాడు. చాలమంది చేతులు చాచారు. కాని ఆయన ఆ వార్డుకు రెండు పుస్తకాలు మాత్రమే ఇచ్చాడు.

రెండవ వార్డులోకూడా ఇలాగే జరిగింది. ఖైదీలంతా క్రిక్కిరిసి పడుకుని ఉన్నారు. చాల అనారోగ్యంగా ఉంది వార్డు. ఇక్కడా సన్నిపాతగ్రస్తులు రోగపీడితులై ఉన్నారు. ఒకడుమాత్రం మూసినకన్ను తెరవకుండా పడి ఉన్నాడు. ఆంగ్లేయుడు ఇక్కడకూడా తన మహోపదేశాన్ని వినిపించి రెండు బైబిల్ పుస్తకాలు ప్రసాదించాడు.

మూడో గదిలో నలుగురికి జబ్బుగా ఉంది. "రోగులందర్నీ ప్రత్యేకంగా ఒకే వార్డులో అట్టిపెట్టకపోయారా?" అని అడిగాడు ఆంగ్లేయుడు. మరో వార్డులోకి వెళ్ళటం రోగులకే ఇష్టంలేదనీ, వాళ్ళకు వచ్చిన వ్యాధి అంటురోగం ఏమీ కాదనీ, వైద్యుడు రోజూవచ్చి వాళ్ళను చూచి పోతూనే ఉన్నాడనీ ఇన్స్పెక్టరు సమాధానం చెప్పాడు.

"వైద్యుడుగారు పదిహేను రోజులనుంచీ ఈ చాయలకే రావటం లేదండీ" ఖైదీల్లోనుంచి ఎవ్వరో మెల్లగా గొణిగాడు.

ఇన్స్పెక్టరు ఏమీ మాటాడలేదు-ఇంకో వార్డుకు దారితీశాడు. అక్కడ కూడా ఆంగ్లేయుడు తన ఉపదేశం వినిపించి, బైబిలు పుస్తకాలు రెండు ఉదారంగా పంచిపెట్టాడు. ఇలాగ ఆరు వార్డులు చూచారు.

తరువాత ఆంగ్లేయుడు ప్రవాసశిక్ష విధించినవారిని చూచాడు. ఏ వార్డులో వెళ్ళిచూచినా ఆకలితో, చలితో బాధపడుతూ, రోగాలతో మూలుగుతూ, జీవకళ అనేది నశించి, అడవి మృగాల్లాగా ఉన్న మానవులు కనిపించారు. ఘోరమైన యీ జైలుపరిస్థితులు చూచిచూచి విసిగిపోయాడు. తనకే ప్రాణం సొమ్మసిలిపోతున్నట్లనిపించింది. ఉపన్యాసం చెప్పటం, బైబిలుగ్రంధాలు పంచిపెట్టటం మానేశాడు. మాట, పలుకూ లేకుండా వార్డునించి వార్డుకు మరమనిషిలా చూచుకుంటూ వెళ్ళాడు; అంతే.

నెహ్లూదోవు కదంతా ఒక స్వప్నసంచారంలాగ ఉంది. ఊపిరి బిగపట్టుకొని ఆంగ్లేయుని వెంట అనుసరించి వెళ్ళుతున్నాడు.

ప్రవాస శిక్ష విధింపబడిన ఖైదీలున్న వార్డులో... నాటి ఉదయం నెఖ్లూడోను పడకమీద తారసిల్లిన ఆ ముసలివాడు కూడా కనిపించాడు. చూచి నెఖ్లూడో ఆశ్చర్యపోయాడు. అతడు చినిగిన రంగుచొక్కా ఒకటి తొడుక్కొని పక్కమీద అనుకుని కూచున్నాడు. తీక్షణంగా చూస్తున్నాడు వచ్చిన వ్యక్తుల కేసి. చాలా బలహీనంగా కనిపిస్తున్నాడు. అయినా ముఖం ఉత్సాహవంతంగానే ఉంది. ఇతర వార్డులలోలాగే అందరూ లేచి నిల్చున్నారు ఇన్స్పెక్టరు రాగానే. ఆ ముసలయ్య మాత్రం లేవలేదు. కనులెర్రజేసి, కనుబొమలు ముడిచి... “నుంచో లేచి” అని అరిచాడు ఇన్స్పెక్టరు.

ముసలివాడు లేవలేదు. నిర్లక్ష్యంగా నవ్వాడు: “మీ అథార్టీ అంతా మీ నౌకర్లమీద చూపించుకోండి. నేను మీ నౌకర్ని కాదు.” అన్నాడు.

“ఆఁ” ఇన్స్పెక్టరుకు చాలా కోపం వచ్చేసింది. అతని మీదికి దూకబోతున్నాడు.

“ఆ ముసలాయన్ను నేను ఎరిగి వున్నాను. అతన్ని ఏ నేరంమీద అరెస్టు చేసినట్టు?” నెఖ్లూడో అడిగాడు

“అతనికి పాస్‌పోర్టు లేదు. పోలీసులు పట్టుకుని ఇక్కడికి పంపించారు. అటువంటివాళ్ళను పంపించొద్దని మేము చెబుతూనే ఉంటాం. కాని వాళ్ళు పంపిస్తూనే ఉంటారు” అని సమాధానం చెబుతూ ఇన్‌స్పెక్టరు కోపంగా చూచాడు ముసలివాడి కేసి.

“అయితే మీరుకూడా క్రైస్తవ వ్యతిరేక సామాజికులన్నమాట?” ముసలివాని ప్రశ్న.

“కాదు నేను ఊరికే చూడ్డానికి వచ్చాను” అని జవాబు చెప్పాడు నెఖ్లూడో.

“ఓహో ఈ క్రైస్తవ వ్యతిరేక సామాజికులు తోడి మానవుల్ని ఎలా హింసిస్తున్నారో చూడ్డానికి వచ్చారన్నమాట! బాగా చూడండి. వేలకువేల మందిని ఈ పంజరంలో బంధించారు. మానవుడు కష్టంచేసి బువ్వ సంపాదించుకుతినాలి. కాని ఈయన వీళ్ళందర్నీ ఇక్కడ బంధించేసి పనిపాటలు చేసు

కోనీయటంలేదు; పందుల్ని మేపినట్లు మేపుతున్నాడు; చివరకు వీళ్ళందరూ మృగాలుగా మారిపోవాలని ఈయన ఉద్దేశం."

"ఏమంటున్నాడు అతను?" ఆంగ్లేయుడు అడిగాడు.

"వీళ్ళందర్నీ ఇక్కడ నిర్బంధించినందుకు కతను ఇన్స్పెక్టరును నిందిస్తున్నాడు" నెక్లూడోవ్ చెప్పాడు.

"మరి చట్టవిరుద్ధంగా ప్రవర్తించేవాళ్ళను ఏమి చేయమంటాడో అతన్నే అడగండి"

నెక్లూడోవ్ ఈ ప్రశ్నను స్వభాషలోకి తర్జుమాచేసి చెప్పాడు. ఆ ప్రశ్న విని ముసలివాడు విచిత్రంగా నవ్వాడు...దంతాలన్నీ కనిపించేలాగు.

"చట్టాలా?" అని ఉచ్చరించి మరోకసారి వ్యంగ్యహాసం చేశాడు. "మొట్టమొదట ఆయన ప్రజల్ని దోచేశాడు. వాళ్ళ భూములూ, హక్కులూ అన్నీ కాజేశాడు. అన్నీ తన స్వాధీనం చేసుకున్నాడు. తనకు వ్యతిరేకంగా వున్నవాళ్ళందర్నీ చంపేశాడు. ఆ తర్వాత చట్టాలు రాశాడు...దోపిడీలు, హత్యలు చెయ్యకూడదంటూ ఇటువంటి చట్టాలు ప్రథమంలోనే రాసివుంటే బాగుండేదిగా!"

ఈ వాక్యాల్ని ఆంగ్లభాషలోకి తర్జుమాచేసి చెప్పాడు నెక్లూడోవ్. విని ఆంగ్లేయుడు మందహాసం చేశాడు.

"పోనీ, ప్రస్తుతం దొంగల్నీ, హంతకుల్నీ ఏం చెయ్యాలంటాడో అడిగి కనుక్కోండి" ఆంగ్లేయుడు నెక్లూడోవ్‌తో చెప్పాడు.

నెక్లూడోవ్ ఈ ప్రశ్న కూడా స్వభాషలోకి తర్జుమాచేసి వినిపించాడు.

దానికి సమాధానంగా ఆ ముసలివాడు యిలా అన్నాడు నెక్లూడోవ్‌తో: "అసలు మొదట వారిలో వున్న క్రైస్తవ వ్యతిరేక తత్వాన్ని చంపుకోమని వారితో చెప్పండి. అప్పుడు దొంగలూ, హంతకులంటూ వారికి కనిపించరు. చెప్పండి ఆ మాట."

నెక్లూడోవ్ ఆ మాట ఇంగ్లీషులో అనువదించి చెప్పాడు. ఆంగ్లేయుడు "వాడికి పిచ్చి కామాలు లెండి" అంటూ బుజాలు యెగరవేసి మరో గదిలోకి దారి తీశాడు.

"మీ వ్యవహారం మీరు చూసుకోండి. ఇతర్ల జోలికి రాకండి. ఎవడి గొడవ వాడు చూసుకుంటే చాలు. ఎవర్ని శిక్షించాలో, ఎవరిని క్షమించాలో భగవంతుడికే తెలుసు. మనకేం తెలీదు. ఎవడికి వాడే అధికారి అయితే న్యాయం చేసే అధికార్ల అవసరం ఉండదు. పోవయ్యా, పో" అన్నాడు కోపంగా. ఇంకా గడప దాటకుండా అక్కడేవున్న నెల్లాడో వైపు తిరిగి: "ఈ క్రైస్తవ వ్యాపారులంతా మా రక్తాన్ని పేల ద్వారా, నల్లుల ద్వారా ఎలా త్రాగేస్తున్నారో బాగా చూశారా? ఇక వెళ్ళండి" అన్నాడు.

నెల్లాడో గడపదాటి వెళ్ళాడు. ఆంగ్లేయుడు, ఇన్‌స్పెక్టరు మరో గది ముందు ఆగి వున్నారు. "ఈ గదిలో ఎవరుంటున్నారు?" అని ఆంగ్లేయుడు అడుగుతున్నాడు.

"ఇది శవాల గది" అంటున్నాడు ఇన్‌స్పెక్టరు.

'ఓహో' అని పలికి, ఆంగ్లేయుడు లోనికి పోయి చూడాలని కుతూహలం వెలిబుచ్చాడు.

అది పెద్ద గదేమీ కాదు. ఒక మూల ఏవో బస్తాలూ, కట్టె మొద్దులు కుప్పగా వున్నాయి. గోడ కొక గుడ్డి దీపం వుంది. ఆ గదిలో నాలుగు శవాలున్నాయి. కోటు సూట్, డ్రాయరు తొడిగివున్న ఒక శవం కనిపించింది. సగం కొరిగిన తల-శవం బాగా గట్టిపడి పోయింది. చేతులు, కాళ్ళు ఎడంగా పడి వున్నాయి. రెండో శవం ఎవరో ముసలమ్మది. ఆ పక్కనే రంగు దుస్తుల శవం ఒకటి పడి వుంది. రంగుదుస్తులు కనిపించగానే నెల్లాడోకు అనుమానం కలిగింది. దగ్గరకుపోయి చూశాడు.

ఆ గడ్డం, చక్కని ఆకృతిగల ముక్కు, విశాలమైన నుదురు, ఉంగరాల జుట్టూ—నెల్లాడో అది ఎవరి శవమో గుర్తించాడు. కాని తన కన్నులు తానే నమ్మలేకపోయాడు. నిన్నను ఆ ముఖం కోపంగా, బాధా సూచకంగా, ఉద్రేక పూరితంగా వుంది. ఇవాళ ఆ ముఖమే నిశ్చలంగా, భయంకర సౌందర్య పూరితమై వుంది. ఔను, ప్రాణం లేని క్రిస్టసో భౌతిక శరీరం అది. "అతడెందుకు బ్రతికినట్టు? ఎందుకీ కష్టాలన్నీ అనుభవించినట్టు? ఇప్పటికైనా అతనికి అర్థమై వుంటుందా?" అనుకున్నాడు నెల్లాడో.

క్లిష్ట సమయాల్లో ఏ ప్రశ్నకైనా బైబిల్లో సమాధానం దొరుకుతుందని కొందరి విశ్వాసం. నెఖ్లూడో బైబిల్ తెరిచాడు. అది తెరుచుకొన్న పేజీలోనే చదివాడు. "అప్పుడు ఏసుక్రీస్తువద్దకు శిష్యులువచ్చి అడిగారు: 'స్వర్గధామంలో ఉండే మహనీయు లెవరూ?' అని. అప్పుడాయన ఒక బాలుని దేరువకుపిల్చి అందరకు చూపించి, మీరంతా ఇలా చంటిపిల్లల్లాగ తయారకపోతే మీకు స్వర్గధామంలో ప్రవేశించే అర్హత రాదు. ఈ పసివానిలాగ నిరహంకారుడైనవాడే స్వర్గరాజ్యంలో స్థానం పొందగల మహనీయుడు' అని చెప్పాడు."

"ఔనౌను నిజంగానే" అనుకున్నాడు నెఖ్లూడో. నిరహంకార స్థితిలోనే తనకు సంతోషం, శాంతి చేకూరాయి జీవితంలో అప్పుడప్పుడు. ఇది అనుభవ సిద్ధమైన సత్యమే. ఆ తరువాతి పుస్తకంలో మళ్ళీ ఇలా రాసి ఉన్నది.

"అటువంటి పసివాడికి నా పేరుమీద ఎవరు స్వాగత మిస్తారో నాకు స్వాగత మిచ్చినట్టే. కాని నాపై విశ్వాసంగల ఇట్టి పసివాణ్ణి ఎవరు ముందుకు తోసి పడవేస్తాడో వాడి మెడకు ఒక బండరాయిని కట్టి సముద్రపు లోతుల్లోకి దించేస్తాను"

ఏమిటిదంతా? స్వాగతం ఇవ్వటమట? ఎక్కడేనివ్వాలి స్వాగతం? 'నా పేరుమీద' అనివుంది. అంటే? ఈ మాటల అర్థం తనకు బోధ పడటం లేదు. వాడిమెడకు బండరాయిని తగిలించటం దేనికి? సముద్రపు లోతుల్లోకి ఎందుకు? ఈ మాటలు విస్పష్టంగా లేవు. బైబిలు తన జీవితంలో చాలసార్లు చదివాడు. అనేకచోట్ల అర్థం సరిగా స్ఫురించదు. వాక్యాలు విస్పష్టంగా ఉండవు. ఆ తరువాత ఇంకా కొంతభాగం చదివాడు. జెహెన్నాల్లోకి త్రోసి మనుష్యుల్ని బాధించటం గురించీ, భగవంతుని ముఖాముఖి చూడగల దేవతల గురించీ చదివాడు. ఇదంతా నెఖ్లూడోకు అసంబద్ధ విషయాల్లా కనిపించింది. మళ్ళీ ఇలా చదవసాగాడు.

"ఏసుక్రీస్తు పతితులను రక్షించేందుకు అవతరించాడు. ఒకనికి నూరు గొర్రెలుంటాయనుకోండి. అందులో ఒకటి దారితప్పి ఎటో కనిపించకుండా పోతుంది. అప్పుడతడు ఆ మిగిలిన తొంభైతొమ్మిది గొర్రెలనూ అలా వొది

లేసి ఆ తప్పించుకుపోయిన ఒక్కదానికోసం కొండల్లో, గుట్టల్లో వెతకడమూ పోయి ? అది కనిపించినప్పుడు ఎంతగానో సంతోషిస్తాడు. సవ్యంగా దారి వెంట వస్తోన్న ఆ తొంభైతొమ్మిది గొర్రెలవల్ల కలిగే సంతోషంకన్నా... దారితప్పిన గొర్రె తిరిగి చేతికి దొరికినప్పుడు కలిగే ఆనందం చాల గొప్పది. కాబట్టి ఏ ఒక్క జీవి నాశనమై పోవటం...స్వర్గవాసియైన తండ్రికి ఇష్ట కానే కాదు."

ఔను; ఎవరూ నాశనం కావటం భగవంతునికి ఇష్టం లేదు. కాని వందలాదిగా, వేలాదిగా ప్రజలు జైళ్ళల్లో మగ్గి నాశనమైపోతూనే ఉన్నారు. ఈ అనర్థాన్ని తప్పించటం ఎలాగో దురవగాహంగా ఉంది నెఖ్లూడొవ్ మళ్ళీ బైబిల్లో ఇలా చదువసాగాడు:

"అప్పుడు పీటరు ఆయన వద్దకువచ్చి అడిగాడు. 'ప్రభూ! నా సోదరుడు నాకు ద్రోహం చేస్తూ ఉంటాడనుకోండి. ఎన్నిసార్లని క్షమిస్తూ ఉండేది? ఏడుసార్ల వరకూనా?' 'ఏడు సార్లేకాదు, నాలుగువందల తొంభైసార్లు క్షమించాలి' అన్నాడాయన. ఇంకా ఇలా చెప్పాడాయన. 'ఒకానొక రాజు ఉన్నాడు. ఒకడాయనకు వెయ్యి మాడలు బాకీవున్నాడు. ఆ బాకీ చెల్లించే తాహతు లేకపోయిందాతనికి. అతన్నీ, అతని భార్యనూ, పిల్లల్నీ, యావదాస్తినీ అమ్మేసి బాకీ చెల్లువేసుకోదలచాడు రాజు. అప్పుడాతను గబగబా కాళ్ళ మీదపడి, పూజించి 'ప్రభూ, కొన్నాళ్ళు ఓపిక పట్టండి; మీ బాకీ యావత్తూ చెల్లించుకుంటాను' అని బ్రతిమాలుకున్నాడు రాజుకు జాలివేసింది అతన్ని క్షమించి బాకీఅంతా కొట్టివేశాడు. ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు. అతనికి ఒకాయన నూరు మాడలు బాకీ ఉన్నాడు. అతని వద్దకు పోయి నా బాకీ చెల్లిస్తావా? లేదా? అని అడిగాడు. అతడు పాపం కాళ్ళావేళ్ళా పడి "కాస్త ఓపికపట్టు బాబూ! మీ బాకీ అంతా చెల్లించుకుంటాను" అని బ్రతిమాలుకున్నాడు. కాని అతను వినిపించుకోలేదు. బాకీ అంతా చెల్లించేదాకా జైల్లో పెట్టించాడు. మిగతా వాళ్ళంతా ఈ సమాచారమంతా విని చాలా విచారించారు. చివరకు వెళ్ళి రాజుగారికి ఫిర్యాదు చేశారు జరిగినదంతా. రాజు అతన్ని

గదిలో సైమన్‌తోపాటు మస్లోవా ఉన్నదీ అని, ఆ సంగతి ఆమే ఒప్పుకున్నదీ అని.

కాసేపు కోర్టు అంతా నిశ్శబ్దంగా ఉంది.

"ఇంకా నువ్వు చెప్పవలసిందేమీ లేదా ?"

"అంతా చెప్పనే చెప్పాను" మస్లోవా ఒక నిట్టూర్పు విడిచి కూచుంది.

ప్రెసిడెంటు ఏదో రాసుకున్నాడు. ఎడమపక్కన కూచున్న సభ్యుడేదో చెప్పింది విన్నాడు. పది నిమిషాలు విశ్రాంతి ప్రకటించి లేచాడు. పొడుగాటి గడ్డంగల సభ్యునికి కాస్త కడుపునొప్పి తిరగబెట్టింది. కాస్త మర్దన చేసుకుని, రెండు చుక్కలు మందు తాగాలి. ఈ సంగతే ప్రెసిడెంటుతో విన్నవించుకున్నాడు. అందుకనే పదినిమిషాలు విశ్రాంతి ప్రకటించవలసి వచ్చింది.

జడ్జీలు లేవటంతోనే ప్లీడర్లు, జ్యూరీలు, సాక్షులు-అంతా లేచారు. సగం విచారణ పూర్తి అయింది కూడా అన్న సంతోషంతో అందరూ అటూ ఇటూ తిరగనారంభించారు.

నెఖ్లూదోవ్ జ్యూరీల గదిలోకి పోయి కిటికీ వద్ద కూలబడ్డాడు.

## ౧౨

"ఔను, ఆమె మస్లోవాయే."

నెఖ్లూదోవ్-మస్లోవాల మధ్య నడిచిన వ్యవహారాలు ఇవీ—

తాను విద్యార్థి దశలో ఉండినప్పుడు ప్రప్రథమంగా మస్లోవాను చూచాడు. విశ్వవిద్యాలయంలో మూడో యేడు చదువుతూ 'భూమి కౌలు విధానం' అనే వ్యాసాన్ని తయారు చేస్తున్నాడు.

మాస్కోకు దగ్గరగా తన తల్లికి పెద్ద యెస్టేటు ఉంది. మామూలుగా వేసంగి సెలవులు అక్కడే తల్లితోనూ, చెల్లెలితోనూ గడుపుతూ ఉండే

ఎవరి వంకా చూడటంలేదు. గోడవరసగా నడిచి, టక్కున వెనక్కి తిరుగుతోంది. తన పసిపిల్లను నూతిలో వేసిందని ఆమెమీద నేరం.



మస్లోవా గదిలో ప్రవేశించే సరికి అందరూ ఆమెవైపు చూశారు. మతోద్యోగి కూతురు కూడా పచార్లు ఆపి, కనుబొమలెత్తి ఆమెవైపు చూసింది. అయితే ఏమీ పలుకరించలేదు. మళ్ళీ యథాపూర్వంలా పచార్లు సాగించింది.

సంచీ అల్లుతోన్న కొరాబ్లెవా సూదిని సంచికి గుచ్చేసి, కళ్ళద్దాలలో నుంచి మస్లోవాకేసి ప్రశ్నార్థకంగా చూసింది. "అయ్యో, భగవంతుడా! మళ్ళీ వచ్చావేం? నిన్ను వొదిలేస్తారనుకున్నా సుమీ" అన్నదామె కటువైన పురుష కంఠస్వరాన. కళ్ళద్దాలు, అల్లుతోన్న సంచీ తన చక్కబల్ల మీద పెట్టింది.

"నిన్ను తప్పకుండా వొదిలేస్తారనే నేనూ, ఆ ముసలమ్మ అనుకున్నాం. ఒక్కొక్కప్పుడు అలాకూడా జరుగుతుంది, నిజమే. ఒక్కొక్కప్పుడు డబ్బుకూడా ఇచ్చి వొదిలేస్తారు. అదృష్టాన్నిబట్టి ఉంటుంది. ఇంతకూ మేం అనుకున్నదంతా తలకిందైనట్టుందే! భగవంతుని ఉద్దేశం వేరు కామాలు!"-అన్నది దీర్ఘాలు తీస్తూ రైలుగేటు కాపలావాని భార్య.

"ఏమిటీ? నీకుకూడా శిక్ష పడిందా? నిజమే!"—థియొడోసియా ఆత్రుతగా ప్రశ్నించింది, మస్లోవాకేసి తన పసిపిల్లలవంటి నేత్రాలతో చూస్తూ. శోభావంతమైన ఆమె మోముతీరు మారిపోయింది. బావురున ఏడవబోతున్నట్టు కనిపించింది.

మస్లోవా ఎవరికీ ఏ విధమైన జవాబూ చెప్పలేదు. తన స్థానంలో వెళ్ళి కూచుంది, కొరాబ్లెవాకు చేరువగా.

"పొద్దున్నించీ ఏమన్నా తిన్నావా?"—అంటూ థియొడోసియా లేచి ఆమెదగ్గరకు వచ్చింది.